# బ్రహ్మజిజ్ఞాస

## (శివ-శక్తుల తత్త్వము)

## (అచలమత పరిశీలనము)

## చతుర్థ భాగము


గ్రంథకర్త

మజ్జిబోయిన రామసుబ్బయ్య






ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2004

**BRAHMA JIJNASA**
**Volume-IV**

*By*
**MARRIBOYINA RAMASUBBAIAH**



T.T.D. Religious Publications Series No : 259

First Edition 2004

Copies : 2,000

Published by
**Sri Ajey Kallam, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

D.T.P. by
Keerthi Offset
103, Prakasam Road, Tirupati.

Printed at :
Nageswara Binding Works,
Kovvur - 534 350.
on behalf of T.T.Ds.

# ముందుమాట

వేదాంత విజ్ఞానాన్ని సామాన్యులకు అందించాలనే ఉదాత్తమైన ఆశయంతో రచింపబడిన ఉద్గ్రంథం బ్రహ్మజిజ్ఞాస. సహజమైన ఈశ్వరచింతన, వైరాగ్యధోరణి, బహుగ్రంథ పరిశీలన, అనేక సంవత్సరాల అనుభవం -- ఇవన్నీ ఏకత్ర సమన్వయం పొందిన జ్ఞానవయోవృద్ధులు శ్రీ మట్టిబోయిన రామసుబ్బయ్యగారి లేఖిని నుండి ఈ గ్రంథం అపూర్వంగా రూపొందింది.

బ్రహ్మజిజ్ఞాస నాలుగు భాగాలుగా ప్రచురింపబడుతోంది. మొదటి భాగం అద్వైతసిద్ధాంతాన్ని, రెండవ భాగం అనుష్ఠాన మార్గాలను, మూడవ భాగం షడ్దర్శన షణ్మతసారసంగ్రహానికి సంబంధించినవి. ఇప్పుడు ప్రచురితమౌతున్న నాల్గవ భాగంలో శివ-శక్తుల తత్త్వము, అచలమతం విస్తృతంగా పరిశీలింపబడింది.

ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగాలకు లాగానే ఈ చతుర్థభాగం కూడ తిరుమల తిరుపతి దేవస్థాన ధార్మిక ప్రచురణగా వెలువడుతోంది. పరమాత్మను (బ్రహ్మ) గూర్చి తెలుసుకోవాలనుకునే ఆసక్తి కలవారందరూ విశిష్టశైలితో విలసిల్లుతు వున్న 'బ్రహ్మజిజ్ఞాస' ను పఠించి ఆత్మోన్నతిని, ఆనందాతిశయాన్ని పొందగలరని మా ఆశయము; ఆకాంక్ష!

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ప్రవేశిక మొదలగువాటి విషయసూచిక

(1)వేదాంతముయొక్క ప్రాశస్త్యము (2) వేదంతము తెలిసినవాడు దేవుడే నట (3)చతుర్థభాగము పరిశీలించిన ముఖ్య విషయములు (4) వేదాంతము తంత్రములు (5) ప్రాచీన నవీన వేదాంతములు (6) అచలబోధ. (7) ఆంధ్ర దేశముమందలి యోగులు,యోగినులు (8) కొన్ని గ్రంథముల కీర్తనలు (9) దీక్షితులవారి అచలబోధకు సంబంధించిన కొన్ని గ్రంథములు (10) బోధ గురువులు-బాధ గురువులు (11) సద్గురుడు లభించునంత వరకు ముముక్షువు చేయవలసిన పని (12) మాలపల్లి (సంగవిజయము)(13)ఈ గ్రంథము అచలబోధ ప్రసక్తి (14) అద్వైతమునకు అచలవాదము పై మెట్టు కాదు. (15) సహజములు-కృత్రిమములు (16) ఈ గ్రంథ రచన (17) భూమిక (18) కృతజ్ఞత (19) అభిప్రాయములు (20) 'బ్రహ్మ జిజ్ఞాస' తృతీయభాగమును గుఱించి కొన్ని పత్రికల అభిప్రాయములు. (21) చతుర్థభాగము యొక్క రచనకు తోడ్పడిన గ్రంథముల పట్టిక.

## చతుర్థభాగము - విషయసూచిక

## మొదటి ప్రకరణము - శివుడు - శక్తి

## రెండవ ప్రకరణము--అచలబోధ

## మూడవ ప్రకరణము - ముగింపు (ఉపసంహారము)

ఓమ్

# ప్రవేశిక

## 1. వేదాంతముయొక్క ప్రాశస్త్యము.

బ్రహ్మవిద్యయే వేదాంతము. అదియే అద్వైతము; తన్ను తా నెఱుగుట. ఇది ప్రపంచమున గల విద్యలలో కెల్ల శ్రేష్ఠతమమును, మిక్కిలి కష్టసాధ్యమునునై యున్నది."**వేదాంత కేసరి గర్జించ కుండునంతవఱకే తక్కిన శాస్త్రములును జంబుకములును కూయుచుండును**". అను సంప్రదాయ శ్లోకమును తృతీయ భాగమునందు (పుట 115 లో) ఉదాహరించి యుంటిని. కనుకనే మహాత్ములు "**ఆసుప్తేః అమృతే కాలం నయే ద్వేదాంతచింతయా**" = "బ్రతికియున్నంత కాలము నిద్రవచ్చు నంతవఱకు వేదాంతచర్చలోనే కాలము గడుపు" మని వచించిరి.

మనదేశమున సామాన్య మానవునకు ఏదైన నొక కష్టమైన కార్యమును చెప్పి "ఈ కార్యమును నీవు చేయగలవా? "అని ప్రశ్నించిన, దానిని చేయగలనని అతనికి తోచిన అతడు "ఇది నాకెంతపని, ఇదియేమి బ్రహ్మవిద్యయా?" అనును. భారతదేశమునందలి సామాన్య మానవునకు వేదాంతపరిచయము లేకపోయినను, దాని గొప్పతనమును, సామాన్యులు గ్రహింపజాల రనుటయు తెలియుటచే వేదాంతమునకు భారతదేశమే జన్మస్థానమై యుండవచ్చును. బ్రహ్మవిదులగు మహర్షులు చక్రవర్తుల సభామందిరముల కేగినపుడు చక్రవర్తులు సింహాసనములనుండి లేచి వారి కెదురేగి స్వాగతము పలికి పూజించుచుండినట్లు పురాణాది గ్రంథములయందును చరిత్రలయందును చదివియున్నాము. మనదేశమున అట్టిదే యగు ఒక సంప్రదాయ మిప్పటికిని కలదు.

మనదేశమున హిందూగృహములయందు, కౌపీన మాత్రధారియగు శ్రీ రమణమహర్షి చిత్రపటమునో; శ్రీ శంకరభగవత్పాదుల యొక్కయు, శ్రీ రామానుజాచార్యాదుల యొక్కయు చిత్రపటములనో సన్న్యాసులగు శ్రీరామకృష్ణ పరమహంస మొదలగు సాధువుల చిత్రపటముల (ఫోటోల)నో ఉంచుకొని పూజ లిడుదురు. కాని కోట్లకొలది ధనరాసులు గల టాటాగారి ఫోటోనుగాని, బిర్లాగారి ఫోటోనుగాని యెంతటి గర్భదరిద్రుడైనను పూజింపడు.

## 2. వేదాంతమును చక్కగా తెలిసినవాడు దేవుడేనట.

బ్రహ్మసాక్షాత్కారమును (బ్రహ్మానుభవమును) పొందుట యట్లుండ వేదాంత గ్రంథములను చదివి చక్కగా అర్థము చేసికొనుటకూడా కష్టమే. దీనిని జ్ఞానయజ్ఞమని భగవద్గీత చెప్పినది (4-33). ఇదియే జ్ఞాన తపస్సు. శ్రీ శ్రీ చిన్మయానందస్వాములవారు కఠోపనిషత్తునకు వ్రాసిన వ్యాఖ్యానమున (ఆంధ్రానువాదమున) ప్రథమవల్లి 21వ మంత్రముయొక్క వ్యాఖ్యానమున నిట్లు వ్రాసిరి:-

**"వేదాంతమును సరిగా అర్థము చేసికొనినయెడల అతడు నిజమైన భక్తుడే గాక భూమిమీద దేవుడే. ఆ వేదాంతమునే సరిగా అర్థముచేసికొనక అపార్థము చేసికొనినయెడల అట్టి విద్యార్థిని అజ్ఞానబోధ పిశాచముగా తయారుచేయును".**

అదే గ్రంథమునందే స్వాములవారు వేఱొకచోట నిట్లు వ్రాసిరి.

"బ్రహ్మవిద్య యనగా ఆ పరమసత్యము............ బ్రహ్మవిద్య ఎంత విన్నప్పటికిని దాని నర్థము చేసికొనుట అంత సులభము కాదు. గంభీర సాంకేతిక పదములను, వాని యథార్థ భావములను గ్రహించుటకు కూడ విద్యార్థికి తగినంత అంతఃకరణ పవిత్రత, తత్ఫలితమగు కుశాగ్రబుద్ధి యుండవలెను". (పుట. 64)

పై వాక్యములయందు అతిశయోక్తు లేవియు లేవు. భగవదనుగ్రహమున 'బ్రహ్మజిజ్ఞాస 'యొక్క మూడు భాగములు మూడు సంపుటములుగ అచ్చయి వెలువడినవి. తత్త్వజ్ఞులగు కొందఱి పెద్దలయొక్కయు, కొన్ని పత్రికల యొక్కయు మన్నన లందగలిగినవని సవినయముగ మనవి చేసికొనుచున్నాను.

## 3. చతుర్థభాగమును పరిశీలించిన ముఖ్యతత్త్వములు.

ఈశ్వరానుగ్రహమున 'బ్రహ్మజిజ్ఞాస' చతుర్థభాగము పూర్తి అయినది. ఇందు ముఖ్యముగా అయిదు తత్త్వగ్రంథములలోని సిద్ధాంతములను సంగ్రహముగ సమీక్షించితిని. అద్వైతమునందు దృష్టి - సృష్టి వాదులు, అజాతవాదులు గలరని చెప్పియుంటిని, శ్రీశంకర భగవత్పాదులు ఆమోదించిన అద్వైతము సయితము అజాతవాదమే. కాని, వీరిది దృష్టి - సృష్టి వాదము

కాదు. దృష్టి-సృష్టి వాదమనగా దృష్టి= జ్ఞానము, సృష్టి=దృశ్యము - అనగా - చూచునదియు, చూడబడునదియు ఒకే పదార్థ మనువాదము.

అజాతవాదమును పెక్కు విధముల వివరించి బోధించిన మహాగ్రంథము 'వాసిష్ఠ రామాయణ మను నామాంతరము గల యోగవాసిష్ఠము'. ఇది అద్భుత గ్రంథము. ఇందు తత్త్వబోధకుగాను కల్పించిన కథలు నిరుపమానములు. సంస్కృతమునగాని, తెలుగునగాని యిట్టి కల్పనా కథలు అరుదు. గ్రంథకర్త వాల్మీకియని యున్నది. కాని, ఈ గ్రంథకర్త శ్రీమద్రామాయణమును రచియించిన వాల్మీకి కాడు. ఏ మహనీయుడో బౌద్ధయుగమున నీ గ్రంథమును వ్రాసి వాల్మీకికి కర్తృత్వము చేకూర్చెను. ఈ గ్రంథమున ఆఱు ప్రకరణములు కలవు. అవి - (1) వైరాగ్య, (2) ముముక్షు వ్యవహార, (3) ఉత్పత్తి, (4) స్థితి, (5) ఉపశమన, (6) నిర్వాణము లనునవి. ఒక్కొక్క ప్రకరణము సర్గములుగా విభజింపబడినది. ఇందు సుమారు 32 వేల శ్లోకములు కలవు. ఈ గ్రంథము క్రీ. శ. నాలుగవ శతాబ్దియందు రచియింపబడి యుండవచ్చునని కొందఱు పండితుల అభిప్రాయమై యున్నది.

యోగవాసిష్ఠమను గ్రంథనామమును వ్రాయునప్పుడు 'వసిష్ఠ' నామమున మధ్యనున్న యక్షరము 'సి' దంత్యమా? లేక తాలవ్యమా? అను సంశయము కలుగుచుండును. "శ్రీమదాంధ్ర వచన జ్ఞానవాసిష్ఠ "మను గ్రంథమును రచియించిన బ్రహ్మశ్రీ వెన్నెలకంటి సుందరరామశర్మ గారు ఆ గ్రంథము యొక్క తొలిపలుకునందు" శబ్దకల్పద్రుమము నందలి వాక్యములవలన రెండును ఉండవచ్చునని గ్రహింతురు గాక" అని వ్రాసి, వసిష్ఠుడగు వ్యక్తి (పుంలింగ మైనపుడు) 'వసిష్ఠ' డని " సి" దంత్యముగను, గ్రంథనామ మైనపుడు "జ్ఞాన వాశిష్ఠము" అని "శి" తాలవ్యముగను వ్రాసిరి. సంస్కృత మూలగ్రంథమునందు 'యోగ వాసిష్ఠము' అనియు; వసిష్ఠ మహర్షి నామమునందు సహితము "సి" అను అక్షరమునే వాడిరి. తిక్కనగారి మహాభారతమునందును 'వసిష్ఠ' మహర్షి యనియే వ్రాసియున్నారు. గ్రంథ, ఋషి నామములయందు 'సి' అను అక్షరమునే నేను వాడితిని.

మహారాష్ట్రమున జన్మించి భారతదేశము నందంతటను ప్రసిద్ధి కెక్కిన ఆర్ష మహాకవియు, తత్త్వవేత్తయు, తాంత్రిక పాతంజల యోగియు అగు శ్రీ జ్ఞానేశ్వరులు సయితము ఒక విధమగు అజాతవాదులే. వీరు 'జ్ఞానేశ్వరి'

యను పేర మహారాష్ట్రభాషయందు భగవద్గీతకు వ్యాఖ్యను రచియించిరి. అదిగాక 'అనుభవామృతము(అమృతానుభవము), అను ఒక స్వతంత్రగ్రంథమును మహారాష్ట్రభాషయందే రచియించిరి. అది సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర భాషలయం దనువదింపబడినది. మరికొన్ని గ్రంథములు కూడా వీరు తమ మాతృభాషయందే రచియించిరి. 'జ్ఞానేశ్వరిని' శ్రీమతి రాణి లలితాదేవిగారును, శ్రీ దిగవల్లి శేషగిరిరావు గారును, భక్త నరసింహముగారి పుత్రుడు శ్రీ సత్యనారాయణగారును తెనిగించిరి. శ్రీ జ్ఞానేశ్వరులు అద్వైతులే. అయినను వీరు శ్రీశంకరుల బ్రహ్మవివర్తవాదమును అంగీకరింపలేదు. శ్రీ జ్ఞానేశ్వరులు శివ-శక్తులను గుఱించి చెప్పిన తాత్త్వికాంశములతో చాలవఱకు ఏకీభవించిన శ్రీ అరవిందుల శివ-శక్తి తత్త్వమును గుఱించి కూడ కొంత వ్రాసితిని.

శ్రీ జ్ఞానేశ్వరుల అనంతరము సుమారు 312 సంవత్సరములకు మహారాష్ట్రమునందే జన్మించిన శ్రీ సమర్థ రామదాసస్వామి అనువారు 'దాసబోధ' అను స్వతంత్ర అధ్యాత్మ గ్రంథమును మహారాష్ట్ర భాషయందు రచియించిరి. అది తెనిగింపబడినది. వీరు అజాతవాదులు కారు. సృష్టివాదులు, శాక్తేయులు.

నాల్గవవారు రామడుగు శివరామదీక్షితులవారు, తెలంగాణావారు. వీరు అచలబోధను స్థాపించినారని అందురు. వీరు రచియించిన యేకైక గ్రంథము "శివరామదీక్షితీయ" మను బృహద్వాసిష్ఠ సిద్ధాంతము. వీరును అజాతవాదులే.

యోగ వాసిష్ఠమునుండియు, శాక్త తంత్రముల నుండియు, కొన్ని అంశములను గైకొని తమ స్వీయానుభవమును, స్వీయాభిప్రాయములను చేర్చి పై నలువురును తమ గ్రంథముల (సిద్ధాంతముల )ను విస్తరింపజేసిరి. కనుక యోగ వాసిష్ఠముతో చేర్చి ఈ నాల్గింటిని చర్చించిన గాని సామాన్య పాఠకులకు తత్త్వము సులభ గ్రాహ్యము కాదని వీటిని ఈ చతుర్థభాగముగా రచియించితిని.

## 4. వేదాంతము - తంత్రములు

శ్రీ శంకరాచార్యులవారు అద్వైత స్థాపకులు కారు. అద్వైతమును బోధించిన శ్రుతులకు శ్రీ శంకరులవారు చెప్పినదే సరియైన యర్థము, కనుక వారద్వైతము నుద్ధరించినందున వారిని అద్వైతస్థాపకులని తెలియనివారందురు. శ్రీ శంకరులవా రంగీకరించినదే అద్వైతము. అదియే

వేదాంతము. అద్వైతమే వేదాంతమని అద్వైతమును నిందించునట్టి సాంఖ్య, వైశేషికాది దార్శనికులు సయితము శ్రీ శంకరులకు పూర్వమే అంగీకరించిరి. (ఈ విషయమై ఈ గ్రంథముయొక్క తృతీయ భాగమునందలి మొదటి ప్రకరణము "(౯) వేదాంతదర్శనము" అను అధ్యాయమున విపులముగ వివరించియున్నారు.)శైవమతము అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత, ద్వైతాద్వైత మార్గముల నడచినది. శాక్తేయము అట్లుగాక అద్వైతమార్గముననే నడచినది. శైవమునకు ముఖ్యాధారములు శైవాగమములు. శాక్తేయమునకు ఆధారములు తంత్రములు. కాని తంత్రములయందలి అద్వైతమునకును, దశోపనిషత్తులను ఆధారముగా శ్రీ శంకరులు చెప్పిన అద్వైతమునకును కొంత భేదమున్నది. శ్రీ శంకరులు తాంత్రిక యోగియని; సౌందర్యలహరి మొదలగు శ్రీవిద్యా ప్రతిపాదకములగు స్తోత్ర గ్రంథములు, వ్యాఖ్యానములు శ్రీ శంకర విరచితములేయని కొందఱు పండితు లందురు. కాని, శ్రీ శంకరులు దేవీపరమగు స్తోత్రములేగాక, శివానందలహరి, శ్రీ లక్ష్మీనరసింహస్తవము మొదలగు శివకేశవాది దేవతా పరములగు స్తోత్రగ్రంథములు కూడా వ్రాసియున్నట్లు ప్రతీతి. కనుక, అవన్నియు వివిధ దేవతలయందు భక్తిని వ్యక్తము చేయునేగాని దేవీస్తోత్రములు వ్రాసినంత మాత్రమున శ్రీ శంకరులు తాంత్రికయోగి కారని కొందఱు పండితు లందురు.

శ్రీ శంకరులు పైన చెప్పిన స్తోత్రము లేవియు వ్రాయలేదనియు, అవి యెవరో శ్రీ శంకరుల పేరున వ్రాసిరనియు మఱికొందఱందురు. అందుకు వారు చూపు నిదర్శన మేమన :- శ్రీ శంకరులు ప్రస్థానత్రయమునకు భాష్యములు రచియించిరి. అట్టి భాష్యముల యందెచ్చటను తంత్రముల నుదాహరింప లేదనియు, తాంత్రిక సిద్ధాంతములను స్వల్పముగా నైనను గ్రహింపలేదనియు, ఆ కారణమున శ్రీ శంకరులు కేవలము ప్రస్థానత్రయమునకు భాష్యములను మాత్రమే వ్రాసినట్లు దృఢపడుచున్నదనియు చెప్పుదురు. ఈ రెండు వాదములను కలుపునట్టి (రాజీ) పద్ధతి యేమన:- శ్రీ శంకరులు వివిధ దేవతారూపమున నున్న సగుణ బ్రహ్మమునందు భక్తి భావమును చూపుచు రచించిన స్తోత్రము లన్నియు నిర్గుణ బ్రహ్మజ్ఞానమును పొందుటకు సాధనములనియు, నిర్గుణ బ్రహ్మజ్ఞానమును ప్రతిపాదించుటయే ప్రస్థానత్రయముయొక్క ముఖ్యోద్దేశ మైనందున ప్రస్థానత్రయమునకు వారు రచియించిన భాష్యములయందు తంత్రములనుగాని, వాటియందు ప్రతిపాదించిన జ్ఞానమునుగాని స్మరింపకపోవుటకు

కారణమనియు నా యభిప్రాయము. ఈ యభిప్రాయముతో నేకీభవించినచో చిక్కులన్నియు తొలగిపోవును. కాని తాంత్రిక యోగులలో కొందఱు ఈ సామరస్య పద్ధతిని అంగీకరింపక శ్రీ శంకరులు చెప్పిన అద్వైతముకంటె తమ తాంత్రికాద్వైతమే పై మెట్టని, దానికి శ్రీ శంకరాద్వైతము క్రింది మెట్టని చెప్పెదరు. అట్లు చెప్పిన వారిలో శ్రీ అరవిందు లొకరు.

తాంత్రికాద్వైతము (శ్రీవిద్య) నాకు తెలిసినంతవఱకు రెండు శాఖలుగా నేర్పడినది. అందొకటి శ్రీ శంకరుల అద్వైతమునకు మిక్కిలి సమీపవర్తి, రెండవది కొంత దూరమైనది. ఈ విచారము చాలకష్టతరమైనది. దీని నిచట చర్చించుటకు చోటు లేకపోవుటయే గాక, సమగ్రముగా ఆ చర్చను విశదీకరించి సంపూర్ణముగ అందఱికి ఆమోదయోగ్యమగు నొక సిద్ధాంతమును చేయుటకు నేనశక్తుడను. ఈ గ్రంథముయొక్క తృతీయ చతుర్థ భాగములను చదివినవారు, కొంతవఱకు ఈ రెంటి భేదమును అర్థము చేసికొనగలరు.

## 5. ప్రాచీన నవీన వేదాంతములు

ప్రాచీన వేదాంత మనగా నేది? మొదటి దశోపనిషత్తులయందు చెప్పబడిన వేదాంతము ప్రాచీన వేదాంతమనియు, తరువాత వెలువడిన కొన్ని ఉపనిషత్తులయందు చెప్పబడిన వేదాంతము నవీన వేదాంతమనియు స్థూలముగా ఒక అభిప్రాయము అభిజ్ఞవర్గమునందు ప్రచారమునందున్నది. పదియవ ఉపనిషత్తుగా లెక్కింపబడినది బృహదారణ్యకోపనిషత్తు, తదనంతరము పదునొకండవదిగా ఎన్నబడిన బ్రహ్మోపనిషత్తునుండి క్రమముగా కొన్ని ఉపనిషత్తులయందు మతము ప్రవేశించి శైవ, శాక్త, వైష్ణవ మతములకు ఆధారభూతము లైనవి. లేదా, పురాణముల యందును, శైవ, వైష్ణవాది ఆగమములయందును గల మతములు సర్వజనసమ్మత మగుటకును, అవి ప్రాచీనములను విశ్వాసము ప్రజలయందు కలుగునట్లు చేయుటకును, వాటిని అంగీకరించు ఉపనిషత్తులు అవసరమని తలచి సమాజమున ఉపనిషత్తులకు గల పలుకుబడిని చూచి ఆయా మతములవారు ఆయా మత సంబంధమైన ఉపనిషత్తులను రచియించిరని పెద్దలు కొందఱందురు.

కంకంటి పాపరాజు ప్రణీతంబైన ఉత్తరరామాయణమునందు - శ్రీ రామచంద్రుడు తవ అవతారమును సమాప్తి చేయుటకు మహాప్రస్థానము చేయు సమయమున ఆయనవెంట నడచిన వారిలో "సావిత్రీ మహాదేవి

స్త్రీరూప ధారిణియై.......ద్వాత్రింశదుపనిషత్సమేతయై నడచె "(ఉ.రా. 8-268 వచనము) అని యున్నది. అనగా ఆకాలమునకు 32 ఉపనిషత్తులు మాత్రమే యుండెనని మన మూహించవచ్చును.

ఒక వంక మతోద్ధరణకై మతపరములగు ఉపనిషత్తులు రచియింపబడినట్లే బౌద్ధమతము క్షీణదశకు వచ్చిన కాలమునందు నవీన వేదాంతమునకు బీజములు గల ఉపనిషత్తులు కూడా రచియింపబడినవని నా యభిప్రాయము. 38 వ ఉపనిషత్తుగా గణనకు వచ్చిన తేజోబిందూపనిషత్తు నందు శ్రీ జ్ఞానేశ్వరుల వేదాంతమునకు ఆధారములగు కొన్ని శ్లోకములు (మంత్రములు) కలవని శ్రీ జ్ఞానేశ్వరుల అనుయాయులు కొన్నింటిని ఎత్తి చూపుతున్నారు. ఆ విషయమును ఇచ్చట విపులముగ చర్చించుటకు చోటు లేదు. తేజోబిందూపనిషత్తు శ్రీ శంకరుల అద్వైతమునకు విరుద్ధమైనది కాదు. అందు మొదటి అధ్యాయమునందలి 15 వ శ్లోకము (మంత్రము) నుండి ఆ యధ్యాయము ముగియు వఱకు గల 36 మంత్రములు ఉన్నవి ఉన్నట్లు శ్రీ శంకరులు తమ "అపరోక్షానుభూతి" యందు 102 వ శ్లోకమునుండి 140 వ శ్లోకమువఱకు గైకొనిరి. కాదేని, శ్రీ శంకరుల 'అపరోక్షానుభూతి' రచనానంతరము తేజోబిందూపనిషత్తు రచియింపబడి యుండిన ఆ శ్లోకములు అపరోక్షానుభూతి నుండి గైకొనబడియైన నుండవలయును.

ఉపనిషత్తులను గుఱించి శ్రీ వివేకానందస్వాములవారు ఒక ఉపన్యాసమున నిట్లు చెప్పిరి :-

"ఉపనిషత్తులు పెక్కులు గలవు. అవి నూటయెనిమిది అని ప్రతీతి. కాని యింకను చాల కలవని కొందఱనుచున్నారు. వీటిలో కొన్ని అనంతరకాల విరచితములనుట స్పష్టము. ఉదాహరణముగా అల్లాను స్తోత్రముచేయు నట్టియు, మహమ్మదును రజసుల్లా అని పేర్కొను నట్టియు, అల్లోపనిషత్తు ఒకటి కలదు. అది హిందువులకును, మహమ్మదీయులకును, సఖ్యమును కూర్చుటకై అక్బరు కాలమున వ్రాయబడినదట, ఎక్కడనో సంహితలయందు ఒకచోట అల్లాశబ్దమో, ఇల్లాశబ్దమో దొరకగానే దానిని పట్టుకుని దాని ఆధారమున ఒక ఉపనిషత్తు వ్రాసివేసిరి. ఈ రీతిగా అల్లోపనిషత్తులో మహమ్మదు "రజసుల్లా" అయిపోయినాడు. "ఈ రీతిగా ఉపనిషత్తు లనేకములు సృజింపబడినవి. ఇప్పుడుకూడా అట్టివి సృజింపబడుచునే యున్నవని నా

వినికిడి. భారతదేశమునందు కొన్ని ప్రాంతములయందు వేర్వేరు తెగలవారు అట్టి ఉపనిషత్తులను సృజించుచున్నారని నాకు చక్కగా తెలియును." (వి. సం. గ్రం. సంపుటము 6 సర్వతోముఖ వేదాంతము. పుటలు. 330 - 331).

మహోపనిషత్తు యోగవాసిష్ఠమునకు సంగ్రహమగు ప్రతిరూప మనవచ్చును. ఇట్టి శ్రుతులు బౌద్ధయుగము భారతదేశమున అస్తమించునట్టి కాలమున రచియింపబడి యుండవచ్చును. ప్రస్తుతము ఈ చర్చ మనకంత ప్రయోజనకారి కాదు.

శ్రీ శంకరుల అద్వైతము ప్రాచీన వేదాంతము కాదని నవీన వేదాంతములో చేరునని కొందఱందురు. వారు శంకరాద్వైతమునందలి యీర్ష్యతో అట్లు చెప్పిరని నా యభిప్రాయము. డా|| శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులిట్లు చెప్పిరి :-

"నిజముగా శంకరుని సిద్ధాంతము పూర్వ సంప్రదాయానుగుణ మైనదో, దానికి బునర్నిర్మాణమో, లేక పూర్వ విజ్ఞానమునకు గ్రొత్తగా జేర్చిన నవ్యకల్పనమో నిర్ణయించుట సుసాధ్యము కాదు. పురాతన నవీన భావ భేదమును మనము నిర్ణయింపజాలము. ఏలయన జీవిత వ్యాపారములో ప్రాత క్రొత్తలు కలిసిపోయినవి"* (భా. త. 8 అ. పుట 377)

శ్రీ శంకరుల అద్వైతమును గుఱించి పశ్చిమఖండ విద్వాంసుల అభిప్రాయమును డాక్టరు. స. రాధాకృష్ణ పండితులు తమ భారతీయ తత్త్వశాస్త్రమున నిట్లుదాహరించిరి. వారిలో డాక్టరు థీబో పండితులు ఇట్లు వ్రాసిరట:-

"శంకరుడు ప్రతిపాదించిన సిద్ధాంతము, మతవిషయ సంబంధములేని శుద్ధ తాత్త్వికదృష్టితో జూచినచో భారత పుణ్యభూమిలో బయల్వెడలిన వానిలో నత్యంత మనోహరము, నతి ప్రసిద్ధమునైన తత్త్వము, శంకరాద్వైతము నుండి భేదించు నితర వేదాంతములుగాని, యే వేదాంతేతర తత్త్వములుగాని

---

* డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు స్మార్త బ్రాహ్మణ కుటుంబమున జన్మించినను వీరు సంపూర్ణముగ శాంకరతత్త్వావలంబులు కారు. వీరు శ్రీ శంకరుల అద్వైతమును అచ్చటచ్చట విమర్శించి వీరొక స్వతంత్ర దర్శనమును రచియించిరి. కొందఱు పూర్వాచార్యులవలెనే వీరును ప్రస్థానత్రయమునకు వీరి దర్శనానుసారము ఆంగ్లమున భాష్యములు రచియించిరి. శ్రీ శంకరుల దర్శనమునకును, రాధాకృష్ణదర్శనమునకును గల భేదము స్వల్పము కాదు.

సంప్రదాయసిద్ధములైనవని చెప్పబడు శంకరుని వేదాంత తత్త్వము చూపు ప్రజ్ఞాతిశయ ధైర్యగాంభీర్యములను జూపజాలవు." (భా. త. అ. 8. పుట. 338)

శ్రీ శంకరుల అద్వైతమును గురించి కనలల్ జాకోబ్‌గారు ఇట్లు వ్రాసిరని డా ||రాధాకృష్ణ పండితులు ఈ క్రింది వాక్యముల నుదాహరించిరి.

"ఉపనిషత్తులలోని వైరుధ్యము లన్నింటిని విడదీసి, సమ్యక్సామరస్య సంపద్విలసితమైన యొక తత్త్వముగా నిర్మించు దుస్తర కార్యమునకు బూనుకొన్నచో శంకరుని తత్త్వ మొక్కటే యిట్టి కార్యమును సాధించెనని చెప్పవలెను". (వేదాంత సూత్రమున కుపోద్ఘాతము - భా. త. పుట 380)

పైన చెప్పిన పాశ్చాత్యపండితు లిరువురును అద్వైతము నందు నిష్ణాతులు, అందువలన శ్రీ శంకరుల అద్వైతము ప్రాచీన వేదాంతమేగాని నవీన వేదాంతము కాదు.

శ్రీ లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయులు తమ 'గీతారహస్యము' నందు -" శ్రీ శంకర భగవత్పాదులు జన్మించినది మొదలు ఇంత పర్యంతము ఈ భూమిపైన అంతటి అలౌకిక తత్త్వవేత్త ఎప్పుడును జన్మించి యుండలేదు" అని వ్రాసియున్నారు. ఇది మరువరాని సత్యము.

వేదాంతమునకు మూలకర్త యెవరు? ఈ ప్రశ్నకు భగవంతుడు తానే కర్తనని భగవద్గీతయందు "వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్" (గీతా.15 - 15) వేదాంతములను చేసినవాడను, వేదమును తెలిసిన వాడును నేనే, అని చెప్పిరి. కనుక వేదాంతమునకు శ్రీ శంకరులు మూలపురుషులు (కర్త) కారు.

శ్రీ వివేకానందస్వాముల వారు "వేదాంతము" అను ఉపన్యాసమున నిట్లు చెప్పిరి :-

"శంకరాచార్యుల వారు అద్వైత సిద్ధాంతమునకు మూలకర్తయని మీరు తలపకూడదు. ఏది శంకరాచార్యులు పుట్టుటకు పూర్వము యుగాంతరములనుండి వచ్చుచున్నదో దాని తుది ప్రతినిధులలో ఈయన ఒకడు" (వివేకానంద సంపూర్ణ గ్రంథావళి సం. 6. పుట 430)*

---

* ఈ వాక్యములను రెండవ ప్రకరణమున (3౧) వ అధ్యాయమున దీక్షితులవారు శ్రీ శంకరులను నిందించిన సందర్భమున చెప్పియున్నారు.

ఇందువలనను, ఈ క్రింద చెప్పబోవు శ్రీ అరవిందుల వాక్యములవలనను శంకరాద్వైతము ప్రాచీన వేదాంతమని రూఢి యగుచున్నది.

శ్రీ అరవిందులు 'మాయ' అను వ్యాసమునం దిట్లు వ్రాసిరి:-

"ఆర్యజాతిని రక్షించుటకై భగవంతుడు పురాణముల యొక్కయు, తంత్రముల యొక్కయు ప్రచారముచే మాయావాదమును ప్రతిరోధించినాడు".

(శ్రీ అరవింద వ్యాసావళి.)

తమ పై వాక్యములవలన శ్రీ శంకరుల అద్వైతము తంత్రములు, పురాణములు రచియింపబడుటకు పూర్వమే యుండెనని శ్రీ అరవిందు లంగీకరించిరి.

## 6. అచలబోధ

ఆంధ్రదేశమునను; బెంగుళూరు, మద్రాసు మొదలగు చోట్లను అచలబోధ అచ్చటచ్చట కలదు. అది మొదట ఎట్లు వ్యాపించినదో చెప్పుట కష్టమే యైనను నాకు తోచినంత వఱకు ఈ గ్రంథము యొక్క తృతీయ భాగము పుట 550 లో ఇట్లు చెప్పియుంటిని :-

ఆంధ్రదేశము నందు బౌద్ధమున విజ్ఞాన - మాధ్యమిక శాఖలు స్థిరముగా కొన్ని శతాబ్దములు నిలిచియుండినందున ఆ శాఖల నుండియు, కొన్ని అంశములను గైకొని బౌద్ధము నవీన వేదాంతముగా రూపొందినది. అట్టి మార్పు ఎప్పటినుండి ఆరంభమైనదో చక్కగా చెప్పుట కష్టమే. అనగా:- బౌద్ధము పేరుమార్చుకొని తత్త్వమునందు ముఖ్యలక్షణమగు క్షణిక వాదమును వదలి వేదాంత వేషమును ధరించినది. అట్లు మారు వేషముతో, మార్పుతో ఉన్నవానియందు, శ్రీరామడగు శివరామదీక్షితులవారి 'అచలబోధ '- 'అచల వేదాంతము' అనున దొకటి యని నా యభిప్రాయము"

శ్రీ శంకరభగవత్పాదులు బౌద్ధమతమునందు ఏ లోపములను చూపి దానిని ఖండించిరో అట్టి లోపములను తదనంతర బౌద్ధులు చాలవఱకు సవరించుకొని మఱల హిందూమతమును గైకొనిరి, వేదాంత శాస్త్రము నభ్యసించుటకు స్త్రీ శూద్రాదులు అధికారులు కారను మధ్య యుగమునాటి నిషేధమును నవీన వేదాంతులు తొలగించిరి. నవీన వేదాంతమునందొక

శాఖయే అచల వేదాంత మనుపేర ఆంధ్ర ప్రదేశమునందు ముఖ్యముగా స్త్రీ శూద్రాదులయందు వ్యాప్తి గాంచెను.

"శ్రీ శివరామదీక్షితులవారి అచల వాదమును గుఱించి తరువాత తెలిపెద"నని ఈ గ్రంథముయొక్క ప్రథమ భాగమునందు నేను వ్రాసియుంటిని. అది యీ భాగమునందు పూర్తి అయినది. శివరామ దీక్షితులవారు చెప్పినది మాత్రమే అచలవాదమనే అనుకొనరాదు. వారి పుట్టుకకు పూర్వమే అచలబోధ కలదు. దానికిని దీక్షితులవారి బోధకును భేదమున్నది. ఈ విషయము ఈ భాగమున రెండవ ప్రకరణములో విపులముగా చర్చించితిని.

## 7. ఆంధ్ర దేశమునందలి యోగులు, యోగినులు

ఆంధ్రప్రదేశమునందు అచ్చటచ్చట సుమారు అయిదువందల సంవత్సరములనుండి ఎందరో మహానుభావులు జన్మించి తరించిరి. కొందఱి నామములు సయితము చరిత్ర కెక్కనే లేదు. ఇటీవల వారి చరిత్రను గుఱించి శ్రద్ధగా తెలిసికొనుచున్నారు. ముఖ్యముగా ప్రసిద్ధికెక్కినవారు కడపజిల్లా బద్వేలి తాలూకాలోని కందిమల్లాయపల్లెలో సమాధిచెందిన పోతులూరు వీరబ్రహ్మయ్యగారు (వీరు విశ్వ బ్రాహ్మణకులజులు). అదే తాలూకాలోని పలుగురాళ్లపల్లెలో నివసించియుండిన సుబ్రహ్మణ్యా అయ్యగారు (వీరు బ్రాహ్మణ కులజులు), పూదోట రామావధూతగారు, వీరి శిష్యులు అవధూత లింగమూర్తి గారు (లింగమూర్తిగారు రెడ్ల కులమున జన్మించినవారు), చిత్తూరుజిల్లా తరిగొండ గ్రామమున నుండిన తరిగొండ వెంగమాంబగారు (వీరు బ్రాహ్మణులు), యాగంటి క్షేత్రము నందుండిన యాగంటి లక్షుమయ్యగారు (వీరు పద్మశాలి కులజులట), వీరి శిష్యులు చిట్టెయ్యగారు, ఆదవని (ఆదోని) తిక్క లక్షుమమ్మగారు (వీరు అరుంధతీయ హరిజనకులమునకు చెందినవారు), కడపలో సమాధిపొందిన కర్నూలు నారాయణరెడ్డి గారు, శ్రీ వెంగగురుడు.

ప్రస్తుతము జీవించియుండు వారియందు ముమ్మడివరం బాలయోగిగారు (హరిజనులు), గుంటూరు జిల్లా రాజుపాళెము నందున్న బాలయోగిగారు, గుంటూరు జల్లా దొండపాడు గ్రామం కాపురస్థులు కోట బ్రహ్మవధూతగారు (ఈ కడపటి ఇరువురు విశ్వబ్రాహ్మణ కులజులు) కందుకూరు తాలూకా మొగిలిచెర్ల గ్రామములో 6-5-1976 తేదీన సమాధిచెందిన దత్తాత్రేయస్వాములవారు (వీరు కమ్మ కులమువారు).

ఇందులో పేర్కొన్నవారు అయాకులములకు చెందినవారని వ్యవహారమునకు చెప్పుదురుగాని, వీరిని అతివర్ణాశ్రము లనియందురు. వీరు గాక ఎందరో మహానుభావులు. లోకమునకు వారి జీవిత చరిత్రము తెలియకుండగనే జీవించి వారి భౌతిక దేహములను వదిలిరి.

పైన చెప్పినవారిలో కొందఱు సిద్ధపురుషులు. ఒక్క సమయమందే అనేక స్థలములయందు కనబడిరని వింటిని. అతిమానుషశక్తి సంపన్నులైనను కమ్మరము, వడ్రంగము మొదలగు పనులు చేసుకొని బీదతనముతో జీవితమును గడిపిరి. లింగావధూతగారు కానాల గ్రామమున చనిపోయిన ఒక వైశ్యయువకుని బ్రతికించిరి, గాని భిక్షాన్నముతోనే జీవితమును గడిపిరి. వారు కోరిరేని కోటీశ్వరులు కాగలిగినశక్తి వారి కుండియు ధనము కొరకు వారు మహిమలను చూపలేదు. వీరి జీవిత చరిత్రములను సంగ్రహముగా నైనను వ్రాసియుందునుగాని గ్రంథ విస్తర భీతిచేతను, పాఠక మహాశయులకు విసుగు కలుగునేమో అనియు వ్రాయుట మానితిని.

ఇచట ఒక విశేషము చెప్పవలసియున్నది. పైన చెప్పబడిన యోగులు - యోగినుల యందు కొందరు చదువురానివారు, వారి పూర్వజన్మ తపః ఫలము (సాధన ఫలము) ఈ జన్మమున వారి అంతఃకరణమునందు ప్రవేశించుటవలననో,మహాత్ముల అనుగ్రహమువలననో నిర్వికల్పసమాధి సిద్ధించి యుండిరని పెద్దలవలన నేను విన్నాను, ఇరువురను నేను చూచియుంటిని.

## 8. కొన్ని గ్రంథములు - కీర్తనలు

ఆంధ్రప్రదేశమునందు కొందఱు యోగులు కీర్తనలను, పద్యములను వ్రాసియున్నారు. వారిలో శతఘంటము సీతారామ యోగిగారి "స్వాంతవర్తి శతకము'. ఇతరులవి - అద్వైత్యబోధ, పూదోటవారి తత్త్వములు, పోతులూరు వీరబ్రహ్మంగారి వచనములు (కీర్తనలు), సిద్దయ్యగారి కీర్తనలు, తరిగొండ వెంగమ్మగారి వచనములు, ఆత్మ, యక్షగానము. యాగంటి వారి యాలలు, త్రిపురారిభట్ల సుబ్బగురుస్వాముల వచనములు (గ్రంథములు), శివగంగాచిదంబర స్వాములవారి వచనములు, శ్రీ పరశురామ పంతుల లింగమూర్తిగారి 'సీతారామాంజనేయ సంవాదము', ఇటీవల సుమారు 80 సంవత్సరముల క్రిందట సిద్ధిబొందిన శ్రీ విద్యానందనాథులను దీక్షానామముగల కనుపర్తి వేంకటరామయ్య గారి 'కైవల్యనవనీత 'మను గద్యపద్య గ్రంథము,

నారాయణ శతకము (స్త్రీలపాట), వేమన పద్యములు, వాసిష్ఠరామాయణము (ఇది యోగ వాసిష్ఠమునకు సంగ్రహముగ రచియింపబడిన పద్యగ్రంథము.) మొదలగు గ్రంథములు, కీర్తనలు పరిశీలించినట్లయిన, ఇందు చెప్పబడిన వేదాంతము శాస్త్రీయమైనదే. 'సీతారామాంజనేయ సంవాదము'నకు కలిగినంత ప్రచారము ఇతర యే తెలుగు వేదాంత గ్రంథమునకును కలుగలేదని చెప్పవచ్చును. ఈ గ్రంథకర్తకు శిష్యు లనేకులు ఉండెడివారట. శిష్యుల నాకర్షించుటకు కావలసిన హంగులను కొన్ని పద్యములయందు చెప్పియున్నారు. ఈ గ్రంథమునకు తరువాత ఎక్కువ ప్రచారము కలిగియుండెడిది 'కైవల్యనవనీతము'.

## 9. దీక్షితులవారి అచలబోధకు సంబంధించిన కొన్ని గ్రంథములు

శివరామ దీక్షితులవారి బృహద్వాసిష్ఠ సిద్ధాంతము, భాగవతుల కృష్ణంభట్లను నామాంతరము గల కృష్ణదాసుగారి కందార్థ దరువులు, కందములు, కీర్తనలు - రామసింగుగారి ద్విపదార్థ దరువులు - గాలన కోటప్పగారు, రంగస్వామి శ్రేష్ఠిగారు, మీరాసాయబ్‌గారు వ్రాసిన కీర్తనలు మొదలగునవి.

అచలబోధకు గౌరవము కలిగించినవారు పోకల శేషాచలం నాయుడుగారు, వీరు అచలగురు పీఠాధిపతులలో ఒకరు. వీరి కీర్తి యిప్పటికి ఆంధ్రదేశమున కలదు. వీరికి శిష్యు లనేకులు. వీరును, వీరి శిష్యులును వ్రాసిన గ్రంథములు కొన్ని గలవు. వీరి శిష్యులలో నొకరగు భోజరాజనువారు ఆదవని (ఆదోని ) లో 1905 సంవత్సరమున సమాధిచెందిరట. వీరివలనను, వీరి శిష్యులవలనను అచల బోధను తెలిసికొన్నవారు ఆదోని తాలూకాలో సుమారు ఇరువది వేలమంది కలరని వింటిని. బెంగుళూరు నందు సుమారు రెండువేలమంది అచలవాదులు కలరట. శేషాచలంనాయుడుగారి శిష్యులు మద్రాసు నగరమున పెక్కండ్రు కలరని వినియున్నారు.

చిత్తూరు జిల్లా వడమాలపేట అను గ్రామములో ఒక గురు పీఠమున్నది. వీరు బోధించునది శ్రీ శివరామ దీక్షితుల అచల బోధయే యని యందురు. వీరికి సుమారు రెండువేల మంది శిష్యులు గలరట.

శ్రీకాకుళం జిల్లా నరసన్నపేటలో శ్రీ శివరామ దీక్షితుల అచలగురు పీఠమున్నట్లు తెలియుచున్నది. ఈ పీఠాధిపతులు శ్రీ కూరాకుల రంగనాథ పంచదశీ స్వాములవారట.

నెల్లూరునందు ఒక అచలగురు పీఠముండెనేమో యని నా యనుమానము. నెల్లూరు పాటిబండ్ల సుందరరామయ్యగారను వారు 'రాజయోగ శతకము' ను, 'పాటిబండ్ల సుందరరామ శతకము ' ను, మఱికొన్ని శతకములను, ద్విపదలను వ్రాసి ముద్రించిన ఒక సంపుటిని నేను చదివితిని, తమ మార్గము అచలమార్గమని వారు చెప్పుకొనిరి. వారి కాలము -

**"శాలివాహనశకము చనిన వర్షంబులు**
**వేద రస ఋషి చంద్ర విధము దనరు"**

అని చెప్పియున్నందున శా. శ. 1764 లో ఆ గ్రంథమును రచియించిరి. సుమారు ఇప్పటికి 137 సంవత్సరముల క్రిందట వ్రాయబడినది.

కడపజిల్లా ప్రాతకడపకు చెందిన మోడంమీదిపల్లెలో శ్రీ శివరామదీక్షితుల అచలపీఠ మొకటి యున్నది. ఆ పీఠాధిపతి కీర్తిశేషులు శ్రీ కడిమెల్ల నరసరాజు. వీరు నాకు మిత్రులు, నిరాడంబరులు, శాస్త్ర పరిచయము కలవారు. సత్ప్రవర్తకులు, వీరికి శిష్య సంగ్రహమునందు వాంఛలేదు. వీరికి ఒక్కడే శిష్యుడు. నరసరాజుగారికిని నాకును తరచుగా వేదాంతచర్చ జరుగుచుండెను. వారు కీర్తిశేషులగువఱకు మా మైత్రి స్థిరముగా నుండెను.

సికిందరాబాదులో పొన్నాల రాజయ్యగారను శ్రీ దయానంద పొన్నాల రాజయోగి గారొకరు కలరు. వీరును శివరామ దీక్షితులవారి అచలగురు పీఠాధిపతులలో ఒకరని ప్రసిద్ధి. వీరికి శిష్యులనేకులు కలరు. వీరును, వీరి శిష్యులును కొన్ని గ్రంథములు రచియించిరి. ఇటీవల ఒకనాడు నా మిత్రులొకరు "రాజయోగ" అను వేదాంత మాసపత్రిక నొకసంచిక నిచ్చిరి. అట్టి మాసపత్రిక ఒకటి కలదని నాకప్పుడే తెలిసినది. ఆ సంచిక 15 - 2 - 1966 తేదీన వెలువడినది. దానిని చదివితిని. అందలి సారాంశము ఈ క్రింద సంగ్రహముగా వ్రాయుచున్నాను.

శ్రీ శివరామదీక్షిత గురు పీఠమను పేరు చెప్పుకొనుచు సికిందరాబాదు వాస్తవ్యులు (మాజీమంత్రి) అరిగె రామస్వామిగారు శిష్యులను చేర్చుకొని

"దాసబోధ" వంటి ఇతర బోధలు చేయుచున్నారని, రామస్వామిగారు ఆ విధముగా చేయుటకు వారికి హక్కు లేదని, శ్రీ శివరామ దీక్షిత గురు పీఠమున్నదని, ఆ పీఠమునకు శ్రీ దయానంద పొన్నాల రాజయోగిగారు అధిపతులని, ఆవిధముగా కోర్టువారు తీర్మానించుచూ, అరిగె రామస్వామిగారి పై చర్యలను నిషేధింపవలయునని శ్రీ రాజయోగిగారు వారి పీఠము పక్షమున డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టులో దావావేసిరి. ఆ కోర్టువారు ఆ దావాను విచారించి తీర్పులో "రాజయోగిగారికి పీఠాధిపత్య మీయబడిన యంశము ఋజువు కాలేదని" దావాను త్రోసివేసిరి. రాజయోగిగారు ఆ తీర్పుపై జిల్లాకోర్టుకు అప్పీలు చేసిరి. ఆ కోర్టువారును, అప్పీలును త్రోసివేసిరి. జిల్లా జడ్జిగారి తీర్పుపై రాజయోగిగారు హైకోర్టులో అప్పీలు చేసిరి. హైకోర్టులోను అప్పీలును తోసివేయుటచే రాజయోగిగారికి మూడు కోర్టులలోను ప్రతికూలమైనది. కాని, హైకోర్టు తీర్పునందు కొన్ని వాదనాంశములు రాజయోగిగారికిని, కొన్ని యంశములు రామస్వామిగారికిని అనుకూలముగా ఉన్నవట. హైకోర్టు తీర్పును గుఱించి రాజయోగిగారికి, రామస్వామిగారికి వాదోపవాదములు గ్రంథములద్వారా జరిగినవట. ఇరువురును జయము తమదేనని యూరేగింపుటుత్సవములు జరుపుకొనిరి. ఈ విధముగా శివరామ దీక్షితులవారి అచలవాదము రచ్చకెక్కి, వీధికెక్కి, మూడు కోర్టుల కెక్కినది.

## 10. బోధగురువులు, బాధగురువులు

అచలబోధను బోధింతుమని 'గురువుల'మని చెప్పుకొనువారిలో పెక్కండ్రు దీనిని వ్యాపారపద్ధతిలో ద్రవ్యార్జన కొక సాధనముగా ఉపయోగించుకొనుచున్నారు. కొందఱు గౌరవ ప్రతిష్ఠలకొఱకు ఈ వృత్తిని నవలంబించి యున్నారు. ఎవరో ఒకరిద్దరు పెద్దలు సంసారమునుండి ముముక్షువుల నుద్ధరింపవలెనని కరుణతో నీ బోధ చేయుచున్నారు. గురువుల 'యొద్దకు పోయి కారణము' పొందు శిష్య బృందమునందు కొందఱు డాంబికులు తాము గురువువద్ద "కారణము" (ఉపదేశము) బొందితిమని, పరమార్థ మెఱిగితిమని, లోకుల మెప్పునకు నటింతురు. మఱికొందరు నిజమైన జిజ్ఞాసువులు, ముముక్షువులు కలరు. వారిలో పెక్కండ్రు తమ పురాకృత దుష్కృతమువలన బోధగురువుల నాశ్రయింపక బాధగురువుల నాశ్రయించుచున్నారు. వారిని చూచిన నాకు పరితాపము కలుగును. భగవంతుడు వారికి ఈ గ్రంథము (బ్రహ్మజిజ్ఞాస)

సరియైన మార్గము చూపగలదని ఆశించుచున్నాను. ఈ భాగమునందలి 2 వ ప్రకరణమున "గురువులు - శాస్త్రములు" అను 40 వ అధ్యాయము చదివిన మఱికొన్ని సంగతులు బోధపడగలవు.

## 11. సద్గురుడు లభించునంతవఱకు ముముక్షువు చేయవలసిన పనియేమి?

సద్గురువు లభించువఱకు ముముక్షువు చేయవలసిన పనియేమి? ఈ ప్రశ్నకు సమాధానము స్వాధ్యాయము చేయుమని శాస్త్రములు చెప్పినవి. స్వాధ్యాయ మనగా: - వేదపఠనమేకదా? అని తలంపరాదు. వేదములే గాక, వేదాంతములు (ఉపనిషత్తులు), మహాభారత - భాగవతాది గ్రంథములు ;శ్రీ శంకరులు, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ వివేకానందస్వామి, శ్రీ రమణ మహర్షి మొదలగు మహాత్ములయొక్క చరిత్రములు, చదువుటకూడా స్వాధ్యాయమే. ఇది ఒక విధమగు తపస్సు. తైత్తిరీయ శ్రుతి యిట్లు చెప్పినది:-

**"ఋతంచ స్వాధ్యాయ ప్రవచనేన చ, తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేన చ, దమశ్చ స్వాధ్యాయ ప్రవచనేన చ, శమశ్చ స్వాధ్యాయ ప్రవచనేన చ, అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనేన చ, అగ్నిహోత్రం చ స్వాధ్యాయ ప్రవచనేన చ... (శిక్షావల్లి 9-వ అనువాకము)**

ఈ విధముగా సత్యవాక్కు, స్వాధ్యాయము చేయుట వలన సత్యము గ్రహించుట. అట్లు గ్రహించిన దానిని ఇతరులకు వినిపించుట ప్రవచన మనబడును. ఇట్లు - ఋతము, సత్యము, తపస్సు, దమము, శమము, అగ్నిహోత్రము మొదలగు వాటిని చెప్పినప్పుడు ప్రతిదానియందును స్వాధ్యాయ, ప్రవచనములు విడువక చెప్పియున్నందున, అధ్యయన అధ్యాపనములే ముఖ్యములని ముద్గల వంశీయుడగు మౌద్గల్యుడు చెప్పెను. అదే తపస్సు, సత్సాంగత్యముల వలన కూడ క్రమముగా ముక్తి లభింపవచ్చును.

## 12. మాలపల్లి (సంగవిజయము)

ఉన్నవ లక్ష్మినారాయణగారు మహాశయులు, వీరు 'మాలపల్లి' (సంగవిజయము) అను ఒక గ్రంథమును వ్రాసిరి. దానిని నవల యందురు. అది నవలయో, కావ్యమో గాని నేను దానిని ధర్మగ్రంథమనియు, అందు లౌకికములగు సాంఘిక, రాజకీయ, శృంగారాదులగు విషయములేగాక,

ముఖ్యముగా మోక్షధర్మము సయితము చెప్పబడియున్నదని నా యభిప్రాయము. ఆ గ్రంథమున కథానాయకుడు రామదాసు ( హరిజనుడు ) గురుముఖమున అచలబోధను తెలిసి కొన్నట్లున్నది. అందులోని పాత్రలలో ఒకరు అచలయోగి బుచ్చయ్య పంతులుగారు శుకమహర్షి వంటివారు. రామదాసు నింటిలో నీ క్రింద చెప్పబడిన గ్రంథము లున్నట్లు ('మాలపల్లి') అందు వ్రాయబడియున్నది. ఆ గ్రంథనామము లివి:-

"వెంగమ్మగారి రాజయోగసారమూ, శేషాచలం నాయుడుగారి పరమపదమార్గమూ, సిద్దప్పగారి తత్త్వాలూ, కోటయ్యగారి గురుకీర్తనలూ, శివరామ భాగవతులవారి తత్త్వకందార్థాలూ, వీరయ్యగారి యాలలూ, సీతారామాంజనేయ సంవాదమూ, బుచ్చయ్యగారి సాధన చతుష్టయము, శ్రీరామశాస్త్రిగారి భక్తియోగము."

ఇవే అచలగ్రంథములు, కాని యిందులో శ్రీ శివరామదీక్షితుల, శ్రీకృష్ణదాసుగార్ల మార్గము వేఱు. తక్కినవారి మార్గము వేఱు. ఈ విధముగా ఉన్నవ లక్ష్మినారాయణగారు తమ 'మాలపల్లి' ద్వారా అచలబోధయను వేదాంత మొకటి ఆంధ్రప్రదేశమున ఉన్నట్లు విద్యాధికులకు ఎఱుక పరచిరి. 'మాలపల్లి' రెండవ భాగమునందలి మూడవ ప్రకరణమునకు "అచలబోధ" అను శీర్షిక నిడిరి. ఆ ప్రకరణము నందు, వీరబ్రహ్మస్వాములవారు, యాగంటి లక్షుమయ్యగారు, నాసరయ్యగారు చెప్పిన తత్త్వములను మాత్రమే ఉదాహరించియున్నారు. నాసరయ్యగా రనగా - నాసరు మహమద్ గారు. వీరి గురువు గాలబ్ సాహెబ్ గారు. వీరి నామములబట్టియే వీరు జన్మతో ముసల్మానులని తెలిసికొన వచ్చును. వీరి కీర్తనలు కొన్ని చదివితిని. అవన్నియు అద్వైతమునే బోధించును. శివరామదీక్షితులవారి బోధను ఆ ప్రకరణమున ఇంచుకైనను వ్రాయలేదు. 'మాలపల్లి' ద్వారా అనేకులకు అచలబోధ యొకటి యున్నట్లు తెలిసినను, దాని స్వరూపమెట్టిది? అను విషయము పండితులలో సయితము అనేకులకు తెలియదు.

## 13. ఈ గ్రంథమున అచలబోధ ప్రసక్తి

ఈ గ్రంథముయొక్క ప్రథమభాగమునందలి మొదటి ప్రకరణమున 15 వ అధ్యాయమునకు " అచలవాదము "అను శీర్షిక నిడితిని. దానిని

చదివిన వారిలో కొందఱు" అచలబోధ " అని 'బ్రహ్మజిజ్ఞాస ' ప్రథమభాగమున మీరు వ్రాసితిరే - అది యెట్టిది? ధాని కాధారమైన గ్రంథము లేవి ? అని నన్ను ప్రశ్నించిరి. ఇట్లు ప్రశ్నించిన వారిలో ఒక స్వాములవారు (సన్న్యాసి) కూడా కలరు. వీరికొక పెద్ద ఆశ్రమము,శిష్యకోటి కలదు. అట్టి గొప్పవారనిపించుకున్నవారికే అచలబోధనుగుఱించి తెలియనప్పుడు, దానిని గుఱించి తప్పక వ్రాయుట యుక్తమని తలంచితిని, అద్వైతమునకంటె అచలబోధ గొప్పదేమో అను అభిప్రాయము కొందఱికి కలదు. నాకు తెలిసి సుమారు అర్ధశతాబ్దముగా ఈ యభిప్రాయము అచ్చటచ్చట ప్రచారములో కలదు. ఇట్లుండుటకు కొన్ని కారణములు కలవు. **కనుక ఆ యంశములను ఈ గ్రంథమున సంగ్రహముగనైనను చర్చింపకపోయితినేని "బ్రహ్మజిజ్ఞాస" సంపూర్ణ వేదాంత గ్రంథ మనిపించుకొనదు.**

## 14. అద్వైతమునకు అచలవాదము పైమెట్టు కాదు

దృష్టి-సృష్టి వాదమును బోధించు యోగ వాసిష్ఠము *అద్వైతమునకు పై మెట్టని కొందఱియందు ఒక యభిప్రాయము కలదు. ఈ యభిప్రాయము ఎట్లు ప్రాకినదో తెలియదు. ఈ విషయమున కొందఱు పండితులు సహితము పొరపడు చున్నట్లున్నది. ఉదాహరణమునకు - 'భారతి' మాసపత్రిక 1960 జూన్ నెలలో వెలువడిన సంచిక యందు ఒక అచలగ్రంథము సమీక్షింపబడినది. సమీక్ష వ్రాసినవారు - అద్వైతమునకు అచలము పై మెట్టని కొందఱు పెద్దల అభిప్రాయము - అను అర్థమిచ్చు వాక్యములను వ్రాసినట్లు నాకు జ్ఞాపక మున్నది. ప్రస్తుతము ఆ 'భారతి ' సంచిక నా వద్ద లేదు. సారాంశమేమనగా :-'భారతి 'వంటి సుప్రసిద్ధపత్రికకు సమీక్ష వ్రాయువారు గొప్ప పండితులే అయియుందురు. అంత గొప్ప పండితులకు సహితము

---

* యోగ వాసిష్ఠము 32 వేల శ్లోకముల గ్రంథమని తొలుత చెప్పియుంటిని. శ్రీ ము నాగలింగశాస్త్రులుగారు, దాని యందలి అరణ్యా వర్ణనాదులను, అనేక శ్లోకములు వదలి తక్కిన గ్రంథమును "జ్ఞాన వాసిష్ఠము" అను పేర ఆఱువేల శ్లోకములును, వాటికి తాత్పర్యమును రచియించిరి, దానిని "లఘుయోగవాసిష్ఠము" అనికూడ అందురు. దానిని " వావిళ్లవారు "ముద్రించిరి. అది యోగవాసిష్ఠముల కంటె నెక్కువ ప్రచారమునకు వచ్చినది. యోగ వాసిష్ఠమునందలి శ్లోకములు జ్ఞానవాసిష్ఠమునందు మార్పుచేయలేదు. - యోగ వాసిష్ఠమునకంటెను వేఱగు "గురు జ్ఞానవాసిష్ఠము" అను వేఱొక గ్రంథము కలదు. దానిని నేను చూడలేదు. దక్షిణామూర్తి కృతమని చెప్పబడు భావార్థ దీపికయు, భావార్థ సూత్రములు కలవట.

ఇట్టి సంశయ మెట్లు కలిగినది? అందుకు కారణము ఈ క్రింది సందర్భమును బట్టి ఉండునేమో అని నా అనుమానము. పోతులూరు వీరబ్రహ్మయ్యగారు యోగ వాసిష్ఠమునకు చెందిన తత్త్వవాది. వారి శాస్త్రీయ విచారమునకు ఆధారము యోగ వాసిష్ఠము, వారి అనుష్ఠానపద్ధతి పాతంజల రాజయోగము. యోగవాసిష్ఠమునందు సయితము యోగము విస్తరించి చెప్పబడినది. అచలవాదమునకు స్త్రీ శూద్రాదులు కూడా అధికారులే యనుటవలన అచలబోధ గొప్పదను భావము కలుగుటకు అదియు ఒక కారణమై యుండవచ్చును. వీర 'బ్రహ్మయ్యగారి వంటి పెద్దల వలన సాధువులలో కొంత ప్రచారము జరిగి అద్వైతమునకంటె అచలబోధ పై మెట్టను అభిప్రాయము అవిచారమువలన క్రమముగా ప్రబలుచు వచ్చినది. అప్పటికి శివరామదీక్షితులవారు జన్మించియుండలేదు. అందువలన నిందులో నేదైన ఘనత యున్న యీ ఘనత ప్రథమమున వారికి చెందినది కాదు. కనుక, శివరామదీక్షితులవారి అచలబోధ అద్వైతమునకంటె పై మెట్టని కాని, అద్వైతమునకంటె శ్రేష్ఠమనికాని చెప్పుట సరికాదు.

అచలవాదము, తమ బోధ-శాక్తాద్వైతము నుండియు, బౌద్ధమతము నుండియు, కాలక్రమమున అచ్చటచ్చట కొన్ని మార్పులతోను చేర్పులతోను ఈ రూపమును ధరించినదని వా రెఱుగరు. ఈ గ్రంథ భాగముయొక్క రెండవ ప్రకరణము చదివిన ఎఱుగవచ్చును. ఏది యెట్లున్నను, కొందఱు జిజ్ఞాసువులకు దీక్షితులవారి అచలవాదమునందు వ్యామోహ మెందుకనగా?-

## 15. సమాజము - కృత్రిమములు

మానవులలో అధిక సంఖ్యాకులు తాము చేరదలచిన చోటునకు రాజమార్గమున్నను అది కొంతదూరము ప్రయాణము చేయవలసి యున్నచో దగ్గరత్రోవను వెదకుదురు. దగ్గర త్రోవ గమ్యస్థానమును చేర్చునా, లేక ఒక మహారణ్యమునకు కొనిపోవునా? అని యోచింపనివారును కలరు. దగ్గరత్రోవ కంటకావృతమైనను సరకు చేయరు. గమ్యస్థానమును త్వరగా చేరుదుమన్న ఆశ (ఆతురత) వారి నట్లు ప్రేరేపించును. ఇది లౌకిక విషయము, ఈ భావము ముముక్షువులయందును కలదు.

సాధన చతుష్టయమును సాధించిన పిమ్మట వేదాంతశాస్త్ర శ్రవణము, మననము, నిదిధ్యాస మొదలగునవి అలవరచుకొనక బ్రహ్మానుభవము కలుగదని శాస్త్రములు, పెద్దలు చెప్పియున్నందున, ఇన్ని శ్రమలకోర్చి చేసిన సాధనవలన ఈ జన్మముననో, రాబోవు జన్మముననో మోక్షము కలుగుననిన నిరుత్సాహముతో నెట్టి కష్టములును లేక మోక్షమును సాధించు దగ్గరత్రోవ యేదైనా కలదా? అని యోచింతురు.

విచారింపగా ఉన్నదని గురువు నాశ్రయించిన ఒక్క దినముననే బ్రహ్మమును పొందవచ్చునని విందురు, దానితో ఆ ముముక్షువునకు ఒక విధమగు ఊరట (సంతృప్తి) కలిగి, ఒక గురువు నాశ్రయించును. గురువు "అదిగో బ్రహ్మము (అచలము)" అని చూపును. ముముక్షువు దానితో తృప్తిపొందును. అతనికి బ్రహ్మమేదో, అది యెట్లుండునో, తెలిసికొనుటకు శాస్త్రజ్ఞానము లేదు. గురువు చెప్పినది నమ్మును. -సాధారణముగ లోకుల యొక్క పోకడ యీ క్రింద చెప్పబోవు విధమున నుండును :-

ఒకగొప్ప శ్రీమంతుని భార్య బంగారు వజ్రాభరణములు ధరించును. పట్టుచీరలు కట్టును. ఆమె కెదురింటి గృహిణి సామాన్య కుటుంబమునకు చెందినది. ఆమెకు ఆమె ఎదురింటి శ్రీమంతురాలు ధరించిన వస్త్రాభరణములను కొని పెట్టమని తనభర్తను కోరును. వాని విలువ తెలిసిన ఆమె భర్తకు తన భార్య కోర్కెను తీర్చుట అసాధ్యమని తెలియును. కాని, ఇల్లాలి అభీష్టసిద్ధికి దగ్గరత్రోవ వెదకును. వజ్రములకు మారుగా రంగూన్ వజ్రములు కలవు. అవి కృత్రిమమైనవి. సహజ వజ్రముల వలెనే కనబడును. అతడు వానిని కొని బంగారమునందు పొదిగించి కంఠహారము చేయించెను. ఆ గృహిణి దానిని ధరించును. ఎదురింటి శ్రీ మంతునిభార్య కంఠమునందు గల వజ్రహారమునకును, తన కంఠమునందు గల కృత్రిమ వజ్రహారమునకును గల భేదము ఆ గృహిణికి తెలియదు. ఆమెవలెనే పామర (సాధారణ) జనులనేకులు తెలిసికొనజాలరు. కృత్రిమ వజ్రహారముతో ఆ గృహిణి తృప్తి చెందును. ఏమైనను తృప్తియే ప్రధానము కదా? బీదవారు బంగారమునకు మారుగ కొమ్మిత్తలి సొమ్ములు ధరింతురు. పట్టువస్త్రములకు మారుగ రాతిపట్టు (Artificial Silk) వస్త్రములు ధరించి తృప్తి చెందుదురు. ప్రాపంచిక వ్యవస్థలో

యిది తప్పు కాదు. పారమార్థిక వ్యవస్థలో ఇట్టిది చాల తప్పే యగును. ఇంతటి ప్రమాదము మఱియొకటి యుండదు.

ప్రస్తుత సమాజమున విలువగల ప్రతి పదార్థమునకును ప్రత్యామ్నాయమగు (పోటీగా) వేఱొక చౌకబారు (తక్కువ వెల గల) పదార్థమును చేసియున్నారు. ఆయా పదార్థముల విలువను తెలిసికొనిన కొందరు వ్యక్తులకు తప్ప తక్కినవారికి, సహజము లేవి? కృత్రిమము లేవి? అను భేదము తెలియనట్లే - పరతత్త్వ మిట్టిదని తెలియని గురువులచెంత చేరి వారు చెప్పినదే నిజమని నమ్ముచున్నారు. "కాననివాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్ కానని భంగి "అను ప్రహ్లాదుని ప్రవచనము ఇట్టివారియెడ సార్థక మగుచున్నది.

లౌకిక విషయములయందు సహితము ఒక చిన్నతప్పు పెద్ద కష్టమునకు కారణ మగుచున్నది. ఇందులకు ఒక దృష్టాంతమును చెప్పెదను: - కడప రైల్వేస్టేషన్‌లో మధ్యాహ్నము మద్రాసు నుండి బొంబాయికి పోవు రైలును. బొంబాయినుండి మద్రాసుకు పోవు రైలును వచ్చి అచ్చట కొంతసేపు నిలిచి యుండును. పల్లెటూరి ఒక అమాయకుడు మద్రాసునకు పోదలచి టికెట్టుకొని అచట ఉన్న తనవలెనే తెలియనివాని నొకని "మద్రాసుకు పోవు రైలు ఏ"దని అడిగిన,అడుగబడినవాడు బొంబాయికి పోవు రైలును చూపెననుకొనుడు, ఆ ప్రయాణికు డామాటను నమ్మి బొంబాయికి పోవు రైలులో కూర్చుండి బొంబాయిని చేరి అచ్చట ఎట్టి యిడుముల పాలగునో - పరమపదమును చేరగోరినవాడు, తెలియని వానిని గురువుగా నమ్ముకొనిన, అంతకంటె గొప్ప దుర్దశనే పొందును.

ఇంద్రియనిగ్రహము మొదలగు శ్రమలును లేకయే బ్రహ్మమును చూపెదమని చెప్పెడి వారిలో శివరామదీక్షితులకోవకు చెందిన కృష్ణదాసుగారు రచియించిన ఒక కీర్తనలో కొంతభాగమును, నీ క్రింద నుదాహరింతును. దానివలన వారి బోధ యెట్టిదో బోధపడును.

పల్లవి

"నరులారా! విని కనుడి - అరమర లేని యీ

పరిపూర్ణమగు బోధను, భవాంబుధి తరియింతు-రిటమీదను.

... ... ... ... ... ... ... ...

చదువులలోపలి తుది యర్థమగు దీని

మరుగు దెలియని వారలు.

హృషీకముల కుదియింపగా బోదురు

విషయేచ్ఛల వదలియుండ దలతురు

కామాదుల కుదురు గూల్చెద మందురు

మొదలులేని వీటి పదిల పరచుటె కల్ల

కదలక యున్నది యెదుర *బ్రహ్మము జూడ.* ||నరులార||

వారి అచలబోధయొక్క స్వరూపమును తెలిసికొనుటకు ఈ కీర్తన ఒక మచ్చుతునక. వారిట్లు ప్రశ్నింపవచ్చును :-

"యోగ (జ్ఞాన) వాసిష్ఠము "స్థితి ప్రకరణము 17 వ సర్గయందును, "శ్రీ సీతారామాంజనేయ సంవాదము" (3-41) లోను, "జాజిపువ్వును నలుపుటకంటెను, అమనస్కయోగము సులభమగు" ననిరి కదా? నిజమే, ఆ గ్రంథములయందే అందుకు విరుద్ధముగ" సముద్రోదకము నంతయు త్రాగుటకంటెను, మేరుపర్వతమును నిర్మూలించుటకంటెను చిత్తనిగ్రహము కష్టము" (వే. పం. 7-21) అనియు -" అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్కరీతిగా గలయగ నీదవచ్చును ...... అమనస్క యోగము గ్రహింపగరాదు దలంప నేరిన్కి" (సీ. రా. సం.) అని ఉన్నది. ఈ వాక్యములను వదలి (జిజ్ఞాసువులకు) పైన చెప్పిన సులభోపాయమును తెలుపునట్టి పద్యముల నుదాహరింతురు. ఈ యంశమును, ఈ గ్రంథముయొక్క రెండవభాగము ఒకటవ ప్రకరణమున" మనోనాశ తత్త్వజ్ఞానములు "అను (౨౧ వ) అధ్యాయమున చర్చించియున్నాను.

అయితే యీ పరస్పర విరుద్ధాంశముల సమన్వయ మెట్లు? అనిన - భగవద్గీత 16వ అధ్యాయమున చెప్పిన దైవసంపద గలవారికి అమనస్కయోగము సులభము, అసుర సంపద గల వారికి కష్టము, వసిష్ఠమహర్షి శ్రీరాముని కిట్లుపదేశించెను -

శ్లో|| ఉపదేశక్రమో రామ! వ్యవస్థామాత్ర పాలనమ్|
జ్ఞప్తేస్తు కారణం శుద్ధా శిష్యప్రజ్ఞైవ కేవలా||

(జ్ఞా. వా. 37 - 134)

తా|| ఓ రామచంద్రా! గురువువలన ఉపదేశింపబడిన మోక్షోపాయము జ్ఞానశాస్త్రమున మర్యాదకు మాత్రమే, అనగా జ్ఞానశాస్త్రమున చెప్పబడినదానికి విరుద్ధముగాక, దాని ననుసరించియున్నదా అని సరిచూచుకొనుటకే గాని, ఆత్మసాక్షాత్కారము కలుగవలయునన్న కేవల గురూపదేశము మాత్రమే చాలదు. శుద్ధమగు శిష్యుని బుద్ధియే సమర్థమై యున్నది.

భారతీయ సంస్కృతిగా హిందూమతమునందలి గొప్పతన మేమనగా:- మన మతతత్త్వమును అందఱికి సరిపడు నట్లు వివిధరూపముల పెక్కు రీతుల కుట్టి సిద్ధముగా ఉంచిన వస్త్రాలయము (Readymade shop) తో పోల్చవచ్చును. అనగా : పిల్లలు, పెద్దలు, స్థూలకాయులు, బక్కచిక్కినవారు, పొడుగు వారు, పొట్టివారు మొదలగువా రా వస్త్రాలయమునకు పోయిన వారివారికి చక్కగా సరిపడునట్టి వస్త్రములను ఎన్నుకొని సంతసింతురు. అట్లే సంఘమున భిన్న భిన్న సంస్కారములు గల వ్యక్తులు అధికారిభేదమును బట్టి మంత్రజపమో, దానమో, ధ్యానమో, సాకార సగుణభక్తియో, తత్త్వజ్ఞానమో- యేదియో యొకదాని నవలంబించి క్రిందివారు క్రమముగా నీ జన్మముననో, రాబోవు జన్మముననో తత్త్వజ్ఞానులై ముక్తు లగుటకు అవకాశ మున్నది. క్రైస్తవ మతములవంటి మతములలో అందఱికి ఒక చొక్కానే కుట్టి పెట్టి యున్నట్లు, అక్కడ అధికారిభేదమునకు తగినట్లులేదు. (ఈ వాక్యములు క్రైస్తవమతమునకే గాని, క్రీస్తు ప్రభువున కన్వయింపవు. ఆయన అద్వైతి.) ఈ యంశమును చక్కగా శ్రీకృష్ణభగవానుడు గీతయందట్లుపదేశించెను :-

"అర్జునా! కర్మయందాసక్తులైన అజ్ఞానులకు బుద్ధిభేదమును కలిగింపరాదు. అనగా - యజ్ఞ, యాగ, తప, జపాదులవలన ప్రయోజనము లేదని వారిని

వాటినుండి మరలింపరాదు. జ్ఞానియు కర్మలను చేయుచునే అజ్ఞానులవలనగూడ కర్మలను చేయింపవలయును." (గీత. 3-25, 26)

పై యంశమును ఈ భాగమునందలి రెండవ ప్రకరణమున దీక్షితులవారు చేసిన "మతనిరసనము" అను 29వ అధ్యాయమున చర్చింతిని. శివరామ దీక్షితులవారికి లభించిన "అచలమార్గము" బ్రహ్మాదులకు సైతము లభింపలేదట, భగవంతుడగు శివుడు కూడ నీ మార్గమును తెలియక అనేక అగచాట్లు పడుచున్నాడట. ఇట్టివి రెండవ ప్రకరణమున చదువగలరు. పాఠకమహాశయులు అచ్చట నీ వాక్యములు చదివిన పిమ్మట, ఇది హిందూమతతత్త్వమా? కాదా? అని వారే నిశ్చయించుకోగలరు.

శ్రీరామకృష్ణపరమహంస, శ్రీరామతీర్థస్వామి మున్నగు మహాత్ములు ఆత్మసాక్షాత్కారముకొఱకు అనేక కష్టములను అనుభవించినట్లు వారి జీవితచరిత్రలయందు మనము చదివియుండలేదా? వైరాగ్యము మోక్షసాధమునకు పునాదివంటిది, గురువు చూపినదే పరతత్త్వమని అంతకుపైన ఏమియు లేదని కొందఱు శిష్యులు సంతృప్తి చెందుదురు.

ఈ సందర్భమున ఒకమాట చెప్పవలసియున్నది. ఏమన:- వారి గురువు వారిని మోసగించెనని నే ననను. అతడును అతని గురువు వలన తెలిసికొని నమ్మియున్న దదే కావచ్చును. కాని, గురువు లనిపించుకొను చుండునట్టి వారందఱు అట్టివారు కారు. కొందరు తమకు పరతత్త్వము తెలియదని తెలిసియును, ద్రవ్యార్జనకొఱకు అమాయకులను మోసగించు చుందురు. గురుకృపవలన ఒక్కదినములో బ్రహ్మమును (అచలమును) చూచితిమని తృప్తి చెందిన ముముక్షువులలో కొందఱితో నాకు పరిచయమున్నది. ఈ చతుర్థభాగమును శ్రద్ధతో పఠించినవారికి సహజమేదో; కృత్రిమము (నకిలీ) ఏదో తెలియగలదని ఆశించుచున్నాను. ఏ ఒక్క ముముక్షువునకైనను ఈ గ్రంథమును చదువుట వలన మేలు కలిగెనేని నా శ్రమ సార్థక మగును. పరమేశ్వరు డట్లనుగ్రహించుగాక!

కొందఱు అచలగురువులు తమకు శిష్యులు కాబోవు వారికి ఉపదేశము చేయుటకు ముందు తాము ( గురువు) చెప్పబోవు రహస్యమును ఇతరుల కెరిగింపరాదని శిష్యునిచేత ప్రమాణమును చేయింతురు. కొందఱు పాత్రలో

పాలుపోసి దానిని శిష్యుడు కాబోవు వానిచేతులో పెట్టి ప్రమాణము చేయింతురు. ఈ పద్ధతులు ఒక్కొక్క రొక్కొక్క విధముగా చేయింతురని వింటిని. కొందఱు ప్రమాణమును చేయింతురుగాని, "ఈ గురు గుహ్యమును ఇతరుల కెఱిగించిన గురుద్రోహ మహాపాతకము కలుగుననియు, కులక్షయమగు "ననియు భయమును కలిగింతురు. అచలవాదులను ఎవరైన నేదైన ప్రశ్నించిన"మాకు అధికారము లేదు. మా గురువుగారి దగ్గరకు వెళ్లు" మందురు. ఆవిధముగా వారు కనుగొన్న అచలము ఉపనిషత్తులు చెప్పిన పరబ్రహ్మ మగునో కాదో పరిశీలించుకొనుటకు వారికి అవకాశము లేదు.

## 16. ఈ గ్రంథరచన

బ్రహ్మజిజ్ఞాస ప్రథమభాగము శాంకర తత్త్వమును తెలియజేయును. ద్వితీయభాగము పంచవిధ మోక్షోపాయమును తెలియజేయును. అనగా - జ్ఞానయోగ, రాజయోగ, కర్మయోగ, భక్తియోగ, ప్రపత్తి -లు ప్రపంచమున గల యే ఆస్తికమతమైనను, ఈ పంచవిధ మోక్షోపాయములలో చేరియే యుండును. ఆయా మతముల వారుపయోగించు పేర్లు భిన్నములు కావచ్చును, సాధనములు ఏకీభవించును.-

తృతీయభాగము షడ్దర్శనములను, షణ్మతములను వివరించును. ఇందులో భారతీయ తత్త్వమంతయు సంగ్రహించి చెప్పబడినది. - చతుర్థభాగము తమ హస్తమునం దున్నందున ప్రత్యేకించి చెప్ప నవసరములేదు. మొత్తము గ్రంథమందంతయు పదునాఱు ప్రకరణములు కలవు. సుమారు, 2000 పుటలకు పైబడును. ఇందులో పత్రికలు, పెద్దలు ఈ గ్రంథమును గుఱించి వ్రాసిన అభిప్రాయములు, సమీక్షలు ముద్రించియుండు పుటలసంఖ్య చేర్చలేదు.

ఈ చతుర్థభాగమునందు మొదటి ప్రకరణమున - శ్రీ జ్ఞానేశ్వరులవారి అమృతానుభవమును గుఱించి నాకు సమగ్ర వివేకము లేకపోయినను వారి అమృతానుభవము నందు ప్రధానముగా శ్రీ శంకరభగవత్పాదుల మాయావాద ఖండనమే యున్నందున వారివాదము (మాయావాద ఖండనము)శాస్త్ర విరుద్ధమని శాస్త్ర ప్రమాణములను చూపి నిరూపించితిని. శ్రీ జ్ఞానేశ్వరులు, శ్రీఅరవిందులు, శ్రీసమర్థరామదాసస్వామి, యోగవాసిష్ఠకర్త - వీరు రచియించిన శివశక్తి తత్త్వములను సంగ్రహముగ వివరించితిని.

రెండవ ప్రకరణమున శివరామదీక్షితులవారి అచలబోధను గుఱించి తెలిపితిని. దీక్షితులవారి అచలబోధ సుమారు రెండువందల సంవత్సరములుగ అచ్చటచ్చట ఇంచుక ప్రబలముగను వ్యాప్తిలోనికి వచ్చుచున్నది. బ్రహ్మవాదులు దానిని సాంగోపాంగముగ పరిశీలించి దాని స్వరూప మిట్టిదని యింతవఱకు లోకము నెదుట పెట్టి యుండలేదు. ఆంధ్రప్రదేశమున వేదాంతమును నాకంటె గొప్పగా తెలిసిన పెద్దలున్నను, వారు దీక్షితులవారి అచలబోధను గడ్డిపోచను చూచినంత చులకనగా చూచి మాటలతో త్రోసివేసిరే కాని గ్రంథరచన చేయలేదు. అందులకు కారణము వారు (వేదాంతులు) దీక్షితులవారి యొక్కయు, వారి శిష్యుల యొక్కయు గ్రంథములను తుచ్ఛములని తలచుటచేతనో, లేక అలసత్వమువలన చదువకనో అచలమత పరిశీలనము చేయు గ్రంథములను రచియింపక కాలము గడచిపోయి యుండవచ్చును.

ఎవరో ఒకానొకరు చదివినను సరియైన దృష్టితో చదివి అవగాహన చేసికొనక దీక్షితులవారిని, వారి అనుయాయులను విమర్శించి వారివలన నిందింపబడిరి. అట్టి రచనల వలన వ్రాసినవారికిగాని, లోకమునకుగాని యెట్టిమేలును చేకూరకపోయినది. దీక్షితులవారు వేదాంతులను, హిందూమత సంప్రదాయములను పెక్కురీతుల నిందించి పాతకులను రెచ్చగొట్టునట్టి వాక్యము లనేకములను వ్రాసియున్నను, ఎవరి పాప పుణ్యములను వారనుభవంతురని శాంత చిత్తముతో శాస్త్రోచిత విధానమున సమాధాన మిచ్చితినేగాని శ్రీదీక్షితులను నేను నిందింపలేదు.

శ్రీ శివరామదీక్షితులు వ్రాసిన, వారి "బృహద్వాసిష్ఠ సిద్ధాంతము" నందు మొదటి నుండి తుదివఱకును అద్వైత నిరసనమును ప్రధానాంశముగా గైకొనియున్నారు. అదియు శాస్త్ర ప్రమాణములను చూపకయే వారి యిష్టము వచ్చినట్లు నిందించిరి. శ్రీ శంకరభగవత్పాదులను పలుచోట్ల నిందించిరి. శ్రీ శంకరులను, సీతాదేవిని, బ్రహ్మాది దేవతలను నిందించిరి. ఆ భాగములను రెండవ ప్రకరణమున క్రమముగా 30, 31, 32, అధ్యాయములయం దుదాహరించి వారికి తగిన సమాధాన మొసంగితిని. ఈ చతుర్థ భాగము నందలి అచలబోధను - సుమారు ముప్పది సంవత్సరములుగా వ్యాధిపీడితుడను. పాండిత్యము లేనివాడను, 76 సంవత్సరములకే వృద్ధుడ నైనట్టివాడనగు నేను వ్రాయుటకంటె -శృంగగిరి శ్రీ శారదా పీఠాధీశ్వరులును, శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య,

శ్రీ జగద్గురు శ్రీ చంద్రశేఖర భారతీస్వామి భగవత్పాదులును,శ్రీవారి శిష్యులగు శ్రీ జగద్గురు శృంగేరి శ్రీమదభినవ విద్యాతీర్థ స్వాములవారును, వారి శిష్యకోటిలోని వారి నొకరిని "అచలమత విమర్శనము చేయుమని "నియోగించి యుండిన బాగుండెడిది. ప్రాజ్ఞులెవ్వరును ఈ కార్యము చేయనందున అజ్ఞుడనగు నేనే యీ కార్య మొనర్పవలసివచ్చినది. ఐనను నేను వ్యాధిచే ఇంటనుండి బయట తిరగకుండ చేయుట నా ప్రారబ్ధఫలమే అయినను కీడులో మేలనునట్లు 'బ్రహ్మజిజ్ఞాస 'ను వ్రాయగలిగిన సుకృతముకూడ భగవంతుడే కలిగించినాడు.

*నేను గ్రంథరచన యందవలంబించిన పద్ధతి యేమన :*

రైలు పట్టాలు రెండు ఒకదాని ప్రక్కన వేఱొకటి యున్నట్లు దీక్షితులవారి అచలవాదమును - వేదాంతమును ఒకదాని ప్రక్క మఱియొక దానిని వ్రాసి (చూపించి) ముముక్షువులగు పాఠకమహాశయులు ఈ రెంటిలో దేనిని ఆమోదింతురో చూచుకొనునట్లు వ్రాసితిని. మఱియు శ్రీ జ్ఞానేశ్వరాదులగు దర్శనకారుల తత్త్వములను కూడా అదేవిధముగా దీక్షితులబోధకు ప్రక్కనే వ్రాసి, వాటితో దీక్షితులవారి బోధ యెంతవఱకు సరిపోవునో, ఎంతవఱకు విరుద్ధమగునో చూపినట్లు చెప్పితిని. ఈ విధముగ అచల పరిశీలమును నాకు తెలిసినంతవఱకు ఎవ్వరును చేయలేదు. ఈ కరుణామూర్తియగు భగవంతుడు ఈ క్షుద్రునియందు తన కరుణామృతదృష్టిని ప్రసరింపజేసి వీనిని (నన్ను) ఒక సాధనముగా ఈ కార్యమును చేయించెనని నా స్థిరమైన నమ్మకము. నే నీ గ్రంథమును వ్రాసితిననగా - భగవంతుడే ఈ గ్రంథరచనమునకు నన్నొక లేఖినిగా ఉపయోగించుకొని రచియించెనని నమ్మకము.

ఒక గ్రంథమును రచియించుటకుగాని, ఒక గ్రంథమునకు వ్యాఖ్యానమును రచియించుటకుగాని అవలంబింప వలసిన షడ్విధ తాత్పర్యలింగములయందు 'అపూర్వ' మను లింగముండవలయు నందురు. అచలవాద పరిశీలనమే యీ గ్రంథమునందుండు "అపూర్వము". ఈ గ్రంథమున అధికార చతుష్టయమును శాస్త్రోక్తక్రమమున చెప్పియున్నాను.

ఈ గ్రంథభాగమును ముద్రించుటయందు రెండవ ప్రకరణమునందు **శ్రీ శివరామదీక్షితులయొక్కయు, వారి శిష్యులయొక్కయు గ్రంథములనుండి**

యుదాహరించిన వాక్యములకు అక్షరములు (లిపి - TYPE) తదితర బైపుకన్నను భిన్నమైనవి. అనగా: కొంచెము పెద్ద అక్షరము లుండును. ముద్రణాలయము వారు దానిని 16-వ పాయింటుబైపు అందురు. సూక్ష్మముగా చూచిన తెలియును. పాఠక మహాశయులు "ఇవి అచలవాదుల వాక్యము" లని సులభముగా తెలిసికొనవలెనని అట్లొనర్చితిని.

రెండవ ప్రకరణమున కేవలము అచలవాద పరిశీలనమేగాక ఆ సందర్భమున అనుషంగికముగా చెప్పవలసిన పరమార్థతత్త్వము నందలి అనేక నిగూఢ విషయములను వెల్లడించియున్నాను. మహర్షులు, పూర్వాచార్యులు గ్రంథమును వ్రాయుటయందు ఒక పద్ధతిని అవలంబించిరి, ఎట్లన :- ఎవరో ఒకరు ఒక మహర్షిని ప్రశ్నించినట్లును, ఆ మహర్షి సమాధాన మిచ్చునట్లును భారత, భాగవతాది గ్రంథములయందు చదివియున్నాము. ఆ పద్ధతిని విడనాడక యీ గ్రంథమున ఒకజిజ్ఞాసువు వేదాంతిని ప్రశ్నించునట్లును, వేదాంతి చెప్పుచు పోవునట్లును వ్రాసితిని. చతుర్థభాగమున మొదటి ప్రకరణము రెండవ ప్రకరణమునకు ప్రవేశిక వంటిది. వేదాంతమునందు సామాన్యప్రవేశము కలిగిన వారికి ఈ గ్రంథము అత్యంతోపకారి కాగలదని ఆశించుచున్నాను. ముఖ్యముగా ఈ చతుర్థభాగము అచల సంప్రదాయమునకు చెందినవారికి, అందును శివరామదీక్షితుల కోవకు చెందిన వారికి నెక్కువ ఫలకారి యగునని నా నమ్మకము. సహృదయముతో వారు ఈ గ్రంథమును చదువుదురని ఆశించుచున్నాను.

అచలవాదమును పరిశీలించు సందర్భమున దాని నేవిధముగానైన ఖండింపవలయునను తలంపు నాకు లేదు. శ్రీ శివరామదీక్షితుల యొక్కయు, కృష్ణదాసుగారియొక్కయు వాక్యముల నుదాహరించునపుడు వారి బోధస్వరూపమును తారుమారు చేయక ఉన్నది ఉన్నట్లు, లోకమునకు చూపించుటయే నా యుద్దేశము. అట్టి సందర్భములయందు అచలవాదమునకు సమీపవర్తియగు నితరతత్త్వములను, అచలబోధను బలపరచు శాస్త్రవాక్యములను దాచుకొనక అవి ఏప్రమాణ గ్రంథముల యందున్నవో వాటిని సైతముదాహరించియున్నాను. అందువలన నా పరిశీలనము వారికి కొంతవఱకైన తోడ్పడగలదని ఆశించుచున్నాము.

ఈ భాగమునందలి మూడవ ప్రకరణము 'ముగింపు' (ఉపసంహారము), ప్రస్తుత కాలమున సంఘమునందు స్వల్పముగ ప్రచారమునందున్న రెండు తత్త్వములను ఇందు సంగ్రహముగ వివరించితిని.

ఈ భాగమునందలి తాత్త్వికాంశములు మిగుల జటిలమైన వగుట వలన నా యజ్ఞానకృతి దోషములుగాని, పొరపాటున గలిగిన లోపములుగాని, ఉన్నచో పెద్దలు మన్నింపవలెనని ప్రార్థన. ఒకవేళ తప్పులున్నయెడల దయతో నాకు తెలిపిన కృతజ్ఞతతో స్వీకరింతును. లోకమున సర్వజ్ఞుడు లేడుగదా? ఒక వేళ సర్వజ్ఞు లున్నారని అంగీకరించినను నేను సర్వజ్ఞుడను కాను. తనతప్పు తనకు తెలిపిన తద్జ్ఞులను నిందింపరాదు. మానవుడు తన జీవితకాలమునందే తన యందలి దోషమును తాను తెలిసికొని సవరించుకొనినచో ధన్యుడు. అట్లుగాక - తన తప్పును తానెఱుగక యీలోకమును వదలినవాడు దురదృష్టవంతుడు. కనుక నాతప్పును నాకు తెలిపిన వారియెడల నేను కృతజ్ఞుడను. నా రచనయందు తప్పు లేకున్నను తప్పని చెప్పువారికి నేను ప్రత్యుత్తర మివ్వను. వారికి తప్పని తోచినదానికి సమాధానము ఈ గ్రంథమున నెచ్చటనో ఉండును. కనుక, సావధానముగ గ్రంథమును పూర్ణముగ చదువక యెచ్చటనో ఒకచోట చదివి, తప్పు కానిదానిని చూచి తప్పని భ్రమించకుందురు గాక! అట్టివారితో నెదురువాదమునకు పూనుకొనను.

ఈ గ్రంథమున ఒకచోట చెప్పిన వాక్యములనే ఆ యా సందర్భములను బట్టి మఱల మఱల చెప్పవలసి వచ్చెను. వేదాంత శాస్త్రములయందు పునరుక్తి దోషము లేదు. జిజ్ఞాసువులకు బోధ దృఢపడుటకై అట్లు చెప్పవలసిన విధి యేర్పడును. ఉదాహరణకు :- ఛాందోగ్యశ్రుతియందు ఉద్దాలక మహర్షి శ్వేతకేతునకు "తత్త్వమసి" అను మహావాక్యమును పలుమారు బోధించెను.

వేదాంతవిదులగు పెద్దలను నేను ప్రార్థించున దేమనగా, అల్పజ్ఞుడగు నితడు (ఈ గ్రంథకర్త) మహాత్ములగు శ్రీ జ్ఞానేశ్వర శ్రీ అరవిందుల రచనలయందలి గుణదోషముల పరిశీలించువాడా? యని నిరసింపక -

శ్లో|| యుక్తి యుక్తముపాదేయం వచనం బాలకాదపి|
అన్యత్తృణ మివ త్యాజ్యమ ప్యుక్తం పద్మయోనినా||

తా|| యుక్తియుక్తమైన వచనము బాలుఁడు చెప్పినను ఉపాదేయమే (పొందదగినదే). యుక్తి యుక్తము కాని వచనము బ్రహ్మదేవుడు చెప్పినను గడ్డిపోచవలె త్రోసి వేయవలసినదే - అను జ్ఞానవాసిష్ఠమునందలి శ్లోకమును జ్ఞప్తికి తెచ్చుకొనవలెనని ప్రార్థించుచున్నాను.

స్వస్తి.

గ్రంథకర్త.



# భూమిక

శ్రీ రామసుబ్బయ్యగారు 'అనంతోపనిషత్తు', 'అనుగీతలు' ఇత్యాది వివిధ గ్రంథములు పరికించి అగాధ పరిశోధన చేసి "బ్రహ్మజిజ్ఞాస" యనెడి ఈ గ్రంథమును రచించిరి. అచలమత మూలగ్రంథములు ఆంధ్రభాషలోనే యున్నందున ఆంధ్రదేశమునందే అచలమత ప్రాదుర్భావము. (బృహద్వాసిష్ఠ సిద్ధాంతము కొద్దిగా సంస్కృతం చదువుకొనిన ఒకానొక వ్యక్తిచేత వ్రాయబడిన దనుట స్పష్టము) ఐనను క్రమేణ ఇరుగు పొరుగు దేశములయందిది వ్యాపించియున్నది.

నిజమైన జిజ్ఞాసువులు - ముముక్షువులు పెక్కురు పురాకృత దుష్కృతము వలన బోధగురువుల నాశ్రయింపక బాధగురువుల నాశ్రయించుట తటస్థించుచున్నది. వారిని చూచి రచయితకు జాలి, పరితాపము కలిగెను. ముఖ్యముగా వారిని గుఱించి ఈ గ్రంథము రచింపబడెను.

సద్గురువు లభించునంత వఱకు ముముక్షువు చేయవలసిన పనియేమి? పీఠికలో 11 వ శీర్షికలో మంచి సలహా యిచ్చిరి.

గ్రంథకర్తగారికి ఏర్పడిన వ్యాధి భవవ్యాధిగ్రస్తుల నుద్ధరించుటకే. రతనాలసీమ యనబడే రాయలసీమలో వీరొక రత్నము. ఈ రత్నముచే ముముక్షులోక మంతటియొక్క దరిద్రత పటాపంచలు గాగలదు. 'బ్రహ్మజిజ్ఞాస' యొక్క మూడు సంపుటములు చూచితిని. ఈ సంపుటము మరల మరల చూచితిని. హర్షము కలిగెను. హరి కృప!

ఆత్మయే (బ్రహ్మమే) అజ్ఞానమున కాశ్రయము, విషయము అనెడి భావము 29 వ పుటలలో సత్సంప్రదాయానుసారము స్పష్టము చేసిరి.

ఆత్మయొక్క కారణకార్య భావాతీత స్థితి 31 వ పుటలలో అత్యద్భుతముగా నిరూపించిరి.

45-47 పుటలలో గొప్పతనముండియు అహంకారము లేకుండుట గొప్పవారి లక్షణము. గొప్పతనము లేకయే తమను తామే గొప్పగా ప్రకటించుకొనుట దురహంకారమని, నీచుల లక్షణమని సూచించిరి. దాసబోధ 85 వ పుటలో శివ - శక్తి పర్యాయపద నిరూపణములో అనువాదకులు పొరపడి యుందురు.

90 వ పుటలో "నా యభిప్రాయము" బహుచక్కగా ఉన్నదని నా యభిప్రాయము.

113-114వ పుటలలో ముక్తపురుషుని దృష్టి మధురముగా నిర్వచింపబడినది.

116 - జ్ఞానశూన్యస్థలమనగా - భేద జ్ఞాన శూన్యస్థలమని నిర్వచింపబడినది. భేదజ్ఞాన శూన్యజ్ఞాన మనగా కేవల జ్ఞానమనియే కదా అర్థము.

117 "సారబచన్" సారవచనముచే చక్కగా ఖండింపబడినది.

119 "బ్రహ్మస్వరూప జ్ఞానముకంటె బ్రహ్మజ్ఞానము తక్కువ" అన్న మాట మిక్కిలి యెక్కువ విలువ గలది అన్ని మాటలు దీని యెదుట తక్కువే.

121- 122 - అతి గంభీరమగు స్వరూపస్థితిని అత్యంత మధురముగా నిర్వచించి మహావినయముతో మొదటి ప్రకరణము ముగింపబడినది. పెక్కుసార్లు మ్రొక్కదగిన భావములు!

అనంతోపనిషత్తును అంగీకరించినను, అంగీకరింపకున్నను అచలమతమునకు ప్రమాదమే. అంగీకరించిన శ్రుతిని ప్రమాణముగా స్వీకరించి నట్లగును. అంగీకరింపకున్న అచలమతము అప్రమాణమని ఒప్పుకొని నట్లగును. పాపము! సంప్రదాయకులు తప్ప యితరులు కనిపెట్టలేని "ఎఱుక మఱపుల నెఱిగెడి యెఱుకను" - ఎఱుక మఱుపులు లేని యెఱుకను ఎఱుగలేక

వృత్తిరూపమైన ఎఱుకనే ఎఱుక యనుకొని, అది యెల్లప్పుడు ఉండునది కాదు కావున దానిని చలమని తలచిరి.

"అచలము, పరిపూర్ణము, కేవలాత్మ, భూమ" - అనెడి పదములు వేదాంతశాస్త్రమునుండి దొంగిలింపబడినవే. మఱి వేఱే ఆధారమేమి యున్నది?

బయలు-ఆకాశము మిగత భూతముకంటె ఊహ కందనంత చాల పెద్దదే యైనను (జడము గావున) తన్నెఱుగదు. ఇతరము నెఱుగదు. ఇదియే అచలుల నాశరహితమైన తత్త్వము. బయలు యొక్క అనుభవములో అశాంతికి, అశాంతి యేర్పడును. నిజమే. కాని శాంతి ఎక్కడిది? చీకటి పోవుటయే. సూర్యోదయ మగునా? అప్పు తీరిపోవుటయే ఐశ్వర్య మగునా? నష్టము లేమియే లాభమగునా? శాంతి - పరమశాంతి స్వస్వరూపమునకు సంబంధించినది గదా! స్వస్వరూపమును (ఆత్మను) అచలులు అంగీకరింపరు. శిష్టులు ఆలోచింతురుగాక!

136- విజయ దుందుభిని విమర్శించి "ఆత్మానాత్మ విచారము అవసరమే" యనెడి తీర్పు చాల నేర్పుతో చేయబడినది.

178 - ఆంధ్రజ్ఞానేశ్వరిలోని జ్ఞానేశ్వరులు అని తలంపు.

18వ - శీర్షిక ప్రకాశోపనిషత్తు తిలకాష్ఠ మహిషబంధన న్యాయము ననుసరించినదే. అనంతోపనిషత్తు సరేసరి. "**స మూలో వా ఏష పరిశుష్యతి యో ఽనృత మభివదతి**" అనెడి శ్రుతి వాక్యమును దొంగిలించి తారుమారుచేసి దానిని ప్రకాశోపనిషత్తనినారు దీక్షితులు.

శిష్టులు అంగీకరించిన ఉపనిషత్తు లన్నియు అపౌరుషేయము లనియే మన దృఢవిశ్వాసము. బ్రహ్మంగారి కాలజ్ఞానములో భవిష్య ద్విషయము లనేకము లున్నవి. అట్టి పేర్లుకూడా కలవు. కాలజ్ఞానము ముందా? పేర్లు ముందా? అట్లే ఉపనిషత్తులలో దేవతలయు, ఋషులయు, రాజర్షులయు పేర్లు గలవు. వేదము సర్వజ్ఞము గదా!

215 - జ్ఞాన శబ్దమునకు ఏ చోట ఏ యర్థము గ్రాహ్యమో, జ్ఞానులకు తప్ప ఇతరులకు ఎట్లు గ్రాహ్య మగును? అమృతానుభవము గలవాడు దప్ప అమృతానుభవము ననువదింప నెవడు సమర్థుడు?

221 -223 "సనత్సుజాతీయముచేత" దీక్షితులవారి మతమంతయు నంతము నొందెను. అయినను అది పిశాచమై అమాయకులను, అసంప్రదాయకులను ఆవేశించి నానా బాధలు పెట్టుచున్నది. పాపము! ఒకప్పుడు నన్నుకూడ అది పట్టుకొనినది. అయినను హరికృపచే పారిపోయినది.

శిష్ట సంప్రదాయము ననుసరించినవారు తప్ప భూమను అర్థము చేసికొనగలిగినవారు భూమిలో ఉండజాలరు. అచలపదమువలెనే భూమపదమునుగూడ అచలులు దొంగిలించిరి. అయినను ఈ పదములు తమవే. బయలువే అనుచున్నారు.

241 - బ్రహ్మము త్రివిధమా? అనెడి మీమాంస మిక్కిలి లాభదాయకముగా ఉన్నది. ప్రతియోగి యనగా విరుద్ధ విషయము. అన్యము కలది. ద్వైతమని యర్థము. నిష్ప్రతియోగి (కము) అనగా అన్యము లేనిది. అద్వైతమని యర్థము. అద్వైతమనినను నిష్ప్రతియోగిక మనినను అర్థము ఒక్కటే. ద్వైతాద్వైత వ్యవహారాతీతము పరతత్త్వమందురా? మంచిది! అపుడు నిష్ప్రతియోగిక మనెడి వ్యవహారాతీతముకంటెను అతీతము. పరతత్త్వమనెడి వ్యవహారము ఏర్పడుచున్నది. పరతత్త్వమనెడి మాటయు ఇట్టిదే కదా! అపుడు మహామౌనము శరణ్యా మగుచున్నది. దానినే శ్రుతి "ప్రపంచోపశమం . . . **అద్వైతమ్**" అనినది. అదియేది? "స **ఆత్మ**" - అదే **ఆత్మ** అని ఉపదేశించి ఉపదేశమును ఉపసంహరించినది. బడాయిమాటలు చెప్పి అమాయకులను మోసగించుట తప్ప మరేమి విశేషమున్నది. మోసమునకు ఫలము మోసమేయని గుర్తింతురుగాక!

253- అచలమే శూన్యమై . . . అగోచరమై నశించుచున్నది.

254, 255 - మార్పులేని తీర్పు!

263 హఠయోగమేదో, రాజయోగమేదో తెలియక దీక్షితులు రాజయోగ నిరసన చేసిరి.

**"అహో! బుధా! నిర్మల దృష్టయోఽపి।**
**జగన్న పశ్యంతి విచిత్ర మేతత్"॥**

అహో! ఇది చాల విచిత్రమైన విషయము. బుధులకు, నిజమైన జ్ఞానులకు నిర్మల దృష్టి యున్నను ఈ జగత్తు కనబడదు. వారీజగత్తును చూడరని

భావము. లేనిది లేనట్లు చూడగలుగుట రాజయోగము. యోగములకు రాజు గావున రాజయోగము అనగా జ్ఞానయోగమే, కేవల జ్ఞానమే.

264- బ్రహ్మానందము లేనేలేదట. గ్రుడ్లగూబ దృష్టిలో సూర్యుడే లేనట్లు, దీక్షితుల దృష్టిలో బ్రహ్మమే లేదు. ఇక బ్రహ్మానందము ఎట్లు సిద్ధించును?

270 - త్రిమూర్తులకు అహంకారము కలదని గురువునకు మాత్రము లేదని దీక్షితు లనిరి. 33 కోట్ల దేవతలకు అహంకారము కలదనిరి. అప్పుడు దీక్షితుల దృష్టిలో 33 కోట్ల దేవత లున్నారన్నమాట -

286 - **"వర్ణాది ధర్మం హి పరిత్యజంతః"** అని శ్రుతి. వర్ణాశ్రమ ధర్మములు మనలను గట్టిగా పట్టుకొనిన గదా! దానిని గట్టిగా ప్రయత్నించి వదలిపెట్టుట?

299-300 పుక్కటి పురాణము కానిది ఒక్కటియు లేదు. దీక్షితులయు, వారి వారియు రచనలలో -

304 - చాలా మంచి సంగతులు విశదపరుపబడియున్నవి -

316- గంభీరమైన చర్చ చేసి స్ఫోటవాదము, అచలవాదము పరస్పర విరుద్ధమని స్ఫుటము చేసిరి -

327 - 330- చిదాకాశ చర్చ బహుచక్కగా ఉన్నది

342 - **"మాయకునుంగని"** మాయకు ఆకరము (ఆశ్రయము) అని భావము-

372- **"సువర్ణాక్షరములతో లిఖింపదగినవి"** అను వాక్యము సువర్ణాక్షరములతో లిఖింపదగినది.

414 - **"మోక్షసౌధములో అడుగిడగనే మాటలు లేవు, మనస్సు లేదు"** ఎంత మంచి మాట!

414 - ఎంత ఉత్తమ విద్య యున్నదో అంత మంచి వినయము నున్నది.

420 - 'కేవల కృప' చేత తత్త్వబోధ చేయు నిజమైన జ్ఞానుల వలననే ముముక్షులోకమునకు మేలు గలుగగలదు.

422 - ప్రతి ప్రకరణము, ప్రతి ఘట్టము, ప్రతి వాక్యము, ప్రతి పంక్తి, ప్రతిమాట ప్రతిభాన్వితమై ప్రయోజనవంతముగా ప్రకాశించు చున్నవి.

ప్రశస్తతరమైన రచన! ఇది నిజముగా పరమేశ్వరానుగ్రహమే.

ఋషి కల్పులగు శ్రీమ|| రామసుబ్బయ్యగారు ఇద్దరు జడ్డిలకు తండ్రి. ఒక జడ్డి శ్రీరాములవంటి శ్రీరాములుగారు, మఱియొక జడ్డి "బ్రహ్మజిజ్ఞాస". ఈ ఇద్దరి జడ్డిల తీర్పు ఇహపరముల మేలుగూర్ప నేర్పు గలది. విజయోఽస్తు!

**రామసుబ్బయ్య రచితా రచనా బుధ సేవితా|**
**"బ్రహ్మజిజ్ఞాస" నామ్నీయం జీయాదాచంద్ర తారకమ్||**

సర్వత్ర సుఖిన స్సంతు "

జనార్ధన భవనము
గుంటూరు - 3

(సం||) శుద్ధచైతన్యస్వామి
19-7-1980



# కృతజ్ఞత

నేను 1949 డిశంబరు నెలనుండి నరముల దౌర్బల్యమను వ్యాధితో పీడింపబడుచున్నట్లు ప్రథమ భాగము యొక్క ఉపోద్ఘాతమున వ్రాసితిని. "గోరుచుట్టుపై రోకటిపో" టనునట్లు గుండెజబ్బుకూడ వచ్చినది. వ్యాధి అధికమైనపుడు గ్రంథ రచన నిలిచిపోవుటయు, కొంచెము శక్తి గలిగినపుడు తిరుగ రచన సాగుటయు ఈ విధముగా భగవదనుగ్రహమున గ్రంథము పూర్తి అయినది.

ఈ భాగము వ్రాయునపుడు గ్రంథము పెద్దదయిన అచ్చునకగు వ్యయమధిక మగునను భీతిచే అచ్చటచ్చట కొన్ని యంశములను సంగ్రహించియు, కొన్నింటిని పూర్తిగా వదలియు వ్రాసితిని. అయినను కొన్ని కారణముల వలన అచ్చునకు కావలసిన దానికంటె అధిక వ్యయము అయినది. తృతీయ భాగము ముద్రణము పూర్తి అయిన తరువాత, నాకు కూర్చుండుటకు కొంచెము శక్తి కలిగినప్పు డెల్లను చతుర్థ భాగము (వ్రాతప్రతిని) చదివి పూర్తి చేసితిని. ఈ భాగముతో గ్రంథమంతయు పూర్తి అయినది. దీనిని

పూర్తి చేయించిన భగవంతునకు నాకృతజ్ఞతను తెలుపుకొనుచు ఈ గ్రంథకుసుమ గుచ్ఛమును, ఆ పురుషోత్తముని పాదపద్మముల కర్పించుకొని నా జీవితము ధన్యమయినదని తలచుచున్నాను.

పూజ్యపాదులగు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శుద్ధ చైతన్యస్వాములవారితో నాకు ముఖపరిచయము లేదు. వారిని గురించి, వారి వృత్తమును గుఱించి ఆదవని (అదోని) లో నేను కొందఱు పెద్దమనుష్యులవలన వింటిని. నేను శ్రీవారి దర్శనమునకు వారున్న చోటునకు పోవుటకు శక్తిలేనివాడను. వారిని నా వద్దకు రమ్మని వ్రాయుటకు అంతకంటెను శక్తి చాలనివాడను.

ఇట్టి సందర్భమున స్వామివారి దర్శన భాగ్యము లభించుటెట్లు? వారి అడ్రసు తెలిసికొంటిని. వారికి 'బ్రహ్మజిజ్ఞాస' రెండవ, మూడవ భాగముల ప్రతులను పంపితిని. స్వామివారప్పుడు అనంతపుర మందుండిరి. ఆ విధముగ ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా వారితో పరిచయము కలిగించుకొంటిని. 'బ్రహ్మజిజ్ఞాస' చతుర్థభాగము వ్రాయుచుంటినని, అందు అచలమత పరిశీలనము ప్రధానాంశమని, స్వామివారికి నివేదించుకొంటిని. వారు అచలవాదులు చెప్పు బయలును తాము చూచితిమనియు, అది బ్రహ్మము కాదనియు, ఒక లేఖలో తెలియజేసిరి. సంతసించితిని.

స్వాములవారు వ్రాసిన గ్రంథములలో రెండు గ్రంథములు భగవదనుగ్రహమున నా చేతబడినవి. అందొకటి శ్రీ మాధవ విద్యారణ్య శ్రీ శంకరవిజయ నందలి శ్లోకములకు శ్రీవారు వ్రాసిన తాత్పర్యము గల గ్రంథము. రెండవది శ్రీమద్భగవద్గీతకు శ్రీ శంకరానంద వ్యాఖ్యానువాద సమేతము - పై రెండు గ్రంథములు చదివి స్వాముల వారికి సంస్కృతాంధ్ర భాషల యందుగల అపార పాండిత్యమును, వేదాంతమునందు వారికి గల పూర్ణప్రజ్ఞయు తెలిసికొన గలిగితిని. మఱియు శ్రీవారు, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ జగద్గురు శృఙ్గేరీ శారదా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ మదభినవ విద్యాతీర్థస్వామి పూజ్యపాదులవారు శిష్యులనియు, జగద్గురువులవలన కాషాయ వస్త్రస్వీకారమును, బ్రహ్మోపదేశమును పొందిరనియు తెలిసికొంటిని. ఈ చతుర్థ భాగమునకు ఎవరిచేత పీఠిక వ్రాయింతునాయని యోచించుచున్న

నాకు వెతుకదలచిన దేవుడు ఎదుట నిలిచినట్లు స్వాములవారు నా మనః పథమున నిలిచిరి. వారి చేత' భూమికను వ్రాయింప నిశ్చయించుకొంటిని.

స్వాములవారు సంస్కృతమును మధ్వశ్రీ పల్లెకృష్ణాచార్యులవారివద్ద అభ్యసించిరి. వీరు రచియించిన అనువాద గ్రంథములు, వివరణ గ్రంథములు, పరిష్కృతములైన గ్రంథములు అనేకములు.

శ్రీ స్వాములవారి చరిత్రయందొక విశేష మేమన :- వీరు రచియించిన గ్రంథములు వెలకు అమ్ముట లేదు. ఉచితముగా జిజ్ఞాసువులకు ఇచ్చెదరు వీరి శిష్యులు, భక్తులు ధనమొసంగిన వారి ధనముతో గ్రంథములు ముద్రించి ధనమొసంగిన వారికాప్రతులను ఇచ్చి వాటిని ఉచితముగా జిజ్ఞాసువులకు ఇచ్చునట్లు చేయుదురు

స్వాములవారు స్వార్థరహితులు, నిరీహులు, నిర్మలులు. ధనమార్జింపవలెనన్న ఒక్క మాసములో కొన్ని లక్షలను ఆర్జింపగలరు.

స్వాములవారు చదలువాడ సుందరరామశాస్త్రిగారు రచియించిన పరమార్థ చంద్రిక గీతా వ్యాఖ్యానమును ముద్రించు కార్యమునందు నిమగ్నులై యుండిరి. (అది బృహత్కార్యము. నాలుగు సంపుటములు. సుమారు ఏబదివేల రూప్యములు ఖర్చు అయి యుండునేమో) అట్టితరి నా గ్రంథమునకు పీఠిక వ్రాయుడని అర్థించితిని. వారవ్యాజకృపతో అంగీకరించి గ్రంథమునందలి ప్రతి అక్షరమును చదివి అమూల్యమగు భూమికను వ్రాసి యిచ్చిరి. వారికి నా కృతజ్ఞతాపూర్వక ప్రణతు లర్పించుచున్నాను. శ్రీవారి భూమిక నా గ్రంథమునకు వజ్రకవచమువలె ప్రకాశించుచున్నది. ఇది యంతయు ఈశ్వరకృప. మహాత్ముల దయ యూరక లభింపదు కదా?

ఈ గ్రంథమునకు అభిప్రాయములు వ్రాసి యిచ్చిన వారిలో ప|| ప|| శ్రీ శ్రీ రామకృష్ణానందస్వాములవారు సుపరిచితులు. (ప్రథమ భాగమునకు పరిచయ వాక్యమును వ్రాసి యిచ్చిన పూజ్యులు). కళాప్రపూర్ణ డా|| మ|| కోదండరామిరెడ్డిగారు నాకు మిత్రులు. వీరందఱకు నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

. గ్రంథము అచ్చువేయించి యిచ్చిన శ్రీవేదం వేంకటరాయశాస్త్రి గారికిని, క్రాంతి ప్రెస్ వారికిని భగవంతుడు అన్ని విధముల తోడ్పడగలడు.

వేదాంతి పాటింపవలసిన నియమములలో అపరిగ్రహ మొకటి. సర్వసంగపరిత్యాగియగు సన్న్యాసి సహితము భిక్షాన్నము నర్థించి పరిగ్రహింపకున్న జీవింపజాలడుకదా? ఏదైన నొక సమయమున పుణ్యకార్యమునకై ఉత్తముడగు దాతనుండి వచ్చిన సహాయమును స్వీకరింపవచ్చును. అందువలన దాతకు పుణ్యమును, పరిగృహీతకు కార్యము గడచుటయును కలుగును

నెల్లూరు వాస్తవ్యులు **దానవీర శ్రీ రేబాల లక్ష్మినరసారెడ్డి** గారిని గుఱించి యెఱుగని వారు ఉండరు. వారితో నాకు ముఖపరిచయము లేకున్నను నన్ను గుఱించి నా మిత్రులవలన విని 'బ్రహ్మజిజ్ఞాస' తృతీయ భాగమును చూచి 1,116/- ఒక్క వెయ్యి నూట పదహారు రూపాయలు చతుర్థ భాగము అచ్చువేయుటకు విరాళ మొసగిరి. వీరు చేసిన దానములలో ఇది చాల స్వల్పము. విద్యాసంస్థలకు లక్షలు దాన మొసగి యున్నారు. భగవంతుడు **శ్రీ లక్ష్మి నరసారెడ్డిగారికి ఆయురారోగ్య** మహాభాగ్యములను ప్రసాదించుగాక- వీరికి నా కృతజ్ఞతా పూర్వకవందనములు.

ఈ చతుర్థ భాగమును చదువు పాఠకమహాశయులకు నేను చేయు విన్నపము - గ్రంథమును చదివిన పిమ్మట భూమికను మఱల చదివి ఆయా పుటల సంఖ్యయందలి విషయమును మఱియొకమారు పరిశీలించినచో గ్రంథస్థ విషయమంతయు అరచేతియందు ఉసిరిక పండువలె స్పష్టపడును. ఇది వేదాంతమునందు నిష్ణాతులైన వారిని గురించి చెప్పినది కాదు. తక్కినవారికి చేసిన విన్నపము.

సర్వేజనా స్సుఖినో భవంతు

26-7-1980
ఆదవని

సర్వం శ్రీరామార్పణమస్తు

స్వస్తి

గ్రంథకర్త

# అభిప్రాయములు

## భూమానందాశ్రమాధిపతులు

### ప ॥ ప ॥ శ్రీ శ్రీ రామకృష్ణానందస్వామివారి అభిప్రాయము

ధన్యజీవికి నా హార్దిక ప్రశంస -

బ్రహ్మమనీషి స్వాధ్యాయ తపస్వి శ్రీ మట్టిబోయిన రామసుబ్బయ్యగారు రచించిన "బ్రహ్మజిజ్ఞాస "నాల్గవ భాగాన్ని నిష్ఠతో పఠించాను. ఈ వరకు రచించిన మూడు భాగములు ఒక యెత్తు; ఈ నాల్గవ భాగము ఒకయెత్తు. గ్రంథము కూడా వెనుకటి వాటికంటె పెద్దది ; విషయ విమర్శనము అత్యంత దురవగాహమైంది. వారే తమ మాటలలో ప్రవేశికలో" ఈ భాగములోని తాత్త్వికాంశములు మిగుల జటిలమైనవి " అని వ్రాసుకొని ఉన్నారు.

ప్రవేశికలో మొత్తం నాల్గు భాగములలోని విషయ సూచికను ఉల్లేఖించి యున్నారు. మొత్తము గ్రంథము రెండువేల పుటలకుపైన ; ప్రకరణములు పదునాఱు. ఈ నాల్గవ భాగములో శ్రీ శంకర భగవత్పాదుల మాయావాదమునకును, శ్రీ జ్ఞానేశ్వర, శ్రీ సమర్థరామదాస, యోగవాసిష్ఠ శ్రీ అరవిందుల అభిప్రాయములకును తులనాత్మక వివేచనము చేసినారు. ఈ ఘట్టములు కొన్ని చోట్ల మిగుల దుర్గ్రాహ్యములు.

నాగపూర్‌డాక్టర్ యస్. డి. పాండిసే అనువారు మరాఠీలో "శ్రీ జ్ఞానేశ్వరాంచేతత్త్వజ్ఞాన "అనే గ్రంథాన్ని రచించారు. శ్రీ జ్ఞానేశ్వరులు శంకరవిధేయులు. వారు పద్దెనిమిదవ అధ్యాయంలో "భాష్యకారాంతేం" అనే పదము శ్రీ శంకరాచార్యులను ఉద్దేశించింది. ముఖ్య సిద్ధాంతంలో వారికి వీరికి భిన్నత లేదు. అవాంతర విషయాలలో "సన్న్యాసము - వర్ణాశ్రమములు లాంటి వాటిలో సార్థక్యము కల్గింది. వైదిక విజ్ఞానము, శాంకరాద్వైతము, నాథసంప్రదాయ యోగప్రక్రియ జ్ఞానేశ్వరిలో పెనవేసు కొన్నాయని వారన్నారు.

మఱి ముఖ్యవిషయ మేమంటే, ఈ గ్రంథములోని "అపూర్వత" అచలమత పరిశీలనము. "మేము అచలులమని, మాది అద్వైతానికంటె పైమెట్టు" ని లోకులను భ్రమింపజేయు అచలమతాన్ని, దాని పుట్టుపూర్వోత్తరాలను దాని అవైదిక సంప్రదాయ స్వరూపాన్ని, ఆ మతానికి మూలపురుషుడైన శ్రీ శివరామదీక్షితులవారి ప్రసంగములలోని అసంబద్ధతను, స్వవచన వ్యాఘాతాన్ని బ్రద్దలు చేసి చూపించినారు. వీరు, అచలవాదులు తమ గురుపరంపరలో చెప్పుకొను జ్ఞానేశ్వర శ్రీధర స్వాములవారిని గురించి చారిత్రక తాత్త్విక విమర్శ చేసి, వారి సిద్ధాంతాలకు అచల సిద్ధాంతానికి గల అనుపపత్తులను వెల్లడించినారు. అచలుడు చెప్పు రహస్యత్రయాన్ని వారి గ్రంథాలను పేర్కొని గాలించి వదలినారు. ఇంతకూ అనన్య సాధారణమైన పని చేసినారు. శ్రీ మలయాళస్వాములవారు తమ ప్రచండ తపః ప్రభావముతో అచలమతాన్ని నిర్వీర్యము చేసినారు. వీరు శాస్త్రీయ పద్ధతిలో దాని గుట్టును రట్టు చేసినారు.

"బౌద్ధము పేరు మార్చుకొని తత్త్వమునందు ముఖ్య లక్షణమగు క్షణిక వాదమును వదలి వేదాంత వేషమును ధరించెను. అదే శ్రీ శివరామదీక్షితుల 'అచల బోధ' అని నా యభిప్రాయము" అని వ్రాసియున్నారు.

ఈ అభిప్రాయము నాకును ఉండినది కాని తగిన నిరూపణకు పరిశ్రమ చేయలేదు. ఆ లోటును తీర్చి శ్రీరామ సుబ్బయ్యగారు నాకెంతో తృప్తిని కల్గించారు. ముఖ్యముగ ఈ ఘట్టము గ్రుడ్డిచాటుగ అచలమతములో పడిపోవు ఆంధ్రుల కన్ను తెరిపించింది. శ్రీ శివరామదీక్షితులవారు తెలుగువారగుటచే ఈ ప్రదేశమున దీనికి బాహుళ్యము కల్గినది. రాను రాను విజ్ఞానవేత్తల సంఘములో దీనికి ఆదరణ తఱిగినది.

నేడు మనము వింటూన్న "సహజమార్గము" ను గూర్చికూడ తాకి వదలినారు. వైదిక సంప్రదాయము కాదని తేల్చినారు. అబ్బ! ఎన్ని చెప్పడం? అగాధ గహనవిషయాలకు పుట్ట. విశ్వప్రపంచ మహామనీషులు భారతీయ వైదిక సంస్కృతి వైభవానికి ముగ్ధులై అఱ్ఱులు చాచుచుండ భారతీయులు పాశ్చాత్య సంపర్కంతో అవైదిక మార్గాలలో పడిపోవుట శోచనీయము. ఆ

అధోగతిని అరికట్టుటకు ఈ గ్రంథము గొప్ప వరప్రసాదము. జిజ్ఞాసువులు సద్వినియోగము చేసికొని ధన్యులగుదురుగాక!

రామసుబ్బయ్యగారూ ! మీ జీవితము చతురస్రసమగ్రత పొందింది. ధన్యులు మీరు. ధన్యులు మీరు - ఓం. శం.

గండిక్షేత్రము
కడపజిల్లా
20-6-1980

(సం ) శ్రీ రామకృష్ణానందస్వామి



## కళాప్రపూర్ణ డాక్టర్ శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారి అభిప్రాయము

అపర్ణ
జేమ్సుగార్డెన్
నెల్లూరు - 524 002

బ్రహ్మవిద్యకు చతుర్థ ముఖం ఈ చతుర్థ భాగం.

శ్రీ రామసుబ్బయ్య పరిణతమైన మనోక్షేత్రం పండించిన అపూర్వతత్త్వ విజ్ఞాన ధాన్యరాశి - ఈ నాల్గవభాగం. ఈయన వ్రాసిన నాల్గు పుస్తకాలు గోపురాకృతిని దాల్చి ఇది దానికి శిఖరమై ధర్మజ్యోతికి స్తంభమైనది.

ఈ రచన సకల వేదాంతసార సంగ్రహమైనది. దీనికి దారి తీసినది అచల మత ఖండన పాండిత్యము. ఈ అచల మతం ఇన్నూరు ఏండ్లనాడు తెలంగాణా నల్లగొండ ప్రాంతాన రామడగు శివరామదీక్షితుల పుర్రెలో బుట్టి ఆంధ్రలో అక్కడక్కడ కొన్ని మఠాలను నెలకొల్పుకొన్నది. ఇందు శూద్రస్వాముల ప్రాబల్యము గుర్తించదగి ఉన్నది. ఉన్నవ లక్ష్మీనారాయణ తమ మాలపల్లె గ్రంథములో గూడ దీనిని ఎక్కించినారు.

అచలమత ప్రవక్త - శివరామదీక్షితులవారికి హిందూ వేదాంతం అజీర్ణం చేసినట్లున్నది. అపండితులకంటె అర్థపండితులు అపాయకారులు గదా! దీక్షితుల వ్రాతలో స్వవచన వ్యాఘాతాలు, వక్రభాష్యాలు మెండు. ఇక వీరి శిష్యకోటి వ్రాతలలో పిచ్చిరేగి ఉన్నది. మహారాష్ట్ర జ్ఞానేశ్వర పంథా అంటూనే

ఈ తెలంగాణా పంథా భిన్నమైనది. ఇది మన ముగ్గురు ఆచార్యుల మతానికే అది అర్థంకాక - ఎసరు బెట్టినది.

ఈ అచలాన్ని ప్రవచించను ఒక వేమన గూడ ప్రభవించినాడు. ప్రజాకవి వేమన గూడ ప్రభవించినాడు. ప్రజాకవి వేమనయోగి ఈయన కానేకాదు. ఈ కాపు వేదాంతి కారణ విమర్శక శక్తికి పట్టాభిషేకం చేసిన అద్వైతి. ఈ అచల వేదాంతం వేమనయోగి తత్త్వానికే వెలితి అయినది. తుంగ వేమన, కటారిపల్లె వేమనలవలె ఈ అచలవేమన భిన్నుడు. అచలమతబీజంలో బలంలేక ఎక్కడా అంతగా వేరులు పారించుకోలేక పోతున్నది.

శ్రీ రామసుబ్బయ్య తత్త్వ బోధక మహనీయ వాక్యాలన్నిటిని ఉపయోగించి ఈ అచల మతవాదభేదనం చేసినారు. ఈ పుస్తకం ఇంతవరకు ఈయన వ్రాసిన తత్త్వశాస్త్ర గ్రంథసారంగా, వివిధ దర్శన విద్యాపునఃప్రకటనంగా చదువరికి పునశ్చరణంగా ఎరుక పెంపుకు దారి తీస్తుంది. మన మూల వేదాంతానికి ఇది ఒక కూలంకష వ్యాఖ్యగా సంతన పడి ఉన్నది.

గ్రంథకర్త వాదబలం, భాషాసౌలభ్యం, శయ్యా విధానం, దార్శనిక విద్యా ప్రాగల్భ్యం - ఇందు మిరుమిట్లు గొలుపుతున్నవి. శ్రీరామసుబ్బయ్యలో విశేషమేమంటే - ఇందు ఉదాహరించిన సూత్రాలు, పద్యాలు ఆయనకు నోటికి వచ్చి ప్రసంగంలో చెరువు కలుజులు దీసినట్లు గలగల పారి పోతుంటవి.

అచలమత మృషా వాదానికి ఇది గొడ్డలి పెట్టు. ఇంత ధైర్యంగా ఇంతటి పాండిత్య ప్రకర్షకంగా అచలాన్ని ఎదుర్కొన్నవారు లేరు. స్వబోధతో తత్త్వమరసి, దర్శన పండితుడైన సుకృతి ఈ యాదవ ప్రముఖుడు - సత్యం అందరి సొత్తు గదా!

ఆంధ్ర ఆస్తికలోకం ఈ వేదాంతికి నెనరు చూపవలసి ఉన్నది.

నెల్లూరు

26-6-1980 (సం) మరుపూరు కోదండరామిరెడ్డి



# 'బ్రహ్మజిజ్ఞాస' తృతీయభాగమును గురించి కొన్ని పత్రికాభిప్రాయములు

**A. ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక -2-9-1977.**

మొదటి ముద్రణ 625 పుటల గొప్ప గ్రంథమిది. వేదాంత విషయాలను సులభమైన భాషలో సుబోధకంగా రచించిన వచన గ్రంథమిది. వేదాంతాన్ని గురించి అధికారయుతంగా బోధించగల సప్రమాణ ఆంధ్ర గ్రంథాలలో ఇదీ ఉత్తమమైనది. సరళమూ, స్వచ్ఛమూ అయిన గద్యంలో సర్వులకూ ఉపయుక్తంగా రచింపబడిం దీగ్రంథము.

ఇది మూడవ భాగము. ఇందులో ఆరు దర్శనాలను గురించి, ఆరు మతములను గురించి రామసుబ్బయ్యగారు విపులముగా చర్చించారు. " ఆధునిక దృష్టి కొరవడినా, పురాణ వాఙ్మయ నిష్ణాతులైన ఛాందసుల పిడివాదము వీరికి లేదు. ఈ గ్రంథము ఆత్మతత్త్వ జిజ్ఞాసువులకు మహోపకారకము. "

ఇందులో జిజ్ఞాసువు ప్రశ్నిస్తూంటే వేదాంతి సమాధానమిస్తూంటాడు. వేదాలను గురించి, దర్శనాలను గురించి ప్రమాణాలతో విశదీకరించారు రామసుబ్బయ్యగారు. మొదటి ప్రకరణంలో, రెండవ ప్రకరణంలో అద్వైత విశిష్టాద్వైత, ద్వైత, ద్వైతాద్వైత, శుద్ధాద్వైత, శైవ, కాశ్మీరశైవ, వీరశైవ, వైష్ణవ, గాణాపత్య, శాక్త, కౌమారాది మతములనూ, మతాచార్యులనూ, మతప్రచారక గ్రంథాలనూ పరిచయం చేశారు.

జైన మతమును గురించి, మతాచార్యులను గురించి జైన సంఘమును గురించి విమర్శించారు. మూడవ భాగంలో, నాలుగవ ప్రకరణం బౌద్ధమతానికి సంబంధించిన విషయాలను ప్రకటిస్తుంది. బుద్ధదేవుని సంగ్రహ జీవితంతో ప్రారంభమైంది. బౌద్ధధర్మ సిద్ధాంతాలనూ, హీనయాన మహాయానాలనూ చక్కగా చర్చించారు రచయిత. వైభాషికులూ, సౌత్రాంతికులూ, యోగాచార్యులూ, మాధ్యమికులు మొదలైన బౌద్ధమత శాఖలవారిని గురించి కూడా తేటతెల్లంగా తెలియజేశారు.

చార్వాక - లోకాయత - నాస్తికమతాలను గురించి చెపుతుంది అయిదవ ప్రకరణం.

ఈ గ్రంథంలో శంకరాద్వైత సిద్ధాంతాన్నే రచయిత నిరూపించారేమో! న్యాయసూత్రాలనూ, గౌతమ కాణాదుల సిద్ధాంతాలనూ, అణువాదాన్ని కూడా ఈ గ్రంథంలో పేర్కొన్నారు.

వీరి పాండిత్య మపారమనిపిస్తుంది. భావప్రకటనలో సిద్ధహస్తు లనిపిస్తారు. బ్రహ్మజిజ్ఞాస - షడ్దర్శన షణ్మత సార సంగ్రహము. ఆంధ్రసాహిత్యాని కలంకారం. ఆంధ్రులకు ఆదరణీయమైన వేదాంత గ్రంథం

- విం. శి. రా.



## B. ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిత 2 - 11 - 1977

ఆధ్యాత్మిక విషయాల్లో అత్యధికమైన కృషి చేసిన గ్రంథకర్త. బ్రహ్మజిజ్ఞాసను గురించి తాము తెలుసుకున్న విషయాలన్నింటినీ అందరికీ అందజేయదలచి పయి పేరుతో గ్రంథ రచనకు పూనుకున్నారు. ఇదివరలో రెండు భాగాలను ప్రకటించి తత్త్వవేత్తల యొక్కయు, విద్వాంసుల యొక్కయు మన్నలను అందుకొన్నారు. ఇప్పుడు షడ్దర్శనములయు, షణ్మతాలయు స్వరూపాల సారాన్ని ఈ గ్రంథంలో సంగ్రహంగ తెలియజేశారు.

షడ్దర్శనాలు, షణ్మతాలు అనే పేర్లు సర్వసాధారణంగా అందరి చెవుల్లోను పడుతూ ఉంటాయి. కాని అవి ఏవో, వాటి స్వరూప స్వభావాలేవో తెలిసినవారు మాత్రం స్వల్పంగానే ఉంటారు. ఉన్నవారిలో ఏ కొద్దిమందియో ఇతరులకు వాటిని గురించి చెప్పగలుగుతారు. తమకు తెలిసిన దానిని వ్రాతలో పెట్టగలవారు మిక్కిలి తక్కువగా ఉంటారు. అట్టివారిలో రామసుబ్బయ్యగా రొకరు. వీరు తమ గ్రంథాన్ని సర్వజనులకు సుబోధకంగా ఉండేరీతిని సరళమైన భాషలో వ్రాయడం దీని ప్రత్యేకతకు తార్కాణం.

"బ్రహ్మజిజ్ఞాస" లో ఇది మూడవ భాగం. అయినా వెనుకటి భాగాలు చదివితేనేగాని ఇది అవగాహన కాదని అనుకోకూడదు. ఏ భాగాని కదే ఒక ప్రత్యేక గ్రంథం. వెనుకటి భాగాల ప్రమేయం లేకుండా దీనిని సులభంగా అర్థం చేసుకోవచ్చును.

ఇందులో మొదటి ప్రకరణంలో పూర్వోత్తర మీమాంసలు, న్యాయవైశేషికములు, సాంఖ్యయోగములు అనే షడ్దర్శనాలూ వివరింపబడినవి.

పరతత్త్వాన్ని గురించి ఆయా దర్శనకారులు విపులంగా చర్చించి తమ సిద్ధాంతాలను వీటిలో వివరించారు. ఆ వివరణ ఈ ప్రకరణంలో ఉన్నది. రెండవ ప్రకరణంలో ద్వైతాద్వైత, విశిష్టాద్వైతాది వైదిక మతాలు, శైవ వైష్ణవ గాణాపత్యాదులు చూపబడినవి. తరువాతి రెండు ప్రకరణాలలో జైన, బౌద్ధమతాలు చర్చించబడినవి. చివరిదైన అయిదవ ప్రకరణంలో చార్వాకాది నాస్తిక మతాలను గురించి ఉన్నది.

ఈ విషయాలే కాకుండా ఇందులో అనుషంగికాలైన పురాణాదులను గురించీ, ధర్మానికి సంబంధించిన ఇతర విషయాలను గురించీ కూడ పెక్కు విషయాలు తెలుపబడినవి. భారతదేశంలోని ఆస్తిక నాస్తిక మతాల తత్త్వాన్ని సులభంగా గ్రహించడానికి ఈ గ్రంథం మిక్కిలి ఉపయోగకరమైనది. రచయిత ప్రతిభ ఇందులో వ్యక్తమవుతున్నది. ఇది తప్పక పరతత్త్వజిజ్ఞాసువుల ఆమోద, ప్రోత్సాహాలను పొందగలదని నా విశ్వాసం.

ఆయాస్య



## ఆంధ్రపత్రిక అభిప్రాయము
## సోమవారం ఫిబ్రవరి 8, 1982
## బ్రహ్మజిజ్ఞాస
## (చతుర్థభాగము)

(గ్రంథకర్త : శ్రీ మర్రిబోయిన రామసుబ్బయ్య, ప్రతులకు : శ్రీ డి. సి సుబ్బన్న (అడ్వకేట్), 52/79, కోటవీథి, కర్నూలు, వెల : రు. 35-00 ).

అయిదు తత్త్వగ్రంథాలలోని సిద్ధాంతాలను సంగ్రహంగా సమీక్షించి ఈ గ్రంథాన్ని వ్రాసినట్టు గ్రంథకర్త మాట.

యోగవాసిష్ఠ, శంకర, జ్ఞానేశ్వర, అరవింద రచనలూ; రాముడుగు శివరామ దీక్షితుల గ్రంథం, 'శివరామ దీక్షితాయం' అనే బృహద్వాసిష్ఠ సిద్ధాంతం.

ఇవిగాక సందర్భానుసారంగా వివేకానందస్వామి, రమణమహర్షి, కావ్య కంఠ గణపతిముని వంటి వారుకూడా ఆక్కడక్కడ దర్శనమిస్తారు.

ఈ బృహద్గ్రంథం మూడు ప్రకరణాలలో శివుడు - శక్తి, అచలబోధ, ఉపసంహారం (ముగింపు) అనే ప్రధాన శీర్షికలతో పరతత్త్వ నిర్ణయం చెప్తుంది.

రెండవ ప్రకరణమైన అచలబోధన ప్రధానంగా శివరామ దీక్షితీయముపై బ్రహ్మాస్త్రమనే చెప్పాలి. దీనియందిచ్చిన శివరామదీక్షితుల వాక్యాలు దారి తప్పి ఉన్నాయని అనడానికి సందేహం లేదు. అతని వాదం ఎంత అప్రమాణమో ఆ వాక్య నిర్మాణం కూడా అంత పెడసరంగానే ఉంది.

రామసుబ్బయ్యగారి ఖండన మృదువుగానూ, సప్రమాణంగానూ, సయుక్తికంగానూ ఉంది.

మాయ, అవిద్య, జ్ఞానం, విస్మృతి - అనే వాటికిన్నీ, బ్రహ్మ పదార్థ నిర్వచనాత్మకమైన తాత్త్విక స్థితికిన్నీ రామసుబ్బయ్యగారు చూపిన ప్రమాణ రచన నాస్తికులు కూడా సర్వాత్మనా అంగీకరించుతారనడానికి సందేహం లేదు.

మూడవ ప్రకరణం ఉపనిషత్తులనూ, గీతోపనిషత్తులనూ ప్రతిఫలిస్తూ హృదయ వికాసకమై ఉంది.

హృదయము, దాని స్వరూప స్వభావాలు (ఇదే హృదయ విద్య) వివిధోపనిషద్వాణితో, మహర్షుల మాటలతో రామసుబ్బయ్యగారు వివరించిన పద్ధతి ఆయన హృదయం ఉపనిషద్వాణిని ఉపాసించిన దృఢమనస్కతకు ప్రత్యక్ష సాక్షిగా ఉంది.

బ్రహ్మజిజ్ఞాసువులకు ఈ 'బ్రహ్మజిజ్ఞాస' వరప్రసాదం అని నా విశ్వాసం.

యామిజాల పద్మనాభస్వామి.

# Opinion of
# Dr. Prof. K. Satchidananda Murthy

Ex. Vice-Chancellor of Sri Venkateswara University,
TIRUPATI.
**Prof. K. Satchidananda Murthy**

Andhra Cottage
Andhra University
Waltair
Visakhapatnam-530 003

23 Feb. 1982

**Dear Shri Ramasubbayya Garu,**

Thank you very much for so kindly sending me a copy of your Brahma Jignasa, IV Part. I have glanced through it and find that this volume is mainly the result of your pioneering and critical investigation of " Achala Bodha ". It is commendable research on a teaching in vogue among some Telugu-speaking people. Few University teachers in India have to their credit a work like your Brahma Jignasa in 4 parts.

I Congratulate you.
With regards,

*yours sincerely,*
**Sd/- K. S. Murthy**
(K. Satchidananda Murthy)

# ఆచార్య కె. సచ్చిదానందమూర్తి
## పూర్వ ఉపాధ్యక్షులు
## (శ్రీ వేంకటేశ్వర విద్యాలయము, తిరుపతి)
## గారి అభిప్రాయము

ఆచార్య కె. సచ్చిదానందమూర్తి

ఆంధ్ర కుటీరము
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు
వాల్తేరు.
విశాఖపట్టణం - 530003

తేది 23-2-1982

ప్రియమైన శ్రీ రామసుబ్బయ్య గార్కి

తమ "బ్రహ్మజిజ్ఞాస" చతుర్థ భాగము దయతో పంపినందుకు వందనములు. నేను గ్రంథమును పఠికించితిని. ఇయ్యది ప్రధానముగా 'అచలబోధ' పై విమర్శనాత్మకము, మార్గదర్శకముగు మీ కృషిఫలితము. కొందరు తెలుగు వారిలో ప్రచారములోమున్న 'బోధ' పైని ప్రశంసాత్మకమైన పరిశోధన. భారత దేశమునందలి విశ్వవిద్యాలయాలలోని అచార్యులలో కూడ మీ బ్రహ్మజిజ్ఞాస 4 భాగముల వంటి గ్రంథము వ్రాసిన ఘనత బహుకొద్ది మందికి మాత్రమే దక్కునేమో.

నేను మిమ్మభినందించుచున్నాను

గౌరవపురస్సరంగా.

భవదీయ

సం॥ కె. యస్. మూర్తి

## ఈ చతుర్థ భాగము యొక్క రచనకు ప్రమాణములుగా ఉదాహరింపబడిన గ్రంథములు, వాటియొక్క సంకేతాక్షరములు మొదలగు వివరములు

### ఉపనిషత్తులు

1. ఈశావాస్య (ఈశ)
2 కేన
3 కఠ
4. ప్రశ్న
5. ముండక (ముం)
6. మాండూక్య (మాం)
7. తైత్తిరీయ (తైత్తి)
8. ఐతరేయ (ఐత)
9 ఛాందోగ్య (ఛాం)
10. బృహదారణ్యాక (బృహదా)
11. తేజోబిందు (తేజో)
12. మహోపనిషత్తు (మహో)
13. పైంగల
14. కైవల్య
15. జాబాల
16. శ్వేతాశ్వతర
17. సుబాల
18. యోగతత్త్వ ( యో. త)
19. శుకరహస్య
20. మైత్రేయ
21. ముద్గల
22. అన్నపూర్ణ
23. ముక్తిక (ముక్తి)
24. మండల బ్రాహ్మణ (మండల)
25. వాసుదేవ
26. అధ్యాత్మ
27. శారీరక
28. సౌభాగ్యలక్ష్మి
29. త్రిపురతాపినీ
30. ఆత్మ
31. సరస్వతీ రహస్య
32. అక్షి
33. ధ్యానబిందు (ధ్యాన)
34. మైత్రాయణి
35. వరాహ (వరా)
36. అథర్వణశిర

# ఇతర గ్రంథములు

37. బ్రహ్మ సూత్రములు (బ్ర. సూ)

38. భగవద్గీత. శ్రీధరస్వాములవారి వ్యాఖ్యానము

39. భగవద్గీత-శ్రీ శంకరానందస్వాములవారి వ్యాఖ్యానమునకు శ్రీ. శ్రీ. శుద్ధచైతన్యస్వాములవారి ఆంధ్రానువాదము.

40. ఉత్తరగీత ( ఉ. గీ ) "వావిళ్ళ "

41. గణేశగీత ( గ. గీ ) ,,

42. దేవీగీత ( దే. గీ ) ,,

43. ఋభుగీత ( ఋ. గీ ) ,,

44. శ్రీ రమణగీత ( ర. గీ ) ,,

45. గీతా రహస్యము ( గీ. ర )- శ్రీ లోకమాన్య తిలక్‌గారి గ్రంథమునకు ఆంధ్రానువాదము

46. జ్ఞానేశ్వరి- శ్రీ జ్ఞానేశ్వరుల గీతా వ్యాఖ్యానమునకు శ్రీమతి రాణి లలితాదేవిగారి అనువాదము

47. అమృతానుభవము ( అమృ ) - శ్రీ జ్ఞానేశ్వరులు. విజయ దుందుభి వ్యాఖ్యానము ( వి. దుం )

48. అనుభవామృతము ( అను ) - మూలము శ్రీ జ్ఞానేశ్వరులు. అమృతానుభవమునకు శ్రీ కోవూరు కోటేశ్వరరావుగారి ఆంధ్రానువాదము.

49. యోగవాసిష్ఠము ( యో. వా )

50. వేదాంత పంచదశి ( వే. పం )

51. భారతీయ తత్త్వశాస్త్రము ( భా. త ) - డాక్టర్ రాధాకృష్ణ పండితుల ఇండియన్ ఫిలాసఫీకి శ్రీ బులుసు వేంకటేశ్వరుల వారి ఆంధ్రానువాదము.

52. తెనుగు విజ్ఞాన సర్వస్వము ( వి. స ) 6 . 7 సంపుటములు.

53. హఠయోగ ప్రదీపిక (హ.ప్ర)- శ్రీ స్వాత్మారామయోగీంద్రుల విరచితమునకు ఆంధ్రానువాదము.

54. శ్రీ శంకర విజయము - శ్రీ మాధవాచార్య కృతము, తాత్పర్యము శ్రీ శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు.

55. శ్రీ వివేకానందస్వామి సంపూర్ణ గ్రంథావళి (వి. సం. గ్ర)

56. జ్ఞానయోగము (జ్ఞా. యో) - శ్రీ వివేకానందస్వామి. అనువాదకుడు శ్రీ తత్త్వానందస్వామి.

57. ఉపదేశ సాహస్రి (ఉ.సా)- శ్రీ శంకరాచార్య కృతము

58. మనీషా పంచకము " "

59. దక్షిణామూర్తిస్తోత్రము " "

60. దృగ్దృశ్య వివేకము (దృ. వి) "

61. వివేక చూడామణి " "

62. సనత్సుజాతీయము " "

63. అపరోక్షానుభూతి " "

64. ఆత్మబోధ " "

65. లలితా త్రిశతీభాష్యము - శ్రీ కృష్ణమూర్తి తాత్పర్యము -

66. లలితా సహస్రనామములు

67. నైష్కర్మ్యసిద్ధి - శ్రీ సురేశ్వరాచార్యులు

68. సిద్ధాంత శిఖామణి (సి. శి)
ఈశ్వర సత్యనారాయణగారి ఆంధ్రవిస్తృతి

69. కైవల్య నవనీతము - శ్రీ కనుపర్తి వేంకటరామయ్య ప్రణీతము.

70. శ్రీ సీతారామాంజనేయ సంవాదము. శ్రీ పరశురామ పంతుల లింగమూర్తి ప్రణీతము

71. ఆంధ్రమహాభారతము. కవిత్రయమువారిది

72. శాంతిపర్వము - శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిది

73. శ్రీమదాంధ్ర మహాభాగవతము. శ్రీపోతనామాత్య ప్రణీతము

74. ఆంధ్రదేవీ భాగవతము, పూజ్యులు తిరుపతి వేంకటేశ్వరకవులు

75. మాలపల్లి - శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ ప్రణీతము.

76. సదానందయోగి శతకము

77. వేమన పద్యములు

78. ప్రపన్నామృతము (ప్ర. ప)

79. అద్వైత సుధానిధి

80. దాసబోధ (దా బో) - శ్రీ సమర్థ రామదాసస్వామి. శ్రీ కోణంకి చక్రధరరావుగారి ఆంధ్రానువాదము.

81. శ్రీ రమణలీల. శ్రీకృష్ణభిక్షువు

82. "నాయన" - శ్రీ వాసిష్ఠ గణపతిముని జీవితచరిత్రము - కర్త - శ్రీ గుంటూరు లక్ష్మీకాంతం.

83. యోగదర్శనము. కళాప్రపూర్ణ కొ. వీరరాఘవాచార్యులు.

84. రామకథ - శ్రీ రామతీర్థస్వామి జీవిత చరిత్ర. కర్త - శ్రీ స్వామికేశవతీర్థ.

85. అంబాస్తవము. శ్రీ కాళిదాస మహాకవి

86. మంత్ర పుష్పము

87. నవనాథచరితము

88. "విశ్వము - డాక్టర్ ఐన్‌స్టీన్ " లింకన్ బార్‌లెట్ గారి గ్రంథమునకు శ్రీ ఎ.వి.యస్. రామారావుగారి అనువాదము.

## అచల మతగ్రంథములు

89. బృహద్వాసిష్ఠ సిద్ధాంతము - అను శివరామ దీక్షితీయము (బృ)

90. శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థములు (కందా) - శ్రీ భాగవతుల కృష్ణదాసు.

91. క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత కందములు (కం)

92. ద్విపదార్థములు (ద్వి) - శ్రీ బాలారామ్

93. అనంతోపనిషత్తు

94. శ్రీ శివరామదీక్షితీయమను అచల గ్రంథము. శ్రీ పోకల శేషాచలంనాయుడు.

95. శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదమను జ్ఞానశాస్త్రము - కర్త- పోలకం నరసింహులు శెట్టిగారు.

## శ్రీ అరవింద గ్రంథావళి

96 మాతృవాక్కులు, (శ్రీ మాత) అనువాదము

శ్రీ తి. వి. కపాలిశాస్త్రి

97 భారతీయత - దాని నిజతత్త్వము (అరవిందాశ్రమము)

98. జగన్మిథ్యాతత్త్వ పరిశీలనము (జ. త. ప)-శ్రీ అరవిందుల గ్రంథమునకు అనువాదకులు శ్రీ తు. కోదండరావు

99. ఎవరీమాత, స్వేచ్ఛానువాదకులు - రాజు

100. మాయ (శ్రీ అరవిందుల వ్యాసావళి) - అనువాదకులు శ్రీ వేలూరు చంద్రశేఖర్

101. మాతృశ్రీ - శ్రీ అరవిందులు. అనువాదకులు డా॥ అనుముల లక్ష్మినరసయ్య

102. యోగదీపికలు - డా॥ అనుముల లక్ష్మినరసయ్య

103. సాధన సమన్వయము - మిస్. మీరా (శ్రీమాత) - అనువాదకులు, యస్. నరసింహులు

## రామచంద్రజీ మిషన్ వారి గ్రంథములు

104 సత్యోదయము - శ్రీరామచంద్రజీ. అనువాదకులు యస్. కుమారస్వామి

105. రాజయోగము - శ్రీ రామచంద్రజీ. అనువాదకులు శ్రీ కాపూరి పూర్ణచంద్రరావు - ఆగ్రాలోని దయాళ్‌భాగ్ వారి గ్రంథము

106. సారబచన్.

ఓమ్

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# బ్రహ్మ జిజ్ఞాస

## చతుర్థ భాగము

## మొదటి ప్రకరణము : శివుడు - శక్తి

"నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యామ్|
నగేంద్రకన్యా వృషకేతనాభ్యాం
నమో నమ శ్శంకర పార్వతీభ్యామ్"||

### (1) ఆరంభము

జిజ్ఞాసువు :- మీ వలన పెక్కు దర్శనములను వింటిని. ధన్యుడనైతిని. శ్రీ శివరామదీక్షితుల అచలమును గుఱించి చెప్పెద నంటిరి. ఇప్పుడు దానిని వినుటకు నా కర్హత కలదేని అనుగ్రహింపుడు.

వేదాంతి :- అచల వేదాంతస్థాపకులని ప్రసిద్ధి పొందిన రాముడుగు శివరామదీక్షితులవారు తమ అచలబోధ, ద్వాపరయుగమునం దుండిన సాందీపనినుండి శ్రీ కృష్ణభగవానునకును, వారినుండి ఉద్ధవునకును, వారినుండి శ్రీ జ్ఞానేశ్వరులకును, వారినుండి శ్రీ శ్రీధరస్వాములకును, వారినుండి తమకు (శ్రీ శివరామదీక్షితులకు) ను లభించినట్లు చెప్పిరి. వీరు చెప్పిన గురుపరంపరయందు శ్రీకృష్ణ ఉద్ధవులను వదలిన శ్రీ జ్ఞానేశ్వరులు సుప్రసిద్ధులు. శ్రీ జ్ఞానేశ్వరుల మత మిట్టిదని తొలుత తెలిసికొని, పిమ్మట శ్రీ శివరామదీక్షితుల అచలబోధను తెలిసికొనుట మంచిది. శివరామదీక్షితులవారు జ్ఞానేశ్వరస్వామివారి కోవకు చెందినవారేనా ? కారా ? అను విషయమును తొలుత విచారింతము.

## (2) శ్రీ జ్ఞానేశ్వరులు - వారి గురుపరంపర

శ్రీ జ్ఞానేశ్వరులనే 'సంత్ జ్ఞానదేవమహారాజ్' అని పిలుతురు వీరు మహారాష్ట్ర బ్రాహ్మణకుటుంబమున శా. శ. 1197 నకు సరియగు క్రీ. శ. 1275 వ సంవత్సరమునందలి యువ శ్రావణ బ ౮ దినమున జన్మించిరి. క్రీ. శ. 25 - 10 - 1296 సరియగు విక్రమ శకము 1353 సం॥ మార్గశిర బ ౧3 గురువారము మధ్యాహ్నము ఆళందియగు గ్రామమున జీవసమాధి నొందిరట. వీరి చరితము పావనమును కరుణరసభరితమును నగునది.

శ్రీ జ్ఞానేశ్వరస్వాములు మహారాష్ట్రభాషయందు భగవద్గీతకు "జ్ఞానేశ్వరి" అనుపేర వ్యాఖ్యను రచియించిరి. జ్ఞానేశ్వరిని ఆంధ్రమున అనువదించిన వారిలో ఒకరగు భక్త సత్యనారాయణగారు జ్ఞానేశ్వరులవారిని గుఱించి యిట్లు వ్రాసిరి. "జ్ఞానేశ్వర మహరాజ్ పండరీపుర వార్కరీ (భక్తి) సంప్రదాయమునకు మూలపురుషుడు." "జ్ఞానేశ్వరి" ని రచియించునప్పటికి వారి వయస్సు 15 సంవత్సరములు మాత్రమేనట. ఇది క్రీ. శ. 1290లో నేవాసేగ్రామమందలి మహాళయాదేవి మందిరమున రచియించినట్లు చెప్పుదురు *

జ్ఞానేశ్వరిగాక అమృతానుభవము (అనుభవామృతము), చాంగదేవప్రసక్తి, హరిపథము, నామన, అభంగములు అను గ్రంథములు రచియించిరి. వీరు జ్ఞానేశ్వరిని ముగించుచు, తమ మతమునందలి రహస్యము వీరి గురుపరంపర నుండి వీరికి లభించినట్లు ఈ క్రిందివిధమున వివరించిరి :-

అతి ప్రాచీనకాలమున క్షీరసాగరతీరమున శంకరుడు పార్వతీదేవి చెవియందు చెప్పినట్టి ఒక రహస్యము (ఆత్మానుభూతి అను అమృతానుభవము) ను క్షీరసాగరతీరమునందలి తరంగములయందు తేలియాడుచున్నట్టి ఒక మొసలిగర్భము నందు నివసించుచున్న మత్స్యేంద్రనాథు లనువారికి లభించినది. (వినిరి). వారివలన చౌరంగీనాథులకును, వారినుండి గైనీనాథు లనువారికిని, వారినుండి జ్ఞానేశ్వరుల అన్నగారగు శ్రీ నివృత్తినాథులకును, వారినుండి శ్రీ జ్ఞానేశ్వరులకును లభించునట్లు చెప్పిరి. ఈ గురుపరంపర సంప్రదాయమునే

* "జ్ఞానేశ్వరి ఏకనాథునిచే ఇటులే శుద్ధము చేయబడినదని ప్రసిద్ధి కలదు" అని శ్రీ లోకమాన్యతిలక్ మహాశయులు తమ గీతా రహస్యమునందు (-పరిశిష్టము - గీతలు - బ్రహ్మసూత్రములు - పుట 785) చెప్పియున్నారు. ఏకనాథులవారు శ్రీజ్ఞానదేవుల శిష్యపరంపరలోనివారు

హఠయోగులు సహితము చెప్పుదురు. హఠయోగప్రదీపిక యను గ్రంథమున యోగుల గురుపరంపర యిట్లు చెప్పబడినది :-

**శ్లో॥ శ్రీ ఆదినాథ మత్స్యేంద్ర శాబ రానందభైరవాః।**
**చౌరంగీ మీన గోరక్ష విరూపాక్ష బిలేశయాః॥**

పై శ్లోకమునందు చెప్పబడిన ఆదినాథుడు శివుడు. వారి శిష్యుడు మత్స్యేంద్రనాథులు, శాబర, ఆనందభైరవులు కూడ ఆదినాథునివలననే సిద్ధులైరని పై శ్లోకము యొక్క విశేషార్థము నందు చెప్పిరి. మత్స్యేంద్రనాథుల శిష్యుడు చౌరంగీనాథులు. (హిందూస్తానీభాషలో కాళ్లు, చేతులు తరుగ బడిన వారికి చౌరంగియని పేరు.) మత్స్యేంద్రనాథు లొకప్పుడు భూసంచారము చేయుచుండ వారిదృష్టి కాళ్లు చేతులు తరుగబడి చౌరంగిపైబడ చౌరంగికి ఎప్పటియట్ల (ముందున్నరీతిగ) కాళ్లు చేతులు మొలచినవట. అప్పటినుండి చౌరంగి మత్స్యేంద్రుల శిష్యులై, యోగియై, చౌరంగినాథులని పిలువబడిరి. చౌరంగినాథులనుండి క్రమముగ మీననాథ, గోరక్షనాథ, విరూపాక్షనాథ, బిలేశయనాథులు ఒకరినుండి మఱియొకరు ఈ యోగమును తెలిసికొనిరి ఈ గురుపరంపరలోనివారికి తమ నామాంతమున 'నాథ' శబ్దముండుటవలన వీరిది 'నాథ' సంప్రదాయమందురు. 'హఠయోగప్రదీపిక' యందు పై శ్లోకము తరువాత గల నాలుగు శ్లోకములయందును వీరి గురుపరంపరకు చెందిన యోగుల నామములు చెప్పబడినవి.

శ్రీ విద్యాసంప్రదాయమునకు చెందినవారియందు వారి గురువు శిష్యునకు మంత్రదీక్ష నొసంగుసమయమున దీక్షానామ మొసంగును. అట్టి నామము 'నాథా' శబ్దాంతముగ నున్నట్లు ఇదివరలో (తృతీయభాగము పుటలయందు) తెలిపియుంటిని. కనుక శ్రీ విద్యాసంబంధమైన యోగముతోను కాశ్మీర శైవముతోను శ్రీజ్ఞానేశ్వర సంప్రదాయమువారికి సంబంధము కలదని విదితమగుచున్నది.

కొందఱు ఈ క్రిందివిధముగా చెప్పుదురు :-

మత్స్యేంద్రనాథులు దత్తాత్రేయులను ప్రసన్నులనుగా చేసికొనుటకై హిమవత్పర్వతమునం దొకచోట తపమాచరించు చుండిరి. శివుడును దత్తాత్రేయులును కలిసి ఆ పరిసరారణ్యమున విహరించుచుండ వారిదృష్టి

మత్స్యేంద్రులపై బడెను. అంత శివుడు దత్తాత్రేయులతో 'నీవు పోయి అచట తప మాచరించుచుండువా డెవడో తెలిసికొని రమ్ము' అనెను. దత్తాత్రేయులు మత్స్యేంద్రులకు దర్శనమిచ్చి, తనకొఱకే అతడు తపమొనర్చుచుండెనని మత్స్యేంద్రులవలన విని సంతసించి అతని ననుగ్రహించి అతనికి మంత్రోపదేశము చేసి మత్స్యేంద్రుని శివుని సన్నిధికి పిలుచుకొనివచ్చెను. శివుడు మత్స్యేంద్రులను చూచి దత్తాత్రేయులతో"ఇతడు నీ శిష్యుడు లోకోపకారార్థము ఇతనికి సర్వసిద్ధులు ప్రసాదింపుము" అని చెప్పెను. దత్తాత్రేయులు ఆవిధముగా శిష్యు ననుగ్రహించి "నాథ" అను బిరుదము నొసంగిరి. అంతటినుండి మత్స్యేంద్రులు మత్స్యేంద్రనాథులని పిలువబడుటచే, వారి శిష్య పరంపరలోనివారికి, వారి నామాంతమున నాథశబ్దమును చేర్చి, వారిది 'నాథ' సంప్రదాయమని ప్రచారము కలిగెను.

మహారాష్ట్రభాషలో నవనాథచరితమును వ్రాసిన "మూలు" అనుకవి, గోరక్షనాథులచే రచియింపబడిన " కీమియాగర్" అను మూలగ్రంథమును ఆధారముగా చేసికొని పై విధముగా వ్రాసిరని చెప్పుదురు.

ఇచట శివునకును మత్స్యేంద్రులకును మధ్య దత్తాత్రేయులను పేర్కొనుటచే ఇది "దత్తసంప్రదాయ" మనియు అందురట.

'విజ్ఞానసర్వస్వము'నందు నాథసంప్రదాయమును గుఱించి యిట్లు వ్రాసిరి.

"శ్రీజ్ఞానేశ్వరులవారి కాలమునకు పూర్వమే, మరాఠీ సారస్వతమున తొలిగ్రంథమని చెప్పదగిన 'వివేకసింధు'వను గ్రంథమును రచియించిన ముకుందరాజు (క్రీ. శ. 1189)కాలమునాటికే, మహారాష్ట్రమున కొన్ని తావుల 'నాథపంథ' అను మతసంప్రదాయము విరివిగ ప్రచారమున నుండెనట. ఆ సంప్రదాయమునకు చెందిన ఆనాటి గ్రంథములయందు 'గోరక్షామంసంవాద్' 'గోరక్షగీత' అనునవి పేర్కొనదగినవి." (వి. స. 6వ సం|| పుట 338)

"మహానుభావపంథతో పాటుగ వార్కరీపంథయు మరాఠీ సారస్వతమును వృద్ధినొందించెను. ఈ పంథనే 'భాగవతపంథ' అనియు వ్యవహరింతురు. ఈ పంథ వైదికసిద్ధాంతములను ప్రోత్సహించును, కాలానుగుణముగ ఆ సిద్ధాంతములకు కొన్ని నూత్నభావములను జోడించెను. ఈ పంథకు చెందిన కవులలో తొలుత పేర్కొనదగినవాడు జ్ఞానేశ్వరుడు (1275-1296). ఈతడు

అర్షకవి. వైదిక మతసమ్మతము లగు భక్తి జ్ఞాన వైరాగ్యములు మాత్రమే మోక్షదాయకము లని యీ మహర్షి బోధించెను."

(వి. స. 6వ సంపుటము. పుట 339)

ఇచట ఒకవిషయము గమనింపవలయును. ఏమన? క్షీరసాగరతీరమున పార్వతీదేవికి శివుడు శ్రీజ్ఞానేశ్వర సంప్రదాయమునకు చెందిన తత్త్వమును (రహస్యమును) ఉపదేశించినట్లు శ్రీజ్ఞానేశ్వరులవారే స్వయముగ చెప్పియున్నందున, ఆకథయొక్క వాస్తవస్వరూప మెట్టిదైనను, వీరి సంప్రదాయ సిద్ధాంతము పై కథ ననుసరించి శైవ -శాక్త తత్త్వములకు సంబంధించినదని బోధపడుచున్నది. అనగా:- శైవ - శాక్త మతసిద్ధాంతములయందలి ముఖ్యాంశములను అధికముగ గైకొని తమ (నూతన) భావములను కొన్నింటిని వానితో చేర్చి శ్రీజ్ఞానేశ్వరులు తాము రచియించిన అనుభవామృతము (అమృతానుభవము) నందు తమ మతతత్త్వమును రూపొందించి యుండవచ్చును.

శ్రీ జ్ఞానదేవులు అమృతానుభవము మొదలగు తమ గ్రంథములు తమ మాతృభాషయగు మహారాష్ట్రభాషయందే రచియించిరి. అమృతానుభవమునందు మంగళాచరణమునందు గల మొదటి అయిదు శ్లోకములు సంస్కృతమునను, మిగత పది అధ్యాయములు గల గ్రంథమంతయు 807 మహారాష్ట్రభాషయందలి ఓవీ ఛందములుగను రచియించిరి. ఈ గ్రంథము ఆంగ్లభాషయం దనువదింపబడినది. ఆంగ్లభాషానువాదము ననుసరించి శ్రీ కోవూరు కోటేశ్వరరావుగారు "అనుభవామృతము" అను పేర ఆంధ్రమున గద్యములుగ అనువదించిరి.

ఇదిగాక మూలగ్రంథము శ్లోకరూపముగా సంస్కృతానువాదము చేయబడినది. దానికి సంస్కృతభాషయందే వ్యాఖ్యానము (టీక) సహితము వ్రాయబడినది. వాటిననుసరించి శ్రీ స్వామ్యమృతానందతీర్థ కలగ ఆంజనేయశాస్త్రిగారు "విజయదుందుభి" అను ఆంధ్రవ్యాఖ్యానమును రచియించిరి. నేను (ఈ గ్రంథమున) సంస్కృతశ్లోకములను, ఆంధ్రగద్యానువాదమును, విజయదుందుభి నామకాంధ్రానువాదమును ఆ యా సందర్భములబట్టి యుదాహరింతును.

జ్ఞానేశ్వరియందు చెప్పబడిన గురుశిష్యపరంపరయే 'హఠయోగప్రదీపిక' యందు చెప్పబడిన నాథసంప్రదాయము. హఠయోగప్రదీపిక యొక్క టీకాకారులు రచియించిన చౌరంగి కథ జ్ఞానేశ్వరియందును గలదు. దీనినిబట్టి శివరామదీక్షితులవారు చెప్పినట్లు తమ సంప్రదాయ రహస్యము శ్రీకృష్ణ, ఉద్ధవాదులనుండి గురుశిష్యపరంపరగ శ్రీజ్ఞానేశ్వరులకు లభించినదనుటకు నెట్టి ఆధారమును లేదు. అయినను మున్ముందు శ్రీజ్ఞానేశ్వరులయొక్కయు, దీక్షితులవారి* యొక్కయు మతములు శ్రీకృష్ణభగవానుని యొక్క మతముతో ఎంతవఱకు సరిపోవునో పరిశీలించి చూడవలసియున్నది.

జిజ్ఞాసువు :- అయ్యా! తమరు నవనాథుల చరితమని చెప్పితిరే, ఆ నవనాథు లెవరు? వారిలో జ్ఞానేశ్వరులవా రొకరా?

వేదాంతి :- ప్రస్తుతాంశమునకు నవనాథుల చరితము మన కవసరము లేదు. అయినను, నీ వడిగితివి కనుక "నవనాథుల చరిత్రము" నందు చెప్పబడినవారిని గుఱించి సంగ్రహముగా చెప్పెదను

పూర్వము స్వాయంభువునకు పుత్రుడు ప్రియవ్రతుడు, అతనికి అగ్నీధ్రుడు, అతనికి నాభి, అతనికి ఋషభుడను మహారాజు జన్మించిరి. శ్రీమన్నారాయణుని ఏకవింశత్యవతారములయందు ఋషభావతార మొకటి, జైనులు ఋషభదేవుని ప్రథమతీర్థంకరు డందురు. అతనికి నూర్గురు కుమారులు, అందులో భరతుడు ప్రసిద్ధుడు. తక్కినవారిలో తొమ్మండుగురు అవధూతలు, ఊర్ధ్వరేతస్కులు, బ్రహ్మవిద్యావిశారదులు. వీరు విదేహరాజునకు తత్త్వోపదేశము చేసినట్లు మహాభాగవత ఏకాదశస్కంధమున కలదు.

ఆ తొమ్మండుగురు 'నవనాథ చరితము' న నవనారాయణులని పేర్కొనబడిరి. ఒకానొక సమయమున శ్రీకృష్ణభగవానుడు ద్వారకయందుండి నవనారాయణులను స్మరింపగా వారచటి కరుదెంచిరి. భగవానుడు వారితో "మీరు కలియుగమున జన్మించి అజ్ఞానులకు ఆత్మవిద్య నుపదేశింపుడు, నేను జ్ఞానేశ్వరు లనుపేర జన్మింతును. శివుడు నివృతినాథుడుగను, బ్రహ్మ సోపాన దేవుడుగను, మాయ ముక్తాంబగను పుట్టుదురు" అని చెప్పి పంపెను.

ఋషభదేవుని పుత్రులగు (1) కవి, (2) హరి, (3) అంతరిక్ష, (4) ప్రబుద్ధ,

* ఈ గ్రంథమున దీక్షితులు అనగా శ్రీ రామడుగు శివరామ దీక్షితులని అర్థము.

(5) పిప్పలాయన, (6) ఆవిర్హోత్ర, (7) ద్రమిళ. (8) చమ, (9) కరభాజను - లను వీరే కలియుగమున క్రమముగ (1) మత్స్యేంద్ర, (2) గోరక్ష, (3) జాలంధర, (4) కానిపా, (5) చర్పట, (6) నాగేశ, (7) భర్తరీ, (8) రేవణ, (9) గహనీ - అను నామముల జన్మించి ప్రసిద్ధులైరి. వీరి నామాంతమున 'నాథ' అను బిరుదమును చేర్పవలయును. వీరే నవనాథులు. వీరుగాక మఱికొందఱు మహాత్ములు జన్మించినట్లు కలదు. వారి ప్రసక్తికి నిచట చోటులేదు.

మత్స్యేంద్రనాథులు సాగరమందు మొసలిగర్భముననుండి, క్షీరసాగరతీరమున శివుడు పార్వతీదేవికి చెప్పిన రహస్యమును వినెనని శ్రీ జ్ఞానేశ్వరులు వ్రాసిరి. నవనాథ చరితమున క్షీరసాగరమును యమునానదిగను, మొసలిని చేపగను మార్చి చెప్పిరి.

## (3) శ్రీ జ్ఞానేశ్వర - శ్రీశంకర మతతత్త్వముల సంగ్రహ విచారము

శ్రీజ్ఞానేశ్వరులు శ్రీశంకరాది ఆచార్యపురుషులవలె ప్రస్థానత్రయమునకు తమ మతానుసారము భాష్యములు రచియించినవారు కారు. శ్రీజ్ఞానేశ్వరులు భగవద్గీతకు మాత్రమే వ్యాఖ్యను రచియించిరి. అదియును భాష్యము కాదు. అది కొంతవఱకు స్వతంత్రమైనదే. జ్ఞానేశ్వరి (గీతా వ్యాఖ్యానము) అమృతానుభవముల నుండి వారిమత మిట్టిదని కొంతవఱకు గ్రహింపవచ్చును అమృతానుభవము స్వతంత్ర గ్రంథము, ఇందు తత్త్వబోధ చాలవఱకు కవిత్వధోరణిలో (కావ్యపద్ధతిలో) నడిచినది. అందువలన ఆ గ్రంథమునందలి కొన్ని స్థలములయందు పాఠకులకు అర్థము సులభగ్రాహ్యము కాదు. వారి తత్త్వమునందలి రహస్యమును, వారి సంప్రదాయమునకు చెందినట్టి గురుముఖమున నుండియే గ్రహింపనగు నందురు. అట్టివారికిమాత్రమే ఆ గ్రంథములు సులభముగ అర్థమగునట. నా కట్టి అదృష్టము లేనందున శ్రీజ్ఞానేశ్వరమహారాజ్ గారిమత మిట్టిదని వివరించుట కష్టమైన పనియే, అయినను, కొన్నిచోట్ల నా వాక్యములలోను, కొన్ని చోట్ల అనువదించినవారి వాక్యములలోను సూత్రప్రాయముగ శ్రీజ్ఞానేశ్వరులమత మిట్టిదని తెలిపెదను.

శ్రీజ్ఞానేశ్వరులు బోధించిన తత్త్వము అద్వైతమే, అయినను పూర్తిగా శ్రీశంకరులు చెప్పిన అద్వైతము కాదు. శ్రీజ్ఞానేశ్వరులమత మిట్టిదని

తెలుపునపుడు అనుషంగికముగా నైనను శంకరాద్వైతప్రసక్తి వచ్చును. అందువలన శ్రీజ్ఞానేశ్వరుల మతతత్త్వమును అర్థము చేసికొనుట సులభమగును. అదిగాక, శ్రీశంకర, శ్రీజ్ఞానదేవుల సిద్ధాంతములు పర్యవసానమున రెండును ఒక్కచోట చేరినను వారు నడచిన మార్గములు భిన్నమైనవి. శ్రీశంకరుల అద్వైత మిట్టిదని, యిదివఱలో అట్టి సందర్భము కలిగినపుడెల్లను, చెప్పియుండినను ప్రస్తుతము సంగ్రహముగా చెప్పుట దోషము కాదు. ఆ తత్త్వమిది :-

ఉన్నది ఒకబ్రహ్మమే, అది నిర్గుణము, నిరాకారము, నిరంజనము, నిరుపమము, ఏకము- బ్రహ్మేతర మేదియు లేదు, అవిద్యవలన బ్రహ్మమునే ప్రపంచముగా చూచుచున్నాము, అవిద్య అనిర్వచనీయము గనుక యిచట ద్వైతమునకు చోటు లేదు. బ్రహ్మము ప్రపంచముగా మారలేదు; మారదు. మారవలెనను సంకల్పము బ్రహ్మమునకు లేదు. మార్పులు గల ప్రతిపదార్థము నశించునదే. మార్పులేనిది కనుక బ్రహ్మము నిత్యము, మసక చీకటిలో త్రాటిని చూచి పామని భ్రమించినట్లు బ్రహ్మమునే భ్రాంతివశమున ప్రపంచముగా చూచుచున్నాము. దర్పణమునందు పట్టణము కనబడునట్లు బ్రహ్మమునందు మాయాప్రభావమున జగత్తును చూచుచున్నాము. ఇది బ్రహ్మవివర్తవాదము.

శ్రీజ్ఞానేశ్వరులవారి మతతత్త్వమును తెలిపెదను- శ్రీశంకరులు చెప్పినట్లు వీరిది వివర్తవాదము కాదు. బ్రహ్మపరిణామవాదమును కాదు. బ్రహ్మ మొక్కటియే. అదియే ఆత్మ; అదియే విశుద్ధజ్ఞానము. ప్రపంచము ఆత్మయొక్క విలాసమే, ఆత్మయొక్కలీలయే. జలము తరంగరూపమున నున్నను జలముకంటె వేఱుకానట్లు, బంగారము ఆభరణ రూపమున నున్నను, ముద్దగా నున్నను బంగారముకంటె వేఱుకానట్లు, ప్రపంచరూపమున నున్నది ఆత్మయే (బ్రహ్మమే), కాని యిందులో భ్రాంతి యనునది లేదు. భ్రాంతి, అజ్ఞానము, అవిద్య, మాయ- అనునవి వంధ్యాపుత్రుడు, గగనకుసుమము, శశవిషాణములవలె మూడుకాలములయందును లేనివే. అజ్ఞాన మనునది ఒక కారణమునకు కార్యముగాని, ఒక కార్యమునకు కారణముగాని కాదు. జ్ఞానముయొక్క అభావమునే అజ్ఞానమని లోకులందురు. ఆత్మయందలి విమర్శరూప శక్తియే* శివ - శక్తిద్వయముగ భాసించినది. శివుడు త్రికాలాబాధితు డగుటవలన

* ఇచట విమర్శరూపశక్తి అనగా మాయయే. ఇందువలన ప్రమాణము

శ్లో॥ విమర్శ ఇతి తాం ప్రాహుః శైవశాస్త్ర విశారదాః।
అవిద్యా మితరే ప్రాహు ర్వేదతత్త్వార్థ చింతకాః॥ (శ్రీ దేవిగీత10)

'సత్' శబ్దముచేతను, శివునియందున్న విమర్శరూపమగు జ్ఞాన మేది కలదో అది 'చిత్' శబ్దము చేతను చెప్పబడును. శివశక్తులయందు గల అన్యోన్యప్రేమయే ఆనందశబ్దముచేత చెప్పబడును. వాస్తవముగ శివశక్తు లిరువురును ఒక్కరే యైనను విలాసమాత్రమున నిరువురుగా తోచుచున్నారు. అందు జ్ఞానము (శక్తి) వలన జగత్కల్పనము జరిగినది. జ్ఞానమే దృశ్యరూపమున జ్ఞానమునకే గోచరమగుచున్నది. శివశక్తు లిరువురు శుద్ధ జ్ఞానస్వరూపమగు ఆత్మకంటె భిన్నులు కారు. విశుద్ధజ్ఞానముయొక్క స్పందనమే జగత్తు. కనుక, జగత్తు ఒకప్పుడు పుట్టినది కాదు. అందువలన ఈ మతమును అజాతవాద మనిరి.

శ్రీశంకర, శ్రీజ్ఞానదేవుల మతమునందు ప్రధాన వైరుధ్యమును చెప్పితిని. వీ రిరువురయందుగల ఏకీభావ మేమనగా :-

జలము, తరంగము- అను నీ రెండింటియందును మనము తరంగమును చేతిలో తీసికొన్న చేజిక్కునది జలమే కదా, కనుక, సర్వమును ఆత్మస్వరూపమే అన్నారు శ్రీజ్ఞానేశ్వరులు - జలము, తరంగము అను నీ రెండింటియందు, తరంగమను నామము, నిడుపుగా ఎత్తుగా కనబడు జలముయొక్క రూపము (తరంగరూపము) - అను నీ నామరూపములు రెండును మిథ్య. జలమునే తరంగమని చెప్పుట అజ్ఞానము, ఏలయన వాస్తవముగ అచట ఉన్నది జలమేకదా - అన్నారు శ్రీ శంకరులు. ఇరువుర వాక్యములయందలి అర్థమొక్కటే. ఈ విధముగ పర్యవసానమున నిరువుర మతములు ఒక్కటిగనే యున్నవి.

సూత్రప్రాయముగ శ్రీశంకర, శ్రీజ్ఞానదేవుల మతము లిట్టివని చెప్పితిని. ఇప్పుడు శ్రీజ్ఞానేశ్వరుల వాక్యములను కొన్నింటిని ఉదాహరించి వారి మతమును దిఙ్మాత్రముగ సూచింతును.

## (౪) ఆత్మ - దాని లీల

ఆత్మ (పరబ్రహ్మము)ను గుఱించి శ్రీజ్ఞానదేవులు ఇట్లు చెప్పిరి :-

---

తా॥ ఈ మాయనే శైవశాస్త్రవేత్తలు విమర్శ అని చెప్పిరి వేదతత్త్వార్థచింతనము చేసి యథార్థ మెఱిగిన మఱికొందఱు విమర్శనే అవిద్య యనిరి

శ్లో॥ అనా ద్యవిద్యాయుక్తస్సన్ జగత్కారణతాం వ్రజే. (శివగీత 9-3)

అనాదియగు నజ్ఞానముతో గూడి జగత్కారణత్వము నందెదను.

". . .ఆత్మ స్థితియుతంబుగాని, స్థితిరహితంబుగాని కాక పోవుటంజేసి కేవల స్థితిరహితంబట్లు తెలియంబడియెడి."

"మఱియు న య్యాత్మ స్థితిరహితంబయి విరాజిల్లు నన్నచో దత్థ్సి త్యభావంబు నేనియు దెలియంగల నరుండెవ్వండగు." (అను. 4-25, 26)

"ఆత్మ స్థితియుతం బగునని పల్కుట కనుకూలంబుగ నయ్యాత్మ వర్తింపకుండు. కాని య య్యాత్మ స్థితిరహితంబని పల్కుట కేనియు గారణంబు కానరాకుండు." (అను. 7-103)

"అజ్ఞానాంధకారంబున బ్రకాశవంతంబగు జ్ఞానంబు సహితము శుద్ధజ్ఞానంబుచే గబళింపబడియెడి." (అను. 4-14)

"మఱియు ని వ్విశుద్ధజ్ఞానం బన్యజ్ఞానంబుచే గాంతివంతంబుగాకయును, నజ్ఞానంబుచే మఱుగువడకయును మహిమాయుతంబై భాసిల్లుచుండు." (అను. 4-17)

"కాని యివ్విశుద్ధ జ్ఞానంబేనియు స్వస్థితింగూర్చి యెఱుంగజాలునె ? నేత్రాండంబు స్వస్వరూపంబు నాలోకింపగల్గునె?" (అను. 4-18)

"మఱియు నయ్యాత్మ తాన దృష్టియై వర్తించుటంజేసి యాలోకనంబును గూర్చికాని, తదభావంబును గూర్చికాని యెఱుంగజాలకుండు. అయ్యుభయ విషయంబులకును నాత్మ తాన మూలకారణంబై యింపారుచుండు."

(అను. 7-197)

"సత్పదార్థంబు సహిత మిమ్మాడ్కి స్థిత్యస్థితులనం జెల్లు సామాన్య భావంబున కతీతంబై స్వాంతరస్థితంబై భాసిల్లుచుండు." (అను. 4-40)

"మఱియు న య్యాత్మ రూపరహితంబగు సౌందర్యంబుమాడ్కిని దేహరహితంబగు యౌవనంబు పోల్కిని, గర్మరహితంబగు సిద్ధిచందంబునను విశిష్టంబై విరాజిల్లుచుండు." (అను. 5-46)

జిజ్ఞా:- ఉపనిషత్తులు చెప్పిన నిర్గుణబ్రహ్మము, పరబ్రహ్మము, పరమేశ్వరుడు అను తత్త్వమునే శ్రీజ్ఞానేశ్వరులు 'ఆత్మ' యని, 'విశుద్ధజ్ఞాన' మని, 'సత్పదార్థ' మని చెప్పిరి కదా?

వే :- చాలవఱకును అంతే. కడపటి పద్యము (అను. 5-46) నందలి భావము ఆత్మ మనోవాక్కుల కందనిదనియే. ఏలయన :- మానవబుద్ధికి రూపరహితమగు సౌందర్యముగాని, దేహరహితమగు యౌవనము `గాని, దురూహ్యము. వాక్కుచే వర్ణింపజాలము.

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ." (తైత్తి. 2-4-1)

అను శ్రుతి తాత్పర్యమునే శ్రీజ్ఞానేశ్వరులు కవితా ధోరణిలో అట్లు చెప్పిరి.

జిజ్ఞా :- శ్రీజ్ఞానదేవులు చెప్పిన ఆత్మ తనను తానెఱుగదు. దానిని తెలిసికొనుటకు ఆత్మేతరమగు వస్తువేదియును లేదు. అన్యజ్ఞానము దానిని ప్రకాశింపజేయలేదు. ఇట్లుండ ఆత్మయొక్క అస్తిత్వంబును గూర్చి యెఱిగినవా రెవ్వరు?

వేదాంతి :- ఆత్మ తనను తానెఱుగ దనునది వేదాంతులకు సమ్మతము కాదు. "అయం పురుషః స్వయంజ్యోతిః" - ఆత్మ స్వయంప్రకాశమైన వెలుగు. (బృహ. 4-3-9) మొదలగు శ్రుతులు ఇందులకు ప్రమాణము. - శ్రీజ్ఞానేశ్వరులు యిట్లు చెప్పిరి :-

"అగణితరూపంబులును నిరంతరాస్తిత్వంబు గాంచి కొమరొప్పుచుండినను, తత్సర్వంబున నొక్క సత్పదార్థంబ మూలంబై యలరారుచుండు."
(అను. 7-124)

"ఈరీతిగా సమస్తవస్తు సముదాయంబునకును మూల కారణంబై పొల్పొందు నవిశుద్ధజ్ఞానంబు మహనీయంబగు దృష్టివైభవంబుచే మత్తిల్లుటంజేసి విభిన్న వస్తు రూపంబుతోడ నొప్పు మణి దర్పణంబు నయ్యాది మగిడి నాలోకింపకుండు." (అను. 7-125)

"అంతియకాక య య్యాత్మ క్షణక్షణంబున వస్తురూపగ్రహణంబను నవ్యభూషాసముదయంబు ధరించు చుండుటం జేసి తాను గర్తృత్వంబు సహితము కల్పించుకొనుచుండు." (అను. 7-128)

"స్వస్వరూపంబు నాలోకించు వాంఛ యొసంగుటం జేసి యేతత్సహజస్థితి జెడుపరాకుండెడు విధంబున (ద్రష్టృత్వదృశ్యత్వాదులగు) సమస్త స్థితి

విధంబులును నుద్భూతంబు లగుచుండు" - "మఱియు న య్యాత్మ దృశ్యత్వంబు దొఱంగియుండ గోరునన్నచో, దృశ్యత్వమై యింపారుచుండు. మఱియు నివ్విధ దృశ్యత్వంబునంజేసి యా దృశ్యత్వంబును, దదభావంబు సహిత మదృశ్యంబగు."
(అను. 7-255, 256)

జిజ్ఞా :- అయ్యా! ఆత్మకు స్వస్వరూపంబు నాలోకించు వాంఛ కలుగుటకు కారణమేమి? వాంఛ (కోరిక) అపరి పూర్ణుడగు పురుషునకు కలుగవలయును, పరిపూర్ణునకు కోరిక యెట్లు కలుగును? ఆత్మ "నవ్యభూషాసముదయంబు ధరించు చుండుటం జేసి" ఆత్మ కర్తృత్త్వము కల్పించుకొనిన ఆత్మకు వికారము సంభవింపదా? దాని అఖండత్వమునకు భంగము కలుగదా?

వేదాంతి :- అట్టి వికారము ఆత్మకు కలుగదనుటకు శ్రీ జ్ఞానేశ్వరులు అనేక ఉదాహరణముల నిచ్చిరి. అందులో కొన్నింటిని చెప్పెదను వినుము.:-

నిలిచి నిద్రించిన భద్రాశ్వము మేల్కొన్న పిదప గూడ నిలిచియే యున్నట్లు, జలము తరంగరూపము వహించి తనకు తాను క్రీడించుచుండినను జలమే యైనయట్లు, అగ్ని విజృంభించి స్వీయంబగు జ్వాలావస్త్రమును ధరించిన అది అగ్నియే యైనట్లు, సూర్యుడు తన కిరణసమూహంబుకంటె భిన్నము కానియట్లు, స్వప్రకాశాచ్ఛాదితుండయ్యు చంద్రు డొక్కడ యైనట్లు, వేయిరేకులు కలిగియుండినను పద్మము యొక్క ఏకత్వము చెడనియట్లు, తత్సహజస్థితి చెడుపరాకుండెడు విధంబున ఆత్మకు వికారము సంభవింప దనిరి. (అను. 7-134 నుండి 139 వఱకు)

జిజ్ఞా :- అయ్యా! జ్ఞానేశ్వరులవారు చెప్పిన భద్రాశ్వాదులగు న వన్నియు పరిచ్ఛిన్నములును, సావయవములును నగునవి. ఏకము శుద్ధజ్ఞానస్వరూపము నిరవయవము అగు ఆత్మ, జలము తరంగరూపమును పొందినట్లు ప్రపంచాకారమును పొందజాలదు. అదిగాక ఆత్మకు తనకు తాను చూడవలెనను కోర్కె యెట్లు కలిగినదో వారు చెప్పలేదు.

వేదాంతి :- విశుద్ధజ్ఞానము యొక్క (ఆత్మయొక్క) స్పందమే * జగద్రూపము. శ్రీజ్ఞానదేవు లిట్లు చెప్పిరి :-

"ఇవ్విధంబుగా నాత్మ దృష్టమై వర్తించినను, లేక దృశ్యపదార్థంబై భాసిల్లుచుండినను నుపర్యుక్తంబగు స్థితిద్వయంబుంగూడ నర్థరహితంబ

యగు. ఏలన నాత్మయొక్క యద్వైతస్థితి యొక్కరుండ సర్వత్ర స్పందించుటంజేసి." (అను. 7-244)

"కేవల స్పందన విషయంబునే భావించి యాలోకించుచో, మన కా స్పందనంబునకంటెను భిన్నపదార్థంబు వేరొక్కరుండు కానరాకుండు. ఇవ్విధంబుననే యాత్మ తాను వీక్షించినను నా ప్రకారంబుగ వీక్షింపకుండు." (అను. 7-245)

"ఇట్లనుటంజేసి రూపత్వంబు పురోభాగంబున స్థితంబైయుండ ద్రష్టయగు నతండు తత్పార్శ్వప్రదేశంబునం జేరి దానిం గాంచునని యర్థము జేయరాకుండు. ఆత్మ స్వస్వరూపదర్శనంబు జేయునెడ నయ్యది తత్స్పందనంబయగు." (అను. 7-246)

"ఆత్మవిషయంబునం గొమరొప్పుచుండు నా స్పందనంబు జలోపరిభాగంబున విజృంభించు సూక్ష్మతరంగంబుల సంచలనంబురీతి నగు. కాదేని హేమఖండంబును గప్పియుంచు హేమత్వంబు పగిది నగు. కాదేని మంత్రబద్ధం బగుటం చేత స్వస్వరూపంబు గ్రహించు నేత్రదృష్టి మాడ్కినగు." (అను. 7-247)

జిజ్ఞా :- నిర్గుణము, శుద్ధము, నామరూపరహితము అగు ఆత్మయొక్క స్పందము* - శుద్ధము, నామరూపరహితమై యుండవలెనేగాని, అశుద్ధము, నామరూపాత్మకము అగు జగత్తుగా కనబడుట కేమి కారణము?విశుద్ధజ్ఞానమునకు ఆకార మెచటినుండి వచ్చెను? జలోపరిభాగమున విజృంభించు సూక్ష్మతరంగము జలరూపముననే యున్నదిగాని రాళ్లు, మట్టి, మృగములు మొదలగు రూపమున లేదుకదా ?హేమఖండమును కప్పిన హేమత్వము హేమరూపముననే యున్నది గాని యినుము, బురద మొదలగు రూపమున కన్పట్టుట లేదే?

వేదాంతి :- ఇది ఆత్మ కొకలీల యని నుడివిరి.

జిజ్ఞా :- 'లీల' యననేమి? అదెట్లుండును?

వేదాంతి :- శ్రీజ్ఞానేశ్వరు లిట్లుచెప్పిరి :-

---

* స్పందము = ఇంచుక కంపము ; చలనము, కదలుట

"ఇట్లగుటంజేసి య య్యాత్మయొక్క లీలావిలాసంబునకు సాదృశ్యంబు మఱియు గావింపరాకుండు. నాత్మకు నాత్మయే సాటియగు." (అను. 7-266)

జిజ్ఞా :- 'లీల' యని చెప్పిన జిజ్ఞాసువగు శ్రోతకు తృప్తి కలుగునా? లీలావిలాసములను ప్రదర్శించు కర్త వ్యక్తియై యుండవలయును. అతనికి స్థూలమో, సూక్ష్మమో, దివ్యమో, పాంచభౌతికమో- (శుద్ధ) సత్త్వగుణనిర్మితమో, అల్పమగునదియో, అధికమైనదియో ఏదియో యొక పరిమాణము గల శరీరము ఎట్టిదైనను అది పరిచ్ఛిన్నమే (హద్దులు కలదియే.) అట్టిది నశింపక తప్పదు. విశుద్ధజ్ఞాన స్వరూపమగు ఆత్మకు శరీరమున్నదని చెప్పుదురా? అప్పుడు ఆత్మ వేఱు ఆత్మయొక్క శరీరము వేఱు-అను ద్వైతము సిద్ధించును కదా?

వేదాంతి :- లీల అను శబ్దము శ్రీ జ్ఞానేశ్వరులు క్రొత్తగా ఉపయోగించినది కాదు. పురాణములయందు విష్ణులీల, కృష్ణలీల, ఈశ్వరలీల, పరమేశ్వరలీల- అని పెక్కు రీతుల లీలాశబ్దము ప్రయోగింపబడినది. శ్రీమద్రామానుజాచార్యాదులగు మతాచార్యులు కొందఱు లీలాశబ్దమును వాడిరి. బ్రహ్మసూత్రములయందు సూ॥ **లోకవత్తు లీలా కైవల్యం** (బ్ర. సూ. 2- -33) అను సూత్రమున 'లీలా' శబ్దమును ఉపయోగించియున్నారు. అచ్చటి సందర్భ మేమనగా :- పరమేశ్వరుడు (పరబ్రహ్మము) జగదుత్పత్తి స్థితిలయములు చేయునని చెప్పెడివారిని వారి ప్రతిపక్షులు 'జగత్తును సృష్టించుటవలన పరమేశ్వరునకు కలుగు ప్రయోజనమేమి?' అని ప్రశ్నించగా - జగత్తును సృష్టించుటవలన పరమేశ్వరునకు ప్రయోజన మేమియు లేదనియు, అది కేవలము ఆయన లీలయనియు, సృష్టివాదులు సమాధానము చెప్పిరి.

ఇట్లు లీలయను శబ్దము పైన చెప్పిన సృష్టివాదుల వాదమునకు బలము చేకూర్చునేగాని, సృష్టియే జరుగ లేదను అజాతవాదులగు శ్రీజ్ఞానేశ్వరులకు - 'జగత్తు ఆత్మయొక్క లీల' యని లీలాశబ్దమును తమ మతమున కనుకూలముగ ఉపయోగించుకొనుట తగదేమో యని నా సంశయము. శంకరాద్వైతులు సగుణబ్రహ్మమగు ఈశ్వరునకు సృష్టి స్థితి సంహారములు లీలామాత్రములని అంగీకరింపరు. లీల కేవల వ్యావహారిక సత్యమేగాని,

పారమార్థిక సత్యము కాదు. శంకరులవారి దృష్టిలో - లీల అనగా మాయావిలాసము, మిథ్య అని తాత్పర్యము.

శ్రీజ్ఞానేశ్వరులు "ఆత్మకర్తృత్వము సహితము కల్పించుకొనుచుండు" (అను. 7-128) అని చెప్పియున్నారు. ఆత్మకు కర్తృత్వము వేదాంతు లంగీకరింపరు. **"అసంగో హ్యాయం పురుషః"** (బృహ. 4-3-16)- ఈ పురుషుడు సంగము లేనివాడు. అని ఉన్నది. కొన్ని శ్రుతులయందు కర్తృత్వము చెప్పియున్నారు కదా ? యనిన - అట్టి కర్తృత్వము ఆత్మకు ఉపాధికృత మనియే తాత్పర్యము.

జిజ్ఞా :- "ఆత్మకు శరీరము లేదు. ఉండనవసరము లేదు. ఆత్మస్పందనమే లీల" అని చెప్పుదురా ? స్పందన మనగా :- కదలుట, లేక, చలనము - అనియే కదా అర్థము? అఖండము, ఏకము, అద్వితీయము అగు వస్తువు అచలమై యుండగా దానియందు చలన మెట్లు కలుగును ? పరిచ్ఛిన్న (హద్దులుగల) పదార్థమునకే చలనము కలుగును. అపరిచ్ఛిన్నము అచలము కదా?

వేదాంతి :- నీ విమర్శ సహేతుకమే. శ్రీ శంకర భగవత్పాదులు చెప్పిన మాయావాదమును అంగీకరింపకున్న ఇట్టి చిక్కుల నెదుర్కొనవలసి వచ్చును. శ్రీజ్ఞానదేవ మహారాజ్ మాయావాదము సరియైనది కాదని నిరూపించుటకు వారికిగల అద్భుత తార్కికశక్తిని చూపిరి. "అజ్ఞానము (మాయ) కలదని యెవ్వరైన చెప్పిన ఆ మాటను మన మించుకయు సహింపరాకుండుదుము" అని చెప్పిరి. వీరి మతము ననుసరించి సమస్తవిశ్వమును విశుద్ధజ్ఞానముయొక్క స్పందనమే. మాయ, అవిద్య అనునవి వంధ్యాపుత్రునివలె మూడు కాలములయందును లేనివే యనిరి. ఆత్మ నూతనాభరణములను ధరించుచున్న దనిరి. (అను. 7-128)

జిజ్ఞా :- అయ్యా ! ఈ మతమును శాస్త్రము లంగీకరించునా? ఆత్మయందు వికారము కలుగకనే జగద్రూపమున నగునా?

వేదాంతి :- ఇది ఒకవిధమగు వేదాంతము. యోగ వాసిష్ఠమునందలి నిర్వాణ ప్రకరణమున ఈ చర్చ విపులముగా చేయబడినది. ఆ విషయము

తరువాత చెప్పెదను. అద్వైతులు మాయ యని దేని నందురో దానిని గుఱించి మరల తెలిసికొనుము. అందువలన తరువాత చెప్పబోవు విషయములు నీకు సులభముగ బోధపడును.

## (ఆ) అద్వైతుల మాయావాదము

శ్రీశంకరులు 'మాయ' యని దేనిని చెప్పిరో దాని స్వరూపమును మనము విచారించి పిమ్మట జ్ఞానదేవులు మాయలేదని యెట్లు సమర్థింప జూచిరో చూతము. మాయనుగుఱించి శ్రీశంకరులు ఇట్లు చెప్పిరి :-

**"సర్వేశ్వరస్య ఆత్మభూతే ఇ వావిద్యాకల్పితే నామరూపే తత్త్వాన్యత్వాభ్యా మనిర్వచనీయే సంసార ప్రపంచబీజభూతే సర్వజ్ఞేస్యేశ్వరస్య 'మాయా', 'శక్తి', 'ప్రకృతి' రితి చ శ్రుతి స్మృత్యోరభిలప్యేతే."**

(బ్ర. సూ. శాం. భా. 1-4-3)

తా|| "ఏవి ఇంద్రియములయొక్క అజ్ఞానముచే మూలబ్రహ్మమందు గల్పింపబడినవో, ఏవి సర్వజ్ఞుడగు పరమేశ్వరునకు నాత్మభూతములుగ నున్నటుల కాన్పించునో, ఏవి జడము లగుటచే బరమేశ్వరునకంటె భిన్నము లనియు, నభిన్నములనియు (తత్త్వాన్యత్యమును) వచించుటకు సాధ్యము కానేరదో, ఏవి జడసృష్టియొక్క (దృశ్యముయొక్క) వ్యాప్తికి మూలముగ నున్నవో, యా నామరూపములనే శ్రుతి స్మృతి గ్రంథములలో సర్వజ్ఞుడగు నీశ్వరుని యొక్క 'మాయ' యనియు, లేక ప్రకృతి యనియు జెప్పుచున్నారు."*

శ్రీశంకరుల 'వివేకచూడామణి' యందు మాయను గుఱించి యిట్లు చెప్పిరి:-

శ్లో|| సన్నాప్యసన్నా ప్యుభయాత్మికానో
భిన్నాప్యభిన్నా ప్యుభయాత్మికానో|
సాఙ్గా ప్యసఙ్గా హ్యుభయాత్మికానో
మహాద్భుతాఽ నిర్వచనీయ రూపా|| (వి. చూ. 111)

---

* లోకమాన్యతిలక్ గారి గీతారహస్యము (361-362 పుటలు) కర్మవిపాకము - ఆత్మస్వాతంత్ర్య మను ప్రకరణమునందలి తాత్పర్యము నుండి

తా॥ మాయ సత్తును కాదు. అసత్తును కాదు. (ఉన్నదియు కాదు, లేనిదియు కాదు) రెండును కలసిన సదసద్రూపమును కాదు. ఆవిధముగనే యీ మాయ పరబ్రహ్మమునకంటె భిన్నమైనది కాదు. ఏలయన:- ఉన్నది ఒక్క పరబ్రహ్మమే. పరబ్రహ్మమునకంటె వేఱైన వస్తువు లేదు. కనుక - అభిన్నమా? యనిన అభిన్నమును కాదు. పోనీ, (పరబ్రహ్మమునకంటె మాయ) భిన్నాభిన్నమును కాదు. ఏలయన :- పరస్పర విరుద్ధమగు రెండు ధర్మములు ఒకటి కానేరవు. అట్లే, మాయ అవయవములు కలదియు కాదు. నిరవయవమును కాదు. సావయవ నిరవయవ ఉభయ స్వరూపమా? కాదు. ఆశ్చర్యకరమైనది, అనిర్వచనీయరూప మైనది.

మాయయందున్న త్రిగుణములయందు శుద్ధమగు సత్త్వగుణము గల దానిని 'మాయ' యనియును, కొంచెము అశుద్ధమగు సత్త్వగుణము గల మాయను 'అవిద్య' యనియును వ్యావహారికముగా రెండువిధములని చెప్పిరి. - అవిద్యను గుఱించి శ్రీశంకరులే యిట్లు చెప్పిరి :-

**శ్లో॥ అనా ద్యవిద్యాఽ నిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే|**
**ఉపాధిత్రితయా దన్య మాత్మాన మవసాదయేత్॥ (ఆత్మబోధ)**

తా॥ అవిద్య అనాది యైనది. అనిర్వచనీయ మైనది. అనిర్వచనీయమైనది. ఈ అవిద్య, కారణోపాధి వ్యష్టి సమిష్టి భేదముల చేత స్థూల సూక్ష్మప్రపంచమునకు కారణభూతము (బీజభూతము) గా నున్నది. ఆత్మ యీ మూడింటికంటె భిన్నమైనది.

శ్రీశంకరులు చెప్పిన మాయయొక్క నిర్వచనమునందు మాయకు 'శక్తి', 'ప్రకృతి' అను నామములను పర్యాయములుగా వాడిరి. మాయయొక్క శబ్దార్థమును (ఉత్పత్త్యర్థమును) కొందఱు ఈ క్రిందివిధముగా చెప్పుదురు :-

యా - మా, సా మాయా = అనగా లేని దగుటచే 'మాయా' అనిరి. దీని నాధారముగా కొని మాయ యనునది వంధ్యాపుత్రునివలె లేనిదే యని అచలవాదు లనిరి. కాని, శ్రీశంకరుల నిర్వచన మట్టిది కాదు. అది లేనిదేయని వారు చెప్పలేదు. మాయ లేనిదే యన్నచో అది అనిర్వచనీయ మెట్లగును?

అది ఉన్నది కాదు - లేనిదియు కాదు. దానిని 'మాయ'అను పేరుతో పిలుచుటకు ఇష్టపడనివారు శ్రీశంకరులు చెప్పినట్లు 'పరమేశ్వరుని శక్తి' లేక 'ప్రకృతి' అని పిలువవచ్చునుగదా? శ్రీజ్ఞానేశ్వరులు ఆత్మయొక్క శక్తిని 'శక్తి', 'ప్రకృతి' అని పిలిచిరికదా? శ్రీశంకరులు దేనిని మాయ, లేక, శక్తి యనిరో దానినే శ్రీజ్ఞానేశ్వరులు స్పందనము, 'లీల' అనిరని మనము సమాధానపడినచో ఇరువుర మతములను ఒకదాని సమీపమునకు వేఱొక దానిని తెచ్చినవార మగుదుము.

శ్రీవివేకానందస్వాములవారు ఈ యంశమును ఒక చక్కని దృష్టాంతముతో చెప్పిరి. దాని సారాంశము నిట వివరింతును - "మాయ యను గాజుపలక మనయెదుట ఉన్నదనుకొనుము. దాని నుండి మనము మన దృష్టిని ముందుకు ప్రసరించితి మేని మనయెదుటనున్న నామరూపరహితమగు నిర్గుణబ్రహ్మమే నామరూపాత్మక ప్రపంచముగ గోచరించుచున్నది. గాజుపలకను మనయెదుటనుండి తొలగించితిమేని మనకు గోచరించునది నిర్గుణబ్రహ్మమే. (ఆత్మ మాత్రమే) అన్యమేమియును లేదు. మనయెదుటనున్న గాజుపలకయే మాయ, మాయ యనగా నామరూపములే."

'మాతృత్వం యాతీతి మాయా'- సమస్త జగత్తునకు మాతృస్వరూపిణి గనుక మాయా అను పేరు కలిగెనని వీర శైవులందురు. (సి. శి. 1-9) ఇదియే సరియైన యర్థము.

మాయ, ప్రకృతి, ఈశ్వరశక్తి, అవిద్య, అజ్ఞానము, నామరూపములు- ఇవన్నియు మాయకు పర్యాయనామములు. పై నామముల నన్నింటిని వదలి శ్రీజ్ఞానేశ్వరులు తమ అమృతానుభవమున ఒక్క 'అజ్ఞాన' శబ్దము (నామము)నే వాడిరి. 'అజ్ఞాన' మనునది వంధ్యాపుత్రుని వంటిదని చెప్పిన శ్రీజ్ఞానేశ్వరుల వాక్యములు కొన్నింటి నిట నుదాహరింతును.

## (ఒ) శ్రీజ్ఞానేశ్వరులు చేసిన అజ్ఞానవాదఖండనము

1. "అజ్ఞానంబు నైజంబుగ జ్ఞానమునందు వాసంబుండుచో నయ్యది యా జ్ఞానంబును సహితము స్వీయంబగు నజ్ఞానపదార్థంబుగ నెందులకు బరిణతిం జెందింపకుండు?" (అను. 7-8)

2. "అట్లుగాక య య్యజ్ఞానంబు కేవలమాత్మయందు వాసంబుండి యా యాత్మనే యాచ్ఛాదించి వైచునని శాస్త్రంబులు ఘోషించు నన్నచో నందులకు సమాధానం బెద్దియన, నజ్ఞానాంకురంబు ద్వైతదూరంబగు విశిష్టస్థితిం గల్గి చెల్వొందు చున్ననాడ యజ్ఞానాస్తిత్వంబు నేనియు దెలియంజాలిన మనుష్యుం డెవ్వండగు?" (అను. 7-10, 11)

3. "ఆత్మ యజ్ఞానంబుచే బరిపూర్ణంబుగ నాచ్ఛాదితంబయ్యు స్వస్థితిం దొరంగకుండుచో నజ్ఞానంబను శబ్దంబు నిరర్థకంబై పోవుట తథ్యంబగు." (అను. 7-23)

4. "అదియునుంగాక యజ్ఞానం బనునది యాత్మయందు వాసంబుండు ననుట తార్కికంబుగనైన యుక్తంబు గానేరకుండు." (అను. 7-24)

5. "అజ్ఞానంబు తిమిరపుంజంబై యెసంగుచో నాత్మ పదార్థంబు తేజోనిధానంబై యింపారుచుండు. అట్టియెడ నజ్ఞానంబును, నాత్మయును బరస్పరైక్యంబు నొందుట యెట్లు భావ్యంబగు?" (అను. 7-25)

6. "అజ్ఞానం బనునది జ్ఞానంబులకు గేవల విరుద్ధ విషయంబై యొప్పుచుండు కారణంబున జ్ఞానస్థానంబున వాసంబుండ నసమర్థంబగు మఱియు, నయ్యజ్ఞానంబు స్వతంత్రంబుగ నైన మనం జాలకుండు."

(అను. 7-35)

7. "అజ్ఞానంబు కానరాకున్నయెడ నాత్మ ప్రకాశించుచుండు" - ననియెడు వాక్యంబులు కేవల మనుచితంబులగు. కావున విజ్ఞులిట్టి సిద్ధాంతంబు లామోదింపరాకుండు." (అను. 7-37)

8. "అజ్ఞానం బనునది యివ్విధంబుగ బ్రత్యక్షానుమానాది ప్రమాణంబుల చేతనైనా సాధింపజాలకుండుటం జేసి యయ్యది కేవలస్థితిరహితంబ యని నిరూపింపబడియె." (అను. 7-55)

9. "మఱియు, నీ యజ్ఞానంబ నునది యెవ్విధకార్యంబునకు గారణంబుగాని, యెవ్విధ కారణంబునకు గార్యంబు గాని కాకపోవుటంజేసి, య య్యజ్ఞానంబును

గూర్చి యది యొక నిత్యవిషయంబని విశ్వసించుటకు భయంబయ్యెడి."
(అను. 7-56)

10."కావుననే న య్యజ్ఞానం బనియెడి శబ్దంబును స్వప్నమునందేనియు నుచ్చరింప నొల్లకుండుదును. కాని, యెట్టకేల కయ్యజ్ఞానభావం బొకరుండు మనంబునం దోచు."
(అను. 7-85)

11. "దృగ్గోచర ప్రపంచంబునం దింపారు సమస్త కార్యకలాపంబును జ్ఞానమూలంబునంజేసి ప్రకాశవంతంబై యెసంగుచుండ నయ్యజ్ఞానప్రవాహంబు నిందు గొనిరా నర్హంబై యుండునె."
(అను. 7-100)

ఈవిధముగ శ్రీజ్ఞానేశ్వరులు అజ్ఞాన మనునది వంధ్యాపుత్రునివలె త్రికాలములయందును లేనిదే యని పెక్కురీతుల అనేక ఉపమానములను, యుక్తులను చూపి చెప్పిరి. ఇదివఱలో మాయావాదమును నిరసించినవారు జగత్తు మిథ్య కాదని, మాయ జగత్కారణము కాదని చెప్పిరేగాని శ్రీజ్ఞానేశ్వరుల వలె మాయ, అవిద్య, అజ్ఞానము వంధ్యాపుత్రునివలె అభావమని చెప్పియుండలేదు. శ్రీజ్ఞానేశ్వరులు అజ్ఞానఖండమునకు చెప్పిన ఒక్కొక్క అంశమునకు (పైన చూపినట్లు 1 నుండి 11 వఱకు గల అంశములకు) శంకరాద్వైతులు చెప్పునట్టి సమాధానమును వరుసక్రమమున సంగ్రహముగా చెప్పెదను.

## (ఉ) అజ్ఞానవాద ఖండనమునకు అద్వైతుల సమాధానము

1. సమాధానము :- బ్రహ్మము అజ్ఞానమునకుగాని, మఱి దేనికిగాని విరోధి కాదు. అదిగాక - మాయ (శ్రీజ్ఞానేశ్వరుల పరిభాషలో అజ్ఞానము) బ్రహ్మముకంటె వేఱనిగాని, వేఱుకాదనిగాని చెప్పుటకు వీలు లేనందున జ్వాల అగ్నిని దహింపజాలని యట్లు అజ్ఞానము దానిప్రభావమును తనకాధారమగు బ్రహ్మమునందు చూపజాలదు. అనగా బ్రహ్మమును అజ్ఞానస్వరూపముగా పరిణతి నొందింపజాలదు.

2. సమాధానము :- పైన చెప్పిన సమాధానమునే యిచటను అనుసంధించుకొనవలెను. బ్రహ్మమునందంతటను మాయ లేదు. 'ఏకాం

**శేన స్థితో జగత్** ' అను గీతావాక్యము ననుసరించి బ్రహ్మమునందు మాయ ఏకదేశస్థమైయున్నది. మాయ బ్రహ్మమునకు విరోధి కాదని యిదివఱకే చెప్పితిని. మాయకు ఆధారము బ్రహ్మమే.

3. సమాధానము :-'మాయ' యన కేవలము అజ్ఞానమనియే భావింపరాదు. జ్ఞానాజ్ఞానములు రెండును మాయయే. జ్ఞానాజ్ఞానముల రెండింటికిని అతీతమగు ప్రజ్ఞానము (శుద్ధజ్ఞానము)ను, అజ్ఞానము అజ్ఞానముగా మార్చలేక పోయినంతమాత్రమున అజ్ఞానము అభావమగునా? సీతా దేవిని అగ్ని దహింపజాలక పోయినంతమాత్రమున అగ్నియందు దహనశక్తి లేదందుమా? హాలాహలము శివుని చంపలేక పోయినంతమాత్రమున దానియందు ప్రాణిని చంపు శక్తి లేదందుమా?

4. సమాధానము:- అజ్ఞానము కలదని శాస్త్రము లంగీకరించుచున్నవి. శ్రుతివిరుద్ధమైన తర్కము నిరుపయోగము. ఆత్మయే అజ్ఞానమున కాశ్రయమను అంశమును ముందు నిరూపింతును.

5. సమాధానము:- బ్రహ్మమునకు మాయకు తేజస్తిమిరములకున్న విరోధము లేదు. ఆత్మకు (బ్రహ్మమునకు), మాయ (అజ్ఞానమున)కు గల సంబంధము శక్తికిని, శక్తిమంతునకును గల సంబంధమువంటిది. ఆత్మస్వరూపజ్ఞానము అవిద్యను (అజ్ఞానమును) నశింపజేయును. సంయక్ (వృత్తి) జ్ఞానము అవిద్యను నశింపజేయును. ఆత్మ అజ్ఞానమునకు ఆశ్రయము. కనుక ఆత్మ విరోధి కాదు. సంయక్ జ్ఞానమే అజ్ఞానమునకు విరోధి. మానవుని యందు సత్త్వగుణాధిక్యము వలనను, ఆత్మానాత్మ విచారము వలనను, తత్త్వమస్యాది మహావాక్య శ్రవణము వలనను సంయక్ జ్ఞానము కలుగును. ఆత్మ జ్ఞానాజ్ఞానములకు ఆశ్రయము.

6. సమాధానము:- పైన చెప్పబడిన (5వ) సమాధానమే ఆఱవ ప్రశ్నమునకును సమాధానము. అజ్ఞానము స్వతంత్రముగా ఉండజాలదనుట అద్వైతు లంగీకరింతురు.

7. సమాధానము:- ఆత్మ సూర్యునివంటివాడు. అజ్ఞానము మేఘమువంటిది. సంయక్ జ్ఞానము మహామారుతమువంటిది. కాని, సూర్యకాంతి సహాయముననే

మనము మేఘమును చూడగలుగుచున్నాము. పెద్దగాలి వీచుటవలన మేఘము తొలగిపోయి సూర్యుడు బాగుగా కనపడును. అట్లే సంయక్ జ్ఞానముచే అజ్ఞానము నశింపగా ఆత్మ సాక్షాత్కార మగును. మేఘము సూర్యుని నెల్లప్పుడును గాని, సంపూర్ణముగ గాని కప్పియుండలేదు. ఆత్మ సూర్యునివలె ఎల్లప్పుడు ఒక్కరీతిగనే ప్రకాశించుచుండును గీత యొక్క యీ క్రింది శ్లోకమునకు శ్రీజ్ఞానేశ్వరులు వ్రాసిన వ్యాఖ్యానమే వారి (7వ) ప్రశ్నమునకు సమాధాన మగుచున్నది.

**శ్లో॥ జ్ఞానేన తు త దజ్ఞానం యేషాం నాశితమాత్మనః।**
**తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥** (గీత. 5-16)

(ఈ శ్లోకమునకు శ్రీజ్ఞానేశ్వరులు వ్రాసిన వ్యాఖ్యనే యీ క్రింద చూపెదను.)

"ఈ అజ్ఞానము పూర్ణముగా నష్టమైన తరువాత భ్రాంతి అను చీకటి కూడ నశించి మనుష్యునికి 'నేను ఈశ్వరుడను, అకర్తను' అను అనుభవము కలుగ నారంభించును. 'ఈశ్వరుడు అకర్త' అను విషయము మనస్సులో నిశ్చయమైన, 'నేను ఈశ్వరుడను' అను తత్త్వము పూర్ణముగా సిద్ధించును. ఇట్టి జ్ఞానము ఒక్కమారు చిత్తములో ప్రవేశించిన ఈ త్రిభువనమున భేదభావము ఉండనే ఉండదు. మనుష్యుడు ఇట్టిస్థితిలో ముక్తుడై సమస్త జగత్తును ఆత్మ స్వరూపముతో చూచును. తూర్పున సూర్యోదయ మైనదని ఆ దిశయందే ప్రకాశము వ్యాపించి ఇతర దిశలయందు చీకటి మిగిలియుండు నేమో నీవే చెప్పుము." (ఆంధ్రజ్ఞానేశ్వరి. 5-16)

పై గీతావ్యాఖ్యానమువలన జ్ఞానదేవుల 7వ ఆక్షేపణ ఖండింప బడినది.

8. సమాధానము:- శ్రుతి, అనుభవజ్ఞానము - వీటి వలన అజ్ఞానము స్థితియుతమని తెలియబడును. కాని, దానిని 'సత్త'ని గాని, 'అసత్త'ని గాని చెప్పుటకు వీలులేనందున అనిర్వచనీయ మనిరి. స్థితిరహితమని నిరూపింపబడలేదు.

9. సమాధానము:- అజ్ఞానమునకు కారణము లేదు. దానికి కార్యము కలదు. దానికార్యమే అనాత్మ. అనగా జడద్రవ్యము.

10, 11. సమాధానము:- శ్రీజ్ఞానేశ్వరులు అజ్ఞాన శబ్దమును స్వప్నమునందైనను నుచ్చరింప నొల్లకున్నను *"ఎట్టకేల కయ్యజ్ఞానభావం బొకరుండు మనంబునం దోచు"* అని అంగీకరించియున్నారు. -

అజ్ఞానము (మాయ) యొక్క అస్తిత్వమును శాస్త్రము లేవిధముగ అంగీరించియున్నవో తెలిపెదము.

## (ర) అజ్ఞానము (మాయ) కలదనుటకు శాస్త్రప్రమాణము

మాయ కలదని, అది బ్రహ్మమును కప్పియున్నదని ఋగ్వేదమునందలి యీ క్రింది ఋక్కు చెప్పుచున్నది.

**"తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే**
**ప్రకేతం సలిలం సర్వమా యిదమ్|**
**తుచ్ఛేనాభ పిహితం యదాసీత్**
**తపసస్త న్మహినా ఒజాయతైకమ్||"**

తా|| "అంధకారముండెను. ఆరంభమునం దిదియంతయు నంధకారముచే వ్యాప్తమును, (మఱియు) భేదాభేదవిరహిత జలముగ నుండెను. లేక ఆభు, అనగ సర్వవ్యాపియగు బ్రహ్మము (ఆరంభముననే) **తుచ్ఛము చేతనే,** అనగా అసత్యమగు మాయచేతనే యాచ్ఛాదితమైనది అని (యత్) ఏది-(చెప్పబడుచున్నదో) అది (తత్) మూలమున నొకటియే (బ్రహ్మమే) తమస్సుయొక్క మహిమచే (రూపాంతరముచే) బిదప బ్రచురమైనది."

పై ఋక్కునందు *మాయ* *'తుచ్ఛ'* శబ్దముచేత చెప్పబడినది.

**"విద్యా దృష్ట్యా శ్రుతం తుచ్ఛం తస్య నిత్య నివృత్తితః||**

(వే. పం. 6-129)

తా|| జ్ఞానదృష్టిచేత ఎల్లప్పుడును నివర్తించుటవలన (మాయ) తుచ్ఛమైనది.

శ్లో॥ **తుచ్ఛా ఽ నిర్వచనీయా చ వాస్తవీచే త్యసౌ త్రిధా।**
**జ్ఞేయం మాయా త్రిభిర్బోధై శ్రౌత యౌక్తికలౌకికైః.**

(వే. పం 6-130)

తా॥ "తుచ్ఛ (మాయ) శ్రౌతసంబంధమగు దృష్టిచేత మూడు కాలములయందు లేనిదేయనియు, యుక్తిసంబంధమగు దృష్టిచేత చెప్ప నలవికాని (అనిర్వచనీయమైన) దనియు, లోకసంబంధమగు దృష్టిచేత సత్యమైనదనియు (తుచ్ఛ, అనిర్వచనీయ, వాస్తవి - అని మూడు విధములు గలదిగ) తెలిసికొనవలయును."

"ఇంద్రా *మాయాభిః* పురురూప ఈయతే." (ఋ. 6-47-18)

"తనమాయచే ఇంద్రుడు అనేకరూపముల బొందుచున్నాడు" అని చెప్పబడినది.

మం॥ **విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ంసహ।**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా ఽమృతమశ్నుతే**

**(ఈశావాస్యశ్రుతి.11)**

**తా॥ విద్యావిద్యల తత్త్వమును తెలిసిన తత్త్వవిదుడు అవిద్యారూపమగు మృత్యువును దాటి విద్యవలన గలుగు అమృతమును (పరమాత్మను) తెలియుచున్నాడు.**

మం॥ **హిరణ్మయేన పాత్రేణ సత్యస్యా పిహితం ముఖమ్।**
**తత్త్వం పూష న్నపావృణు సత్యధర్మాయ దృష్టతే॥** (ఈశా. 15)

తా॥ ఓ సూర్యభగవానుడా! సత్యము యొక్క ముఖము బంగారుపాత్రచే మూయబడియున్నది. సత్యధర్ముడనైన నేను నిన్ను చూచుటకై పై మూతను దీయుము. అనగా నామరూపము లనుమాయయే బంగారుపాత్ర, దానిని తొలగించిన సత్యము (పరబ్రహ్మము) చూడగలను - అని సూర్యుని స్తుతించినది.

శ్రు॥ **అవిద్యాయా మంతరే వర్తమానాః।**
**స్వయంధీరాః పండితం మన్యమానాః॥** (కఠ. 1-2-5)

తా॥ అవిద్య (అజ్ఞానము)చే కప్పబడినవారు తామే బుద్ధిమంతులమనియు పండితులమనియు భావింతురు.

ఈ మంత్రమే ముండకశ్రుతి 1-2-8 వ మంత్రముగా కొలది మార్పులతో చెప్పబడినది.

శ్రు॥ **అవిద్యాయాం బహుధా వర్తమానా**
**వయం కృతార్థా ఇత్యాభిమన్యంతి బాలాః.** (ముండక. 1-2-9)

తా॥ అవిద్య (అజ్ఞానము) వలన నానాజన్మముల నొందుచు, తాము కృతార్థులమని బాలబుద్ధి గలవారలై మోహితు లగుదురు.

శ్లో॥ **త్రిభిర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్‌।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్‌॥** (గీత. 7-13)

తా॥ త్రిగుణాత్మక మాయచే మోహింపబడిన మానవులు పరుడను, అవ్యయుడను అగు నన్ను తెలిసికొనలేరు. (మాయ అడ్డుపడుచున్నదని కదా భగవానుడు చెప్పెను.)

శ్లో॥ **దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥**

(గీతా. 7-14)

ఈ శ్లోకమునకు శ్రీజ్ఞానేశ్వరులు వ్రాసిన వ్యాఖ్యానము ఇట్లున్నది :-

"ఓ అర్జునా! మహత్తత్త్వము మొదలగు నా మాయను దాటి నా మూలరూపమును ఎట్లు పొందుట అను ప్రశ్న ఉదయించుచున్నది . . . . . . కొందఱు అజ్ఞానము అనెడి గుండములో అభిమానము యొక్క నోటిలో పడిపోవుదురు" (ఆంధ్రజ్ఞానేశ్వరి)

పై శ్లోకముయొక్క తాత్పర్య మేమనగా :- నన్ను చేరుటకు నా మాయ అడ్డు తగులుచున్నది. అది దాటుటకు శక్యము కానిది. నన్ను శరణుపొందినవారు మాత్రమే దానిని తరింపగలరు.

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః।
మాయయా ఽపహృతజ్ఞానా అసురం భావ మాశ్రితాః. (గీతా. 7-15)

తా॥ పాపము చేసిన మూఢులగు నరాధములు మాయచేత అపహరింపబడిన జ్ఞానము గలవారలై అసుర స్వభావులై హింసాదికర్మలు చేయుచు నన్ను శరణుపొందరు.

శ్లో॥ నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః।
మూఢో ఽయం నాభిజానాతి లోకో మా మజమవ్యయమ్॥

(గీత. 7-25)

తా॥ యోగమాయచేత కప్పబడి మోహము నొందిన వారికి నా స్వరూపజ్ఞానము లేదు. అందువలన నన్ను నాశరహితునిగా ఎఱుగరు.

అవిద్యకు యోగమాయ యనునది పర్యాయపదమే. ఇది పరమేశ్వరునకు సంబంధించినదే కనుక అదియే ఆయన లీల. ఆయనకు ఆయన లీలయే కప్పినది - శ్రీజ్ఞానేశ్వరులు "జ్ఞానమును అజ్ఞానము కప్పజాలదనిరి కదా? (అను. 7-10, 11) ఈ సిద్ధాంతము ఈ క్రింది గీతావాక్యముచే ఖండింపబడినది.

శ్లో॥ "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః।"

తా॥ అజ్ఞానము జ్ఞానమును కప్పియున్నది. కాన, మానవులు అవివేకులై మోహమును చెందుచున్నారు.

(శ్లోకమునందు 'జంతవః' అని యున్నందున మానవులు మాత్రమే కాదు, పుట్టుక గల సమస్త ప్రాణులు అని అర్థము.)

సూర్యుని మేఘము కప్పినదని లోకు లనుచున్నారు. అది వ్యావహారిక సత్యమే గాని పారమార్థిక సత్యము కాదు. మనము మనశరీరము కనబడకుండులాగున వస్త్రమును కప్పుకొందుము. ఆవిధముగ మేఘము సూర్యుని కప్పజాలదు. అది సూర్యుని సమీపింపజాలదు. కాని, మేఘము మన నేత్రమునకును, సూర్యునకును మధ్యగా ఉండునప్పుడు మన దృష్టికి మాత్రమే మేఘము అడ్డు తగులుచున్నది. మేఘము సూర్యుని పూర్ణముగ కప్పియుండిన

మన దృష్టికి సూర్యుడే కాక మేఘము సహితము గోచరింపదు. అట్లే బ్రహ్మమును మాయ పూర్ణముగ ఆవరించియుండలేదు.

జిజ్ఞా:- ప్రాచీన ఉపనిషత్తులయందు 'మాయ' ను గుఱించి చెప్పబడలేదందురు. మీరును ముండక, కఠ, శ్రుతులనుండి ఉదాహరించిన వాక్యములయందు 'అవిద్యా' శబ్దమునే ఉదాహరించితిరి.

వేదాంతి:- మాయాస్వరూప నిర్వచనమునందు శ్రీశంకరులు నామరూపములకే 'మాయ' అను నామమును చెప్పియున్నారు. పారమార్థికదృష్టితో చూచిన నామరూపములు లేనివే యగుటచే పట్టుకు చిక్కనవికావు. కాని, వ్యావహారికదృష్టితో చూచిన అవి సత్యములే. ప్రాచీన శ్రుతులయందు నామరూపములకు ఎచట సత్య శబ్దము నుపయోగించిరో, అచట నామరూపములకు పరమునందున్న పరబ్రహ్మమునకు అమృతశబ్దము నుపయోగించిరి. తరువాత రాను రాను వ్యావహారికదృష్టితో కాక సత్యదృష్టితో (పారమార్థిక దృష్టితో) పూర్వము సత్యశబ్దము నుపయోగించిన నామరూపములకే మాయాశబ్దము నుపయోగించి అమృత శబ్దమునకు బదులు పరబ్రహ్మమును సత్యశబ్దముతో పిలిచిరి. మఱియు సవిమర్శగా అర్థమగుటకై బ్రహ్మమును 'సత్యస్య సత్యం' వ్యావహారిక సత్యమునకంటె పరమునందున్న సత్యమని చెప్పిరి. ఈ యంశమును శ్రీలోకమాన్యతిలక్ మహాశయులు వారి గీతారహస్యమునందలి 'అధ్యాత్మము' అను ప్రకరణమునందు (పుటలు. 304, 305) విపులముగ చర్చించిరి.

అజ్ఞానము అభావమని శ్రీజ్ఞానేశ్వరులు అనేకవిధముల చెప్పియుండియు, వారే గ్రంథమున అజ్ఞానము కలదనునట్టి అర్థమిచ్చు వాక్యములను కొన్నింటిని వ్రాసియున్నారు. వాటిలో కొన్నింటి నిచట ఉదాహరించుచున్నాను

"అజ్ఞానాంధకార మధ్యంబునం బారాడుచు, స్వానుభూతి నొందుచు జెల్వొందు న వ్విశుద్ధజ్ఞాన సంగ్రహ కార్యంబున సహాయంబొనర్చు న గ్గురుదేవునకుం బ్రణామంబు గావించెద." (అను. 2-2)

"మాయామత్తేభంబును గూల్చివైచి తత్కుంభస్థల స్థితంబగు రత్నచయంబు గొని మగిడి (మత్తేభము) దర్పణంబు గావింపగల్గి. . . .

(అను. 2-3)

"*అజ్ఞానాంధకారంబున* బ్రకాశవంతంబగు జ్ఞానంబు సహితము శుద్ధజ్ఞానంబుచే గబళింపబడియెడి." (అను. 4-14)

"ఇవ్విధంబున నజ్ఞానంబు సహితము స్వాస్తిత్వంబును గాంచు నవసరంబున మిథ్యాజ్ఞానంబును గల్పించు." అని వ్రాసియున్నారు.*
(అను. 3-10)

జిజ్ఞా:- అయ్యా! శ్రీజ్ఞానదేవులే స్వయముగా ఇట్లు వ్రాసియు మాయావాదఖండన మేల చేసిరో నాకు బోధపడలేదు. బహుశః వారి దృష్టిలో అజ్ఞాన మనునది ఒక భావ పదార్థము కాదనియు, జ్ఞానముయొక్క అభావమునే లోకులు అజ్ఞాన మందురని భావించి యుండవచ్చును. లేదా జ్ఞానము యొక్క ప్రాగభావమే అజ్ఞానమని అనుకొని యుండవచ్చునా?

వేదాంతి :- ఆవిధముగ తలంచుటకు వారి మతము ననుసరించి వీలు లేదు. ఏమన? సర్వమును జ్ఞానస్వరూపమై యుండ దాని ప్రాగభావమును భావించుటకు వీలులేదు. ఈ యంశమును శ్రీసురేశ్వరాచార్యులు తమ 'నైష్కర్మ్యసిద్ధి' యందు (అ, 3. 2-63) విచారించి ఖండించిరి. ఇట్లుండ శ్రుతిస్మృతులయందు మాయ (అజ్ఞానము) స్థితియుతమని నిరూపింప బడియున్నదను విషయమున ఇంకను సంశయముండునా?

అదిగాక మన నిత్యానుభవమునందు చూడుము 'మామహం జానామి'- నన్ను నే నెఱుగుదును; 'మామహం న జానామి' -నన్ను నే నెఱుగను, ఇత్యాది వాక్యముల యందు జ్ఞానాజ్ఞానములు రెండును స్వానుభవమునందు వ్యక్తమగుచున్నవి. నీవు ఆత్మవై యుండగా దేహముననియు, నీవు నిత్యుడవై యుండగా అనిత్యుడ ననియు, పొరపడుటకు హేతువేదియో అదియే అవిద్య. ఇది స్వానుభవము. అజ్ఞానమే లేకపోయినచో లేని అజ్ఞానమువలన నీకిట్టి

* ఈ యర్థమే సంస్కృతానువాదమునం దిట్లున్నది.

శ్లో|| *అవిద్యా* ప్రతిబంధాచ్చ భవచక్రేణ పీడితమ్|
కారుణ్యా జ్జీవచైతన్యం యో మోచయతి దుఃఖతః|| (అమృతా. 2-2)

శ్లో|| *మాయానాగం* విదార్యాథా శయతి ముక్తి మౌక్తికమ్|
సద్గురుం హరిరూపం తం నివృత్త్యాఖ్యం నమామ్యహమ్|| (అమృతానుభవము. 2-3)

పొరపాటు కలుగజాలదు. అజ్ఞానము వంధ్యాపుత్రునివంటి అభావము కాదనుటకు శంకరాద్వైతులు చెప్పిన సమాధానము వింటివి. ఇంతకంటెను ఎక్కువగ చెప్పనవసరము లేదనుకొందును.

జిజ్ఞా:- తమ వాక్యములవలన అజ్ఞానము వ్యావహారికముగ స్థితియుత మైనదే యని నిశ్చయించుకొంటిని. కాని, అజ్ఞానము ఆత్మ నాశ్రయించుకొని యున్నదను విషయమై సంశయ మున్నది. దానిని వివరింపుడు.

## (౮) ఆత్మయే అజ్ఞానమున కాశ్రయము

అద్వైతు లిట్లు చెప్పుదురు:- ఆత్మ - అనాత్మ అను రెండు పదార్థములు మాత్రమే కలవు. ఇవిగాక మూడవదేదియును లేదు. అందు ఆత్మ సత్యము, అనాత్మ అసత్యము. నే నీ జగత్తును చూచుచున్నాను. జగత్తు నాచేత చూడబడుచున్నది. ఇచ్చట చూచువాడొకడును, చూడబడున దొకటియు నను రెండు పదార్థములు పరస్పర భిన్నము లనుట నిస్సంశయము. చూచువాడు ద్రష్ట, చూడబడునది దృశ్యము. ద్రష్ట అనగా : చూచునట్టి స్వభావము కలవాడు. దృశ్యము అనగా : చూడబడునట్టి స్వభావము కలది. భిన్న స్వభావము గల యీ రెండును ఒక్కటి కానేరవు. దృశ్యపదార్థము జడము. అది తన్ను తా నెఱుగదు. ఇతరమును తా నెఱుగదు. ఇతరమును ఎఱుగజాలదు. కనుక అది అనాత్మ. తన్ను తా నెఱుగునట్టివాడు ఆత్మ.

ఆత్మ, అనాత్మ అను నీ రెంటియందు అజ్ఞానము దేనినైన నొకదాని నాశ్రయించుకొని యుండవలయును కదా? ఆత్మానాత్మలయందు అజ్ఞానమున కాశ్రయమేది? అని మనము విచారించిన, జడమగు అనాత్మ అజ్ఞానమున కాశ్రయము కాజాలదు. అనాత్మ అజ్ఞానము యొక్క కార్యమని అంగీకరింపక తప్పదు. అజ్ఞాన కార్యమైన అనాత్మ అజ్ఞానమున కెట్లు ఆశ్రయమగును? అనాత్మ కలుగుటకు పూర్వమే అజ్ఞాన ముండెను కదా? అప్పుడు అజ్ఞానమున కాశ్రయమేది? ఆత్మానాత్మలయందు అనాత్మ అజ్ఞానమున కాశ్రయము కాదని స్థిరపడిన పిదప ఆత్మయే అజ్ఞానమున కాశ్రయమని తేలినది. త్రాటియందు పామువలెను, శుక్తియందు రజతమువలెను ఆత్మ యందు అజ్ఞానమువలన

అనాత్మ తోచుచున్నది. మన అనుభవము కూడ ఈ విషయమునే దృఢపరచుచున్నది. ఎట్లన :-

జడపదార్థ మేది యైనను 'మామ హం న జానామి'- నన్ను నే నెఱుంగను, అనిగాని 'న జానామి'- ఎఱుగను అని గాని చెప్పుట లేదు. లేక, తలచుటలేదు. అంతఃకరణ ముండిననే జ్ఞాన ముండును. ఒక ఘటమునకు 'నేను ఘటమును' అను జ్ఞానము లేదు. ఏలయన? దానికి అంతఃకరణము లేదు. అది జడము, అజ్ఞాన నివర్తకమగు సంయక్ జ్ఞాన మెచ్చట నుండునో (దేని నాశ్రయించి యుండునో) అచ్చటనే అజ్ఞాన ముండును. అనాత్మ యందు సంయక్ జ్ఞానము లేదు. కనుక అజ్ఞానము లేదు. మఱియొక విషయమేమన:-

అజ్ఞానము కారణము, అనాత్మ దానియొక్క కార్యము, అందువలన కారణము కార్యము నాశ్రయించియుండదు. ఎన్ని విధముల చూచినను అనాత్మతో అజ్ఞానమునకు ఆశ్రయాశ్రయీ సంబంధము లేదు, అవి రెండును ఒకదానిని వేఱొకటి యెఱుగవు. కనుక, నా రెంటికి విషయ విషయి సంబంధము కూడ లేదు. ఇట్లు ఆత్మానాత్మలయందు అనాత్మ అజ్ఞానమునకు ఆశ్రయము కాదనియు, అనాత్మ పదార్థము అజ్ఞానమునకు ఆశ్రయము కాదనియు, అనాత్మపదార్థము అజ్ఞానమునకు విషయము కాదనియు, స్థిరపడిన పిదప ఇక మిగిలియుండునది ఆత్మయే అయినందున ఆత్మయే అజ్ఞానమునకు ఆశ్రయము. అదియెట్లో యింకను వివరింతును.

1. ప్రమాజ్ఞానము (ఇదియే సంయక్ జ్ఞానము). 2. సంశయ జ్ఞానము. 3. మిథ్యా జ్ఞానములచేత బుద్ధియే శేషించుచున్నది. ప్రమాజ్ఞానము అబాధితార్థమును తెలియజేయును. అనగా త్రాటిని చూచి 'ఇది త్రాడు' అని తెలిసికొనును. సంశయజ్ఞానము మసక చీకటిలో త్రాటిని చూచి 'ఇది త్రాడా? పామా? ' అని సంశయించును. మందాంధకారములో త్రాటినిచూచి పామని తలచుట మిథ్యాజ్ఞానము. ఈ మిథ్యాజ్ఞానమునే విపర్యయజ్ఞాన మందురు.

ఈ మూడును నెచట నుండునో అచటనే అజ్ఞానము ఆశ్రయించి యుండును. ఈ త్రివిధ జ్ఞానములకును ఆత్మయే ఆశ్రయము. అనాత్మ

గాని దాని కార్యములగు ఘట కుడ్యాదులుగాని అజ్ఞానమునకు ఆశ్రయములు కావు. కనునే ఆత్మాశ్రయమ్మైన సంశయ మిథ్యాజ్ఞానములను సంయక్ జ్ఞానము తొలగించుచున్నది. శాస్త్రములు సహితము అజ్ఞానము ఆత్మ నాశ్రయించి యున్నదని నిరూపించినవి. ఇందుకు ఉదాహరణము :-

నారదమహర్షి సనత్కుమార మహర్షికడ కేగి "ఓ భగవానుడా! ఋగ్వేదాదుల నెఱిగితిని, ఆత్మ నెఱిగినవాడను కాను" అని చెప్పినట్లు ఛాందోగ్య శ్రుతియందు కలదు. ఇచట నారదమహర్షి తనకు గల అజ్ఞానానుభవమును తెలియజేసెను.

అజ్ఞానమునకు అనాత్మ ఆశ్రయమని చెప్పిన నేదోషములు సంభవించునో అట్టి దోషములు ఆత్మ అజ్ఞానమున కాశ్రయమని చెప్పిన కలుగవు. అజ్ఞానమునకు ఆత్మ ఆశ్రయ మైనందుననే నిత్య శుద్ధ బుద్ధ మగు అద్వితీయాత్మవస్తువు తాను అనిత్య అశుద్ధమగు దేహాదికముగ భావించుచున్నది. ఈ కారణములవలన ఆత్మ - అజ్ఞానములకు ఆశ్రయ ఆశ్రయీభావ సంబంధము, విషయ విషయీభావ సంబంధములు కూడ కలవు.

జిజ్ఞా:- అయ్యా! అనాత్మకు అజ్ఞానము కారణ మంటిరికదా? అజ్ఞానమునకు కారణ మేది? అజ్ఞాన మనునది దేని కార్యము

వేదాంతి :- అజ్ఞానమునకు కారణము లేదు. అజ్ఞానమునకు కార్యమున్నది. వ్యష్టిగతముగా విచారించిన సుషుప్తి అజ్ఞానము. సుషుప్తి నుండి స్వప్నజాగరములు కలిగినవి. కనుక సుషుప్తి కారణము, స్వప్నజాగరములు దాని కార్యములు. అట్లే సమష్టియందు ఈశ్వరుడు కారణము. హిరణ్యగర్భ, విరాట్టులు కార్యములు. ఈ విధముగ అజ్ఞానము కారణబద్ధమై యున్నది. స్వప్నము కార్యకారణబద్ధమై యున్నది జాగ్రత్త కారణబద్ధమై యున్నది. ఈ త్రివిధావస్థలకంటె వేఱగు జగత్తు లేదు. కనుక జగత్తునకు బీజము అజానము.

జిజ్ఞా:- అజ్ఞానమునకు కారణము ఆత్మ కాదా?

వేదాంతి:- కాదు. వ్యవహారికముగ మాత్రమే ఆత్మయందు కారణత్వ మారోపించుచున్నారు. ఆత్మ ఒకదానికి కారణమును కాదు, కార్యమును కాదు. కారణ కార్యధర్మములు రెండును ఆత్మను బంధింపవు. ఆత్మ కారణ కార్యములకంటె పరమునందు (అతీతమై) ఉన్నది. శ్రీజ్ఞానేశ్వరులు అజ్ఞానమును గుఱించి విమర్శించిన సందర్భమున "నీ యజ్ఞాన మనునది యెవ్విధ కార్యంబునకు గారణంబు గాని, యెవ్విధ కారణంబునకు గార్యంబుగాని కాకపోవు . . . . . . "(అను. 7-56) అని చెప్పిన వాక్యములు అద్వైతులకు సమ్మతము కావని యిచట నిరూపింపబడెను.

సూర్యునియందు చీ క టి కా పు ర ముం డు నా? యని శ్రీజ్ఞానేశ్వరులు ప్రశ్నించిరి. ఆత్మకు సాక్షి చైతన్యమే స్వభావము కనుక, సాక్షి చైతన్యము అజ్ఞానమునకు విరోధి. ఇచట ఇంకొక విషయము జ్ఞాపకముంచుకొనవలయును. ఆశ్రయ ఆశ్రయీ భావాదిభేద మంతయు వ్యావహారికమేగాని పారమార్థికమని అద్వైతు లంగీకరింపరు.

ఆత్మకు రెండు ఆకారములు కలవు. 1. 'అహం' సామాన్యముగ కనబడునట్టి ఆకారము. ఇదియే జ్ఞానాజ్ఞానములకు ఆశ్రయము. దీనిని ప్రతీయమాన మందురు. 2. అద్వితీయ సచ్చిదానంద ఆకారము. ఇది అప్రతీయమానము. ఇది శాస్త్రగమ్య మైనది.

శ్రీజ్ఞానేశ్వరులు అజ్ఞానము లేనిదనుటయేగాక జ్ఞానము సహితము లేనిదే యనిరి. అజ్ఞాన మనునది లేనియెడల జ్ఞానముతో నిమిత్తము లేదు. ఉన్నదన్న అట్టి జ్ఞానము వలన ప్రయోజనమేమి? "చీకటి రాగా దీపము వెలిగింతుము కాని సూర్యుడే ప్రకాశించుచుండగా దీపముతో అవసరమేమి" అని చెప్పిరి. (అను. 8-10, 11, 12) వారి వాక్యముల పర్యవసాన మేమన జ్ఞానాజ్ఞానములు రెండును లేనివే, శుద్ధజ్ఞానము జ్ఞానాజ్ఞానరహితము. అద్వైతులు వ్యావహారికముగ జ్ఞానాజ్ఞానముల రెంటియొక్క భావమును అంగీకరింతురు.

కాని, రెండును మాయికములే యగుటవలన రెండును నశించునవే యనిరి. అందువలన బంధమోక్షము లనునవి మృషయని అద్వైతుల సిద్ధాంతము. ఈ యంశమున శ్రీజ్ఞానేశ్వరుల యొక్కయు, అద్వైతుల యొక్కయు అభిప్రాయములు ఒక్కటియే.

జిజ్ఞా :- శ్రీజ్ఞానేశ్వరులు ఆత్మయే జగద్రూపమున కనబడుచున్న దనిరికదా? దానిని వా రేవిధముగా వివరించిరో బోధింపుడు.

## (౧౦) శ్రీజ్ఞానేశ్వరులు చెప్పిన శివ - శక్తులు

వేదాంతి :- ఆత్మయొక్క స్పందనమే శివశక్తిరూపమును పొంది జగద్రూపమున కనబడుచున్నారని శ్రీజ్ఞానేశ్వరులు ఈ క్రింది విధముగా తమ అనుభవామృతమునందు చెప్పిరి :-

1. "నిరుపాధికంబును, విశ్వంబున కాది కారణంబునై దీపించు నద్దేవీ దేవస్వరూపంబున కిమ్మాడ్కి భక్తియుక్తంబుగ వందనంబు గావించువాడ."

(అను. 1-1)*

2. "మనోహర ప్రదేశంబునం దాసీనుండగు ప్రేమికుండు (శివుడు) స్వీయంబగు ప్రేమాతిశయంబునం జేసి తత్తుల్యమాంసోపనిర్మితంబై తుల్యాహారంబు గైకొనియెడు స్వప్రియా శక్తి రూపంబు నొందుచుండు."

(అను. 1-2)

---

* ఈ పద్యముయొక్క తాత్పర్యము ఈ క్రింది వరుసక్రమము ననుసరించి చెప్పుచున్నాను

1. శివశక్త్యాత్మకమైన నిరుపాధిక బ్రహ్మమే జగత్కారణమని చెప్పబడినది
2. సద్రూపుడైన శివుడు చిద్రూపిణియగు శక్తి (ప్రకృతి) రూపమును పొందుననగా సచ్చిద్రూపములు రెండును ఒకటియేయని, శివుని యిచ్ఛయే ఆవిధముగ భేదరూపమున తోచుచున్నదని అరము.

3. "ఇవ్విధంబున నా శివుండును శక్తియు దీవ్రంబగు వాంఛాపారవశ్యంబుచే బరస్పరంబు గబళించుకొను వారలై మగిడి దదీయంబగు ద్వైతాభిలాషంబున బరస్పరంబు నుద్దీర్ణించుకొనుచుందురు." (అను. 1-3)

4. "త (శివుండును శక్తియును) ద్విషయంబున బూర్ణంబగు భిన్నత్వం బేనియు నభిన్నత్వం బేనియు గానరా కుండెడు కతంబున దత్సహజస్వభావంబును మన మెఱుగ జాలకుండుదుము." (అను. 1-4)

5. "శివుండును, శక్తియును నభిన్నత్వంబున జెల్వొందుచుండియును, సామాన్యంబుగ నిర్వురట్లు కానవచ్చుటంజేసి, యెవ్వారి యర్థాంశంబునని యన్యార్థాంశంబున నైక్యంబగునా యని యూహింప నసాధ్యంబగు.

(అను. ఈశ్వరప్రార్థనము 3)

6 "అద్దేవుని కారణంబునంజేసి దేవ్యస్తిత్వంబు కొమరొప్పుచుండు. మఱియు న ద్దేవ్యభావంబుచే దేవాస్తిత్వంబును బద్ధంబై తనర్చు. సారాంశం బేమన ద దుభయాస్తిత్వంబును బరస్పరాధారంబై వెలయుచుండు."

(అను. 1-10)

7. "విశ్వంబనియెడు విశాలగృహంబున వాసంబుండు వార లీ యిర్వురుమాత్ర మనం జెల్లు, మఱియు నీయిర్వురందును బ్రభుండు సుషుప్తిం

---

3. శివుడు శివుడుగా నున్నప్పుడు శక్తి తోచుటలేదు శక్తి శక్తిగా నున్నప్పుడు శివుడు గోచరింపడు అని భావము

4. శివశక్తు లిరువురు భిన్నులనిగాని, అభిన్నులని గాని చెప్పుటకు సాధ్యపడనందున వారి నిజస్వరూప మిట్టిదని తెలియదు

5. పైన చెప్పిన తాత్పర్యమే దీనికి అన్వయించును.

6. శివశక్తు లిరువురకు పరస్పరము శేష శేషీ భావము సమానమని యిచట చెప్పబడినది

7. సత్తు - చిత్తు అనునవి రెండే విశ్వాకారమున గోచరించును అనగా: చిజ్జడములను రెండే యీ విశాల విశ్వమను ఇంటియందు కాపురమున్న వనియు, అందు శక్తియను జ్ఞానము శివుని యందు జగద్రూపమును గోచరింపజేయు చున్నందున ఎంతవరకు జగత్తు గోచరించునో అంతపర్యంతము సత్పదార్థము (శివుడు) గోచరము కాదు. దానినే కవి "ప్రభుండు సుషుప్తి చెందియుండునెడ, దేవియే మేల్కొనియుండి సంసారము (ప్రపంచము)ను నిర్వహించును

జెందియుండునెడ నద్దేవి యజాగృతయై తాన కార్యద్వయంబును నిర్వహించుచుండు." (అను. 1-13)

8. "అట్లుకాక య య్యుభయులు జాగృతులై యుండి రేని దన్నికేతన సర్వస్వంబును నొక్కట గబళింపంబడియెడి. అట్టియెడ నందింకెద్దియును శేషింపకుండు." (అను. 1-14)

9. "నానాత్వంబు నిర్వహించెడు నిమిత్తంబు వారిర్వురును (శివుండును, శక్తియును) భిన్నరీతి బూర్ణత్వంబునం దర్ధాంశంబులై యొప్పుచుండుదురు. మఱియు స్వీయంబగు ద్వైతంబు నైక్యంబునందు విలీనంబు గావించుకొనియెడు ప్రయత్నంబున వారు విరాజిల్లుచుండుదురు." (అను. 1-15)

10. "మఱియు, శివుండొక్కండ స్త్రీ పురుషాత్మకంబగు రూపాభాసంబున సుఖం బుండ దదీయంబులగు న య్యర్ధాంశంబులు పరస్పరైక్యంబు నొందుటంబట్టి విశ్వస్థితియు గోచరంబయ్యెడి." (అను. 1-17)

---

దేవి ప్రభునియందు ప్రేమచూపుట యనగా : విశ్వాభిముఖమైన జ్ఞానము సన్మాత్ర వస్తువున కభిముఖ మైనపుడు దానియందు (సత్పదార్థమునందు) లయమగును అప్పుడు విశ్వము గోచరించుటలేదు అదియే సుషుప్తి (ప్రళయము). అప్పుడు ప్రత్యేకించి శక్తిలేదు సద్రూపుడగు శివుడే మిగిలియుండును ఇటు విశ్వాకృతియు, సద్రూపమును గోచరింపజేయుటయు, అను కార్యద్వయమును శక్తియే చేయు చున్న" దని భావము.

8. ఉభయులు మేలుకొనుట యన నిజజాగ్రత్త (భ్రాంతిరహితస్థితి) యందు సత్తుని గాని, చిత్తునిగాని అను వ్యవహారములేని విశుద్ధజ్ఞానము (ఆత్మ) మాత్రమే మిగిలియుండును అది యిట్టిదని వచింపరానిది

9. నానాత్వము నిర్వహించుట యనగా : ప్రపంచాకృతిగ భాసించుట. అప్పుడును శివశక్తు లిరువురును వేఱు వేఱుగా తోచక శర్కరామాధుర్యముల వలెను, కర్పూరపరిమళంబులవలెను పూర్ణత్వంబున అర్ధాంశంబులై యుండుట వలెను, కర్పూరపరిమళంబులవలెను పూర్ణత్వంబున అర్ధాంశంబులై యుండుటచే ద్వైతము లేదని భావము.

10. శక్తి స్వరూపమున నున్నది శివుడే, జగమున స్త్రీ పురుష లింగభేదము

శివునియందే (దేహమునందే) కనబడుచున్నది. సద్రూపమునందున్న విమర్శ యేది కలదో అదియే శివుని శక్తియని భావము

11. "వీణాద్వయంబును నొక్క స్వరంబునే యుత్పాదించెడు చందంబునను, సుమద్వయంబును నొక్క పరిమళంబునే ప్రతిపాదించు విధంబునను, దీపద్వయంబును నొక్క ప్రకాశంబునే ప్రకటించెడుభంగిని."
(అను. 1-18)

12. "ఓష్ఠద్వయంబును నొక్క శబ్దంబునే యుచ్చరించెడు రీతిని, నేత్రద్వయంబును నొక్కదృశ్యంబునే వీక్షించెడు మాడ్కిని, న య్యుభయులును (శివుండును, శక్తియును) నొక్క ప్రపంచంబునే కావించుచుండుదురు."

(అను. 1-19)

శ్రీజ్ఞానేశ్వరులు శివశక్తులను గుఱించి చెప్పిన వాక్యములయందు కొన్నింటిని చెప్పితిని. దీనిని మనము చక్కగా అవగాహనము చేసికొనవలయును.

జిజ్ఞా:- అయ్యా! ఈ శివశక్తు లెవరు? అద్వితీయమగు ఆత్మ తప్ప అన్యమేమియును లేని స్థితియందు నీ ద్వైతభావము కలుగుటకు కారణమేమి?

వేదాంతి :- అగ్ని కొంచెము ముందునకు సాగి జ్వాలా రూపమున కనబడినట్లు ఆత్మస్పందనమే శివశక్తులైనది. పైన చెప్పబడిన పద్యముల (ఓవీఛందముల) యందు 4వ పద్యమున శివశక్తులు భిన్నులనిగాని, అభిన్నులనిగాని చెప్పజాలనందున వారి ***"సహజస్వభావము మన మెఱుగజాల కుందుము."*** అని యున్నది. దీని భావమేమి? శ్రీశంకరులు చెప్పిన మాయనే ఒకవిధముగా శ్రీజ్ఞానేశ్వరులు పరోక్షమున అంగీకరించి నట్లయినదని నా యభిప్రాయము. 5వ పద్యమున, శివశక్తులు ఇరువురవలె కనబడుదురే గాని యిరువురు ఒక్కటియే యని చెప్పిరి. ఇరువురు ఒక్కటె ట్లగుదురు? "ఎవరి అర్ధాంశములు చని అన్యుల అర్ధాంశమున ప్రవేశించెనో చెప్పలేము" అనిరి. వేఱువేఱు భాగములు రెండు ఒక్కటియైనవని తలంపవచ్చునా? అట్లు చెప్పుటకు వీలులేదు.

---

11, 12. ఈ రెండు పద్యములయందలి అర్థ మొక్కటియే. లోకమున దంపతులు దాంపత్య ధర్మమును నిర్వహించునపుడు, భర్తయొక్క శుక్లమును భార్యయొక్క శోణితమును కలిసియే శిశువు జన్మించుచున్నది కదా? ఆ విధముగనే శక్తి శివుని ఆధారముగ గైకొని గర్భము ధరించి విశ్వమను బాలకుని కనుచున్నదని భావము

శివశక్తులు అర్ధనారీశ్వరునివలె నున్నారని కొందఱందురు. అర్ధనారీశ్వర విగ్రహమునుగాని అట్టి చిత్రపటమునుగాని మనలో అనేకులు చూచియే యున్నాము అర్ధనారీశ్వర రూపకల్పనమునందు మనకు ఏకత్వమున భిన్నత్వము కనబడును. అది స్వగతభేదము వంటిది కాదందురు. అట్టివారే యీ శివశక్తులని శ్రీ జ్ఞానదేవుల అభిప్రాయమా? అర్ధనారీశ్వర విగ్రహమున (రూపమున) నే సగభాగమైనను తీసి వేఱుచేసిన రెండుభాగములును నిరుపయోగమగును. రెండును ఒకటిగా ఉన్నప్పుడే ప్రవృత్తి, లేక, వ్యాపారము కలుగునని 6వ పద్యము యొక్క తాత్పర్యము. అర్ధనారీశ్వరులు నడచినను, సంభాషించినను నేమిచేసిన నిరువురు ఒక వ్యాపారమునే (క్రియనే) చేయుదురు. కాని, ప్రత్యేకించి యేమియు చేయజాలరు. ఇది 11, 12 పద్యముల యందలి సారాంశము. కాని, అర్ధనారీశ్వర విగ్రహమును ఉపమానముగ గైకొని శివశక్తుల స్వరూపనిరూపణము చేయుటకు వీలులేనట్లుగ వా రిరువురు "సమీర చలనంబుల వలెను, స్వర్ణకాంతుల కరణియు, కస్తూరి పరిమళంబుల మాడ్కిని, విభాగింప నలవికాకుండుదురు" అని (అను. 1-41, 42) శ్రీజ్ఞానేశ్వరులే చెప్పియున్నందున అర్ధనారీశ్వర విగ్రహసామ్య మిచట సరిపడదు. ఒక సగభాగము పురుషాకృతిగను, వేఱొక సగభాగము స్త్రీ యాకృతిగను కనబడు అర్ధనారీశ్వర విగ్రహసామ్యము వలన నే అర్ధభాగము లేకున్నను మిగత అర్ధభాగము వ్యర్థమగునట్లు శివశక్తుల యందు ఏ ఒకరు లేకున్నను తక్కినవారి యునికి ప్రయోజనకారి (క్రియావంతము) కాదని మాత్రమే బోధించుటకు సహాయకారి యగునేగాని ***అర్ధనారీశ్వర విగ్రహము శివ శక్తుల స్వరూపనిరూపణము చేయజాలదు.***

శివ శక్తు లిరువురు పురుషుడు ప్రకృతియు నని శ్రీజ్ఞానదేవులు చెప్పుటకంటె వస్తువు, దాని గుణము అని చెప్పుట వారి వాదమునకు సరిపడును. ప్రకృతి పురుషులనగా : వీరు కాపిలసాంఖ్యమునందు చెప్పిన ప్రకృతి పురుషులవంటివారు కారు. కాపిలసాంఖ్యమున ప్రకృతి పురుషు లిరువురు పరస్పరము భిన్నులు, స్వతంత్రులు. ఇచట వీ రిరువురు అభిన్నులును, భిన్నులును కూడ. వీ రొకరిపై ఒక రాధారపడినవారు. వేదాంతులయొక్కయు, సాంఖ్యుల యొక్కయు తత్త్వముల ననుసరించి ప్రకృతి జడము, పురుషుడు (ఆత్మ) చైతన్యస్వరూపుడు.

శ్రీజ్ఞానేశ్వరులు చెప్పిన శివ-శక్తులు సత్తాస్ఫూర్తులు. సత్య-జ్ఞానములు, అనగా : సత్తు-చిత్తు లనుగా వర్ణించిరి. ఇందు శివుడు (పురుషుడు)శక్తియందు ప్రేమ చూపినపుడు ప్రపంచాకృతిగ భాసించును. శక్తి (ప్రకృతి) శివుని యందు ప్రేమ చూపినపుడు, శక్తి పురుషుని యందు లయమగును. అప్పుడు ప్రపంచము భాసించదు. అనగా : సత్తు చిత్తు అను రెండింటియందు చిత్తు సత్తునందు లయమగుటవలన సన్మాత్రమే మిగిలియుండును. శ్రీజ్ఞానేశ్వరులు చెప్పునట్టి సత్తు - చిత్తు అను వాటి యందు 'చిత్తు' అనునది అద్వైతులు చెప్పునట్టి వృత్తి జ్ఞానమే* యైయుండవలయునేగాని అద్వైతులు చెప్పునట్టి చిత్తు కాదు. అనగా: కూటస్థాత్మ కాదు. సాక్షి కాదు. ఏలయన:- వృత్తి జ్ఞానము ఆగమాపాయములు (రాకడ పోకడ) కలది. ఆత్మయందు లయమగుచున్నది. కూటస్థజ్ఞానమునకు లయము లేదు. ఇది రాకడ పోకడలు లేక యేకాకృతిగ ప్రకాశించునది.

అనుభవామృతమునందలి ఐదవ ప్రకరణమునందు శ్రీజ్ఞానదేవులు సచ్చిదానంద శబ్దవిచారము చేసిరి. అందు సత్తు, చిత్తు, ఆనందము అను నీ "శబ్దత్రయమును సత్పదార్థ నిరూపణమున నిరుపయోగంబగు. మఱియు నీశబ్దత్రయంబు భావంబులందు శేషించు స్వభావంబు గలవియై వెలయుచుండు." (అను. 5-9) మఱియు "ఈ శబ్దత్రయం బేకమై జ్ఞాత కవగతం బగుననియు, వర్షించినపిమ్మట మేఘమువలెను, సముద్రమున సంగమించిన నదివలెను, గమ్యస్థలమును చేర్చిన మార్గము వలెను, ద్రష్టకు త న్నిజస్వరూపంబు జూపి, అంత మౌనంబున వినష్టంబగు" (అను. 5-20, 21, 25) అని వచించిరి. అయినను ఆత్మను 'సత్' అనుటవలన అసత్తు కాదనియు, 'చిత్' అనుటవలన జడము కాదనియు, 'ఆనంద' మనుటవలన చింతారహిత మైనదనియు శ్రుతి బోధించి యున్నట్లు చెప్పిరి.

---

* వృత్తి జ్ఞానమనగా :- సాభాసాంతః కరణమునందొక భాగమగు మనస్సు జ్ఞానేంద్రియములతో చేరి ఘటాదివిషయములయందు ప్రసరించుచున్నది. అనగా :- విషయములతో సంయోగము కలుగుచున్నది. అప్పుడు మనస్సు ఆ విషయముయొక్క ఆకృతిని లోనికి గొనిపోయి బుద్ధియెదుట నిలుపును. బుద్ధి ఆ విషయాకారముగ పరిణమించును. ఇచట బుద్ధి అనగా : చిదాభాససహితమగు బుద్ధి. ఈ విషయాకారముగ పరిణమించిన బుద్ధినే 'వృత్తి' యని 'బుద్ధివృత్తి' యని 'వృత్తజ్ఞాన' మని 'ప్రత్యయజ్ఞాన' మని అందురు. ఈ గ్రంథముయొక్క ప్రథమభాగము రెండవ ప్రకరణమున కూటస్థచిదాభాసులను ౨౭ వ అధ్యాయమున ఈ విషయము చర్చించితిని.

శ్రీజ్ఞానేశ్వర సంప్రదాయమునకు చెందిన పెద్దలు ఇట్లు చెప్పుదురు .- **ఆత్మ** నిత్యానందస్వరూపము, లేక, సచ్చిదానందము. ఇచట 'నిత్య' శబ్దమునకు సత్యజ్ఞానమని అర్థము. సత్యజ్ఞానమును విడదీసి (వికల్పించి)న, సత్య+జ్ఞానము అని యగును. ఇందులో 'సత్య' మనునది త్రికాల అబాధిత మగుటవలన శివుడు, 'జ్ఞాన' శబ్దము విచారణాత్మక మగుటవలన శక్తి. ఆత్మ స్వసంవేద్యము (తనను తా నెఱుగును) కాన జ్ఞాతృజ్ఞేయత్వము, ప్రాప్యప్రాపకత్వము అను రెండును ఆత్మయే యైనట్లు సత్య జ్ఞానములు రెండును ఒకటియే. సత్య జ్ఞానముల కలయిక ఆనందము.

ఇచట ముఖ్య విషయమొకటి చెప్పవలసియున్నది. ఆనందము సత్య జ్ఞానములయొక్క కలయిక యని అమృతానుభవముయొక్క వ్యాఖ్యానమున కలదు. ఎట్లన? :-

"లోకమున సామాన్య మానవుడు కర్రను చేతను బట్టినప్పుడు దండి. అనగా దండము కలవాడని పిలువబడుచున్నాడు. అట్లే శబ్దరహితమైన పరమాత్మ దుఃఖాతీత లక్షణము ననుసరించి ఆనందశబ్దముచే పిలువబడుచున్నాడు. ***ఆత్మ కానందశబ్దము ధర్మము ననుసరించి వచ్చినదేగాని స్వరూపతః లేనేలేదు."*** (విజయదుందుభి పుట 38)

దీనిని శ్రుతు లంగీకరింపవు. ఆత్మకు ఆనందము ధర్మము కాదు, గుణమును కాదు. ఆత్మ దేనికిని ధర్మికాని, గుణికాని కాదు. ఆనందము ఆత్మస్వరూపము. ఆత్మయే ఆనందము. ఆనందమే ఆత్మ, సచ్చిదానందములు ఆత్మస్వరూపమని తైత్తిరీయోపనిషత్తును, ఇతర శ్రుతులును స్పష్టముగ చెప్పియున్నవి. ధర్మముగాని గుణముగాని, వస్తువుయొక్క స్వరూపమునకంటె భిన్నములు. ***ఆనందము ఆత్మ ధర్మమని చెప్పినవారి దర్శనము వేదాంతము కాదు.*** కాని, శ్రీజ్ఞానేశ్వరుల అమృతానుభవముయొక్క ప్రారంభమున మంగళాచరణ శ్లోకమునందే ఆత్మ ఆనందమని చెప్పిరి.

శ్లో॥ **యదక్షరమనాఖ్యేయ 'మానంద' మజమేకలమ్।**
**శ్రీమన్నివృత్తినాథేతి ఖ్యాతం దైవత మాశ్రయే॥** (అమృ. 1-1)

గద్యము. "మహిమాన్వితంబును 'శ్రీనివృత్తినాథ నామాలంకృతంబును' **శాశ్వతంబును**, వర్ణనాతీతంబును, ***నానంద పూర్ణంబును***, నిత్యంబునై యొప్పు న ప్పరమేశ్వర **తత్త్వంబు** నాశ్రయించెద." (అను 1-1)

అని చెప్పియున్నందున వ్యాఖ్యాతయే పొరబడియుందురని నా అనుమానము.

అద్వైతులు స్వల్పభేదముతో పై విషయమునే యిట్లు చెప్పుదురు :- ఆత్మ-అనృత, జడ, దుఃఖాత్మక ప్రపంచమువంటిది కాదని నిషేధరూపమున తెలియజేయుటకు శ్రుతి 'అనృత' శబ్దమునకు వ్యతిరేకమగు (విరుద్ధమగు) 'సత్' (సత్య) శబ్దమును; ఆత్మ జడము కాదనుటకు 'జడ' శబ్దమునకు విరుద్ధమగు 'జ్ఞాన' (చిత్) శబ్దమును, ఆత్మ దుఃఖస్వరూపము కాదని తెలియజేయుటకు 'దుఃఖ' శబ్దమునకు విరుద్ధమగు 'ఆనంద' శబ్దమును, ఉపయోగించి ఆత్మ సచ్చిదానందమని శ్రుతి చెప్పినది. ఇది నిషేధరూపమే. అయినను నిందు విధిచ్ఛాయలున్నవి. ఆత్మయే సత్తు, ఆత్మయే చిత్తు, ఆత్మయే ఆనందము- అని తాత్పర్యము. దీనినే 'సత్యాజ్ఞానానందము' లనియు, 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అనియును శ్రుతి చెప్పినది.* - పర్యవసాన మేమన :- శ్రీశంకరాద్వైతులు సచ్చిదానందములు పరబ్రహ్మవాచకము లందురు. శ్రీజ్ఞానేశ్వరులు అవి వస్తువాచకములు కావందురు. మఱియు, వీరు జగత్తు దుఃఖాత్మకమని అంగీకరింపరు. కనుక, ఆత్మ 'చింతారహిత' మగుట వలన ఆనందమని స్వల్పముగ మార్చి చెప్పిరి. చింత = దుఃఖమేకదా? చింతయందు స్వల్పమాత్రమగు దుఃఖము గోచరించునుగదా? పై విధముగ శ్రీజ్ఞానేశ్వరులు శివశక్తులను గుఱించి చెప్పిరి.

జిజ్ఞా:- శివశక్తులు ప్రకృతి పురుషులని పై విధముగ చెప్పిన పెద్ద లెవరైన గలరా?

వేదాంతి:- లేకేమి? మన కాలమునందే మహాతాంత్రిక యోగియని ప్రసిద్ధికెక్కిన మహనీయులు శ్రీఅరవిందులు. శివ-శక్తి తత్త్వములను గుఱించి వివరించియున్నారు. వీరు చెప్పిన తత్త్వమును సంగ్రహించి చెప్పెదను. సావధానుడవై వినుము.

---

* ఈ గ్రంథముయొక్క ప్రథమభాగమునందలి రెండవ ప్రకరణమున "(౨౨) సచ్చిదానందములు" "(౨౩) సత్తు - అసత్తు" "(౨౪) చిత్తు - జడము" "(౨౫) ఆనందము - దుఃఖము" అను అధ్యాయముల యందు వీటిని గుఱించి విపులముగ వ్రాసితిని

## (౧౧) శ్రీమాత - శ్రీఅరవిందులు

శ్రీమాత ఫ్రెంచిదేశమున *'21-8-1878* లో జన్మించి, మనదేశమున *17-11-1973* లో విదేహముక్తి నొందిరి. శ్రీఅరవిందులు *'15-8-1872* న జన్మించి *5-12-1950* లో విదేహముక్తి నొందిరి.

వంగదేశవిభజన సందర్భమున అప్పటి బ్రిటీషు ప్రభుత్వము శ్రీఅరవిందులపై రాజద్రోహనేరమును మోపి అలీపూర్ జైలునందు నిర్బంధించిరి. నిరపరాధులగు శ్రీఅరవిందులు తమస్థితినిగుఱించి ఒకనాడు భగవంతునకు నివేదించుకొనిరి ఆ ప్రార్థన వ్యర్థము కాలేదు. వారిపై పెట్టిన కేసును న్యాయాధిపతి త్రోసివేసిరి. కారాగారమునందే శ్రీఅరవిందులకు భగవద్వాణి మూడు, లేక, నాలుగుమారులు వినిపించెను. "భారతీయ సనాతన ధర్మమును లోకమునకు వినిపింపు" మనియే భగవద్వాణియొక్క ఆదేశము, దానిని శ్రీఅరవిందులు నమ్మి, తాము నమ్మిన దానినే లోకమునకు బోధించిరి. ఈ మహాకార్యమునకు శ్రీఅరవిందులకు శ్రీమాత తోడ్పడిరి. శ్రీఅరవిందులు తమ్ము గుఱించి తామే యిట్లు చెప్పుకొనిరి :-

"భారతీయులకుగాని, యూరోపియనులకు గాని అవగతంగాని ఉపనిషద్రహస్యాలు నా కవగతం చేశాడు కృష్ణభగవానుడు. కాబట్టి వేదాన్ని వేదాంతాన్ని పునర్వికాసితం చేయవలసిన బాధ్యత నాపైన వుంది."

(భారతీయత - దాని నిజతత్త్వము 1 సం|| పుట 14)

శ్రీఅరవిందులు పరతత్త్వమును ద్వివిధముగ పేర్కొని సృష్టికి పూర్వమునందున్న వస్తువును 'అతీతసత్యము' అనిరి. తాంత్రికులు ఆ అతీతసత్యమునే 'పరస్మవిత్' అనిరి. ఈ అతీతసత్యమునుండి అభివ్యక్తమైన సత్యమునే ఈశ్వరుడు, జీవుడు, మాయ, జగము మొదలగు ఈ సమస్తమును, కాలాతీతమైన అతీతసత్యముయొక్క అంశములై కాలములో వ్యవహరించుచున్నవి.

శివుడాది క్షితి పర్యంతము శైవదర్శనము 36 తత్త్వములుగా చెప్పినది. వాటినే శాక్తతంత్రములు (ఆగమములు) అంగీకరించినవి. ఒక భూరేణువుగాని, భూమిపైనుండు చిన్న గడ్డిపోచగాని, పరమశివు డెంత సత్యమో అంత

సత్యమే. లక్ష్యము కాని దేదియు సృష్టియందు లేదు. శైవమతమును చెప్పిన సందర్భమున 36 తత్త్వములను వివరించియుంటిని. శ్రీఅరవిందులు ఈ తత్త్వములను ఆమోదించిరి

శ్రీఅరవిందులు తమ దర్శనమును శాక్తతంత్రముల నుండి గ్రహించి దానిని తమ అనుభవమునకు అనుగుణముగా ఆధునికులకు తృప్తికరమగు భాషలో (విధానములో) రూపొందించిరి. శ్రీఅరవిందులు తాము 'తాంత్రికయోగి' నని చెప్పుకొనిరి.

శ్రీశంకరులును, శ్రీఅరవిందులును పరమసత్యము మనోవాక్కుల కందనిదని అంగీకరించిరి. శ్రీశంకరుల నిర్గుణ బ్రహ్మము స్థితిస్వరూపము. స్థితి-అనగా సత్తు, లేక, పరమసత్యము. సత్యమే చిత్తు. (జ్ఞానము.) చిత్తే ఆనందము. సచ్చిదానందములు మూడును ఒక వస్తువే, భిన్నములు కావు. ***శ్రీఅరవిందుల పరమసత్యము స్థితి - గతి (Motion) లేక చలనము కలది.*** అనగా: పరమసత్యము స్థితి - గతి స్వరూపముగా గలదని అర్థము. ఇచట స్థితి, అచలము -గతి చలము అని తాత్పర్యము. శ్రీశంకర, శ్రీఅరవిందుల ధ్గర్శనముల యందు గల ముఖ్యభేద మిది. ఇందుండి అనేకభేదములు కలుగును. సృష్టికి పూర్వమందున్న స్థితిని (పరమసత్యమును) శాక్తేయులు (తాంత్రికులు) సెనగగింజతోగాని, పెసర గింజతోగాని పోల్తురు. అరవిందులు ఆవిధానమునే గైకొనిరి. సెనగగింజ ఒకటిగా నున్నను దానియందు రెండుభాగములు (రెండు బేడలు)న్నవి. ఆలాగే పరమతత్త్వమున సహితము స్థితిని - గతిని, ఆ గింజయందలి రెండు భాగములతో పోల్తురు. పై పొట్టు రెండు బేడలను ఒక గింజగా చేసి, లేక ఒక గింజగా ఉన్నట్లు మనకు చూపుచున్నది. పరమసత్యము నందు స్థితి-గతి, కలిసి యేకముగా ఉన్నవి. అవియే శివుడు-శక్తి. సెనగగింజకు పై పొట్టువలె మాయాశక్తి శివశక్తులను కప్పియున్నది.

శివుడు తన పరబ్రహ్మస్వరూపమున (పరమసత్యమున) శివ - శక్తి సామరస్య స్వరూపమున నున్నాడు. అందు శక్తి - (1) చిత్ శక్తి యనియు (2) మాయాశక్తియనియు రెండువిధముల కనబడుచున్నను, సృష్ట్యాత్మకమును,

మార్పులు లేనిదిగను ఉన్న ఆ చిత్ శక్తియే మార్పులు చెందు మాయాశక్తిగ అగుచున్న దనిరి. అనగా : పరాశక్తి ఒకేశక్తి యయ్యును, రెండుశక్తులుగ గోచర మగుచున్నది. కనుక మాయాశక్తిని చిత్ - శక్తిని రెండుగా (భిన్నమైనవిగా) తలపరాదు.

శ్రీఅరవిందులు చెప్పిన మాయాశక్తి, శ్రీశంకరులు చెప్పిన మాయవలె అనిర్వచనీయ మైనది కాదు. శ్రీఅరవిందులు చెప్పిన మాయాశక్తినే వారు (శ్రీఅరవిందులు) బ్రహ్మమనియు, నిత్యవస్తువైన శివస్వరూపమనియు, చైతన్య స్వరూపమనియు చెప్పుదురు. అది ప్రకృతి కాదు. జడము కాదు. జడజగత్తుగా కనబడుచున్నదే యనిన, జడమనునది యెచ్చటను లేదు. ఉన్నదంతయు చైతన్యమే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ'-'సర్వము చైతన్యస్వరూపమే' అను శ్రుతి ప్రమాణమును చూపుదురు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుతివాక్యమునందలి అర్థము శ్రీఅరవిందులు చెప్పిన సందర్భమునకు సరిపడదు. భ్రాంతి జ్ఞాన ముదయించి, త్రాటిని చూచి పాము అనుకొన్న సమయమునందును - వెలుతురు వచ్చిన పిమ్మట ప్రమాజ్ఞాన ముదయించి అచట ఉన్నది పాముకాదు, త్రాడే అని తెలిసికొన్న సమయమునందును, ఈ సమయద్వయమునందును ఉన్నది రజ్జువే అన్నట్లు 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ' అని శ్రుతి చెప్పినదని నా తాత్పర్యము. మఱియు శ్రీఅరవిందు లిట్లు చెప్పిరి :-

మాయ తన స్వరూపమును మరుగుసరచుట ద్వారా అందు కొంతభాగమును జడమని మన మనుకొనినది మాయాశక్తియొక్క ఒక యంశము. మాయాశక్తి తన స్వరూపమును మరుగుపరచుట ద్వారా దాని శక్తు లుద్భవించునందురు. మఱియు శ్రీఅరవిందుల మతమున మాయాశక్తి సచ్చిదానందస్వరూపిణి, మాయాశక్తి ప్రభావ మేమన :- పూర్ణమును అపూర్ణముగను, నిరాకారమును సాకారముగను కల్పించి శుద్ధచైతన్యమును తగ్గించిగాని, దానిని కప్పిగాని లేదనిపించును. జీవాత్మ చేతనను కప్పి భేదభావమును కలిగించును. ఈ వాక్యములు శ్రీజ్ఞానేశ్వరుల మాయాఖండవాదమును ఖండించుచున్నవి.

అరవిందుల తత్త్వ మిట్లుండును:- దైవము తన్ను తాను వ్యక్తీకరింపవలెనని తలచినది. అది కోరిక కాదు. అదిఒక ఆనందము, లేక, లీల,* అగ్నిదాహకములవలె శక్తి, శక్తిమంతునకంటె వేఱుకాదు. పరబ్రహ్మము (పరమశివుని) నందున్న చిత్ - శక్తి ఆయనయందుండి వేఱైనపుడు, పరబ్రహ్మము క్రియారహితమగు అచలస్థితి యందుండును. అట్టి సమయమున శక్తి పరమశివునియందున్న సమస్తమును జగద్రూపమున వ్యక్తీకరించి* *వ్యక్తమైన విశ్వమును పాలించి తిరుగ వ్యక్తమునంతయు బ్రహ్మసత్తయం దుపసంహరించి, తానుకూడ ఆసత్తయందే లయమై, అచలస్థితి నొందును. వీటినే సర్గ, ప్రళయము లందురు. ఇట్టివి యెన్ని పర్యాయములు జరిగెనో యెవ్వరును చెప్పజాలరు. ప్రథమసర్గమును గుఱించి యెవ్వరికిని తెలియదు. ఏస్థితియందున్నను ఉన్న దంతయు శివశక్తుల స్వరూపమే.

శైవమునందు చెప్పిన 36 తత్త్వములనే శాక్తతంత్రములు గైకొన్నవి. ఆ తత్త్వములయందు సృష్టిక్రమమును తెలియజేయును. 36 తత్త్వములయందు శివతత్త్వము మొదటిది. మాయాతత్త్వము ఆఱవది. ఆ వరుసక్రమ మిట్లున్నది:-

(1) శివము, (2) శక్తి, (3) సదాశివము, (4) ఈశ్వరుడు, (5) శుద్ధవిద్య, (6) మాయ, శివునియందు అభేదరూపముతో నున్న శివుని విమర్శరూపశక్తియొక్క భిన్నరూపములతో (భిన్న శక్తులతో) శివునకు సంయోగము కలిగినపుడు శివుని యందు పరిణమించు శివస్వరూపములే పై ఆఱుతత్త్వములు. ప్రథమతత్త్వమగు శివుడు సృష్టికి నిమిత్తకారణమును, ఆఱవ తత్త్వమగు మాయ సృష్టికి ఉపాదానకారణము అయియున్నవి. తరువాత యీ క్రింది తత్త్వములు చెప్పబడినవి : (7) కల, (8) విద్య, (9) రాగము, (10) కాలము, (11) నియతి, (12) ప్రకృతి, (13) మహత్తు, (14) బుద్ధి. పైన చెప్పిన కలా, విద్యా, రాగ, కాల, నియతి తత్త్వము లైదుసు కంచుకముల వంటివి.

---

* శ్రీజ్ఞానేశ్వరాదులు కొందఱు 'లీల' అని చెప్పియున్నారనునది విదితమే.

** ఈ యంశమును శ్రీజ్ఞానేశ్వరులవా రిట్లు వ్రాసిరి :- "రూపాభావంబున భాసమానుండై యొప్పంగు పతిని స్వీయంబగు మనోహరాకృతిని గూడ నొక్కటం బరిశీలించు నద్దేవి లజ్జాశీలయై విశ్వాధిక నామరూపంబులనియెడు భూషావిశేషంబులచేత బ్రభు నలంకృతుం గావించె."

(అను. 1-30)

వీటిలో ప్రవేశించి శివుడు తన సర్వజ్ఞత్వాది శక్తులను సంకుచితము చేసికొని జీవసంజ్ఞ నొందుచున్నాడు.

జిజ్ఞాసువు :- అయ్యా! ఈ పదునాలుగు తత్త్వములలో శివ - శక్తు లెవ్వరు?

వేదాంతి :- నీ వడిగిన ప్రశ్న చాల చిక్కైనది. శ్రీఅరవిందులు వారి అనుచరులు శివ - శక్తులను గుఱించి యిట్లు చెప్పిరి -

(1) "మానవుని ఆత్మ శివుడు, మానవుని మనఃప్రాణ శరీరములు శక్తి. శివ శక్తు లొక్కటియేకాని వేఱు కాదు."

(జగన్మిథ్యా తత్త్వపరిశీలనము. పుట 54)

(2) "జీవాత్మకూడా శివశక్తి స్వరూపమే" (జ. త. ప. పుట 57)*

జ త ప. అనగా : జగన్మిథ్యా తత్త్వ పరిశీలనము. ఇందులో 41 వపుట వఱకు శ్రీ అరవిందుల రచనకు ఆంధ్రానువాదము. తక్కిన గ్రంథము అనువాదకుల సొంత రచన.

(3) "శుద్ధచైతన్యమే శివుడు." (జ. త. ప. పుట 57)

(4) "శివుడు చిత్తుగను, శక్తి చిద్రూపిణిగను నున్నవి."

(జ. త. ప. పుట 51)

(5) "అతడు - ఆమె యను పదములు సర్వోత్కృష్టమైన ఒకనొక చేతనాశక్తి. అనగా : పురుషుడు - ప్రకృతి, ఈశ్వరుడు - ఈశ్వరి, శివుడు - పార్వతి, నారాయణుడు - లక్ష్మి ; వీరు ద్వైతభావము గల ఒకేఒక విభూతి. ఒకటి స్థిరశక్తి, మరొకటి సామర్థ్యయుక్తమైన శక్తి ; *ఒకటి జడము - మరొకటి చేతనము భగవంతుడు - శక్తి.*"

(ఎవరీమాత, పుట 18)

(6) "ప్రపంచసృష్టికి పూనుకొన్నప్పుడు శివశక్తిలోని శక్తి, నిషేధవ్యాపార రూపమును దాల్చి (Negates Her-Self) తాను 'ఇది' (This) అయి, శివచైతన్యము

---

* జ. త. ప. అనగా : జగన్మిథ్యా తత్త్వ పరిశీలనము. ఇందులో 41 వపుట వఱకు శ్రీ అరవిందుల రచనకు ఆంధ్రానువాదము తక్కిన గ్రంథము అనువాదకుల సొంత రచన.

'నేను' (1) గానగును. పరమశివునియొక్క ప్రకాశనము వలన అతని శక్తి విమర్శశక్తియై విశ్వమంతటిని సృజించును." (జ. త. ప. పుట 60)

(7) "వ్యక్తి రూపమును నొందిన చైతన్యమే జీవుడు. ప్రకృతి శక్తినుండి మూడు శరీరములను పొందినవాడగును. జీవుడు మొదట కారణ శరీరముతో నుండును." (జ. త. ప. పుటలు 62, 63)

(8) "పరాప్రకృతి జీవభూత మగును." (యోగదీపికలు. పుట 27)

(9) "అపరాప్రకృతి దైవమునుంచి విడదీయబడిన మనఃప్రాణ శరీర అవిద్యాప్రకృతి. పరాప్రకృతి సచ్చిదానందముయొక్క దివ్యప్రకృతి."

(యోగదీపికలు. పుట 34)*

(10) *"శివుడు శక్తి రెండును చేతన యైనను శివుడు ఆ చేతనయొక్క మార్పులేని అచలస్థితిగను, శక్తి ఆచేతనయొక్క మార్పునొందు ఉద్వృతస్థితిగ నున్నది."* (జ. త. ప. పుట. 59)

(11) "పరాత్పరుడు శాశ్వత సచ్చిదానంద రూపుడుగా ఆమెయందు మూర్తీభవించి నిరతముగా నుండును. పరాత్పరుడు ఆమె ద్వారా ఏకము, ద్వంద్వమును అయిన ఈశ్వరశక్తి చైతన్యముగను, పురుషప్రకృతి అను ద్వంద్వతత్త్వముగను, లోకమునందు వ్యక్తమగుచున్నాడు."

(మాతృశ్రీ. పుట. 45)

"స్వభావము, ప్రకృతి, యని మనచే తెల్పబడునవి ఆమెయొక్క కార్యనిర్వాహక బాహ్యరూపమే" (మాతృశ్రీ. 47)

(12) "ప్రకృతి వున్నంతవరకు అతడు (పురుషుడు) కూడ అచ్చటనే యుండును. ఏలయన, అతడు-ఆమె ఒక్కటే యనుసత్యము నిశ్చయమైనది గనుక అతడు నిద్రించునపుడుకూడ ఆమెను తన వక్షఃస్థలముపై నుంచుకొనును.

---

* శ్రీఅరవిందులు, 8-9 సంఖ్యగల పరా, అపరా ప్రకృతులను గురించి భగవద్గీత ఏడవ అధ్యాయమునందు వ్రాసినరీతిగా గ్రహించిరి.

ఎవరు ఆమెను వదలిపెట్టినను ఆమెవినా ఆతడు అవేద్యుని యందు విశ్రాంతి కైనను పోజాలడు. (ఎవరీమాత - సావిత్రి స్వరూపము. పుట. 153)

శ్రీ అరవిందు లిట్లు చెప్పిరి :- ఆమే లేనిది ఆయన వ్యక్తీకరింపబడడు, ఆయన లేక ఆమె యునికి లేదు *

జిజ్ఞాసువు :- అయ్యా! పరమసత్త అద్వితీయము, అఖండము, సర్వగతము, అచలము కదా? ఆవస్తువునందుండి ఆవిష్కరించుట, ఆవిర్భవించుట వ్యక్తీకరింపబడుట, పరిణమింపబడుట - ఇత్యాదులు కలిగినవని చెప్పనగునా? విత్తనము నుండి చెట్టు (మొక్క) ఆవిర్భవించిన దనగా - ఆవిర్భవించుటకు పూర్వము అదిలేని చోటున వ్యక్తమైనదనికదా అర్థము. పరమసత్తనుండి శక్తి వ్యక్తమైన దనగా? -ఎందుకు వ్యక్తమైనది? ఎచట వ్యక్తమైనది? దానికి సాక్షి యెవరు? ఉన్నదంతయు పరమసత్తయేకదా? ఇట్టి సంశయములు తొలగుటెట్లు? అదియునుగాక, ఒకేచైతన్యము శివశక్తు లిరువురైరని చెప్పిరి. శ్రీజ్ఞానేశ్వరులు చెప్పినది చాలవఱకు ఇదియే కదా? శ్రీజ్ఞానేశ్వరులు:- కస్తూరి దాని పరిమళముతోను, శర్కరా మాధుర్యములతోను శివ - శక్తులను పోల్చి చెప్పిరి. శ్రీఅరవిందులు ఒక సెనగగింజలోని రెండు బేడలతో శివ - శక్తులను పోల్చి చెప్పిరి.

శివశక్తుల స్వరూపమును నిరూపించుటకు శ్రీజ్ఞానేశ్వర దర్శనమునందు చెప్పబడిన ఉపమానము లెట్లు సరిపడవో, శ్రీఅరవిందుల దర్శనమునందు చెప్పిన సెనగగింజ, అగ్ని దాహకశక్తుల యుపమానములు సహితము వీరి తత్త్వమును అవగతము చేసికొనుటకు సరిపడవు. సెనగగింజయందున్న రెండు భాగములయందు ఒకభాగమును నశింపజేసితిమేని రెండవ భాగము దానితోపాటు నశింపదు. కనుక, సెనగగింజలోని రెండు భాగములు ఒకటేననికాని, రెండనికాని చెప్పలేము. అట్లే అగ్ని - దాని దాహకశక్తియు ఒకటేనని చెప్పలేము. ఏలయన? మణి మంత్రౌషధముల ప్రభావమువలనగాని,

---

*" అత శ్లేష శ్లేషిత్యయ ముభయ సాధారణతయా "

శివ శక్తులకు అన్యోన్య శేష శేషిభావము సమానమగునని (సౌందర్యలహరి యందు) చెప్పినదే శ్రీ జ్ఞానదేవులును చెప్పిరి (అను. 1-10).

శీలప్రభావము లేక తపఃప్రభావము వలనగాని ఒకసమయమున దాహకశక్తి పనిచేయదు. అనగా అగ్నికి కాల్చునట్టిశక్తి యుండదు. సీతాదేవి అగ్నియందు ప్రవేశించినను అగ్ని ఆమెను దహింపలేదు. ఆసమయమున అగ్నికి దాహకశక్తి లేదు. కనుక, అగ్నియే దహనశక్తియని చెప్పలేము. కాని, అగ్నియు, దానియందలి దహనశక్తియు భిన్నములనికూడా చెప్పలేము. ఇందువలన శ్రీశంకరులు చెప్పిన అనిర్వచనీయమును శ్రీ అరవిందులు పరోక్షమున అంగీకరించినట్లు అయినదికదా?

వేదాంతి:- నీ ప్రశ్న సరియైనదే. నీకు గల సంశయములు జగత్సత్యవాదులు తీర్ప లేరని నా యభిప్రాయము. అదిగాక, శ్రీ అరవిందుల తత్త్వమున పరతత్త్వము స్థితి - గతి కలది అని చెప్పితిని గదా? శివుడు అచలుడు, శక్తి చలనము గలది. వెనుక నేను నీకు వినిపించిన 12 అంశములలో పదియవ యంశమును స్మృతికి తెచ్చుకొనుము. . . . శక్తి ఆచేతన యొక్క క్రియారూప మగును" అనిరి. 'చేతన' అనగా - వీరి భావమేమి? అద్వైతము ననుసరించి చేతన అనగా ప్రాణాదుల స్పందనము "**చేతనాధృతిః**" అని గీతలో 13 అధ్యాయమునందు రూఢిపఱుపబడినది. చేతన జడము - "చైతన్యము", శుద్ధ జ్ఞానము. ఇది అనంతాఖండ శుద్ధవస్తువు. శ్రీ అరవిందులు 'చేతన' అను శబ్దమును చైతన్యశబ్దమునకు పర్యాయముగా వాడియుండిన, చేతనము అచలము గదా, అచలమునందు క్రియ యెట్లు కలుగును? 12వ అంశమున "ప్రకృతి ఉన్నంతవఱకు పురుషు డుండును" అన్నారు. 1వ అంశమున మానవుని ఆత్మ శివుడు, మానవుని మనఃప్రాణ శరీరములు శక్తి అని చెప్పిరి. ఇవి ఒక దానిని విడిచి వేఱొకటి యుండ వనిరి కదా? ఇందుకు విరుద్ధముగ శ్రీమాతను గుఱించి చెప్పిన ఒక సంఘటనను నిచట తెలిపెదను:-

ఒక సమయమున శ్రీమాత మధ్యధరాసముద్రమున ఒక యోడలో పయనించుచుండిరి. పెద్దతుపాను చెలరేగెను. దాని నాపుటకై శ్రీమాత వెంటనే తామున్న గదికి (Cabin) వెళ్ళి తాము తమ శరీరమును అచట వదలి సూక్ష్మ శరీరముతో స్వేచ్ఛగా సముద్ర మధ్యమునకు వెళ్ళి అచట రూపములు లేని జీవులు సముద్రమును అల్లకల్లోలమును చేయుచుండుటను చూచి, వారితో మృదువుగా సంభాషించి వారి చర్యల నాపి తుపాను రాకుండ చేసి,

తిరిగి తమగదికి వెళ్లి తమ శరీరములో ప్రవేశించిరట. (ఎవరీమాత. పుట. 30) ఇందు వలన దేహి దేహములు రెండును భిన్నములని తెలిపినట్లే కదా?

దురదృష్టవశమున శ్రీ శంకరులవారి అనంతరము జన్మించిన మతాచార్యులు, దార్శనికులు శ్రీ శంకరుల జగన్మిథ్యావాదమును ఉన్నదున్నట్లు చక్కగా అనువదింపక, వారు విమర్శించుటకు వారివారికి అనుకూలమగు పదజాలము నుపయోగించి, అనువదించి, వారివారికి తోచిన తార్కిక బుద్ధిచే విమర్శించిరి. కాని, జగత్సత్యావాదము తర్కము నెదుట నిలుచునట్లు శ్రీ అరవిందులుగాని మఱెవ్వరైనను గాని ఒక నిర్దిష్టమగు సిద్ధాంతమును చేసియుండలేదు. జగన్మిథ్యావాదము కొందఱకు కొంతవఱకు అసంతృప్తికరముగా ఉండినను, జగన్మిథ్యావాదము నందున్న విడదీయుటకు వీలు గానట్టి చిక్కు జగన్మిథ్యావాదమున లేదు. కొందఱు శ్రీ శంకరులను తూలనాడినను అట్టివారి ఘనత యెక్కువ కాలేదు. శ్రీజ్ఞానేశ్వరులు, శ్రీ అరవిందులు, శ్రీ శంకరుల యోగ్యతను గుర్తించి మృదువైన పదజాలముతో విమర్శించి, వారి ఘనతను వెల్లడించుకొనిరి. గతకాలమునందేగాక యీ కాలమునందుకూడా ప్రపంచమున గల మహామేధావులగు తత్త్వవేత్తలలో అధికసంఖ్యాకులు శ్రీ శంకరుల పక్షముననే గలరు.

బుద్ధభగవానులును, శ్రీ శంకరులును సాధించినదాని కంటె తాము (శ్రీ అరవిందులు) సాధించినది ఎక్కువని శ్రీ అరవిందులు చెప్పుకొనిరి, వారి వాక్యములు ఈ క్రింద నుదాహరింతును :-

"శంకరుల తత్త్వము ఈ విచారమున, విశిష్ట మాయా తత్త్వమని (Qualified Illusionism) చెప్పవచ్చును. మాయకు పరిమిత సత్యము ఈ తత్త్వములో చూపబడినది. దీనిని (మాయను) వాచామగోచర మైనట్టిదియు, అగణనీయ మైనట్టిదియు, అద్భుత రహస్యమునుగా వర్ణించి, మనస్సునకు సంతృప్తి నొసంగు విధమున జగదనిత్యతను, మానవ మూఢత్వమును, అశాశ్వత జీవిత పరిధులను నిరూపించి శంకరు డీతత్త్వమును మహోన్నత విస్తారతతోను, శక్తివంతముగను లోకమునకు సమర్పించినాడు. శంకరులు

స్వతఃస్ఫురణ విజ్ఞానములచే కేవలము **అతీతమైన అంతఃకరణ** సత్త యొక్క సత్యమును చక్కగా నిర్ణయించి, తన **అఖండమేధాశక్తి**చే ప్రపంచ విధమును, దాని అనిత్యతను నిరూపించెను. బుద్ధియొక్క వివేచనాశక్తిచే వాస్తవ జగమును, ఆంతరిక విజ్ఞానముచే అతీతమును నిర్ణయించియు శంకరు డీ రెండింటియొక్క సమన్వయమును సమగ్రముగా ననుసరింపకుండుట దురదృష్టకరము"

(జ. త. ప. పుట. 27)

"బుద్ధుడు తన నిశిత సూక్ష్మబుద్ధిద్వారా ప్రపంచము యొక్క నిర్మాణమును, ఈ నిర్మాణమునుండి ఉపశమించు మార్గమును మాత్రము కనుగొని తరువాత ముందుకుబోను తిరస్కరించెను. శంకరుడు బుద్ధునికంటెను ముందంజవేసి బుద్ధుని సంస్కార శూన్యానుభవమున కతీతుడై, పరమసత్యమునకు, ప్రపంచమునకు మధ్య నిలబడి జగత్తుయొక్క రహస్యము భేదింపరానిదనియు, బుద్ధిచే అగ్రాహ్యమనియు చెప్పెను. కాని బుద్ధితో చూచినపుడు ప్రపంచము నిజముగా కనబడుచున్నందున దీనిని అనిత్య సత్యమనియు, కేవల సత్తయే యథార్థమనియు ప్రవచించెను. కాని శంకరులు ఇంకను బుద్ధి కూర్ధ్వమున నున్న విజ్ఞానములోనికి బోయి, అచట స్థావర మేర్పరచుకొని సర్వమును పరిశీలించియుండినచో బ్రహ్మముయొక్క ముఖము లన్నియు, స్థితిగతు లన్నియు సమగ్రముగ గోచరమయి వేదవాక్కుల ప్రకారము 'సర్వము బ్రహ్మ' మని **తన యఖండ మేధాశక్తితో** నిర్ణయించెడివారు."

(జ. త. ప. పుటలు 32, 33)

శ్రీ అరవిందులు తమ దర్శనమునందు దివ్యసత్త యనుదానిని పేర్కొనిరి. దివ్యసత్త యనగా నేమి? దానిని గురించి శ్రీ అరవిందులే యిట్లు చెప్పిరి :-

"స్థితి రూపకముగను, వేరుగను నిరాకారముగ నుండు **ఆత్మ**కు అవల మహోన్నత చేతన యున్నది. ఈ **బృహత్** చైతన్యములో నిశ్చలతయు, విశ్వకార్యకలాపము- ఈ రెండును కలిసికొని ఏకముగ నున్నవి. ***స్థితిరూపమైన పరమసత్త (Static Self)- దివ్యసత్త (Divine Reality) యొక్క ఒక పార్శ్వము మాత్రమే యగును.*** ఈ స్థితిరూపమైన సత్త ఒక అంతస్తు మాత్రమే యగును. దీనిలో నున్నప్పుడు, దీని కావల బోనపుడు దీనినే తుదిమెట్టుగా నెంచి

మాయావాదులు జగమును మిథ్యగా భావించిరి. కాని మానవుడు ఆ బృహచ్చైతన్యమును చేరినపుడు విశ్వస్థితి, రూపము, జీవితము, మనస్సు-ఇవన్నియు అకస్మికముగ కనబడక అర్థవంతమగును. ఊర్ధ్వగతిలో సహితము రెండంతస్తులు అధిమానసము, అతీతమానస మనునవి యున్నవి. కాని అతీతమానస స్థితిని చేరినపుడే మానవునికి విశ్వస్థితిగతులయొక్క నిజ స్వభావ సత్యములు సమగ్రముగ గోచరించును." (జ. త. ప. పుట 41)

శ్రీ అరవిందుల పై రచనలవలన బోధపడిన దేమన - శ్రీ శంకరులు పైన చెప్పిన బృహత్ చైతన్యమును, లేక దివ్యసత్తను గుఱించి యెఱుగరని, దివ్యసత్తయందు ఒక పార్శ్వమే యగు స్థితిరూపమైన పరమసత్తవఱకే వారి అనుభవ మగుటచే అదియే తుదిమెట్టుగా భావించిరని, అట్లు భావించుటకు కారణము శ్రీ శంకరులు అధిమానసము వఱకు పోగలిగిరి కాని, అతీతమానసమువఱకు పోజాలకపోయిరని, శ్రీ అరవిందులు భావించినట్లు స్పష్టమగుచున్నది. ఇది మిక్కిలి సాహసోపేతమగు వారి యూహమాత్రమే కాదా?

శ్రీ అరవిందులు చెప్పిన పరమసత్త స్థితి - గతి కలది. అనగా - అచలము - చలముల రెండింటి సమ్మేళనము. ఈ రెండును పరస్పర విరుద్ధములు, ఒకటి ఉన్నచో ఆస్థానమున మఱియొకటి యుండజాలదు. రెండింటి కలయికయే దివ్యసత్త యొక్క స్వరూప మనిన - "మాయ కలిమిలేముల కలియక యని చెప్పిన అద్వైతుల నెదిరించువారు, ఎట్టి ఆక్షేపణలు చేసియున్నారో అవన్నియు దివ్యసత్తకు అన్వయించును. అదిగాక స్థితి - గతి అని రెంటిని కలిపి చెప్పినపుడు "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతికి విరోధము సంభవించును. ఏమైనను ఈ విషయమును ఇచట పూర్ణముగ చర్చించుటకు చోటులేదు. కేవల శివ - శక్తులను గుఱించిన చర్చలో నీ యంశము ఆనుషంగికముగా వచ్చినది.

## (౧౨) దాసబోధ : శివ - శక్తులు

జిజ్ఞాసువు :- శ్రీ జ్ఞానేశ్వరులవారి అనంతరము క్రీ. శ. 1608-1682 మధ్య శ్రీ సమర్థ రామదాసస్వామి వారనునొక మహనీయులు జన్మించిరని,

వీరు "రామదాసీయ పంథ" అను నొక సంఘము నేర్పరచిరని, వీరును శివ - శక్తుల గుఱించి చెప్పిరని వింటిని. వారి తత్త్వమెట్టిదో దయయుంచి తెలుపుడు.

వేదాంతి:- వీరు ఛత్రపతి శ్రీ శివాజీ మహారాజుగారికి గురువులు. 'దాసబోధ' యను వేదాంత గ్రంథమును రచియించిరి. ఆ గ్రంథము నుండి కొన్ని భాగముల నిట నుదాహరింతును:-

(1) "ఆదియందు నిత్యము, ముక్తము, పరమార్థ క్రియము నగు *పరబ్రహ్మ యొక్కటియే గలదు. దానియందు* అస్పష్టముగను, సూక్ష్మముగను *మూలమాయ కలిగెను.*" (దా. బో. 8-2-3)*

"నిశ్చలమగు ఆకాశమునందు జంచలమగు వాయువు ఎట్లు కలుగుచున్నదో యటులే అచలమును, నిరాకారమునగు స్వరూపమునందు మూలమాయ కలుగుచున్నది." (దా. బో. 8-3-27)

"కాని వాయు వుండుటవలన నాకాశముయొక్క నిశ్చలత్వమునకు వేఱొకవిధమగు బాధ కలుగుట సంభవింపదు." (దా. బో. 8-3-28)

"ఇటులే మూలమాయ యుండుటవలన బరమాత్ముని నిర్గుణత్వము నందు గూడ నేవిధమగు బాధయు గలుగదు" (29)" వాయువు మొదట నుండియే యుండవలయు నను నియమము లేదు. ఇటులే మూలమాయయు బురాతనము గాదు. దానిని సత్యమని యంగికరించుచో అది మఱల లీనము గూడ గావలసియున్నది." (30)" వాయువునకు వలె మూలమాయకు గూడ స్వరూప మెఱుంగవలయును. వాయువు భాసమాన మగు చున్నదిగాని దృష్టిలోనికి రాదు." (31) "... అవిద్య మాయయొక్క విస్తరము సుమా. "(33).

(2) "బ్రహ్మమునందున్న మూలమాయయే ముందున కరిగి అష్టవిధ ప్రకృతి యనబడుచున్నది. పంచభూతములు త్రిగుణములయందును మూలమాయ కలసియే యుండును" (దా. బో. 10-4-9). బ్రహ్మమునందు సమీరరూపమున నున్న మూ*లమాయయందు గల చైతన్యమే* యీశ్వరుడు.

---

* దాసబోధయందలి వాక్యములను కుండలియందు వేసిన అంకెలు దా. బో. అని గుర్తుపెట్టినాడు

ఆ చైతన్యమును ఈశ్వరుడనియు సర్వేశ్వరుడనియుగూడ జెప్పుదురు." (దా. బో. 10-4-16). "ఆ ఈశ్వరుడే గుణముక్తు డైనపు డాతని గుణముల ననుసరించి మూడు భేదములు కలుగుచున్నవి. ఆ భేదములను బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అని అందురు". (దా. బో. 10-4-17). "మొదట బ్రహ్మమునందు మూలమాయ కలిగెను. తరువాత *దానినుండి గుణమాయ జనించెను.* ఇందువలననే మాయను గుణక్షోభిని అని చెప్పుచున్నారు. (దా. తో. 8-4-2). ***మాయవలన సత్వ రజస్తమోగుణములు మూడు గలిగెను.*** ఆ పిమ్మట తమోగుణమునుండి పంచమహాభూతము లేర్పడెను", (3) "మూలమాయయందుగల యెఱుకయే సత్త్వగుణము. ఎఱుకలేమియే (మఱుపే) తమోగుణము. రెండింటి మధ్యదశ (కొంతయెఱుక-కొంతయెఱుక లేమి). రజోగుణము" (దా. బో. 9-6-3) "ఏమియు నెఱుగకుండుట యజ్ఞానము. అన్నిటిని నెఱుగుట జ్ఞానము. ఇట్లే అన్నింటి నెఱిగిన భావనగూడ లయమైపోవుట విజ్ఞానము. ఈ దశ కలిగిన పిమ్మట ప్రాణి స్వయముగా ***ఆత్మయై పోవును***" (దా.బో. 9-7-51)

(3) "వాసనావృత్తి ప్రాణులను వెంట నంటియుండును. కావున బంచప్రాణములు తమతమ స్థానములను విడిచి పోవుచున్నప్పుడు వాసనకూడ దేహమును విడిచి వాని వెంట వెడలిపోవును" (దా. బో. 9-8-4) ఈవిధముగా ప్రాణవాయువుల వెంటనంటి తొలుదొలుత వెడలిపోవునది వాసనయే. మఱల హేతువు ననుసరించి యదియే జన్మము గైకొని ప్రపంచములోనికి వచ్చును(9-8-5). "...ఊది నంతనే అగ్ని ప్రకటన మగునట్లు వాసనారూపమగు వాయువు గూడ జన్మము నొందుచుండును" (దా. బో. 9-8-11). "మనస్సునకు నానావిధములగు వృత్తులు గలవు. వానియందే (ఆ వృత్తులయందే) వాసన యుత్పత్తి యగును. వాసన యనునది చూచుటకు గాన్పింపకున్నను అది యవశ్యముగా నున్నది సుమా" (12) "వాసనయందు నెఱుకయొక్క హేతువు ఉన్నది. *ఈ ఎఱుక మూలమాయ నుండి వెడలిన తంతువు.* ఇది కారణరూపముతో మూలమాయయందు మిశ్రితమై యుండును." (13)

(4) "*వాస్తవమునకు జలనశక్తి నెఱుక యందురు.* వాయువునందు సమస్త గుణములున్న సంగతి వెనుక జెప్పియున్నాము. ఈవిధముగా ఎఱుక మఱుపులతో మిశ్రమములై పంచభూతము లన్నియు వర్తించును కావున భూతములయందు ఎఱుక యవశ్యముగ నున్నది." (దా.బో. 9-6-19,20)

"ఈ ప్రకారముగా ఎఱుక యొకచోట గుప్తముగను, ఒకచోట ప్రకటముగను జగమునందు వర్తించుచుండును." (దా. బో. 9-8-26)

"అంతఃకరణమని సంజ్ఞకు చెప్పుదురు. సంజ్ఞయని యెఱింగెడి స్వభావమునకు జెప్పెదరు. ఇదియే దేహరక్షణ కుపాయము. (ఎఱుగునట్టి కళ)" (దా.బో. 10-1-11, 12). సర్పమెఱిగి కరవ వచ్చుచున్నది. ప్రాణి యెఱిగి పారిపోవు చున్నాడు. సంజ్ఞ (Consciousness) ఇరు పక్షముల నున్నది. (13) *సంజ్ఞ యనునది రెండుపక్షముల నొక్కటియే యున్నట్లుగా జూచెదమేని అంతఃకరణము గూడ నొక్కటియే యగును. ఏలయన అంతఃకరణ సంజ్ఞారూపమని యింతకు ముందే చెప్పితిని" (14).

(5) "మూలమాయ జడపదార్థమునకు చేతనము నొసంగుచున్నది. కాన దానిని చైతన్యమందురు." "వాయువు చేతనశక్తి (జగజ్జ్యోతి) కలసి మూలమాయ యనబడును." పురుషుడు ప్రకృతి యని సైతము దీని నందురు." (దా.బో. 10-9-7). "*వాయువును ప్రకృతియనియు జగజ్జ్యోతిని పురుషుడనియు యందురు. వీనికే 'పురుష ప్రకృతులు, శివశక్తులు అని పేరులు గలవు"* (8). "వాయువునందు గల చేతన విశేషమే ప్రకృతియందు పురుషుడు. ఈ విషయమునందు విశ్వాస ముంచవలయును" (9). "*వాయువు - శక్తి, చేతనము- శివుడు. వీనినే జనులు అర్ధనారీనటేశ్వరు డందురు.* (10). "వాయువులో చేతన గుణము కలదు. ఇదియే ఈశ్వర లక్షణము. దీనినుండియే మఱల త్రిగుణము లేర్పడును". (11). త్రిగుణములలో సత్త్వగుణము శుద్ధచైతన్య లక్షణము. దీని దేహధారి 'స్వరూపము శ్రీవిష్ణుమూర్తి.' (12)…. ఆత్మ, జగజ్జ్యోతి, సర్వజ్ఞత్వము అను నీ మూడింటిని నొక్కటి యనియే తెలిసికొనవలెను. దానినే అంతఃకరణము, లేక జ్ఞప్తియని నిశ్చయపూర్వకముగా నెఱుగవలయును. (దా.బో. 10-10-33)… అన్నింటిని నడుపునది అది యొక్కటియే. ఆ అంతరాత్మ అనంత బ్రహ్మాండముల వ్యాపారమును నడుపుచున్నది. . . . (35). అది క్షేత్రమును క్షేత్రవాసియునై యున్నది. మఱియు దానిని దేహి యనియు, గూటస్థమనియు గూడ నుడువుదురు" (44).

* ( ) కుండలిలో ఒక్కసంఖ్య వేసినవన్నియు అపైన వేసిన అధ్యాయమునందలి వాక్యములని గుర్తింపవలయును.

(6) "అవిద్య జడము. ఆత్మ చంచలము. జడము (అవిద్య) కర్పూరము. **ఆత్మ** అనలము. రెండును కాలిన వెంటనే చల్లారుచున్నవి. (దా బో 13-7-6). బ్రహ్మము ఆకాశము నిశ్చలజాతివి. ఆత్మయు, వాయువు చంచలజాతివి . . (7). జడ మనేకము గలది. ఆత్మ యేకము,ఇదియే ఆత్మానాత్మ వివేకము జగత్తుయొక్క వ్యవహారమును నడపువాడు జగన్నాయకుడు (8). జడము అనాత్మ, చేతనము ఆత్మ, అన్నింటియందును వర్తించునది సర్వాత్మ. అన్నియు గలసి చంచలాత్మ మయ్యెను. ఇది నిశ్చలమైనది కాదు (9). పరబ్రహ్మము నిశ్చలము, దానికి దృశ్యభ్రమ లేదు. విమలబ్రహ్మమునకు భ్రమలేదు. అది యచలము" (10). "*ఇట్లే దేహి (ఆత్మ) దేహములు (అనాత్మలు) రెండును భిన్నములుగా నున్నవి. మఱియు నీ రెంటికిని భిన్నముగా నున్నది నిరంజనమును, నిరుపమమును నగు పరమాత్మ.*" (దా.బో. 13-10-7)

సమర్థులవారి వాక్యములయందలి తాత్పర్యమును వారి వాక్యములకు ప్రారంభమున సూచించిన సంఖ్యా క్రమము ననుసరించి చెప్పెదను. సావధానముగా వినవలయును.* ఇందులో అచ్చటచ్చట నా యభిప్రాయమును గూడ తెలియజేయుదును.

(1) శ్రీజ్ఞానేశ్వరులవలెగాక, శ్రీసమర్థులు అద్వైతులవలె మాయ అవిద్యలయొక్క స్థితిని అంగీకరించిరి. కాని, వీరు చెప్పిన మూలమాయయొక్క స్వరూపమునకును, అద్వైతులు చెప్పిన మాయా స్వరూపమునకును భేదమున్నది. మూలమాయ సాంఖ్యుల ప్రకృతివంటిది కాదు.

(2) సమర్థులవారు మూలమాయయేగాక గుణమాయయను మఱియొకటి కలదనిరి. మూలమాయయే గుణమాయగా పరిణమించినట్లు చెప్పిరి. మూలమాయ బ్రహ్మము నందు పుట్టినది. అందే గిట్టుచున్నది. శుద్ధజ్ఞానము పరబ్రహ్మస్వరూపము. శ్రీసమర్థులు చైతన్యము, జడము అను రెండును మూలమాయయొక్క లక్షణము లనుటవలన పరబ్రహ్మము చైతన్యస్వరూపము

---

* ముందు చెప్పబోవు శివరామదీక్షితులవారి అచలవేదాంతమునకు సమర్థులవారి బోధకును నెట్టి సంబంధమైన కలదా యను నంశము ముందు చర్చింపబడును. కనుక, యీ విషయమును ఇచట చక్కగా అవగాహనము చేసికొనిన ముందు చెప్పబోవు అచలవేదాంతము సులభముగ బోధపడును.

కాదని పరోక్షముగ చెప్పినట్లైనది. కాని పరబ్రహ్మము శుద్ధజ్ఞాన స్వరూపమని చెప్పియున్నారు. పరబ్రహ్మము శుద్ధజ్ఞానమని చెప్పుటవలన ఆ శుద్ధజ్ఞానమున కంటె భిన్నమగు జ్ఞానము మఱియొకటి కలదని తాత్పర్యము. అది కేవల వృత్తిజ్ఞానమే. అనగా: అంతఃకరణ వృత్తియని అర్థము చేసికొనవలసియున్నది.

శ్రీసమర్థులు ఒక విధమగు అద్వైతము నంగీకరించియున్నను శ్రీశంకరుల చిదాభాసు నంగీకరింపలేదు. ఆ కారణమున శ్రీసమర్థులు చెప్పిన అంతః కరణమే జీవుడు. ఈశ్వరుడు, వారు చెప్పిన అంతఃకరణము విభువు. ఇందువలన శ్రీసమర్థుల అద్వైతము శ్రీశంకరుల అద్వైతముకంటెను భిన్నమైనది. సమర్థులవారి మతమున గల ముఖ్యమైన తప్పేమనగా:- పరమాత్మ, సర్వాత్మ, నిశ్చలమగు పరబ్రహ్మము, అచలము- అను నామములతో చెప్పబడిన శుద్ధబ్రహ్మము విభువే. అంతఃకరణము విభువే. విభువనగా సర్వవ్యాపి. రెండు విభువులుండుట అసంభవము. ఇది సవరింపరాని తప్పు.

మూలమాయ వాయురూపమున నున్నదని పలుమారు చెప్పిరి. వాయు వెచ్చటనుండి వచ్చినది? అప్పటికి పంచభూతములు పుట్టియుండలేదే. కనుక, శ్రీసమర్థులు చెప్పిన వాయువు ముండకశ్రుతియందు (ముం. 2-1-3) చెప్పిన ముఖ్య ప్రాణమే యనవచ్చునా?

మూలమాయ, గుణమాయ అని సమర్థులు చెప్పిన మాయాద్వయమును ఒకవిధముగా వీరశైవమత మంగీకరించినది.* అద్వైతులు చెప్పు మాయ జాడము, త్రిగుణాత్మకము. సమర్థుల వారు చెప్పు *మూలమాయ చైతన్యము, జడముల, రెండింటియొక్క మిశ్రమము*. చైతన్యము చేతన అను రెండు పదములు సర్వత్ర సమానార్థకములు కావు. చైతన్యము శుద్ధజ్ఞానము. ఉప్పుకల్లునందు లవణరసము తప్ప అన్యరసము లేనియట్లు, చైతన్యమునందు

---

* వీరశైవమతము ననుసరించి మాయోపాధి శుద్ధమని అశుద్ధమని, రెండు విధములు: (1) శుద్ధమాయయే ఊర్ధ్వమాయ యనియు, (2) అశుద్ధమాయ అధోమాయ యనియు, ప్రకృతి యనియు, అవిద్యాశక్తి యనియు పిలువబడును ఊర్ధ్వమాయ శివునాశ్రయించి యున్నను అతనికి మోహాదులను కలుగనీయదు. - అవిద్యాశక్తి భేదముచేతనే జీవు లనేకవిధము లగుచున్నారని, (సిద్ధాంత శిఖామణి 5-40, 41) శ్రీ జ్ఞానేశ్వరులు అజ్ఞానము బ్రహ్మమునందు వాసంబున్న బ్రహ్మమును (జ్ఞానమును) అజ్ఞానముగా నేల మార్చదు! (అను. 7-8) అని చెప్పిన వాక్యములు వీరశైవమతమునకు సమ్మతము కాదని విదితమైనది.

జ్ఞానము తప్ప జడపదార్థము లేదు. సమర్థులవారు 'చేతనము', 'చైతన్యము' అను శబ్దద్వయమును సర్వత్ర సమానార్థకములుగా వాడిరి. చైతన్య సాన్నిధ్యమున జడమునందు చైతన్యము కలుగును. ముఖ్యప్రాణమును చేతన యనవచ్చును, గాని చైతన్య మనరాదు. ముఖ్యప్రాణమే మూలమాయయను భావముతో అందులో చైతన్య మున్నదని సమర్థులు తలచిరి. అది పొరపాటు, చేతన (ప్రాణచలనము) మాత్రమే కలదు.

శ్రీసమర్థులు వాయురూపమున నున్న మూలమాయ యందు గల చేతనమే ఈశ్వరు డనిరి. అందువలన శ్రీశంకరులవారి ఆభాసవాదమును వీరు త్రోసిపుచ్చిరని స్పష్టమైనది. సమర్థులవారు చెప్పిన అపరాప్రకృతులకును గీతయందు (7-4) చెప్పిన అపరా ప్రకృతి సంబంధమగు అష్టవిధప్రకృతులకును భేదమున్నది. గీత చెప్పిన అపరాప్రకృతి అహంకారము, బుద్ధి, మనస్సు, పంచభూతములు; శ్రీ సమర్థులు చెప్పిన అష్టవిధ ప్రకృతులు, పంచభూతములు, త్రిగుణములు.

(3) వేదాంతులయందలి భిన్న భిన్న శాఖలు జీవుడున్నట్లు అంగీకరించినవి. బౌద్ధులవలె శ్రీ సమర్థులును జీవుని స్థానమున వాసనను ప్రవేశపెట్టిరి. మరణకాలమున పంచప్రాణములవెంట దేహమును విడిచి పోవునదియు, దేహాంతరము పొందునదియు వాసనయే యనిరి. వీరిట్లు చెప్పుటకు కారణమేమన, వీరు చెప్పిన అంతకరణ మనునది విభువు, (సర్వవ్యాపి). కనుక, అది ఒక చోటనుండి మఱియొక చోటునకు పోజాలదు. అందువలన గమనాగమనములు వాసనకే చెప్పిరి.

బౌద్ధులు సహితము మరణకాలమున దేహమును విడిచి పోవునవియు, పునర్జన్మ యెత్తుననియు 'భావాదు' లేయని చెప్పిన సంగతి తెలిసినదే. దీనిని వేదాంతులయందు ఇతర శాఖ లెవ్వియు అంగీకరింపవు. కాని, న్యాయ వైశేషిక దర్శనములయందు "మరణకాలమునందు దేహము నుండి వెడలిపోవునది మనస్సనియు, మనస్సు వాసనలను తనయం దిముడ్చుకొనియుండు పెట్టెవంటిదనియు, పునర్జన్మమున నూతనదేహమునందు ప్రవేశించిన మనస్సు తనయందున్న వాసనలను క్రమముగా బయటికి వదలుననియు అందురు.

నైయాయికులు చెప్పినది వేదాంతులకు సమ్మతము కాకపోయినను సమర్థులవారు చెప్పిన దానికంటె యుక్తముగనే యున్నది. నైయాయికుల

మనస్సు విభువు కాదు. కనుక, గమనాగమనములు దానికి చెప్పవచ్చును. అంతఃకరణము చైతన్యమని శ్రీ సమర్థులు చెప్పిరి, కాని వాసన చైతన్యము కాదు. వాసనలే పునర్జన్మ మెత్తిన, పూర్వాజన్మమున చేసిన కర్మ ఫలమును అనుభవించు వా రెవ్వరు? వాసనలు పురుషుడు కాదుగదా? మనస్సునందు నానావిధవృత్తులు గలవనియు, వృత్తులయందు వాసన లున్నవనియు చెప్పియుండుట వలనను; వాసనలయందు ఎఱుకయొక్క మూలమున్నదని చెప్పియుండుటవలనను, మనస్సే జన్మాంతరము నొందుచున్నదని యొకవిధముగా సమాధానపడవచ్చును. అయినను నీ సిద్ధాంతము వేదాంతులలో నెవ్వరికిని సమ్మతము కాదు.

(4) ఈ యంశమున నెఱుక, అంతఃకరణము అను వాటిని గుఱించి చెప్పిరి. 'అంతఃకరణమని సంజ్ఞకు చెప్పుదురు' అని చెప్పియున్నారు. దీనినిబట్టి సమర్థులవారు చెప్పిన 'ఎఱుక' - అంతఃకరణము (సంజ్ఞ) అనునవి సమానార్థకములు కావను సంశయము కలుగుచున్నది.

(5) *సమర్థులవారు చెప్పిన మూలమాయ యందు వాయువు, చేతనశక్తి యనునవి రెండు కలవు. ఇందులో చేతనశక్తి (జగజ్జ్యోతి) ని పురుషుడనియును, వాయువును ప్రకృతియనియు చెప్పిరి. ఇందులో పురుషుడు, శివుడు, ప్రకృతిశక్తి- ఈ విధముగా పురుషప్రకృతులు, శివశక్తులు నిర్వచింపబడిరి. ఈ జంటనే అర్ధనటేశ్వరులని కూడ చెప్పిరి. వీరు చెప్పిన శివశక్తులకును, శ్రీజ్ఞానేశ్వరులు చెప్పిన శివశక్తులకును భేదమున్నది. శ్రీజ్ఞానేశ్వరులు ఏతత్త్వమును శివుడనిరో దానిని శ్రీసమర్థులు శక్తియనియు, శ్రీజ్ఞానేశ్వరులు దేనిని శక్తియని చెప్పిరో ఆ తత్త్వమును శ్రీసమర్థులు శివుడనియు తారుమారుగా చెప్పిరి.* వీరిమతము ననుసరించి ఆత్మ యనునది అంతఃకరణమే. అదియే జగజ్జ్యోతి. అదియే క్షేత్రమని క్షేత్రజ్ఞుడనిరి. దానినే దేహి దేహము లని కూడ చెప్పిరి. ఆత్మను క్షేత్రమని చెప్పుట పొరపాటై యుండవచ్చును. ఏలయన, శ్రీ సమర్థులే క్రింద చెప్పబోవు శివ శక్తుల నామములయందు క్షేత్రమును 'శక్తి' యొక్క నామములలో చేర్చిరి.

దాసబోధయందు శివుడు, శక్తి-అను నీ నామద్వయమునకు పర్యాయనామముల నీ క్రింది విధముగా చెప్పియున్నారు:-

**శివునకు పర్యాయనామము లివి** :- ఎఱుక, ఆదినారాయణుడు, విష్ణుదేవుడు, జగజ్జ్యోతి, సత్త్వగుణము, జ్ఞాత, సర్వజ్ఞుడు, జీవుడు, ఈశ్వరుడు, ఆత్మ, జ్ఞప్తి, సంజ్ఞ, క్షేత్రవాసి, లేక క్షేత్రజ్ఞుడు, కూటస్థుడు, జగన్నాయకుడు, సర్వాత్మ, చంచలాత్మ, చైతన్యము, చేతన, అహంకారము, దేహి, అంతః కరణము.

**శక్తికి పర్యాయనామము లివి** :- ప్రకృతి, జడము, తమోగుణము, అనాత్మ, క్షేత్రము, లేక దేహము, వాయువు, జ్ఞేయము.

శ్రీ సమర్థుల మతమున మూలమాయయే ఆత్మానాత్మ లైనది. ఆత్మ అనగా అంతఃకరణ (జీవుడు), అనాత్మ అనగా అంతఃకరణమునకంటె భిన్నమగు దేహాది సంఘాతము.

(6) ఆఱవ అంశము నందును ఆత్మానాత్మల వివేచనము చేయబడెను. కాని రెండును భిన్నములని చెప్పెను. అవి రెండును ఒకే మూలమాయయందు కలిగినవి కదా? భిన్నములని చెప్పుట యేల? అను సంశయము కలుగును. శరీరమునందు తక్కిన భాగములకంటె గోర్లు, వెంట్రుకలు భిన్నము లైనట్లు దేహాది సంఘాతముకంటె అంతఃకరణము భిన్నమని వారి మతమై యుండవచ్చునేమో!

శ్రీ సమర్థులవారు "జడము (అవిద్య) కర్పూరము, ఆత్మ అనలము-రెండును కాలిన వెంటనే చల్లారును" అని చెప్పిరి. ఇది సరికాదు. ఒక జడపదార్థమును, ఆత్మ (అంతఃకరణము) తెలిసికొన్నంత మాత్రమున ఆ జడపదార్థము నశించి పోవుచున్నదా? అట్లగుటలేదే? జడపదార్థమును కర్పూరముతో పోల్చుటెందులకు? ఆత్మ అనల మెట్లగును? అద్వైతులు చెప్పిన ప్రకారము అవిద్య కర్పూరము. సంయక్ జ్ఞానము అగ్ని అను సామ్యము సరిపోవును.

శ్రీ శంకరులు చెప్పిన ఆత్మ నిర్గుణబ్రహ్మము, శ్రీ సమర్థులు చెప్పిన శుద్ధజ్ఞానము (నిర్గుణబ్రహ్మము) ఒక్కటియే. శ్రీ శంకరులు చెప్పిన సూక్ష్మదేహముతో శ్రీ సమర్థులు చెప్పిన ప్రాణపంచకముతోటి వాసనలను పోల్చవచ్చును. శ్రీ సమర్థుల ఆత్మ (అంతఃకరణము) శంకరుల మతమున చెప్పిన అంతఃకరణముకంటె వేఱు.

జిజ్ఞాసువు :- ఈ మతము ననుసరించి బంధమోక్షము లెవనికి కలుగుచున్నవి? వాసనకేనా? బ్రతికియుండగా భోగ మనుభవించువా డెవడు?

వేదాంతి :- వేదాంతుల మతానుసారమే శ్రీ సమర్థుల మతమునందును సంసార మున్నంతవఱకును బంధమున్నది. స్వర్గనరకము లున్నవి. పరమార్థమున బంధమోక్షము లనునవి యెవ్వరికిని లేవు. ఉన్నది ఒక్క బ్రహ్మమే. దాని యందుండి కలిగిన మూలమాయమే ప్రకృతి పురుషులై (శివ - శక్తులై) సమస్త విశ్వమును ఉన్నట్లు కల్పించుకొని సమస్త నాటకమును ఆడి తుద కవి రెండును ఏకమై ఏ (మూలమాయమై) తొలుత ఆ మూలమాయ యేపరబ్రహ్మమునుండి కలిగెనో ఆ పరబ్రహ్మమునందే లయమగుచున్నవి. అంతటితో నీవు, నేను, సమస్త విశ్వమును కలలో తోచిన వస్తువులు మేల్కొనగనే యేమియు లేనియట్లు లేకపోవుచున్నవి. మాయమే తాను దేహధారి యైనట్లు, సుఖదుఃఖముల ననుభవించినట్లు తలంచుచున్నది. ఇదియే సంసారము. ఈ సంసారము తొలగిపోవలయునన్న శుద్ధజ్ఞానము కలుగవలయు నందురు. శుద్ధ జ్ఞానము కలుగగనే ఆత్మ నశించుట. అనగా : ఆత్మ దేనియందుండి వచ్చినదో దానియందు లయమగును. అప్పుడు మనము శుద్ధ జ్ఞానస్వరూపులమై యుందుము. శుద్ధజ్ఞాన మనగా పరబ్రహ్మము.

జిజ్ఞాసువు:- దీనికి సాధన యేమియు అవసరము లేదా?

వేదాంతి:- సమర్థులవా రిట్లు చెప్పిరి: "శ్రోతలారా! ఇపుడు మీరు శుద్ధ జ్ఞాన లక్షణములను వినుడు. **మనము *శుద్ధ జ్ఞాన స్వరూపులమే*** - యనుదానియం దనుభవము కలుగుటయే ***శుద్ధజ్ఞానము.*** మహావాక్యమంత్రము మంచిదే. **తత్త్వమసి** (తత్ + త్వం + అసి = ఆ బ్రహ్మము నీవే యై యున్నాడవు) ఈ మంత్రమును జపింపుమని చెప్పలేదు. ఈ వాక్యమును సాధకుడు విచారము గావింపవలసియున్నది." (దా. బో. 5-6-10-11) "ఈ మహావాక్య వివరణము గావించుటయే జ్ఞానమునకు ముఖ్యలక్షణము. అట్టి ముఖ్యలక్షణము కతన మనము బ్రహ్మస్వరూపులమను సంగతి సుబోధమగును (దా.బో. 5-614). **తనకు తనది లభించుట (నేనెవ్వరిని తెలిసికొనుట, లేక, ఆత్మస్వరూప మెఱుగుట) యను నీ జ్ఞానము పరమ దుర్లభమైనది. ఈ జ్ఞాన మాద్యంతమునందు స్వయంభూ స్వరూపమున నున్నది."** "సమస్తము **నెచటనుండి** ప్రకటిత

మగుచున్నదో, దేనియందది యంతయు లీనమగుచున్నదో యట్టి జ్ఞానము కలిగిన పిమ్మట బంధములను గూర్చిన భ్రాంతి యంతయును నశించును." (దా.బో. 5-6-16)

పర్యవసానమున శాంకరమతముతో సమర్థులు ఒక విధముగా ఏకీభవించిరి గాని ప్రారంభమునుండియు శంకరుల మార్గమునకు భిన్నముగనే నడచిరి. ఆత్మైక్య జ్ఞానమును బోధించుటచే పర్యవసాన మొక్కటే అయినది.

జిజ్ఞాసువు :- ఈ బోధ ప్రస్థానత్రయమునకు సమ్మతమైనదేనా? దీనికి మూలమేది?

వేదాంతి .- ఈబోధ శ్రీ సమర్థులు స్వయముగా స్థాపించినది కాదు. ఇది యొకవిధముగ శైవశాక్త సంబంధమగు తత్త్వము. కొంతవఱకు ప్రాచీన మైనదే యని చెప్పవచ్చును. దేహి దేహములు రెండును మాయికములే (ప్రకృతియే) యను వీరి యీ సిద్ధాంతము మాత్రము ప్రస్థానత్రయమునకు సమ్మతము కాకపోయినను తక్కిన యంశములు మాత్రము చాలవఱకును సమ్మతమైనవే. ఇదియు ఒకవిధముగు అద్వైతమే. శ్రీశంకరులవలె వీరును మాయ నంగీకరించిరి. కాని, చిదాభాసుని అంగీకరింపలేదు. అద్వైతులలోని అవచ్ఛిన్న వాదమును కూడ వీ రంగీకరింపలేదు. వీరిబోధ యోగవాసిష్ఠము వంటి అద్వైత గ్రంథములయందు చెప్పిన దృష్టి-సృష్టి వాదముతో కొంతవఱకుమాత్రమే సరిపోవును. దాసబోధయందు, శ్రీశంకరులు చెప్పినట్లు మాయోపాధికుడు ఈశ్వరుడనియు, అవిద్యోపాధికుడు జీవుడనియు ఏర్పాటు లేదు. ఈశ్వరుడు, జీవుడు- అను వారి స్థానములందు అంతఃకరణమునే చెప్పిరి. అంతఃకరణమే (ఎఱుకయే) తాను. తానే (అంతఃకరణమే) తనకొక శరీరము, తల్లిదండ్రులు లున్నట్లును, ఈశ్వరు డొకడున్నట్లును, అత డీ సమస్త విశ్వమును సృష్టించినట్లును కల్పించుకొన్నది. యథార్థము విచారించిన ఈశ్వరుడు లేడు. ప్రపంచము లేదు. ఉన్నది ఒక్క బ్రహ్మమే.

జిజ్ఞాసువు:- అయితే ఈశ్వర భజనము వ్యర్థమనియేనా వీరిమతము?

వేదాంతి:- వ్యర్థమనరు. ఒకనికి కల తోచినది. అందులో తాను దరిద్రుడై అన్నవస్త్రములు లేక అలమటించి పోవుచు ఒక రాజును చేరి ఆయనను సేవించి రాజుయొక్క అనుగ్రహమున ధనధాన్య సంపదలు కలిగి సుఖించినట్లే,

తాను, భ్రాంతి వలన ఉన్నట్లు కల్పించుకొన్న ఈశ్వరుని సేవించి, చిత్తశుద్ధి కలిగి శుద్ధజ్ఞానరూపు డగుచున్నాడు.

జిజ్ఞాసువు:- యోగవాసిష్ఠమున శివశక్తులను గుఱించి చెప్పబడినదని వింటిని. అచట శివశక్తులయొక్క స్వరూపవిచార మెట్లు చేసిరో దయయుంచి తెలుపుడు.

## (౧3) యోగవాసిష్ఠము : శివ - శక్తుల స్వరూపవిచారము

వేదాంతి :- యోగవాసిష్ఠమునందు శివ శక్తులను గుఱించిన చర్చ అచ్చటచ్చట కలదు. ముఖ్యముగ నిర్వాణ ప్రకరణమునందలి 81వ సర్గముయొక్క చివరవఱకు ఈ విషయము విపులముగ చర్చించబడినది. యోగవాసిష్ఠము దృష్టి-సృష్టి వాదమును, అద్వైతమును బోధించును. దృష్టి అనగా-జ్ఞానము; సృష్టి అనగా-జగత్తు. జ్ఞానమే జగద్రూపమున ఉన్నదని సారాంశము. చిత్తు (బ్రహ్మము) యొక్క శక్తి (చిత్ + శక్తి) యే చిత్తరూపమును పొంది జగద్రచన చేసినదని బోధించును. దీనినే దృష్టి-సృష్టి వాదమందురు. యోగవాసిష్ఠమున శ్రీరామునకు శ్రీ వసిష్ఠమహర్షి యిట్లు బోధించినట్లు కలదు:-

శ్లో|| "మనో మనన నిర్మాణమాత్రమేతజ్జగత్త్రయమ్|
స సన్న్యాస దివ స్ఫారముదితం నేతరన్మునే||" (4-11-23)

తా|| మునీంద్రా! ముల్లోకములును మనోనిర్మాణ* మాత్రమే. సదసద్విలక్షణంబగు మనస్సే యీవిధముగ నిర్మించుచున్నది.

చిత్తు, చిత్తునందున్న జగన్నిర్మాణ సామర్థ్యరూపశక్తి రెండును చిత్తే అని నిర్వాణప్రకరణమున ఈ క్రింది విధమున చెప్పబడినది:-

శ్లో|| స భైరవశ్చిదాకాశః శివ ఇత్యభిధీయతే|
అనన్యాం తస్య తాం విద్ధి స్పన్దశక్తిం మనోమయీమ్||
(యో. వా. 6-84-2)

---

* ఇచట చెప్పబడిన మనస్సు పంచభూతములయొక్క సాత్త్వికాంశములయందు అయిదు అర్ధభాగముల సమష్టిరూపమైన సామాన్య మానవ మానసము కాదు. అది అతీతమానసము. (అనిర్వచనీయమైన మాయాశక్తియని యెఱుంగవలెను.)

తా॥ శ్రీ వసిష్ఠుడు :- "ఓ రామచంద్రా! ఆ భైరవుడు చిదాకాశమగు శివరూపుడని చెప్పబడుచున్నాడు ఆ కాళికాదేవి అతనికంటెను వేఱు కానిదిగను అతని స్పందన శక్తిగను, మనోమయ రూపిణిగను నెఱుగుము."

శ్లో॥ "యథైకం పవనస్పన్దమేక మౌష్ణానలౌ యథా।
చిన్మాత్రం స్పన్ద శక్తిశ్చ తథై వైకాత్మ సర్వదా॥"
(యో.వా. 6-81-3)

తా॥ "వాయువు, అద్దాని స్పందమును; అగ్ని, అద్దాని యుష్ణత్వమును నొకేపదార్థమగునట్లు చిన్మాత్రము, అద్దాని స్పందనశక్తియు సదా యేకమే యగును."

శ్లో॥ "స్పందన లక్ష్యతే వాయు ర్వహ్ని రౌష్ణ్యేన లక్ష్యతే।
చిన్మాత్ర మమలం శాంతం శివ ఇత్యభిధీయతే॥"

శ్లో॥ "తత్స్పన్దమాయా శక్త్యైవ లక్ష్యతే నాన్యథా కిల।
శివం బ్రహ్మ విదుః శాస్త్ర మవాచ్యం వాగ్విదామపి॥"
(యో. వా. 6-81-4-5)

తా॥ స్పందము (=ఇంచుక కంపనము) చేత వాయు వెఱుగబడుచున్నది. వేడిచేత అగ్ని యెఱుగబడుచున్నది. అట్లే శాంతుడైన శివుడు స్పందరూపమగు మాయాశక్తి చేతనే యెఱుగబడుచున్నాడు. అన్యథా యెఱుగబడడు. ఆ శివుడే బ్రహ్మమని బ్రహ్మవిదులు చెప్పుచున్నారు.

శ్లో॥ "స్పన్దశక్తి స్తదిచ్ఛేదం దృశ్యాభాసం తనోతి సా।
సాకారస్య నరస్యేచ్ఛా యథా వై కల్పనా పురమ్॥"
(యో. వా. 6-84-6)

తా॥ సాకారమైన నరుని యిచ్ఛ (సంకల్పము) మనో రాజ్యమును కల్పించుకొనునట్లు శివుని స్పందనశక్తియైన ఇచ్ఛారూపిణియగు కాళి (శక్తి) ఈ దృశ్యప్రపంచమును విస్తరింపజేయుచున్నది.

శ్లో॥ "చితిశ క్తేః క్రియా దేవ్యాః ప్రతిస్థానం యదాత్మని।
యథా భూతస్థితే రేవ తదేవ శివ ఉచ్యతే॥" (యో.వా. 6-84-2)

తా॥ చితిశక్తి తనయందు స్పంద జడభావముతో ఉండుట యేది కలదో అదియే క్రియ (శక్తి) యనబడును. తన స్వాభావిక చిన్మాత్ర స్వభావముతో నుండుట యేది కలదో, అదియే శివరూప మనబడును.

జిజ్ఞాసువు:- చితి శక్తి విశ్వనిర్మాణము చేయుచున్న దంటిరి గదా? దీనికి ఉపాదానకారణ మేది? జీవకోటి ఎట్లు సృజింపబడెను?

వేదాంతి:- ఈ మతమునందు సృష్టి కలిగిన దనుట కేవలము వ్యావహారికమే. సృష్టి కలుగను లేదు, నశింపను లేదు. నీకు స్వప్నము కలిగిన దనుకొనుము. ఆ స్వప్నమున ప్రపంచము వాస్తముగ కలిగినదేనా? మేలుకొనగనే దానికి నాశనము కలిగినదందువా? మొదట కలుగనూ లేదు, తుదకు నశింపనూ లేదు. మనోరాజ్యమును మానవుడు నిర్మించుకొనినపుడు కలిగినదందుమా? అట్లే చిత్తముచేత సమస్తమును కల్పితమైనది. స్వప్నలోకమునందలి జీవులందఱు ఆభాసజీవులే. స్వప్నప్రపంచము సహితము ఆభాసమాత్రమే. అట్లే జాగత్తయందు తోచు విశ్వమును, ఇందుండు దేవ, మానవ, పశు, పక్ష్యాది జీవరాసులు ఈ మతము ననుసరించి స్వప్న సృష్టివంటివారే. "స్వప్నజాగరములు సమములు." ద్వివిధ సత్తల నంగీకరించు మతమిది. త్రివిధ సత్తల నంగీకరింపరు.

జిజ్ఞాసువు:- అట్లైన స్వప్నము జాగ్రత్తవలన నశించు చున్నది కదా? ఈ జగత్తునకు నాశన మెట్లు కలుగును?

వేదాంతి:- ఈ విషయమై యోగవాసిష్ఠము 85వ సర్గమున 7వ శ్లోకము నుండి 27వ శ్లోకము వఱకు విస్తరించి చెప్పబడియున్నది. దానిని సంగ్రహించి తెలిపెదను.

పద్మమునందున్న భ్రమరము పద్మమును విడిచి 'ఝుం' అని ఝుంకారము చేయుచు బయలున తిరిగి తిరిగి అలసినదై, కాకతాళీయ న్యాయమున తిరిగి ఆ పద్మమునే చేరి పద్మమునందలి మకరందము నాస్వాదించుచు తన్మయత్వముతో శబ్దమును మానియుండునట్లు చిదాకాశము (పరబ్రహ్మము) నందు నృత్యము (జగత్కల్పనము) చేయుచున్న శక్తి కాకతాళీయయోగము చేతన ప్రియుడగు శివుని సమీపించి శివుని స్పృశించినంతనే తత్స్పర్శ మాత్రమున ఆవరణశక్తిని కోల్పోయినదై, నదీజలము సముద్రమునందు

ప్రవేశించి సముద్రరూపమును బొందునట్లు శివరూపమునే పొందును. అప్పుడు చిన్మాత్రమే మిగులును.

ఇట్టి యనుభవమునే అమృతానుభవమనియు, అస్పర్శ యోగమనియు, అఖండైకరస స్వరూపమనియు, నిర్వికల్పసమాధియనియు, పూర్ణావస్థయనియు, అచలమనియు, 'నేను లేకపోయితి' ననియు, వారివారికి తోచిన నామముల నిడియున్నారు. ఇట్టి స్థితినే లోకవ్యవహారమునందు ప్రళయమనియు, జగత్తు నశించుట యనియు అనుచుందురు.

## (౧౪) బ్రహ్మము : సృష్టి (సర్గము) - ప్రళయము

శ్రీజ్ఞానేశ్వరుల, శ్రీఅరవిందుల, శ్రీసమర్థుల, యోగ వాసిష్ఠకారులచే చెప్పబడిన శివ శక్తులను గుఱించి తెలిసి కొంటిమి. నామరూపాత్మక జగత్కల్పనకు, శివశక్తుల విచారమనినను, ఒక్కటియే. ప్రపంచమునందు గల ప్రతి మతమునందును సృష్టి యెట్లు కలిగినదను విచారము చేయబడియున్నది.

నామరూపరహితమై, నిర్గుణమై, నిరంజనమై, సర్వవ్యాపకమై అఖండాద్వితీయ బ్రహ్మము ఒక్కటియే సృష్టికి పూర్వముండెను. ఆయనయందుండి నామరూపాత్మక ప్రపంచము కలిగినది. కలిగినదనగా ఎట్లు కలిగినది? లేక బ్రహ్మమే నామరూపాత్మక జగత్తుగా పరిణమించెనా? పరిణమించెననిన ఏల పరిణమించెను? ఎట్లు పరిణమించెను? పరబ్రహ్మము అనృత, జడ, దుఃఖాత్మకమగు జగత్తు నేల సృజించెను? ఇట్టి ప్రశ్నలన్నియు ఒకటే ప్రశ్న. సృష్టి ఎట్లు కలిగిన దనుటయే. ఈ ప్రశ్నకు అందరికిని తృప్తిని కలిగింపగల సమాధానము చెప్పగలుగుట మానవబుద్ధికి సాధ్యము కాదు. ఏలయన, సృష్టియొక్క యీ రహస్యము ఎవ్వరికిని పూర్ణముగా తెలియదు. ఈశ్వర వాక్కులని ప్రసిద్ధికెక్కిన వేదములు సయితము చెప్పలేక పోయినవి. ఋగ్వేదమునందలి నాసదీయ సూక్తమున* ఈ యంశము ఏడు మంత్రముల యందు చెప్పబడియున్నది. అందు అయిదు మంత్రముల సారాంశమును, రెండు మంత్రములును వాటి తాత్పర్యమును ఈ క్రింద క్రమముగ వివరింతును:-

1. మొదట సత్తుగాని, అసత్తుగాని, అంతరిక్షముగాని, ఆకాశముగాని, జలముగాని లేకుండెను.

---

* ఋ. 10 వ మండలమునందు 129 వ సూక్తము

2. మృత్యువుగాని, అమృతముగాని, రాత్రింబవళ్ళను భేదముగాని, భేదమును తెలసికొను సాధనములుగాని లేకుండెను. అప్పుడు ఏది యుండెనో అది (అ వస్తువు) తనశక్తిచే వాయువు లేకనే, శ్వాసోచ్ఛ్వాసములు చేయుచుండెను. అదితప్ప మఱియొక వస్తువు లేదు.

3. సర్వవ్యాపియగు బ్రహ్మము, మాయ (తపస్సు)చే ఆచ్ఛాదింపబడి యుండెను. ఆ సర్వవ్యాపియే తన మాయచే తాను ప్రకటితమైనది.

4. దానియొక్క బీజమునే (రేతస్సునే) కాలమనియు, శక్తియనియు చెప్పిరి.

5. ఆశక్తి గొప్ప వ్యాప్తి కలది

6. **"కో అద్ధా వేదక ఇహ ప్రవోచత్**
**కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః|**
**అర్వాద్దేవా అన్య విపర్జనేనా**
**ధకోవేద యత ఆబభూవ||"**

తా|| "(సత్తుయొక్క) ఈవిసర్గము అనగా వ్యాప్తి, యెక్కడనుండి వచ్చెను? (దీనికంటె) 'ప్ర' అనగా విస్తారముగ, ఇచ్చో జెప్పువారెవ్వరు? నిశ్చయముగ దెలిసికొనుచున్న వారెవరు? దేవతలు సైత మీ (సత్ సృష్టి యొక్క) విసర్గాంతముననే పుట్టినవారు. మఱి యది యెచ్చో నుండి వెలువడినదియు నెవరెఱుంగుదురు?"

7. "ఇదం విసృష్టి ర్యత ఆ బభూవ
యదివా దధే యది వా న దధే|
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్
సో అంగవేద యది వా న దేవ||"

తా|| "(సత్తుయొక్క) ఈ విసర్గము అనగా వ్యాపకమెచ్చోనుండి వచ్చినది? లేక, అది నిర్మించినను నిర్మింపక పోయినను సరే. అది పరమగు నాకాశమునందుండెడి నీ జగత్తునకు నధ్యక్షుడునగు వా డెవడున్నాడో (హిరణ్యగర్భుడు) వా డెఱిగియుండును; లేక, యెఱుగక సైతముండును. (ఎవరు సెప్పగలరు?)"

ఈ విధముగ సృష్టి రహస్యము హిరణ్యగర్భునకు సైతము తెలియునని చెప్పుటకు వేదమే భయపడి ***"ఎఱిగి యుండును, లేక, యెఱిగియుండక***

**పోవచ్చును,"** అని సందిగ్ధముగా చెప్పినది. మఱియు ఋగ్వేదము (10-129-4) నందు "ఆదియందు అసత్తు (బ్రహ్మము) మాత్రమే యుండెను. దానియందుండి 'సత్' అనగా: నామరూపాత్మక జగత్తు వెలువడెను" అని చెప్పబడినది.

తరువాత ఉపనిషత్తులు సాహసించి సృష్టినిగుఱించి అనేకవిధముల చెప్పినవి. పైన వేదము చెప్పిన విధముగనే (అసత్తు తొలుత కలదనినట్లే) **"అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత"** (తైత్తిరీయశ్రుతి 2-7) ఆదియందు 'అసత్తు' మాత్రమే యుండెను దానియందుండి 'సత్తు' కలిగెను అని చెప్పబడెను. 'స ఐక్షత' ఆ బ్రహ్మము సృష్టి చేయవలయునని సంకల్పించెను. **"సో ఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి"** (తై. 2-6 ; ఛాం. 6-2-3) ఈ బ్రహ్మమునకే "నేను అనేక మగుదునను ఇచ్ఛకలిగెను." అని చెప్పబడెను. ఆ యిచ్ఛయే (ఆ సంకల్పమే) కర్మయని, మాయ యని శాంకరమతము. అదియే పిమ్మట జగత్కల్పన చేసినది. అనగా: బ్రహ్మమునందు జగద్భ్రాంతిని కలిగించినది.

పైన 'సృష్టికర్త సంకల్పించెను', అచట 'సృష్టికర్త' అను నతడు నిర్గుణబ్రహ్మము కాడు. అద్వైతమతము ననుసరించి ఆయన సగుణ బ్రహ్మమగు ఈశ్వరుడే. అయననుండి కలిగినవాడు హిరణ్యగర్భుడు. బృహదారణ్యక శ్రుతి ప్రథమాధ్యాయము 4వ బ్రాహ్మణము 1, 2, 3 వ మంత్రములయందు ఇట్లున్నది.

ఆత్మైవేదమగ్ర ఆసీత్ పురుషవిధః సో ఽనువీక్ష్య నాన్యదాత్మనో ఽపశ్యత్ సో ఽహ మస్మీ త్యగ్రే వ్యాహర త్తతో ఽహనామా భవత్ . . . .
(బృహదా. 1-4-1)

"స వై నైవ రేమే తస్మా దేకాకీ న రమతే స ద్వితీయ మైచ్ఛత్, స హైతావా నాస యథా స్త్రీపుమాంగ్ంసౌ సంపరిష్వక్తౌ స ఇమ మే వాత్మానం ద్వేధా ఽపాతయ త్తతః పతిశ్చ పత్నీచాభవతాం తస్మాదిద మర్ధ బృగల మివ స్వ ఇతి హస్మాహ యాజ్ఞవల్క్య స్తస్మాదయ మాకాశః, స్త్రియా పూర్యత ఏవతాగ్ సమభవ త్తతో మనుష్యా అజాయంత" (బృహదా. 1-4-3)

తా|| సృష్టికి పూర్వము ఆత్మ ఒక్కడే యుండెను. అన్యు లెవ్వరును లేరే అని ఆత్మ తలచుటవలన అది 'అహం' అను పేరుగలదాయెను ఆ 'అహ' మే హిరణ్యాగర్భుడు. అతడే పురుషుడాయెను. ఒంటరిగా ఉన్న హిరణ్యాగర్భుడు (బ్రహ్మదేవుడు) తన ఒంటరితనమునకు తృప్తి చెందక ఒంటరి తనమునందు ఆనందము లేదని రెండవదాని నపేక్షించెను. అపుడతడు స్త్రీపురుషులజంట యెటులుండెనో అట్లుండెను. తనను రెండు భాగములుగా చేసికొనెను. అతడే భార్యభర్తలను ఇద్దరు వ్యక్తు లయ్యెను. కాబట్టి మనుష్యుడు చీల్చిన వెదురు బొంగువలె ఉన్నాడని యాజ్ఞవల్క్యముని చెప్పెను. అందుచేత పురుషునియందున్న యీ యర్థభాగము స్త్రీచే పూర్ణము చేయబడినది. అట్టి యీ యిరువురివలనను మనుష్యులు పుట్టిరి.

(తరువాత 4వ మంత్రముయొక్క తాత్పర్య మిట్లు చెప్పవచ్చును.)

అట్లు హిరణ్యాగర్భునివలన పుట్టింపబడిన స్త్రీ తననుండి యితడు నన్ను పుట్టించి నాతోనే గవయవచ్చుచున్నాడని అంతర్ధానము నొంది గోరూపిణి యయ్యెను. హిరణ్యాగర్భుడు వృషభమై ఆమెతో కూడెను. వారి కలయికవలన వృషభములు గోవులు పుట్టెను. ఇట్లే గుఱ్ఱములు, గాడిదలు, మేకలు, గొఱ్ఱెలు మొదలగు సకల ప్రాణులు పుట్టినట్లు చెప్పబడెను.*

జిజ్ఞాసువు- మహాత్మా! ఈ సృష్టివిధానము బైబిల్‌లోని సృష్టిక్రమముతో పోలియున్నదే. తత్త్వజ్ఞులు గాని పామరులకొఱకు చెప్పబడియుండునా? లేక అధ్యాత్మికముగ అర్థమున్నదా?

---

* యూదులకు క్రైస్తవులకు పవిత్ర గ్రంథమగు బైబిల్ ప్రాతనిబంధనయందు దేవుడు ద్వివిధసృష్టిని చేసినట్లు చెప్పబడినది దేవుడు తొలుత భూతములను, పశు పక్షి తరు లతా గుల్మాదులను తన సంకల్పమాత్రమున చేయుట ఒక విధమగు సృష్టి ; రెండవది కుమ్మరివాడు మట్టితో కుండను చేసినట్లు నరుని సృష్టించుట అను ఈ విషయము బైబిల్‌లో ఇట్లున్నది. "దేవుడైన యెహోవా నేల మంటితో నరుని నిర్మించి వాని నాసికారంధ్రముల జీవవాయువును ఊదగా నరుడు జీవాత్మ అయెను. . . నరుడు ఒంటరిగా నుండుట మంచిది కాదు; వానికి సాటియైన సహాయమును వానికొఱకు చేయుదుననుకొనెను..... ఆ దామునకు (ఆ నరునకు) గాఢనిద్ర కలుగజేసి అతడు నిద్రించినపుడు అతని ప్రక్క టెముకలలో ఒకదానినితీసి ఆ చోటును మాంసముతో పూడ్చివేసెను. తరువాత దేవుడు ఆదామునుండి తీసిన ప్రక్క టెముకను స్త్రీగా నిర్మించెను."

వేదాంతి:- దీనిని మహాత్ములు తమ అనుభవము ననుసరించి చెప్పిరి. ప్రళయ మేక్రమమున జరిగెనో దానికి వ్యతిరేకముగ (ప్రతిలోమముగ) సృష్టి జరుగును. సర్గ ప్రళయముల గుఱించి వేఱు వేఱు దర్శనములు, ఉపనిషత్తులు చెప్పిన భిన్న భిన్న విధానము లన్నియు ఇదివఱకే నీకు వివరించి యుంటిని. ఇప్పుడు ఇంకొక పద్ధతిని వివరింతును ఇదియు శాస్త్రసమ్మతమే. వేదాంతుల మతమే శ్రద్ధతో వినుము:-

ఆకాశము జడద్రవ్యమున కాశ్రయము. ద్రవ్యరాశి యొక్క మూలస్వరూపము. శక్తికి జడద్రవ్య మాశ్రయము. ఆత్మనుండి తొలుత ఆకాశము కలిగినదని తైత్తిరీయ శ్రుతి చెప్పినది. (తై-2, అ-1 అనువాకము) ఆకాశము అత్యంత సూక్ష్మభూతము. భూమి అన్నిటికంటె స్థూలభూతము. అన్నింటికంటె జడమైనది.

ముండక శ్రుత, బ్రహ్మము నుండి తొలుత ముఖ్యప్రాణము.* తరువాత అంతఃకరణము ఆకాశాదిభూతములు కలిగినట్లు చెప్పినది. (ముం. 2-1-3)

ప్రళయసమయమున జడద్రవ్యమంతయు విచ్ఛిన్నమై అందున్న శక్తి బహిర్గత మగును. ఆ సమయముననే సమస్త ప్రాణుల స్థూలశరీరములు నశింపగా, అందు ప్రాణరూపమున నున్న శక్తి బహిర్గతమై విశ్వవ్యాప్తమై యున్న (ప్రాణ) శక్తియందు కలియును. ఇదియే సమష్టిప్రాణము లేక ప్రాణశక్తి. ముండకశ్రుతి తొలుత పుట్టినట్లు చెప్పిన ప్రాణ మిదియే. ప్రతిజడ ద్రవ్యమునందును అంతర్గతమై శక్తి కలదు. ఆయా ఉపాధులు నాశముకాగా ఆయా ఉపాధులు నశించుటవలన వాటినుండి బహిర్గతమైన శక్తి ఏకమై ఆకాశమంతటను వ్యాపించి స్పందించును. స్పందనమే శక్తి యని నీ వెఱుగుదువు. అట్లు ఆకాశమంతటను వ్యాపించిన శక్తి ఉద్ధృతముగా స్పందించుట కారంభించును. అంతవఱకు అచలమై (చలనము లేనిదై) యున్న ఆకాశము కూడ చలించును. అట్టి స్థితిలో ఈశ్వరనిర్మితమగు స్థూలసృష్టి నశించుట (సూక్ష్మావస్థకు మారుట)కు ఆరంభించును.

---

* ఇచట ప్రాణమనగా 'స్పందన' అని అర్థము చేసికొనిన శ్రీ జ్ఞానదేవుల సిద్ధాంతముతోను, యోగవాసిష్ఠకారుల సిద్ధాంతముతోను సరిపోవును

సృష్టియందలి సమస్త జడద్రవ్యమునకును ఏదో ఒకరూప మున్నది రూపమున్న ద్రవ్యమునకును, రూపరహిత ద్రవ్యమునకును నామము లున్నవి. పైన చెప్పిన స్థితికి (సమయమునకు) ముందు రూపము లన్నియు నశించినవి. కాని, శబ్దము (నామము) నశింపలేదు ఎట్లన :- మనయెదుట ఒకఘటము కలదనుకొనుము. అది మరుక్షణమున నేదో ఒక కారణమున భిన్నమగు ననుకొనుము. కానీ, ఘటరూపనాశనముతో ఘటనామము నశింపదు. శబ్దమనగా భావము. స్థూలరూపము నశించినను సూక్ష్మమగు శబ్దము నశింపక భావరూపమున మిగిలియుండును సృష్టి ఆరంభమునుండి ప్రళయపర్యంతము, ప్రపంచమున ఉద్భవించిన నానావిధ శబ్దరాశి (భావరాశి) అంతయు నశింపక నిలిచియుండును. ఆ శబ్దరాశియొక్క సమష్టిరూపము 'ఓం' అను నాదము. పైన చెప్పిన విధమున ఆకాశ, ప్రాణములు స్పందించు నప్పుడు ఓంకారనాదము కూడ కలసిపోవును. ఓంకారము భావరాశినంతయు తనయందు లీనము చేసికొని (ఇముడ్చుకొని) యుండును. ఈ మూడును ఒక రాశిగా నేర్పడునని చెప్పవచ్చును. ఇట్లేర్పడిన యీ రాశి (ఏకద్రవ్యము) ఆవిధముగా ఎంతకాలముండునో చెప్పజాలము. కాని వాని ఉద్ధృత స్పందము క్రమక్రమముగా తగ్గుచు, తుదకు పరమసత్తయందది లీనమగును. లీనమనగా నీటియందు నీరువలెను, పాలయందు పాలవలెను కలసిపోవునట్లు గాదు. సరోవరమునందు గొప్పగా లేచిన తరంగము తగ్గి అత్యంత అల్పతరంగముగా గోచరించునట్లని అర్థము చేసుకొనవలెను. పూర్తిగా కలిసిపోవునని కొందఱందురు. పూర్తిగా లీనమైనచో తిరిగి నూతన సర్గమునకు కారణము నశించును. మతేమనగా: పరమసత్తయందు స్పందము లీనమయ్యును లీనము కానియట్లు; ఉండియు, లేనట్లుండును. అది విశ్వమునకు విశ్రాంతి. చలనరహితస్థితయే విశ్రాంతి.

తిరిగి విశ్వ మావిష్కరించును. ఆవిష్కరించుట యేమో మన పూర్వులకంటే మనకు బాగుగా తెలియుటకు సాధనము లేర్పడినవి. మనము చలనచిత్రములను చూచుచున్నాము. మనలో పెక్కండ్రకు దాని రహస్యమేమియో తెలియును. సుమారు 10 మిల్లి మీటర్లు గల చిన్న చిత్ర సముదాయమును (ఫోటోలను) ఒక చుట్టగా చుట్టి దానిని ప్రొజెక్టరులో పెట్టి అది తిరుగునట్లు చేయుదురు. ఫిలిమునందు సూక్ష్మముగా ఉన్న నానావిధరూపములును, అవ్యక్తస్థితి యందున్న వాక్యములును (శబ్దమును) ఫిలిమ్ తిరుగుటవలన తెల్లతెరపై అభివ్యక్త మగును. అనగా అదివఱకు ఫిలిమ్‌లో సూక్ష్మముగను అవ్యక్తముగ

నున్నదే స్థూలముగా మననేత్ర, శ్రోత్రేంద్రియములకు వ్యక్తమగును అట్లే హిరణ్య గర్భునుండి స్థూలసృష్టి యేర్పడినది సూక్ష్మమునందు లేనిది స్థూలముగ వ్యక్తము కాదు. ఇట్లనేక పర్యాయములు జరిగినది. ప్రథమ సర్గము (సృష్టి) ఎట్లు జరిగినదో "హిరణ్య గర్భుడు ఎఱిగియుండును లేక యెఱుగక సైతముండును (ఎవరు సెప్పగలరు)" అని వేదమే చెప్పలేక పోయినది.

కల్పము చలనముతోనే ప్రారంభమైనది. ఈ చలనము తిరుగ శాంతి పొందుటకే చలించును. ఒక భ్రమరము పద్మమునందలి తేనెను త్రాగి పద్మము చుట్టును 'ఝుం' అనుచు తిరిగి తిరిగి అలసి తుదకు ఆ పద్మమునందే పరుండి నిద్రించి శ్రమను పోగొట్టుకొని విశ్రాంతిని గొనునట్లు విశ్వము చలనరూపమున శాంతిని గోల్పోయి తిరుగ శాంతికొఱకే ఆరాటపడుచున్నది. వ్యక్తికి సమాధియందు శాంతి లభించుచున్నది. సామాన్య ప్రాణికి స్వప్నరహిత సుషుప్తియందు శాంతి లభించుచున్నది. సుషుప్తి నిత్యప్రళయముగదా? యోగి సమాధినుండి లేచునపుడు నాదము (ఓమ్) తొలుత స్వయం వ్యక్తమగుచున్నదని పెద్ద లందురు.

జిజ్ఞాసువు :- ఇచట శివ శక్తు లెవ్వరో తెలియజేయుడు.

వేదాంతి:- ప్రళయారంభసమయమున మిగిలినవి రెండే వస్తువులని చెప్పియుంటిని. ఒకటి ద్రవ్యరాశిరూపమగు ఆకాశము - రెండవది ప్రాణరూపశక్తి. (ప్రాణమే హిరణ్యగర్భుడు; అతని శక్తియే నాదము - శబ్దము) ఈ శక్తియందే శబ్దాంతర్గతమగు నాదము కూడ కలసియున్నదని చెప్పితిని. కనుక లెక్కకు వచ్చునవి రెండే. అందు మొదటిది శివుడు - రెండవది శక్తి. హిరణ్యగర్భుడే పురాణములయందు చతుర్ముఖ బ్రహ్మదేవుడు. అతనియందుండి ఒక స్త్రీని సృష్టించెనని శబ్దశక్తిని వ్యక్తీకరించెనని అర్థము. శబ్దరూపిణినే పురాణములయందు సరస్వతీదేవియని యందురు. హిరణ్యగర్భునే తత్త్వశాస్త్రములందు మహాతత్త్వమందురు. ముందు అచలబోధను గుఱించి చెప్పునపుడు (-శబ్దబ్రహ్మము - స్ఫోటవాదము) *సృష్టి లయముల గుఱించి మఱికొన్ని సంగతులను వివరింతును. వాటిని విన్న నీకు గల సంశయములు తొలగిపోవును. శివశక్తులను గుఱించి యిచట మఱియు కొన్నింటిని వివరింతును, సావధానుడవై వినుము :-

* ఈ గ్రంథముయొక్క ప్రథమభాగమున వివిధములగు సృష్టి క్రమములను చెప్పియుంటిని. కనుక యిచ్చట చెప్పు టనవసరము.

## (౧౫) శివ - శక్తి తత్త్వముల పరిశీలనము

శివ శక్తులనే ప్రకృతి పురుషు లనిరి. శివశక్తులను గురించి అనేకులు అనేకవిధముల చెప్పిరి.

శాక్తేయులు (దేవీ భక్తులు) శివశక్తి తత్త్వములకు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చిరి. దేవీభాగవతమునం దిట్లున్నది:- "సృష్ట్యాది నాత్మ రెండు విధంబులయ్యె నందు కుడిని బురుషుండు నెడమ బ్రకృతియు నుండునదియె బ్రహ్మరూపము, నిత్యము సనాతనమునై యలరారు అగ్ని దాహికలకు బోలె నాత్మశక్తులను భేద మసదు." (ఆంధ్ర దేవీ, భా. 9-24) తరువాత దేవీ భక్తు లందఱును తవిధమునే అనుసరించిరి.

శ్లో॥ "త్వం చంద్రికా శశిని తిగ్మరుచౌ రుచిస్త్వం
త్వం చేతనాఽసి పురుషే పవనే బలం త్వమ్।
త్వం స్వాదుతాఽసి సలిలే శిఖిత త్వ మూష్మా
నిస్సారమేవ నిఖిలం త్వదృతే యది స్యాత్॥"

అని మహాకవి కాళిదాసు అంబాస్తవమునందు దేవిని స్తుతించిరి. పై శ్లోకమున, సూర్యునియందు కాంతి, పురుషునియందు చేతనము, దేవియే యనిరి.

తత్త్వదృష్టిచే చూచిన పురుషుడు చైతన్యస్వరూపుడు చైతన్యము మినహా పురుషుడు (ఆత్ముడు) లేడు. చైతన్యము పురుషుని గుణము కాదు, స్వరూపము. ఈ విధమగు తాత్త్వికదృష్టితో చూచిన అచ్చట శక్తికి స్థానము లేదు. శైవ తత్త్వము ననుసరించి చూచిన చైతన్యస్వరూపుడగు శివునకును, జడ జగత్తునకును సంధానకారిణి శక్తి. లౌకికదృష్టినుండి చూచిన శక్తి యనునది జడము. ఈ శక్తి, జ్ఞానము (చైతన్యము) కాదు. ఇదివఱలో న్యాయవైశేషిక వాదులును, పూర్వమీమాంసా వాదులయందు ప్రభాకరులును, ఆత్మ అచేతన మనువారు. (జడాత్మవాదులు)

శివుడు జడమైనచో జడమునుండి చైతన్యము కలిగినదని అంగీకరింపవలసి వచ్చును. జ్ఞానము పుట్టినదైనచో అదియు జడమే కావలెను. పుట్టిన దంతయు జడమేయని అట్టిది నశించునని వేదాంతుల మతము.

జిజ్ఞాసువు:- అయ్యా! శివశక్తులను గుఱించిన భిన్నాభిప్రాయములు ఎట్లు కలిగినవి? ఎవరు చెప్పినది సరియైనదా?

వేదాంతి.- మనదేశమున దర్శనకారులు అనేకులు జన్మించి భిన్న భిన్న దర్శనములను రచియించిరి. ఆత్మ (ఆత్మలు) జడములని చెప్పు న్యాయ వైశేషిక పూర్వమీమాంసా దర్శనములను గుఱించి చెప్పియుంటిని. వాటిని పూర్వము కొందఱు పండితులు చాలాకాలము పఠించి యుందురు. అందువలన అట్టివారు ఆదర్శనములయందు భక్తి గలవారై యుందురు ఆ కారణమువలన ఆత్మ జడమను సిద్ధాంతము వారి బుద్ధియందు బలముగా నాటుకొని యుండును. కొంతకాలమైన తరువాత వారు వేదాంత దర్శనమును పఠించియుందురు ఆత్మ చైతన్యస్వరూపమను వేదాంత సిద్ధాంతము యుక్తి యుక్తమైనదనియు, శ్రుతి సమ్మతమనియు, వారికి నమ్మకము కలిగియుండును. అట్లు నమ్మకము కలిగియుండియు - వెనుకటి సంస్కారములు వారి బుద్ధియందు బీజరూపమున నున్నందున వాటిని వదిలించుకోలేక పోవుటచే ఆత్మ జడమనిగాని చైతన్యమనిగాని విస్పష్టముగ చెప్పలేక ఆత్మయొక్క శక్తియే చైతన్యము (జ్ఞానము) అని సిద్ధాంతము చేసికొని జడచైతన్య సమరస భావమును (సామరస్యమును) స్థాపించి తృప్తి చెందియందురేమో అని నా యూహ,

ఆత్మయే (బ్రహ్మమే) ప్రపంచమును సృష్టిచేసినదన్న సిద్ధాంతము తర్కము నెదుట నిలువదు. కనుక ఆత్మయం దంతర్లీనమైయున్న విమర్శరూప ఆత్మయొక్క (చిత్) శక్తి ఆత్మనుండి వేఱై ఆత్మయందే, అద్దమునందు నగరము తోచునట్లు, జగద్రచనము చేసినదనిన ఆత్మకు కర్తృత్వదోష మాపాదింపబడకుండ నివారించినట్లగును. అంతేగాక వారు ఆత్మ జడమనిగాని, చైతన్య మనిగాని చెప్పక తప్పించుకొనవచ్చును. లేదా, సమయానుకూలముగ ఆత్మ జడమని చెప్పినను, ఆత్మయొక్క గుణమే చైతన్యమని చెప్పి తృప్తిచెందవచ్చును. ఈవిధముగ ఆత్మ జడమను వాదమును ఆధారముగ శివశక్తుల భావ ముద్భవించి యుండవచ్చు నేమోయని నా యభిప్రాయము.

దేవునకు భార్య కలదని చెప్పినవాడు ఈ కాలమున పరిహాసాస్పదు డగును. కాని, లోతునకు పోయి శోధించినవాడు ఆ భావమును అంత

తేలికగా త్రోసివేయజాలడు. ఏలయన? మనకు గల జ్ఞానమంతయు మన అనుభవమును బట్టి యుండును. ఒక విత్తనము భూమిలో పడిన అది నీటి సంపర్కమున మొలకయెత్తును. ఆ అంకురమే క్రమముగా మహావృక్షమగును. విత్తనము వృక్షమునందు కనబడదు. వృక్షమునకు తరుణ వయస్సు వచ్చినపుడు పుష్పించును. కాయ కాయును. కాయ పండగును ఫలమునందు విత్తనము గోచరించును. మొదట భూమిలో వేసినది ఒక విత్తనమే యైనను వృక్షమునందు గల అనేక ఫలములయందు వేలు, లక్షల సంఖ్యలలో బీజము లుండును. ఇది విశ్వమునందలి అద్భుత నియమము. బీజము అంకురమైనపుడు అంకురమునందు రెండు దళము లుండును. స్థావరములగు ప్రాణుల విషయమిది.

జంగమములగు ప్రాణులయందు మనుష్యులను దృష్టాంతముగ తీసికొందుము. నరనారీరూప ద్వయమువలననే సృష్టి జరుగుచున్నది. స్త్రీ లేని పురుషునివలనగాని, పురుషుడు లేని స్త్రీవలనగాని సంతతి కలుగదు. శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పినట్లు "ఓష్ఠ ద్వయంబును నొక్క శబ్దమునే యుచ్చరించెడి రీతిని, నేత్రద్వయంబును నొక్క దృశ్యమునే వీక్షించెడు మాడ్కిని నయ్యుభయులును (శివుండును, శక్తియు) నొక్క ప్రపంచంబునే కావించుచుందురు" అను అనుభవము ననుసరించియే స్త్రీ పురుష లిరువురు కలసి ఒక్క సంతానమునే కనుచుందురు.

వృక్షమునందలి ఫలమును పరిశీలించిన యీ చెట్టు పుట్టుటకు కారణమైన బీజ మిదియేయని తెలియును. తొలుత భూమిలో వేసిన విత్తు ఇంతకాలమునకు ఫలమునందు తిరుగ మన కగపడుచున్నదని తెలిసిన పిమ్మట అట్టి అనుభవము వలన పొందిన వివేకముచే సృష్టికి పూర్వమున సృష్టికి కారణమగు వారు, ఒకడుగాక యిరువురు, కలరను నూహ సామాన్యముగా మానవునకు కలుగుచున్నది. కాని యీ ద్వైతభావము సరియైనది కాదని విశేష విచక్షణచే స్థిర పడిన పిమ్మట ద్వైతాద్వైతములకు మధ్య ఒక రాజీమార్గమును కుదుర్చుకొనిరి. ఎట్లన:- మూలకారణమగు బ్రహ్మము లేక (ఈశ్వరుడు) ఒకడుగానే యుండి తనయందుండియే వేఱొక దానిని (శక్తిని) సృష్టించినట్లు చెప్పిరి. చూచుటకు వారిరువురివలె నుందురేగాని ఒకరుమాత్రమేయని అద్వైతమునే స్థాపించిరి.

## (౧౬) భౌతిక విజ్ఞానవేత్తల శక్తివాదము

శక్తినిగుఱించి భౌతిక విజ్ఞానవేత్తలు (Scientists) చెప్పిన దానిని కూడ కొలదిగా విచారింతము. శక్తి అనగా సామర్థ్యము, బలము. (Energy). ఇది అద్వైతులు చెప్పు మాయాశక్తియం దొక యంశము మాత్రమే. శక్తిని గుఱించిన వాదము శక్తివాదము (Energism) అందురు. వీరి సిద్ధాంతము ననుసరించి విశ్వమున మనకు తెలియవచ్చునవి రెండే. ***అందు ఒకటి ద్రవ్యము (Matter), రెండవది శక్తి అని చాలకాలమువఱకు నమ్ముచుండిరి.*** వేదాంతులమతమున ఈ రెండును జడములే. జడద్రవ్యము నాశ్రయించుకొని శక్తియుండును. ఏది ద్రవ్యము (భౌతిక పదార్థము) నాశ్రయించుకొనియుండి దానిచేత కార్యమును చేయించునో అట్టి దానిని శక్తియందురు.

ఒకానొక సందర్భమున శ్రీ వివేకానందస్వాములవారు ఇట్లు చెప్పిరి:- "భౌతిక పదార్థమనగా నేమి? శక్తి తన బలమును దేనిపై ప్రయోగించునో అది. శక్తి యనగా నేమి? భౌతిక పదార్థముపై నేది తన బలము నుపయోగించునో అది." (జ్ఞానయోగము విశ్వమతాదర్శము)

శక్తిగల పదార్థము (ద్రవ్యము) శక్తము. శక్తి కలవాడు శక్తిమంతుడు. ద్రవ్యము-శక్తి అనునవి వేఱు వేఱుగా కనబడును. (శివశక్తులవలె) అవి ఒక దానిని విడిచి మఱియొకటి ఉండవు. శక్తిచేతనే జడద్రవ్యమునకు చలనము కలుగుచున్నదని తలచిరి. పరమాణువు విచ్ఛిన్నమైన పిమ్మట దానిచుట్టు తిరుగుచుండు ఎలెక్ట్రానులవలన ద్రవ్యమునకు చలనము కలదని అంగీకరించిరి. ద్రవ్యము వివిధరూపములలో మనకు కనబడుచున్నను ద్రవ్యరాశినంతయు పగులగొట్టి అణువులుగాను, పరమాణువులుగాను చేయవచ్చును. అనగా : వివిధ నామరూపములతో కనబడుచున్న ద్రవ్యమంతయు ఒక్కటే -అని వెనుక చెప్పితినిగదా? అట్లే శక్తియును - ఉష్ణము, కాంతి, విద్యుత్తు మొదలగు వివిధరూపములతో మనకు కనబడుచున్నది. ఒక రూపములో కనబడుశక్తి యింకొక రూపముగా పరివర్తన చెందుచుండును. కొంతకాలము క్రిందటివఱకు నీ శాస్త్రజ్ఞులు చెప్పినదేమనగా:- "మనము శక్తిని క్రొత్తగా సృష్టించజాలము, నాశనము చేయజాలము" దానినే శక్త్యవినాశ

నియమ మందురు (Law of Conservation of Energy). శక్తి యెట్లు అవినాశియో ద్రవ్యము సయితము అవినాశి యనుచుండిరి. కాని, తరువాత జరిగిన పరిశోధనలవలన రెండును వినాశము చెందునని అంగీకరించిరట.

భౌతిక తత్త్వవేత్తలు విశ్వమును-ద్రవ్యము, శక్తి అను రెండు స్పష్టమైన మూలకములని కొన్ని శతాబ్దములుగా నమ్మిరి వా రట్లు నమ్ముటకు కారణము ఇట్లు తలచిరి:- "ద్రవ్యము జడత్వము గలది. స్పర్శేంద్రియ గ్రాహ్యమయినది. ద్రవ్యరాశి అని పిలువబడే ఒక ధర్మమువలన విలక్షణమైనది. శక్తి చైతన్య పూరితమయినది. అగోచరమయినది ద్రవ్య రహితమైనది." కాని డాక్టరు ఆల్బర్టు ఐన్‌స్టయిన్ మహాశయుడు చాలవఱకు పూర్వుల సిద్ధాంతములను తారుమారు చేసి తమ సాపేక్ష సిద్ధాంతములను (Theroy of Relativity) స్థాపించిన పిమ్మట, ఆ సిద్ధాంతమును కాలక్రమమున ప్రపంచమునందలి మహామేధావులగు భౌతిక శాస్త్రవేత్తలు, విశ్వశాస్త్రజ్ఞులు, గణిత శాస్త్రజ్ఞులు, ఖగోళశాస్త్రజ్ఞులు ఆమోదించిరి. డా|| ఐన్‌స్టయిన్ సిద్ధాంతమును కొద్ది వాక్యములలో ఈ క్రింది విధముగ చెప్పిరి:-

"ద్రవ్యము, శక్తి, తుల్యమయినవని ఐన్‌స్టయిన్ చూపించెను ద్రవ్యము అని పిలువబడే లక్షణము కేంద్రీకృతమయిన శక్తి మాత్రమే. వేరేమాటలలో ద్రవ్యరాశియే శక్తి ; శక్తియే ద్రవ్యరాశి. వాటికి ఉన్న వ్యత్యాసము తాత్కాలికస్థితి మాత్రమే " ('విశ్వము - డాక్టర్ ఐన్‌స్టయిన్' పుట 79)

స్థూలదృష్టికి ద్రవ్యము భిన్న భిన్నముగ కనబడుచున్నను , వివిధ ద్రవ్యములను పరిశోధించిన పిమ్మట అంతయు ఏకద్రవ్యమే - అను సిద్ధాంతమునకు వచ్చినట్లే, భిన్న భిన్నముగా కనబడుచుండు శక్తులను పరిశోధించిన పిమ్మట శక్తి ఏకమను సిద్ధాంతమునకు వచ్చినట్లే. *భిన్న భిన్నముగా కనబడుచుండు ద్రవ్యము - శక్తులను పరిశోధించిన పిమ్మట* ***అవి రెండును ఏకమను 'ద్రవ్యశక్తి' అను అద్వైత సిద్ధాంతమునకు వచ్చిరి.*** కాని, వ్యావహారికముగా 'ద్రవ్యము'-'శక్తి' అను అద్వైతభావమును విసర్జింపలేము. సృష్టి యొక్క మూలతత్త్వమును శోధింపగోరువారికి అద్వైతమే శరణ్యము.

భౌతికతత్త్వవేత్తల సిద్ధాంతములు స్థిరముగ నిలువక పోయినను, మొదట సిద్ధాంతము ఆధారముగా గైకొని వారి పరిశోధనలు ముందుకు సాగిపోజొచ్చినవి

ఉదాహరణమునకు, మొదట, ఆంగ్లేయుడైన డాల్టన్ (క్రీ. శ. 1801-03) ద్రవ్యము సూక్ష్మతరమైన పరమాణువులచేత నిర్మింపబడినదని తెలిపెను. ఏ రసాయన ప్రక్రియవలనను పరమాణువు విచ్ఛిన్నము కాదని తెలిపెను.

రష్యన్ భౌతికతత్త్వవేత్తమగు మెండలీవు (1834-1907) ఆవర్తననియమము (ఆవర్తసంవిభాగము) అను సిద్ధాంతమును కనిపెట్టెను. ఈ సిద్ధాంతము ననుసరించి సృష్టియందలి అనంతనామరూపములు గల ద్రవ్యరాశి మనము చూచుచున్నన్ని విధములుగా లేదనియు, మూలతత్త్వములు 92 మాత్రమే కలవనియు, నిరూపించి వాటి అణుభారమును ఇతర లక్షణములనుబట్టి 1 మొదలు క్రిందికి 92 గా ఒక పట్టిక వ్రాసి తత్త్వములను ఆ క్రమములో పెట్టి చూచిరి 1 నుండి ప్రతి 8 వ తత్త్వము ఒకేజాతికి చెందినదని- (అనగా.- 1, 8, 16, 24, 32, 40 యీ ప్రకారము) చూపించెను ఇందువల్ల కలిగిన లాభమేమనగా - మనము తొలుత ద్రవ్యములు, భేదములో అనంత మనుకొనినవి 92 మాత్రమే అనియు, అవియు 8 విధములగు వంశములకు చెందినవిగా ఉన్నవనియు అర్థమైనది. మెండలీవు కాలము నాటికి 92 అన్న తత్త్వములు నేటికి 105 అయినవని చెప్పుచున్నారు. అయినను ముఖ్యమయినవి 92 అనుచున్నారు

ఆంగ్లేయ భౌతికతత్త్వవేత్తయగు సర్ జె జె. థాంసను విద్యుత్ శక్తిని పరమాణువుమీద ప్రయోగించి చూడగా పరమాణువునుండి చిన్న చిన్న తునకలు ఊడి పడినవి. వాటికి ఎలెక్ట్రానులని అతడు పేరు పెట్టెను. అది వఱకే కనుగొనబడినది హైడ్రోజన్ పరమాణువు. క్రొత్తగా తెలిసికొన్నది ఎలెక్ట్రాన్ పరమాణువు 1850 ఎలక్ట్రానుల బరువు ఒక హైడ్రోజన్ పరమాణువంత బరువునకు సరితూగును దీనితో పరమాణువు అవిభాజ్యమను డాల్టన్ సిద్ధాంతము త్రోసివేయబడినది.

ఈరీతిగా భౌతికపరిశోధన ముందుకు సాగిపోవుకొలదిని వెనుకటి సిద్ధాంతములకు విలువ తగ్గినది. భారతీయుల ఆధ్యాత్మిక పరిశోదన, స్వానుభవరూప మగుటచే దానికి చలనము లేదు.

విశ్వసృష్టి (సర్గము) యెట్లు కలిగిన దను ప్రశ్నను పరిష్కరించుటకు మతకర్తలవలెనే భౌతిక విజ్ఞానవాదులును అనేక విధముల ప్రయత్నించిరి.

న్యూట్రాను, ప్రోటాను, ఎలక్ట్రాను రూపకమైన ద్రవ్యబీజము ఎట్టి విచిత్రసంఘటన వలన ప్రదేశమునందు తొలుత ఏర్పడినదో చెప్పలేకపోయిరి. కాని, యూరపుఖండమునందలి భౌతిక విజ్ఞానవేత్తలు చేసిన పరిశోధనాఫలితమే నేటికి మానవుడు చంద్రలోకమునకు పోయి వచ్చుటకు నిచ్చెనవలె ఉపకరించినది.

పరమాణువాదియగు డాల్టన్, పరిణామవాదియగు డార్విన్ మహాశయులకంటె అనేక శతాబ్దముల పూర్వమే గౌతమ, కాణాదఋషులును, జైనులును, బౌద్ధులును పరమాణువులను గుఱించి తెలిసికొనిరి. సాంఖ్య మతాచార్యులగు కపిలమహర్షి పరిణామవాది. మనవారు భౌతిక విజ్ఞానమునందు గౌతమాదులు చూపిన మార్గములయందు ముందునకు సాగిపోవుటకు సాధనములు లేకయో అలసత్వమువలననో కొన్ని సందర్భములయందు వెనుకపడిపోయిరి. దానికి కారణము మన పరాధీనత యని కొంద అందురు. అది ఎట్లున్నను ఇంకొక కారణమున్నది.

మనదేశమునం దుదయించిన యే విద్యయైనను, అనగా - దర్శనము, శిల్పము, సంగీతము, జ్యోతిషము, నాట్యము, వైద్యము మొదలగు ఏ కళయైనను దాని పర్యవసానము భగవత్సన్నిధికి జీవుని చేర్చునట్టిదిగా కల్పించిరి. అందువలన యూరోపియన్ భౌతిక విద్యావేత్తలకు, భారతీయ తత్త్వవేత్తలకు, లక్ష్యములో భిన్నత్వముండుట వలన భౌతికమగు ఏ అన్వేషణమైనను భగవదన్వేషణానందమున మనవారు సంతృప్తులై యుందురు. యూరోపియన్‌లు ఆ మార్గమును చూడక వారు వారు పూనిన భౌతిక పరిశోధనలయందు అన్వేషణము అవిచ్ఛిన్నముగ జరుపుచునే యుందురు.

ద్రవ్యనాశనమువలన అపారమగు శక్తి విజృంభించు చున్నది. ఒక కట్టెను కాల్చిన అది కాలుచున్నపుడు అందలి శక్తి వెలుతురు వేడి రూపమున బహిర్గత మగును. కట్టె బూడిద యగుననగా- అణురూపమును పొందును. ఒకానొక కారణమున ప్రళయకాలమున అణువులు సయితము విభాజ్యమై పరమాణురూపమును పొందును. విశ్వమునందు గల ద్రవ్యమంతయు ఆ కాలమున (ప్రళయమున) నామరూపములను కోల్పోయి పరమాణువులగును. పరమాణువులు ప్రదేశమునందు మహావేగముగా తిరుగుటవలన ఒకదాని నొకటి ఢీకొని అవియు వాటి స్వరూపమును గోల్పోయి తేజముగా (విద్యుత్తుగా)

మారును. అంతటితో ద్రవ్యమనునది లేకపోయెను. ద్రవ్యశబ్దము మాత్రమే మిగిలెను. అప్పుడు కాలభావ మనునది సైతము లేదు. ఏలయన, కాలసూచకములగు సంఘటనలు లేని ఆ సమయమున కాలభావ మెట్లుండును?

భౌతిక శాస్త్రవేత్తలలో అగ్రగణ్యు డనదగిన డాక్టర్ ఐన్‌స్టయిన్ సాపేక్షాసిద్ధాంతముయొక్క సారమేమి?- ప్రదేశకాలములు రెండును ఒకటేగాని రెండు కావని, ప్రదేశమునందలి ఒకభాగమే కాలము. కాలము లేకపోవు ననగా ప్రదేశము సయితము లేనిదే అని అర్థము. అవి (అది) లేకపోవుననగా దేనియొక్క రూపాంతరములో అట్టి విజ్ఞానము మాత్రము మిగులును. "డా|| ఐన్‌స్టయిన్ ఈ తారకసూత్రమును చరమావధులకు తీసికొనిపోయి ప్రదేశకాలములు సైతము దివ్యజ్ఞానము (Intuition) యొక్క రూపములేయని, రంగు, ఆకారము లేదా పరిమాణము అనే మన భావములను ఏవిధముగా అంతఃకరణమునుండి వేరుపరచజాలమో అదేవిధముగా ప్రదేశకాలములను కూడ అంతఃకరణమునుండి వేరుపరచజాలమని చూపినాడు."

(విశ్వము - డాక్టర్ ఐన్‌స్టయిన్ పుట 20, 21)

మహామనీషియగు డా|| ఐన్‌స్టయిన్ తుదకు భౌతిక విజ్ఞానపరిధిని దాటి తత్త్వశాస్త్రములో ప్రవేశింపక తప్పలేదు.

భేదింపబడిన పరమాణువులనుండి మహాశక్తి ఆవిర్భవించును. నేటి ఆటంబాంబులు, హైడ్రోజన్ బాంబులను గురించి మనము వినియున్నాము. అట్లు పరమాణువులు నశింపగా వాటియందుండి ఆవిర్భవించు మహాశక్తి అఖండమగు తేజోతరంగముగా రూపొందును. అట్టి తేజము సయితము క్రమక్రమముగా చల్లారి అదృశ్యమగును. ఏలయన తేజోరాశికిని, అది అస్తమించిన పిమ్మట ఆవహించెడి అఖండాంధకారమునకును, ఏది ఆధారమై యుండునో అదియే పరబ్రహ్మము. అట్టి బ్రహ్మమునందే మహాశక్తి ఇంచుమించుగా లీనమై పోవును. బ్రహ్మమునందు లీనమగు ననుటకు మారుగ భౌతిక విజ్ఞానవేత్తలు శక్తి (తేజము) అదృశ్య మగునందురు. తిరుగా ఎప్పుడో ఒకప్పుడు బ్రహ్మమునందు లీనమైన ఆ మహాశక్తి క్రమక్రమముగా ఆవిర్భవించి విశ్వాకృతి నొందును.

శక్తి విశ్వమంతటను సమముగ వ్యాపించియున్నది. కాని అది పరబ్రహ్మము వలె విశ్వాతీతము కాదు. పరబ్రహ్మము విశ్వాంతర్యామి. విశ్వాతీతుడు కూడ. శక్తి అఖండతయును, సర్వవ్యాపకత్వమును, విశ్వము యొక్క హద్దులకు లోపలనే అని అర్థము. శక్తి సర్వత్ర సమముగ నున్నను ఉపాధులను బట్టి ఒక్కొక్కచోట అధికముగ విజృంభించునని వేదాంతపంచదశియందు (13 వ ప్రకరణమున) చెప్పబడినది భౌతిక విజ్ఞానవేత్తలు సయితము మఱొకవిధముగ శక్తిసమవిభాగ సిద్ధాంతమును (Equipartition of Energy) అంగీకరింతురు.

ద్రవ్యశక్తి ఏవిధముగా పరశివబ్రహ్మమునందు లీనమయ్యెనో ఆరీతికి (అపవాదరీతిగ) వ్యతిరేకముగ తిరిగి మహాంధకారమును భేదించి తేజోరాశి (మహాశక్తి) ఆవిర్భవించు నను ప్రశ్నకు సమాధానము* లేదు. అది పరమేశ్వరుని లీల. అట్లు సర్గమున ఆవిర్భవించిన మహాతేజమునందు ఒక బిందు మాత్ర స్వరూపము మనము చూచుచున్న సూర్యగోళము. సూర్యుడు ప్రకాశించుచున్నాడనగా-ప్రతి సెకండునకు 40 లక్షల టన్నుల బరువు తగ్గిపోవుచున్నాడు. ఇట్లు ద్రవ్యము నశించి దానివలన అపారశక్తి యుదయించుచు అనంతకోటి జీవరాసులకు ఆహారపదార్థముల ఉత్పత్తికి అవసరమైన శక్తియు, విద్యుత్ (Electricity) మొదలగు శక్తులకు మూలమును అగుచున్నది.

పరమాణువు ఇంచుమించుగ ఖాళీగా నున్నదని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. పరమాణు గర్భమునందున్నదే బ్రహ్మనందమునందున్నది. బ్రహ్మాండమునందలి మూలశక్తియే పిండమున కుండలినీ శక్తిగా నున్నది. శ్రీ జ్ఞానేశ్వరులు శివ శక్తులను గుఱించి చెప్పిన వాక్యములు జ్ఞప్తికి వచ్చును. వారిట్లు చెప్పిరి : "త న్నివాసంబు నెదుట విశాల విశ్వంబు సహిత మల్పంబై కానవచ్చుచుండ వారలు సర్వకాలంబుల బరమాణువునందు మిక్కిలి సుఖంబుండుదురు." (అను. 1-11) గ్రహములు సూర్యుని చుట్టును తిరుగుచుండునట్లు పరివృత్తియ ఎలెక్ట్రానులు పరమాణుకేంద్రము చుట్టును తిరుగుచుండునంట. ఈ వాక్యములు విన్నప్పుడు ఈశ్వర విలాసము ఆశ్చర్యమును గొలుపును.

శక్తి శబ్దరూపిణి, శబ్దము (ధ్వని) విద్యుద్రూపమున మారుటయు, తిరిగి శబ్దరూపమును పొందుటయు గ్రామఫోనుఫిలిమ్ మొదలగు వాటివలన మనకు

* జగదుత్పత్తికి మూలకారణము పరమాణువులను సిద్ధాంతమును శ్రీ శంకరాచార్యులవారు అంగీకరింపలేదు. వ్యావహారిక జగత్సంబంధమగు సర్గ ప్రళయములను అంగీకరించిరి.

అనుభవమున నున్న విషయమే. ఇది విజ్ఞానము (Science) యొక్క ఫలితము. శబ్దము అక్షరరూపము. మన పూర్వులు శబ్దజాలమునుండి బీజాక్షరములను మంత్రములను కనిపెట్టిరి. (ఉద్ధారణ చేసిరి). అట్టి మంత్రములనుండి శక్తిని పొందిరి. శక్తి మంత్రరూపిణి. ఇట్లు పాశ్చాత్యులు శక్తిని భౌతికమార్గమున సాధింపగ భారతీయులు పిండమును శోధించి వివిధ సాధనములచే శక్తిని ఆవిష్కరింపజేసి మహిమలను మోక్షరూపమగు నిరతిశయ శాంతిని పొందగలిగిరి.

మానవుని శరీరమునందు ప్రపంచమునందు గల సకలవిధ శక్తులున్నవి. ఆ శక్తులకు కేంద్రము కుండలినీశక్తి. మానవ శరీరమందు ఇనుమే గాక, అయస్కాంతము మొదలగు లోహములు కూడ గలవు. రాగిని బంగారుగా మార్చు శక్తియు కలదని యిటీవల ప్రత్యక్షముగా చూచినవారు కలరు. వాటిని తపస్సువలనను, మంత్రోపాసనా విధానము వలనను ఆవిష్కరింప జేసికొనవచ్చును. వాటిని ఆవిష్కరింపజేయు సంకల్పము ఎంతమాత్రము లేకున్నను సిద్ధ పురుషుని సాధనమార్గమున వాటంతట అవి బహిర్గతము లగును. ఉదాహరణమునకు:-

శ్రీ రమణమహర్షి శిష్యుడును, గొప్ప తపశ్శాలియు, గణేశుని అవతారమని చెప్పబడు కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని తిరువణ్ణామలై గుహలో తపమాచరించుచుండ ఉపాసన దేవతాశక్తిని ఆయన శరీరము భరింప లేక పోవుట వలననో, మరే కారణమువలననో కపాలభేదన మైనది. అప్పుడు దాదాపు ఆయన మృత్యుముఖమున నున్నట్టి స్థితిలో శ్రీ రమణమహర్షి కపాలములను అతికించి బ్రతికించిరి. అప్పటినుండి గణపతి మునిని పాదుకలు ధరించక భూమిపై అడుగిడరాదని మహర్షి చెప్పిరి.

శ్రీ గణపతి కలకత్తా సమీపమునందలి ఖడ్గపురము నుండి స్వగ్రామమగు కలువరాయికి వచ్చినపుడు ఒక కార్యార్థము అర్ధణా రాగినాణ్యమును (పూర్వము రూపాయ పరిణామము కల దానిని) చేతిలో పట్టుకొనియుండిరి. చేతిలోని నరములు లాగుటచే, చెమటపట్టి బాధగా నున్నందున, రాగినాణెమును కుమారుని చేతికిచ్చి గోడపై పెట్టుమనిరి. తరువాత దానిని చూడగా అది బంగారు నాణెమై యుండెను.('నాయన.' పుట. 701) ఈ సంగతి ఖడ్గపురమునకు గణపతి పోయినపుడు అక్కడి శిష్యుల కెట్లో తెలిసి అదేవిధమగు రాగినాణెమును

గురువుచేత నుంచిరి. కొంచెము సేపటికి చెమటపట్టి చెమటవలన ఆ నాణెము (డబ్బు) తొలుత బూడిదరంగుగను పిమ్మట పసుపురంగుగను మారి బంగారమైనది ఇదియంతయు స్వల్పకాలమున జరిగినది. గణపతిమునిగారు ఆ బంగారు అర్ధణాను విసిరి యెచ్చటనో పారవైచిరి.

అనేక శతాబ్దములనుండి మన దేశమునను, పశ్చిమ దేశములయందును, భౌతిక శాస్త్రవేత్తలు (Scientists) స్వర్ణ సిద్ధికి అనేక పరిశోధనలు చేసి విఫలులైరి. స్వర్ణార్జన తలంపు లేకయే కొందఱు దేవతోపాసకులు ఇట్టి సిద్ధిని పొందగలిగిరి. శ్రీ గణపతిమునిగారు రేణుకాదేవి ఉపాసకులు, వారి ఉపాసన సిద్ధించినదని వారికి తెలియకయే వారి యిచ్ఛ లేకయే స్వర్ణసిద్ధి వారికి కలిగెను. దానివలన వారికి ధనమార్జింపవలయునను కాంక్షలేదు. ధన మార్జింపను లేదు.

భౌతిక శాస్త్రజ్ఞుడు నిర్ణయించిన ఆవర్తసంవిభాగములోని క్రమసంఖ్యలో బంగారము పరమాణు కేంద్రకములోని ధన విద్యుదావేశము నికరము 79 గా నుండుటచే ప్రథమవర్గములోను, పాదరసములో ధనవిద్యుదావేశము 80 లో ఉండుటచేత దీనిని ద్వితీయవర్గములోను చేర్చియున్నారు. పాదరసము యొక్క కేంద్రములో ఒక్క ఎలెక్ట్రానును చేర్చినయెడల పాదరసము బంగారమగును. బౌతిక విజ్ఞాన వేత్తలు చాలాకాలమునుండియు శ్రమపడుచున్నను ఫలితము లభింపలేదు. తామ్రము, స్వర్ణము ఒకేవర్గమునకు చెందినవైనను తామ్రముయొక్క విద్యుదావేశము (పరమాణు క్రమాంకము) 29. దాని పరమాణుభారము 63-57, స్వర్ణము 79, అని పైన చెప్పితిని. స్వర్ణముయొక్క భారము 197-20. అందువలన తామ్రము బంగారము కాదని భౌతికవిజ్ఞానుల అభిప్రాయము.

వేమ(న)యోగి రసవాదమును గుఱించి చెప్పిన పద్యమును వినుము:-

**"తల్లి చన్నుపాలు తనుబంపు పాలును**
**రుద్రవీర్యమందు భద్రపరచి**
**దాని పొడుముచేసి తామ్రంబుపై జల్లు**
**విశ్వదాభిరామ వినురవేమ.!"**

ఈ యంశ మింతటితో విరమించి గణపతిమునిగారిని గుఱించిన మఱియొక సంఘటనను వినిపింతును.

ఖడ్గపురమునందే జరిగిన మఱియొక వింత యేమన:- గణపతిగారి శరీరమునుండి విద్యుత్తరంగములు వెడలుటను శిష్యులు కనుగొనిరి. వారు దానిని పరీక్షించుటకు అచ్చట నున్న బీగము నొకదానిని గణపతిగారి శిరమునకు అడుగున్నర యెత్తున రెండు మూడు నిముసములు పట్టుకొనిన పిదప విద్యుత్ప్రయోగముచే బీగ మాకర్షణ శక్తియుతమై నట్లయినది. గుండుసూదులను సమీపమునందుంచగా ఆ బీగమాకర్షించినది. అప్పుడు వారి శిష్యులకు వారిట్లు చెప్పిరి:-

"నాయందు చాలా కాలముక్రిందటనే యుత్పన్నమైనట్టి దివ్యశరీరముయొక్క శక్తి వ్యాపారము నన్ను కేంద్రముగాగొని భ్రమణ మగుచున్న సుడివలె నున్నది. ఆ శరీరమిపుడు దేవకార్యమునకు సుఘటితమై యున్నది."
(నాయన. పుట. 707)

ఈ రెండు సంఘటనలు 1935 వ సంవత్సరం సెప్టెంబరు నెలలో జరిగినపుడు వారి శిష్యులు చూచినవారు గొప్ప విద్యాధికులు అనేకులు ఇప్పటకిని గలరు. శ్రీ గణపతిమునిగారు 25-7-1936 తేదీన భౌతిక దేహమును వీడి దివ్య దేహ ధారులైరని చరిత్రయందున్నది.

మనదేశమునందలి తత్త్వవేత్తలు కేవలతత్త్వవేత్తలే గాక మహాకవులుకూడ అగుటచేత ఆ మహాశక్తినే జగత్పితకు భార్యగను, జీవకోటిని కన్న జగదంబ గను సకలజీవులను పోషించు జగన్మాతగను పరమాద్భుతరీతుల వర్ణించియున్నారు. శక్తిని స్త్రీరూపిణి యనుటకు కారణము కూడనదియే.

ఒక స్త్రీ తన భర్తకు భోగదాయిని యగును. భర్త భౌతిక దేహము సంపూర్ణముగ నాశము నొందకుండ అతనిలోని కొంత భాగమును (అంశమును) తన గర్భమునందు దాచి భర్తకు పుత్రరూపమగు నూతన శరీరమును ప్రసాదించుచున్నది. వాడు పెద్దవాడు కాగానే, ఆ శక్తియే మఱియొక స్త్రీరూపమున భార్యయై వానికి భోగదాయిని యగుచున్నది. ఈ విధముగ ఈ గొలుసు సాగిపోవు చున్నది. పురుషుడు పుత్రరూపమున నున్నప్పుడు త్యాగమును, పతిరూపమున నున్నప్పుడు భోగమును, స్త్రీరూపమున శక్తియే ప్రసాదించుచున్నది.

మానవునకు ఇట్టి అనుభవమువలన కలిగిన వివేకబుద్ధిని భూతకాలమున ప్రసరింపజేసి శక్తితత్త్వమును తెలిసికొని భోగమోక్షములను ప్రసాదించునది శక్తియే యని మనవారు శక్తి నారాధించిరి.

పర్యవసానమేమన:- ఆధ్యాత్మిక ఆధిభౌతిక విజ్ఞానముల మధ్య గల అంతరము నశించి రెండును పర్యవసానమున నొక్కటియే యను నిర్ణయమునకు రాగలరు.

## (౧౭) సింహావలోకనము - సంగ్రహ పరిశీలనము

జిజ్ఞాసువు:- అయ్యా! శ్రీ జ్ఞానేశ్వర, శ్రీ అరవింద, శ్రీ సమర్థుల, శివ-శక్తి స్వరూపవిచారమును సింహావలోకనము చేసిన బాగుండును, అనుగ్రహింపుడు

వేదాంతి·- నీ వన్నట్లే వారి శివ-శక్తి తత్త్వములను సంగ్రహముగ సింహావలోకన న్యాయమున పరిశీలించుటయేగాక, నీ కిదివఱకు చెప్పని నూతనాంశములను బోధ దృఢమగుటకుగాను చెప్పి అంతటితో శివ శక్తుల విచారమును ముగింతును.

## శ్రీ జ్ఞానేశ్వరుల శివ - శక్తి తత్త్వపరిశీలనము

శ్రీ జ్ఞానేశ్వరులును, శ్రీ విద్యారణ్యస్వాములవారును సమకాలికులు, స్వాములవారికంటెను శ్రీ జ్ఞానేశ్వరులు వయస్సున చిన్నవారని చెప్పవచ్చును. జ్ఞానేశ్వరులవారి కాలమునకు అద్వైతమునందు శాఖ లేర్పడియుండెను శ్రీ శంకరుల మాయావాదమును త్రోసిపుచ్చినవారిలో శ్రీ జ్ఞానేశ్వరులే ప్రథములు కారు వీరికంటెను సుమారు రెండున్నర శతాబ్దములకు ముందేయుండిన యాదవమిశ్రులును, సుమారు నాలుగున్నర శతాబ్దములకు ముందే మహారాష్ట్రమున జన్మించియుండిన భాస్కరరాయలను నామాంతరము గల శ్రీ భాస్కరాచార్యులును, మఱి కొందఱును మాయావాదమును త్రోసిపుచ్చిరి. వీరు బ్రహ్మపరిణామవాదులు

భాస్కరాచార్యులవారు శ్రీవిద్యోపాసకులు. 'లలితా సహస్రనామము' లకును, 'బ్రహ్మసూత్రము' లకును వీరు భాష్యములు రచియించిరి. వీరి మతమున అచిత్తునకు (జడమునకు)ను, బ్రహ్మమునకును. భేదమును; అభేదమును, స్వాభావికమనియు ; చిత్తునకు బ్రహ్మమునకు అభేదము

స్వాభావికమనియు; భేదము ఉన్నట్లు కనబడినను అట్టి భేదము ఔపాధికమనియు చెప్పిరి. కొందఱు పండితులు చెప్పినట్లు వల్లభాచార్యులవారు క్రీ. శ. 1041 నాటివారను వాదము సరియైన దయినచో వీరును శ్రీ జ్ఞానేశ్వరులకంటెను పూర్వికులే. శ్రీ వల్లభాచార్యులు శుద్ధాద్వైతమును స్థాపించి జగత్తు మాయావిలాసము కాదనియు, పరబ్రహ్మముయొక్క లీలయనియు చెప్పిన సంగతి ఇదివఱకే తెలిపితిని.

**న్యాయదర్శనము:** జగత్తు సృష్టింపబడినదని చెప్పిన దార్శనికు లనేకులు గలరు. న్యాయదర్శనము నిరవయవ పదార్థములు సృష్టింపబడినవి కావనియు, సావయవ జగత్తు మాత్రమే సృష్టింపబడినదనియు, సర్వజ్ఞుడగు సృష్టకర్త యొకడు కలడనియు చెప్పినది.

**వైశేషికదర్శనము:** కూడ పైవిధముగ సృష్టి నంగీకరించినది కాని, సృష్టికర్త ఒకడు కలడని తొలుత అంగీకరింపక తరువాత ప్రశస్తపాదులవారి కాలమున అంగీకరించినది.

**సాంఖ్యదర్శనము:** పురుషుడు ప్రకృతి అను ద్వైత సిద్ధాంతము నామోదించి, సృష్టి ప్రకృతివలన కలిగినదని, లేదా సృష్టి ప్రకృతియొక్క పరిణామమని సృష్టివాదము నంగీకరించినది.

**పాతంజల యోగదర్శనము:** ఈ యంశమున సంపూర్ణముగ సాంఖ్యదర్శనము ననుసరించినది

**పూర్వమీమాంసా దర్శనము:** సృష్టివాదము నంగీకరించినది శ్రీ మద్రామానుజాచార్యులు ప్రకృతి వికాసము- సంకోచము, సర్గ-ప్రళయములని సృష్టివాదమును సమర్థించిరి.

**శ్రీమధ్వాచార్యులు:** సృష్టివాదులే

**శ్రీనింబార్కాచార్యులు:** బ్రహ్మపరిణామవాది వారిమతము ద్వైతాద్వైతము

**శ్రీకృష్ణచైతన్యులవారు:** అచింత్య భేదాభేదవాదులు. వీరును శ్రీ నింబార్కులవలె బ్రహ్మపరిణామరూపమగు సృష్టి వాదమును అంగీకరించిరి.

**శైవులు:** సృష్టి శివ-శక్తుల పరిణామమని సృష్టివాదము నంగీకరించిరి.

**శాక్తేయులు:** శక్తి పరిణామవాదులు. సృష్టి నంగీకరించిరి.

శ్రీ విద్యాతత్త్వము: అద్వైతమే. ఈ తత్త్వము ననుసరించి శివుడు నిర్గుణ చైతన్యము. ఆయనయందు అంతర్లీనమైయున్న విమర్శరూప* శక్తిని గుఱించి (తృతీయభాగమున) తెలిపియుంటిని. శ్రీ విద్యాతత్త్వముతోను, కాశ్మీర శైవముతోను, జ్ఞానేశ్వరుల వారిమతమునకు దగ్గర సంబంధమున్నది. అదియుగాక, శ్రీ జ్ఞానేశ్వరులు యోగవాసిష్ఠము నందు తెలిపిన అజాతవాదమును తెలిసికొనియుంటిరి. ఈ విధముగా శ్రీ జ్ఞానేశ్వరుల కాలమునాటికి వ్యాప్తియందున్న వివిధ సిద్ధాంతములను ఆయన తన మనస్సునందుంచుకొని వారి సిద్ధాంతమును రూపొందించియుందురని మన మూహింపవచ్చును.

శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిన శివ-శక్తి స్వరూపతత్త్వము ఇట్టిదని నిరూపించి చెప్పుట మిక్కిలి కష్టమైన కార్యము. శ్రీ జ్ఞానేశ్వరులు, వారి వాదము సరియైనదని నిరూపించుటకు అసమాన ప్రజ్ఞతో, విశేష ప్రయాసతో, అనేక ఉపమానములను చూపి బోధించిరి. నేను ఇదివఱలో ఉదాహరించిన వారి వాక్యముల అర్థమును మఱల పరిశీలించుట ప్రస్తుత కర్తవ్యము.

అద్వితీయమగు ఆత్మ శుద్ధ జ్ఞానస్వరూపము. ఆత్మ తన్ను తాను చూడజాలదు. ఆత్మకు తన్ను తా నాలోకింప వలయునను సంకల్పము కలిగెను. ఆ సంకల్పమే దర్పణమై అందు ప్రతిఫలించిన ప్రతిబింబము ద్వారా ఆత్మ తన్ను తాను చూడగలిగెను. తన్ను తానాలోకించుట (స్వసంవేద్యత్వము) ఏది కలదో అదియే విమర్శరూపమై యున్నది. ప్రకాశ రూపమే సత్యజ్ఞానమై యున్నది. సత్యజ్ఞాన మనగా : సత్యము+జ్ఞానము=సత్యజ్ఞానము. ఈ సత్యజ్ఞానములయందు సత్య మనునది త్రికాలాబాధితమగు శివుడు. జ్ఞానము విమర్శరూప మగుటవలన శక్తి సన్మాత్రమునందున్న స్వసంవేద్యత్వమే విలాసము.** నామరూపాత్మక ప్రపంచ మంతయు జ్ఞానవిలాసమే. అదియంతయు ఆత్మయొక్క లీలయే.*** అన్యమేమియును లేదు. సూర్యుడు

* "విమర్శ అనగా పరబ్రహ్మముయొక్క సహజ పరిభ్రమణమని భాస్కరరాయలు నిర్వచించె" నందురు. అవిద్య యని వేదాంతు లందురు.

** విలాసము=క్రీడ, ఆట్లాడుట, లీల.

*** "లీల" అనగా ఏమి? శ్రీ శంకరాచార్యులవారు ఇట్లు చెప్పిరి:-

"లీలలు అన్యప్రయోజనరహితమగు వ్యాపారములు కావచ్చును. లేక, తనయొక్క హర్షమువలన కలుగుచున్నవి కావచ్చును. లేక, తత్కాలోచితములగు నవరసాంగీకార సమయమందలి ఉచితభంగి విశేషములు కావచ్చును." (లలితాత్రిశతీభాష్యము. 71)

ప్రకాశించుచున్నాడు. ఇచట 'సూర్యుడు' సత్ పదార్థము ఆయన ప్రకాశము 'చిత్తు' (జ్ఞానము). జ్ఞానమే విశ్వాకారమున నున్నదియే. ఇది సంగ్రహముగా శ్రీ జ్ఞానేశ్వరుల సిద్ధాంతము

నామరూపములు ఎచటనుండి వచ్చెను? అను నీ ప్రశ్నకు శ్రీ జ్ఞానేశ్వరుల సమాధానము ఇట్లున్నది:- "రూపాభావంబున భాసమానుండై యెసంగు పతిని, స్వీయంబగు మనోహరాకృతిం గూడ నొక్కట బరిశీలించు న ద్దేవి తా లజ్జాశీలయై విశ్వాధిక నామ రూపంబు లనియెడు భూషావిశేషంబులచేత బ్రభు నలంకృతుం గావించె." (అను. 1-30)

నామరూపరహితంబగు సత్పదార్థమునందు జ్ఞానశక్తి తన సామర్థ్యముచే నామరూపాత్మక ప్రపంచమును సృష్టించినదను తాత్త్వికాంశమును - తన భర్త (శివుడు) దిగంబరుడై యుండుట చూచి భార్యయగు శక్తి (జ్ఞానము) మనోహరంబగు తన యాకృతిని పరిశీలించి సిగ్గు చెందినదై పతిని వస్త్రభూషణాదులచే అలంకరింపజేసినదని కావ్యధోరణిలో రూపకల్పనము చేసి చెప్పిరి. ఈ విధముగ చెప్పిన అర్థమునే వేఱొకవిధముగ ఇట్లుచెప్పిరి:- "స్థితియుతుండయ్యు నత్యంత సూక్ష్మాకారంబున వర్తించుటంజేసి యద్దేవుండు దృగ్గోచరుండు కానేరకుండు, ***మఱియు న ద్దేవి కటాక్షోపలబ్ధిచే నతండు విశ్వాకారంబున ప్రకాశించుచున్నవాడు." (అను. 1-35)***

మఱియొకవిధమైన అర్థమునుకూడ చెప్పవచ్చును. ఎట్లన:- దిగంబరుడైన శివుడే మన యనుభవమున గాఢనిద్ర. శక్తి జ్ఞానరూపిణి, (చిదాభాస సంబంధమగు జ్ఞానము,) అని చెప్పిరి కదా? గాఢనిద్రయందు జ్ఞానము కలుగగనే స్వప్నమో, జాగ్రత్తయో కలుగును. జాగ్రత్త కలుగుట యనగా నామరూప ప్రపంచము గోచర మగుట. అట్లు గోచరమైన నామరూపములే వస్త్రభూషణాదులు. అట్లు సుషుప్తికి (శివునకు) వస్త్రభూషణాదుల నలంకరించుటయే శివుడు విశ్వాకారమును ధరించుట. అట్లు కాదేని యీ క్రిందివిధముననైనను అర్థము చెప్పవచ్చును. ఇచట మనము గమనింపవలసిన యంశమేమన "మాయాప్రభావమున మనము పరబ్రహ్మమునే జగద్రూపమున చూచుచున్నాము" అని శ్రీ శంకరులవారు చెప్పిన వాక్యమునందలి యర్థమునకును, "అ ద్దేవి కటాక్షోపలబ్ధిచే నతండు విశ్వాకారమున ప్రకాశించుచున్నాడు" అని

శ్రీ జ్ఞానదేవులు చెప్పిన పై వాక్యములయందలి అర్థమునకును భేదమించుకయు గోచరింపదు.

శైవతత్త్వమునందు శివుడును, శక్తియును కలిసియే జగద్రూపమును పొందిరని యున్నది. క్షీరసాగర తీరమున శివుడు పార్వతీదేవి చెవిలో చెప్పిన రహస్యమును మత్స్యేంద్రనాథులు విని దానిని లోకమున ప్రచారములోనికి తెచ్చిరని గదా శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిరి. కనుక, వారి మతము శివ శక్తులయొక్క మేళనమే యను తత్త్వము ఆ కథయందే గర్భితమై యున్నది.

సృష్టియే జరుగ లేదని, ఆత్మయొక్క లీలయే జగద్రూపమున నున్నదని చెప్పుటవలన ఈ మతమును అజాతవాదమనిరి. జ్ఞానమే (ఆత్మవిలాసమే) జ్ఞేయరూపమున నున్నందున దృష్టి-సృష్టివాదమనియు చెప్పిరి. జ్ఞానము సత్పదార్థమునకంటె భిన్నము కానందున *విశ్వము సద్రూపమే (శివ స్వరూపమే) గాని వేఱుకాదనిరి.*

జిజ్ఞాసువు:- అయ్యా! శివశక్తుల యందు విశ్వాకారమున నున్నది శివుడే యైనచో శక్తియొక్క యునికికి చోటెచ్చట?

వేదాంతి:- శ్రీ జ్ఞానేశ్వరు లిట్లు చెప్పిరి:-

(1) శ్లో॥ నిర్గుణం నిర్వికారం చ సత్తా మాత్ర స్వరూపకమ్।

**యత్తత్ప్రకృతి యోగేన విశ్వరూపేణ భాసతే॥ (అమృ. 1-35)**

"వి. దుం॥ ఏ పరమాత్మస్వరూపము గుణత్రయ రహితమై నామరూపాత్మక దృశ్యవికారశూన్యమై కేవలము సద్రూపమై భాసించుచున్నదో, *అట్టి పరమాత్మ స్వరూపము ప్రకృతియొక్క స్వతంత్రశక్తి నాశ్రయించి తానే ప్రపంచాకారమున భాసించుచున్నది."* (వి. దుం పుట. 98)

(2) "కనుకనే బాహ్యదృష్టి ననుసరించి జగద్విలాసము గోచరించుచున్నప్పటికిని జగద్రూపమున పరమాత్మయైన తానే ప్రకాశించుచున్నాడు. ఈ కారణమువలన *చిచ్ఛక్తివిలాసము ననుసరించి ప్రపంచాకృతిని నానాత్వము గోచరించుచున్నది. ఒకడైన తానే గాని వేరుకాదు."*

(వి. దుం. పుట. 94)

(3) శ్లో॥ "సర్వ శూన్యస్య నిష్కర్షో యః పుమా ననయాకృతః।
భర్తృ సత్తా విశేషేణ శక్తిర్భార్యా వినిర్మితా॥" (అమృ. 1-27)

"వి. దుం॥ సద్రూపుడైన పరమాత్మ సర్వద్వంద్వ విముక్తుడై తనంతట తాను నిర్వికారుడై యున్నను శక్తి స్వరూపమైన ప్రకృతిచేత, పురుషుడను పేర పిలువబడుచున్నాడు. పురుషసత్తాను ఆశ్రయించియే విశేషప్రకాశమున భార్యారూపమైన శక్తి నిర్మింపబడినది. కనుక, నీ సత్తాస్ఫూర్తుల తాదాత్మ్యము ననుసరించియే బాహ్యమున ప్రకృతి పురుషద్వంద్వ మాకర్షింపబడు నవకాశము కలిగినదని నిర్ణయము." (వి దుం. పుట. 86)

(4) "అందువలన సన్మాత్రమైన ఆత్మ సర్వశక్తి సమన్వితమై పురుషుడని చెప్పబడుచున్నది. అది శక్తి సంపన్నమైన దగుటచేత నాశరహితమై స్వయంప్రకాశమై యున్నది." (వి. దుం. పుట. 86)

ఏ కారణము చేతనైన నేమి నామరూపాత్మక జగద్రూపమున గోచరించుచున్నది సన్మాత్రుడైన శివుడేయనియు, శక్తియని పిలువబడునది శివునకు సృష్టికార్యమున జగద్రూపమును పొందుటయందు, లేదా, తోచుటయందు సహాయకారియనియు పై నాలుగంశములయందలి సారాంశము. ***అయినను, శక్తియే జగద్రూపమున నున్నదను నర్థమిచ్చు వాక్యములు సహితము లేకపోలేదు.***

శ్రీ జ్ఞానేశ్వరులు సత్తా స్ఫూర్తులనే శివశక్తు లని చెప్పిరి. ఇచట సత్త వేఱు, స్ఫూర్తి వేఱు, అను ద్వైత భావము గోచరించుచున్నది. శ్రీ జ్ఞానేశ్వరులు ద్వైతి కారు.

ఇంతవఱకు చేసిన వివేచన వలన తెలిసిన, సారాంశమేమన - పరమాత్మ సద్రూపుడని (అనగా కలిమి మాత్రమే స్వరూపముగా కలవాడని) అతడే శివుడని, అతడు తన శక్తితో కలిసినపుడు పురుషుడని పిలువబడుచున్నాడని, సద్రూపుని పురుషుడని వ్యవహరించినపుడు అతని స్ఫూర్తి ప్రకృతియని పిలువబడునని, ఆ ప్రకృతియే జ్ఞానమని (వృత్తి జ్ఞానమని) శివునియొక్క భార్యగా-చెప్పబడినదని, ఇట్టి భార్యా భర్తలు వారిలో వారు అన్యోన్య ప్రేమ చూపుటవలన ప్రపంచమను సంతానము కలిగినదని, లేదా ఆ దంపతులే ప్రపంచాకృతిగా పరిణమించిన వారని తేలినది.

ఇందునుగుఱించి నా యభిప్రాయ మేమన? :- ఏది నిత్యసత్యమై త్రికాలాబాధితమై మార్పులేనిదై, నామరూపరహిత మైనదై, ఆదిమధ్యాంత శూన్యమైనదై యున్నదో అదియే సద్రూపమని చెప్పబడును. అట్టి సద్రూపము కేవల ప్రజ్ఞాన ఘనమై (చిద్రూపమై) యుండవలయునే గాని, జడమై తన్ను తా నెఱుగుటకు అన్యసహాయ మపేక్షించునదియై యుండరాదు. సత్తును జడమని చెప్పితిమేని అట్టి సత్త్వ పదార్థమొకటి కలదని లోకమున ప్రతీతియే యుండదు. అట్టి సచ్చిద్రూపమైన ఏకవస్తువునుండి సత్తు+చిత్తు అని సద్రూపమునుండి చిద్రూపమును వేఱుచేయుటకు వీలులేదు. లోకమున వేఱువేఱగు రెండు భిన్నవస్తువులు ఒకానొక సమయమున ఒకటిగా కలిసియుండెనేని వాటిని కొంతకాలమునకు (ఒకానొక సమయమున) ఏదేని సాధనములతో వేఱుచేయవచ్చునేమోగాని అఖం డాద్వితీయ వస్తువునందు విలాసమాత్రముగ నైనను వేఱుపాటు చెప్పగూడదు. నేను చెప్పిన యీసిద్ధాంతమును "విజయదుందుభి" అంగీకరించి యీ క్రింది వాక్యములు చెప్పక తప్పినదికాదు. అవి యేవనగా:-

"*ప్రకృతి పురుష భావకల్పన మిథ్యామాత్రమగుట చేత నది మిషచే వర్తించుచున్నది గాని వేరుకాదు*". (వి. దుం. పుట. 89)

"*వాస్తవమునకు ప్రకృతి పురుషు లిద్దరు లేనే లేరు. ఉన్నట్లు తోచిన నా రెండును ఒకటియేకాని రెండు లేవు*". (వి. దుం. పుట. 87)

"*ఏది ప్రకృతిశబ్దముచేత చెప్పబడుచున్నదో అది పురుషుడేకాని వేరు కాదు*". (వి. దుం. పుట. 83)

"*కావున నాయందు శక్తియను సంభాషణ కూడ నౌపచారికమేకాని వాస్తవము కానేరదు. వాస్తవమును విచారింపగా ఏకాత్ముడనైన నేనే సర్వత్ర ప్రకాశించుచున్నాను*" (వి. దుం. పుట. 80)

శ్రీ జ్ఞానేశ్వరు లిట్లు చెప్పిరి :- "ఇవ్విధంబున *సంపూర్ణ విశ్వంబునుం గేవల జ్ఞానపదార్థస్పందనం బై వర్తింపుచుండ* నయ్యాజ్ఞానంబును గూర్చి సిద్ధాంతము జేయ బ్రబలాసంగత విషయంబై యొప్పుచుండదె"

(అను. 7-277)

ఇచట ప్రపంచాకృతిగ భాసించునది శక్తియను అర్థమిచ్చుచున్నది. మఱి "నయ్యాజ్ఞానము" అనునది మాయనుగూర్చి చెప్పబడినదని గ్రహింపవలయును.

ఇంకొక విషయమేమన -

విశుద్ధ జ్ఞానముయొక్క లీలయే శివ శక్తు లైనదని శ్రీ జ్ఞానేశ్వరుల సిద్ధాంతము అనగా : శివశక్తులకంటె పరమునందు విశుద్ధజ్ఞాన మనబడు పరబ్రహ్మ మున్నట్లును, శివశక్తులు ఒకానొక సమయమున (నిర్వికల్ప సమాధియందు) ఆత్మానుభూతియందు (విశుద్ధజ్ఞానమునందు) లయ మగుదురనియు శ్రీ జ్ఞానేశ్వరుల భావము.

ఇంతవఱకు మనము చర్చించిన దానినిబట్టి *విశ్వాకారమున నున్నప్పుడు శివుడనిగాని శక్తియనిగాని చెప్పవచ్చును. లేదా, శివశక్తు లిరువురు జగదాకారమున నున్నారని చెప్పినను తప్పుకాదు.* ఇట్లు చెప్పుటకు వారి వాక్యములయందు ఆధారములున్నవి. కొన్నింటిని మాత్రమే చెప్పితిని. నీ ప్రశ్నకు అంతమాత్రము సమాధానము చాలు ననుకొందును.

శ్రీ జ్ఞానేశ్వరులు లోకవ్యవహారములయందును, శాస్త్రములయందును గల ద్వంద్వముల నంగీకరింపలేదు. ఎట్లన :- రాత్రింబవళ్లు, సుఖదుఃఖములు, జ్ఞానాజ్ఞానంబులు, నిద్రా జాగరణములు అను మొదలగు ద్వంద్వంబులయందు రెండు లేవనియు - ఉన్నది ఒక్కటియే యనియు చెప్పిరి. ఆ వాక్యముల సారాంశ మిట్లుండును:-

'రాత్రి నశించుచు దివారూపంబును బొందు' (అను. 1-46)

'సుఖము నశించుచు దుఃఖరూపంబుగ పరిణమించు, అజ్ఞానము నశించుచు వివేకరూపంబున శేషించియుండు. (అను. 3-26),

'నిద్ర అంతమొందుచు జాగ్రద్రూపమున శేషించు'.

పై సిద్ధాంతమును పెద్ద లనేకులు అంగీకరింపలేదు.

శివుడు కనబడునపుడు శక్తియు, శక్తి గోచరించునపుడు శివుడును, కనబడరు. దీనిని శ్రీ జ్ఞానేశ్వరులు వారి కావ్యభాషలో నిట్లు చెప్పిరి:- శివుని

శక్తియు, శక్తిని శివుడును ఒకరి నొకరు మ్రింగి తిరిగి యుద్గీర్ణించుకొనుచుందురు (అను. 1-3) దీని భావమే పైన చెప్పిన జాగరణ సుషుప్తులు మొదలగునవి.

జిజ్ఞాసువు.- లోకమున చిజ్జడము లనుద్వయము తోచుచున్నది కదా? శివ శక్తులలో చిత్ ఎవరు? జడమెవరు?

వేదాంతి.- వేదాంతము ననుసరించి ప్రకృతి జడము, పురుషుడు చైతన్యము. జడమనునది మిథ్య, పురుషుడు సత్యము. శ్రీజ్ఞానేశ్వరుల మతమున "ఒకటైన పరమాత్మ చిజ్జడములుగ భాసించుచున్నది" అనిరి (వి దుం. పుట. 102)

"పరమాత్మయందు చిజ్జడములు వేరువేరుగా నున్నవని జల్పవాదము చేయ దగదు" అని చెప్పిరి (వి. దుం. పుట. 103)

జిజ్ఞాసువు:- శ్రీ జ్ఞానేశ్వరుల తత్త్వము ననుసరించి జగత్తు తథ్యమా? మిథ్యమా?

వేదాంతి:- శ్రీ జ్ఞానేశ్వరుల విషయమున నిది చాల చిక్కైన ప్రశ్న. వారి యీక్రింది వాక్యములవలన జగత్తు సత్యమో, మిథ్యయో మనమూహింపవలయును -

"కావున ఈ కల్పింపబడిన ప్రపంచము అధిష్ఠానమైన చైతన్యసత్తా లేక సిద్ధిలేదు. అట్టియెడ ఆరోపిత జగత్తును చూచి యిదియే *సత్యమని నమ్మి* అధిష్ఠానమును మరచుట *భ్రాంతియే* కాని వేరుకాదు"

(వి. దుం. పుట. 90).

"ఎచ్చట ప్రకృతి పురుష లనుభేదము లేక ఒకటైన పరమాత్మయే యుండెనో అచట సృష్టి విలాసరచన యనునది లేనేలేదు. కనుక జగత్తు *మిథ్యయని పెద్దలు వచించిరి."* (వి. దుం. పుట. 95)

"ప్రకృతి పురుష లనుమిషచేత అద్వైతాత్మయే నిరూపింపబడుచున్నది. ఈ కారణము ననుసరించి స్వరూపము సచ్చిదానందమని పిలువబడుచున్నది. *దీనియందు జగన్మిథ్యాత్వ మనాయాసముగనే సిద్ధించుచున్నది".*

(వి. దుం. పుట. 121)

*"తనయందు కల్పిత సాక్షిత్వ మంగీకరించినంత మాత్రమున జగత్తు సత్య మగుటకు వీలులేదు".* (వి దుం. పుట. 134)

ఇచట గమనింపవలసిన యంశ మొకటి కలదు. ఏదన :- శ్రీ జ్ఞానేశ్వరుల గ్రంథ వ్యాఖ్యానమునందు (విజయదుందుభి యందు) ప్రపంచము మిథ్యయని పలుమార్లు చెప్పబడియున్నది ఇచట మిథ్యాశబ్దమున కర్థము *ప్రపంచము వంధ్యా పుత్రునివలె లేనేలేదనిరి.* శ్రీ శంకరులు ప్రపంచము వంధ్యా పుత్రునివలె లేనేలేదనిరి. శ్రీ శంకరులు ప్రపంచము మిథ్యయనుట యందు పై అర్థమునకు విరుద్ధము. ఎట్లనగా.- "సదస ద్విలక్షణత్వం మిథ్యాత్వం"- ఉన్నది లేనిది అని చెప్పుటకు వీలు లేనిది గనుక (అనిర్వచనీయ మగుటచే) మాయను దాని కార్యమగు జగత్తును మిథ్యయని మిథ్యకు శ్రీ శంకరుల నిర్వచనము. ఈ యంశము విపులముగా ఇదివఱలో చెప్పియున్నాను.* శ్రీ జ్ఞానేశ్వర విరచిత "అమృతానుభవ" వ్యాఖ్యాతలచే గ్రంథారంభమున ***"మాయావాద ఖండనేన అజాత సిద్ధాంత ఉత్కృష్ట రీత్యా ప్రతిపాదితో౽స్తి"*** అని ఉపోద్ఘాతమున వ్రాయబడినది అని శ్రీ కలగ ఆంజనేయశాస్త్రిగారు వ్రాసియున్నారు.

మూలగ్రంథమగు అమృతానుభవమునందు మాయావాద ఖండనము చేయ (లే)క పోవుటయేగాక తుదకు వారిచే మాయావాదమే పరోక్షమున అంగీకరింపబడినది.

శ్రీ జ్ఞానేశ్వరుల దర్శనమును పరిశీలించిన, వీరి వాదమునకు జగన్మిథ్యాత్వ వాదము సరిపడదని నాయభిప్రాయము. సత్యమైన విశుద్ధజ్ఞానము యొక్క స్పందనమే జగద్రూపమున నున్న దనిరి. సత్యమైన వస్తువుయొక్క స్పందనముగాని, విలాసముగాని సత్యమే కావలయును గాని మిథ్య కాజాలదు. నా యభిప్రాయమును దృఢపరచు శ్రీ అరవిందుల వాక్యము లివి.-

"నా ఆత్మయు పరమాత్మయు సత్యమైనపుడు, వీని నుండి జనించు నాతలంపులు, భావములు మిగత నా అన్ని శక్తులు అసత్యములు కానేరవు. అటులనే ఆత్మను ధరించి అందులో నివసించు నాశరీరము నిజమే కాని, శూన్యము కానేరదు. సారములేని వట్టినీడ కానేరదు" (జ. త. ప పుట 39) అని స్పష్టముగ చెప్పిరి. శ్రీ అరవిందుల వాక్యములు సూటిగా జగన్మిథ్యావాదమును ఖండించుచున్నవి. మఱియు,

---

* బ్రహ్మజిజ్ఞాస 1 భాగము 8వ ప్రకరణము. జగత్తు మిథ్య అను 4వ అధ్యాయము

శ్రీ అరవిందు లిట్లు చెప్పిరి :- "జగత్తు భ్రాంతి కాదు. ఆధార రహితమైన క్షణభంగురమైన గోచరము కాదు. *"సర్వం ఖల్విదం బ్రహ్మ"* నీవు సత్యమే. పరమసత్య మెంతటి సత్యమో ఇది అంతటి సత్యము. బ్రహ్మమే సర్వము అయినాడు. అందుచే సర్వము సత్యమే" అని తెల్పిరి.

(అరవిందుల సాధన సమన్వయము. పుటలు 7-8)

శ్రీ జ్ఞానేశ్వరులు సద్రూపుడగు శివుడు విశ్వాకారమున నున్నా డనినందున జగత్తు సత్యమేగాని, మిథ్యకాదు, భ్రాంతికాదు అని చెప్పినను తప్పుకాదు. కాని వ్యాఖ్యాతలు జగత్తు *మిథ్య* యని అనేక పర్యాయములు స్పష్టముగ చెప్పిరి.

"విశ్వంబనియెడు విశాలగృహంబున వాసంబుండు వార లయ్యిరువురు మాత్ర మనంజెల్లు." (అను. 1-13)

శ్రీ జ్ఞానేశ్వరుల దర్శనమును సూక్ష్మముగ పరిశీలనము చేసిన పిమ్మట విశ్వాకారమున నున్నది శివ శక్తు లిరువురని సిద్ధాంత మగుచున్నది. కొన్ని యంశములయందు శ్రీ జ్ఞానేశ్వరుల మూలగ్రంథముతో (అనుభవామృతముతో) విజయ దుందుభి వ్యాఖ్యానమునకు సమన్వయము కుదురుటలేదు. అవి రెండును భిన్నమార్గముల నడచినవి. ఉదాహరణమునకు:-

"నిరుపాధికంబును విశ్వంబున కాదికారణంబునై దీపించు న ద్దేవీ దేవస్వరూపంబున కిమ్మాడ్కి భక్తియుక్తంబుగ వందనము గావించువాడ."
(అను. 1-1)

నిరుపాధికులగు శివశక్తులను మిథ్య యనరాదు. వారు నిత్యులే. ఒకప్పుడు విశుద్ధజ్ఞానమునందు లీనమైనను, మఱల మఱల అందుండి వెడలుచున్నారు. వా రిరువురు కారు, ఒక్కరే. ఆ ఒక్కరు విశుద్ధజ్ఞానముకంటె భిన్నులు కారు. ఇట్లుండ జగదాకారమున నున్నది శివుడైనను, శక్తియైనను విశ్వము మిథ్య యెట్లగును? కనుక జగత్తు మిథ్య కాదని చెప్పుటకు మూలగ్రంథమందు కొన్ని వాక్యము లున్నవి. వ్యాఖ్యానమునందు అనేకచోట్ల విశ్వము మిథ్య యనియే యున్నది. జగత్తు సత్యమనుట నా యభిప్రాయము కాదు. ***జగత్తు సత్యమను అర్థమిచ్చు వాక్యములు శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పియున్నారను నా యభిప్రాయమును మాత్రమే వ్యక్త పరచితిని.***

జిజ్ఞాసువు:- జ్ఞానము (శక్తి) విశ్వాకారమును పొందినదని చెప్పుటకంటె ఆత్మయే (శివుడే) విశ్వాకారమును చెందెనని చెప్పిన శివునకు వికారము సంభవింపదా?

వేదాంతి:- శ్రీ జ్ఞానేశ్వరు లిట్లు సమాధానము చెప్పిరి:-

"ఆత్మయే తత్స్వహజస్థితి చెడని రీతిగా ద్రష్టృత్వ దృశ్యత్వాదులగు సమస్తము కలిగించె" నని చెప్పిరి. (అను. 7-255-256)

ఆత్మకు అట్టి పరిణామమువలన వికారము సంభవింపదని శుద్ధాద్వైతమత స్థాపకులగు వల్లభాచార్యులవారును చెప్పియున్నారు. వీరేగాక ఆత్మ అవికృత పరిణామవాదమును అంగీకరించినవారు మఱికొందరు గలరు కాని ఇచట ఒక విషయము జ్ఞప్తియం దుంచుకొనవలెను. శ్రీ జ్ఞానేశ్వరులవాదము బ్రహ్మపరిణామవాదము కాదు. అదియే పైన చెప్పిన వారితత్త్వములకు, జ్ఞానేశ్వరులవారి తత్త్వమునకు గల భేదము.

అటు మాయ నంగీకరింపక, పరబ్రహ్మమే జగమును సృష్టించెనని చెప్పిన నెదుర్కొనవలసిన చిక్కులను తప్పించుకొనలేక, ఈ రెండింటికంటె భిన్నమగు మూడవ మార్గము ప్రాచీన వేదాంత శాస్త్రములయందు చెప్పియుండనందున తమ ప్రతిభ నుపయోగించి శ్రీజ్ఞానేశ్వరులు ఈ నవీన మార్గమును కనుగొనిరని తోచుచున్నది. కాని యీ మార్గమునందున్న సంశయమేమన శుద్ధజ్ఞానస్వరూపమగు ఆత్మను సూర్యునితో పోల్చి "సూర్యుడు అతని కిరణజాలము" అని రెండుగా చెప్పి (అను 1-24; 25) సూర్యుడే శుద్ధబ్రహ్మము, అతని వెలుగే జగత్తుగా (శక్తిగా) చెప్పినప్పుడు శివ శక్తులను ఈద్వంద్వమును ఇచట కొనిరా నవసరమేమి? అను సంశయమును తొలగించుకొనవలసి యున్నది. ఈ యంశమున జ్ఞానేశ్వరులవారు యోగవాసిష్ఠకారుల మతమునే కొంతవఱకు అనుసరించిరి. యోగవాసిష్ఠమున ఇట్లున్నది:-

శ్లో॥ **తస్యైవ బ్రహ్మ భావస్య తేనైవం బ్రహ్మణాత్మనా।**
**స్వచ్ఛస్యైవ స్వభావస్య స్వస్వభావ మనుజ్ఞతా॥**

**శ్లో॥ ఇదం జాగ్ర దయం స్వప్నః సుషుప్తం తుర్య మిత్యపి।**
**శ్రుతం నామ స్వయం చిత్వా ద్బ్రహ్మ వాతేతి చాత్మని॥**
(యో. వా. 6-167-16, 17)

తా॥ సర్వశక్తివంతమగు బ్రహ్మము (ఆత్మ) తన పరమార్థస్వరూపమును పరిత్యజింపకయే 'ఇది జాగ్రత్త', 'అది స్వప్నము', 'ఇది సుషుప్తి', 'ఇది తురీయము', 'ఇది బ్రహ్మము', 'ఇది ఆత్మ', అను నీ ప్రకారములు స్వయముగా గావించెను -

"ఆత్మయొక్క స్పందమే శివ శక్తు లయినదనియు, వా రిరువురు తప్ప జగత్రయమునందు అన్యులు లే రనియు" చెప్పిన శ్రీ జ్ఞానేశ్వరుల సిద్ధాంతము, యోగవాసిష్ఠకారులు "చిదాకాశరూపుడగు శివుని స్పందశక్తియే (మనస్సే) జగత్త్రయమని" రనియు, ఇదివఱలో చెప్పియుంటిని. (యో. వా. 6-84-6) అందు చెప్పిన రెండు శ్లోకముల అర్థము కూడ పై సిద్ధాంతమునే దృఢపరచుచున్నవి. వీ రిరువురి మతములయందును జ్ఞానమే జ్ఞేయరూపమున నున్నందున జ్ఞాత లేడు ఈ సందర్భమున 'యోగ వాసిష్ఠము' జ్ఞానేశ్వరులవారికి ఫత్తాసి (ఉపాశ్రయము)గా నిలిచినదని చెప్పవచ్చును. యోగవాసిష్ఠము ప్రాచీన వేదాంతమునకు సంబంధించినది కాదని జ్ఞప్తియం దుంచుకొనవలయును.

బౌద్ధమతము భారతదేశమున బాగుగా వృద్ధినొందిన పిమ్మట రచియింపబడిన నవీన వేదాంతమును బోధించు ఉపనిషత్తులయందు అజాతవాదము, అచ్చటచ్చట సూక్ష్మముగ చెప్పబడియున్నది. 108 ఉపనిషత్తులయందు మొదటి నుండి వరుసక్రమముగ లెక్కించిన 64వ ఉపనిషత్తుగా కూర్పబడిన మహోపనిషత్తు నందు చతుర్థాధ్యాయమున 120 నుండి 123 శ్లోకములవఱకు అజాతవాదము చెప్పబడి యున్నది. ఈ యుపనిషత్తునందు చెప్పబడిన తత్త్వము యోగవాసిష్ఠము నందలి తత్త్వముతో సరిపోవుచున్నది.

ఈ వాదమును బ్రహ్మసూత్రకారులు సూత్రముల యందును, సూత్రభాష్యమున శ్రీ శంకరులును బౌద్ధుల విజ్ఞానవాదమును విమర్శించుటచే ఈ వాదమును గూడ విమర్శించినట్లె తలంపవలయును. వెనుక (తృతీయభాగము నందు నాలుగవ ప్రకరణమునందలి (౧౯) అధ్యాయమున)

యీ మతమును తెలిపియుంటిని ఇందువలన జ్ఞానదేవుల యొక్కయు , యోగవాసిష్ఠకారుల యొక్కయు తాత్త్వికాంశములు చాలవఱకు ఒకరీతిగనే యున్నవనియు, ఇరువురును, దృష్టి - సృష్టివాదు లగుటవలన అజాతవాదులనియు తెలిసినది.*

## -: శ్రీ అరవిందుల శివశక్తి - తత్త్వపరిశీలనము :-

శ్రీ అరవిందులు శ్రీ శంకరులు చెప్పిన మాయను విమర్శించినారు. విమర్శయందలి ముఖ్యాంశ మేమన:- మాయ నంగీకరించి "బ్రహ్మమునందు మఱియొక ఏకమును, సనాతనమును, అనిర్వచనీయమును నగు వస్తువు నెలకొల్పబడినది. ఏకత్వము రక్షింపబడలేదు" అని చెప్పిరి. (మాయ)** వీరు చెప్పిన దేమి? ఏ అనిర్వచనీయ పరబ్రహ్మముయొక్క స్వరూపమును - క్రియయును - పురుష ప్రకృతులో, ఆ పరబ్రహ్మమే జగముయొక్క అనశ్వరమును, అద్వితీయమును అగు మూలసత్యము మఱియు "ఆత్మ లేక పురుషుడు ఈ ప్రకృతియొక్క క్రీడకు అధ్యక్షుడు, మఱియు సాక్షి" అని చెప్పిరి. ఈ వాక్యములయందు ప్రకృతికిని దానియొక్క క్రీడకును సాక్షియైన పురుషుడు ఆ రెంటికంటె భిన్నుడై యుండవలెను. అట్లుండకపోయిన పురుషుడు సాక్షి కానేరడు. ఇచ్చట శ్రీ అరవిందులచే ఏకత్వము రక్షింపబడలేదు. వారితత్త్వము ద్వైతమునకు దారితీసినది. మాయను పరబ్రహ్మముయొక్క స్వరూపమనిన, పరబ్రహ్మమే యనినట్లగును. అతని క్రియ శక్తియనిరి. పరబ్రహ్మము క్రియారహితము. అనంతాఖండ వస్తువునందు క్రియ యెట్లు కలుగును? కలుగదు. పరబ్రహ్మముయొక్క సామర్థ్యమే ఆయనశక్తి యనిన శ్రీ శంకరులు చెప్పినదియు అదియే కదా?

శ్రీ శంకరులు మాయను గుఱించి చెప్పిన వాక్యములు ఇదివఱలో చెప్పియుం టిని.*** అందులోనుండి కొంతభాగము తిరుగ జ్ఞప్తికి తెచ్చుచున్నాను. *"ఈశ్వరుని మాయయనియు, 'శక్తి' యనియు, లేక ప్రకృతి*

---

* ఈ దృష్టి-సృష్టి వాదమును శ్రీ శంకర, శ్రీ జ్ఞానదేవుల అనంతరము క్రీ శ 1564 న నుండిన ప్రకాశానందులవారు పోషించిరట

** శ్రీ అరవిందులు రచియించిన 'ధర్మము - జాతీయత' అను పేరు గల గ్రంథమునకు 'వ్యాసావళి' అను ఆంధ్రానువాదమున 'మాయ' అను వ్యాసమునందుండి ఉదాహరించితిని

*** ఈ ప్రకరణమునందలి 5వ అధ్యాయమున చెప్పియున్నాను

*యనియు చెప్పు చున్నారు."* అని కదా శ్రీ శంకరులు చెప్పినది? దాని కంటె శ్రీ అరవిందులు భిన్నముగా చెప్పినదేమి?

శ్రీ శంకరులవారు మాయయొక్క నిర్వచనమును ఏవిధముగా చెప్పిరో ఆవిధముగా శ్రీజ్ఞానదేవ, శ్రీ అరవిందులు తమ విమర్శయం దుదాహరింపక కొంత దాచిపెట్టి, అందులో కొంతభాగమును మాత్రమే వారి బుద్ధికి తోచిన అర్థముతో అనువదించి విమర్శించిరి. శ్రీ శంకరులు చెప్పిన దానికంటె తాము చెప్పునది సర్వోత్కృష్టమని చెప్పిరి.

శ్రీ అరవిందుల తత్త్వమును సూక్ష్మముగ పరిశీలించిన శ్రీ వల్లభాచార్యుల శుద్ధాద్వైతము, శ్రీ నింబార్కుల ద్వైతాద్వైతమును, స్మృతికి వచ్చును.* ఆ రెంటితో అరవిందుల తత్త్వమునకు చాలవఱకు సామ్యమున్నది. వల్లభాచార్యులు మాయ నంగీకరింతురు. కాని, శ్రీ శంకరుల అర్థముతో కాదు. మాయ జగత్కారణము కాదు. సర్వశక్తియగు ఈశ్వరునకు జగన్నిర్మాణ కార్యమునందు, ఇతరుల సహాయ మవసరము లేదు. బ్రహ్మమే జగద్రూపమున పరిణమించెను. ఈశ్వరుడు (పరబ్రహ్మము) ఎట్లు నిత్యుడో జీవ, జగత్తులు అట్లే నిత్యములు.

శ్రీ అరవిందుల పరమసత్యము స్థితి - గతి కలదని చెప్పిరని చెప్పియుంటిని. శ్రీ వల్లభులు సహితము బ్రహ్మమునందు పరస్పర విరుద్ధగుణము లుండవచ్చునని చెప్పిరి.

నింబార్కాచార్యులవారు - బ్రహ్మము, జీవుడు, ప్రకృతి, అను మూడు రూపములుగా బ్రహ్మమే యున్నాడనిరి. వీరిది అవికృత బ్రహ్మపరిణామవాదము.

శ్రీ అరవిందులవలెనే, శ్రీ వల్లభులు, శ్రీనింబార్కులు శివ - శక్తుల (తొలుత) అంగీకరించి ఆపిదప రెండును మిథ్యయే యని అనవలసిన అవసరము వారికి లేకపోయినది.

శ్రీ శంకరులు మాయ నంగీకరించుటవలన బ్రహ్మము యొక్క అద్వైత స్థితికి భంగము కలిగినదని చెప్పిన శ్రీ అరవిందులు, ఎంత సామర్థ్యమును ప్రకటించి చెప్పినను వారు (శ్రీ అరవిందులు) శివశక్తుల నంగీకరించుటవలన

---

* శుద్ధాద్వైతవాదమును, ద్వైతాద్వైతవాదమును ఈ గ్రంథము ఈ యొక్క తృతీయభాగమున రెండవ ప్రకరణమున 6-7 అధ్యాయముల యందు చెప్పియున్నాను.

బ్రహ్మముయొక్క ఏకత్వమునకు భంగము కలుగుచున్నది శ్రీ శంకరుల మాయానిర్వచనమునం దట్టి దోషము కలుగదు.

శ్రీ అరవిందులు తాము చెప్పు పరమసత్త స్థితిరూప మైనదని చెప్పుచు, అంతటితో ఆగక పరమసత్తకంటె పరమునందు దివ్యసత్త అనున దొకటి కలదనియు, దాని ఒక పార్శ్వము, లేక, ఒక అంతస్తు మాత్రమే పరమసత్తయగు స్థితియనియు, చెప్పుటచేత పరమసత్త అను నామము స్థితిగల బ్రహ్మమునకు సార్థకము కాకపోవును. పరమసత్త - దివ్యసత్తయొక్క ఒక పార్శ్వమనిగాని, ఒక అంతస్తని గాని చెప్పుటవలన పరమసత్తయు, దివ్యసత్తయు రెండును సావయవములని చెప్పవలసి వచ్చును. అప్పుడు ఆ రెండింటిలో దేనికిని అఖండత్వము - అద్వితీయత్వము చెప్పుటకు వీలులేదు. అట్టిచో 'గతికి' స్థానమెచ్చట? శ్రీ అరవిందులు ఇన్ని దోషముల నెదుర్కొని నిలుచుట అసాధ్యము. శ్రీ అరవిందులు చెప్పిన దివ్యసత్త శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిన శివ - శక్తులకు మూలమైన విశుద్ధజ్ఞానమైనను, శ్రీ సమర్థులు శ్రీ శంకరులు చెప్పిన నిర్గుణబ్రహ్మమైనను కావలెను. వేఱుమార్గము లేదు.

శ్రీ శంకరులు జగత్తును వ్యావహారిక సత్యమనిరి. శ్రీ అరవిందులు సహితము "బ్రహ్మముయొక్క దేశకాలాతీతమైన దశయందు దాని కస్తిత్వము లే దనిరి." మఱియు "యథార్థమునకు సర్వమును దేశకాలాతీతమైన దశయందు జగము మిథ్య. కాని మనము దేశకాలాతీతులము కాము. మనము జగమును మిథ్య యనుట కధికారులము కాము" అని చెప్పిరి. (మాయ)

శ్రీ శంకరుల మాయావాదముపై దండయాత్ర జరిపిన ఆచార్యులందఱి వాదమునకంటె శ్రీ అరవిందుల యీ వాక్యములు సమంజసమై యున్నవి. శ్రీ అరవిందులు పరమసత్తను గుఱించి చెప్పుచు - "దేనిని తెలిసికొనిన సర్వము తెలిసి, సర్వము బ్రహ్మమగునో అదియే పరమసత్త (Supreme Reality) కాని మాయావాదము ప్రకారము దేనిని తెలిసికొనిన, అన్నియు భ్రమాత్మక మగునో అదియే పరమసత్తగా నిరూపింపబడుచున్నది." అనిరి.

శ్రీ శంకరులు చెప్పినదానిలో తప్పేమియు లేదు. దేనిని (పరమసత్తను) తెలిసికొనిన తప్పేమియు లేదు. దేనిని (పరమసత్తను) తెలిసికొనిన దానికంటె అన్యమయినది వేఱొకటి లేనందున, ఉన్నదను భావము భ్రమాత్మకమని

అర్థము. పరమసత్తను తెలిసికొనిన, 'అన్నియు' అను అనుభూతి లేదు. కనుక శ్రీ శంకర, శ్రీ అరవిందుల భావ మొక్కటే.

దివ్యసత్త ఒకటి కలదని చెప్పుట అరవిందదర్శనము నందలి అపూర్వత. మానవుని మేధాశక్తి సామార్థ్యములపై పరమసత్య మాధారపడదు. శ్రీ శంకరులు చెప్పినదానినే శ్రీ అరవిందులు, శ్రీ జ్ఞానేశ్వరులును ఒక చేత స్వీకరించుచు వేఱొకచేత త్రోసివేసిరి. ఐనను ముప్వురయొక్క గమ్యస్థాన మొక్కటే.

## శ్రీ సమర్థుల శివ - శక్తితత్త్వ పరిశీలనము

సృష్టియొక్క రహస్యమును నెవ్వరును నెఱుగరని వేదమునందు చెప్పిన విధమును కొలది మార్పుతో శ్రీ సమర్థులును ఇట్లు చెప్పిరి:- "వీని నన్నింటిని సృష్టిగావించిన వాడే సర్వకర్తయగు పరమేశ్వరుడు. వాస్తవమున కాతడు నిరాకారుడు. *వాని కళా లీలాకౌతుకములను బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలు సైత మెఱుంగరు."* (దా. బో. 8-1-24)

ఈ విధముగ చెప్పియును బ్రహ్మమునందు మూలమాయ కలిగిన దనిరి. శ్రీ శంకరులవలెనే బ్రహ్మము నిర్గుణ మనియును, శుద్ధజ్ఞాన మనియును చెప్పిరి. మాయావిద్యల నంగీకరించిరి. శ్రీ శంకరులు చెప్పిన మాయ అనిర్వచనీయము. సమర్థులవారు చెప్పిన మాయ అట్టిది కాదు. అది బ్రహ్మమునందు పుట్టినది. అందే లయ మగునది. అంతమాత్రమున వారి మతము ద్వైతమని చెప్పకూడదు. ఏలయన? మూలమాయ నిత్యము కాదు. బ్రహ్మమువలె ఆద్యంతరహితము కాదు. నిత్యమైనది బ్రహ్మమే. కనుక వారి మతము ఒకవిధమగు అద్వైతమే. *శ్రీ సమర్థులు శాక్తేయులు.*

ఇదివఱలో సమర్థులవారి వాక్యములను కొన్నింటి నుదాహరించియుంటిని. వాటిలో ఈ క్రింది వాక్యముల గమనింపవలయును.

"నిరాకార స్వరూపమునందు మూలమాయ కలుగుచున్నది." (దా. బో. 8-3-27) అని బ్రహ్మమునందు మూలమాయ కలిగినట్లు స్పష్టముగ చెప్పిరి. మూలమాయ యెట్టిదైనను బ్రహ్మమునం దొకటి కలిగినదను వాదమును వేదాంతు లంగీకరింపరు. అట్లంగీకరించిన బ్రహ్మము కారణము, మూలమాయ కార్యము- అగుచున్నవి. బ్రహ్మము దేనికిగాని కారణము గాదు, కార్యమును

గాదు. ఆత్మ కార్యకారణబద్ధము కాదని శ్రుతులు చెప్పినవి. పరబ్రహ్మమునందు మాయ లయమైపోయినదని సమర్థులవారు చెప్పిరి అదియు వేదాంతులకు సమ్మతము కాదు.

బ్రహ్మముయొక్క స్వరూపమును వివరించుచు నిత్యముక్తము 'పరమార్థక్రియయు' అన్నారు. పరమార్థక్రియ యననేమో, దాని భావమేమో, ఎచ్చటను వివరింపలేదు. క్రియారహితమగు బ్రహ్మమునందు పరమార్థక్రియ యెట్లుండును?

నిర్గుణబ్రహ్మమునందు గుణసహితమగు మూలమాయ యెట్లు కలిగినది? నిర్గుణబ్రహ్మగర్భమున సగుణ మున్నచో పరబ్రహ్మము నిర్గుణ మెట్లగును? ఈ ప్రశ్నకు దాసబోధ యందు సమాధానము లేదు.

సమర్థులవారు తాము చెప్పిన మాయ శ్రీ శంకరులు చెప్పిన మాయకంటె భిన్నమైనదని తెలియజేయుటకు 'మాయ' అను శబ్దము నుపయోగింపక మాయకు 'మూల' అను విశేషణము చేర్చి 'మూలమాయ' అనిరి. అదిగాక గుణమాయ యని మఱియొక మాయను చెప్పిరి గదా? 'మూలమాయ' యనుటకు అదియును ఒక కారణము. *మూలమాయనుండి చైతన్యము, జడము, రెండును కలిగినవి.* అనగా: మూలమాయమే చైతన్యముగాను, జడ జగత్తుగాను విభక్తమైనది. శుద్ధజ్ఞానము వేఱు, చైతన్యము వేఱు - అని వారిభావమనుటకు ఇదియొక నిదర్శనము. ఈ చైతన్య - జడములే శివుడు - శక్తి. *ఈ మతమునందు దేహమువలెనే దేహియు పుట్టినవాడే. దేహి దేహములు రెండును మాయా సంభవములే.* అట్టి భావము యోగవాసిష్ఠమునందుగాని శ్రీ జ్ఞానేశ్వరుల రచనలయందుగాని కనబడదు.

గీతయొక్క 7వ అధ్యాయమునందు చెప్పిన, పరా అపరా ప్రకృతులు అవి కావా? అనిన అట్టివి కావు. భగవద్గీత ననుసరించి ప్రకృతియొక్క అవ్యక్తస్థితి, 'పర' యనియు, వ్యక్తస్థితి 'అపర' యనియు శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిరి గాని శ్రీ సమర్థులవలె చెప్పలేదు. అదియునుగాక, శ్రీ సమర్థులు చెప్పిన శివుడు - శక్తి అను ద్వంద్వమునందు రెండును ఒకటి కావని అవి అత్యంత భిన్నములని (దా. బో. 13-10-7) చెప్పుటవలన కూడ శ్రీ జ్ఞానేశ్వరుల శివ - శక్తి తత్త్వములతో వీటిని పోల్చుటకు వీలులేదు. శ్రీ సమర్థులు

చెప్పిన శివ శక్తులు ఈ క్రింది ఉపమానముతో పోల్చి చెప్పవచ్చును. ఎట్లన: భూమివంటిది శుద్ధజ్ఞానము (బ్రహ్మము), భూమిని భేదించుకొని వెడలిన బీజముయొక్క అంకురము వంటిది మూలమాయ. అంకురమున కంటుకొని యుండు రెండు దళముల వంటివి శివుడు - శక్తి. ఇట్లుగాక, మూలము, స్కంధము, రెండు కొమ్మలు గల వృక్షములతో కూడ పోల్చవచ్చును. మూలము బ్రహ్మము, స్కంధము మూలమాయ, రెండు శాఖలు శివుడు - శక్తి. ఇట్లనినను సరిపోవును. *పర్యవసానమున మనస్సు, ప్రాణము అనునవియే వీరి మతమున శివుడు - శక్తి.*

శ్రీ సమర్థులు జ్ఞానము (చైతన్యము) శుద్ధజ్ఞానము అను జ్ఞానద్వయమును అంగీకరించిరి. వీరిమతమున శుద్ధజ్ఞానమును, అంతఃకరణమును రెండును విభువులు. 'విభువు' అనగా : సర్వవ్యాపకము. రెండు వస్తువులు సర్వవ్యాపకములు కాజాలవు. వీరిది అజాతవాదము కాదు, సృష్టివాదము. సమర్థుల వారిట్లు చెప్పిరి:-

"పరమాత్ముడు సృష్టి యొనరించినటుల నొక శిల్పి సుందర మందిరము నిర్మించె ననుకొనుడు. కాని యా మందిర నిర్మాత స్వయముగా మందిరము కాగలడా? *అటులే జగత్తును నిర్మించిన పరమాత్ముడు జగత్తునకంటెను వేఱుగా నున్నాడు.* కొందరు మూర్ఖు లీయంశమును నెఱుంగక 'జగమే జగదీశ్వరు'డని నుడువుదురు. జగదీశ్వరుడు వేఱుగా నున్నాడు. జగద్రచనము వాని కళ. అతడన్నింటిలో నున్నాడు. కాని అన్నింటి కంటెను వేఱుగా నుండి అన్నింటిలో నున్నాడు." (దా. బో. 8-1-39, 40, 41).

ఈ వాక్యములు శ్రీ జ్ఞానేశ్వరుల మతమును మనస్సునం దుంచుకొని దానిని నిరసించుచు చెప్పియుందురని భావింపవచ్చును. అజాతవాదమునకు ఇది విరుద్ధము. వీరి వాదము తర్కమునకు నిలువదు.

శివశక్తు లిరువురయందును ఏ ఒక్కరును పరబ్రహ్మము కాదు. శ్రీ శంకరుల అద్వైతమున ఆత్మము బ్రహ్మమును ఒక్కటే. అవిద్యాదశయందును, సంయక్ జ్ఞానము కలిగిన తరువాతను కూడ ఆత్మ బ్రహ్మమేగాని అన్యము కాదు. ఆత్మ బ్రహ్మమునకంటె వేఱైయుండి బ్రహ్మముగా మారదు. మార్పునకు రెండు వస్తువులుండి ఒకటి మఱియొకటిగా మారవలయును గదా? 'ఏకమే

**వాద్వితీయం బ్రహ్మ'** అను శ్రుతి ననుసరించి బ్రహ్మ మొక్కటే. 'తత్త్వమసి' మొదలగు మహావాక్యము ఔపచారికమే గాని పరమార్థము కాదు. అవిద్యవలన, 'నేను బ్రహ్మమును కాను' అను వానికి గురువు (శ్రుతి) ఆత్మానాత్మ విచారము చేసి 'నేతి' 'నేతి' వాక్యములచే అనాత్మను నిషేధించి, నిషేధావధియగు ఆత్మను గుఱించి చెప్పి **'అయమాత్మా బ్రహ్మ' - ఈ ఆత్మయే బ్రహ్మమని బోధించినదే గాని వేఱుకాదు.**

శ్రీ సమర్థుల దర్శనమునందు ; ఆత్మ అనగా - అంతఃకరణము. అది బ్రహ్మ మెట్లగును? సమస్తమును మూల మాయలో కలియగా - మూలమాయ బ్రహ్మమునందు లయించుచున్నందున తుదకు మిగిలినది బ్రహ్మమే కనుక అదియే నీవను అర్థముతో చెప్పియుందురా? అనిన అదియును సరిపడదు. శ్రీ సమర్థులు చెప్పిన శివ శక్తు లిరువురయందును ఏ ఒక్కరును పరబ్రహ్మము కారను జ్ఞానము కలిగిన పిమ్మట 'తత్త్వమసి' లోని త్వం, శబ్దము దేని నుద్దేశించి చెప్పబడినది?

జగత్తు బ్రహ్మమునకంటె వేఱైనయెడల అది ద్వైతమగును. జగత్తు వేఱు, బ్రహ్మము వేఱు అని చెప్పిన బ్రహ్మమునకు పరిచ్ఛిన్నత కలుగును. పరిచ్ఛిన్న మగునది (హద్దులు కలది) ఏదియును నిత్యము కాదు.

దాసబోధ 8వ దశకము 2వ సమాసమున నిర్గుణ బ్రహ్మమునందు మూలమాయ యెట్లు కలిగెనని శ్రోతలు అనేకవిధములగు ప్రశ్నపరంపరలను గురిపించినట్లు చెప్పుకొని వాటికి సమాధానము మూడవ సమాసమున చెప్పిరి. కాని వారు వేసికొన్న ప్రశ్నలకే వారు సరియగు సమాధానము చెప్పలేకపోయిరి. ఎంత ప్రయత్నించినను నిర్గుణమునందు గుణసహితమగు మూలమాయ యెట్లు కలిగినదో తృప్తికరమగు సమాధాన మివ్వలేక తిరిగి శంకరాద్వైతములోనికి ప్రవేశించి రజ్జు సర్పము మొదలగు దృష్టాంతములను గైకొనిరి.

## యోగవాసిష్ఠము - అజాతవాదము

జిజ్ఞాసువు :- అయ్యా! దృశ్యజగత్తు తొలుత ఏవిధముగా కలిగినది. జగత్తు పుట్టనేలేదని గౌడపాదాచార్యులవారనిరికదా అది ఎట్లు?*

---

* శ్రీ గౌడపాదుల అజాతవాదమును గుఱించి యీ గ్రంథమున 1-36 న వ్రాసితిని.

వేదాంతి:- జగత్తు పుట్టనే లేదని వసిష్ఠమహర్షి శ్రీ రామచంద్రున కుపదేశించినట్లు యోగవాసిష్ఠ నిర్వాణ ప్రకరణమునందలి 190వ సర్గమున కలదు. అచ్చట మహర్షి యొక్కయు శ్రీరామచంద్రుని యొక్కయు, సంవాదమున ఈ యంశము వివరింపబడినది. ఆ సంవాదముయొక్క సారాంశము జగత్తు పుట్టలే దనుటయే.

జిజ్ఞాసువు:- జగత్తు పుట్టనిదై కుందేటి కొమ్మువలె అభావమే యైనయెడల కనబడుచున్న జగత్తు కేవల భ్రమమాత్రమే యనవలసి వచ్చును. అప్పుడు ఈ భ్రాంతి ఎచ్చటనుండి వచ్చినది? - అను ప్రశ్న కలుగుచున్నది. దానికేమి సమాధానము?

వేదాంతి:- స్వప్నపదార్థములు, ఎండమావుల యందలి జలము, ఇద్దరు చంద్రులు, ఆకాశమునందు నీలిమ-ఇవి వాస్తవములు కాకున్నను, కనబడుచున్నవి. అట్లే జగత్తు పుట్టకపోయినను కనబడుచునే యున్న దనిరి.

జిజ్ఞాసువు.- ఏదృష్టాంతములు చెప్పి యెదుట కనబడు జగత్తు పుట్టలేదని మీరు చెప్పితిరో ఆ దృష్టాంతములు సంతృప్తికరములు కావు.

వేదాంతి:- అట్లైన వినుము. కారణమునుండి కార్యము జనించును గాని వేఱొక విధముగా కలుగదని నీ వంగీకరింతువు గదా? సృష్ట్యాదియందు సర్వకారణములు మించియుండుటవలన జగదుత్పత్తికి కారణము లేక యుండుటచే జగత్తు పుట్టనే లేదనిరి.

జిజ్ఞాసువు:- మహాప్రళయము సంభవించినపుడు పరబ్రహ్మము మాత్రమే శేషించియుండును. అట్టి బ్రహ్మమే జగదుత్పత్తి కారణమని ఏల చెప్పరాదు?

వేదాంతి:- పరబ్రహ్మము జగత్తునకు కారణమని చెప్పుట తప్పు. ఏలయందువా? కారణము నందుండునదియే కార్యమునం దుండును. కారణమునందు లేనిది కార్యమునందుండదు. ఘటమునందు పటము (వస్త్రము) లేదు. కనుక ఘటమునందుండి వస్త్ర మెన్నడును పుట్టజాలదు. ఉప్పుకల్లు నందు ఉప్పదనము తప్ప నితరరుచి లేనియట్లు బ్రహ్మము కేవల చిద్రూపమే (జ్ఞానస్వరూపమే) కాని అన్యము కాదు. కనుక బ్రహ్మమునుండి జడజగత్తు పుట్టజాలదు.

జిజ్ఞాసువు :- మహాప్రళయమున జగత్తు బ్రహ్మమునందు సూక్ష్మరూపమున నుండి తిరిగి బ్రహ్మమునందుండియే స్థూలరూపమును పొందుచున్నదని చెప్పిన తప్పేమి? శాస్త్రములు సయిత మావిధముగా చెప్పుచున్నవి కదా?

వేదాంతి:- మహాప్రళయ కాలమున కేవల పరబ్రహ్మమునందు జగత్తు బీజరూపమున నుండెనని సృష్టియొక్క బీజసత్తను (బ్రహ్మమునందు) చూచినవా డెవడు?

జిజ్ఞాసువు .- ముక్త పురుషులు బ్రహ్మమునం దైక్యమై యుందురు వారా సృష్టి బీజమును తెలిసికొనియుందురు కదా?

వేదాంతి :- ముక్త పురుషులకు పునర్జన్మము లేదు. వారు బ్రహ్మమునం దైక్యమయిరి కనుక వారివలన ఆ విషయమును మన మెఱుగజాలము కనుక జగత్తు మహాప్రళయమున బ్రహ్మమునం దుండెననుట సరికాదు 'అట్లు కాదు బ్రహ్మమే జగత్తునకు బీజము' అని చెప్పితివేని కుండయందు మట్టితప్ప అన్యమేమియును లేదుగదా? ఆ విధముగనే ముల్లోకములు (దృశ్యజగత్తంతయు) జ్ఞానమాత్ర స్వరూపమేయని నీ వంగీకరించినట్లే కదా? ఇదియే దృష్టి - సృష్టి సిద్ధాంతము (వాదము)

జిజ్ఞాసువు :- అయ్యా! జగత్తును మొదటినుండియు లేనిదై, బ్రహ్మము మాత్రమే యుండునదైన జగత్తు కలదను భ్రాంతి యేకారణమువలన కలిగినది?

వేదాంతి .- కారణాభావముచే జగత్తు పుట్టలేదని నీ వంగీకరించితివి. ఇప్పుడు జ్ఞేయరూపమగు జగత్తు స్వరూప మేమను ప్రశ్నయే నీకు కలిగినది. ఉన్నది ఒక్క బ్రహ్మమే. ఆ బ్రహ్మమే నిజమాయా ప్రభావమున జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయ రూపమున కనబడుచున్నది.

జిజ్ఞాసువు:- శుద్ధ చైతన్య స్వరూపమగు బ్రహ్మసత్త ఎక్కడ? జడజగత్తు ఎక్కడ? బ్రహ్మము జగద్రూపముగ కనబడుచున్నదనిన, కట్టెలు అగ్నిని కాల్చుచున్న వన్నట్లు విపరీతముగా నున్నది. కేవల బ్రహ్మమాత్రమే యున్నందున జగద్భ్రమ కలుగుటకు అవకాశమే లేదు గదా?

వేదాంతి:- కారణాభావమువలన జగత్తు పుట్టనే లేదు. కనుక భ్రమ యనునది కూడ లేదు. శ్రీరామచంద్రుడు వసిష్ఠ మహర్షిని ఇట్లు ప్రశ్నించెను.

"బ్రహ్మమునందు మనస్సు ఏకారణమున, ఏ రూపమున స్థితి కలిగియున్నది?"
(యో. వా. 4-21-2).

ఈ ప్రశ్న సామాన్యమయినది కాదు. సృష్టిని గుఱించిన సమస్త సంశయములు నిందే యిమిడియున్నవి ఇక్కడ మన స్సనునదే మాయ యని, జగత్తని చెప్పవచ్చును వసిష్ఠ మహర్షి ఆ ప్రశ్నకు వెంటనే సమాధాన మివ్వక సిద్ధాంతమును గుఱించి చెప్పునపుడు (నిర్వాణప్రకరణమున) సమాధానము చెప్పెదనని (యో. వా. 5-14-12) చెప్పి, సిద్ధాంతమును గుఱించి చెప్పునపుడు 'మనస్సు కలుగనే లేదని' సమాధాన మిచ్చిరి. మనస్సు కలుగలే దనినను, జగత్తు పుట్టలే దనినను ఒక్కటియే. ఆ విధముగా యోగవాసిష్ఠమున అజాతవాదము చెప్పబడును.

జిజ్ఞాసువు :- అయ్యా! మీరు ఎంత చెప్పినను 'కారణాభావము వలన జగత్తు పుట్టలేదని', పుట్టని జగత్తు ఉండుట గాని, దానికి నాశనము గాని లేదని చెప్పుచున్నారు. 'కారణాభావ' మను ఆధారము తప్ప వేఱొక ఆధార మేదియు మీ వాదమును బలపరుపలేదే?

వేదాంతి:- *నేను నీకు పైన చెప్పినదంతయు శ్రీ వసిష్ఠ శ్రీరామ సంవాదమునందలి సారాంశము మాత్రమేగాని నా మతము కాదు. నేను శ్రీ శంకరులవారు చెప్పిన అజాతవాదమును అంగీకరింతును.* కాని యోగవాసిష్ఠకర్త యొక్క దృష్టి -సృష్టి వాదమును అంగీకరింపను. జ్ఞేయమగు వస్తువు సత్తకలది కాకపోయిన అనిర్వచనీయ మైనదైనను కావలెను. జ్ఞానముకంటె భిన్నమగు నేదేని యొక పదార్థము లేనిదే దానిని జ్ఞేయ మనజాలము. నేను, కేవల దృష్టియే సృష్టి, (దృశ్యము) అను వాదమును అంగీకరింపను. ఈ త్రిపుటి అనిర్వచనీయ మాయాశక్తి పరిణామమని నమ్ముదును.

## -: యోగవాసిష్ఠమునందలి శివ - శక్తులు :-

యోగవాసిష్ఠమున శివ శక్తులను గుఱించి యిట్లున్నది:- చిదాకాశమే శివుడు. (పరబ్రహ్మము) చిదాకాశమే చిత్తు. చిత్తుయొక్క శక్తి చిచ్ఛక్తి. విషయాభిముఖమైన చిత్తు చిత్తము. అదే మనస్సు. ఈ విధముగ జ్ఞానమును రెండు విధముల అంగీకరించిరి. మాయావిద్యలను ఈ మత మంగీకరించెను.

ఈ అంశమున తప్ప తక్కిన అంశములలో చాలవఱకు శ్రీ జ్ఞానేశ్వరులవారు ఈ మతముతో నేకీభవించిరి.

శ్రీ జ్ఞానేశ్వరులు ఆత్మస్పందనమే శివ శక్తులనిరి యోగ వాసిష్ఠకారులు ఆత్మయే శివుడు. ఆయన స్పందనమే శక్తి యనిరి. శివుడు భైరవు డనినప్పుడు శక్తిని కాళియని చెప్పిరి. కామేశ్వరీ కామేశ్వరుల స్వరూప వర్ణనమున కామేశ్వరుడు ప్రకాశమాత్ర స్వరూపుడనియు, ఆయనయం దంతర్లీనమై యుండిన విమర్శయే పరాశక్తి యనియు చెప్పి యుంటిని. ఈ యంశమున రెండు మతములును ఒక్కటియే యని విదిత మగును. మఱియు చిత్ శక్తియే స్పంద జడభావమున నున్నప్పుడు క్రియ (శక్తి) యనియు, స్వాభావిక చిన్మాత్ర రూపమున నున్నప్పుడు శివుడనియు యోగవాసిష్ఠమతము. ఇచ్చట అద్వైతమునకు హాని కలుగదు.

శ్లో॥ మాయైషా సాహ్యావిద్యైషా భావనైషా భయావహా।
సంవిద స్తన్మయత్వం యత్తత్కర్మేతి విదు ర్బుధాః॥
(యో. వా. 4-21-37)

"చైతన్యము (జ్ఞానము) దృశ్య మగుటచే బంధహేతువగు కర్మయని బుద్ధిమంతులు వచింతురు. మఱియు నదియే మాయయు, అవిద్యయు, భయప్రదమగు భావనయు నగును.

## శ్రీ శంకరుల అజాతవాదము

శ్రీ శంకరుల మతమున పరబ్రహ్మము పరిపూర్ణము, నిర్గుణము, నిర్విశేషము, అనంతము, అఖండము. ఈ యంశమును అద్వైతులలో అన్ని శాఖలవారును చాలవఱకు అంగీకరించిరి. నిర్గుణబ్రహ్మము సృష్టి చేయవలెననిగాని, తానే జగద్రూపమును పొందవలయునని గాని సంకల్పించెననిన అది సరియైన మతము కాదు. నిర్గుణునకు సంకల్ప మెట్లు కలుగును? సంకల్పము శరీరధారికేగాని శరీరములేని వానికి కలుగదు. సంకల్ప వికల్పములు మనోధర్మములు. మనస్సనినపుడు శరీరము కలిగియుండవలెను. శరీరము పరిచ్ఛిన్నమైనదే. శరీరధారి పుట్టినవాడుగనే యుండవలయును. జన్మము కలవారికి మరణము తప్పదు. జనన మరణములు కలవాడు మనవంటివాడే యగును. కాని, నిత్య సత్యమగు పరబ్రహ్మము

కాజాలడు. "స ఐక్షత", "సో ఽకామయత" ఇట్టి సంకల్పములు పూర్ణకామునకు (పరిపూర్ణునకు) ఎట్లుకలుగును? మన లోకానుభవమునుబట్టి అపరిపూర్ణునకే (యేదియో ఒకకొఱత కలవానికే) సంకల్పము, కోరిక కలుగును కోరిక గలవాడు బ్రహ్మ మెట్లగును? "నేను తప్ప అన్యు లెవ్వరును లేరు" అని బ్రహ్మము తలంచెనట. సృష్టికి పూర్వము సజాతీయ విజాతీయ స్వగత భేద రహితమగు ఆ స్థితియందు, లేక ఆ వస్తువునందు "నేను" అను భావ మెట్లు కలుగును? "ఇతరు లెవ్వరు లేరే" అని యెట్లు తలచును? కనుక పరబ్రహ్మము తన సంకల్పమున నామరూపాత్మక జగత్తును సృష్టించెనను వాదము తర్కమునకు నిలువదు

ఇంకొకవాద మున్నది. అదియేదన-పరబ్రహ్మము తానే జగద్రూపమున పరిణమించెను అనునది. అదియును తర్కమునకు నిలువదు. నిర్వికార పరబ్రహ్మము జగద్రూపు డాయెననిన ఆయనకు వికారము సంభవించును. వికారము* గల వస్తువునకు నాశన మున్నది. వికార మున్నప్పుడే సమస్త హేయ గుణము లుండును. నిర్గుణునియందు ఇట్టి దోష మారోపింపరాదు. పరబ్రహ్మమునకు పరిణామ మంగీకరించిన, మఱియొక్క గొప్ప దోషమును ఎదుర్కొనవలసి వచ్చును. ఏమనగా - పాలు పెరుగైన తరువాత పాలు లేకపోవును. అట్లే పరబ్రహ్మము జగదాకారముగ పరిణమించి యుండిన, నిర్గుణ పరబ్రహ్మ వస్తువు లేకపోవలసివచ్చును. అట్లైయుండిన జగదుత్పత్తికి పూర్వము పరబ్రహ్మ మనువస్తువొకటె యుండెననియు, అది నిర్గుణమై యుండి జగదాకారమున పరిణమించెననియు, నెఱిగిన వారెవ్వరు? పరిణామమునకు ముందున్న దానిని అట్లుండెనని, యే యనుభవముచేత చెప్పగలుగుదురు? అట్లుగాక పరబ్రహ్మమే తనలో కొంత భాగము జగద్రూపమున పరిణమించి కొంతభాగము పరిణమింపక యెప్పటివలెనే యున్నదనిన పరబ్రహ్మము సావయవి యని అంగీకరించి నట్లగును. అవయవి యగు వస్తువేదియు నిత్యము కాదు. కనుక బ్రహ్మ పరిణామవాదము అసంగతము.

ఒకవేళ యోగవాసిష్ఠకారులును శ్రీ జ్ఞానదేవులును ఇదివఱలో చెప్పినట్లు బ్రహ్మము ఆయన నిర్వికారతకు భంగము రాకుండు విధమున సమస్త

* వికారమనగా వేదాంత పరిభాషయందు మార్పు.

నామరూపములను పొందుచున్నదని అంగీకరించితిమేని నామరూపాత్మక జగత్తు బ్రహ్మమునందు బీజరూపమున (సూక్ష్మమున) ఉండినదనియు అదియే స్థూలరూపమున వ్యక్త మైనదనియు సంశయింప వలసి వచ్చును. అట్లంగీకరించిన బ్రహ్మము నిర్గుణుడు. నిర్విశేషుడు, నిర్లిప్తుడు అను శ్రుతి వాక్యములు అర్థశూన్యము లగును. అదిగాక, జగత్తునకు పర (నిర్గుణ) బ్రహ్మము కారణమని జగత్తు కార్యమని చెప్పవలసి వచ్చును. అట్లంటి మేని బీజము వృక్షమైనట్లు బ్రహ్మమే జగత్తుగ అయినదని అంగీకరింపవలసివచ్చును. అట్లైన జగత్తు బ్రహ్మమువలె నిత్య సత్య మైనదనియు నిర్వాకార మైనదనియు చెప్పవలయును .గదా? (శ్రీ అరవిందులు మొదలగువారు కొందరు అట్లే చెప్పిరి).

ఈ రెండును అసంగతములే. ఈవాదము శ్రుతులకేగాక మన నిత్యానుభవమునకుకూడ విరుద్ధ మగును. ఏలయన? జగద్బ్రహ్మలు (కారణకార్యములు) రెండును సత్యమైనను కావలెను. అసత్యమైనను కావలయును. కార్యకారణములు రెండును సత్యమే అయిన "అసత్య" మను వాక్యమే మనము వినియుండము. ఆ రెండును అసత్యమే అయిన "సత్య" శబ్దము శ్రవణగోచరమై యుండదు. జగత్తు పుట్టినదనిన యిట్టి చిక్కు లనేకములు కలుగును. ఈ చిక్కులను విడదీయుటకు ఎవ్వరికిని సాధ్యపడదు. మన అనుభవమున కారణము లేని కార్యము ఎఱుగము. కనుక జగదుత్పత్తికి కారణము లేనందున జగత్తు పుట్టనే లేదనిరి. అదియే "అజాత వాదము" అని యిదివఱకే చెప్పియుంటిని. ఏవో కొన్ని యుక్తులు కూర్చుకొని జగత్తు పుట్టనేలే దనిన కనబడుచున్న జగత్తు మాట యేమిటి? లోకమున అందరికి పిచ్చిపట్టలేదు కదా? ఈ సమస్య యెట్లు పరిష్కార మగును? ఈ సమస్యను శ్రుతులును, శ్రీ శంకరులును సులభముగ పరిష్కరించిరి. ఎట్లనగా:-

పరబ్రహ్మము కంటెను వేఱనిగాని, అది పరబ్రహ్మమే యనికాని అనుటకు వీలులేనిదై ఉండునది, లేనిది, అని చెప్పుటకు వీలులేక (అకారణమున) అనిర్వచనీయమని చెప్పబడు పరబ్రహ్మముయొక్క శక్తియగు మాయయే అద్దమునందు నగరము కనబడునట్లు బ్రహ్మమునందే నామరూపాత్మక జగద్రూపమును కనబడజేయుచున్నది. వాస్తవముగ జగత్తు బ్రహ్మమునందే కనబడుచున్నను మాయా ప్రభావమున బయట నున్నట్లు కనబడుచున్నది.

స్వప్నమున స్వప్నానుభవము పొందు పురుషుడు స్వప్న ప్రపంచము తన యందే యున్నను అది తనయందున్నట్లు ఎంతమాత్రము తెలిసికొనలేక బయట ఉన్నట్లు తెలిసికొనుచున్నాడు. దీనికి కారణము అవిద్యయే.

బయట జాగ్రదవస్థయందు కనబడు ప్రపంచమునకు మాయ కారణమైనట్లు, స్వప్న ప్రపంచమునకు మాయ కారణమైనట్లు, స్వప్నప్రపంచమునకు మాయ యొక్క అంశమగు అవిద్య కారణమై యున్నది. జగత్తు కనబడలేదని చెప్పుటలేదు. జగత్తు అసలే లేదని చెప్పరు. మాయవలెనే జగత్తు సయితము అనిర్వచనీయము. మసక చీకటియందు త్రాడును చూచి పామనుకొను విధమున అవిద్యావశమున బ్రహ్మమునే జగద్రూపమున చూచుచున్నాము. వెలుతురు వచ్చినంతతట త్రాడు పాముగా కనబడక త్రాడుగనే కనబడునట్లు అవిద్య నశింపగనే జగత్తు బ్రహ్మముగ తోచును. అంత పర్యంతము జగత్తు కనబడును. అనగా : జగత్తు వ్యావహారిక సత్యమే. ఇదియే శాంకరతత్త్వము (మతము).

అద్వైతులలో కొందఱు మాయకు శ్రీ శంకరులు చెప్పిన నిర్వచనమును కొంత మార్చిరి. వేదాంతపంచదశి యందలి అద్వైత ప్రకరణమున నిట్లున్నది:- "బ్రహ్మము నందుండు మాయాశక్తి బ్రహ్మమును ఆధారము చేసికొని జగత్కల్పనము చేసియున్నది. మాయాశక్తి తనకాధారమగు బ్రహ్మముకంటెను, తన కార్యమగు జగత్తునకంటెను వేఱైనది. ఇందులకు దృష్టాంతము - "మట్టి యందు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనుధర్మము లున్నవి. ఆ మట్టియం దొకశక్తి గలదు. ఆశక్తియొక్క కార్యము కుండ. శక్తి కుండ కంటెను, మట్టి కంటెను విలక్షణముగా నున్నది. ఎట్లన? కుండయందున్న లావు, గుండ్రము మొదలగు గుణములు శక్తియందు లేవు. కనుక శక్తి మట్టియును కాదు, కుండయును కాదు. ఈ రెండింటికంటె భిన్నమైనందున శక్తి అనిర్వచనీయము"! (వే. పం. 13వ ప్ర.)

---

* పంచదశి పదునైదు ప్రకరణములును శ్రీ విద్యారణ్యులు వ్రాయలేదనియు, అందు కొంతభాగము, బహుశః మొదటి ఆఱు ప్రకరణములు మాత్రమే వ్రాసిరనియు, తక్కిన భాగము నితరులు పూర్తిచేసిరనియు, పండితులయందు ఒక వాదమున్నట్లు నేను వినియుంటిని. కనుక 13వ ప్రకరణమునందలి శక్తి నిర్వచన వాక్యములు శ్రీ విద్యారణ్యులవి కావని అనుమానింప వలసియున్నది.

శ్రీ శంకరులు చెప్పిన మాయయొక్క నిర్వచనమును నిదివఱలో 5వ అధ్యాయమున చెప్పియుంటిని. అదియే సరియైనది. పైన చెప్పిన పంచదశియందలి నిర్వచనము సరియైనది కాదు. ఏలయన? పంచదశియందే ఇందులకు భిన్నముగ 2-51, 52, 53 నందును 3-78 నందును చెప్పబడినది.*

శ్రుతులు సృష్టిక్రమమును చెప్పినవిగదా, అవి అబద్ధములా? అను సంశయము కలుగవచ్చును. శ్రుతులు ముముక్షువునకు బ్రహ్మబోధ చేయుటకు, బ్రహ్మతత్త్వమును అవగాహన చేసికొనుటకు సహాయకారిగా ఉండునని సృష్టిక్రమము చెప్పినట్లు పెద్దల అభిప్రాయము. అయినను "సృష్టి కర్త సంకల్పించెను". "నేను అనేక మగుదును" అను నీ మొదలగు సంకల్పములు చేసినట్లు చెప్పు వాక్యములు, శ్రుతులు నిర్గుణ బ్రహ్మము నుద్దేశించి చెప్పినవి కావు. మాయా సంబంధమగు సగుణ బ్రహ్మము (ఈశ్వరు) నుద్దేశించి చెప్పినవి ఈ అంశ మిదివఱకే చెప్పియుంటిని. కనుక, శ్రీ శంకరుల మతమునకు కొట్టురాదు.

దృష్టి - సృష్టివాదము బౌద్ధుల విజ్ఞానవాదమును ఖండించు సందర్భమున శ్రీ శంకరులు వారి భాష్యమున నేమి చెప్పిరో (బ్ర.సూ. 2-2-28) ఆ వాక్యములనే లోకమాన్య బాల గంగాధర తిలక్ మహాశయులు తమ గీతారహస్యమునందలి అధ్యాత్మ ప్రకరణమున పుట 304 నందు ఇట్లుదాహరించిరి:-

"జ్ఞానవ్యతిరిక్తమగు వస్తువే లేనియెడల కేవల జ్ఞానమే స్తంభము, గోడ, బల్ల మొదలగు రూపములతో కాన్పించునేని ఒక జ్ఞానమే వివిధమగు భిన్నరూపముల నేల గోచరించుచున్నది?" అని ప్రశ్నించిరి. అదిగాక మన నిత్యానుభవమునందు జ్ఞాన మొక్కటే వివిధరూపముల నున్న యెడల "నేనే స్తంభముగా నున్నాను. నేనే గోడగా నున్నా" నని సర్వజ్ఞానములు నస్మచ్ఛబ్ద పూర్వకముగనే యుండవలసి వచ్చును. కాని యట్లుగాక నేను వేఱగుటచే నాకంటె స్తంభమును, గోవు మొదలగు పదార్థములు వేర్వేఱుగ నున్నవని యందఱకును బ్రతీతి యుండుటచే, ద్రష్టయొక్క మనస్సున గలుగు సర్వజ్ఞానములకు నాధారభూతమగు బాహ్యసృష్టి యుండి తీరవలయును బాహ్యమగు నేదైన నొక స్వతంత్ర వస్తువుండవలయును" అని శంకరులవారు సిద్ధాంతీకరించి యున్నారు." (గీ. ర. పుట. 302) శ్రీ లోకమాన్య తిలక్‌గారియొక్క

సిద్ధాంతము కూడ ఇదియే. ఇంతకంటెను అధికముగ ఈ విషయమున నేను చెప్పవలసిన దేమియులేదు.*

## అనుభవ విచారము

జిజ్ఞాసువు :- శ్రీ జ్ఞానదేవులు, శ్రీ అరవిందులు, శ్రీ సమర్థులు, యోగ వాసిష్ఠకారులు - వీరియొక్క శాస్త్రీయ సిద్ధాంతములయందు కొన్ని భేదాభిప్రాయము లున్నవి. ఐనను వీరి అనుభవము కూడ భిన్నముగా నుండునా? లేక ఒక విధముగనే యుండునా ఆనతిండు.?

వేదాంతి:- అనుభవమును గుఱించి అడిగితివి. బ్రహ్మ వస్తువే అనుభవము వ్యావహారిక జగత్సంబంధమైన అనుభవము ఆయా వ్యక్తులనుబట్టి భిన్న భిన్నములుగా ఉండును. వారి వారి అనుభవములు (అంతఃకరణ వృత్తులు) ఇట్టివని చెప్పుట కష్టము. అలౌకికమగు పారమార్థిక విషయమున ఏ మతమునకు, ఏ సంప్రదాయమునకు సంబంధించిన వారైనను, వారి శాస్త్రీయ సిద్ధాంతము లెట్టివైనను బ్రహ్మానుభవమును పొందియుండిన ముక్త పురుషుల అన్మభవమునందు భేదముండదు. వారి అనుభవము ఒక్క రీతిగనే యుండునని నా యభిప్రాయము. అనుభవజ్ఞులగు మహనీయులు వ్రాసిన గ్రంథములయందలి వారి వాక్యములనుబట్టి వారి అనుభవమును మన మూహింపవచ్చును. నీవు నన్నడిగిన పై నలువురు వ్రాసిన గ్రంథములను బట్టి వారి శాస్త్రీయ వాక్యములయందు భేదము కనబడుచున్నను, అందలి పరమార్థము ఒక్క రీతిగా నున్నట్లు నాకర్థమైనందున వారి అనుభవము నందు తరతమభేద ముండునని తలచితిని. అనగా :- జ్ఞాన భూమికలు నీకు తెలియును గదా?

శ్రీ జ్ఞానేశ్వర సంప్రదాయమునకు చెందిన పెద్దలు తాము మాత్రము అద్వైతులము కామనియు, అరూపబ్రహ్మవాదుల మనియు, తమ సిద్ధాంతము 'ఆత్మానుభూతి' యనియు చెప్పుదురు. అరూప బ్రహ్మమునే నిష్ప్రతియోగిక బ్రహ్మమని యందురు. ఈ విషయమై ముందు అచల వాదమును గుఱించి చెప్పు సందర్భమున చెప్పుదును. పై నలువురయందును శ్రీ సమర్థులవారు వ్రాసిన కొన్ని వాక్యముల వలన వారికి పరిపూర్ణానుభవము కలదా యను సంశయము కలుగుచున్నది. దానిని వేఱొకచోట చర్చింతును.

---

* ఇంకను విస్తరించి తెలిసికొన గోరువారు ఈ గ్రంథము 3-4-24 "అద్వైత విజ్ఞాన వాది సంవాదమును చదువవలయునని మనవి.

మన అనుభవమునుబట్టి శ్రీ శంకరాదుల తత్త్వములను విచారింతము. మనకు గాఢ నిద్ర కలుగుచున్నది. దానిని శ్రీ శంకరులు అవిద్యయనియు, అజ్ఞానమనియు వచించిరి. ఆ శబ్దములను ఉచ్చరించుటకు శ్రీ జ్ఞానేశ్వరుల కిష్టము లేదు. వారి తత్త్వము ననుసరించి సుషుప్తియే శివుడనుకొందము. సుషుప్తియందే స్వప్నము (జ్ఞానము) కలుగుచున్నది. అదియే జాగ్రద్రూప మగుచున్నది. శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిన దేమి? శివునియం దంతర్లీనమై యున్న విమర్శశక్తియే జ్ఞానము. "చిద్రూపిణియగు శక్తి తన పతియగు శివునకు భూషణాంబరములను ధరింపజేసినది" అనగా నామరూపములు లేని శివుని యందు నామరూపములు కల్పించినదని యర్థము.

జగత్తు గోడలేని చిత్తరువు వంటిదిగా కనబడును. శివశక్తుల యందు ఏ యొకరినైనను చూడవలయు నన్న, ఒకరిని మూసివేసిననే గాని యింకొకరిని చూడలేమనిరి. స్వప్న జాగరముల యందేదియున్నను శక్తిని చూచుచున్నామని భావింపవలయును ఆస్థితియందు సుషుప్తి రూపుడగు శివుడు గోచరింపడు. శివుని (సుషుప్తిని) చూచుచుండగ జ్ఞాన రూపిణియగు శక్తి కనబడదనిరి. శక్తి శివునియందు ప్రేమ చూపినపుడు ఆయనయందు లీనమగు ననగా- అప్పుడు శివుడు (సుషుప్తి) మాత్రమే గోచరించును *మనము లోకమున వస్తువును చూచుటలేదు. వస్తువుయొక్క గుణములు మాత్రమే తెలిసికొనుచున్నాము. వస్తువే శివుడు. నామరూపాది గుణములే శక్తి.* శివ శక్తు లిరువురు మేల్కొని యుందురేని అప్పుడు వారిరువురును లేనివారే (అను. 1-14) యనిరి. అనగా అదియే తురీయావస్థ (సమాధి). ఆస్థితియందు శుద్ధ జ్ఞానరూపమగు ఆత్మయే మిగులునని భావము. అదియే అనుభవము.

శ్రీ జ్ఞానేశ్వరుల వారి అనుభవము వారి యీ క్రింది వాక్యములవలన తెలిసికొనవచ్చును.

"మఱియు న య్యాత్మ నైజస్థితి ద్రష్టయు, దృశ్యంబును నను నయ్యుభయ విషయంబులు వినష్టంబై పునరుత్పన్నంబగు నమ్మధ్యంబునం జెల్వొందుచుండునని సారాంశంబగు" (అను. 7-185).

*వీరు చెప్పిన ఆస్థానము చిదాకాశమే ; అదే పరబ్రహ్మము.*

వీరు స్వాభావిక భక్తిరహస్యమును గుఱించి అనుభవామృతము (అమృతానుభవము) తొమ్మిదవ ప్రకరణమున నిట్లు చెప్పిరి:-

"తరు వనునది ఫల పత్ర సుమాద్యాకారంబునం బెంపొందుచుండినను నందు తరుపదార్థంబు గాక అన్యం బెద్దియు గాన రాకుండు". (అను 9-43)

ఈ భావమునే వేఱొక విధముగ మఱియొక చోట ఇట్లు చెప్పిరి :- ఒక పర్వతమువంటి యొక శిల గలదు. దానియందు ఒక శిల్పి గొప్ప దేవాలయమును నిర్మించెను. ఒకటే జాతియందు ప్రాకార, గోపుర, కళ్యాణమండప గర్భాలయాదులనే గాక ద్వారపాలకులను, గర్భగుడియందలి దేవతా విగ్రహమును, పూజారిని, పూజా ద్రవ్యాదులనుకూడ ఆ యేకశిలయందే నిర్మించెను. దేవాలయము నందలి ప్రాకారాదులకు ఒక్కొక్కదానికి ఒక్కొక్క నామము ఒక్కొక్క రూపము గలదు. ఈ నామరూపము లన్నియు వ్యావహారిక మేగాని వాస్తవముగ అచ్చట ఉన్న సమస్తమును ఒక్కశిలయే. ఆ శిల తప్ప అన్యమేమియును లేదు. "ఇతడు దేవుడు", "ఇతడు అర్చకుడు", "ఇవి పూజాద్రవ్యములు" అని చూచువారు చెప్పుకుందురేగాని, "ఇదిశిల", "ఇదియు శిలయే", "అదియు శిలయే" అని చెప్పుకొనరు. ఇవి అనుభవసిద్ధమే కదా? సర్వము బ్రహ్మమయముగా చూచు ముక్తపురుషుడు దేవాలయాదు లన్నియు శిలయే యని చూచునట్లు ప్రపంచమును బ్రహ్మముగా చూచును. శ్రీ జ్ఞానదేవులు తమ అనుభవ మట్టిదని చెప్పిరి. ఇట్టి అనుభవమునే శ్రీ శంకరాచార్యులవారు బాహ్యసమాధి యనియును, ముందు చెప్పిన *చిదాకాశమును నిర్వికల్ప సమాధి యనియును చెప్పిరి.* ఈ విషయమును నే నిదివఱలో చెప్పియుంటిని.* అయినను ఇచట కొన్ని వాక్యములు చెప్పెదను.

**శ్లో|| దేహాభిమానే గళితే విజ్ఞాతే పరమాత్మని|**
**యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః|| (దృ. వి. 32)**

తా. దేహాభిమానము నశించి సర్వము బ్రహ్మమేయను దృఢ నిశ్చయము కలిగిన పిమ్మట మనస్సు ఎచ్చటెచ్చటికి పోవునో అచ్చటచ్చట అప్రయత్నముగ సమాధి యగుచుండును.

ఇదియే బాహ్యసమాధి. సర్వమును బ్రహ్మముగా చూచుట దీని లక్షణము. అంతర సమాధి (నిర్వికల్ప సమాధి) శ్రవణ, మనన, నిదిధ్యాసలచేత సిద్ధించునది. ఇదియే *చిదాకాశము.*

---

* ఈ గ్రంథముయొక్క ద్వితీయభాగము ప్రథమ ప్రకరణమున (౨౫) సమాధి అను అధ్యాయమున నీ విషయము చెప్పియుంటిని.

శ్రీ జ్ఞానేశ్వరులు సమస్తము సత్పదార్థమగు ఆత్మయే యనిరి అదియే పరిమళమును, నాసికయు దాని యనుభవమును అని చెప్పిరి. అట్లే పంచేంద్రియ వృత్తులు, ఇంద్రియములు, ఇంద్రియములచేత నెఱుగబడు విషయములు సమస్తమును ఆత్మయే యనిరి. (అను. 9 ప్రకరణము).

వెనుక మనము విజ్ఞానవేత్తలు (Scientists) చెప్పిన విషయములు స్మరించితిమి. ఆవిధముగ చూచినను విశ్వమున కనబడుచుండు నానావిధ నామరూపాత్మక ద్రవ్యరాశి యంతయు ఛేదించిన అణువు లగుననియు, అణువులు సయితము విభాజ్యమై పరమాణువు లగుననియు, అప్పుడు నామరూపముల ప్రసక్తియే లేక శక్తిమాత్రమే యుండుననియు, తెలిసికొని ఆశక్తి సహితము అంతర్ధాన మగునని చెప్పిరి. భారతీయ తత్త్వవేత్తలు "శక్తి అంతర్ధాన మయినదని" చెప్పుటకు మారుగ శక్తి శివునియందు లీనమగు"నని చెప్పుదురు.

ముముక్షువు పైవాదముల అన్నింటియొక్క పర్యవసానమునందు భేద మణుమాత్రమైనను లేదని నిశ్చయించుకొని సమస్తమును శక్తి (అణుసముదాయ) రూపమే, లేక పరమాత్మయే. ఇందులో 'నేను', 'నీవు'; 'నాది', 'నీది' అనునది కేవల మిథ్యా విషయమే అను నిశ్చయమునకు రావలెను. కేవలము నిశ్చయమునకు వచ్చుటే గాదు, ప్రతిక్షణమునందు నీ భావమును మరువక జ్ఞప్తియందుంచుకొన వలెను. శత్రువులు, మిత్రులు, ఉదాసీనులు, భార్యాపుత్రాదులు, సర్వులు ఏక వస్తువుయొక్క భిన్నరూపములే యని శ్రీ జ్ఞానదేవులు చెప్పిన దేవాలయ స్వరూపమువలె దేవుడు సయితము నావలెనె ఏకైక సత్పదార్థమే యనుభావము బుద్ధియందు పూర్ణముగ నిండి ప్రతిరక్త బిందువు నందును, దేహము నందలి ప్రతిఅణువునందును ఆభావము వ్యాపించువఱకు భావన చేయవలయును. అట్టివారికి శత్రుమిత్ర ఉదాసీనాది భావము లేశమైనను కలుగజాలదు. విశ్వమంతయు శివశక్తి స్వరూపమే యనియు, శివశక్తు లిరువురుగా తోచు పరమాత్మయే యను భావన కలుగుటయే బంధవిచ్ఛేదనము.

## అఖండాకారవృత్తి - అఖండైకరసము

శ్రీ జ్ఞానేశ్వరులు ముక్తికిని, ఆత్మానుభూతికిని భేదము కలదనిరి. **అఖండాకార వృత్తిరూప జ్ఞానానుభవమును ముక్తియనియు, అఖండైకర సానుభవమును ఆత్మానుభూతి యనియు; శ్రీ జ్ఞానేశ్వరుల యొక్కయు,**

వారి అనుయాయుల యొక్కయు తాత్పర్యమై యున్నది. అఖండాకార వృత్తి యొక్క అనుభవము ఇట్టిదనియు, అఖండైక రసానుభవము ఇట్టిదనియు ముందు వివరింతును. శ్రీ జ్ఞానేశ్వరు లిట్లు చెప్పిరి :-

"మఱియు ముక్తివిషయంబు మనోహరంబై యొప్పుచుండినను నాత్మానుభూతి యనునది మిగుల నిర్మలంబై యత్యంత మధురంబై వెలయుచుండుటం జేసి శాశ్వతముక్తి విషయం బేనియు దదీయంబగు మాధుర్యంబును గ్రోలుచుండుటకునై తీవ్రాభిలాషంబు గల్గియుండెడిని". (అను. 10-20) అభిలాష కలవాడు ముక్తుడు కాడు. అభిలాష యనగా కోరిక లేక కామము. కోరిక చేత కట్టుబడినవాడు బద్ధుడు. బద్ధుడు ముక్తుడెట్లగును?

శ్రీ జ్ఞానేశ్వరులు ముక్తి సహితము బంధమే అనిరి. ముక్తి బంధమైనట్లయిన దానిని "బంధము" అనక "ముక్తి" యని యేల అనవలెను? ముక్తి అనగా - విడుపు. విడుపు బంధ మెట్లగును?

శివ సూత్రముల యందు "జ్ఞానం బంధః"- "జ్ఞానము కూడ బంధమే" అని ఉన్నది. కనుక, జ్ఞానమువలన లభించిన ముక్తి బంధమని వారి భావమై యుండును. కాని "జ్ఞాన బంధః" అను సూత్రమునకు జ్ఞానేశ్వరులవారు చెప్పిన అర్థము సరికాదని వీరశైవులు ఈక్రింది వివరించిన అర్థమును చెప్పుదురు. "సిద్ధాంతశిఖామణి" యందిట్లున్నది :-

శ్లో॥పరస్పర సమాపేక్ష భావాభావ వివేచనమ్।
జ్ఞానం బ్రహ్మణి యన్నాస్తి జ్ఞానశూన్య స్థలం విదుః॥ (20-54)

తా. ఒండొంటి యపేక్షతో గూడిన ఉన్నది లేదు - అనెడి, భావాభావముల భేద జ్ఞానము పరబ్రహ్మ స్వరూపుడైన యే శివయోగియం దుండదో, అట్టివాని భేద జ్ఞానశూన్యతను ప్రతిపాదించు స్థలమును "జ్ఞానశూన్యస్థల" మందురు. "జ్ఞాన బంధః" అనెడి శివసూత్రమందలి జ్ఞానపదమునకు భేదజ్ఞానమని తెలియునట్లే యిక్కడను జ్ఞానశూన్య స్థలమనెడి పదమునకు భేదజ్ఞాన శూన్య స్థలమని తెలియవలయును".

శ్రీ జ్ఞానదేవులు ముక్తికంటెను ఆత్మానుభూతి గొప్పదని చెప్పుట ప్రరోచన వాక్యములని చెప్పవచ్చును.

శ్రీ జ్ఞానేశ్వరుల అనుయాయులు శ్రీ శంకరానుచరులకు అఖండాకార వృత్తివఱకే వారి యనుభవమనియు, ఆపైన నుండు అఖండైక రసానుభవము వారికి (అద్వైతులకు) లేదు" అనియు చెప్పుదురు. ఇట్లు చెప్పుట పొరపాటు. అన్వయవ్యతిరేకముల చేత ఆత్మానాత్మజ్ఞానము కలుగుచుండగ, తత్త్వమస్యాది మహావాక్య శ్రవణమువలన సర్వసంసారబంధ నివర్తకమయిన అఖండైక రస ప్రత్యగభిన్న పరమాత్మ స్వరూప జ్ఞానము కలుగుననియు, అట్టి అనుభవమే అఖండైక రసానుభవమనియు అద్వైతానుభవము పొందిన పెద్దలు చెప్పియున్నారు. అఖండాకారమగు వివేకము (సంయక్ జ్ఞానము) బుద్ధివృత్తియే కనుక అట్టిది అఖండైక రసముకంటె తక్కువ స్థితి యని అంగీకరించినను, అఖండాకార వృత్తి సిద్ధించిన అతనికి ఆ యనుభవము అంతటితో ఆగక ఆ వెంటనే వృత్తి (బుద్ధి) కూడ నశించి నిర్వికల్ప సమాధి సిద్ధించును. బుద్ధి వృత్తి నశించినపుడు ***మిగిలియుండునది ప్రత్యగాత్మయే. అదియే అఖండైకరసము.***

ఒక సంప్రదాయమునకు చెందినవారు తమ సంప్రదాయమునకు చెందిన సిద్ధాంతమే యితర సంప్రదాయములకు చెందినవారి సిద్ధాంతములకంటె శ్రేష్ఠమని చెప్పుకొనుట లోకమున పరిపాటి యైయున్నది. ఉదాహరణమునకు :- ఆగ్రాలో - దయాళ్ భాగ్ - రాధాస్వామి సత్సంగమునకు చెందినవారు తమకు మాత్రమే సద్గురువు లభించెననియు, శ్రీ జ్ఞానేశ్వరులకును వారి సంప్రదాయమునకు చెందిన వారికిని సద్గురువు లభింపని కారణమున వారికి యథార్థజ్ఞానము కలుగ లేదనియు చెప్పిరి. వారి వాక్యము లివి:-

"వేలకొలది బ్రహ్మలు, వేలకొలది గోరఖులు, వేల కొలది నాథులు వేలకొలది ప్రవక్తలు తృష్ణాగ్నిలో బడి దహించుకొని పోవుచున్నారు. ఏలయన **వారికి సద్గురువు లభించలేదు.** * (సారబచన్ II పుట 156)

---

* 'సారబచన్' II 156వ పుట, పాదభూమిక (Foot Note) యందు నీ క్రింది వాక్యములు వ్రాసియున్నవి.

. "1 గోరఖనాథు 15వ శతాబ్దములో జీవించియున్న యొక సుప్రసిద్ధ సన్న్యాసి.

2. గోరఖనాథుని గురువగు మత్స్యేంద్రనాథుడుకూడ నొక సుప్రసిద్ధ సన్న్యాసి. ఆయన అనుయాయులను 'నాథుల'ని పేర్కొందురు" అని యున్నందున "నాథులు" జ్ఞానేశ్వరులవారి గురువులే యనుటకు సంశయము లేదు.

ఎంత ఆశ్చర్యమో చూడుడు. వేలకొలది బ్రహ్మలకు సయితము సద్గురువు లభింపలేదట. నాథుల సంగతి చెప్పవలసిన దేమున్నది. ఇచట "నాథులు" అనగా : శ్రీ జ్ఞానదేవుని గురు పరంపరకు చెందినవా రనుట విదితమేగదా? బ్రహ్మలకు సద్గురువు లభింపలేదని వీరికెట్లు తెలిసినదో?

ఈ సందర్భమున యోగవాసిష్ఠమునందలి యీ శ్లోకము స్మృతికి వచ్చుచున్నది.

**శ్లో॥ మోక్షే తు నాన్యథా ప్రాప్తిరితి భావిత చేతసః।**
**స్వాం దృష్టిం ప్రతిబింబంతి స్థితాః స్వనియమభ్రమైః॥**
(యో. వా. 4-21,25)

తా. భిన్న భిన్న మతములవారు తాము చెప్పునట్టి యుపాయముచేతనే తప్ప మఱియొకరు చెప్పు నుపాయము చేత మోక్షము కలుగనేరదని నిశ్చయించి తాము కల్పించు కొన్న నియమమను భ్రమచే నితరులు చెప్పిన యుపాయములను త్రోసివేసి తమ సిద్ధాంతమే శ్రేష్ఠమని లోకులకు బోధించుచుందురు.

జిజ్ఞాసువు:- అయ్యా! అఖండాకారవృత్తి యనగా నెట్టిది? అఖండైకరసమనగా నెట్టిది? ఈ యనుభవముల తారతమ్యమేమి?

వేదాంతి:- నీ ప్రశ్నమునకు సమాధాన మిదివఱకే చెప్పితిని. అయినను బోధదార్ఢ్యము కొఱకు మఱల చెప్పెదను :- శ్రవణ, మనన, నిదిధ్యాసల వలన బ్రహ్మజ్ఞానరూపమైన చరమవృత్తి కలుగును. బ్రహ్మజ్ఞానమనగా:- అఖండాకార బుద్ధివృత్తియే గాని (పర) బ్రహ్మస్వరూపజ్ఞానము కాదు. ఉప్పుకల్లునందు ఉప్పదనము తప్ప అన్యరసము లేనట్లు (పర) బ్రహ్మస్వరూప జ్ఞానమునందు జ్ఞానము తప్ప వృత్తులేవియు లేవు. అందువలన (పర) బ్రహ్మస్వరూప జ్ఞానముకంటె (పర) బ్రహ్మజ్ఞానము తక్కువ. బ్రహ్మజ్ఞానమే పైన చెప్పిన అఖండాకారమగు వివేకము లేక, జ్ఞానము. ఇది కలుగగనే యిది యితరవృత్తుల నన్నింటిని (ద్వైతమును) నశింపజేసి ఇదియును నశించును. ఎట్లన:- అగ్ని కర్పూరమును నశింపజేసి తానును నశించున ట్లని అర్థము. ఇట్లు బ్రహ్మజ్ఞానము (సంయక్ జ్ఞానము) ద్వైతమును నశింపజేయగా మిగిలియుండునది అద్వితీయాఖండ పరబ్రహ్మమే. అబ్రహ్మమునే

ప్రత్యగాత్మయని యందురు. అఖండాకార వృత్తిని పొందిన పెద్దలు తప్పక అఖండైక రసానుభూతిని పొందుదురు. అద్వైతులకు అఖండైక రసానుభవము లేదనుట తప్పు.

జిజ్ఞాసువు:- ప్రత్యగాత్మ యంటిరిగదా? ఆ శబ్దార్థమును వివరింపుడు.

వేదాంతి:- ఇదివఱకు జ్ఞానయోగమును చెప్పినపుడు* ఈ యర్థమును చెప్పియుంటిని. ఇప్పుడు నీవడిగిన ప్రశ్నమునకు సూటిగా సమాధానము చెప్పెదను. ***పెద్దలు ప్రత్యగాత్మనే అఖండైకరస మందురు.*** ప్రత్యగాత్మ యనగా "ప్రతీపం దేహేంద్రియాది వైలక్షణ్యం అంచతీతి ప్రత్యక్" అని వ్యుత్పత్తి. కనుక జడమైన దేహేంద్రియాదుల కంటెను భిన్నమై (అజడమై)నందున విలక్షణ వస్తువు "ప్రత్యక్" అనబడును. భేదరహితమై స్వయంప్రకాశ రూపుడైన ఆత్మనే ప్రత్యగాత్మ అందురు. ప్రత్యగాత్మ నిత్యనిర్వికారమైన చైతన్యమే, (జ్ఞానమే), స్వభావముగా గలిగి సమస్త దేహాదులయందు ఒక్కడే సర్వదా ప్రకాశించుచున్నాడు ఇతని ప్రకాశమునకు సంకోచ మనునది లేదు. కనుక, ప్రత్యగాత్మ యందు జ్ఞానప్రత్యక్ష్యములకు భేదము లేదు. అనగా . ఏది జ్ఞానమో అదియే ప్రత్యక్ష్యము. ఏదిప్రత్యక్ష్యమో అదియే జ్ఞానము. ఇచట వ్యభిచారము కలుగదు.** అనగా : జ్ఞానమును విడిచి ప్రత్యక్ష్యముగాని, ప్రత్యక్ష్యమును విడిచి జ్ఞానముగాని ప్రకాశించుట లేదని తాత్పర్యము.

బుద్ధి జడమైనది. అగ్ని యందుంచబడిన యినుపకమ్మికి అగ్ని ధర్మములు కలుగునట్లు జ్ఞానస్వరూపుడగు ప్రత్యగాత్మ సాన్నిధ్యముచే బుద్ధికి జ్ఞాన - ప్రత్యక్ష్యములు కలుగుచున్నవి. అవి ఆగంతుకములు. ఇచట అవి బుద్ధియొక్క ధర్మములు (బుద్ధియొక్క స్వరూపము కాదని అర్థము) ఇచట బుద్ధి ధర్మియనియు, జ్ఞాన - ప్రత్యక్ష్యములు బుద్ధి యొక్క ధర్మములనియు చెప్పుటచేత ధర్మి ధర్మ భేదము కలుగుచున్నది. ఇట్టి భేదము ప్రత్యగాత్మయందు లేదు.

· బుద్ధికి ప్రత్యక్ష్యము ఏలాగున చెప్పవచ్చుననగా - బుద్ధి జడమైనను దేహేంద్రియాదులలో కొన్నింటికంటె ఆంతరమై యన్నందునను, ఆత్మ

---

* "వ్యభిచారము" = ఒకటి యున్నప్పుడు మఱియొకటి లేకపోవుటయని వేదాంత పరిభాష.

** ఈ గ్రంథముయొక్క ద్వితీయ భాగము I ౨౫, ౨౯ అధ్యాయములు చిత్తగింపుడు

ప్రతిబింబమగు చిదాభాసుడు బుద్ధియందే యన్నందునను దేహేంద్రియాది సంఘాతము కంటె బుద్ధికి ప్రత్యక్త్వము చెప్పవచ్చును. బుద్ధి ఘటాది విషయాదులను ప్రకాశింపజేయుచున్న వృత్తులను పుట్టించుటచే బుద్ధికి జ్ఞాతృత్వము కలుగుచున్నది. ఈవిధముగ బుద్ధికి ప్రత్యక్త్వము, జ్ఞాతృత్వము కలిగినది. కాని బుద్ధికి గల యీ జ్ఞాతృత్వము ఔపాధికము. ప్రత్యగాత్మకు గల జ్ఞాతృత్వము నిరుపాధికము. ఈ రెండింటి భేదమును తెలియజేయుటకు శ్రీ సురేశ్వరాచార్యులు చక్కని యీక్రింది దృష్టాంతమును చెప్పియున్నారు.

"తిష్ఠతి"=నిలిచియున్నది, అను వ్యవహారము "పర్వతములు నిలిచియున్నవి", "వృషభములు నిలిచి యున్నవి" అనునపుడు పర్వతములు సర్వకాలముల యందును నిలిచియే యున్నవి. నిలిచియుండుట వాటి స్వభావము. ఒకప్పుడును అవి నడచుట లేదు. వృషభములయందు ఉపయోగించిన "తిష్ఠతి"(నిలిచియున్నవి) అను వ్యవహారము అవి యొకప్పుడు నిలిచియుండును, మఱియొకప్పుడు నడచుచుండును; నిలిచియుండుట వాటి స్వభావము కాదు. కనుక "ప్రత్యగాత్మ తెలిసికొనుచున్నాడు" అనునప్పుడు జ్ఞాన క్రియను (ఉపాధిని) బట్టి ప్రవర్తించినది కాదు. ఇచట "జ్ఞా" ధాత్వర్థమే వివక్షితము. బుద్ధియందు జ్ఞాతృత్వము, జ్ఞానక్రియా కర్తృత్వము.

అఖండాకారవృత్తి యనిన బుద్ధి కలదని భావింపవలెను. వృత్తి బుద్ధి స్వరూపమే కదా? ఇచట బుద్ధి ఆత్మరూపమును పొందుచున్నది. కనుక "నేను బ్రహ్మమే అయియున్నాను" అను తలంపు కలుగుచున్నది. ఆ అనుభవము కలిగిన పిమ్మట నెట్టి ప్రయత్నము లేకయే ఆతలంపు సయితము నశించి అఖండైక రసానుభవమగు ప్రత్యగాత్మ శేషించుచున్నది.

అద్వైతులు ఒకకథ చెప్పుదురు:- ఆటవికు డొకడు ఎట్లో పసిపాపడగు ఒక రాజపుత్రుని దొంగిలించుకొని పోయి వానిని పెంచి పెద్దవానినిగ చేసెను. ఆ రాజకుమారుడు తాను ఆటవికుడ ననియే తలచెను. రాజపుత్రుని దొంగిలించి తెచ్చిన ఆటవికునకు మరణకాల మాసన్నము కాగా, రాజువద్దకుపోయి బాలుని చూపి "యితడు మీకుమారుడు, పసిపాపడై యుండు సమయమున నేను ఇతనిని దొంగిలించితిని - అని కొన్ని నిదర్శనములు చూపెను. ఆ నిదర్శనములు చూచి రాజు వాని మాటలను నమ్మెను. రాజుకుమారుడు తాను ఆటవికుడను కానని రాజపుత్రుడనని

అమితానందము నొందెను. కొంత కాల మట్లు తలంచెను. కాని అతని జీవితకాలమంతయు "నేను రాజపుత్రుడను" అని జపము చేయలేదు.

అట్లే "తత్త్వమసి"- అది నేనై యున్నాను అను బుద్ధివృత్తి నిరంతరము అట్లే యుండదు. "తత్త్వమసి", "తత్త్వమసి" అని ముముక్షువు జపము చేయుచుండదుగదా? కొంత అనుభవము కలిగిన పిమ్మట "తత్త్వమసి' అను భావనకూడ మరచి కేవల స్వస్వరూపమునందే నిలిచియుండును. అదియే ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపమగు తురీయాతీత మనియు, అఖండైకరస మనియు అస్పర్శయోగమనియు చెప్పుదురు. అఖండాకారవృత్తి గలవానికే అఖండైక రసానుభవము సిద్ధించును. అది సహజమై యుండును. ఆస్థితియందు యోగి తురీయమును పొందిన తరువాత పొందదగిన దేదియు నుండదు.

తురీయమును శుద్ధతుర్యమని, మిశ్రతుర్యమని కొందఱు చెప్పుదురు. ఇందులో శుద్ధతుర్యమె తురీయాతీతమని చెప్పవచ్చును. ఈ విషయమై ముందు మఱియొక సందర్భమున చెప్పెదను.

"తుర్యావస్థ నొందిన శివయోగికి బ్రమాణమును లేదు. తెలియదగినదియు లేదు. తెలియదగిన సాధనమును లేదు." అని వీర శైవ సిద్ధాంతము (సి. శి. 20-21)

తురీయాతీత మొకటి కలదు గదా, దానిని పొందవలదా? యనిన తురీయ, తురీయాతీతములకు భేదము లేదు. అయినను కొందఱు ఒక ఆక్షేపణ చేయుదురు. అఖండాకార వృత్తియందు సజాతీయ విజాతీయ భేదము నశించి యుండినను స్వగతభేదము నశించియుండదు. కనుక ముక్తియు ఒకవిధమగు బంధమే యందురు. స్వగతభేద మనునది సాకార సావయవ పదార్థమునకే కలదుగాని నిరాకార నిరవయవ వస్తువునందు లేదని నాసమాధానము. ఘటాకాశ మహాకాశములకు స్వగతభేదము కలదా? కనుక యీ ఆక్షేపణ సమంజస మైనది కాదు.

. సర్వసంసార బంధనివర్తకమైన అఖండమైకరస ప్రత్యగభిన్న పరబ్రహ్మస్వరూపానుభవము తత్త్వమస్యాది మహావాక్య శ్రవణము వలననే కలుగును. కనుక ఆత్మైక్యబోధ కలిగిన పిదప సమస్తభేదములు నశించును. శ్రీ జ్ఞానేశ్వరులు మొదలగు అధ్యాత్మజ్ఞాన సంపన్నులగు మహాత్ములు శాస్త్రీయ

సిద్ధాంతములకు సంబంధించిన కొన్ని యంశములయందు పరస్పర మేకీభవింపకున్నను, *వారు వచించురీతిని వారు అనుభవము పొందియుండిరేని* అందటి యొక్క అనుభవమును ఒక్కటిగనే యుండును. భేదముండదని నావిశ్వాసము. కనుక మనమును వారి అనుభవమును మాత్రమే మనమునం దుంచుకొని అట్టి అనుభవమును పొందిన మహాత్ములు మనకు ప్రసాదించిన అమృతమును మనము పానము చేయుదుము గాక. మనకు మార్గమును సుగమము చేసిన శ్రీ జ్ఞానదేవాదులకు భక్తిపూర్వకముగ ప్రణామము లాచరించి యింతటితో ఈ ప్రసక్తి విరమించి ముందునకు సాగి పోవుదము గాక.-

శ్లో॥ నమశ్శివాభ్యాం పశుపాలకాభ్యాం
జగత్త్రయీరక్షణ బద్ధహృద్భ్యామ్।
సమస్త దేవాసుర పూజితాభ్యాం
నమో నమ శ్శంకర పార్వతీభ్యామ్॥

ఇది పరమేశ్వరానుగ్రహమువలన మట్టిబోయిన రామసుబ్బయ్యచే
రచియింపబడిన "బ్రహ్మజిజ్ఞాస"
చతుర్థభాగమందలి "శివుడు-శక్తి" అను
మొదటి ప్రకరణము, సంపూర్ణము.
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః



ఓమ్

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# బ్రహ్మ జిజ్ఞాస

## చతుర్థ భాగము

## రెండవ ప్రకరణము : అచలబోధ

"నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం

విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్|

ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం

భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి||"

### (౧) ఆరంభము

జిజ్ఞాసువు:- అయ్యా! మీ అనుగ్రహమున శ్రీ జ్ఞానదేవ మహారాజుగారి యొక్కయు, శ్రీ అరవిందులయొక్కయు, శ్రీ సమర్థరామదాస స్వామివారి యొక్కయు శివ-శక్తుల తత్త్వ మిట్టిదని వింటిని. శ్రీ శివరామ దీక్షితుల అచటబోధ యెట్టిదో అనుగ్రహించి తెలుపుడు.

వేదాంతి:- దీక్షతులవారి* అచల బోధను తెలిసికొనుటకు ముందు వినవలసిన దంతయు వినియున్నావు. ఇప్పుడు అచలబోధ వినుటవలన అది ప్రస్థానత్రయమునకు సమ్మతమో, కాదో, గ్రహింపగలవు.

### (౨) దీక్షితులవారి కాలము - అచల బోధకు చెందిన సారస్వతము:-

దీక్షితులవారు "బృహద్వాశిష్ఠ సిద్ధాంతము" అను "శివ రామ దీక్షితీయము" అను గ్రంథమును వ్రాసియున్నారు. వీరు తెలంగాణాలోని నల్లగొండజిల్లా

---

* ఈ గ్రంథమున "దీక్షితులు" లేక "దీక్షితులవారు" అనిన, అచల వేదాంతమతస్థాపకులగు శ్రీ రాముడుగు శివరామ దీక్షితులని పాఠకమహాశయులు తెలిసికొనవలెనని మనవి.

నారాయణపురం కాపురస్థులు. బ్రాహ్మణకులజులు. "బృహద్వాశిష్ఠ సిద్ధాంత"* గ్రంథముయొక్క రెండవ సంపుటమున వీరి భక్తులు వీరి చరిత్రమును గద్య పద్యములతో వ్రాసి అచ్చువేయించి యున్నారు. అది ఒక కట్టుకథవలె తోచుచున్నది. వీరి "చిత్రపటమును" గ్రంథాదియందు ముద్రించిరి. అది వీరి ఛాయాచిత్రము గాని, వీరి కాలమున లిఖింపబడినదిగాని కాదు. అది కేవలము ఊహాచిత్రమై యుండవచ్చును. ఆ చిత్రము కందిమల్లాయపల్లె వీరబ్రహ్మస్వాములవారి చిత్రమును పోలియున్నది. వీరబ్రహ్మస్వాములవారి చిత్రపటమని ప్రచారములో ఉన్నది సహితము చిత్రకారుని ఊహాచిత్రమే.

దీక్షితులవా రేకాలము వారైనది స్పష్టముగ తెలియకపోయినను ఈ క్రింది ఆధారములను బట్టి యిప్పటికి సుమారు రెండువందల సంవత్సరముల నాటి వారని యూహింపవచ్చును. - దీక్షితులవారి శిష్యులు కంబాలూరి అప్పారావుగారు. వీరి శిష్యులు పరశురామ సీతారామస్వామిగారు. వీరి శిష్యులు భాగవతుల కృష్ణదాసుగారు. వీరు తాము రచియించిన కందపద్యములయందు

భాగవత వంశభవుడను

భాగవతోత్తముల పాదపద్మంబులకున్

సాగిలి మొక్కె వాడను

బాగుగ నను జనులు కృష్ణభట్లందురిలన్. (కం. 21)

అని వ్రాసికొనియున్నను కృష్ణభట్లనుపేరు వాడుకలో లేదు. వారి సంప్రదాయమునకు సంబంధించిన వా రందఱు "కృష్ణదాసు" గారని పిలుచుచుండుటచే నేనును కృష్ణదాసుగారనియే యంటిని. కృష్ణదాసుగారు "శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థదరువులు" అను గ్రంథమును శా. శ. 1784వ సంవత్సరమునందును రచియించినట్లు ఆగ్రంథముల యందు చెప్పియున్నారు.

* బృహద్వాసిష్ఠమని వ్రాయునపుడు "వసిష్ఠ" నామమున మధ్యమ వర్ణము (సి) అనిగాని (శి) అనిగాని వ్రాయవచ్చునని శ్రీ వెన్నెలకంటి సుందరరామ శర్మగారు చెప్పియున్నారు. అయినను వారు ముఖ్యముగా పుంలింగమున "వసిష్ఠ" యని (సి) వర్ణమును, వాసిష్ఠము అను గ్రంథనామమున 'శి' వర్ణమును వ్రాసియున్నారు. అంత్యవర్ణమును 'ష్ఠ' అని వ్రాయవలయునేగాని 'ష్ట' అని వ్రాయకూడదు. శ్రీ శివరామ దీక్షితులవారి గ్రంథనామమున దానిని ముద్రించినవారు "బృహద్వాశిష్ట" అని వ్రాసియున్నారు. పుంలింగ మగునపుడు కూడ 'వశిష్ట' అని వ్రాసియున్నారు. నేను సాధ్యమయినంతవఱకు 'ష్ఠ' అని దిద్దికొని వ్రాసితిని.

అనంతోపనిషత్తు* అచలబోధకు మూలగ్రంథమని యందురు. అదియును దీక్షితులవారు రచియించిన "బృహద్వాశిష్ఠ సిద్ధాంతము" **కృష్ణదాసుగారిచే రచియింపబడిన పైన చెప్పిన కందార్థములు, కందములు-బాలారామ్ అనువారు రచియించిన "ద్విపదార్థదరువులు", ఈ సంప్రదాయమునకు చెందినవారు కొందఱు రచియించిన కీర్తనలు, మొదలగు గ్రంథముల వలన దీక్షితులవారి మతమిట్టిదని తెలియును.

జిజ్ఞాసువు:- అనంతోపనిషత్తు అష్టోత్తరశతోపనిషత్తులలోని దేనా?

వేదాంతి:-కాదు. ఆగ్రంథమునకు పీఠిక వ్రాసినవారు "'మహానారాయణోపనిషత్తు' యొక్క యంతర్భాగ మగునదియే ప్రస్తావంబున నుండెడు ఈ యనంతోపనిషత్తు" అని వ్రాసిరి. 'త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు' అష్టోత్తరశతోపనిషత్తుల లోనిదే. కాని, అందులో ఈ అనంతోపనిషత్తు లేదు. త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు నందు"త్వమేవ తుర్యాతీతః త్వమేవ అనంతోపనిషద్విమృగ్యః" (నీవే తుర్యాతీతుడవు, నీవే అనంతోపనిషత్తుచేత నెఱుగ బడువాడవు) అను వాక్య మున్నది. ఆయర్థము నాధారముగా గైకొని యెవరో అనంతోపనిషత్తనుపేర మూడు మంత్రములును ముప్పదిమూడు శ్లోకములును గల గ్రంథమును రచియించి యుందురు.

---

* అనంతోపనిషత్తును 1925వ సంవత్సరమున, బొగ్గర-అది నారాయణయ్యగారిచే - "అచల యోగులగు" అరణబూడిదవాకము నాప-మునుసామయ్యగారి యొక్కయు స్వానుభవానుగుణముగ ప్రతిపద టీకా తాత్పర్యము రచియింపబడినట్లును "అచలయోగి" పమ్మి త్యాగరాయసెట్టిగారు ముద్రించి ప్రకటించినట్లును కలదు అనంతోపనిషత్తు ప్రతినే నే నా గ్రంథమున ఉదాహరించితిని

** బృహద్వాశిష్ఠసిద్ధాంత మను గ్రంథము పూర్వభాగమనియు, ఉత్తరభాగమనియు రెండు భాగములుగ ఉన్నది. పూర్వభాగమున 11 ప్రకరణము లున్నవి ఉత్తరభాగమున 6 ప్రకరణము లున్నవి ఉత్తర భాగమునందలి ప్రకరణములు అధ్యాయములుగ విభజింపబడినవి ఇందు 1 నుండి 5 ప్రకరణములవఱకు ఒక్కొక్క ప్రకరణము నాలుగేసి అధ్యాయములుగను, 6వ ప్రకరణము మాత్రము 12 అధ్యాయములుగను విభజింపబడినది

బ్రహ్మజిజ్ఞాసయందు బృహద్వాశిష్ఠ సిద్ధాంతమునందలి వాక్యముల నుదాహరించినపుడు పూర్వభాగమునకు "పూ" అనియు ఉత్తర భాగమునకు "ఉ" అనియును, ప్రకరణమునకు "ప్ర" అనియు, అధ్యాయమునకు "అ" అనియును సంకేతాక్షరములను, వాటిని సూచించు సంఖ్యలను నిడితిని కొన్నిచోట్ల ఉదాహరించిన వాక్యములకు అయాపుటల సంఖ్య నిడితిని అచట పుట అనుటకు మారుగ "పు" అను సంకేతాక్షరము నుంచియున్నాను.

## (3) దీక్షితులవారి గురు శిష్య పరంపర

దీక్షితులవారు తమ గురుశిష్య పరంపరను గుఱించియు తమ సంప్రదాయ రహస్యమును గుఱించియు తమచే రచియింపబడిన బృహద్వాశిష్ఠసిద్ధాంత మను గ్రంథమున నిట్లు చెప్పిరి:-

"శ్రీ కృష్ణస్వామికి తగ్గ గురువు సాందీపుడే* గాని, మరివొకరు లేరు. సాందీపులకు వశిష్టునకు చాలా యెక్కువ తక్కువ వున్నది. గురుభావం శ్రీకృష్ణస్వామి అయిన శిష్యుడు యెరుగు. శిష్యునియొక్క ప్రభావం శ్రీధరస్వామి యెరుగు. యీ ముగ్గురు యొక్క ప్రభావం యీపుస్తకం వ్రాసినవారు యెరుగు....

ఈ పుస్తకంచూచి చదువుకొన్నవారికి నలుగురి ప్రభావం .... తెలుస్తుంది. శీఘ్రంగా భ్రాంతిలేనివాడు అయ్యి .... వుంటాడు. యీ అభిప్రాయం గురుముఖంగా విచారించినవారికి యే సిద్ధాంతం వుండదు. జ్ఞాన ఖర్మలయొక్క భ్రాంతి పుట్టదు. ..... యింత కన్న యెక్కువ వున్నదని ఆశ పుట్టదు. యీ శరీరమందు ..... శరీరం లేనిది సూచన అయితే సర్వం శరీరం పాయ".

(బృ. ఉ. ప్ర. 6-అ 12)

"భగవద్గీత గుహ్యయైతే జ్ఞానేశ్వరులవారికే తెలుసు. శ్రీ భాగవతం యొక్క రహస్యము శ్రీధరస్వాములవారికే తెలుసు. శ్రీ శుకులు శ్రీధరస్వాములవంటివారు కారు. పృథ్వి యందు శ్రీ కృష్ణస్వామియొక్క నిజ స్వరూపం శ్రీధరస్వామికే గాని మరి వొకరు యెరిగేటందుకు తోచదు".

(బృ. ఉ. ప్ర. 6-అ12)

పై వాక్యములవలన ద్వాపర యుగాంతమున నున్న సాందీపని నుండి శ్రీకృష్ణభగవానునకును, వారి నుండి శ్రీజ్ఞానేశ్వరులకును, వారినుండి శ్రీధరస్వామిగారికిని, వారి నుండి దీక్షితులవారికిని నీ సంప్రదాయ సిద్ధాంత (జ్ఞాన)ము ప్రాప్తించినట్లు చెప్పుకొనిరని మన మూహింపవచ్చును. కాని, శ్రీ జ్ఞానేశ్వరుల సంప్రదాయ గురు పరంపరయు, దీక్షితులవారి గురు పరంపరయు, వేఱు వేఱని శ్రీ జ్ఞానేశ్వరులచే చెప్పబడిన వారి గురుపరంపరవలన విదితమైనది.

---

* శ్రీకృష్ణ భగవానుని గురువు సాందీపుడని అచల వేదాంతుల గ్రంథములయందు కలదు శ్రీమద్భాగవతాది పురాణముల యందు "సాందీపని" అని యున్నది. "సాందీపుడు" అని లేదు.

శ్రీ జ్ఞానేశ్వరులకును దీక్షితులవారికిని మధ్య శ్రీధరస్వాములవారిపేరు వినబడుచున్నది. ఈ శ్రీధర స్వాములవా రెవరైనదియు తెలియదు శ్రీమద్భాగవత. శ్రీవిష్ణుపురాణ, శ్రీభగవద్గీతలకు వ్యాఖ్యలు రచియించిన సుప్రసిద్ధ శ్రీధరస్వామివారు అద్వైతులను విషయము లోకవిదితమే వీరు 'అచల' సంప్రదాయమునకు చెందినవారు కారు. శ్రీధరస్వాములవారు గీతకు "సుబోధిని" అను వ్యాఖ్యను రచియించియున్నారు. అందులో కొన్ని ముఖ్యాంశములకు చెప్పిన వ్యాఖ్యానము జ్ఞానేశ్వరులు గీతకు రచియించిన వ్యాఖ్యానమునకంటె భిన్నమైనది. ఇందువలన కూడ పై శ్రీధరస్వామి వారును భిన్నులని తోచుచున్నది. భగవద్గీతకును, సంస్కృత భాగవత, విష్ణుపురాణములకును వ్యాఖ్యానములు రచియించిన శ్రీధర స్వామివారు క్రీ. శ. 10-వ శతాబ్దము నాటివారని పండితుల అభిప్రాయము. శ్రీధరస్వామివారు భాగవతమును తెనిగించిన బమ్మెరపోతనగారి కంటె పూర్వులనుట నిర్వివాదము. ఆంధ్రభాగవతమున శ్రీధరస్వాములవారు భాగవత పురాణమునకు వ్రాసిన "భావార్థదీపిక" అను వ్యాఖ్యానములోని అంశములను కొన్నింటిని పోతనగారు తెనిగించి యున్నట్లు పండితు లంగీకరించియున్నారు. పోతనగా రిప్పటికి సుమారు అఱువందల సంవత్సరముల క్రిందటివారు. కనుక శివరామదీక్షితులవారి గురువు ఈ శ్రీధరస్వాములవారు కారు. మహారాష్ట్రదేశమున* "శ్రీధరకవి" యను పేరు శ్రీ సమర్థ రామదాసస్వామివారి జీవిత చరిత్రమునందు వినబడుచున్నది. బహుశః ఆ శ్రీధరకవియే దీక్షితులవారు చెప్పు శ్రీధరస్వాములై యుండవచ్చును.

వీరిని గుఱించి విజ్ఞానసర్వస్వమున నిట్లున్నది :- "పదునెనిమిదవ శతాబ్దివాడగు మహీపతి మహాఋషులయు, భక్తజనులయు జీవితచరిత్రలను రచియించెను. ఇవి విశ్రుతముగ ప్రజాదరణమును ఆర్జించినవి. ఈతని సమకాలికుడగు శ్రీధరుడు తాను రచియించిన రామవిజయ, పాండవప్రవాస,

---

* మహారాష్ట్రమునందు 1. శ్రీసమర్థరామదాసస్వామి, 2. జయరామస్వామి, 3. రంగనాథస్వామి, 4. ఆనందమూర్తి, 5. కేశవస్వామి అను వారైదుగురు సుప్రసిద్ధ సాధుపురుషులు వీరు భిన్న భిన్న కాలములకు చెందినవారైనను వీరిని ఆ ప్రాంతీయులు "రామదాస పంచాయతన" మని పిలుతురు. పైన పేర్కొనిన యేవురలో 3వ వారగు రంగనాథస్వామి అన్నగారి కుమారుడు శ్రీధరకవి. వీరినే 'శ్రీధరస్వామి' యని దీక్షితులవా రనియుండవచ్చును వీరు కొన్ని గ్రంథములు రచియించిరి శ్రీ రంగనాథస్వామి క్రీ. శ. 1684 లో సమాధి చెందిరి. దీక్షితులవారి కాలము వీరికాలముతో నించుమించు సరిపోవును

హరివిజయములచే క్రమముగ రామాయణ, మహాభారత, భాగవత కథలకు విపుల ప్రచారము కలిగించెను. అతని 'శివలీలామృత్' శైవులకు మాననీయగ్రంథము." (వి. స. 6 వ సం. పుట. 340)

ఈ సంప్రదాయమునకు చెందిన గురువు వలననే యీ బోధ లభ్యమగును గాని యీ సంప్రదాయ గ్రంథములు చదివినంత మాత్రమున తెలియదని అచలవాదు లందురు. ఇట్టి వాక్యములు మనదేశమున ప్రతి సంప్రదాయమునకు చెందిన వారును చెప్పుచుండుట పరిపాటియైనది. వీరి గ్రంథమున కొన్ని సంకేతాక్షరముల నుంచిరి. ఉదాహరణమునకు, దీక్షితులవారు వారి సంప్రదాయమును గుఱించి చెప్పిన పైవాక్యములలో 'ం ం ం' మూడు సున్న లుంచియున్నారు. దాని అర్థము వారికే తెలియవలెను. ఇతరులు వాని కేయర్థము నైనను చెప్పవచ్చును. నాకు తోచిన అర్థమును ఈ క్రింద వివరింతును.

దీక్షితులవారి పైవాక్యములయందు మూడుసున్నలు (ం ం ం) మూడుచోట్లను, (ం ం ం ం) నాలుగుసున్నలు ఒక చోటను వ్రాసియున్నారు. సున్న (ం) దీనికి గణితశాస్త్రమునందు అర్థమున్నది. అర్థము లేదు. అందు సున్న ఉండుస్థలము, సందర్భములను బట్టి దానివిలువ స్వరూపము మారుచుండును. గణితశాస్త్రము మాట అటుంచి లోకవ్యవహారమునందు సున్న (ం) శూన్యమని అర్థము. "పరీక్షలలో ఫలానా వారి అబ్బాయికి ఎన్ని మార్కులు వచ్చిన" వని ఉపాధ్యాయుని మన మడిగిన మార్కులు ఏమీ రాలేదని అర్థము నిచ్చునట్లు 'సున్నవచ్చినది' అని ఉపాధ్యాయు డనును. ఇచట సున్న ('ం') శూన్యార్థబోధకము.

సున్న (ం) అనగా - పూర్ణబిందువు. పూర్ణమునకు సూచకము (హద్దులు లేనిది) ఏలయన - పూర్ణబిందువు ఆద్యంతరహితము. అనగా - దానికి ఆది యెచటనో అంతము అచటనే. అవి రెండును కలసిపోయి యుండుటచే ఆద్యంతములు తెలిసికొనుట కష్టము. కనుక బిందువు (ం)ను ఆద్యంతరహిత మనిరి. కాని అది ఆద్యంత రహితమగు బ్రహ్మమునకు చిహ్నము (సూచకము) కాదు. ఆద్యంతరహిత వస్తువును మానవు డూహింపజాలడు. కనుకనే బ్రహ్మము మనోవాక్కుల కంద దనిరి.

బిందువు, లేక సున్న (ం)బ్రహ్మాండమునకు చిహ్నముగా ఉపయోగింపవచ్చును. బ్రహ్మముయొక్క అండము (గ్రుడ్డు) వర్తులాకారము. బ్రహ్మాండము (విశ్వము) వర్తులాకారముగా నున్నది. కనుక దానిలోని భూమి,

సూర్యుడు, నక్షత్రములు, గ్రహములు అన్నియు వర్తులాకారము (౦) గా ఉన్నవి విశ్వము వ్యావహారిక సత్యమే అయినను, పరమార్థ దృష్టితో సున్న (౦) శూన్యమే (లేనిదే) కనుక ఆవిధముగా '౦' కు అర్థము చెప్పవచ్చును.

దీక్షితులవారి గ్రంథము నేను చదివియున్నాను కనుక ౦౦౦ సున్నలు- స్థూల, సూక్ష్మ, కారణ శరీరములని; నాలుగవ (౦) సున్న మహాకారణ శరీరమైన ఆత్మయని (ఇది వారి అభిప్రాయము), అదియు శూన్యమే యని వారి భావమై యున్నట్లు వారి గ్రంథమును చదివిన విదిత మగును.

శ్రీ శివరామదీక్షితుల అచలబోధను ఉపదేశించు చున్నామని చెప్పెడివారిలో ప్రసిద్ధి కెక్కినవారు కీర్తి శేషులు శ్రీ పోకల శేషాచలంనాయుడు గారు. వీరికి శిష్యు లనేకులు కలరు. శ్రీ నాయుడుగారు శివరామదీక్షితుల 'బృహద్వాశిష్టసిద్ధాంత' మను గ్రంథమును సంగ్రహించి "శివరామదీక్షితీయమను అచలగ్రంథము" అనుపేర 1888 వ సంవత్సరమున ముద్రించిరి. వీరిశిష్యులలో ఒకరగు పోలకం నరసింహం శెట్టిగారు "శ్రీకృష్ణరుక్మిణీసంవాద మను సుజ్ఞాన శాస్త్రము" అను గ్రంథమును గద్యపద్యాత్మకముగ రచియించిరి. ఇది కొంత వ్యాప్తిగల గ్రంథము. ఇందు సాంఖ్య, తారక, అమనస్క, అచలములను నాలుగును నాలుగాశ్వాసములయందు క్రమమున రచియించిరి. ఇందలి అచల బోధకు, దీక్షితులవారి గ్రంథమునందలి అచలబోధకును అచ్చటచ్చట భేదమున్నది. వీరి గ్రంథమునందు వీరి గురు శిష్య పరంపరను గుఱించి యీ క్రింది విధముగ వ్రాసిరి:-

శ్రీ శేషాచలంనాయుడుగారిగురువు కోటప్పదేవరగారు. వీరి గురువు మహేశ్వరుడుగారు. వారి గురువు రామకృష్ణుడుగారు. వారి గురువు శివరామదీక్షితులవారు. శ్రీరామకృష్ణుడు శివరామదీక్షితులవారి శిష్యులు కాకపూర్వము శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారి శిష్య పరంపరకు చెందినట్లు చెప్పియున్నారు.

## (ళ) అచలవాదులలో రెండుశాఖలు

ఆంధ్రప్రదేశమునం దచ్చటచ్చట పలువురు గురువులు శిష్యులను చేర్చుకొని అచలబోధను చేయుచున్నామని చెప్పుకొనుచున్నారు. వీరు భిన్న భిన్న గురుపరంపరకు చెందిన వారైనను మూలమున అందఱును శివరామదీక్షితులవారి

పీఠమునకు చెందినవారమే యనియు, అచలబోధయే తమ మతమనియు చెప్పుకొనుచు, అచలబోధకు చెందిన గ్రంథములనే ప్రమాణముగా గైకొని చదివి మననము చేయుచున్నారు. వీ రందరిని రెండు తెగలుగ భావింపవచ్చును. ఇందులో ఒకరు మితవాదులు, వేఱొకరు అతివాదులు.

(1) మితవాదుల వాదము :- మరణానంతరము శరీరమునం దేమియు మిగులదని, పునర్జన్మము లేదని, పరలోకగమన మనునది లేదని చెప్పు వర్గము. వీరిని మితవాదు లనవచ్చును.

(2) అతివాదుల వాదమును వినుము .- బ్రహ్మవాదులు (వేదాంతులు) పరబ్రహ్మము నిర్గుణము, నిర్విశేషము, శుద్ధచైతన్యస్వరూపమని చెప్పుదురు. ఇది ఉపనిషత్తుల మతము. అచలవాదులు ఇందులకు వ్యతిరేకముగా చెప్పుదురు. ఎట్లన:- బ్రహ్మము, మాయ, ప్రకృతి, అవ్యక్తము, సత్తు, చిత్తు, త్రిగుణాత్మకత, పరాప్రకృతి, చైతన్యము, శుద్ధచైతన్యము, ఎఱుక, జ్ఞానము, అక్షరము, ఆత్మ, ప్రత్యగాత్మ, జీవుడు, దేహము, అక్షరము, అపరాప్రకృతి అని చెప్పబడునవి చలము; ఇవి చలించునట్టివి. ఇదే లేని యెఱుక క్షణభంగుర మైనది. ఇందులో నేదైనను ఎఱుకయే.

దీనికంటె వేఱైనది-అచలము, పరిపూర్ణము, కేవలాత్మ, బయలు అను నామములచే వ్యవహరింపబడునది. ఇదియే బట్టబయలు లేక పరబాహ్యము. ఇది సర్వవ్యాపి. చైతన్యము కాదు. ఇది తన్ను తానెఱుగదు. ప్రపంచమును ఎఱుగదు. దేనినైనను నెఱుగుటకు దీనికి నెఱుక లేదు. ఇది నిత్యము, నాశరహితము.

అచలము, మాయ (చలము) కాదు; చలము, అచలము కాదు. ఈ రెండింటికి ఐక్యము లేదు. మాయ అచలమునకు పుట్టలేదు. కాని అచలమునందే ఉన్నది :-

బ్రహ్మము అనబడు మాయ బ్రహ్మాండ రూపమున పరిణమించినది. అదే శరీరము - అందులోని యెఱుక (జ్ఞానము)గా పరిణమించినది.

మఱియొక విధముగాకూడ చెప్పియున్నారు. మాయ దేహి దేహముగా మారినది. దేహి (యెఱుక) తానున్నట్లు బ్రహ్మాండము లున్నట్లు తానే

కల్పించుకొన్నది గాని ప్రపంచ మనునది పుట్టనే లేదు - జనన మరణ భ్రాంతి అచలబోధ వలన తొలగిపోవును.

మితవాదులు, అతివాదులు అను నీ సంకేతనామములు బోధ సౌలభ్యము కొఱకు నే నేర్పర్చుకొన్నవేగాని వీటికి ప్రత్యేకమైన అర్థమేమియు లేదు. ఈ యిరుపక్షముల వారికిని శ్రీ దీక్షితులును, వారి శిష్యవర్గము వారును వ్రాసిన గ్రంథములే ప్రమాణము. "బృహద్వాసిష్ఠ సిద్ధాంతము" నందలి దీక్షితులవారి వాక్యములకు వీ రిరువురు భిన్నార్థమును చెప్పుదురు.

## .(౫) అచలబోధ తెలిసికొనుటకు అనధికారులు - అధికారులు

అచలబోధను తెలిసికొనుటకు అనర్హు లిట్టివారని, అర్హు లిట్టివారని దీక్షితులవారు తెలియజేసిరి. దీనినిబట్టి వారి బోధ యిట్టిదని మనము కొంతవఱకు ఊహింపవచ్చును. వారిట్లు చెప్పిరి:-

**అనధికారులు :- (1) మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అయివున్న పతితులకు చెప్పవద్దన్నారు. (2) శాస్త్రాలు నిబద్దే అని నమ్మియున్నవారికి చెప్పవద్దన్నారు. (3) యెదురు బడి వాదించేవారికి చెప్పవద్దన్నారు. (4) గురుసేవ చెయ్యని వారికి చెప్పవద్దన్నారు. (5) నేను యేది అంటే అదే అనే మూర్ఖులకు చెప్పవద్దన్నారు. (6) స్త్రీభ్రాంతి యున్నవారికి చెప్పవద్దన్నారు. (7) జ్ఞానభ్రాంతి యున్నవారికి చెప్పవద్దన్నారు. (8) భక్తభ్రాంతి యున్నవారికి చెప్పవద్దన్నారు. (9) వైరాగ్యం దొడ్డదనే మూర్ఖులకు చెప్పవద్దన్నారు. (10) మొద్దుబుద్ధి గల వారికి చెప్పవద్దన్నారు. (11) అది నేను కావలెనని భ్రాంతివున్న వారికి చెప్పవద్దన్నారు. (12) అది నేను అయితినని అనుభవం కావలెనని భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు. (13) నేను అని వాదించేవారికి చెప్పవద్దన్నారు. (14) శ్రవణభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు. (15) ధ్యానభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు. (16) మననభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు. (17) ద్వైత భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు. (18) అద్వైతభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు. (19) విశిష్టాద్వైతభ్రాంతి వున్న వారికి చెప్పవద్దన్నారు. (20) మతాంతరభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.**

**అధికారులు:- (1) సూచన చేయగనే కనుక్కొనే వారికి చెప్పమన్నారు. (2) స్త్రీలేగాని, పురుషులేకాని భ్రాంతి రహితము కావలెనని మిక్కిలి యిచ్ఛ వున్నవారికి చెప్పమన్నారు."** (బృ. పూ ప్ర.)

అచలబోధను తెలిసికొనుటకు దీక్షితులవారు పైన చెప్పిన యిరువది అనర్హతలందు ఏయొక్కటి యున్నను అట్టివాడు అనర్హుడని తాత్పర్యము. 1, 4, 5, 6, 10, 20 సంఖ్యలయందు చెప్పిన అనర్హతలు తప్ప తక్కిన సంఖ్యల యందు చెప్పబడిన అనర్హత లనునవి దీక్షితులవారి దృష్టిలో మాత్రమే అనర్హతలుగాని అందులో కొన్ని అద్వైతమును తెలిసికొనగోరు జిజ్ఞాసువులకును, కొన్ని ద్వైతమును తెలిసి కొనగోరువారికిని, కొన్ని విశిష్టాద్వైతమును నెఱుగగోరు వారికిని అవశ్యముగ ఉండవలసిన అర్హతలు. వీటియందు కొన్ని కొందఱకు సరిపడకపోయినను ముఖ్యముగ భక్తి, జ్ఞానము, వైరాగ్యము, శ్రవణము, ధ్యానము అను నైదును వేదాంతులయందలి అన్ని శాఖలకును (దీక్షితులవారికి తప్ప) అవసరమే. అవి లేనివారికి పరమార్థజ్ఞానము పట్టుబడదు. భక్త్యాదు లున్నవారు అచలబోధ కనర్హులని దీక్షితులవారు చెప్పిరి. ఇందువలన అచలబోధకు విరుద్ధము వేదాంతము. వేదాంతమునకు విరుద్ధము అచలబోధ. ఈవిధముగా అచలబోధ స్వరూపమును స్థాలీపులాకన్యాయముగ మన మెఱుగ వచ్చును.

## (౬) మంత్రత్రయము

దీక్షితులవారు మూడు మంత్రములను చెప్పిరి. వారి బోధయంతయు ముక్కాలుపీఠమువలె మూడు మంత్రముల పైన నిలిచియున్నది. క్రింద చెప్పబోవు మూడు మంత్రములకు విపులమగు వ్యాఖ్యానమే 'బృహద్వాశిష్ట సిద్ధాంత' గ్రంథమంతయు నని చెప్పవచ్చును. అందు మొదటి మంత్రము:-

(1) **"ఈ మూలం లేని గుర్తెరిగే శరీరం యేమీ లేదు"** కొన్నిచోట్ల **"మూలము లేని గుర్తెరిగే శరీరం యేమీ లేదు"** అని కూడా కలదు. ఇందులో పదునాఱక్షరము లున్నందున దీనిని షోడశాక్షరీ మంత్రమందురు. దీనికి సంస్కృతము **"మూలాభావ మిదం జ్ఞాతం శరీరం నాస్తి కేవలమ్"** అని యున్నది. కొందఱు దీనినే **"మూలాభావ మిదం జ్ఞాతుం శరీరం న కిమస్తి తే"** అని చెప్పుదురు.

(2) **"కలదోచిన శరీరము యేలాగో అలాగే"** ఇది పంచదశీమంత్రమట.

(3) **"ఈ ఉత్త బట్టబయలు యేమీ లేదు"** ఇది ద్వాదశాక్షరీమంత్రమట.

***అనంతోపనిషత్తునందు*** నీ మంత్రములును, వాటి అర్థమును నీ క్రింది విధముగా వ్రాయబడినది:-

**(1) "మూలాభావ మిదం జ్ఞాతం శరీరం కిము నాస్తి హి!"**

టీ. "మూలం=జ్ఞాతకును, శరీరాదులకును కారణమగు మాయ, అభావం=మిథ్య (అనగా లేనిది), ఇదం జ్ఞాతం=ఈ గుర్తెఱుగు నెఱుకయును, శరీరం=నశించునట్టి శరీరమును, కిము నాస్తి హి=ఎప్పుడును లేదు గదా! (అనగా ఏమియును లేదు)" (ఇది షోడశాక్షరీమంత్రము).

తా. "మూలములేని గుర్తెఱిగే శరీరం ఏమి లేదు అనగా : జ్ఞాతకు శరీరాదులకు కారణమగు మాయ లేని దగుటచేత, కార్యములగు శరీరాదులును వానిని గుర్తెఱుగు నట్టి ఎఱుకయును ఎప్పుడును లేనిదని భావము."

**(2) మం|| "స్వప్నే ప్రతీయమానాని రూపాణి యథా తథా!"**

టీ. "స్వప్నే=స్వప్నమునందు, ప్రతీయమానాని=తోచునట్టి, రూపాణి=రూపములు, యథా తథా=ఏలాగో ఆలాగే.

తా. కల దోచిన శరీరము ఎలాగో ఆలాగే. అనగా: కలలో దోచిన రూపములు జాగ్రత్తయందును ఏలాగున లేకపోవుచున్నవో ఆలాగుననే స్వానుభవమునందు మాయయును బ్రహ్మము లేకపోవుచున్నదని భావము. దీనికి ముఖ్యాభిప్రాయము ఏమనగా : అది నామరూపము క్రియారహితమగు నవాఙ్మానస గోచర మగుటచే బ్రహ్మ మనుటకు వీలులేదని తాత్పర్యము. "పై మంత్రమున పదునైదక్షరము లున్నందున 'పంచదశి' మంత్రమందురు.

**(3) మం|| "అయం వ్యర్థః బాహ్యః కోఽపి న భవతి"**

టీ. "అయం=ఈప్రపంచము, వ్యర్థః=నిరర్థకము, బాహ్యః=బట్టబయలు, కోఽపి న భవతి=ఏమియును లేదు."

**తా|| "ఉత్తదీ బట్టబయలు ఏమీ లేదు. అనగా; అయ్యది అవాఙ్మానసగోచర మగుటవలన మాయ యనిగాని, బ్రహ్మమని గాని, బయలనిగాని నిర్దేశించుటకు**

వీలులేదని భావము." పై మంత్రమున పంద్రెండక్షరము లున్నందున 'ద్వాదశాక్షరి' మంత్ర మందురు.

ఈ మూడును మంత్రములని చెప్పుటకంటె సూత్రములని చెప్పిన బాగుండునేమో. ఈ మంత్రములు శివపంచాక్షరి, వాసుదేవ ద్వాదశాక్షరి, నారాయణ అష్టాక్షరి- మంత్రములవలె జపము చేయదగినవి కావు.

*'విజయదుందుభి' లో పై మూడు మంత్రములు.*

శ్రీ జ్ఞానదేవులు 'అమృతానుభము' ను మహారాష్ట్ర భాషయందు రచియించిరని చెప్పియుంటిని. ఆ గ్రంథమునకు 'విజయదుందుభి' అను ఆంధ్రవ్యాఖ్యానమును రచియించిన శ్రీ స్వామ్యమృతానందతీర్థ కలగ ఆంజనేయశాస్త్రిగారు రచియించిన ఉపోద్ఘాతమునందు, ఈ క్రిందివిధముగ నున్నది.

"శ్రీ జీవన్ముక్త యతీంద్రులవారు పదబోధిని యను వ్యాఖ్యానము పేర గీర్వాణభాషానువాదము గావించి పండితలోకమున కందజేసిరి."

"మరియు నీ మహారాష్ట్ర భాషయందున్న విషయముల నెఱుక పరచుటకై అల్పజ్ఞానము కల ముముక్షువుల హితమును గోరి శ్రీ శివకళ్యాణనామక విద్వద్వరేణ్యులు నా మూల గ్రంథమును సమన్వయపరచి స్వల్ప టీకను వ్రాసియున్నారు. ఈ విషయము ముందు చెప్పబోవు ప్రస్తావనయందు పాఠకులు గ్రహింపగలరు. సంస్కృతానువాదకులు శ్రీ జ్ఞానేశ్వరులచే రచియింపబడిన మూలగ్రంథమును టీకాకారులయొక్క టీకను గూడ గీర్వాణభాష ననువదించియున్నారు."

శ్రీ కలగ ఆంజనేయశాస్త్రి పైన చెప్పిన గీర్వాణభాషానువాదము ననుసరించి 'విజయదుందుభి' నామ కాంధ్రానువాదమును గావించిరి. కాని, నాకు విజయదుందుభి యందు మొదటి మూడు ప్రకరణములు గల ప్రథమసంపుటము ఒకటిమాత్రము లభించినది. మిగత గ్రంథముకొఱకు ప్రయత్నించితిని. కాని, ముద్రింపబడినదో, లేదో నాకు తెలియదు. నాకు లభింపలేదు.

పైన చెప్పిన విజయదుందుభియందలి మూడవ ప్రకరణమునందు **182, 186, 187**వ పుటలయందు అనంతోపనిషత్తునందు పైన చెప్పిన మూడు మంత్రము లున్నవి. అవి సంస్కృతమున మాత్రమే కలవు. వాటిని

విజయదుందుభి అంగీకరింపలేదు. అదియునుగాక, విజయదుందుభియందు వాటిని మంత్రములని పేర్కొనక *'వాక్యములు'* అని మాత్రమే చెప్పినది.

శ్రీ జ్ఞానేశ్వరులవారు ఇట్లు చెప్పిరి :-

శ్లో॥ **జ్ఞానాంతరేణ శ్లాఘ్యా చే ద్వ్యర్థం జ్ఞానస్వకం తదా।**
**స్వావిర్భావం తు దీపేన కో మన్యేత వినా భ్రమమ్॥** (3-19)

వచనము:- "అంతియగాక ఆత్మయొక్క మాహాత్మ్యంబున కన్యజ్ఞానం బాధారం బగుచో దద్జ్ఞాన పూర్ణత్వంబు నిరర్థకంబగు కాంతిప్రసారంబునందు దీపంబున కన్యదీపసహాయంబును స్వాతిత్వంబును గోల్పోవుటయ కాదె."
(అను. 3-20)

పై శ్లోకమునకు విజయదుందుభి వ్యాఖ్యానమునందు నీ క్రింది విధమున చెప్పబడినది-

"ఆత్మానాత్మ విచారోఽయం ముధైవ క్రియతో బుధై" అనియును, ***"అయం వ్యర్థో బాహ్యః కోఽపి న భవతి"*** అనియును పలికినారు. అనగా బాహ్యజగత్తు సత్యముగనుండి అది తనను బాధించుచున్నప్పుడు దాని బాధ నుండి తొలంగుటకు తగిన పూర్ణప్రయత్నము కర్తృత్వవశమున జేయవలయును గాని అసలే జగత్తు లేకనే ఉన్నట్లు తోచి లేనిదగుచుండగా అనగా "నాసతో విద్యతే భావో నా భావో విద్యతే సతః" అనునట్లు లేనిది విచారించినను విచారింపక పోయినను, లేనిదగుచుండగా, ఉన్నది విచారించినను విచారింపక పోయినను ఉన్నదే యగుచుండగా నాత్మానాత్మ విచారము పండితులచేత వ్యర్థముగనే చేయబడుచున్నదనియును, బాహ్యమందు ప్రపంచము లేనేలేనప్పు డీ విచారమంతయు వ్యర్థమే యనియును ఈ పరమరహస్యము శ్రీ సద్గురు ముఖంబున నెరింగి తూష్ణీం భావ స్థితినున్నవాడే యోగియని తాత్పర్యము-వాస్తవము నెరింగినయెడల నీ యెరుంగుటను లేనిదే యగుచున్నది. ఇదియే విద్యారహస్యము. మరియు ***'మూలాభావ మిదం జ్ఞాతం శరీరం నాస్తి కేవలమ్'*** అను వాక్య మీ భావమునే బలపరచుచున్నది. ఇట్లు బలపరచుటకు ముఖ్యకారణము లేని జగత్తు స్వప్నమునందువలె తోచి లేకపోవుటచేతనే పెద్దలు స్వానుభూతిని ***'స్వప్నే ప్రతీయ మానాని రూపాణి యథా తథా'*** అని నుడివినారు." (విజయదుందుభి. 186, 187)

పై వాక్యములను పరిశీలింపగా జగత్తు మిథ్యయగుట వలన ఆత్మానాత్మవిచారము వ్యర్థమేయని వారి సిద్ధాంతమని తేలినది. జగత్తు మిథ్యయను సిద్ధాంతము వేదాంతుల కంగీకారమే. కాని ఆత్మానాత్మవిచారము వ్యర్థము కాదు. అవశ్యముగ చేయవలసినదే. అది వ్యర్థమనిన శ్రీజ్ఞానదేవులు గ్రంథ మేల వ్రాయవలయును? దానిని కొందఱు సంస్కృతములోని కేల అనువదింపవలయును? కొందఱు టీక లేల వ్రాయవలయును? వారందఱు వ్యర్థముగనే ప్రయాసపడిరని యెఱిగియు శ్రీ ఆంజనేయ శర్మగారు విజయదుందుభియను వ్యాఖ్యాన మేల చేయవలయును? వీరి కార్యములు అర్థరహితము కదా? భ్రాంతివశమున త్రాటియందు తోచిన సర్పము యథార్థముగ లేనిదైనను భయము కలిగించుటచే దీపము తెచ్చి చూచి 'ఇది సర్పము కాదు. త్రాడు' అను నిశ్చయము కలుగునంతవఱకు దీపకాంతి అవసర మైనట్లు జగత్తు తోచనంతవఱకు ఆత్మానాత్మ విచార మవసరమే.

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽ ంతస్త్వ నయో స్తత్త్వదర్శిభిః॥ (గీత. 2-16)

తా. నశించెడి స్వభావము గలది ఉండుట లేదు. నిత్యమైన ఆత్మకు లేకపోవుట లేదు. తత్త్వదర్శనులు (బ్రహ్మ వస్తువు నెఱిగినవారు) 'ఇది ఆత్మ', 'ఇది అనాత్మ' అని యీ సదసత్తుల నిర్ణయము చూతురు అని తాత్పర్యము.

శ్రీ జ్ఞానేశ్వర విరచితమగు మూలగ్రంథమునకు సంస్కృతానువాదమగు పై (అమృతానుభవము. 3-19) శ్లోకమునకును, తెనుగున గద్యానువాదము (వచనానువాదము) నందలి అనుభవామృతము (అను. 3-20) గద్యమునకును అర్థము సరిపడుచున్నది. కాని, దాని వ్యాఖ్యానము (విజయదుందుభి)లోని అర్థమునకును, మూలమునందలి అర్థమునకును, ఏవిధమగు సంబంధము లేదు. వ్యాఖ్యయందలి వివరణము మూలమునందు బీజమాత్రముగనైనను లేదు. కనుక పై మూడు వాక్యములు శ్రీ జ్ఞానేశ్వరులవారు రచియించిన మతే(గ్రంథమునందైన నుండిననే తప్పు, లేనియెడల పై మూడు వాక్యములు వ్యాఖ్యాతలు అనంతోపనిషత్తు నుండి గ్రహించిరని చెప్పవచ్చును. అట్లుగాక శ్రీ జ్ఞానేశ్వర విరచితమగు నితర గ్రంథమునందుండిన వ్యాఖ్యాత(లు) ఆ గ్రంథనామము నుదాహరించియుండవచ్చును గదా? కనుక పై మూడువాక్యములుగాని,

వాటి అర్థముగాని శ్రీ జ్ఞానేశ్వరుల అభిప్రాయమని చెప్పుటకు సాక్ష్యాధార మేదియు కానరాదు.

పై వాక్యత్రయమును గుఱించి విపులముగా పరిశీలించినగాని వీరితత్త్వ స్వరూపము పూర్ణముగా తెలియదు. మొదట షోడశాక్షరీ మంత్రార్థమును పరిశీలింతము.-

## (౭) షోడశాక్షరీమంత్రము

**ఈ మూలం లేని గుర్తెఱిగే శరీరం ఏమీ లేదు. (బృ. పూ. ప్ర. 1)**
**మూలాభావ మిదం జాతం శరీరం కిము నాస్తి హి. (బృ. పూ. ప్ర. 5)**

అచలవేదాంతులయందు రెండుశాఖలు కలవని చెప్పియుంటిని. అందు మితవాదులును, అతివాదులును పై మంత్రములకు పరస్పర భిన్నములగు అర్థములను ఈ క్రింది విధముగ చెప్పుదురు :-

మితవాదులు :- మూలము లేకుండుట, ఎఱుగుట, ఏమియు లేకపోవుట - అను మూడును శరీరమునకు విశేషణములు, శరీరమునకు మూలము లేదు. మన శరీరములకు మన తలిదండ్రులు మూలము. అనగా : ఎవరి శరీరమునకు వారి తలిదండ్రులు మూలము. వారికి వారి తలిదండ్రులు మూలము. ఈవిధముగా శరీరమునకు ఆది లేదు. శ్రీ కృష్ణదాసుగారి కందార్థము ఈ యర్థమునే చెప్పును

**కం.దా.|| తనమూలము తలిదండ్రులు - తనవలెనే వారివారి తలిదండ్రులకున్ - తనవలెనె గాని యన్యము - గన జననస్థాన మొకటి - గలదాన తరమా - బ్రహ్మాదుల కది దెలియ తరమా . . . . (75)**

దీక్షితులవారు కూడ ఈ విధముగనే చెప్పియున్నారు. **"కలలో శరీరమునకు మూలము లేదు. అలాగుననే యీ శరీరమునకున్నూ మూలము లేదు. ఈ శరీరమునకు తలిదండ్రులే మూలము. వారివారికి వారివారి తలిదండ్రులే మూలము. ఇందులో ఆలోచన యేమియు లేదు."** (బృ. పూ. ప్ర. 10)

కనుక, శరీరమునకు మూలము లేదు. 'ఇది భూమి', 'ఇది జలము' అని యెఱుగునట్టిది శరీరమే. ఎఱుగునట్టి శక్తి శరీరమునకే కలదు, కాని, ఎఱుక శరీరమున కంటె విలక్షణ మైనది కాదు. (భిన్నమైనది కాదు)

బెల్లము తీపువలె రెండును ఒక్కటిగనే యున్నవి. ఉన్నట్లుండి ఒకప్పుడు శరీరము లేకపోవుచున్నది. అందువలన ఇది యేమీ లేదు. శరీరము నశించిన పిమ్మట శరీరి స్వర్గమునకు పోవునని మఱల జన్మించునని చెప్పుట సరికాదు. శరీరనాశముతో సర్వము నశించును. ఇంకేమియు మిగులదు.

అతివాదులు:- పై మంత్రమునకు ఈ క్రింది విధముగా అర్థము చెప్పుదురు:- గుర్తెఱిగే శరీరము ఎఱుక. ఆ యెఱుకకు మూలము లేదు. అది మాయ, మూలమాయ అదే. మాయ అనగా 'లేనిది' అని అర్థము. పట్టిచూచిన అది పట్టునకు చిక్కదు. కనుక, దానిని లేదనవలసి వచ్చినది. అదే మనస్సు 'ప్రజ్ఞానం లాంఛనమ్ ధియో' అని నానార్థ రత్నమాలయం దున్నది. కనుక ప్రజ్ఞాన మన్నను, గుర్తన్నను, లాంఛనమన్నను, బుద్ధి అన్నను గుర్తే. అదే యెఱుక. యెఱుకయే శరీరము. దానికే మూలము లేదు.

అచలబోధయం దీ మంత్రము చాల ముఖ్యమైనది. దీక్షితులవారు రచియించిన 'బృహద్వాశిష్ట సిద్ధాంతము' నందు ఈ మంత్రము (షోడశాక్షరి) 470 మార్లకంటె ఎక్కువగనే ఆవర్తనము చేయబడినది. అదిగాక ఈ మంత్రముతోనే ఆ గ్రంథ మారంభింపబడినది. ఈ మంత్రమును గుఱించి దీక్షితులవా రిట్లు చెప్పిరి:-

**"మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు. మూడు కాలాలయందు మూడువేళ్ళకు, కాలానికి వెయ్యిచొప్పున ప్రతిదినమూ జపము చేయవలె. చేస్తే కృతకృత్యు డగుచాడు."** (బృ. పూ. ప్ర. 7)

**"సర్వకాలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు. అని నిద్ర వచ్చినదాక మరణం వచ్చినదాక రెప్పపాటులో సగకాలమైనా మరువక వున్నవాడే బంధమోక్షరహితుడు."** (బృ. ఉ. ప్ర. 6)

ఈ విషయమై దీక్షితులవారు, వారిగ్రంథమున అచ్చటచ్చట చెప్పిన వాక్యములను ఒకచోట చేర్చి చెప్పెదను. అందువలన మితవాదులు, అతివాదులును అను ఈ రెండు పక్షములయందు షోడశాక్షరీ మంత్రమునకు ఎవరుచెప్పిన అర్థము సరియైనదో తెలిసికొనుటకు వీలగును.

(1) "దేహి దేహములు రెండూ దేహమే." (బృ. ఉ. ప్ర. 3 అ. 3)

(2) "ఇదే మూలమాయ, ఇదే గుర్తెరిగే శరీరం." (బృ. ఉ. ప్ర. 5 అ. 1)

(3) "చూచే శరీరం ఇది లేకుంటే చూడంది యేది వున్నది?"
(బృ. ఉ. ప్ర. 57)

(4) "మూలం లేని శరీరం తనకు తానేవచ్చి తనకు తానే ఏమీలేదు."
(బృ. ఉ. ప్ర. 6 అ. 4)

(5) "ఈ శరీరానకు మూలం యేమీ లేదు. వున్నది అని అందరు గడ్డితిన్నారు తించూ వున్నారు." (బృ. ఉ. ప్ర. 6 అ. 6)

(6) "ఈ శరీరానకు మూలం పలానిది అని యెవ్వరూ గెలువలేరు."
(బృ. ఉ. ప్ర. 6 అ. 4)

(7) "కలలోవచ్చిన శరీరానకు కూడా మూలం లేదని చెప్పిరి."
(బృ. ఉ. ప్ర. 6 అ. 6)

(8) "శరీరమువలన గుర్తెరగడము ఖర్మాలు పుడుఛావి."
(బృ. ఉ. ప్ర. 6 అ. 6)

(9) "ఇంతేకాని విచారిస్తే యీ శరీరముయొక్క రాకడకు మూలం యేమీ లేదు. వునికికీ మూలం లేదు. పోకడకు మూలం యేమీ లేదు."
(బృ. ఉ. ప్ర. 6 అ. 8)

(10) "ఈ దేహాలకు మూలం యేమీ లేదు." (బృ. ఉ. ప్ర. 6 అ. 9)

(11) "విచారిస్తే యీ శరీరానకు మూలం యేమీ లేకపోయినా."
(బృ. ఉ. ప్ర. 6 అ. 12)

(12) "ఈ దేహాలకు దేహాలే మూలం." (బృ. ఉ. ప్ర. 6 అ. 10)

(13) "శరీరం జడము కాదు." (బృ. ఉ. ప్ర. 6 అ. 12)

(14) "శరీరం పుట్టక మునుపు శరీరం యేమీ లేదు. చచ్చిన తరువాత యీ శరీరం యేమీ లేదు. వున్నది కాసంతసేపు మందికూతలు విని

అనేకభ్రమలుచాత అనేకమంది యున్నట్లు తాను వుండి కొనకు తానేమి లేదు. యిలాగే అనేకమంది వుండి మళ్ళా యేమీ లేదు. చచ్చినవారు మళ్ళీ పుడుతారు అనేటందుకు యేమీ లేదు. కనుక యిది మళ్ళా పుడుచుండి అని యేలాగు అనె?" (బృ. పూ. ప్ర. 1)

(15) "ఇరవై అయిదోది అయిన యెరుక అనే అహంకారమే ఆత్మ. ఆత్మ అనే శరీరం ఆత్మ శరీరములు అహంకారం." (బృ. పూ. ప్ర. 3)

(16) "అహంకారము శరీరము వక్కటే. శరీరం వేరే అన్నది అహంకారమే. తాను వేరు అయితే జంధ్యాలు తానే వేసుకోవలె. శరీరానికి యేల వెయ్యవలె? తానే లింగం కట్టుకోవలె. శరీరానికి యేల కట్టవలె? తానే జపము చెయ్యవలె, శరీరం యేల చేస్తుంది? తాను చక్రాంకితం వేసుకోవలె. శరీరానకు యేల వెయ్యవలె? (భుజములకు యేల వెయ్యవలెను) తానే బొట్టు పెట్టుకోవలె, గాని శరీరానకు యేల పెట్టవలె? అందుకే తాను వేరు అని వాదించేది తత్వవాదము. అదే మాయావాదము."

(బృ. పూ. ప్ర. 3)

ఇందులో 1,3 నుండి 12ను సంఖ్యవఱకు గల వాక్యములయందు షోడశాక్షరి మంత్రమునందున్న 'గుర్తెరిగే' అను పదము తొలగించినందునను, మితవాదులు చెప్పునట్లు శరీరమే గుర్తెరుగు ననుటవలనను, 14వ అంశముచే పునర్జన్మ సిద్ధాంతమును త్రోసివేయుట వలనను, అహంకారము శరీరము ఒకటేనని 15, 16 అంశములు చెప్పుట వలనను, మితవాదులు తమ వాదమే సరియైన దందురు.

జిజ్ఞాసువు:- మంత్రశాస్త్రవిదులు (శ్రీవిద్యోపాసకులు) చెప్పిన రాజరాజేశ్వరీ (షోడశాక్షరీ) మంత్రమునకును దీక్షితులవారి షోడశాక్షరికిని సామ్యము కలదా?

వేదాంతి:- రెంటియందును మాయనుగుఱించి చెప్పినట్లున్నను రెండింటియొక్క తాత్పర్యములు వేఱు. దీక్షితుల వారును, వారి శిష్యపరంపరకు చెందినవారును 'ఎఱుక' అనగా : ఏమని చెప్పిరో యింకను విచారించవలసియున్నది.

## (౮) ఎఱుక - మఱుపు

(1) "శరీరం జన్యం గుర్తెరిగే జ్ఞానం." (బృ పూ ప్ర. 1)

"ఎఱుకే జ్ఞానం." (బృ. పూ. ప్ర. 3)

"ఈ జ్ఞానమే దండిమాయ. అవిద్యయని యెవరు యెరుగుదురో వారు ఏమిచేస్తారు." (బృ ఉ. ప్ర 4 అ 2)

"అహంకారము శరీరము వొక్కటే." (బృ. పూ. ప్ర. 3)

"అహంకారం యెరుక వక్కటే. యెరుకే చిద్రూపము, యెరుకే శ్రీమన్నారాయణరూపము." (బృ. పూ. ప్ర 3)

"అహమే దేహము." (బృ. పూ ప్ర 3)

"ఆత్మానాత్మ అనే అడవిలో వుండెనా, నరడవి తప్పదు." (బృ. ఉ. ప్ర. 6 అ. 9)

"ఈ దేహానికి ఆధారము లేదు. దేహమునకు జీవుడు అన్యము గాదు. జీవునకు నామరూపములు లేవు. జీవుడు జీవుడనే పేరేగాని వెతికితే వేరేలేదు." (బృ. పూ. ప్ర. 6)

*"శిలాప్రతిమవత్! అని దేహి దేహానకు అవినాభావ సంబంధము వుండి చెప్పినారు. గనుక దేహానకు విశిష్టం తప్పదు. దేహానకు వుపద్రవం వస్తే యేద్చేది దేహి గనుక యీ దేహికి సుఖదుఃఖాలు లేవని శాస్త్రం చెప్పుతూవున్నది. అది పెద్ద అబద్ధం. శాస్త్రాలు అబద్ధమే. దేహి నిబద్ధి. దేహము అబద్ధం. అని శంకరాచార్యస్వాములవారు శ్రుతిమూలంగా చెప్పినారు. సుఖదుఃఖాలు దేహము వున్నంత నేపేకాని దేహి లేకుంటే దేహమునకు లేవు. సుషుప్తియందు దేహి లేకపోయినదా. సుఖము అనుభవించలేదా? దేహము వుండగానే సుఖదుఃఖములు సిద్ధం. దేహి నిబద్ధి అయితే దేహ మున్నదని నిర్ణయం గనుక దేహిదేములు రెండు దేహమే, దేహము వున్నాదని భ్రాంతి ఉన్నంతనేపు జనన మరణ భ్రాంతి తప్పదు."* (బృ. ఉ. ప్ర. 3 అ. 3)

కృష్ణదాసుగారు ఇట్లన్నారు :-

క|| మానసము దేహి జీవుం
డానందము సత్తు చిత్తు అహము అజదధి
ష్ఠానంబు సాక్షి సత్య
జ్ఞానము ద్రష్టనిన నీవె సత్యము సుజ్ఞా. (కందము. 88)

"మూలం లేని గుర్తెరిగే శరీరం జీవుడు." (బృ. ఉ. ప్ర. 6 అ. 10)

"అద్వైతమువలె దేహం అబద్ధం దేహి నిబద్ధి అన్నట్లు కాదు. సార్వకాలము దేహమునకు దేహికి వేరు యెన్నటికి లేదు. గుడమధురములవత్."
(బృ.ఉ. ప్ర. 6 అ. 10)

"నాశరీరము నేను ఒకటేగాని రెండుగా నాకు తెలియదు."
(బృ. పూ. ప్ర. 10)

జిజ్ఞాసువు:- **'శిలాప్రతిమవత్'** ఒక శిల్పి ఒకఱాయిని తెచ్చి ప్రతిమను చెక్కినపుడు ఆ ప్రతిమ (విగ్రహమున) కున్న దానిని నే శిలయందు చెక్కబడెనో ఆ శిలకును అభేదమైనట్లుగను; **'గుడామధురవత్'** బెల్లము తీపు- ఈ రెండింటికి అభేద మైనట్లుగను దేహి దేహములు రెండును ఒకటియేయైన అచలవాదులలో మితవాదపక్షము వారి వాదమునకే ఈ వాక్యములు సూటిగా సరిపోవుచున్నవని వారందురు.

వేదాంతి:- అచల వేదాంతులయందు మితవాదుల వాదమునకును చార్వాక సిద్ధాంతమునకును ఒక్క విషయమున మాత్రమే భేదమున్నట్లు తోచును. చార్వాకులు శాశ్వతమైన దేదియు లేదందురు. శూన్యము కలదందురు. మితవాదులు బట్టబయలు కలదందురు. తుదకు అదియును శూన్యమై కడపట మహాశూన్యమై పోవునందురు. 'నేను నా దేహము ఒక్కటే' అనిన దీక్షితులవారి సిద్ధాంతమును చార్వాకముతో పోల్చుదురన్న భయము దీక్షితులవారికి లేకపోలేదు. కనుక వారొకచోట "అందరు పరిపూర్ణులే గాని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని నమ్మియున్నారు. గనుక వారికంటె నీచులు లేరు. వారికంటె పాపాత్ములు లేరు." (బృ. ఉ. ప్ర. 6 అ. 3)

అని అన్నారు. అది అట్లుండ ఎఱుక యొక్క ఉత్పత్తిని గుఱించి దీక్షితులవారును కృష్ణదాసుగారును చెప్పిన దానిని వినిపింతును.

(2) "ఎఱుకయొక్క యుత్పత్తిని బ్రహ్మాదు లెఱుగరు."(కందా. 65)

"వంధ్యాపుత్రునివలె గగన కుసుమమువలె యెఱుక కలిగినది." (కందా.66)

"నారికేళ ఫలములోనికి నీరు వచ్చినట్లు ఎఱుక వచ్చి, కరిమ్రింగిన వెలగపండులోని గుజ్జు కనబడక పోయినట్లు ఎఱుక కనబడక పోయినది." (కందా. 68)

"శరీరము ఎఱుక ఒకదాని నొకటి సృజించినవి." (కందా. 85)

ఇందులో ముందు పుట్టినది శరీరమా? ఎఱుకా? ఈ ప్రశ్నకు సమాధానము లేదు.

"పిండ బ్రహ్మాండములు రెండును ఆ రెంటిలోని రెండుహములు. ఈ ఖండములు నాల్గుజేరి అఖండమగు ఎఱుక." (56 వ కందార్థము)

"అన్నపు సూక్ష్మాంశము మన
సెన్నగ నీరంబు ప్రాణమెఱుగుము యీ రెం
డెన్నడు కలియవొ నాడే
సున్న సుమీ యెఱుకమాట - సుగుణసంపన్నా -
కలసుటె యెఱుక సుమి యింతకన్నా -
వున్న దేఱుక మూలమన్నది వినలేదు." (కందా. 83 ; 152)

జిజ్ఞాసువు :- వంధ్యాపుత్రుడు, గగనకుసుమము, త్రికాలములందు లేనివే గదా? ఎఱుక అట్టిదైనచో ఈ వాక్యములు చెప్పినవా రెవరు? నారికేళ ఫలములోనికి నీరు ఎట్లు వచ్చినదో నాలుగవ తరగతి చదువు బాలుడు చెప్పగలడు. కరిమ్రింగిన వెలగపండులోని గుజ్జు ఏనుగు జఠరాగ్నిచే కరిగిపోయినది. కరిగర్భమున వెలగపండు పెద్దదైనది. దాని రంధ్రములనుండి ద్రవముగా మారిన గుజ్జు బయటకు అనగా పండునుండి గజగర్భమునందలి జఠరాగ్నిలో కలసి పోయినది. టెంక గుజ్జుకంటెను గట్టిదికనుక అది అట్లే నిలిచినది. ఎఱుకయొక్క యుత్పత్తి బ్రహ్మాదు లెఱుగరని చెప్పుచు ఎఱుక అన్నోదకములవలన కలిగిన దనుట స్వవచన వ్యాఘాతము కాదా?

వేదాంతి :- వీటిని గుఱించి ముందు ప్రత్యేకముగా వివరింతును.

(3) "విను మితరులు యెఱుకను సాక్ష్యని పల్కిరి.
నేను సాక్షిసహమని నీతో వినజెప్పితి నింతియె
వేఱనకూడదు రెంటి నొక్కటిని తెలిసికోరా-
మాటల భేదమని కనుక్కోరా." (కందా. 61)

జిజ్ఞాసువు:- అయ్యా! ఊరగాడిద, ఉచ్చైశ్రవము ఒక్కటియేయైన సాక్షియు అహమును ఒక్కటియే యనవచ్చును. మీరేమందురు?

వేదాంతి :- సాక్షియు అహమును రెండును ఒకటియేయని ప్రస్థానత్రయమున యందు ఏ శాస్త్రమును అంగీకరింపదు. కాని 'అహము' రెండువిధములు. దేహము నేనను అహము ఒకటి. నేను దేహమును గాను 'పరబ్రహ్మమును' అను అహము రెండవది. మొదటి అహము బంధహేతువు తుచ్ఛము. రెండవది మోక్షహేతువు. ఈ విషయమై విపులముగ ముందు చర్చింతును. ప్రస్తుతము ఎఱుకకు స్థానమేది యని అచలవాదులు చెప్పిరో దానిని చెప్పెదను వినుము.

(4) "కృష్ణదాసుగారు ఎఱుక హృదయపద్మమున నున్నట్లు శ్రుతులు చెప్పినది సరికాదనిరి (కందా. 62).

ఈ వాక్యము వలన *కృష్ణదాసుగార్కి శ్రుతులయందు గౌరవము లేదని విదితమైనది.* కనుక వీరి వాదము శ్రుతి విరుద్ధము. ఎఱుక శరీరమునం దున్నచోటును ఇట్లు చెప్పిరి:-

"కంటిలోని పాప గుర్తెరిగే ఆత్మ." (బృ. ఉ. ప్ర. 6 అ. 12)

"కంటిలోని పాపయనే ఆత్మ లేనిది." (బృ. ఉ. ప్ర. 1 అ. 2)

దీనినే కృష్ణదాసుగారు అలంకారముగా ఇట్లు చెప్పిరి:-

కందార్థము. తొర్రలు తొమ్మిది గలమే - న్మర్రికి యొక రెంటిలోన మర్రలు నాల్గున్ - డెర్రది తెల్లది నల్లది కర్రెది దానగ్రమందు గలదొక్క తూటూ - అది యెరుకానె పులుగుండె చోటూ -" (కందా. 103)

ఈ విధముగ కంటిలోని పాపను ఎఱుకన్నారు. ఇదియే 'అపోద్యోతి' యట. (కందము. 72, 102)

పురుషునియొక్క బిందువే యెఱుక యని రక్త శుక్లములే జీవమని దీక్షితులవారి మతము. వారిట్లు చెప్పిరి:-

"శిష్యుడు:- అయ్యా! ఎఱుక బిందువు ఒకటేనా? ఏమైన భేదము గలదా"?

గురువు:- "ఎఱుకకు-బిందువుకు ఎంతమాత్రము భేదము లేదు. ఎరుకే గుణమాయెను. బిందువు రసమాయెను. రసమే బిందువాయెను. బిందువే రసమాయెను. గనుక ఈ శంకచేయవలసినది గాదు. ఎరుకను విడువవలెను. ఎరుకకు మరపు గలదు. గనుక ఎరుక నిత్యము గాదనుట."

(బృ. పూ. ప్ర. 10)

ఎఱుక మరపుల స్వరూప నిర్వచనము కృష్ణదాసుగారు ఈ విధముగ చెప్పిరి.

"ఎరుకనగా యెరిగేటిది -మరుపనగా యెరుక తనను మరచుట మీరెం - ట్నెరుగనిదె బయలివి .... (కందా. 147)

ఈ రెండింటినే యింకొకవిధముగా చెప్పిరి.

క|| ఎరుకన మరపనరానిది -

పరిపూర్ణం బీశ్వరుం డనబడు నెరుకెఱుకన్

మరచిన జీవుం డనబడు

నెరుక చలము నెరుగ నరుగు నెరుక మరపులున్.

(కందము. 233)

"స్వప్నావస్థ గురుడు మేలుకొలుపుతే అదే జాగ్రత్త. అదే ప్రబోధ. ఇంతేగాని నాలుగు అవస్థలు లేవు. ఇంతేగాని యీ శరీరం వొక్కటే. నాలుగు శరీరాలు అనుట అబద్ధం." (బృ. ఉ. ప్ర. 3 అ. 1)

"మహాకారణదేహ శరీరత్రయం అజ్ఞానం అనే మర్యాదా. సర్వం గుర్తెరిగే శరీరమే అని వేదశాస్త్రాలకు అభిమానం." (బృ. ఉ. ప్ర. 4 అ. 1)

"దేహములు రెండు లేవు. మూడు లేవు. ఈ దేహము పోతే సూక్ష్మదేహము లేదు." (బృ. పూ. ప్ర. 6)

కం|| "నేనన నాలవ దేహము

మేనన నాలోని మూడు మేనులు సుమ్మీ

నేను మేననున దొక్కటే

కానిది తన మూల మరయ గనరాదు సుమీ." (కందము. 230)

అన్నారు కృష్ణదాసుగారు.

"**అన్నమయకోశమన్న యెరుకే.**" (బృ. పూ. ప్ర. 9)

పర్యవసా నమేమన:- ఈ షోడశాక్షరీ మంత్రార్థము నందు చెప్పిన యెఱుకకు మూలము లేదు. శ్రీ జ్ఞానేశ్వరుల శక్తికి మూల మున్నది. శ్రీ అరవిందుల జ్ఞానమునకు మూల మున్నది. యోగవాసిష్ఠకారుల చిత్తమునకు మూలమున్నది. సమర్థుల మూలమాయకు మూల మున్నది. కాబట్టి శ్రీ జ్ఞానదేవాదుల మతములతో దీనికి సామ్యము కుదరదు.

జిజ్ఞాసువు:- ***కృష్ణదాసుగారు శ్రుతులను ప్రత్యక్షముగ తిరస్కరించిరి. కనుక వీరిమతము ఉపనిషత్తుల నంగీకరింపదని విదితమైనది.*** ఎఱుక అనగా ఏదని మీ అభిప్రాయము?

వేదాంతి:- నాకంటె చక్కగా చెప్పగల మహనీయులు ఎఱుక యనగా నేది యని చెప్పిరో, దానినే చెప్పెదను వినుము. ఎఱుకను గుఱించి శ్రీ వివేకానందస్వాములవారు ఒక యుపన్యాసమునందు ఇట్లు చెప్పిరి:-

"ఆత్మ యనునది యొకశక్తి కాదు. భావము కూడ కాదు. అది భావములయొక్క నిర్మాత, భావము కాదు ; శరీరములయొక్క నిర్మాత, శరీరము కాదు. ఇదెట్లు? శరీరము ఆత్మ కాదని మన మెఱుగుదుము. ఏలకాదు. దానికి ఎఱుక (తెలివి) లేదు గనుక. శవమునకు ఎఱుక లేదు. కసాయి అంగడిలోని మాంసమునకు ఎఱుక లేదు. ఎఱుక అనగా నేమి? ప్రతిక్రియా (Reaction) శక్తి. దీనిని ఇంక కొంత లోతునకు దిగి విచారింతము. ఇచ్చట నొక కుండ కలదు. దానిని నేను చూచుచున్నాను. ఎట్లు? కుండనుండి వెలుతురు కిరణములు వచ్చి నా కండ్లలో ప్రవేశించును. కంటిపాప పొర (Retina)పై నొక ఆకృతిని కల్పించును. ఈ ఆకృతి మెదడుకు కొనిపోబడును.

అప్పటికిని కుండదృష్టి గోచరము కాదు. ఆ కొంపోవు వానిని శారీరశాస్త్రజ్ఞులు స్పర్శనాడులు (Sensory nerves) అందురు. మెదడులోని ఇంద్రియ కేంద్రము ఆ ఆకృతిని మనస్సునకు నివేదించును. మనస్సు ప్రతీకార మొనర్చును. వెంటనే కుండ తళుక్కున గోచరించును.

ఇంతకన్న సాధారణమగు మఱొక ఉదాహరణము గైకొందము. మీ ముక్కుపై నొక దోమ వ్రాలి దోమలు కల్పించు మనోజ్ఞానుభూతిని కల్పించుచున్నది. కాని మనస్సున నా మాటలలో వ్యగ్రమై యుండుటచేత, ఆ దోమ సంగతియే మీకు తెలియలేదు. ఇప్పుడేమి జరిగినది? మీ శరీరములో నొకచోట దోమ కుట్టినది. అచ్చట కొన్ని స్పర్శనాడులు కలవు. ఆ అనుభూతి నవి మెదడునకు చేర్చినవి. కాని అది మెదడులోనే నిలిచిపోయినది. మీ మనస్సు అన్యత్ర నిలిచియుండుటచే అది ప్రతీకార మొనర్పలేదు. కావున దోమ ఉనికి మీకు ఎఱుక పడలేదు. ఒక క్రొత్త అనుభూతి కలిగినపుడు, మనస్సు ప్రతిక్రియ చేయనిచో, ఆ అనుభూతి మన ఎఱుకకు రాదు. ప్రతీకారము కల్గిన పిదపనే మన మనుభవింతుము, చూతుము, విందుము."*

పూర్వానుభూత విషయము స్మృతిరూపమున తిరిగి అనుభవమునకు రాకుండుటే మరపు. కాని స్థూల సూక్ష్మ కారణ శరీరములు మరపు అని కృష్ణదాసుగారు చెప్పినది సరికాదు. ఏలయన, స్థూల సూక్ష్మ శరీరములయందు జాగ్రత్ స్వప్నములయందు మూర్ఛాది దేహజనిత వ్యాధులు లేనియెడల యెఱుక గలదు.

## (౯) జ్ఞానముయొక్క వివిధ స్వరూపవిచారము

వివేకానందస్వాములవారి పైవాక్యములవలన ఎఱుక అనగా ఎట్టిదో అనుభవపూర్వకముగ విదితమైనది. ఎఱుకను జ్ఞానమని చెప్పిరిగదా! జ్ఞానమనేకవిధములు. అందులో ఎఱుక యేది అని విచారింతము.

(1) పరబ్రహ్మము శుద్ధ జ్ఞానస్వరూపము. ఉప్పు కల్లునందు ఉప్పుదనము తప్ప వేఱొక రసము లేనియట్లు, ఆయనయందు జ్ఞానము తప్ప వే ఱేదియును లేదు. సర్వవ్యాపి. వ్యాపక చైతన్య మందురు.

---

* 'జ్ఞానయోగము' అమృతత్వము అను ఉపన్యాసము నుండి శ్రీ తత్త్వానందస్వాములవారి అనువాదము.

**(2) వృత్తిజ్ఞానము:-** దీనిని గుఱించి యిదివఱలో చెప్పియుంటిని. కనుక, ఇచ్చట చెప్పనవసరము లేదు. *

**(3) సాక్షిజ్ఞానము:-** జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము (ద్రష్టృ, దర్శన, దృశ్యము)లను త్రిపుటియందు ఒక దానిని మఱియొకటి స్వతంత్రముగ నెఱుగజాలదు. ఎట్లన:- ద్రష్టయొక్క స్వరూపమును దర్శన దృశ్యములుగాని, దర్శన స్వరూపమును ద్రష్టృ దృశ్యములుగాని, దృశ్యము యొక్క స్వరూపమును ద్రష్టృ దర్శనములుగాని స్వయముగా తెలిసికొనజాలవు. ఏలయనగా, ఇవి జడములు. చిదాత్మ (సాక్షి చైతన్యము)చే, త్రిపుటి యెఱుగబడుచున్నది. ఈ త్రిపుటి ఉన్నపుడు దాని యునికియు, అది లేనప్పుడు దాని లేమియు, ఎఱుగువాడు చిదాత్మ. జనన మరణములు గల ద్రష్ట తన లేమిని ఎఱుగజాలదు. వృత్తి జ్ఞానము ఘటాకారమును పొంది, దానిని మాని కుడ్యాకారమును పొందినప్పుడు ఘటాకార మెవ్వనిచే నెఱుంగబడును?

ఒక వృత్తి పుట్టి అది నశించి వేఱొకవృత్తి పుట్టుటకు ముందు త్రిపుటి లేదు. అనగా : రెండు వృత్తులకు మధ్య నుండు వ్యవధిని (చిదాకాశమును) ఆ సమయమున నశించియున్న ద్రష్టృ, దర్శన, దృశ్యము లెఱుగలేవు కదా? అట్టి చిదాకాశమును ఎఱుగువా డెవ్వడు? చిదాత్మ (సాక్షి)యే గదా? చిదాకాశమును చిదాకాశమే యెఱుగుచున్నది. చిదాత్మయే చిదాకాశము.

**(4) సంయక్ జ్ఞానము:-** అంతఃకరణము నానావిధ వృత్తిరూపముగ పరిణమించును. ఆ వృత్తులయందు చిదాత్మ ప్రతిఫలించును. ఆ కారణమున వృత్తులు జ్ఞానము లనబడును. ఈ జ్ఞానములు చిదాత్మయందు క్వాచిత్కములై కలుగుచుండును. వేదాంత మహావాక్యముల శ్రవణమువలన అంతః కరణమునందు ఒకవృత్తి (అఖండాకారవృత్తి) చిదాత్మ ప్రతిబింబకము కలదై పుట్టును. దీనినే సంయక్ జ్ఞానమందురు. ఈ సంయక్ జ్ఞానమువలననే అవిద్య (అజ్ఞానము) నివర్తించును. (నై. సి. 3.2)

**(5) సంశయజ్ఞానము:-** ఇదికూడ ఒకవిధముగ భ్రమయేయై యున్నది. ఎట్లన-ఏక విశేష్యమునందు రెండు విశేషణములయొక్క జ్ఞానము సంశయ మనబడును. ఉదాహరణమునకు:- మనము త్రోవను నడచునప్పుడు

---

* వెనుక 54 వ పుట క్రింద (Foot Note) లో కలదు, చిత్తగింపుడు.

మసకచీకటిలో త్రాడు కనబడినపుడు, ఆ త్రాడునే సమీపమునుండిగాక కొంతదూరమునుండి చూచిన అది 'త్రాడై యుండునా, పామై యుండునా?' అని తలతుము. ఇట్టి అనిశ్చయజ్ఞానమును సంశయజ్ఞాన మందురు.

**(6) భ్రాంతిజ్ఞానము:-** ఆత్రాటినే మసక చీకటిలో చూచి పామని భ్రమపడి భయముచే ముందునకు పోలేక నిలిచిపోవుదుము. ఇచ్చట కలిగిన జ్ఞానమే మిథ్యాజ్ఞానము, లేక భ్రాంతి జ్ఞానమనియు, భ్రమయనియు అందురు. ఈ భ్రాంతిని నివర్తింపజేయునది సంయక్ జ్ఞానము.

**(7) స్మృతి-విస్మృతులు:-** మన మొకప్పుడు ఒక అశ్వమును చూచియుందుము. దాని రూపాదులు (సంస్కారములు) మన మానసము నందుండును. ఏదేని మఱియొక యశ్వమును చూచినప్పుడుగాని, అశ్వకథనము విన్నప్పుడుగాని మనము ఇదివఱలో చూచిన అశ్వము జ్ఞప్తికి వచ్చును దీనిని స్మృతి అందురు. అనగా : పూర్వానుభూత విషయాకారమును పొందిన అంతః కరణవృత్తి. ఇది యింద్రియ సంబంధము వలన కలిగినది గాక సంస్కార సంబంధము వలన కలిగినది.* ఒకప్పుడు మనకు పూర్వము చూచిన అశ్వమే కనబడినయెడల దానిని మన మిదివఱకు చూచితిమను జ్ఞానము మనకు కలుగును. దానికి 'ప్రత్యభిజ్ఞ' అని యందురు. అనగా పూర్వము చూడబడిన అశ్వమే యిది యని గుర్తింతుము. అట్లు గుర్తింపలేక పోయినయెడల దానిని 'విస్మృతి' యందురు. ఇదే మఱపు. మఱపనగా శరీరము కాదు. జ్ఞప్తికి రాకపోవుటయే మఱపు.

శ్రీ వివేకానందస్వాములవారిట్లు చెప్పిరి:-

"నేను మీవైపు చూచునప్పుడు నామనస్సులో నొక తరంగము కలుగును. అది నామనస్సున లోతునకు మునిగిపోయి క్రమేణ సూక్ష్మతరాకృతిని దాల్చి పడియుండును. కాని నాశము పొందదు. తిరిగి యదెన్నడో స్మృతి (జ్ఞప్తి) రూపమున దలచూపుటకు సిద్ధముగ నుండును." (జ్ఞానయోగము- విశ్వతత్త్వదర్పణము - పిండాండము) అట్లు స్మృతిరూపమున తలయెత్తక పోవుటయే విస్మృతి. అనగా : మఱపు.

---

* స్మృతి, సంశయ, జ్ఞానముల విచారము, ఈ గ్రంథముయొక్క ప్రథమభాగము 38 వ అధ్యాయమున చేయబడినది.

ఇంతవఱకును మనము విచారించిన దానినిబట్టి జ్ఞానము ఏడువిధములని పెద్దల నిర్ణయము. దీక్షితులవారి మతమున ఎఱుక, యెఱుక లేకుండుట అనునవి రెండే. వేదాంతులు సయితము ఉపాధి భేదమునుబట్టి బోధకొఱకు జ్ఞానము ఏడువిధములని ఆవిధముగా చెప్పవలసి వచ్చినది. ఇది వ్యావహారికమే గాని, పారమార్థికముగ జ్ఞానమంతయు ఒక్కటే.

ఎఱుక, శరీరము ఒక్కటేనని దీక్షితులవారి మతము. ఎఱుక యెఱుగునట్టి స్వభావము గలది. శరీరము ఎఱుగబడు నట్టి స్వభావము గలది. రెండును పరస్పర విరుద్ధ ధర్మములు గలవి ఒక్కటిగా ఎట్లు రూపొందును? రెండును ప్రకృతి సంభవములే గదా? అనవచ్చును. వారు చెప్పెడి యెఱుక మాయికమే గాని, జ్ఞానము కేవలము మాయికము కాదు. చిదాభాసుడు లేని అంతఃకరణము తెలిసికొనజాలదని వేదాంతుల మతము.

"ఒక్క అద్వైతులేగదా చిదాభాసుని అంగీకరించుచున్నారు. తక్కిన వేదాంతు లెవ్వరును అంగీకరింపరే?" అని ప్రశ్నింపవచ్చును. ఇందుకు సమాధానమిది:-

## (౧౦) ఎఱుక - జీవుడు కాదు

శ్రీమద్రామానుజాచార్యుల విశిష్టాద్వైతము, శ్రీమధ్వాచార్యులవారి ద్వైతము, శ్రీనింబార్కాచార్యులవారి ద్వైతాద్వైతము, శ్రీ వల్లభాచార్యులవారి శుద్ధాద్వైతము, శ్రీకృష్ణచైతన్యుల అచింత్య భేదాభేదమతము, నీలకంఠ శివాచార్యులవారి శైవమతము, శ్రీపతిపండితుల వీరశైవము, శాక్తము - ఈ మతములన్నియు ఏకగ్రీవముగ జీవుడు అణుస్వరూపుడనియు, నిత్యుడనియు, పరమేశ్వరాంశమనియు, జ్ఞానస్వరూపు డనియు, చెప్పిరి గదా! ఇందులో కొందరి మతము ననుసరించి పరమేశ్వరునివలె జీవుడు సచ్చిదానందములు పూర్ణముగ గలవాడు గాకపోయినను, కొంతవఱకైనను సచ్చిదానంద స్వరూపుడనియే అంగీకరించి, జీవుడు అణువు కాకపోయినను భ్రాంతిచే తాను అణువనుకొనిరి. జీవుడు హృదయమున నుండుననియు, ఇంటిలోని దీపము ఇంటిలో నొక్కచోట నున్నను ఇంటినంతయు ప్రకాశింపజేయునట్లు; శరీరమంతయు ప్రకాశింపజేయుననియు అందఱు చెప్పిరి. జీవుడు స్వరూపతః జ్ఞానస్వరూపుడనియు, అతని స్వరూపజ్ఞానము ధర్మభూతజ్ఞానమనియు, అతనియందుండి దేహమంతటను వ్యాపించిన జీవుని జ్ఞానము

ధర్మిభూతజ్ఞానమనియు చెప్పిరని చెప్పియుంటిని. దీక్షితులవారు చెప్పిన జ్ఞానమున (ఎఱుక)కు వీటిలో దేనితోను పోలిక లేదు. దీక్షితులవారు చెప్పు ఎఱుకను వారు చెప్పిన విధమును మార్చక అంగీకరించువారు హిందూమత తత్త్వశాఖలయం దేయొక్కరును లేరనియే చెప్పవచ్చును. జీవుడు వేఱు, దేహము వేఱని వైదిక మతశాఖ లన్నియు ఆమోదించినవి. దేహమునకు జీవుడు అన్యము కాదని దీక్షితులవారి మతము. అహంకారము, ఎఱుక ఒక్కటేనని దీక్షితులవా రన్నారు. అహంకార మనగా నేమి?

## (౧౧) అహంకారము - ఎఱుక

దీక్షితులవారు చెప్పిన అహంకారము ఎట్టిదో తెలిసికొనుట దుస్తరము. ఒకచోట 'అవును' అన్న దానినే మఱియొకచోట 'కాదు' అనుట దీక్షితులవారికి పరిపాటియైనది. "*అహంకారమే దేవుడు. అహంకారము లేకుంటే పర(బహ్మాన్ని ఎవడు ఎరుగు? అహంకారమే పర(బహ్మ స్వరూపం. అహంకారం వుంటే అన్ని యున్నవి. అహంకారమే లేకుంటే దానితోనే పోయెను. అందరూ అహంకార స్వరూపులే. అందరూ అహంకారము వలనే పుట్టినారు. నేను తురకవాణ్ణి అని అహంకారమునకే యెరుక. అహంకారమే తురకది.*" (బృ. పూ. (ప. 3) అదేపుటలో కొన్ని పంక్తుల క్రింద "*అహంకారము శరీరము ఒక్కటే. శరీరం వేరే అన్నది అహంకారమే.*" ఇంకొక చోట ఇట్లు చెప్పిరి:-

"అహంకారము దేహమువలననే కలిగినది. సందేహము లేదు. అహంకారము వలననే ఆశాపాశములు సంభవించినవి. అహంకారము లేకపోతే నరకము లేదు. అహంకారము అవల యావల దిరుగదు. తిరుగుచున్నదా దేహములు తిరుగవలె. దేహము తిరుగక అహంకారము తిరుగుచున్నదా అంటే అహంకారమునకు కాళ్లు గలవా? అహంకారము సూక్ష్మమైనది. అహంకారము అహంకారమును పుట్టించుచున్నది. అహంకారమునకు రూపము లేదు. పేరు లేదని గ్రంథములలో వ్రాయుచున్నారు. అహంకారమే శరీరము. అహంకారమునకే అన్ని పేర్లు. అహంకారము లోపల వెలుపల నిండి సంపూర్ణమై ఉన్నదని అన్నారు. శరీరములయందే కనబడుచున్నదిగాని శరీరము లేని ఆకాశమునకు అహంకారము కనబడలేదు. వాయువునందు కనబడలేదు. అగ్నియందు కనబడలేదు. జల మందు కనబడలేదు. భూమియందు

కనబడలేదు. భూతములయందు అహంకారము లేకుంటే భూతములవల్ల గలిగిన శరీరమునకు మాత్ర మేలాగున గలుగుననే పక్షమందు కలుగుటకు కారణము గలదు. ఆ కారణ మేలాగంటే దేహమునకు బాధగలిగితే యావద్దేహమునకు గలుగవలె గదా. అలాగున కనబడలేదు. దేహమునందు గల గోళ్ళకున్నూ, రోమములకున్నూ ఎంత కొట్టినా, గిల్లినా, కరచినా బాధ కలుగనేరదు కదా. అలాగుననే దేహమునందు అహంకారము కనబడుచున్నదిగాని మహాభూతములందు కనబడ లేదు. అహంకారము అన్ని కులములయందు కలదు. అహంకారము లేని కులములేదు. అహంకారము లేని కులము మహోన్నతము. అహంకారము లేని వారలకు బాధ లేదు. "*ఏబాధకైనా అహంకారమే మూలము.*" (బృ. పూ. ప్ర. 3)

"ఈ అహంకారము శరీరమువలన కలిగినది. శరీరము లేకపోతే అహంకారము లేదు. శరీరమునకు మూలము అహంకారము. శరీరమును విడిచి అహంకారము ఉండునా? అహంకారమునకు శరీరమునకు భేదము లేదు. అహంకారమే జీవుడు." (బృ. పూ. పు. 35)

"ఎరుక అఖండమైన పక్షమున కాలికి తేలుకుట్టితే కంటికి నీరుగారినట్టు వొకరికి తేలుకుట్టితే అందరికి బాధ కలుగవలయును గదా? ఒకరు ముక్తులైతే అందరు ముక్తులు కావలెను. అందరు ముక్తులైతే నరకమునకు యెవ్వరు లేరు. అట్లనుటకు చెల్లదు." (బృ. పూ. ప్ర. 10)

ఇందుకు విరుద్ధముగా వారే ఇంకొకచోట అందఱి యందున్న అహంకారము ఒక్కటేనని యీ క్రింది వాక్యములను చెప్పిరి.

"నీవనగా యెవరు? నేననగా యెవరు? నీవు నేను అహంకారమే గదా. అహంకారమే నావాయెను. నీవే నేనాయను, నేనే నీవాయను, నేను నీవనే భేదము లేదు. నీవని ప్రస్తాపించినపుడు భేదబుద్ధి తోచుచుండును. ఒక అహంకారమే అన్ని దేహములలోను యున్నది. దానిని నీవు నేనని యనిన దోషమే. నీవు లేదు. నేనూ లేదు. నీవు నేను లేకపోతే రూపములు భేదమై యుండవలదా యని యందురేమో." అనుదానికి నీ క్రింది ఉదాహరణమును ఇచ్చిరి.:-

"ఒక కుక్క గాజుయిండ్లలోను నుండి యే మల్లారములో యే గాజులలో చూచినను తాను ప్రతిఫలించి మొరుగుచుండును. అలాగే తాను అన్ని శరీరములలోను ఉండి తనకు తానే అన్యముగా తోచుకొని భ్రాంతిచేత తిరుగుటేగాని తెలుసుకొంటే తనకు అన్యమైన వస్తువు ఒకటి లేదు."

(బృ. పూ. ప్ర. 6)

ఎఱుకతో సంభాషణ జరిగినట్లు వ్రాసిరి. అందు ఎఱుక యిట్లు ప్రశ్నింపబడెను.

"ప్రశ్న:- నీవు ఎక్కడ వున్నావు?"

ఎఱుక చెప్పిన ఉత్తరము:- "ఉ|| నే నంతట నిండియున్నాను." (బృ. పూ. పు. 88) దీనిని బలపరచుచు మఱి యొకచోట "ఒక అహంకారమే అన్ని దేహములలోను యున్నది." (బృ. పూ. ప్ర. 6) ఎఱుక అఖండమని కృష్ణదాసుగారు చెప్పిన కందార్థము (56)ను ఉదాహరించియుంటిని. ఈ విధముగా ఒకచోట వారు చెప్పిన వాక్యములను మఱియొకచోట వారే ఖండించిరి. అహంకారమును గుఱించి వేదాంతుల అభిప్రాయమును తెలిపెదను.

అహంకారము ఆత్మ ధర్మము కాదు. ఆత్మధర్మమైన యెడల అహంకారము మోక్షదశయందును, సుషుప్తి యందును, మూర్ఛయందును ఆత్మను వదలక యుండవలయును. అట్లుండుట లేదు. అందుచేత అహంకారము ఆత్మయనిగాని, ఆత్మయొక్క ధర్మమనిగాని అనరాదు. అహంకారము ఆత్మా-నాత్మ గ్రంథి. అనగా :- ఆత్మయందు అనాత్మ ధర్మమును, అనాత్మయందు ఆత్మ ధర్మమును ఆరోపించునట్టిది. ఇదియే సంసారమునకు మూలము. ఆత్మను ఆత్మగాను, అనాత్మను అనాత్మగను దర్శించుటే అహంకార నాశనము.

అచలబోధయందు ఎఱుక తప్ప ఆత్మయనునది లేదు. దీక్షితులవారి మతము ననుసరించి యెఱుక - శరీరము రెండును ఒక్కటియే యైనందున ఒకదాని ధర్మము మఱియొక దానియం దారోపింపబడుటలేదు. ఎఱుకకు శరీరమును, శరీరమునకు ఎఱుకయు, చెట్టునకు విత్తును, విత్తునకు చెట్టును పుట్టినట్లు పుట్టినవని వారు చెప్పియున్నందున, ఆ రెండిటికి ఒకదానికొకటి కార్యకారణ సంబంధ మేర్పడినందున నిచట ఆరోపణకు అవకాశమే లేదు. కనుక, గ్రంథి పుట్టుటకు అవకాశమే లేదు. అచ్చముగా వేదాంతులు చెప్పునట్టి

అహంకారమును అచలవాదులు చెప్పునట్టి అహంకారము (ఎఱుకయు)ను ఒకటి కావు సుషుప్తియందు ఎఱుక అహంకారములు రెండును లేవు. కనుక రెండును ఒక్కటియేయని సాధించినను ముక్తావస్థయందు అహంకారము (గ్రంథి) లేదు. దీక్షితులవారికిని, వారి గురువులవారికిని అహంకారము లేదని వారే చెప్పుదురు. అది నిజమేయని మన మనుకొన్నను వారికి ఎఱుక కలదు. ఎఱుకతోనేగదా గ్రంథముల రచియించి శిష్యులకు బోధించిరి. కనుక అహంకారమును, ఎఱుకయు ఒకటికావు. రెండును ఒక్కటియే యైనచో ఉండిన రెండును ఉండవలెను, లేకున్నచో రెండును లేకపోవలెను.

దీక్షితులవారు పైన చెప్పిన వాక్యములయందు పరస్పర విరుద్ధమైనవి కొన్ని గలవు. వాటిని చెప్పెదను.- ఎఱుక అన్నిచోట్లను కలదట. అహంకార మట్టిది కాదట. అహంకారము మహాభూతములయందు లేదట. శరీరమునందు మాత్రమే గలదట. మఱియు **'అహంకారమే యెఱుక', 'అహంకారము శరీరము వక్కటే'** (బృ. పూ. పు. 22). **'అహంకారము యెరుక వక్కటే'** బృ. పూ. పు. 25) వారి గ్రంథమునందే అనేకచోట్ల వారు చెప్పిన వాక్యములకు ఈ వాక్యములు విరుద్ధము. **"భూతములయందు అహంకారము లేకుంటే భూతములవల్ల కలిగిన శరీరములకు మాత్రము ఏలాగున కలుగు"** నని ప్రశ్నించుకొన్నారు. ఈ ప్రశ్నకు వారికి తగు సమాధానము చిక్కలేదు. శరీరమునకు బాధ కలిగినను శరీరముతో పుట్టిన గోళ్లకు వెంట్రుకలకు బాధలేనట్లని సమాధానపడినారు.

జిజ్ఞాసువు:- అహంకారము లేకపోయిన లోకవ్యవహారము జరుపుటెట్లు?

వేదాంతి:- అహంకారము మూడు విధములని 'యోగవాసిష్ఠము' చెప్పినది.

(1) జగత్తునకు కారణరూపుడగు పరమాత్ముడును, ఆయన కార్యరూపమని భావించు దృశ్యజగత్తును నాకంటె అన్యము కాదను అహంకారము.

(2) దృశ్యరూపమగు జడజగత్తును నేను కాను. పరమసూక్ష్మమును , దుర్గ్రాహ్యమును నగు సాక్షిని నేనను అహంకారము.

(3) శరీరమే నేనను అహంకారము.

ఈ మూటియందు మొదటి రెండును మోక్షమును కలుగజేయును.

మూడవది పురుషుని సంసారమున బంధించును కనుక విడువదగినది.
(యో. వా. స్థితి. 38-49 నుండి 52 వఱకు)

ముక్త పురుషునియందు మొదటి రెండు శుభాహంకారములు కూడ నుండవని పెద్దలందురు. అయినచో భోజనపానాదు లెట్లు జరుగు నను ప్రశ్నమునకు సమాధానము-సర్వభూత హృదయాంతర్వర్తియైన యీశ్వరుడే ముక్తపురుషుని సర్వవ్యవహారములు జరుపుచుండును. అచల బోధయందన్ననో సర్వజీవ హృదయాంతర్వర్తియై వాటిని నడుపు ఈశ్వరు డొకడు లేడు. కనుక వారిమతము ననుసరించి ముక్తపురుషులకు అహంకారము లేకపోయినచో లోకవ్యవహార మెట్లు జరుగునో వారు తెలుపలేదు.

## (౧౨) ఎఱుక - సాక్షి

సాక్షిని గుఱించి యిదివఱలో చెప్పియుంటిని.* ఇచట మఱికొన్ని విషయములు చెప్పవలసిన ఆవశ్యకత కలిగినది. దీక్షితులవారును, కృష్ణదాసుగారును చెప్పిన యెఱుక, వేదాంతులు చెప్పునట్టి సాక్షి కాదు, వేదాంతము ననుసరించి సాక్షి చైతన్యము, పరమాత్మ. జననమరణములు లేనివాడు. జ్ఞానస్వరూపుడు. ఈ విషయము పంచదశియందలి నాటక దీపప్రకరణమున చక్కగా వివరించిరి. వేదాంతులు చెప్పు ప్రమగాని, అచలవేదాంతులు చెప్పునట్టి యెఱుకగాని సాక్షియని శ్రుతు లంగీకరింపవు. ఏలయన?

**శ్లో|| బహిరంత ర్విభాగో ఽయం దేహాపేక్షో న సాక్షిణి|**
**విషయా బాహ్యదేశస్థా దేహస్యాంత రహంకృతి||**

(వే. పం 10-16)

తా|| సాక్షికి దేహములోపలయనియు, వెలుపల యనియు భేదములేదు. దేహాపేక్షయును లేదు. అహంకారమన్ననో అది దేహములోపలనుండు వృత్తి, దీనికి దేహాపేక్ష కలదు. -

---

* ఈ గ్రంథము ప్రథమభాగమునందలి రెండవ ప్రకరణమున ౩౧, ౩౨, ౩౪, ౩౫ అధ్యాయములయందు సాక్షిని గుఱించిన వివరము కలదు ఈ ప్రకరణమందే (౯)వ అధ్యాయమునను చెప్పియున్నాను. ఈ అధ్యాయమున ఎఱుక సాక్షి కాదని ఉపనిషత్తులయందుండియు శ్రీ జ్ఞానేశ్వరులవారి గ్రంథములనుండియు అనేక ప్రమాణములను చూపుచున్నాను

శబ్దాదులు బాహ్యావిషయములు, సుఖదుఃఖాదులు అంతరములు. "ఎచట బహిరింద్రియములుగాని అంతరింద్రియములుగాని ప్రవేశింపవో అచట సాక్షి (పరమాత్మ) సహజ ప్రకాశముతో వెలుగొందుచున్నాడు." (వే. పం. 22-20)

"బుద్ధి తన పరిణామముచే నే దేశమును నే వస్తువును కల్పించుచున్నదో, అనగా : ఆ యా రూపమున పరిణమించుచున్నదో ఆ యా ఆకారమును సాక్షి ప్రకాశింపజేయుచున్నాడు." (వే. పు. 22-23)

ఇట్లు చెప్పుటవలన సాక్షిగా కర్తృత్వము కలుగదు. కొందరిట్లందురు "సాక్ష్య ముండిననే గదా సాక్షి యుండును." 'సాక్షి' అన్నప్పుడు 'సాక్ష్యము' ఆపేక్షింపబడుచున్నది. కనుక సాక్షి మాయికము. మాయిక మయినదంతయు నశించునుగదా? కనుక, సాక్షి నిత్యు డెట్లగును? అని ఆక్షేపింతురు. వారికి నా సమాధానమిది:- పరమాత్మ త్రిపుటిని ప్రకాశింప జేయునపుడు ఆయనకు 'సాక్షి' అను నామము కల్పింపబడినది. త్రిపుటి (సాక్ష్యము) లేని సమయమున ఆత్మకు సాక్షియను వ్యావహారికనామ ముండదు. 'సాక్షి' యను నామము నిత్యము కాదేగాని సాక్షి జ్ఞానము నిత్యసత్యమగు చిదాత్మయే. ఒకవ్యక్తి న్యాయాధికారిగా ఉద్యోగమునందున్నపుడు 'న్యాయాధిపతి' (జడ్జి) అని పిలువబడును. ఆ యుద్యోగమునుండి ఆ వ్యక్తి విరమించిన పిమ్మట ఆ వ్యక్తి స్వంతపేరున పిలువబడును. ఉద్యోగ విరమణముతో వ్యక్తి నశించడుగదా? అట్లే సాక్షికి సాక్ష్యము లేకపోయినను నాశము లేదు.

జిజ్ఞాసువు:- అయ్యా! ఎఱుక, అహంకారము, సాక్షి యనునవి ఒకటియే యనుటకును, సాక్షి నశించు ననుటకును శాస్త్రప్రమాణ మేమైన కలదా?

వేదాంతి:- అట్టి శాస్త్రప్రమాణ మేదియును లేదు. సాక్షి మాయికమని, మాయికమైనది సర్వము నశించునని దీక్షితులవారి భావము. సాక్షి మాయిక మనుటకు కారణము పైన వివరించితిని. ఇంకొక కారణ మేమన పురాణముల యందు పురాణములు ఏ యే దేవతాపరముగ చెప్పబడినవో ఆయా పురాణముల యందు ఆయా దేవతలనే పరతత్త్వమందురు. దేవియే పరతత్త్వమని చెప్పునట్టి పురాణములు, శాస్త్రములు; దేవిని సాక్షియనియు, శివుడే పరతత్త్వమని చెప్పిన పురాణములు, శాస్త్రములు; శివుడే సాక్షియనియు, విష్ణువే పరతత్త్వమని చెప్పిన పురాణములు, శాస్త్రములు; విష్ణువే సాక్షియనియు

చెప్పినవి. దేవీ, శివ, కేశవులు మాయికులేగదా? కనుక, సాక్షి మాయికుడే (నశించువాడే) అని దీక్షితులవారి అభిప్రాయమై యుండినచో అట్టి అభిప్రాయము సరియైనది కాదు. ఏలయన:- దేవీ, శివ, కేశవాదుల పారమ్యమును చెప్పిన శాస్త్రములు ఆ యా దేవతలు నాశరహితులు (నిత్యులు) అను భావముతో వారిని 'సాక్షి' యని చెప్పిరేగాని, వారు మాయికులు, నశించువారను భావముతో కాదు. పరతత్త్వమని చెప్పినప్పుడే వారికి నాశనము లేదని వారి భక్తుల అభిప్రాయముకదా? దీక్షితులవారు ఇట్టి వాక్యముల నాధారముగాగొని సాక్షి నశించువాడనిన వారివాదము గ్రాహ్యము కాదు. అది శాస్త్రవిరుద్ధము. సాక్షి నశించుననిన, సాక్షి యొక్క నాశనము ఎఱుగునట్టి మఱియొక సాక్షి యుండవలయును. అతడును సాక్షియే గనుక అతడును నశించువాడే యనవలయును. అతని నాశ మెఱుగుటకు మఱియొక సాక్షి కావలసివచ్చును. ఇట్లైన అనవస్థాదోషము సంభవించును. కనుక, సాక్షికి నిత్యత్వ మంగీకరింపక తప్పదు. సర్వప్రపంచము లయమైనను సాక్షి నిత్యుడై యుండును. అట్లుండడేని ప్రపంచము లయమైనదను సంగతియే మనకు తెలియుటకు వీలులేదు విద్యారణ్యస్వాములవారు ఇట్లు చెప్పిరి:-

**శ్లో॥ మనోజృంభణరాహిత్యే యథా సాక్షినిరాకులః।**

**మాయాజృంభణతః పూర్వం సత్తథైవ నిరాకులమ్॥**(వే. పం. 2-46)

**తా॥** మాయ విజృంభించి ప్రపంచరూపమున పరిణమింపక పూర్వము సత్పదార్థమగు బ్రహ్మ మెట్లు నిరాకులమై యుండెనో అట్లే మనోవిజృంభణము లేని సమయమున సాక్షి స్వస్వరూపముతో నిర్మలుడై యుండును.

ఈ యర్థమే మహాభారతమునం దిట్లు చెప్పబడెను:-

క॥ భూతము లన్నియు నడగిన
నా తఱి దనుదాన కనుచు నంజన రహిత
త్వాతిశయ మొసగ వెలిగెడు
నా తెలి వాతత్త్వమునకు నమరు మహేశా. (మ. భా. ఆ. మ. 4-194)

ఇంతకంటెను అధికముగ చెప్పవలసిన దేమున్నది? దీక్షితులవారును కృష్ణదాసుగారును ఈ విషయమై చెప్పిన వాక్యముల నిట నుదాహరింతును.

**"గుర్తెరిగే దాని ప్రభావాన్ని గుర్తెరుగుటే గురుద్రోహం."** (బృ. ఉ. ప్ర.

4 అ. 1) అనగా :- ఎఱుకను ఎఱిగే సాక్షి ఒకడున్నాడంటే గురుద్రోహమట. కృష్ణదాసుగారి వాక్యములు ఇదివఱలో చెప్పితిని. మఱియును వారి వాక్యములు కొన్ని యిచట చెప్పెదను.

"ఎరుకే కోశము లైదెరు-గెరుకే

భూతముల నెరుగు నెరుగును సర్వం - బెరుకే యెరుక నెరుంగును-

యెరుకను గుర్తెరుగ వేరె - యెరుకొ వున్నాదా -

వున్నదంటె - నరకామె కాదా." (కందా. 165)

దీక్షితులవారు ఎఱుకే సాక్షి అన్నారు. ఎఱుకకు రాకడ పోకడ కలదన్నారు. అనగా: పుట్టుట గిట్టుట యని యర్థము. సరికదా! ఎఱుక లేకపోయినదని చెప్పిన, దాని లేమిని గుర్తించినవా రెవ్వరు? ఎఱుక ఉన్నప్పుడు ఎఱుకను బయలును ఎఱుకయే యెఱుగుచున్నదన్నారు. ఎఱుక లేనప్పుడు బయలును లేదు, ఎఱుకయు లేదన్నారు. **"చలనము కలిగితేనే అచల మున్నదిగాని చలనము లేకపోతే అచల మేలాగున కలదు"** (బృ. పూ. ప్ర. 10) దీక్షితులవారన్నారు. ఇంతేకదా! ఈ రెండింటికంటే మూడవది లేదు కదా? ఎఱుకను పరిపూర్ణ మెఱుగదు. (కందా. 122) బయలు తన్ను తానెఱుగదు (కందా. 39) ఎఱుక వీరి మతమున నిత్యము కాదు. దాని అనిత్యతను యెఱిగిన వారెవ్వరు? కనుక అద్వైతులు చెప్పిన సాక్షి నంగీకరింపవలయును. సాక్షి నంగీకరించిన, వీరి అచలవేదాంతము శంకరాద్వైత మగునని వీరి భయము.

ఇదిగాక దీక్షితులవారి మతమున మఱియొక చిక్కు కలదు. ఏమన ***ఎఱుక బయలునెఱిగి తాను లేకపోవునట. ఎఱిగిన యెఱుక నశించిన బయలున్నదని యెట్లు తెలిసిది? నశించిన యెఱుక చెప్పలేదుకదా? బయలున్నదని యెవరు చెప్పిరి? ఇంకొక చిక్కు కూడ కలదు.*** ఏమన : ***చలనము (ఎఱుక) లేకపోయిన అచలము కూడ లేదట. అట్లైన యెఱుక నశియించినపుడు బయలు నశించును. ఎఱుక పుట్టినపుడు బయలును పుట్టుచున్నది అని చెప్పవలసి వచ్చును. అట్లైన బయలుకూడ అసత్యమే యగును.***

జిజ్ఞాసువు :- అయ్యా! ఇచ్చట నాకొక సంశయము కలుగుచున్నది. శ్రీవిద్యయందు శుక్లబిందు రూపశివుని (ఆత్మ) యందు అంతర్లీనమై యున్న విమర్శరూప రక్తబిందువగు శక్తి బయలువెడలి శివునకు దర్పణము వంటి దైనదని చెప్పియుంటిరి. ఆ శక్తియే సాక్షి యనియు చెప్పితిరి. దీక్షితులవారు చెప్పిన 'మూలము లేని గుర్తెరిగే శరీర' మే విమర్శరూపశక్తి (జ్ఞానదేవి) అయినచో ఎఱుకను సాక్షి యనిన తప్పేమి?

వేదాంతి.- శ్రీ విద్య వేఱు. దీక్షితులవారిబోధ వేఱు రెండును ఒకటి కావు. దీక్షితులవారు అఖండము ప్రతిఫలించదన్నారు. రూపమున్నదానికే ప్రతిబింబ ముండును గాని రూపరహితమగు శివునకు (ఆత్మకు) ప్రతిబింబము ఉండదన్నారు. ఈ రెండంశములు శ్రీవిద్యకు విరుద్ధము. శ్రీవిద్య ననుసరించి కేవలము శక్తివలన ప్రపంచోత్పత్తి కానేరదు. శివుడు 'అ' కారము, శక్తి 'హ' కారము. కనుక వీ రిరువురవలనను ప్రపంచోత్పత్తి కలుగనేరదు. మూడవదియగు మిశ్రబిందువు 'అహం' వలన ప్రపంచోత్పత్తి జరిగినది. 'అహం' సాక్షి యని శ్రీవిద్యోపాసకులు చెప్పరు. 'హ'కార రూపిణియగు శక్తినే సాక్షి యని శ్రీవిద్యయందు చెప్పిరి. కనుక దీక్షితులవారి మతమును, శ్రీవిద్యయు భిన్నములు. శ్రీవిద్యయందు శక్తి (సర్వసాక్షి) నిత్య. దీక్షితుల మతమున అనిత్య మిథ్య.

పర్యవసాన మేమన దీక్షితులవారు చెప్పిన యెఱుక వేఱు, ఉపనిషత్తులయందును, వేదాంత ప్రకరణ గ్రంథముల యందును చెప్పిన సాక్షి వేఱు, రెండును ఒకటియే యన్న మతము శ్రుతులకు విరుద్ధము. ఆ శ్రుతిమంత్రములను ముందు రాబోవు హృదయవిద్యను గుఱించి చెప్పు సందర్భమున వివరింతును.

ఈ విధముగా సాక్షియొక్క నిత్యత్వము స్థిరపడినను, "సాక్షియే ఆత్మయని, అదియే జ్ఞానమని, దానినే నాలుగవ శరీరమని" దీక్షితులవారు చెప్పిరి. సాక్షిని గుఱించి శ్రీ జ్ఞానేశ్వరుల సంప్రదాయమువారి అభిప్రాయము తెలిపి, పిమ్మట నాలుగవ శరీర మనగా నెట్టిదో పరిశీలింతును.

సాక్షి నిత్యుడని శ్రీ జ్ఞానదేవులవారు చెప్పిన దానిని సయితము ఈ క్రింద నుదాహరింతును:-

శ్లో|| "యస్యాదర్శన లోభేన ద్రష్టృత్వం ప్రతిపద్యతే|
అదృష్ట్వా తాం స్వయం తేన ద్రష్టృత్వ మపి హీయతే." (అమృ. 1-33)

పై శ్లోకమునకు ఆంధ్రానువాదము

"అంతియగాక యద్దేవుండు దేవీదర్శనోత్సాహంబున ద్రష్టృత్వంబు గావించుకొని తద్దర్శనాభావంబున దన్ను దూరస్థుం జేసికొనియె."

(అను. 1-33)

సర్వము నేనై యుంటినను అనుభవమునందు ద్రష్ట లేడు. కనుక, కల్పితమైన దృశ్యము అదృశ్య మయినంతనే దాని నాధారముగా గైకొని చెప్పబడిన ద్రష్టయు లేకపోవుట వలన దర్శనము లేనిదే యగుటచే *సాక్షిత్వము లేదు. కాని తాను లేకపోవుట యనునది లేదు.* దీక్షితులవారి యీ క్రింది వాక్యములు పై వాక్యములకు విరుద్ధములు.

"*నీవు లేకపోతే* నేను సూచన చేసినది లేకపోదుగదా." (బృ. ఉ. పు. 9)

"*తాను లేకపోవడమే* విచారనకు ఫలం." (బృ. ఉ. పు. 10)

'తాను లేనివాడనని,' 'నేను లేనని' చెప్పిన శ్రీ శివరామదీక్షితుల వాక్యములు జ్ఞానేశ్వరస్వాములవారి అమృతానుభవ వ్యాఖ్యానమున ఏవిధముగ ఖండింపబడినవో గమనింతము:-

"భ్రాంతిజ్ఞానము ననుసరించి దృశ్యప్రపంచము సత్యమని భావించి దాని ననుసరించిన మాత్రముచేతనే జగత్తు నపేక్షించి పరమాత్మయందు ద్రష్టృభావ మేర్పడినది. వాస్తవమును విచారించగా జగత్తంతయు మిథ్యయని తెలియుట చేత జగత్తు ననుసరించి యేర్పడిన తనయందలి కల్పితద్రష్టృత్వము కూడ మిథ్యాభూతమే యగుచున్నది. కాని *తానుమాత్రము* మిథ్యకాక సర్వదా ఏకాకారమున బ్రకాశించుచు, తనయందాగంతుకముగ దోచిన మిథ్యాభూత దృగ్దృశ్యపు జంటను ప్రకాశింపజేయుచు తద్ద్వారా తాను సర్వద్రష్టయై వెలుంగుచున్నాడు. *అట్టి యెడ తనయందలి సాక్షిత్వ మెన్నటికి నపవిత్రము కానేరదు.* తనయందు కల్పిత సాక్షిత్వము నంగీకరించినంత మాత్రమున జగత్తు సత్యమనుటకు వీలు లేదు. *తనయందు యథార్థదృష్టిని తా ననుమాట లేదని చెప్పినంతమాత్రమున తానే లేదని శూన్యవాదము నంగీకరింపవలసిన*

*పనిలేదు. తా నెన్నడు శూన్యుడు కాజాలడు. కనుకనే పెద్దలు 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' యని పలికిరి."*

(అమృ. 2-15. విజయదుందుభి. పుట 134)

జిజ్ఞాసువు:- అచలవాదులు శరీరములు నాలుగందురు కదా, దానినిగుఱించి దయయుంచి వివరింపుడు.

## (౧3) శరీరములు మూడా? నాలుగా?

శరీరములు మూడని ప్రాచీన వేదాంత శాస్త్రముల యందును, మహాభారతాది ప్రాచీన గ్రంథములయందును చెప్పిరి. తరువాత కొందఱు శరీరములు నాలుగని చెప్పిరి. నాలుగుశరీరము లనువారు ఆత్మను నాలుగవ శరీరమందురు. ఆత్మ (శుద్ధజ్ఞానము) శరీరము కాదనుటకు దశోపనిషత్తుల లోనిదగు మాండూక్యోపనిషత్తునం ది ట్లున్నది :-

మరి "నాంతః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞమ్. అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయ సారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః. " * (మాం. 7)

తా|| (1) నాంతః ప్రజ్ఞం = సూక్ష్మశరీరముగాని, స్వప్నావస్థగాని కాదు.

(2) న బహిః ప్రజ్ఞం = స్థూలశరీరము గాని, జాగ్రదవస్థగాని కాదు.

(3) నోభయతః ప్రజ్ఞం = స్వప్నజాగరములుగాని, ఆ రెండింటియొక్క సంధిగాని, ఆ రెండింటి సంయోగమువలన కలిగిన మఱియొక యవస్థగాని కాదు.

(4) న ప్రజ్ఞానఘనం = సుషుప్త్యవస్థగాని, కారణ శరీరముగాని కాదు.

(5) న ప్రజ్ఞం = ఒక్క సమయముననే సర్వవిషయ ప్రజ్ఞాత కాదు.

(6) నాప్రజ్ఞం = అచేతనమగు జడము కాదు.

(7) అదృష్టం = పంచేంద్రియములచే కనబడునది కాదు.

---

* ఈ గ్రంథము ప్రథమభాగము 2వ ప్రకరణమునందలి (౨౮) తురీయమను అధ్యాయమునందు ఈ మంత్రమును దీనియొక్క తాత్పర్యమును చెప్పియుండియు సందర్భమును బట్టి యిచ్చట చెప్పవలసివచ్చినది.

(8) అవ్యవహార్యం = వ్యవహారసంబంధము లేనిది.

(9) అగ్రాహ్యం = మనోబుద్ధులచే గ్రహింపరానిది.

(10) అలక్షణం = ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియుటకు సాధ్యము కానిది.

(11) అచింత్యం = చింతించుటకు శక్యము కానిది.

(12) అవ్యపదేశ్యం = ఉపదేశించుటకు సాధ్యము కానిది.

(13) ఏకాత్మ - ప్రత్యయ - సారం = ఒక్కటియగు శుద్ధ చైతన్యస్వరూపమగు ఆత్మ తప్ప అన్యమిశ్రితము కానిది.

(14) ప్రపంచోపశమం = ప్రపంచము, దాని సంబంధమేమియు లేనిది.

(15) శాంతం = ఇచ్ఛా రాగ ద్వేషాది రహితమైనది.

(16) శివమ్ = పరమానందబోధ స్వరూపమును మంగళరూపమును అయినది.

(17) అద్వైతం = అద్వితీయమైనది. (అనగా ఆత్మ తప్ప అన్యమేమియు లేదని తాత్పర్యము). చతుర్థం అనుటచే నాలుగవపాదమగు తురీయమే ఆత్మయని తెలిసికొనవలెను. ఆత్మ మాత్ర కాదు. అమాత్ర యనిరి.

పై మంత్రమునందు 1 నుండి 12 వఱకును గల ఆత్మ విశేషములు నేతి, నేతి అను నిషేధ పద్ధతిలో చెప్పబడినవి. కేవల నిషేధపద్ధతిని చూపి అంతటితో విరమించిన ఆత్మ శూన్యమను భావము కలుగునేమో యని అట్లు కలుగకుండుటకై శ్రుతి 13 నుండి 17 వఱకు ఆత్మయొక్క స్వరూపమును చెప్పినట్లు భావింపవలయును. ఈ మంత్రములోని శ్రుతి ప్రతివాక్యము మాయగాని, మాయయొక్క కార్యజాతముగాని ఆత్మగాదని స్పష్టపరచినది. ఇచ్చట చెప్పబడిన ఆత్మ ఉపనిషత్ప్రతిపాదితమైన పరబ్రహ్మమే. మంత్రమునందలి 17వ వాక్యము 'అద్వైతం = ఇదితప్ప మఱియొకటి లేదని' దృఢపరచినది. దీనికంటె మఱియొకటి యున్నయెడల శ్రుతి 'అద్వైతం' అని చెప్పియుండదు - ఇంతకంటెను విశదముగా చెప్పవలసిన పనియుండదు.

దీక్షితులవా రిట్లు చెప్పిరి :- "అవిద్య యని పేరు కలిగినటువంటి చైతన్యాన్ని గూర్చి యీ గుర్తెరిగే చైతన్యం... *'మహాకారణదేహ శరీరత్రయం'* **అజ్ఞానం అనే మర్యాద సర్వం గుర్తెరిగే శరీరమే అని వేదశాస్త్రాలకు అభిమానం."** (బృ. ఉ. ప్ర. 4 అ. 1) దీక్షితులవారి పై వాక్యములు గమనింతము. 'అవిద్య చైతన్య' మట. *మహాకారణ శరీరత్రయం'* అనగా : అర్థమేమో భగవంతునికే యెఱుక. మహాకారణదేహము, దానికంటె వేఱగు శరీరత్రయము చేరి అజ్ఞానమని అర్థమగుచున్నదా?

నాలుగవదేహ మేది? దీక్షితులవారు దానికి ఆత్మ అన్నారు. జ్ఞాన మన్నారు. ఎఱుక అన్నారు. సాక్షి అన్నారు. అహంకార మన్నారు. దేహ మన్నారు. వారి మతమున ఈ యాఱును ఒకటే అన్నారు. శ్రుతి 'నాప్రజ్ఞం' అనుట వలనను, 'ప్రపంచోపశమం' అనుటవలనను, దీక్షితులవారును, కృష్ణదాసుగారును నాలుగవ శరీరమును గుఱించి చెప్పిన వాక్యము లేవియు ఆత్మకు సంబంధించవని శ్రుతి త్రోసివేసినది. దీనినిబట్టి ఆత్మ దేహము కాదని విదితమైనది. దేహమనగానే దేహి యొకడుండవలయు ననియును, శరీర మనగానే శరీరి యొకడుండవలయు ననియును, క్షేత్ర మనిన క్షేత్రి, లేక క్షేత్రజ్ఞుడు (క్షేత్రమునకు స్వామి) ఒకడుండ వలయుననియు స్ఫురించును. ఆత్మను నాలవ శరీరమని చెప్పితిమేని దానికి శరీరి యొకడుండవలయును. ఈ ప్రశ్నకు దీక్షితులవారు చెప్పిన సమాధానమేమి? ఉన్నది శరీరమే గాని శరీరి లేదన్నారు. నాలుగవ దేహమే గుర్తెరిగే దన్నారు. ఇంకొకచోట శరీరములు నాలుగు లేవన్నారు. **"మూలంలేని గుర్తెరిగే శరీరము ఒక్కటే గాని రెండో శరీరము లేదు. శరీరం ఉన్నంతసేపూ స్వప్నావస్థే గాని రెండో అవస్థ లేదు. ఒక్కటే దేహం, ఒక్కటే అవస్థ, నాలుగు దేహాలు నాలుగవస్థలు లేవు."**

(బృ. ఉ. ప్ర. 6 అ. 9)

అని అన్నారుకదా, ఎఱుక నాలుగవ దేహమని యేల అనవలె- అనునదే ప్రశ్న. అది అట్లుండనిమ్ము. మహాకారణశరీర మనువాక్యము కొన్ని గ్రంథములయందు కనబడుచున్నది. వ్యష్టికారణ శరీరముల సమష్టిరూపమును (ఈశ్వరోపాధిని) మహాకారణ శరీరమని చెప్పిన యుక్తముగ నుండును. పైంగలోపనిషత్తునందు మూలప్రకృతియందు ప్రతిఫలించిన బ్రహ్మచైతన్యమును

సాక్షియని చెప్పియున్నందున* గుణసామ్యస్థితిని మహాకారణ శరీరమని కొందఱందురు. అదియే యీశ్వరోపాధి యగు మహాకారణ శరీరమని చెప్పిన ఆక్షేపింపను. శరీరము, (దేహము) అని పిలువబడునది యెంత పెద్దదైనను, ఎంత చిన్నదైనను, ఎంతటి శక్తివంత మైనదైనను, అది పరిచ్ఛిన్నమైనదే. (మేరగలదే) పరిచ్ఛిన్నమైనది పుట్టినదే పుట్టినది యెప్పుడో ఒకప్పుడు గిట్టక తప్పదు. ఆత్మ పుట్టునది కాదు. గిట్టునది కాదు. నిత్యము. ఆత్మ శరీరాదులకు అధిష్ఠానము

పైన చెప్పినట్లు మాండూక్యశ్రుతియందు ఆత్మను 'చతుర్థం' అని చెప్పియున్నందున, చతుర్థమనగా నాలుగవది అని అర్థము. అనగా : తురీయము. ఆత్మ అన్నను తురీయ మన్నను ఒక్కటియే.

కొందఱు వేదాంతు లిట్లందురు:- సర్వమును ఆత్మగా చూచుటయే తురీయము. ఇదియే యీశ్వరోపాధి. ఇదియే నిజమైన జాగ్రత్త. ఆ జాగ్రత్తయే బ్రాహ్మీస్థితి. వీరి తురీయమునందు (1) శుద్ధతుర్యము (2) మిశ్రతుర్యము అని భేదమును చెప్పుదురు. (1) శుద్ధతుర్యమన:- బుద్ధి ప్రపంచమును చూచుటను మాని అంతర్ముఖమై ఆత్మనే చూచిన సమయమున జగత్తు తోచదు. అప్పుడు బుద్ధి ఆత్మాకారమును పొందును. ఆ బుద్ధియే ఆ స్థితియందుండి జారి ప్రపంచాభిముఖమై ప్రపంచమును చూచుచున్నను, ప్రపంచమును ఆత్మకంటె అన్యముగా భావింపదు. ఎట్లనగా: స్వర్ణనిర్మిత కంకణమును, దానిని కంకణమని భావింపక కేవల స్వర్ణమాత్రముగ భావించిన ట్లని తెలియవలెను. ఇట్లు కేవలాత్మాకార బుద్ధ్యవస్థకు శుద్ధతుర్యం బందురు. (2) ఏతుర్యమునందు జగత్తు స్ఫురద్రూపమై ఆ జగత్తు ఆత్మయని తెలియబడునో ఆ బుద్ధ్యవస్థకు మిశ్రతుర్యమని యందురు.

---

* "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్. తం నిత్య ముక్త మవిక్రియం సత్యజ్ఞానానం దం పరిపూర్ణసనాతనమేక మేవాద్వితీయం బ్రహ్మ. తస్మి న్మరుశు క్తికా స్థాణు స్ఫటికాదౌ జలరూప్య పురుష రేఖాదివ ల్లోహిత శుక్ల కృష్ణ గుణమయీ గుణసామ్యా నిర్వాచ్యా మూలప్రకృతి రాసీత్. తత్ప్రతిబింబితం యత్తత్సాక్షి చైతన్యమాసీత్." (పైంగలోపనిషత్తు)

పైన చెప్పిన సాక్షి శ్రీవిద్య (శాక్తము) నందు శుక్ల, రక్త, మిశ్ర బిందువులయందు రెండవదియగు రక్తబిందువు ఈ గ్రంథముయొక్క తృతీయభాగము "కామకలాస్వరూపము"ను చిత్తగింపుడు.

మాండుక్య శ్రుతియొక్క తాత్పర్యము తురీయమగు ఆత్మ కేవల బ్రహ్మమేగాని అది ఒక అవస్థ కాదు ఈశ్రుతియే కదా 'అయ మాత్మా బ్రహ్మ' అని వచించినది.

ఆత్మయందు అధ్యాసవలన స్థూల, సూక్ష్మ శరీరములు కల్పింపబడినవి. దీనికి కారణము శరీరమగు అవిద్య. దేహత్రయముయొక్క వివరమిది:-

౧. **స్థూలశరీరము** :- 1. చర్మము, 2 మాంసము, 3. రక్తము, 4. నరములు, 5. మజ్జ, 6. మేధస్సు, 7 వీర్యము. ఈ సప్త ధాతువులతో కూడి స్తంభాకారముగ కంటి కగపడుచు పంచీకృత పంచభూత సమ్మేళనమువలన నేర్పడినది.

౨. **సూక్ష్మశరీరము** :- 1. కర్మేంద్రియ పంచకము, 2. జ్ఞానేంద్రియ పంచకము. 3. ప్రాణపంచకము, 4. సూక్ష్మభూత పంచకము, 5. అంతఃకరణ చతుష్టయము, 6. అవిద్య, 7 కామము, 8. కర్మము- ఈ యెనిమిదింటిని పుర్యష్టక మందురు. అనగా ఎనిమిది పురములని అర్థము. దీనిని ఎనిమిది పురులుగల త్రాడువంటిదని మన మూహించుకొనిన సరిపోవును.

3. **కారణశరీరము** :- పైన చెప్పిన పుర్యష్టకమునందు 6వది యగు అవిద్య. పుర్యష్టక మనబడు సూక్ష్మ శరీరము చిదాభాసునితో చేరి జీవుడని పిలువబడును. సూక్ష్మ శరీరమునందలి పుర్యష్టకమునందు 6, 7, 8 సంఖ్యలు గల అవిద్య, కామ, కర్మములు మూడును నశించిన సూక్ష్మదేహము భగ్నమగును. సూక్ష్మ శరీరములోనిదగు కారణశరీరమగు అవిద్య నశించిన దాని కార్యమగు సంసారము నశించును. విద్యచేత అవిద్య నశించును. దానితో జీవుడు శివుడగును. ఇదియే త్రిపురసంహారము-

దీక్షితులవా రొకచో నిట్లు చెప్పిరి:- "**అవస్థలు లేవు, శరీరాలు లేవు. మూడు నాల్గులు పండెండు యేమీ లేవు.**" (బృ. పూ. ప్ర. 9)

ఈ వాక్యములు ఇదివఱకు చెప్పినవే. మరల చెప్పితిని.

జిజ్ఞాసువు :- అయ్యా! శరీరములు నాలుగు గలవని యెట్లు ప్రచారములోనికి వచ్చినది?

వేదాంతి:- ఈ విషయము చాల లోతైనది. విస్తరించి చెప్పినగాని చక్కగా బోధపడదు. విస్తరించి చెప్పుట కిచ్చట అవకాశము లేదు. కాని,

కొంతవఱకు మాత్రము చెప్పెదను వినుము:-

సాంఖ్యులమతము ననుసరించి మూలప్రకృతిని వదలిన దానివలన కలిగిన తత్త్వములు 23 అగును. వాటి వివరమిది:- పృథివ్యాది భూతములు 5. తన్మాత్రలు 5. ఇంద్రియములు 10. మనస్సు. బుద్ధి, అహంకారము చేరి 23. ప్రకృతిని కలుపుకొన్న 24. పురుషుడు ఇరువది అయిదవవాడు. ఇది సాంఖ్యుల పద్ధతి. ఈ వివరమంతయు ఇదివఱకు చెప్పినదే * (వేదాంతులు వీనిలో చిత్తమును కలుపుకొన్న ప్రకృతి 25 వది. అప్పుడు పురుషుడు ఇరువది ఆఱవవాడు). సాంఖ్యుల మతానుసారము పురుషుడు (జీవుడు) స్థూలశరీరమును వదలి లింగశరీరముతో వెడలిపోవుటయే మరణము. మృతుని శరీరమందు (మృతకళేబరమున) బుద్ధి, అహంకారము, మనస్సు, దశేంద్రియములు ఉండవు. కనుక, ఆ పదుమూడే లింగశరీరమని కొందఱు సాంఖ్యు లందురు.

మఱికొందఱు సాంఖ్యు లిట్లందురు:- దేహము నుండి నిర్గమించిన పై పదుమూడు తత్త్వములు నిలుచుటకు అధార ముండవలయును కదా? ఒక గోడయో, కాగితమో, లేనిదే చిత్తరువు ఉండజాలనట్లు పదుమూడు తత్త్వములకు ఆధారముగ సూక్ష్మభూతములు, (తన్మాత్రలు) అయిదును కలవందురు. వీటితో చేరి పదునెనిమిది తత్త్వములు గలది లింగశరీరము. ముఖ్యముగ సుప్రసిద్ధ సాంఖ్యకారికలయందు లింగమనగా : పదునెనిమిది తత్త్వములని కలదు. కాని, పైన చెప్పిన 13 తత్త్వములే లింగశరీరమని చెప్పునట్టి సాంఖ్యులు సూక్ష్మభూతము లైదును కలసి ఒక ప్రత్యేక శరీరమని అందురు. దానిని వారు **'అంతరాభవ'** మనియు, 'గంధర్వ' మనియు పిలుతురు. ఈ అంతరాభవమే పై 13 తత్త్వములు నిలుచుట కాధారమనియు, ఇది స్థూలశరీరమునకును లింగశరీరమునకును మధ్య కలదనియు, మరణము వలన లింగశరీరమును, అంతరాభవము కలసియే స్థూలశరీరమునుండి నిర్గమించుననియు చెప్పుదురు. గంధర్వశరీరమును అంగీకరించు సాంఖ్యుల మతానుసారము శరీరములు మూడని తేలినది. గంధర్వశరీరమును అంగీకరింపని సాంఖ్యుల మతానుసారము శరీరములు రెండే. సాంఖ్యులు వేదాంతుల కారణశరీరమును అంగీకరింపరు.

---

* ఈ గ్రంథముయొక్క ప్రథమభాగమున ౧ - ౧౬ కాపిల సాంఖ్యమను అధ్యాయమున సాంఖ్యదర్శనమున చెప్పియున్నాను.

వేదాంతుల సూక్ష్మశరీరమునందే సూక్ష్మభూతపంచకము (కొందఱు సాంఖ్యుల గంధర్వదేహము) చేరియున్నందున, వేదాంతులు అంతరాభవ (గంధర్వ) దేహమును ప్రత్యేకించి అంగీకరింపరు. కాని, సాంఖ్యుల ప్రభావమునకు వశులైన కొందఱు వేదాంతులు సాంఖ్యుల గంధర్వశరీరముతో వారి స్థూల సూక్ష్మకారణశరీరములు కలుపుకొని శరీరములు నాలుగని చెప్పియుండవచ్చును. మొదట నెవరో తెలియక చెప్పియుండిన, వారి ననుసరించి కొందఱు అవిధముగా చెప్పుటచే శరీరములు నాలుగని వాడుకలోనికి వచ్చియుండ వచ్చును.

ఇంకొకవిషయము చెప్పవలసియున్నది. పుర్యష్టకమును గుఱించి వివరించియుంటిని.* అందులో పంచప్రాణములు, అవిద్యా, కామ, కర్మములు కలవు. వీటిని సాంఖ్యులు లింగదేహమున గైకొనకపోవుటకు కారణమేమనగా - బుద్ధి యందున్న భావన యను దానిలోనే కామ, కర్మములు కలిసి యున్నవని, బుద్ధిని చెప్పియున్నందున వాటిని ప్రత్యేకించి చెప్ప నవసరము లేదని వారు భావించిరి. అవిద్య కారణమైనను సాంఖ్యుల ప్రకృతి అవిద్య కాదు. సాంఖ్యుల ప్రకృతి సర్వవ్యాపకము. కనుక, దానిని లింగమునందు చేర్చలేదు. సాంఖ్యుల ప్రాణపంచకము వేదాంతుల ప్రాణము భిన్నములు. ఇప్పుడు నీకు వేదాంతుల సూక్ష్మ శరీరమునకును, సాంఖ్యుల లింగశరీరమునకును భేదము బోధ పడియుండును. సారాంశమేమన ·వేదాంతుల మతము ననుసరించి శరీరములు మూడు, సాంఖ్యులు అంతరాభవమును వదలిన వారి మతమున శరీరములు రెండే.

మఱియొక విషయమేమన:-శాక్తేయులు (శ్రీవిద్యోపాసకులు)ను చాలవఱకు వారి ననుసరించిన శ్రీజ్ఞానేశ్వరులు శ్రీసమర్థరామదాసస్వామి వంటి పెద్దలును శరీరములు నాలుగని చెప్పిరి. స్థూల సూక్ష్మ కారణ శరీరములను గుఱించి సామాన్యముగ భిన్నాభిప్రాయములు లేవనియే చెప్పవచ్చును. నాలుగవదియగు మహాకారణశరీరమును గుఱించియే ప్రస్తుతము వివాదము. నేను వెనుక (నాలుగవశరీరమును గుఱించి) చెప్పిన విషయమును ఇచట జ్ఞప్తికి తెచ్చుకొనవలయును. అచట (శ్రీవిద్యయందు) శుక్ల, రక్త, మిశ్ర, సంవి ద్బిందువు

---

* పుర్యష్టకమును గుఱించి నేను పైన చెప్పిన విధముగనే పైంగలోపనిషత్తునందును శ్రీ శంకరుల వివేక చూడామణియందును చెప్పబడియున్నది.

లను నాలుగు బిందువులు చెప్పియుంటిని. అందులో రక్తబిందువే నాలుగవ శరీరమనియు, శుక్లబిందువుయొక్క ప్రతిబింబముతో చేరి అదియే సాక్షి యనియు చెప్పియుంటిని. మఱియు ఈ సాక్షియే యీశ్వరుడు, కూటస్థుడు అనియును చెప్పియుంటిని. వారి తత్త్వము ననుసరించి యిదియే తురీయ మనబడు నాలుగవ శరీరము. దానివలన నేర్పడిన మిశ్ర బిందువు మహత్తత్త్వము. ఇది మూడవ శరీరము. శుక్ల, రక్త, మిశ్ర బిందువుల కాంతిచే నేర్పడిన సంవిద్బిందువు అహంకారము. ఇది రెండవశరీరము. స్థూల శరీరమే ఒకటవ (మొదటి) శరీరము. అనగా : స్థూలశరీరము నుండి లెక్కించిన 'హం' అనబడు రక్తబిందువే నాలుగవ శరీరము.

మఱియు, శ్రీ విద్యాసంప్రదాయమునందు శక్తి వాగ్రూపిణి (నాదరూపిణి) అని చెప్పిరి. ఆ శక్తి మానవశరీరమున పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని నాలుగు విధములుగా ఉన్నదందురు. వెనుక (తృ. భా. 371 నుండి 374 పుటల వఱకు) ఈ విషయము చెప్పియుంటిని. ఈ పరాదినామములు నాలుగును వాక్కు ఏ యే స్థానముల యందుండునో ఆ యా స్థలములయొక్క నామములేగాని వాక్కుయొక్క నామములు కావనియు చెప్పియుంటిని. కనుక ఆపరాది స్థానములే నాలుగు శరీరములని కొందఱు పొరపాటున భావించుట కవకాశ మున్నది.

శైవమతమునందు చెప్పిన ముప్పదియాఱు తత్త్వములలో శక్తితత్త్వము రెండవది. మాయాతత్త్వము ఆఱవది. ప్రకృతి, మహత్తు, బుద్ధి, అహంకారము అను తత్త్వములు క్రమముగా 12, 13, 14, 15 వ తత్త్వములుగా శైవమునందు గుర్తింపబడినవి. ఈ క్రింది నాలుగు తత్త్వములకంటె శక్తితత్త్వము అతీతమైనది. ఈ శక్తితత్త్వము దీక్షితులవారి యెఱుక కాదు. శైవతత్త్వములను పృథ్వీతత్త్వమునుండి లెక్కించుచు పోయిన అహంకారము 22వ తత్త్వమగును. ప్రకృతి 25వ తత్త్వము. ఈ విధముగా చూచిన అహంకారము, ప్రకృతి అను నీ తత్త్వములకంటె పరమునందు శక్తి, మాయా తత్త్వములు కలవు. కనుక 25వ తత్త్వము దీక్షితులవారు చెప్పు ఎఱుక యని అంగీకరించిన 26వది బయలు కాదు.

దీక్షితులవారు అహంకారమే (ఎఱుకే) నాలుగవ శరీరమనిరి. మఱియొక చోట **"అజ్ఞానమే కారణశరీరము. అది రహితము కాకనే అనేక నరకములలో**

**ప్రవేశించుట కలుగును."** (బృ. పూ. ప్ర. 3) అనిరి. అజ్ఞానమన్నను అవిద్యయన్నను ఒక్కటేకదా? ఇంకొకచోట నిట్లనిరి **"అవిద్య అనే పేరు కలిగినటువంటి చైతన్యాన్ని గూర్చి యీ గుర్తెరిగే చైతన్యం. . . ."** (బృ. ఉ ప్ర 4 అ 1). చైతన్యమనగా జ్ఞానమని దీక్షితులవారేగాక లోకమందఱు అంగీకరించినదే. అవిద్యను చైతన్యమనిరి. అవిద్య అంటే అజ్ఞానమే కదా? అవిద్యను చైతన్యమనిన అజ్ఞానమును జ్ఞానమనినట్లే కదా? ఇంతకంటె వింత యేమి కలదు? ఇంకొకచోట నిట్లనిరి. **"ఆత్మ అన్న బ్రహ్మ యన్న యిరవై అయిదో దానికి సంజ్ఞ."** (బృ. ఉ. ప్ర. 6 అ. 12) దీక్షితులవారు ఇట్లు చెప్పిరి. **"ఇరవై అయిదోది అయిన యెరుక అనే అహంకారమే ఆత్మ. ఆత్మ అనే శరీరములు అహంకారము. ఈ అహంకారం అయివున్న యిరవై అయిదోది అయిన యెరుక అనే అహంకారం లేకపోతేసరి."** (బృ. ఉ. ప్ర. అ. 3). ఈ మాటలకేమైన నర్థమున్నదా? అహంకారము ఇరవై అయిదవది అట. ఆవిధముగా చూచిన ప్రకృతి యిరువది ఆఱవది అనవలెనుగదా? అట్లయిన బయలు ఇరువది యేడవది అనవలసివచ్చునుగదా? **"తత్వాతీతం యిరవై ఆరోది"** (బృ. ఉ. ప్ర. 6 అ. 7) అని వారే అన్నారు. ఒక లక్ష్యము లేదు. ఎక్కడ ఏది తోచిన అక్కడ దానిని చెప్పిరి.

మహాభారతము హిందువైన ప్రతివానికి శిరసావహింపదగిన పంచమవేదము. అందులో దేహికి నాలుగు దేహము లున్నట్లు ఎచ్చటను చెప్పియుండలేదు. భీష్ముడు ధర్మరాజునకు స్వప్నాద్యవస్థల తెలుగెఱిగించుచు నిట్లు చెప్పిరి:-

తే|| తెలియ మేల్కనియుండుట కలలు నిద్ర
యను నవస్థాత్రయంబును నవులబెట్ట
జాలు విజ్ఞాన నిర్మల సత్య బోధ
రూప నిర్భరానంద స్వరూపుడనఘ. (శాంతి. 4-327)

తా. తెలియ మేల్కని యుండుట = జాగ్రదవస్థ ; కలలు = స్వప్నావస్థ; నిద్ర = సుషుప్త్యవస్థ ; అను నీ మూడవస్థలను సమాధినిష్ఠుడైనట్టి బ్రహ్మవేత్త అవల పెట్టు చున్నాడని. తాత్పర్యము ఇచ్చట బ్రహ్మమునకును,

బ్రహ్మవిదునకును అభేదమును చెప్పుటకై - విజ్ఞానియు, మలిన రహిత శాశ్వతజ్ఞానరూపుడును, ఆనందరూపుడును అని ఆత్మ స్వరూపము వివరింపబడినది

ఇందులో గమనింపవలసినది యేమన 'నిర్మల సత్య బోధరూపుడు' తురీయుడగు ఆత్మ, రాకడ పోకడ కలిగినట్టిది వృత్తి జ్ఞానము. అది శ్రీదీక్షితుల పరిభాషలో ఎఱుక అనవచ్చునేమో? ఆత్మను నాశరహితమైన జ్ఞానమనియు చెప్పియున్నందున నిత్యజ్ఞానము పరబ్రహ్మమేగాని వేఱుగాదు. అట్టి సచ్చిదానందస్వరూపమును (శాశ్వతజ్ఞానమును) నాలుగవ దేహ మనుటకంటె ఉపనిషన్మతమునకు విరుద్ధ మేమున్నది?

దీక్షితుల వారిట్లు చెప్పిరి. **"శంకరాచార్యులు దేహాది పదార్థములను గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే పరాప్రకృతిని ఆత్మ అని అబద్ధమాడి ఈ ఆత్మే బ్రహ్మస్వరూపమని అన్నాడు. శృతి 'అయి మాత్మా బ్రహ్మ' అనే అబద్ధాల శృతి ముందర బెట్టినాడు."** (బృ. ఉ. ప్ర. 6 అ. 4)

ఏవిధముగ చూచినను మాండూక్యోపనిషత్తునందలి 7వ మంత్రము దీక్షితులవారికి కొరకరాని కొయ్యయైనందున దానిపై పట్టరాని ఆగ్రహము కలిగి ఆ శ్రుతికి "అబద్ధాలశ్రుతి'యని బిరుదమును ప్రసాదించిరి. పరాప్రకృతి ప్రస్తావన తెచ్చిరి. భగవద్గీతయందు పరా - అపరా ప్రకృతుల గుఱించిన విచారమున్నది. ఆ విషయమును చర్చింతము.

## (౧౪) ప్రకృతిద్వయము

దీక్షితుల వా రిట్లు చెప్పిరి. **"ఈ యెఱుకయే పరా ప్రకృతి స్వరూపం కనుక సార్వకాలం లేని పరాప్రకృతి స్వరూపమే. ఎరుక మరపులను యెరిగె యెరుక నరకము. సంశయమే నరకము."** (బృ. ఉ. ప్ర. 2 అ. 2)

పరాప్రకృతి విషయమైన విచారము ప్రస్తుతము చేయుట యుక్తము.

భగవానుడు గీత ఆఱధ్యాయములు చెప్పిన పిమ్మట, ఏడవ అధ్యాయమును ప్రారంభించుచు, ఓ అర్జునా! దేని నెఱిగిన పిమ్మట మోక్షవిషయమై తెలియదగిన దేదియు మిగిలియుండదో, అట్టి విజ్ఞానముతో కూడిన జ్ఞానమును నీ కుపదేశించెదనని తన విభూతులగు పరా, అపరా

ప్రకృతులను తెలిపి, పిమ్మట తన స్వరూప మిట్టిదని తెలుపదలచెను. గీతాకారుడు ఏడవ అధ్యాయమునకు 'విజ్ఞానయోగమని' పేరుపెట్టెను. విజ్ఞానమనగా : పరబ్రహ్మమునుండి నామరూపాత్మక మగు స్థూల సూక్ష్మ సృష్టి యెట్లు కలిగెనని తెలిసికొనుట కొందఱు 'విజ్ఞాన' శబ్దమునకు పరబ్రహ్మము యొక్క సంపూర్ణ జ్ఞానమనియు, మఱికొందఱు అనుభవముతో కూడిన బ్రహ్మజ్ఞాన మనియు అర్థమును చెప్పుదురు. ఇచ్చట నేను మొదట చెప్పిన అర్థమే యుక్తమై యున్నది తన ప్రకృతులను గుఱించి భగవంతు డిట్లు చెప్పెను :-

**శ్లో॥ భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ|**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ (గీత. 7-4)**

**శ్లో॥ అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం|**
**జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥ (గీత. 7-5)**

**తా॥** భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము - ఈ ఎనిమిదియు నా (భగవంతుని) యొక్క అపరా ప్రకృతి.

పైన చెప్పిన అపరా ప్రకృతి గాక యింతకంటెను వేఱుగ 'పర' అను రెండవ ప్రకృతి కలదు. అదియే యీ చరాచర జగత్తును ధరించునట్టిదియై జీవభూతమై యున్నది.

నాలుగవ శ్లోకమునందు అపరా ప్రకృతిని గుఱించి చెప్పినపుడు పైనుండి అహంకార మాదిగా భూమి పర్యంతమును చెప్పక క్రిందనుండి మొదట పృథ్వీ భూతముతో ఆరంభించి అహంకారపర్యంతమును చెప్పి అంతటితో ముగించి 'ఇది అపరా ప్రకృతి' అని చెప్పి, తరువాత 5వ శ్లోకము నందు పరాప్రకృతిని గుఱించి చెప్పుట వలన అహంకారమున కంటెను, పైనున్న అవ్యక్త ప్రకృతి (మూలప్రకృతి) యే పరాప్రకృతి యని జ్ఞానేశ్వరులు అభిప్రాయ పడియుంధురు. వారు 5వ శ్లోకముయొక్క అర్థమును ఈ క్రింది విధముగ వ్రాసిరి.

"అర్జునా! ఈ ఎనిమిది విభేదములయొక్క సామ్యావస్థను నా పరమ ప్రకృతిగా తెలిసికొనుము. దానినే 'జీవము' అందురు. ఇదియే నిర్జీవ శరీరమును సజీవముగా చేయును. శరీరమునకు ఇదియే చలనాదికము ఇచ్చును. ఇదియే

మనస్సునకు శోకాది వికారములను భాసింపజేయును. బుద్ధికి ఈ మాయయొక్క సహవాసఫలమే జ్ఞాతృత్వము. దీనినుండి ఉత్పన్నమైన అహంభావమే ఈ ప్రపంచము యొక్క అస్తిత్వమును పుట్టించుచున్నది."

(ఆంధ్ర జ్ఞానేశ్వరి, గీత. 7-5)

గీతకు మహాత్ము లనేకులు భాష్యములు, వ్యాఖ్యానములు, టీకలు రచియించిరి. అపరాప్రకృతిని గుఱించి చెప్పిన 4వ శ్లోకమునకు నే నెఱిగినంతవఱకు భిన్నార్థములను ఎవ్వరును చెప్పియుండలేదు. అందులో వివాదాంశ మేమియును లేదు. అహంకారమాది దేహాంత పర్యంతమైన సంఘాతమే అపరాప్రకృతి యనునది నిర్వివాదము.

పరాప్రకృతిని గుఱించి వ్యాఖ్యాతలు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చిరి. ఇచ్చట ఒక ముఖ్య విషయము జ్ఞప్తియం దుంచుకొనవలయును. పై రెండు శ్లోకములకు అర్థము చెప్పునప్పుడు వ్యాఖ్యాతలు గీతయొక్క 13వ అధ్యాయమునందలి 'ఇదం శరీరం' అను శ్లోకమునుండి ఆఱుశ్లోకముల తాత్పర్యమును, గీతయొక్క 15వ అధ్యాయము నందలి 16, 17, 18 శ్లోకార్థములను స్మరింతురు. 13, 15 అధ్యాయముల యందలి పై శ్లోకముల వ్యాఖ్యానమునందు పైన చెప్పిన 7వ అధ్యాయము నందలి, 4, 5 శ్లోకములను స్మరింతురు. కారణ మేమన - ఒక అంశమునే (ఒక అర్థమునే) వేఱు వేఱు సందర్భములయందు భగవంతు డుపదేశించెను. గీత యొక్క 7వ అధ్యాయము నందలి 4, 5 శ్లోకములకు పూర్ణమగు తాత్పర్యము నిర్ణయింపవలయునన్న యీ యంశమును గుఱించి వేఱు వేఱు సందర్భములయందు చెప్పిన తాత్పర్యములను మనస్సునం దుంచుకొనియే నిర్ణయింపవలయును. అట్లు కాదేని శ్రీ జ్ఞానేశ్వరులవారు చెప్పినట్లు మూలప్రకృతియే పరాప్రకృతి అని పొరపడుట కవకాశమున్నది.

ఇప్పుడు 'పరా, అపరా' శబ్దములయొక్క అర్థమేమి? పరా = శ్రేష్ఠము, లేక, ఉత్కృష్టము అనియు; అపరా అనగా కనిష్ఠము, లేక నికృష్టము అనియు అర్థము. పైన చెప్పిన అష్టవిధ ప్రకృతులు నశించునట్టివి. నిరంతరము మార్పు చెందునట్టివి. కనుక ఉత్కృష్టము. అందువలన వాటి కాపేర్లు సార్థకమైనవి. ఒకటి సత్యము. వేఱొకటి అసత్యము. ఇవి రెండును ఒకటి

కావు. రెండును వేఱు వేఱని వాటి నామములే చెప్పుచున్నవి. అపరా ప్రకృతిలో చెప్పబడిన పంచభూతములు సూక్ష్మములైనవని తెలియవలయును. ఇవియే క్రమముగ స్థూలభూతములైనవి. అపరా ప్రకృతిలో అహంకారము చేరియున్నది. అహంకార మనగా ఏమి? ఈ ప్రశ్నకు ఇదివఱలో సమాధానము చెప్పియే యుంటిని. మఱల చెప్పెదను. మానవుడు 'నేను' నేను అని వ్యవహరించుచున్నాడు. 'నేను' అన్నప్పుడు అష్టవిధప్రకృతియే (ఒక్క అపరా ప్రకృతియే) సమస్త బ్రహ్మాండరూపమును ధరించియున్న సంగతిని తెలియక సమస్త స్థావర జంగమాత్మక ప్రపంచము తనకంటె వేఱైనదని, యీ సమస్తముకంటె తాను వేఱని మనుజునియందు ఏ భావము కలదో అదియే అహంకారము.

ఇంకొక విధముగా చెప్పవలెననిన : ఆత్మానాత్మల గ్రంథియే అహంకారము. ఎట్లు చెప్పినను భావ మొక్కటే. ఆశ్చర్యమేమనగా:- దీక్షితులవారు అహంకారమే ఎఱుక అని చెప్పిన వారి వాక్యములను ఉదాహరించి యుంటిని. మఱియు "**ఈ యెరుకే పరా ప్రకృతి స్వరూపం గనుక సార్వకాలం లేని పరాప్రకృతి స్వరూపమే.**" (బృ. ఉ. ప్ర. 2 అ. 2) అన్నారు. అహంకారము అపరాప్రకృతిలోనిదే గదా? అపరాప్రకృతిలోనిదగు అహంకారమునే ఎఱుక అని చెప్పుచు, ఈ ఎఱుకయే పరాప్రకృతి యనుట అర్థశూన్యము. ఇది శ్రీ జ్ఞానేశ్వరులవారి మతమునకు సరిపోవునా? శ్రీ జ్ఞానేశ్వరులు పరాప్రకృతిని గుఱించి వ్రాసిన తాత్పర్యమున -

"దీనినుండి (పరాప్రకృతినుండి) ఉత్పన్నమైన అహంభావమే యీ ప్రపంచముయొక్క అస్తిత్వమును పుట్టించుచున్నది." అని వ్రాసిరి. అహంకారము అపరాప్రకృతి లోనిదిగ 4వ శ్లోకమున స్పష్టపరుపబడియుండగా పరా ప్రకృతినుండి యెట్లు అహంభావము కలుగును? అహంకారము-అహంభావము భిన్నములని శ్రీ జ్ఞానేశ్వరులుగాని దీక్షితులవారుగాని యెచ్చటను చెప్పలేదే?

పరాప్రకృతిని గుఱించి చెప్పిన 5వ శ్లోకమునకు భాష్యకారులు భిన్నార్థములను చెప్పిరని చెప్పియుంటిని. శ్రీ శంకరులవారు పరాప్రకృతిని ఆత్మ యనిరి. శ్రీమద్రామానుజాచార్యులవారు జీవుడు (జీవాత్మ) యనిరి. శ్రీమధ్వాచార్యులవారు లక్ష్మి యనిరి. శ్రీధరస్వాములవారు శ్రీశంకర మతము ననుసరించిరి. ప్రస్తుతాంశ మేమన:- పరా ప్రకృతి దీక్షితులవారు చెప్పు

ఎఱుక యగునా, కాదా? యనునదే - అదియుగాక, ఎఱుకయు దేహమును ఒక్కటే నన్నారు.

గీతాచార్యులు అపరాప్రకృతిని గుఱించి చెప్పినప్పుడు అష్టవిధ ప్రకృతులను చెప్పి అవి యేమూలప్రకృతి నుండి జన్మించెనో ఆ ప్రకృతిని యేల చెప్పలేదు? అపరా ప్రకృతి యందు దానిని చేర్చక పోవుటయే అది పరాప్రకృతి యని గీతాచార్యులవారి అభిప్రాయము కాదా? అను ప్రశ్న కలుగుచున్నది. ఈ ప్రశ్నకు ఇచ్చట కొంత మాత్రమే సమాధానము చెప్పి, క్షేత్రవిచారమునందు పూర్తి సమాధానము చెప్పెదను.

ఒక కుటుంబమునందు తల్లియొక్క సంతానమును చెప్పినప్పుడు తల్లిని సహితము చెప్పినట్టే. అష్టవిధ ప్రకృతులను చెప్పినపుడు వాటి తల్లియగు అవ్యక్త ప్రకృతిని చెప్పినట్లే యగునని వ్యాఖ్యాతల అభిప్రాయము. జ్ఞానేశ్వరుల అభిప్రాయమే గీతాచార్యుల అభిప్రాయమై యున్నయెడల మొదట తల్లిని చెప్పి పిమ్మట దాని పిల్లలను చెప్పునట్టి లోకాచారము ననుసరించి మొదట పర్మాప్రకృతిని చెప్పి పిమ్మట అపరాప్రకృతిని చెప్పియుండును.

శ్రీ జ్ఞానేశ్వరులవాద మంగీకరించుటకు గల చిక్కేమనగా:- ప్రకృతి యొక్క సామ్యావస్థ సుషుప్తి వంటిది. ఇదిగాక, ప్రకృతి జడమైనది ; దాని సంతానమును జడమే. ప్రకృతియు దాని సంతానమును జడమైనచో నీ రెంటిని తెలిసికొను చైతన్యమెచ్చటనుండి వచ్చినది? అవ్యక్త ప్రకృతియే చైతన్యమనిన అందులకు శ్రుతి ప్రమాణము లేదు. లేకపోవుగాక అనుభవ మున్నదిగదా యనిన అవ్యక్తము మఱియొక దానిని వ్యక్తీకరించుట యెట్లు? 'ఎఱుక' వ్యక్త మగుచున్నది గదా? వ్యక్తమగు దానిని అవ్యక్త మనవచ్చునా?

భగవంతుడు 'నా విభూతులు రెండు' అని చెప్పుటవలననే అవి రెండును భిన్నమైనవని స్పష్టమగుచున్నది అందులో ఒకటి జడము ; వేఱొకటి అజడము (చైతన్యము). ఇవి రెండును పరస్పర భిన్నములు. 5వ శ్లోకమునందు ఇతస్తు = ఈ ప్రకృతికంటె (అపరాప్రకృతికంటె) ; అన్యాం = ఇతరమైన; మే = నాయొక్క; ప్రకృతిం = ప్రకృతిని; విద్ధి = తెలియుము; రెండు ప్రకృతులు ఒక్కటి కావనుటకు ఇంతకంటె విశదముగ చెప్పవలయునా?

5వ శ్లోకము యొక్క రెండవ పాదమున పరాప్రకృతికి విశేషణములు చెప్పుచు 'జీవభూతమైనది', 'జగత్తును ధరించునది' అని రెండు విశేషణములను

చెప్పిరి. ధరించునది ధరింపబడునది వేఱు వేఱై యుండవలయు ననుట లోకానుభవసిద్ధమే గదా? ఎవడైనను వాని భుజములమీద వాడు కూర్చుండగలడా? గీతయొక్క 6వ శ్లోకమునందు **'ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ'** అని 'సమస్త భూతములును ఈ రెండు ప్రకృతులే కారణములుగా కలిగియున్నవి' అని చెప్పబడినది.

శ్రీధరస్వాములవారు 4వ శ్లోకమునకు వ్రాసిన వ్యాఖ్యానమునందు కొంతభాగమును ఈ క్రింద తెలియజేయుదును

వ్యా॥ "మనశ్శబ్దేన మనసైవ ఉన్నేయ మవ్యక్తరూపం ప్రధానం ఇత్యనేన ప్రకారేణ ప్రకృతిః మాయాఖ్యాశక్తి రష్టధా భిన్నా విభాగం ప్రాప్తా "

తా॥ మనశ్శబ్దముచేత, మనస్సుచేతనే తెలిసికొన దగిన అవ్యక్తరూపమైన ప్రధానమని యీ ప్రకారముచేత మాయ యనియు, ప్రకృతి యనియు పేర్లు గల నాయొక్క శక్తి యెనిమిది విధములుగా విభజింపబడినది.

5వ శ్లోకమునకు శ్రీధరస్వాములవారు వ్రాసిన వ్యాఖ్యను గమనింపుము-

వ్యా॥ "అపరేతి అష్టధోక్తాయా ప్రకృతిరియం అపరా నికృష్టా జడత్వా త్పదార్థత్వాచ్చ, ఇతః సకాశా త్పరాం ప్రకృష్టా మన్యాం జీవస్వరూపాం మే ప్రకృతిం విద్ధి జానీహి పరత్వేహేతుః యయా చేతనయా క్షేత్రజ్ఞ రూపయా స్వకర్మద్వారే ణేదం జగద్ధార్యతే."

తా॥ ఎనిమిది విధములుగా చెప్పబడిన అపరా ప్రకృతి జడమగు పదార్థము అగుటవలన నికృష్ట (కనిష్ఠ) మైనది. దీనికంటె నుత్కృష్టమైనది జీవరూపమైన నా వేఱొక ప్రకృతిని తెలిసికొనుము. పరత్వహేతువుచేత చైతన్యము క్షేత్రజ్ఞరూపము నగు తన కర్మద్వారా యీ జగత్తు ధరింపబడుచున్నది.

అని వ్రాసిరి. ఈ కారణమువలన ఈ శ్రీధరస్వాములవారు అద్వైతులని అచలవాదులు కారని స్పష్టమైనది.

భగవద్గీత అద్వైతమును బోధించుచున్నదని పెద్దలందురు. పరా, అపరా ప్రకృతులను గుఱించి శాంకర భాష్యమును సమర్థించు కొన్ని గీతా శ్లోకముల నిట నుదాహరింతును.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్॥ (గీ. 13-19)

తా॥ ప్రకృతియు పురుషుడును అనాదులని తెలిసికొనుము. వికారములు గుణములు ప్రకృతినుండి పుట్టినవని తెలిసికొనుము.

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే।
పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥
(గీ.13-20)

తా॥ కార్యము (దేహము) కారణము (ఇంద్రియములు) అను నీ రెంటియొక్క కర్తృత్వమునకు ప్రకృతి కారణమని చెప్పుచున్నారు. మఱియు, సుఖ దుఃఖముల నుపయోగించుటకు పురుషుడు కర్త కాకపోయినను కారణమని చెప్పుచున్నారు

శ్లో॥ ఉపద్రష్టా ఒనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహే ఒస్మిన్ పురుషః పరః॥ (గీ. 13-22)

తా॥ ఉపద్రష్ట అనగా : ప్రకృతియొక్క గుణములను దగ్గరనుండి చూచువాడు. (యజ్ఞము చేయునపుడు ఋత్విగ్యజమానులు చేయువానిలోని గుణదోషములను చూచువాడు (Spectator). అనుమోదించునట్టియు, భరించునట్టియు, నియామకుడైనట్టియు పరమాత్మ యని చెప్పబడిన పురుషుడు (క్షేత్రజ్ఞుడు) ఈ దేహమునందు ఉత్కృష్టుడైనవాడు.

ఇందలి సారాంశ మేమన:- అపరాప్రకృతి జడమని, జీవరహితమని పరాప్రకృతి చేత ధరింపబడుచున్నదని పరా ప్రకృతి అపరాప్రకృతిచేత ధరింపబడునది కాదని, అపరా ప్రకృతియందే అహంకారాది యిరువదినాలుగు తత్త్వములు ఇమిడియున్నవని*, ఇరువదియైదవ తత్త్వమగు ఆత్మయే పరాప్రకృతి యని శ్రీధరస్వాములవారి మతము. ఇదియే శ్రీ శంకరులవారి మతము.

---

* శ్రీధరస్వాములవారు వారి వ్యాఖ్యానమునందు అష్టప్రకృతుల యందు ఇరువదినాలుగు తత్త్వములు ఇమిడియున్నట్లు వ్రాసియున్నారు. గ్రంథవిస్తరణభీతిచే ఇచ్చట దానిని వ్రాయక వదలితిని.

పర్యవసాన మేమన:- శివ శక్తుల వలె పరా, అపరా ప్రకృతులు ఒకరిపై మఱియొకరు అధారపడియుండలేదని. అనగా : పరస్పరము శేష శేషి భావము లేదని రెండును ఒక్కటి కాదని, రెంటిలో ఒకటి (అపరా) మఱి యొక దానిపై (పరాప్రకృతిపై) మాత్రమే ఆధారపడి యున్నది గాని అపరా ప్రకృతిపై పరాప్రకృతి ఆధారపడి యుండలేదని స్పష్టమైనందున శ్రీ జ్ఞానేశ్వరుల శివ శక్తులే పరా అపరా ప్రకృతులని చెప్పగూడదని విదితమైనది.

శ్రీధరస్వాములవారును శ్రీ జ్ఞానేశ్వరులును శరీరము జడమని అంగీకరించిరి. దీక్షితులవారు **"శరీరం జడము కాదు. అన్ని శరీరాలు గుర్తెరిగే ప్రవర్తిస్తాయి."** (బృ. ఉ. ప్ర. 6 అ. 12) అనిరి గదా? ఇందుకు విరుద్ధముగా శరీరము జడమే అని వేఱొక్కచోట చెప్పియున్నారు . . . **"వేదమనగా గ్రంథాలు, జడం మాయ, అవిద్య యని వున్నది. ఆ శాస్త్రాలలోనే ప్రకృతులు రెండు అని వున్నవి. చైతన్యం పరా ప్రకృతి జడం అపరాప్రకృతి వున్నది కనుక యిది వింతకాదు."** (బృ. ఉ. ప్ర. 4 అ. 1)

**"ఈ రెండు జడాజడములు"** (బృ. పూ. ప్ర. 3) శరీరము జడము కాదని పైన చెప్పిరి. ఇచ్చట 'జడ' మనిరి. ఇందులో ఏది సత్యము. ఇంకను ఈ విషయమును పూర్తిగా అవగాహన చేసికొనుటకు గీతయందలి క్షేత్ర క్షేత్రజ్ఞ విచారమును పరిశీలింపవలయును.

## (౧౫) క్షేత్రము - క్షేత్రజ్ఞుడు

క్షేత్రస్వరూపము గీతయం దిట్లు చెప్పబడినది :-

శ్లో|| **ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే|**
**ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః||** (గీ. 13.1)

తా|| ఓ అర్జునా! ఈ శరీరము క్షేత్రమనియు, దీని నెఱుగువాడు క్షేత్రజ్ఞుడనియు, క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము నెఱిగిన పెద్దలు చెప్పుదురు.

పై శ్లోకమున క్షేత్రమని* చెప్పిన దానియొక్క పూర్ణరూపము ఈ క్రింది రెండు శ్లోకములయందు చెప్పబడినది.

---

* పై శ్లోకమున 'శరీర' మని గాని 'దేహ' మని గాని చెప్పక క్షేత్రమని చెప్పుటవలన సజీవమైన శరీరమే క్షేత్రశబ్దము చేత పిలువబడునని భావమై యుండును 'క్షేత్రము' అనగా : పొలము. కర్మఫలము నొసంగునది యని భావము.

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్త మేన చ|
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియ గోచరాః|| (గీ. 13-5)

శ్లో॥ ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః|
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్|| (గీ. 13-6)

తా॥ పృథివ్యాది భూతములును, అహంకారమును, బుద్ధియు, అవ్యక్తము, (మాయ, లేక మూలప్రకృతి శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిన పరాప్రకృతి), జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియును, మనస్సును, శబ్దాది విషయ పంచకమును, (ఇవి సాంఖ్యుల 24 తత్త్వములు), కోరికయు, ద్వేషమును, సుఖమును, దుఃఖమును, దేహేంద్రియాది సంఘాతమును, చేతన (మనోవృత్తి), ధైర్యము, (వీటిని వైశేషికులు ఆత్మ గుణములని చెప్పిరి). ఇదియంతయు సవికారము. ఇది క్షేత్రమని సంగ్రహముగా చెప్పబడును.

శ్రీ జ్ఞానేశ్వరస్వాములు 'మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్త' అను శ్లోకముయొక్క వ్యాఖ్యానమునందు **అవ్యక్తశబ్దమునకు** ఈ క్రింది విధముగ అర్థమును వ్రాసిరి.

"ఇక అవ్యక్తప్రకృతి లక్షణములను వినుము. సాంఖ్యశాస్త్రముల ప్రకారము ప్రకృతియొక్క రెండు భేదములను 7వ అధ్యాయములో చూపియే యున్నాను. **వానిలో రెండవది యగు పరాప్రకృతి యేదైతే జీవదశ (జ్ఞానదేవి) అని చెప్పబడినదో, దానికే యిచ్చట రెండవ పేరు అవ్యక్తము."**

(ఆంధ్ర జ్ఞానేశ్వరి. 13-5)

పైన చెప్పిన పరాప్రకృతిని అవ్యక్తమని గీత చెప్పిన కారణమున శ్రీ జ్ఞానేశ్వరులు ఇచట చిక్కులో పడిరి. ఈ చిక్కును విడిపించుకొనుటకు సాధ్యపడదు. గీతాచార్యులే స్వయముగా క్షేత్రమునందలి వివిధ తత్త్వములను విడివిడిగా చెప్పుచూ, అందులో 'అవ్యక్త ప్రకృతిని' ఒకటిగా పేర్కొనినందున, శ్రీజ్ఞానేశ్వరులు క్షేత్రమును (అపరా ప్రకృతిని) ధరించునట్టిదియు, జ్ఞానదేవియు అని ఏ అవ్యక్తమనబడు పరాప్రకృతిని గురించి చెప్పియుండిరో, ఆ అవ్యక్త ప్రకృతిని సహితము గీతాచార్యులు (లేక భగవానుడు) క్షేత్రమున (అపరా ప్రకృతియందు) చేర్చియుండుటచేత - క్షేత్రవాసి, క్షేత్రజ్ఞుడు, క్షేత్రి, ఆత్మ

అను నతడు క్షేత్రము కంటె వేఱైనవాడును, క్షేత్రమును (అపరాప్రకృతిని) ధరించువాడును అగు, ఆత్ముడని నిశ్చయింపబడినందున, ఇందుకు విరుద్ధముగ పూర్వము 5వ శ్లోకమునకు తాము (శ్రీ జ్ఞానేశ్వరులు) చెప్పిన వ్యాఖ్యానమును నిలుపుకొనుటకు సాధ్యము కాదని, శ్రీ జ్ఞానేశ్వరులు వారి వాదమును విరమించుకొని గీత ననుసరించిరని తోచుచున్నది.

శ్రీ జ్ఞానేశ్వరులు గీతయొక్క 7వ అధ్యాయము నిచ్చట (13వ అధ్యాయమున) స్మరించిరి. ఈ యధ్యాయమున క్షేత్రమని చెప్పినదే 7వ అధ్యాయమునందలి అపరాప్రకృతి అనినపుడు సమష్టి శరీరములను, క్షేత్రమనినపుడు వ్యష్టి శరీరమును గుఱించి చెప్పిరని తాత్పర్యము. గీతాచార్యులు గీతయొక్క 7వ అధ్యాయమున బ్రహ్మాండమును గుఱించియు, 13వ అధ్యాయమున పిండమును గుఱించియు తెలిపిరి. క్షేత్రమునందు 'అవ్యక్తము' చేర్చుటవలన అష్టవిధ ప్రకృతులయందే (అపరాప్రకృతియందే) అవ్యక్తమనబడు మూలప్రకృతి (లేక మాయ) చేర్చబడినదని వ్యాఖ్యానము చేసిన శ్రీ శంకరాదుల మతమునే జ్ఞానదేవులు కూడ నిచ్చట అంగీకరించక తప్పలేదు. పరాప్రకృతి అవ్యక్తనామక ప్రకృతి కాదని శ్రీ శంకరులును, శ్రీధరస్వాములవారును, చెప్పిన ఆత్మయే యని యిచ్చట స్పష్టముగ ఋజువైనది. ఇచ్చట క్షేత్రజ్ఞుడని యెవ్వనిని చెప్పిరో ఆ క్షేత్రజ్ఞుడే ఆత్మయని పరాప్రకృతి యని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. గీత క్షేత్రమునందే అవ్యక్తమును (మూలప్రకృతిని) చేర్చినందున 7వ అధ్యాయమునందలి 5వ శ్లోకమునందు చెప్పిన **పరాప్రకృతి అవ్యక్త ప్రకృతికంటె భిన్నమైన ఆత్మ అని గీతయే అంగీకరించుటవలన జ్ఞానేశ్వరస్వాములవారు వ్యాఖ్యానమునందుగల యీ వైరుధ్యమును తొలగించుటకు ప్రయత్నించలేదు.**

క్షేత్రమును గుఱించిన వివరమునందు "సంఘాతశ్చేతనాధృతిః" అను వాక్యముల అర్థమును విచారింతము. చార్వాకాది మతములయందు నాలుగు భూతములయొక్క కలయిక వలన 'ఆత్మ' అను జ్ఞాన ముత్పన్నమగు చున్నదనియు, శరీరనాశముతో ఆ యా భూతాంశములు ఆ యా మూలభూతములయందు కలియగా ఆత్మ అనునది లేకపోవు ననియు చెప్పుదురు. ఇతరులవిషయ మట్లుండ భాగవతుల కృష్ణదాసుగారు, ఎఱుక యుత్పత్తినిగుఱించి చెప్పిన వాక్యములను ఇదివఱలో ఉదాహరించియుంటిని.

అన్నము సూక్ష్మాంశము మనస్సనియు, జలము సూక్ష్మాంశము ప్రాణమనియు, మనఃప్రాణసంయోగమువలన ఎఱుక యుద్భవించినదనిరి. ఇట్టి మతములు (అభిప్రాయములు) లోకమున కొన్ని కలవని భగవాను డెఱుగును కనుక వాటిని ఖండించుటకై సంఘాతము (పెక్కింటి కలయిక) ఆత్మ (క్షేత్రజ్ఞుడు) కాదని తెలియజేయుటకుగాను, మహాభూతాదులైన 24 తత్త్వములును, ఇచ్ఛాద్వేషాదులును- ఇవియన్నియు కలియుటవలన కలిగిన శక్తియును, (సంఘాతమును)క్షేత్రమునందే చేర్చబడి క్షేత్రస్వామిని (ఆత్మ లేక పరాప్రకృతిని) వేఱుగా ఉంచెను.

ఇక 'చేతన' అనగా : విచారింతము. 'చేతన' అనగా : చైతన్యము కాదు, చైతన్యమనగా శుద్ధ జ్ఞానము. చేతన ప్రాణాదుల స్పందము. అనేకులు ఇచట చేతన యనగా చైతన్యమని పొరపడిరని శ్రీ లోకమాన్య బాలగంగాధరతిలక్ గారు చెప్పిరి.

ఇవి యేవియు ఆత్మ కాదు. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత-" ఓ అర్జునా! సమస్త క్షేత్రముల యందున్న క్షేత్రవేత్తను (క్షేత్రిని) నన్నుగా తెలియుము అని క్షేత్రములకంటె తాను భిన్నుడనని తెలియజేసెను. దీనివలన ఒక్క ఆత్మయే సర్వక్షేత్రముల (దేహముల) యందు కలదనియు, ఆత్మ లనేకములు కావనియు చెప్పు అద్వైతమతమే గీతామతమని స్పష్టమైనది.

## (౧౬) క్షరాక్షర విచారము

క్షరాక్షరముల గుఱించి గీత యిట్లు చెప్పినది :-

**శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ|**
**క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే (గీ. 15-16)**

తా॥ లోకమునందు క్షరుడని అక్షరుడని వీ రిద్దరు పురుషులు గలరు. అందు క్షరుడనగా : సమస్త శరీరములే స్వరూపముగా గలవాడు. కూటస్థ అక్షరుడనగా : అవ్యక్త ప్రకృతి అని పెద్దలు చెప్పుదురు.

ఈ శ్లోకమునకు భాష్యకారులు భిన్నార్థములు చెప్పిరి. పై శ్లోకమునందు అక్షరు డనగా : మూల ప్రకృతి (అవ్యక్తప్రకృతి) అని అద్వైతుల మతము. ఇచ్చట అద్వైతులతో దీక్షితులవారు కొంతవఱకు ఏకీభవించిరి. 'అక్షర' శబ్దము

పరబ్రహ్మవాచకముగా ఉపనిషత్తులయందును, భగవద్గీతయం దనేక స్థలముల యందు చెప్పియున్నను, ఇచ్చట **'కూటస్థ అక్షర'** మని చెప్పియున్నందున కూటస్థ విశేషణము చేత మూల ప్రకృతినే చెప్పిరనియు, క్షరము (శరీరముల) వలె క్షణభంగురముగాక మాయ (కూటస్థ అక్షరము) జ్ఞానోదయ పర్యంతము ఎన్నిజన్మములకైనను నశింపకయుండునను కారణమున కూటస్థ విశేషణముతో 'అక్షర' శబ్దము వాడబడెననియు అద్వైతుల మతము. ఇదియే యిచట సరియైన యర్థము.

అవ్యక్తమగు మూలప్రకృతి కూటస్థ అక్షరము. అవ్యక్తమునుండి వ్యక్తమైన నామరూపములు నిరంతరము మార్పుచెందుచుండును. కావున నామరూపములు మాత్రము 'క్షర' శబ్దముచేత నిచ్చట చెప్పబడెనని తాత్పర్యము.

సారాంశమేమన - వ్యక్తము, అవ్యక్తమునగు ఒక ప్రకృతియే క్షరము, అక్షరము అని పై శ్లోకమున చెప్పబడి యీ రెండింటికంటెను పరమునందున్న పరమాత్మ లేక పురుషోత్తముని గుఱించి తరువాత రెండు శ్లోకముల యందును చెప్పబడెను, ఆ పరమాత్మయే క్షేత్రజ్ఞుడు.

దీక్షితులవారి వాక్యము లివి:-

**"దేహం క్షరోపాధి యీ దేహమును గుర్తెరిగే నేను అక్షరోపాది. యీ రెండు అయివున్న దీంట్లో ఒకటి అయివున్న వాడే పతితుడు. యీ రెండూ దోష స్వరూపములు, గనుక యీ రెండు ప్రకృతి ద్వయం. యీ రెండూ సగుణనిర్గుణాలు, ఈ రెండు విద్యా విద్యలు. యీ రెండూ సదసత్తులు. యీ రెండు జడాజడములు, ఈ రెండు సుఖదుఃఖములు, జ్ఞానఖర్మాలు, యీ రెండు స్త్రీ పురుషులు, యీ రెండే సకల యోగాలు, సకల యాత్రలు సకల చదువులు, సకల నీమాలు, బ్రహ్మ హత్యాది మహాపాతకాలు. మేడిపండువంటి దేహము. వేపకాయవంటి క్షేత్రజ్ఞ స్వరూపం."**

(బ్ర. పూ. ప్ర. 3)

పై వాక్యముల అర్థమేమో కొంత పరిశీలింతము. దేహము క్షరము, నేను అక్షరము అన్నారు. వేఱొక స్థలమున 'నేను నా దేహము నొక్కటే' అన్నారు. కనుక క్షరాక్షరములు రెండని పేరేగాని రెండును ఒక్కటియే యని అనేక పర్యాయములు స్పష్టపరచి యున్నారు. "ఈ రెండు అయివున్న దీంట్లో

ఒకటి అయివున్న వాడే పతితుడు" అన్నారు. అంటే, దేహాత్మవాదులైన చార్వాకాదులను పతితులన్నారు. ఇచ్చట వారి ప్రసక్తి వీరికెందుకు? వీరి మతముకూడ అట్టిదేనని పాఠకులు అనుకొనరాదని హెచ్చరిక. చార్వాకు లేమన్నారు-శరీరముకంటె భిన్నమైన ఆత్మ లేదన్నారు. దీక్షితులవారు శరీరము ఆత్మ రెండు ఒకటే గాని రెండు కాదన్నారు. ఇదే కదా భేదము. ఇందులో మాటభేదమే గాని దాని అర్థమునందు భేదమేమున్నది?

'క్షరోపాధి', 'అక్షరోపాధి' అన్నారు. ఉపాధి అను పదమునకు అర్థము తెలియకనే దీక్షితులవారు వారి గ్రంథమున అనేకచోట్ల ఉపాధి శబ్దమును వాడిరి. 'క్షరోపాధి' అనినపుడు క్షరము ఉపాధి గాగల వస్తువు (ఉపేతము) ఒకటి ఉండవలెనుగదా? 'అక్షరోపాధి' అనినపుడు అక్షరము ఉపాధిగాగల ఉపేతము ఒకటి ఉండవలయును గదా? ఉదాహరణమునకు ఘటాకాశ మన్నపుడు ఘటము ఉపాధిగాగల ఆకాశము అని అర్థము. ఇచ్చట ఘటము ఉపాధి. ఘటాకాశము ఉపేతము. అట్లే క్షరము, అక్షరము అను ఉపాధి ద్వయమునకు ఉపేతభూతమగు వస్తువు (వస్తువులు) ఉండవలయునుగదా? అది (అవి) యేది? లేక యేవి?

దీక్షితులవారు తమ గ్రంథమున 'నేను నా దేహము ఒకటే' 'గుడామధురములవత్' అని అనేకపర్యాయములు చెప్పియున్నారు. ఇచ్చట 'దేహము క్షరోపాధి' యట, తాను 'అక్షరోపాధి' యట. ఎంత విచిత్రములైన వాక్యములివి. క్షరమైన శరీరము ఉపాధియని, అక్షరమైన తాను ఉపేతమని చెప్పియుండరాదా! అట్లనియుండిన వీరికి ఉపాధి శబ్దమునకు అర్థము తెలిసియున్నదని భావింపవచ్చును. కాని, అట్లనినచో 'గుడామధురములవత్' అను మూలసిద్ధాంతమునకు భంగము వాటిల్లును. అక్షరము నిర్గుణమట. శాక్తేయులు శక్తియే సగుణము, నిర్గుణము నందురు. వారి మతమున రెండును నిత్యములేగాని మిథ్యకావు. దీక్షితులవారు, వారి ననుకరించుచు వారికి విరుద్ధముగ సగుణనిర్గుణములు రెండును మిథ్య యనిరి.

పర్యవసాన మేమన :- దేహి దేహములు రెండును ప్రకృతియే యను మతము గీతకు సమ్మతము కాదని స్పష్టమైనది.

## (౧౭) దేహి దేహము ఒక్కటేయను శ్రీ దీక్షితుల చార్వాకవాదము

జిజ్ఞాసువు:- అయ్యా! దీక్షితులవారు దేహి దేహములు రెండును ఒక్కటేనని చెప్పిరి. ఇందుకు దృష్టాంతముగ (1) 'శిలాప్రతిమవత్' (2) 'గుడామధురములవత్' అనిరి మొదటి దృష్టాంతము శిలావిగ్రహము (=ఱాతి బొమ్మ). ఇందులో ఱాయి ఒకటి. బొమ్మ మఱియొకటి, రెండు లేవు. చిన్నబిడ్డలైనను 'రెండు' అనరు. రెండవ దృష్టాంతమునందు 'గుడామధురములవత్' బెల్లము తీపులవలె అన్నారు. ఇందులోను బెల్లముయొక్క గుణము తీపు. ఇవి రెండు అని లోకమున నెంతటి అవివేకులైనను అనరు. ఇట్లుండగా 'దేహి దేహములు' అని రెండుగా చెప్పి, తుదకు రెండు ఒకటేనని చెప్పుటయేల? దేహమే అని చెప్పరాదా? 'దేహమే నేను' అన్న చార్వాకాదులను పతితులని నిందింపనేల? నా కీవిషయమును సంపూర్ణముగ వివరింపుడు.

వేదాంతి:- శ్రీ జ్ఞానేశ్వరులు శివశక్తులు ఇరువురును ఒకరే అనుటలో నున్న రహస్యము - ఒకమూల ప్రకృతియు ఆమె యందుండి వెడలిన అష్టవిధ ప్రకృతులును చేరగా శివశక్తులు గనుక భిన్నముగా కనబడుచున్న ఒకే తత్త్వమను దృష్టితో చెప్పిరని అనుమానింపవచ్చును. అదిగాక శ్రీ జ్ఞానేశ్వరులు శివ-శక్తులు అభిన్నులని వారిని విడదీయుటకు సాధ్యము కాదను అంశమును పాఠకులకు సులభముగ అర్థమగుటకై యీ క్రింది దృష్టాంతములను చెప్పిరి:-

శ్లో॥ "కర్పూరం తస్యగంధం చ గుడత్వం మాధురీం తథా|
న వివేక్తుం కదా శక్యం క ర్తురాయాస ఏవ సః||" (అమృ. 1-23)
"శర్కరామాధుర్యంబులంగాని కర్పూర పరిమళంబు
లంగాని విభాగింప నెవ్వారికి సాధ్యంబగు?" (అను. 1-23)

శ్రీ జ్ఞానేశ్వరులు ఈ యర్థమునే 42 శ్లోకమున (వచనమున) చెప్పియున్నారు. శ్రీ జ్ఞానేశ్వరులు ఇదివరలో చెప్పిన దేమనగా:- సత్తాస్ఫూర్తులయందు సత్=శివుడు ; స్ఫూర్తి శక్తి ; అనగా : చిత్ శక్తి. ఇచట పరశివుడు (పరబ్రహ్మము) ఆయనయందున్న విమర్శరూపశక్తి, వీ రిరువురు శివశక్తులు.

దీక్షితులవారి మతమున శివుడు బట్టబయలు (అచలము). బయలుతో నేవిధమైన సంబంధము లేనిది యెఱుక. ఇచ్చట ఎఱుక బయలుయొక్క

శక్తికాదు. వీరిమతమున, ఎఱుకే దేహి దేహములైనది. కనక దేహి దేహములు శివశక్తులు కారు.

దీక్షితులవారు శ్రీ జ్ఞానేశ్వరుల భావమునే గైకొని 'నేను నా శరీరం ఒకటేగాని రెండుకా'దని చెప్పియుండ వచ్చునని అతివాదుల వాదము. దీక్షితులవారి ఈ క్రింది వాక్యములు అట్టి భావమునకు విరుద్ధముగ అర్థమిచ్చు చుండుటవలన అది సరికాదని మితవాద పక్షమువారు తమ వాదమునకు అధారముగ దీక్షితులవారి యీ క్రింది వాక్యముల నుదాహరింతురు -

దీక్షితులవారి ఈ క్రింది వాక్యములను గమనింపుము :

"యెరుకకు దేహమునకు భేదమని కొంద రందురు. యెరుకను దేహమునకు భేదమైతే సుఖదుఃఖములు యెరుకకే గాని, శరీరమునకు లేకపోవలె. అందుకు శరీరమునే సుఖదుఃఖము లనుసరించియున్నవి. యెరుకకు దేహమునకు భేదమైతే సుఖదుఃఖములు శరీరమునకు లేకుండా యేలాగు నుండవలె ననగా? పుట్టవంటిది దేహము, పుట్టలోని పామువంటిది యెరుక. ఇల్లువంటిది దేహము. ఇంటిలోని మనిషివంటిది యెరుక. రాయివంటిది దేహము. రాతిలోని కప్పవంటిది యెరుక. కొట్టెవంటిది దేహము. కొట్టెలోని పురుగువంటిది యెరుక గావలెగదా? ఈలాగున యెరుకకు దేహమునకు భేదమైతే దేహమునకు బాధ లేకపోవును. ఎరుకకు బాధ లేకపోవలెను. ఎలాగననగా పుట్టమీద కొట్టితే పుట్ట తనకు సుఖమని దుఃఖమని చెప్పుకొనజాలదుకదా? పుట్టలోపల గల పాము ఎక్కడ నుండునో తెలియదు కదా? అలాగే యెరుకకు సుఖదుఃఖములు లేకపోవును. దేహమునకు లేకపోవును. ఇండ్ల తలుపులు వేసికొని పడుకొంటే వానకు యిండ్లు తడిసినాగాని మనుష్యులకు ఏబాధా లేనట్టుగా దేహమునకు యెరుకకు వేరైతే ఆలాగున బాధలేకపోవును. రాతికి దెబ్బ తగిలినాకాని రాతిలో కప్పకు యేలాగున బాధలేదో అలాగే శరీరమునకు బాధ లేక పోవును కనుక యెరుకకు దేహమునకు అభేదముగా కనబడుచున్నది.

అభేద లక్షణము యేలాగనగా : పాము, పాముకూసము ఒకటైనట్టుగా; నీళ్లు పాలు ఒకటైనట్టుగా, కాయ విత్తు ఒకటై నట్టుగా, పుష్పము పరిమళము ఒకటైనట్టుగా, నూనె నువ్వులు ఒకటైనట్టుగా, అగ్ని కాష్ఠము ఒకటైనట్టుగా,

యెరుక దేహము ఒకటైయున్నది. అందువలనే సుఖదుఃఖములు శరీరమునకు యెరుకకు కూడ కలుగుచున్నవి. శరీరము విడచి యెరుక యుండదు. యెరుకను విడిచి శరీరముండదు." (బృ. పూ. ప్ర. 6)

ఈ యంశమును దృఢపరచుటకు గురుశిష్యసంవాద రూపమున ఈ క్రింది విధమున చెప్పిరి:-

(1) *"శిష్యుడు:- అయ్యా! ఎరుకకు దేహమునకు అభేదమని చెప్పితిరి గదా? అభేదమైతే దేహముతోగూడ, యెరుక నశించవలెనుగదా? ప్రేతశరీరమునందు యెరుక కనబడదు. అప్పుడు యెరుక యేమాయెను? యెక్కడికి లేచిపోయెను?

గురువు:- మృత్యుకాలమందు యెరుక యెక్కడికి లేచి పోయినదని చెప్పను? యెరుక లేవనులేదు, మరియొకచోటికి పోనూలేదు. దేహములోనే లయమగుచున్నది. ఆ దేహము మృతదేహమునకు తగినట్లుగానే యున్నది.

(2) శిష్యుడు:- మృతదేహములో యెరుక గలదని పైన చెప్పితిరిగదా? అప్పుడేల పిలిచితే పలుకడు.

గురువు:- సుషుప్తి నొందిన వానిని పిలిచితే యేలాగున పలుకడో అలాగున పలుకడు.

(3) శిష్యుడు:- నిదురబోయిన వానిని నొకసారి పిలిచితే పలుకకున్నను మరియొకసారి పిలిచితే పలుకకున్నను, మరియొకసారి పిలిచితే పలుకుచుండలేదా?

గురువు:- చెవిటివానిని పిలిచితే పలుకనట్టుగా.

(4) శిష్యుడు:- చెవులకు చెవుడైతే కనులు చూచుచుండ లేదా?

గురువు:- కనులు గలవు కనుక చూచుచున్నాడు.

(5) శిష్యుడు:- కనులు లేక చూడనప్పటికిని చెవిలేక వినబడనప్పటికిని

---

* 1నుండి 15 వఱకు వేసిన వరుస సంఖ్యలు రచనా సౌలభ్యము కొఱకు నేను వేసికొన్నవే గాని "బృహద్వాసిష్ఠ సిద్ధాంతము"న లేవు.

క్షుత్పిపాసాది బాధలకు పరితపించుచుండవలెనుగదా?

గురువు:- తనలో తాను పరితపించుచునే యుండును, గాని మానుకొనడు, నిర్మలుడు గానేరడు.

(6) శిష్యుడు:- ప్రేతశరీరమున కేమయిన బాధ కలదా?

గురువు:- ఏమి గలుగునోయీ! ఇది యేమి శంక.

(7) శిష్యుడు:- పునర్జన్మమునకు యేది లేచిపోవునో? అది యేమిటిదో?

గురువు:- లేచిపొయ్యే దొకటి గలదా?

(8) శిష్యుడు:- అలాగ అయితే పునర్జన్మ దేనికి?

గురువు:- శరీరమునకు.

(9) శిష్యుడు:- శరీరము మృతమైయె కదా?

గురువు:- కాలేదు.

(10) శిష్యుడు:- దహనాదిక్రియలు దేనిని గూర్చి చేయుచున్నారు?

గురువు:- శరీరమునకు

(11) శిష్యుడు:- శరీరము మృతి నొందలేదంటిరి కదా?

గురువు:- సూక్ష్మ శరీరమునకు.

(12) శిష్యుడు:- రెండు శరీరములు గలవా?

గురువు:- కలవు.

(13) శిష్యుడు:- అది యేలాగున?

గురువు:- పామున్ను పాము కుబుసమువలెను."

(బ్ర. పూ. పు. 147, 148)

"ఎరుక దేహమై యున్నది. ఎరుక దేహమైయుంటే దేహము నశించునుగదా? దేహము నశించిన పిమ్మట ఎఱుక లేదుగదా యని యందురేమొ. అమాట నిజమేకాని దేహము నశించలేదు. దేహము నశించకపోతే

మరణమే యని యందురేమొ. మరణమనగా పాము కూసము విడిచినట్లుగా, అరటిచెట్టు పొర లూడిపోయినట్లుగా, వుల్లిపాయపొట్టు వూడినటుగాను శరీరము గురూపదేశము వలనగాని పోనేరదు . . . . "

"ఎరుక ఎపుడు లేదో అపుడే శరీరము లేదు. శరీర మెపుడు లేదో యెరు కపుడే లేదు. ఎరుకను విడచి శరీరము వుండదు. ఎరుకను విడచి ప్రేతశరీర ముండలేదా? యనిన యీ శరీరము ఎంత జాగ్రత్తగా నున్నదో అక్కడ యెరుక అంత లక్షణముగానే వుంటున్నది. గాని ఎరుకకు వేరే జాగ్రత్త లేదు." (బృ. పూ. పు. 163)

(14) శిష్యుడు:- శరీరములేక ఎముకలు గనబడుచుండును గదా? ఎముకలయందు ఎరుక గలదా లేదా?

గురువు:- ఎరుక గలదు.

(15) శిష్యుడు:- ఎరుక గలిగితే ఏల మాట్లాడదు? సుఖ దుఃఖములు దాని కేల తెలియవు?

గురువు :- అయితే ఈలాగున అడిగితిరిగదా? శరీరమంతట ఎరుక గలదా లేదా?

శిష్యుడు :- గలదు.

గురువు :- గలిగితే గోళ్ళకు సుఖదుఃఖములు ఎందుకు లేదు? రోమములకు ఎందుకులేదు . . . .?

గురువు :- వినరోయీ నఖా రోమ దంతములకు ఘాతము వలన సుఖ దుఃఖములు ఎందువలన గలుగవని యడిగితిరి గదా? ఎక్కడెక్కడ రక్తశుక్లములు గలుగునో అక్కడ గలుగును గాని అవి లేనిచోట గలుగవు. అయితే రక్తశుక్లములే జీవమా యని అందురేమో? అందున కలిసియే యున్నవి. అది లేక యుత్పత్తి యెక్కడ యున్నది. బిందువునందు ఎరుక కలదా లేదా? యని యడిగినయెడల బిందువందు ఎరుక లేకపోతే అది యేలాగున వృద్ధి యగును. గనుక బిందువందు యెరుక మరపులై యున్నది. ఆ బిందువే స్త్రీపురుషులై యున్నారు." (బృ. పూ. ప్ర. 10)

14వ అంశమున దీక్షితులవారు ఎముకలయందు ఎఱుక కలదనిరి. ఎఱుక గలిగితే యేల మాట్లాడదని శిష్యుడు ప్రశ్నించినట్లు వ్రాసిరి. దీక్షితులవారు సమాధానము చెప్పుటకు (వారికి) అలవిగాని ప్రశ్నను వారే వేసికొనిరి. సూటిగా సమాధానము చెప్పలేక పోయిరి. డొంకతిరుగుడు మార్గమును అనుసరించి సమాధానము చెప్ప ప్రయత్నించి "అయితే నఖాదంతములకు సుఖదుఃఖములు ఎందుకు లేవు?" అని యెదురుప్రశ్న వేసిరి. అక్కడ దీక్షితుల వారికి వచ్చిన చిక్కులివి:-

బెల్లము దానితీపు ఒకటే అయినట్లు, శరీరము యెఱుక ఒక్కటియేయైన నీకు కడుపులో నొప్పి కలిగిన, వైద్యునియొద్దకు వెళ్లి 'నొప్పి యెందుకు కలిగిన' దని సలహాపొందవలసిన అవసరమేమి? చేతిపైన కఱ్ఱదెబ్బ తగిలినపుడు చేతి యెముక విరిగినదా? లేదా? అని తెసిసికొనుటకు ఎక్సరే ఫోటో తీయించుకొవలసిన అవసరమేమి? ఎముకల యందును ఎఱుక కలదంటిరికదా? అది విరిగినసంగతి దానికేల తెలియదు. శరీరసంబంధమైన అనేక వ్యాధులు బాధలు ప్రతిశరీరి యెఱుగవచ్చునుగదా? రోగనివారణకు వైద్యునిసలహా అడుగవచ్చునుగాని, శరీరమునకు కలిగిన వ్యాధి శరీరమునకే తెలియనిపక్షమున వైద్యున కెట్లు తెలియును? శరీరము ఎఱుక ఒక్కటై యుండగా వైద్యుడెందుకు?

**రెండవది:-**

బ్రహ్మచైతన్యము సర్వత్ర (జడద్రవ్యమునందును) కలదు. కాని ఒకశిల మఱియొక దానిని తెలిసికొనజాలదు. శిలయందు బ్రహ్మచైతన్యము కలదు గదా? యేల తెలిసికొనలేదు? అనగా కేవల వ్యాపక చైతన్యము (బ్రహ్మచైతన్యము) పదార్థముల నెఱుగజాలదు. చిదాభాస సహితమైన బుద్ధి వృత్తియే ఎఱుగుచున్నది. శిలయందు అట్టి బుద్ధి వృత్తిలేదు. అటులనే నఖములయందును దంతములయందును, శల్యములయందును, ఇతర జడపదార్థములయందును వృత్తి చైతన్యము లేదు. కనుక అవి తెలిసికొనజాలవు. దీక్షితులవారి మతమున ఉన్నది ఒక యెరుక యేగాని అద్వైతులవలె వ్యాపక చైతన్యము (పరబ్రహ్మ స్వరూపమైన జ్ఞానము), వృత్తి చైతన్యము (చిదాభాసుని సంబంధమైన జ్ఞానము) అను రెండు జ్ఞానములు లేవు. రెండు జ్ఞానములు ఎవరి మతమున అంగీకరింపబడునో అట్టివారి మతమున పదార్థముల నెఱుగునట్టి జ్ఞానసంబంధము గల మనస్సునకే సుఖదుఃఖాదుల అనుభవము కల్గును.

కేవలవ్యాపక చైతన్యమాత్ర మున్నచోట అట్టి అనుభవము లేదు. ఇట్టి వేదాంత జ్ఞానము దీక్షితులవారికి లేదు. కనుకనే సూటియైన సమాధానము చెప్పలేక "ఎక్కడెక్కడ రక్తశుక్లము లుండునో అక్కడక్కడ సుఖదుఃఖము లుండును" అని దీక్షితులవారు చెప్పిరి. ఇదియు సరికాదు. దేహమునకుగాని రక్తశుక్లములకుగాని సుఖదుఃఖములు తెలియవు. సుఖదుఃఖములు మనోధర్మములు. శస్త్రచికిత్స చేయించుకొనువానికి క్లోరోఫారమును ఇచ్చి కత్తి నుపయోగింతురు. వాని శరీరమందు రక్తమాంసములున్నవి, శుక్లమున్నది. కాని వానికి నొప్పి తెలియదు. కారణమేమన సుఖదుఃఖముల నెఱుగు మనస్సు అప్పుడు ఆత్మయందు లీనమైయున్నది. మనస్సు లేనపుడు చిదాభాసుడు ఉండడు. కనుక సుఖదుఃఖములు తెలియుటలేదు.

జిజ్ఞాసువు:-అయ్యా! ఎఱుక మృతదేహములో నుండునని దీక్షితులవారు చెప్పిరిగదా? దాని భావమేమి? అదిగాక 'గురు శిష్య సంవాదము' న శిష్యుడు రెండు శరీరములు కలవా? అని ప్రశ్నించగా 'కలవని' - పాము, పాము కుబుసమువలెనని చెప్పిరిగదా? దాని భావమేమి?

వేదాంతి:- అచలవాదులయందలి మితవాదుల అభిప్రాయము మృతుని శరీరమునుండి గాలి (ప్రాణము) పోవును గదా? అదియే పాము కుబుసమును (శరీరమును) విడిచి పోవుట యని అర్థము చెప్పుదురు. దీక్షితులవారు చెప్పిన యీ దృష్టాంతము సరియైనది కాదు. పాము కుబుసమును విడుచునట్లని చెప్పిన యీ దృష్టాంతము దార్ష్టాంతికము నందు ఎట్లు సమన్వయింపనగును? దీక్షితులవారి మతము ననుసరించి యేది స్థూలశరీరమును విడుచుచున్నది? జీవుడా? దీక్షితులవారు జీవుడు లేడు పొమ్మన్నారు.

శ్రీమద్రామానుజాచార్యుల మొదలు తదనంతరము వచ్చిన మతాచార్యులు అణుప్రమాణము గల జీవుడు సూక్ష్మదేహముతో కూడ స్థూలదేహమును విడిచి పోవుటే మరణ మన్నారు. వారందఱి మతములయందును అద్వైతులతోకూడ జీవునకు స్థూలశరీరమునకు గల సంబంధము కత్తి, దాని ఒరకుగల సంబంధము వంటిదని చెప్పియుండిరి. పాము దాని కుబుసము వంటిదని యెవ్వరును ఇంతవఱకు చెప్పియుండలేదు; పూర్వులు చెప్పకపోయిననేమి? ఎవరు చెప్పినను చెప్పిన వాక్యము సరియైనదైనచో గ్రాహ్యమేకదా? అనిన దీక్షితులవారు చెప్పిన దృష్టాంతము (దానికి దార్ష్టాంతికమే

లేదు) అర్థరహితము. జీవునకు స్థూలశరీరము భోగసాధనము. ధర్మసాధనము. సర్పమునకు దాని కుబుస మట్టిది కాదు. కుబుస మూడిపోయిన పాము మరణింపదు. మనుష్యునకు నీ జన్మమునందే ఒక కాలమున లేని దంతములు మొదలగు అవయవములు తరువాత ఒక యవస్థయందు పుట్టును, కొంత కాలముండి అవి ఊడిపోవును. పాముకుబుస మట్టిది. అరటి చెట్టుపొర లూడుట ఉల్లిపొట్టూడుట ఇట్టివి అర్థరహిత వాక్యములు. కాని వానికి అర్థము వేఱొకవిధముగా చెప్పవచ్చును.

ఈ యంశము యోగ వాసిష్ఠమునం దిట్లున్నది:-

**శ్లో॥ స్థూలదృష్టి దశాం త్వేతా మవలంబ్య మహామునే।**
**పుంసో మనః శరీరం చ కాయౌ ద్వావితి కథ్యతే॥**

(యో. వా. 4-11-22)

తా॥ స్థూలదృష్టిచేత రెండు శరీరములు గలవని చెప్పబడుచున్నది. ఒకటి మనస్సు, రెండవది పాంచభౌతికమగు స్థూలశరీరము.

**శ్లో॥ మనో మనన నిర్మాణ మాత్ర మేతజ్జగత్త్రయమ్।**
**స సన్న్యాస దివస్ఫార ముదితం త్వే తరన్మునే॥**

(యో. వా. 4-11-23)

తా॥ సూక్ష్మదృష్టితో చూచిన స్ఫురణమాత్రమును అనిర్వచనీయమునగు మనస్సే మూడులోకములను నిర్మించియున్నది. ఇంతకంటె వేఱులేదు.

అని చెప్పబడినందున దేహము ఒకటే అనగా మనస్సే. అదియే తనకు స్థూలశరీరమును నిర్మించుకొన్నదని తాత్పర్యము. బహుశః దీక్షితులవారు ఈ యర్థముతో శరీరములు రెండని చెప్పియుండవచ్చునా-యనిన యోగమో వాసిష్ఠకారుల మతము ననుసరించి మనస్సు పరమాత్ముని శక్తి. అది చిదాకాశమునుండి వెలువడిన చిత్‌శక్తి. దీక్షితులవారి యొఱుక (మనస్సు) అన్నముయొక్క సూక్ష్మాంశమువలన కలిగినది.

ప్రాణి మనస్సుచేతనే కర్మ చేయుచున్నాడు. కర్మవలన జనించు వాసనావిశేషములు మనస్సునందు గూడు కట్టుకొనియుండు సంస్కారములను

(వాసనలను) సామాగ్రితో పునర్జన్మకు యోగ్యమగు స్థూలదేహమును నిర్మించుచున్నది. కాని స్థూలదేహము పాముచే విడువబడిన పొరవంటిది కాదు ఈ వాక్యములు దీక్షితులవారి సిద్ధాంతమునకే విరుద్ధము. వారు ఇదివఱలో చెప్పినదేమి? దేహి దేహములగుఱించి వారు చెప్పిన వాక్యముల నుదాహరించి యుంటిని. అయినను మరల చెప్పెదను.-

**"శిలాప్రతిమవత్! అని దేహి దేహానికి అవినాభావ సంబంధము వుండి చెప్పినారు."** (బృ. ఉ. పు. 36)

**"గుడా మధురములవత్."** (బృ. ఉ. పు. 147) అని చెప్పియున్నందున శిలను వదలి శిలయందలి శిల్పము అనగా శిల్పిచే చేయబడిన ప్రతిమ పాముచే వదలబడిన దాని కుబుసమువలె వేఱుగా ఉండగలదా? బెల్లమును వదలి దానియందున్న తీపు వేఱుగా ఉండగలదా? పాము దాని కుబుసమును విడిచి యుండునట్లు దేహి దాని దేహమును వదలియుండునని యెట్లు చెప్పగలిగిరి? వారి గ్రంథమున ఇట్టి పరస్పర విరుద్ధమగు అర్థము నిచ్చు వాక్యములు ఎన్ని యేని గలవు.

గురుశిష్యుల సంవాదరూపమున దీక్షితులవారు వ్రాసినట్లు పైన చెప్పిన 15 అంశములను విని వాటి అర్థమును గ్రహించిన వారికి దీక్షితులవారి యోగ్యత యెంతమాత్రమైనది స్పష్టముగా తెలియగలదు.

కర్మఫలము అనుభవించుటకు స్థూలదేహమే స్థానము. కనుక దీక్షితులవారు పాము, పాముయొక్క కుబుసము అని చెప్పిన దృష్టాంతము ఇచ్చట సరిపడదని విస్తరించి చెప్పవలసి వచ్చినది. పాము దానికుబుసమును విడుచుట అను దృష్టాంతము శ్రీ శంకరులవారు బ్రహ్మసూత్రభాష్యమున ఒకచోట ఉపయోగించిరి. అచట పాముచే విడువబడిన కుబుసమునందు పామునకు ఆత్మబుద్ధి యెట్లు లేదో, అనగా : నాదను భ్రాంతి యెట్లు లేదో, జీవన్ముక్తులకు దేహమునందు ఆత్మబుద్ధి లేదని చెప్పిరి. (బ్ర. సూ. 1-1-4; బృహదా. 6-4-7) అచ్చట ఆ దృష్టాంతము యుక్తమైనది.

జిజ్ఞాసువు:- దీక్షితులవారు శిష్యుని (7వ) ప్రశ్నమునకు సమాధానముగా 'లేచిపోవున దొకటి కలదా?' అని యెదురుప్రశ్న వేసిరి. లేచిపోవుట లేదని అర్థము గదా? దేహమునుండి లేచిపోవున దొకటి లేదు కనుక జన్మాంతరము,

స్వర్గనరకములు లేకపోయెను. కర్మఫలము అనుభవించుట యెట్లు?

వేదాంతి:- అచలవాదులయందు మితవాదు లిట్లు చెప్పుదురు:- "కర్మయనగా - మనము చేయు వ్యాపారము, పని, దానివలన మనము అన్నమును సంపాదించుకొని భుజింతుము. అన్నసారము వీర్యము, మనస్సు. మనస్సు ప్రేరేపింపగా పురుషుడు భార్యతో రమించును. అప్పుడు వాని వీర్యము (అనగా వాని సూక్ష్మశరీరము) భార్య గర్భమున ప్రవేశించి స్థూలత్వమును పొందును. అనగా స్థూలదేహమై గర్భమునుండి జన్మించును. ఈవిధముగా పురుషుడు తన భార్యగర్భమునందు తానే తిరుగ పుత్రుడై పుట్టుచున్నాడు. ఇదియే పునర్జన్మము. కర్మవల్ల జన్మము కలుగునను శాస్త్రవాక్యములయొక్క తాత్పర్య మిదియే. దీక్షితులవారు బిందువే (వీర్యమే) సూక్ష్మశరీరమని చెప్పియున్నారు. బిందువునందు యెఱుక కలదని చెప్పిరిగదా? శాస్త్రములను అడవిలో పడినవారు ఈ యథార్థము తెలియక జనన మరణ భ్రాంతికి లోనైయున్నారట. అట్టి భ్రాంతి లేకుండ జేసినవాడు సద్గురువట.

పై యర్థమును ధృడపరచునట్టి దీక్షితులవారి మఱికొన్ని వాక్యము లివి:-

## (౧౮) పరలోకము-పునర్జన్మములు లేవా?

**"దేహమునకు నియమము లేదు. నిలుపులేదు. అంద లేదు. దేహమునకు జీవుడు లేడు. పరమాత్మ లేదు. బ్రహ్మ లేదు. దేహమునకు తలవ్రాత లేదు తలతిక్క లేదు. దేహమునకు తలతోక రెండును లేవు." (బృ. పూ. పు. 78)**

**"గు ... శరీరము పుట్టిన తర్వాత వున్నట్లు వుండి సమస్తమైన వ్యవహారాలు చేసి వెంటనే నిద్రపేరు చెప్పి యేమి లేక పోచుంది. యీ మూడు నాలుగు ఘడియలు వొకవేళ రెండు ఝాములు మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు. ప్రతిదినమందు యీ శరీరము యెప్పుడు మేలుకొంటే అప్పుడే కల. కొన్నాళ్ళు యీలాగు ప్రతిదినము సుషుప్తి యేమీ లేక పోయినటు యేమీ లేదు. అది మరణం అన్నారు. శరీరం పుట్టక మునుపు యేమీ లేదు. కొనకు యేమీ లేదు. ఇది లెస్సా బట్టబయలు వుండనే వున్నది."**

**(బృ. ఉ. పు. 132, 133)**

"యీ శరీరంతోటి పుట్టె కల. యీ శరీరం యేమీ లేకుంటే మంది సుషుప్తి అన్నారు. లేకుంటే మరణం అన్నారు. యింతేకాని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు నానాకూతలు మనము కూస్తాము. మనతోకూడా వచ్చినవారు కూస్తారు." (బృ. ఉ. ప్ర. 132)

ఈ వాక్యములయెక్క తాత్పర్యము మితవాదులు ఈ క్రింది విధముగ చెప్పుదురు.

"నిద్రించినపుడు (సుషుప్తిలో) ఎఱుక లేదు. ఎఱుక లేదు కనుక దేహము లేదు. ఇదే మరణము. తిరిగి మేల్కొన్నప్పుడు ఎఱుక, శరీరము కలుగుచున్నది. ఇదే జననము. ఈ విధముగా జరుగుచుండుటే జనన మరణ ప్రవాహము. స్థూలశరీర నాశనరూపమగు మరణముతో తిరిగి పుట్టక పోవడమే జన్మరాహిత్యము. ఇంతకంటె వేఱైన జనన మరణములు కలవని తలచుటే భ్రాంతి. అదే **"జనన మరణ భ్రాంతి" "జన్మభ్రాంతి లేకుండాచేసినవాడు గురువు"** (బృ. ఉ. పు. 73) 'అని దీక్షితులవారు చెప్పిన వాక్యమునకు తాత్పర్యమిదే' అని అందురు. స్వర్గ నరకాదులు లేవనుటకు మితవాదులు దీక్షితులవారి యీ క్రింది వాక్యముల నుదాహరింతురు:-

"శరీరములో కొంత నిబద్ధి, కొంత అబద్ధం అని చెప్పినా ఆ గురువు పుత్ర మిత్ర కళాత్రాదులతోటి నిర్మ్యాలమై పోచాడు : అని భరద్వాజులువారు పలికినారు. యేమని అంటే శ్రుతి॥ సమోలోవుపరి శిష్యతి యో దృత మభివదతి! తస్మాత్ హమ్మ్యనృతః వక్తః॥ అని ప్రకాశోపనిషత్తుయందు వున్నది."*

(బృ. ఉ. పు. 115)

*"యేమీ లేని యీ గుర్తెరిగే శరీరములో కొంత నిబద్ధి కొంత అబద్ధం అని కుక్కలవలె మొరిగిందాకా యేమి? గాడిదల వలె కూచిందాకా యేమి? నక్కలవలె వెళ్ళిందాకా యేమి? మనుష్యులు మూలం లేని గుర్తెరిగే శరీరాల్లో కొంత నిబద్ధి కొంత అబద్ధం అని అనుకోగా విని, ఛీ! వారివలె మనము మాట్లాడవద్దు."* (బృ. ఉ. పు. 123)

"శరీరం పుట్టకమునుపు ఏమీ లేదు. చచ్చినతరువాత ఈ శరీరం యేమీలేదు. వున్నది కాసంతసేపు మంది కూతలు విని అనేక భ్రమలచేత

* 'ప్రకాశోపనిషత్తు' అనునది అష్టోత్తరశతోపనిషత్తులలో లేదు.

అనేకమంది యున్నట్లు తాను వుండి కొనకు తానేమి లేదు. యిలాగే అనేకమంది వుండి మళ్ళాయేమిలేదు. *చచ్చినవారు మళ్ళీ పుడుతారు అనేటందుకు యేమీ లేదు గనుక యిది మళ్ళా పుడుచుంది అని యేలాగు అనా"*

(బృ. పూ. పు. 11)

"అందరికి యీ మూలంలేని గుర్తెరిగే శరీరమే ప్రతిదినమందు యేమీలేదు. కొనుట యేమీ లేదు. ఏమీ లేని అపకీర్తి సుషుప్తి అని కల్పించినారు. కొనకు మరణం అని కల్పించినారు. **తల్లికి అలవాటయిన పిల్లకు తల్లి కొనకు చస్తే, అపిల్ల అమ్మా, అమ్మాయని యాదిచేస్తే నీళ్లకుపోయింది, వస్తుందని పొరుగింటివారన్నట్టు, మూలంలేని యీ గుర్తెరిగే శరీరం స్వర్గానికి పోయింది అని కల్పించినారు."**

(బృ. ఉ. పు. 21, 22)

జిజ్ఞాసువు :- ఈ మతము శుద్ధనాస్తికము కాదందురా?

వేదాంతి :- దీక్షితులవారు ఈ సందర్భమున కాక వేఱొక సందర్భమునందు చెప్పిన యీ క్రింద యుదాహరించినవారి వాక్యములవలన అతివాదులు తమ మతమును సమర్థించుకొందురు.

**"అయితే మరణమగు వారందరు యీలాగుననే జన్మరహితు లగుచున్నారా? యని శంక రాగా, అందరి కాలాగున జన్మరహితము కాదు. అట్లైన అందరు ముక్తు లగుచున్నారని శంక రాగలదు. అలాగున ఒప్పుకొనిన, గురుశిష్య న్యాయము లేకపోవుచున్నది. పాప పుణ్యములు లేకపోవుచున్నవి. ఈ విపరీతార్థము లన్నియు కలుగుచున్నవి. ఇది ముక్తులైనవారు ఒప్పుకొందురు." (బృ. పూ. పు. 43)**

**" .... సద్గురువు దొరికినయెడల దుర్భ్రమలను విడిపించి జనన మరణ ప్రవాహరూపమైన సంసారసాగరమును దాటించును. అనగా సంసారమునుండి విముక్తుడగును. సంసారము నుండి విముక్తుడనగా ఈ సంసారమును విడవడముకాదు, జనన మరణ ప్రవాహమైన సంసారము విడుచుట."**

**(బృ. పూ. పు. 79)**

జిజ్ఞాసువు - పాప పుణ్యములు కలవని దీక్షితులవారు ఒప్పుకొన్నారు గదా? పుణ్య పాపముల ఫలము స్వర్గమో నరకమో యని మితవాదు లేల అంగీకరింపరు?

మితవాదు లిట్లందురు:- సద్గురువు దొరికినయెడల దుర్భ్రమలను విడిపించుననగా - పాప పుణ్యముల ఫలము నరకము, స్వర్గము - అనియు, పునర్జన్మ గలదనియు నమ్మకము ఏదికలదో అదియే దుర్భ్రమ దానిని విడిపించిన సంసారమునుండి విముక్తి కలిగినట్లె అందురు.

దీక్షితులవారు తమ గ్రంథమున స్వప్నజాగరములు రెండును ఒకటే కలయని అనేక సందర్భములయందు చెప్పియున్నారు. వారి మతమున కల మెలకువలకు భేదము లేదు. అందువలన కలలో పాపము చేసినవారికి శిక్ష లేనట్లే జాగ్రత్త యందును పాపము చేసినవారికి శిక్ష లేదని, (కర్మఫలానుభవము లేదని,) స్వర్గ నరకములు భ్రాంతియని చెప్పుదురు. ఇందు కాధారముగా దీక్షితులవారి యీ క్రింది వాక్యములను మితవాదులు ఉదాహరింతురు.-

*"స్వప్నములో వచ్చిన శరీరం పుణ్యాపాపములు చేసిందా? లేదా? అని వ్రాసుకొన్నవారు యెవరు? ముందర విమర్శించే వాడు యెవ్వడు? అది వేరే ఇది వేరే కాదు. వొక్కటే వ్యాపారము: వునికి వొక్కతీరే. కొనకు యేమీ లేదు. యీలాగున అన్ని శరీరాలకు సమానమే.* పుట్టనివి మళ్ళా పుట్టవు. కలలో మర్యాద యెవరు చేసినారు. ఎవ్వరూ *లేరు. కల యెవరి స్వాధీనము లేదు. అందుకే యీ జగత్తుకు దిక్కు లేదు. యెవ్వరికి యేలాగు అనుకూలమైతే అలాగే వారివారి సమ్మతమే సమ్మతము. యే మర్యాద నిలువదు. ఆదరంలేనిది గనుక న్యాయం నమ్మరాదు, అన్యాయం నమ్మరాదు.* ధర్మం నమ్మరాదు. అధర్మం నమ్మరాదు. కీర్తి నమ్మరాదు. అపకీర్తి నమ్మరాదు. యీ శరీరంనకు యేమి వుంది అని యెవ్వరు విచారించరు. తనకు తానే పుట్టి తనకు తానే యేమిలేదు." (బృ. ఉ. పు. 68)

దీక్షితులవారు నరకం ఉన్నట్లు అర్థమిచ్చే వాక్యములు 'నరక' శబ్దమును వాడిరి. 'నరక' శబ్దము పాపాత్ములు పోవు నరకలోకమును గుఱించి చెప్పబడినదని అతివాదుల వాదము. "అది సరికాదు ; నరకలోక మనునది లేదు, కంటికి కనబడు శరీరమునే దీక్షితులవారు 'నరక' మన్నార" ని మితవాదుల

వాదము. ఇందుకు వారు దీక్షితుల వారి యీ క్రింది వాక్యములే ప్రమాణములని చూపుదురు.

"జీవులకు జీవులే భక్షణ గాని. యింకేమి సందేహము లేదు. ఈ జీవులు నరక మనుభవించుచున్నారు. ఒకరిని ఒకరు అనుభవించుచున్నారు." (బృ. పూ. పు. 76)

దేహము నరకము గనుక ఒక దేహమును ఇంకొక దేహము తినుటయే నరకము అనుభవించుట యట.

"మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేసిన మర్యాద నమ్మినా సంకెళ్ళు తగిలినట్టే. మోక్షభ్రాంతి అయినా తగిలి శాస్త్రలవాసనచేత, లోకాంతరగతమై తగిలి దానంతవాడై *శరీరమనే నరకాన్ని విడువక మునిగి తేలేది.*"

(బృ. పూ. పు. 59)

"అహంకారము నరకము." (బృ. పూ. పు. 35)

*మితవాదుల మతమున పాప పుణ్యములు స్వర్గ నరకములు, ఇహపరములు, ధర్మాధర్మములు, అను ఈద్వంద్వము లన్నియు ఎఱుక, దేహము, అనునవి రెండేగాని శాస్త్రముల యందు చెప్పిన పుణ్యాపాపములు, స్వర్గనరకములు, ఇహపరములు, ధర్మాధర్మములు ప్రత్యేకముగా లేవని చెప్పుదురు. బాలారాంసింగుగారు వ్రాసిన యీ క్రింది ద్విపదార్థ దరువులను ప్రమాణములని చూపుదురు.*

"ఇదియే మేనెరుకలు యివియె సదసత్తు
లివియే యాత్మానాత్మ లివి యెరుకమరపు
లివికారణము కార్యమిదె జీవజగము
లివియే ప్రకృతి పురుషులు - యిహపరము లివియే-
యివియే సద్గురు శిష్యులు - యివియే సగుణ - నిర్గుణ
మివియే ప్రత్యక్పరమాత్మ - లివియే భావాభావము
లివె బంధమోక్ష మరయ ||లివి|| " (ద్విపదార్థ. 28)

"యివి క్షేత్ర క్షేత్రజ్ఞు లివె చిజ్జడంబు
లివి యవిద్యావిద్య లివె సుఖదుఃఖ
మివియె జ్ఞానాజ్ఞాన మివె పాపపుణ్యా
మివియే సాకారరూపము -
నిరాకారమివియే ధర్మా ధర్మము -
లివియే దృక్కు దృశ్యము లివియే జ్ఞానఖర్మము -
లివియే నీవును నేను యెరుగజెప్పితి గదా ||యివియే|| " (29)

ఈ ద్విపదార్థ దరువులు 'నరక' ము ఈ శరీరమే యని దీక్షితులవారు చెప్పిన అర్థమును దృఢపరచుచున్నవని మితవాదుల వాదము.

## (౧౮) దేహి-దేహములు భిన్నములు

దేహి దేహములు ఇవి రెండును భిన్నములు. దేహినే ఆత్మయని, జీవాత్మయని, పురుషుడని, శరీరి యని వేఱు వేఱు నామములతో పిలుతురు. ఎవరే నామముతో పిలిచినను దేహి దేహములయందు ప్రకృతి సంబంధమైనది దేహము మాత్రమే యనియు, దేహి ప్రకృతి సంబంధమైనవాడు కాడనియు, వేదాంతులు ఏకకంఠముగ చెప్పిరి. ఇందున భేదాభిప్రాయములు లేవు. హిందూమతమునందలి విశేష మిదియే. హిందుమతమునందేగాక క్రైస్తవులును, మఱికొన్ని యితర మతములవారును శరీరము వేఱు, శరీరి వేఱు - అను సిద్ధాంతమును అంగీకరించిరి. శరీరము ప్రకృతి సంబంధము, శరీరి ప్రకృతికి అతీతుడు. అనగా ప్రకృతికంటె భిన్నుడు అని అంగీకరించిరి.

శాక్తతంత్రములు శ్రుతులకు భిన్నముగా చెప్పునంత వఱకు వాటియందు చెప్పబడిన సిద్ధాంతము ప్రమాణముగా గైకొనవచ్చును. శ్రుతివిరుద్ధమగు తంత్రజ్ఞానము గ్రాహ్యము కాదు. ఇచట శ్రుతులనగా - ప్రాచీనశ్రుతులు (దశోపనిషత్తులు) నవీనములగు శాక్తోపనిషత్తులు కావు? చైతన్యమును జడమును, రెండును శక్తియేయను శాక్తాద్వైతము నుండియే కాలక్రమమున దేహి, దేహములు ఒక్కటియేయను సిద్ధాంతమును - శరీరములు నాలుగను సిద్ధాంతమును ప్రచారములోనికి వచ్చి బలపడినందున తుదకు ఈ సిద్ధాంతము నాధారముగా

గైకొనియే శాక్తేయులయందలి కౌలశాఖకు చెందినవారు దేవికి (శక్తికి) జంతుబలి యిష్టమని తలచి ఆవిధముగ జంతుబలిని సమర్థించు శాస్త్రములు, ఆచారములు ఆచరణ(మున)కు వచ్చియుండవచ్చును. జంతువులలో ఉత్తమోత్తముడు నరుడు, కనుక నరబలియు ఆవిధముగా ఆచరణలోనికి వచ్చియుండవచ్చునని యూహింపవచ్చును.

ఆత్మ స్వరూపమును గుఱించి శ్రుతులు చెప్పినదే ప్రమాణము. ఈశావాస్యశ్రుతిలో 4 నుండి 8వ మంత్రము వఱకును, కేనోపనిషత్తున ప్రథమఖండము 2వ మంత్రమునుండి 8వ మంత్రమువఱకును ఆత్మస్వరూప మిట్టిదని చెప్పబడెను.*

మం॥ న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్।
అజో నిత్య శ్శాశ్వతో యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ (కఠ. 1-2-18)

తా॥ ఆత్మ జననము మరణము లేనిది. అది దేనివలనను పుట్టినది కాదు అజము, నిత్యము, శాశ్వతము, సనాతనము. శరీరము చంపబడినను ఆత్మ చంపబడదు.

మం॥ అణోరణీయా న్మహతో మహీయా
నాత్మా ఒస్య జంతో ర్నిహితో గుహాయామ్,
తమ క్రతుః పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః (కఠ 1-2-20)

తా॥ ప్రాణుల హృదయగుహయం దుండు ఆత్మ అణువుకంటెను అణువై యున్నది. మహత్తునకంటెను మహత్తై యున్నది. కోరికలు విడిచిన శోకరహితులకు పరమేశ్వరానుగ్రహమువలన ఆత్మయొక్క మహిమ తెలియును. అనగా : ఆత్మదర్శనము కలుగును.

---

* గ్రంథవిస్తరభీతిచే వాటినిట నుదాహరింపలేదు. కఠోపనిషత్తు నందలి మంత్రములు కొన్ని 3 వ ప్రకరణము (4) అధ్యాయమునందు చెప్పబడును కనుక నిచట చెప్పలేదు.

వెనుక కఠోపనిషత్తునందలి (1-3-1) మంత్రమును ఇదివఱకే యుదాహరించియుంటిని.

శ్రుతులు దేహియొక్క స్థానమును నిట్లు చెప్పినవి ·

మం॥ **అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి.** (కఠ 2-1-12)

తా॥ అంగుష్ఠమాత్రుడైన పురుషుడు శరీరములో హృదయమధ్యమందు నివసించుచున్నాడు.

శ్రుతి ఆత్మను రథికునితోను, శరీరమును రథముతోను పోల్చి చెప్పుటతో తృప్తిచెందక శరీరమును పురముగను, అందున్న వానిని పురుషునిగను నిట్లు వర్ణించినది:-

మం॥ **పుర మేకాదశద్వార మజ స్యావక్రచేతసః॥**
**అనుష్ఠాయ న శోచతీ విముక్తశ్చ విముచ్యతే ఏతద్వై తత్॥ (కఠ.2-2-1)**

తా॥ శరీరమొక పురము. దీనికి పదునొకండు ద్వారము లున్నవి. ఈ పురము పుట్టుకలేని బ్రహ్మముదై యున్నది. అట్టి పురమునందున్న బ్రహ్మము నారాధించినవాడు దుఃఖమును విడిచినవాడై అజ్ఞానబంధమునుండి విముక్తుడై స్వతంత్రు డగుచున్నాడు. ఇదియే అది.

ఇచ్చట పదునొకండు ద్వారము లనగా తలలో సప్తరంధ్రములు (కన్నులు రెండు, చెవులు రెండు, ముక్కు రంధ్రములు రెండు, నోరు), నడినెత్తిన సూక్ష్మమైన బ్రహ్మరంధ్రమొకటి కలదు. దేహమునందు నాభిమొదలు మూడు రంధ్రములు కలసి పదునొకండు రంధ్రములు. ఈ రంధ్రములే ద్వారములు. (ఇంద్రియములు) ఈ పురమునందుండు వాడే పురుషుడు.(రాజు)

రథము, రథస్థుడైన రథి - ఇద్దరు ఒక్కటియేయైన - పురము, పురమునకు స్వామి (పురాధిపతి) ఒక్కటియే యైన - దేహి దేహములు ఒక్కటియే అనవచ్చును. ఇందువలన దేహి దేహములు 'బెల్లము, తీపు' వలె ఒకటే యను వాదము ఎవరిదైనను ప్రాచీన శ్రుతులకు సమ్మతము కాదని స్పష్టమైనది.

మం॥ **తస్మై స హోవాచ, ఇహైవాంతః శరీరే సోమ్య!**
**స పురుషో యస్మి న్నేతాః షోడశకలాః ప్రభవంతీతి॥**
(ప్రశ్న. 6-2)

తా॥ ఎవనియందు ఈ పదునాఱు కళలు ఉత్పన్నమగునో ఆ పురుషుడు ఈ శరీరమునందే యున్నాడు.

అని పిప్పలాదఋషి సుకేశునకు చెప్పినట్లు కలదు.

శౌనకుండను గృహస్థుడు అంగిరసుడను ఋషికడకు వెళ్ళి ఓ భగవానుడా! 'విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి'- దేనిని తెసిసికొనుటవలన సర్వమును తెలిసికొనినట్లగునో అట్టి జ్ఞానమును తెలుపుమని ప్రార్థించెను. అంగిరసఋషి యీ క్రింది విషయమును బోధించెను.

మం॥ **సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా**
**సమ్యక్ జ్ఞానేన బ్రహ్మ చర్యేణ నిత్యమ్।**
**అంతః శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో**
**యం పశ్యంతి యతయః క్షీణదోషాః॥** (మం. 3-1-5)

తా॥ సత్యము, తపస్సు, సమ్యక్జ్ఞానము, నిత్యమగు బ్రహ్మచర్యము- ఇవి ఆత్మజ్ఞానమార్గములు. దోషరహితులగు యతులు జ్యోతిర్మయాత్మను శరీరము (హృదయము) నందే చూతురు.

మం॥ ". . . . పశ్య త్విహైవ నిహితం గుహాయాం" (ముం. 3-1-7)

తా॥ దివ్యదృష్టిగల జ్ఞానులకు ఆత్మ వారి హృదయ గుహయందే గోచరమగును.

మం॥ "తస్యైష ఏవ శారీర ఆత్మా"

మొదటి ఆనందమయ పురుషుని ఆత్మయే ఈ శరీరము నందు ఆత్మమై యున్నది. (తైత్తిరీయ బ-6 అనువాకం)

ఐతరేయోపనిషత్తునందు పరమాత్మ ఈ శరీరము నందెట్లు ప్రవేశించెనను విషయమును వివరించుచు -

మం॥ **స ఏత మేన సీమానం విద్యార్యైతయా ద్వారా ప్రాపద్యత,**
**సైషా విదృతి ర్నామద్వా స్తదేతన్నానందసదనమ్।**

**తస్య త్రయ ఆవసథా స్త్రయ స్స్వప్నా అయ**
**మావసథో య మావసథో య మావసథ ఇతి||** (ఐత. 1-3-12)

తా|| ఆత్మ శిరోమధ్యభాగమును భేదించుకొని శరీరమునందు ప్రవేశించెను. దీనినే దశమద్వారమని చెప్పుదురు. ఈ ద్వారమునకే 'విదృతి' యనియు నామము. ఇది ఆనందనిలయము. దీని స్థానములు మూడు, స్వప్నావస్థలు మూడు. ఇట్లు మూడు తెరగులై యున్నది. (జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి, అను మూడవస్థలయందును క్రమముగ కుడికన్ను, మనస్సు, హృదయములని.)

**మం|| స వా ఏష ఆత్మా హృది తస్యైత దేవ నిరుక్తగ హృదయ**
**మితి తస్మా ద్ధృదయ మహరహర్వా ఏవం వి త్స్వర్గం లోకమేతి||**
(ఛాందో. 8-3-3)

తా|| అట్టి ఈ ఆత్మ హృదయమునందున్నాడు. 'హృది అయం' = హృదయమునందు ఆత్మ యున్నదని అర్థము. ఇట్లు తెలిసినవాడు అనుదినము స్వర్గమునకు పోవును.

పాపరహితమగు ఆత్మ హృదయము నందుండుట చేతనే హృదయమునకు 'హృదయ' మను పేరుగలిగినది.

**మం|| యో విజ్ఞానే తిష్ఠ న్విజ్ఞానా దంతరోఽయం విజ్ఞానం న వేద**
**యస్య విజ్ఞానగ్ం శరీరం యో విజ్ఞాన మంతరో ఽ య మయ**
**త్యేష త ఆత్మాంతర్యా మ్యమృతః||***

(బృహదారణ్యా. అ. 5-7-22)

తా|| ఎవడు విజ్ఞానము (బుద్ధి) యొక్క లోపల వెలుపల నున్నాడో, ఎవనిని విజ్ఞానము తెలియజాలదో, ఎవనికి విజ్ఞానము శరీరమో, ఎవడు

---

* బృహదారణ్యకోపనిషత్తునందు మొదటి రెండధ్యాయములు అశ్వమేధయాగమును గురించి చెప్పిన కారణమున కొన్ని ప్రతులయందు మొదటి రెండధ్యాయములు వదలి మూడవ అధ్యాయముతో శ్రుతి ప్రారంభించి మూడవ అధ్యాయమునకు ప్రథమాధ్యాయమని పేరిడియున్నారు. కొన్ని ప్రతులయందు మూడవ అధ్యాయమునకు మూడవ అధ్యాయమనియే పేరిడియున్నారు. నేను రెండవ పద్ధతి ననుసరించితిని.

అంతర్యామియైయుండి విజ్ఞానమును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

అని యాజ్ఞవల్క్యమహర్షి, ఉద్దాలకమహర్షికి ఉపదేశించెను.

ఉపనిషత్తులు ఇట్లు చెప్పినవి:- ఇందులోని ప్రతి మంత్రార్థము దీక్షితులవారి మతమునకు భిన్నముగనే యున్నది. దేహి దేహములు ఒక్కటేయను వాదమును భగవద్గీతకు ఎట్లు విరుద్ధమో చూతము : శ్రీ జ్ఞానేశ్వరులును శ్రీదీక్షితులును గౌరవించిన గీతయందలి కొన్ని శ్లోకముల నుదాహరింతును:-

**శ్లో॥ దేహినో ఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా!**
**తథా దేహాంతర ప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి॥ (గీత. 2-13)**

తా॥ ఆత్మకు ఈ స్థూలదేహమునందు బాల్యము, యౌవనము, ముసలితనమును ఏప్రకారము కలుగునో మఱియొక దేహము ప్రాప్తించుటయు అట్లే యగును.

**శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః।**
**అవినాశినో ఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ (గీత. 2-18)**

తా॥ నాశము లేనిదియు, ప్రత్యక్షాది ప్రమాణములచేత గోచరము కానిదియు నగు ఆత్మ (శరీరి) ఎల్లప్పుడు ఏకరూపమైనది. దేహములు నాశనము కలవి అని తత్త్వజ్ఞులచేత చెప్పబడినది. కనుక యుద్ధము చేయుము.

**శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ**
**నవాని గృహ్ణాతి నరో ఽపరాణి।**
**తథా శరీరాణి విహాయ జీర్ణా**
**న్యంగ్యాని సంయాతి నవాని దేహీ॥ (గీత. 2-22)**

తా॥ "ఏవిధమున ప్రజలు ప్రాతవస్త్రములను విడిచి క్రొత్త దుస్తులను ధరింతురో, ఆవిధముగనే చైతన్యాధిపతి అయిన జీవాత్మ ఒక శరీరము విడిచి మరియొక శరీరమును ధరించును." (ఆంధ్రజ్ఞానేశ్వరి)

జిజ్ఞాసువు :- దీక్షితులవారు "శరీరములో కొంత నిబద్ధి. కొంత అబద్ధం, కుక్కలవలె మొరిగిందాకా యేమి? గాడిదలవలె కూచిందాకా యేమి . . . " అని యీ విధముగా చెప్పిరే, వారు దీనికేమి సమాధాన మివ్వగలరు? అదిగాక, దేహాన్ని విడిచి ఎఱుక వుండదని చెప్పిరి గదా? గీత అట్టి సిద్ధాంతమును ఖండించుచున్నది గదా?

వేదాంతి :- ఇంతేకాదు ఈ యర్థము నిచ్చు శ్లోకములు గీతయందు అనేకములు గలవు. ఈ క్రింది శ్లోకమునకు శ్రీజ్ఞానేశ్వరుల వ్యాఖ్యను చూడుడు.

శ్లో॥ శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః।

గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥ (గీత. 15-8)

తా॥ "జీవాత్మ ఒకటికంటె ఎక్కువ శరీరములలో సంచరించునపుడు తానే కర్తగాను, భోక్తగాను కనబడును. తానుకూడ నట్లే యనుకొనును. అర్జునా! ఒక పురుషుడు రాజకీయ విలాసములతో సంపన్నుడై యొకస్థానమున నివాసము చేయునపుడు మిక్కిలి ధనవంతుడుగాను, విలాసపురుషుడుగాను కనబడును. అట్లే జీవాత్మ శరీరము నాశ్రయించినపుడు అతనికి 'నేనే కర్త' ననెడి భావన మిక్కిలి బలము కలిగినదగును. మరియు నింద్రియములయొక్క గంతు లారంభించును. లేక జీవాత్మ శరీరమును విడిచినప్పుడు ఇంద్రియములయొక్క సరంజామా యావత్తును తనతో తీసికొనిపోవును. అతిథి కవమాన మయినప్పుడు అతిథి గృహస్థునియొక్క యావత్తు పుణ్యసంపత్తిని హరించినట్లు, బొమ్మల నాడించువాడు వాటి నాడించు త్రాళ్ళను తనతోకూడ తీసికొని వెళ్ళినట్లు, వాయువు ఫలములయొక్కయు, పుష్పముల యొక్కయు పరిమళము దోచుకొనిపోయినట్లు, అర్జునా? శరీరము విడిచిపోవునపుడు దానిప్రభువగు జీవాత్మకూడ మనము, శ్రోత్రము మొదలైన షడింద్రియములను తనతో కూడ తీసికొనిపోవును." (ఆంధ్రజ్ఞానేశ్వరి)

గీతయొక్క 2-22 ; 15-8 ; శ్లోకముల తాత్పర్యము ఎవరో వ్రాసినది కాదు. శ్రీ జ్ఞానేశ్వరులవారు వ్రాసిన తాత్పర్యమునకు సరియైన అనువాదము.

జిజ్ఞాసువు :- అయ్యా! దీక్షితులవారు ఇదివఱలో చెప్పినట్లు - "అద్వైతమువలె దేహం అబద్ధం. దేహి నిబద్ధ అన్నట్లుకాదు" అన్నారు కదా? పై శ్లోకములు భగవద్వాక్యములే కదా? పై రెండు శ్లోకముల తాత్పర్యము

శ్రీజ్ఞానేశ్వరులవారు చెప్పినదే కదా? అట్లుండియు దీక్షితులవారు అద్వైతుల తిరస్కరించుటయేల? అదిగాక "మృత్యు కాలమునందు ఎరుక లేవనూ లేదు, మరియొక చోటికి పోవనూ లేదు, దేహములోనే లయమగుచున్న" దనిరి. ఈ వాక్యములు శ్రీజ్ఞానేశ్వరులవారి మతమునకు విరుద్ధము కదా?

వేదాంతి :- విరుద్ధమే. దీక్షితులవారు "దేహమునకు జీవుడు లేడు" (బృ. పూ. పు. 78) అని చెప్పిరి. దేహమునకు ప్రభువు కలడని పై శ్లోకమునందు గలదు. అది అట్లుండనిమ్ము. ప్రస్తుత చర్చనీయాంశమేమన; దశోపనిషత్తుల యందును, భగవద్గీతయందును దేహి దేహములు 'బెల్లము తీపు' వలె ఒకటి కాదనియు, దేహి నిత్యమనియు, దేహము అనిత్యమనియు రుజువైనది. ఇక బ్రహ్మసూత్రములయందు దేహి దేహములను గురించి చెప్పిన విషయము ఇదివఱకే విపులముగా చెప్పియుంటిని.* కనుక నిచ్చట చెప్పుట అనావశ్యకము. ఇంతటితో, ప్రస్థానత్రయమునకు "దేహి దేహములు రెండును ఒక్కటియే" యను దీక్షితులవారి వాదము సమ్మతముకాదని సిద్ధాంతమైనది. పంచమవేదమని ప్రసిద్ధికెక్కిన మహాభారతముయొక్క అభిప్రాయము కూడ ఇదియే యనుటకు ఈ క్రింది ప్రమాణములను చూపుచున్నాను.

భీష్ముడు ధర్మజునకు ఆత్మవిద్యాప్రకార ముపదేశించుచు-

(1) క|| వికృతులు మహదాదిక స
ప్తకముభయవిధేంద్రియములు పదియు విషయ పం
చకమును మనస్సును గూడగ
వికారషోడశక మిది వివేకాభ్యర్థీ. (శాంతి 4-273)

(2) క|| ఈ స్వరము దేహత్వా
భాసిక మిది దేహియైన పరమాత్ముని వి

---

* బ్రహ్మజిజ్ఞాస ప్రథమభాగమున 3 వ ప్రకరణమునందు మరణానంతరము జీవుని అస్తిత్వము, పునర్జన్మ సిద్ధాంతము, పంచాగ్ని విద్య, బ్రహ్మోపాసకులు మరణానంతరము పోవు దేవయానము, బ్రహ్మలోకము, పుణ్యాత్ములు పోవు పితృయానము, మూడవమార్గము జీవుల ఉత్క్రాంతి, బ్రహ్మవేత్తలకు ఉత్క్రాంతి లేకపోవుట అధికారపురుషుల జన్మము- మొదలగు విషయములు చెప్పియుంటిని.

న్యాసమునకు గానొదవి యు
పాసించుం గరణరూపమై యాకర్తన్. (శాంతి. 4-274)

(3) తే|| పుత్ర వినుము నవద్వారకపురము
నందచింత్య సంవ్యాపకు డైశయించు
నీ సమస్త భావంబుల నెనసి యట్టు
లగుట బురుషుండు నా జను నవ్విభుండు. (శాంతి. 4-275)

(4) క|| అమరుం డవ్యయు డజరుం
డమేయు డమలస్వభావు డప్పురషుడు దే
హమున మహీజమునం దన
లముగతి నుండు మథనలక్ష్యుం డగుచున్. (శాంతి 4-275)

ఈ మొత్తము పద్యములయొక్క భావ మేమన, ప్రకృతియు దానినుండి కలిగిన మహదాదులును కలసి దేహము. ఇది అనిత్యము దేహి ప్రకృతిసంబంధమైనవాడు కాడు, నిత్యుడు.

దీక్షితులవారి మతము ననుసరించి ప్రకృతియందలి సత్త్వగుణమువలన పుట్టినది యెఱుకయని, అదియే దేహియని చెప్పబడిన యీ మతము సరియైనది కాదని మహాభారతాదుల నుండి అనేక ప్రమాణములు చూపితిని. ఇప్పుడు దేహము, దేహి వేఱగు ననుటకు శాస్త్రప్రమాణములను చూపింతును. పరకాయ ప్రవేశవిద్య మనదేశమున పూర్వకాలమున నుండెననుటకు పురాణములయందును చరిత్ర గ్రంథములయందునను గలదు. అందుకు దృష్టాంతముగా నీ క్రింది యితిహాసములను వివరింతును :-

శ్రీ శంకరభగవత్పాదులు గోకర్ణేశ్వరుని సేవించి, మూకాంబికాదేవి నారాధించి ఆ క్షేత్రమునకు సమీపమున ఉన్న బలిపురమను పేరు గల అగ్రహారమునకు పోయిరి. ఆ గ్రామమున ప్రభాకరుడను బ్రాహ్మణు డుండెను. అయన ఏకైకపుత్రుడు పదమూడు సంవత్సరముల వయస్సు గలవాడు జడుడై యుండెను. ఆ బాలుడు పాఠశాలకు పోడు. ఒక అక్షరమైనను

వ్రాయడు. ఎవరితోను మాటలాడడు. తోడిబాలురు తిట్టినను, కొట్టినను సహించునేగాని ప్రతీకారమును తలంపడు. ఒకప్పుడు భుజించును, మఱియొకప్పుడు భోజనము లేకయే యుండును.

ప్రభాకరునకు శంకరుల ఆగమనవార్త తెలిసి కుమారుని వెంట నిడుకొని శ్రీశంకరులను దర్శించి ఆ బాలుని వృత్తాంత మెఱిగించి ఉపనయనమును మాత్రమే చేయించితినని చెప్పి కుమారుని శ్రీశంకరులపాదముల కడ నుంచెను. బాలుడు శ్రీశంకరుల పాదములు పట్టుకొని విడువకుండెను. శ్రీశంకరులు ఆ బాలు నిట్లు ప్రశ్నించిరి.

"నీ వెవడవు, జడునివలె నిట్లు ప్రవర్తించుచున్నావు?" - అందు కా బాలు డిట్లు చెప్పెను.

"నేను జడుడను కాను, నా సాన్నిధ్యమున జడము చలన మగుచున్నది. నాకు షడూర్మలు, షడ్భావవికారములు లేవు. సర్వాతీతమగు 'సత్' పదవాచ్యుడను నేనై యున్నాను. - అని పండ్రెండు శ్లోకములలో పరమాత్మతత్త్వమునుగూర్చి, అరచేతిలోని ఆమలకము (ఉసిరికపండు) వలె స్పష్టముగా తెలియునట్లు ఆశువుగా చెప్పెను. ఆశ్లోకములకు హస్తామలకములని ఆబాలునకు 'హస్తామలకాచార్యు'లని శ్రీశంకరులు నామకరణ మిడిరి. అచటనున్నవారి ఆశ్చర్యమునకు మేరలేదు. అంత శ్రీశంకరులు ప్రభాకరునితో "నీ కుమారుడు సమస్తము నెఱిగినవాడు. ఇతనితో నీకు ప్రయోజన మేమియు నుండదు. నావెంట కొనిపోయెదను." అని ప్రభాకరుని సమ్మతితో హస్తామలకుని శ్రీశంకరులు తమవెంట గొనిపోయిరి.

శ్రీశంకరులు ఒకానొకనాడు శిష్యుల ప్రార్థనవలన హస్తామలకాచార్యుల పూర్వవృత్తాంతమును దివ్యదృష్టితో కనుగొనియుండిరి. కనుక ఇట్లు చెప్పిరి:-

ఒకప్పుడు యమునాతీరమున ఒక సిద్ధపురుషుడు నివసించుచుండెను. అచటికి స్నానార్థమై వచ్చిన యాత్రికులలో నీ బాలుని తల్లిదండ్రులుకూడ ఉండిరి. ఈతని తల్లి రెండేండ్ల ప్రాయము గల యితనిని ఆ సిద్ధపురుషుని యెదుట కూర్చుండబెట్టి 'స్వామీ! ఈ బాలుని ఒకక్షణము చూచుచుండుడు, స్నానముచేసి వచ్చెద' నని ఆ సిద్ధుని అనుజ్ఞ గొని స్నానమునకు పోయెను. విధివశమున ఆ బాలుడు ఇటునటు తిరుగుచు పోయి నదిలోపడి మరణించెను.

ఆ బాలుని తలిదండ్రులు బాలుని మృతదేహమును సిద్ధుని యెదుటనుంచి అనేకవిధముల విలపించిరి. ఆ మహాత్ముడు వారిరోదనమును విని మిక్కిలి దుఃఖించి చేయునది లేక యోగమహిమచే తన శరీరమ్మును వదలి బాలునిశరీరమున ప్రవేశించెను. బాలునకు చైతన్యము కలుగగనే అతని తలిదండ్రులు కుమారుడు బ్రతికెనని సంతోషముతో బాలునెత్తుకొని వారిగ్రామమును చేరుకొనిరి. ఆ సిద్ధపురుషుడే హస్తామలకుడు, అందువలన ఇతడు గురూపదేశము లేకయే శ్రుతులు చదువకయే పరతత్త్వమును తెలిసికొనియున్నాడు. ఇతనికి తెలియనిది లేదు అని శంకరులవారు చెప్పిరి.
(శం. వి. 13 వ సర్గము. 35 నుండి 38)

చచ్చినవారియందు పరకాయప్రవేశ విద్యద్వారా ప్రవేశించుట యట్లుండ బ్రతికియున్న మానవునియందు మరణించిన మానవుని జీవాత్మ ప్రవేశించుటయు, ఈ జీవుడు పూర్వదేహమున ఆర్జించిన శక్తులను, కొన్ని మహిమలను, భవిష్యత్తును చెప్పుట మొదలగు విద్యలను ప్రదర్శించి ధనమార్జించి కొందఱు పుణ్యకర్మముల నాచరించి స్వర్గమునకు సోపానములు కట్టుచున్నారు. కొందఱు క్షుద్రవిద్యల నార్జించి వానిచే ధనమును, యశమును సంపాదించి పాపకర్మముల చేయుచు అధోగతిపా లగుచున్నారు. ఒకానొక వ్యక్తి బ్రహ్మవిద్యను తెలిసికొను వాంఛ కలిగి కొంత తెలిసికొని సర్వసంశయ నివృత్తి చెందనివాడై మరణించిన పిమ్మట సంకల్పబలమున స్వర్గాది లోకములకు పోక గంధర్వశరీరముతో తిరుగుచు బ్రతికియున్నవారి శరీరమునం దావేశించి కోర్కెను తీర్చుకొనిపోయినట్లు ఉపనిషత్తులయందు కలదు. బృహదారణ్యకోపనిషత్తునందలి పంచమాధ్యాయమున యాజ్ఞవల్క్యమునికిని భుజ్యునకును జరిగిన సంవాదమునం దిట్టి కథ కలదు.

మద్రదేశమున కపిగోత్రియగు పతంజలుని బిడ్డ ఒంటిపై అంగీరస ధన్వుడను గంధర్వు డావేశించి భుజ్యునితో ఆత్మవిద్యను గుఱించి సంభాషించినట్లు కలదు. మఱియు, యాజ్ఞవల్క్య ఉద్దాలక సంవాదమునందును నీకథ కొంత మార్పుతో చెప్పబడినది.-

ఇది యిట్లుండ బ్రతికియున్న మానవుడొకడు తన శరీరమునువదలి వేఱొకవ్యక్తి శరీరమున ప్రవేశించి సంభాషించి నట్లు మహాభారతమునందు ఈ క్రింది ప్రమాణమును చూడవచ్చును.

దేవశర్మయను మునికి రుచియను నామధేయము గల సర్వాంగసుందరి యగు భార్య యుండెను. దేవేంద్రుడు ఆమెయం దనురక్తుడై సమయమునకు వేచియుండెను. దేవశర్మ కీవిషయము తెలియును. ఒక సమయమున దేవశర్మ ఆశ్రమము వదలి పోవలసివచ్చెను. అపు డతడు ఏకాంతమున తనశిష్యుడగు 'విపులు' డను నాతని పిలిచి ఇంద్రుని పాపసంకల్పము చెప్పి జాగ్రత్తగా నుండుమని' పోయెను. విపులుడు కర్తవ్యమేమని ఆలోచించి నిజశరీరమును వదలి గురుపత్నియగు రుచిశరీరమునందు ప్రవేశించెను.

ఆ|| "పవను డాకసమున బరగు విధంబున
సమ్ప్రగాక్షితనువునందు గలయ
విపులు నాత్మ దగ బ్రవేశించె నవ్వధూ
రత్నమునకు నెఱుగ కాక యుండ."

(అనుశాసనికపర్వము. 22-94)

వ|| "ఇట్లు ప్రవేశించి యయ్యోగివరు నాత్మ యన్నాతిచైతన్యంబు జడంబుగా జేసికొనియుండ నట్టి యెడం బురందరుం డతిసుందరంబగు నాకారంబును దాల్చి యచ్చటికి వచ్చి విపులుని శరీరంబు సూచి నిద్రితునింగా ధలంచుచు"

రుచిముఖమునుండి విపులునివలన చీవాట్లు తిని వెడలిపోయినట్లు కలదు. 'బెల్లము తీపు' వలె దేహి దేహములు విడదీయరాని వైనచో ఇట్లు చేయుటకు సాధ్యమగునా? ఇది పరకాయప్రవేశవిద్య.

యోగమార్గమున తనువును వదలి మఱియొకరియందు ప్రవేశించినట్లు మహాభారతమునందుండియే మఱికొన్ని ప్రమాణములు చూడవచ్చును.

జపసిద్ధినొందిన కౌశికుండను మునికిని, ఆ ఫలమును కౌశికుని వలన గైకొనిన ఇక్ష్వాకు మహారాజునకును, బ్రహ్మదేవుడు ప్రత్యక్షము కాగా, వారు యోగబలమున శరీరము నుండి బ్రహ్మరంధ్ర ద్వారమున నిర్గమించి చతుర్ముఖుని యందు ప్రవేశించిన ట్లున్నది. ఆసందర్భమునందలి వాక్యము లివి :-

"వ॥ అప్పుడు తదీయ బ్రహ్మరంధ్రోద్గతుండును మహాజ్యోతిర్జ్వాలాకృతియుం బ్రాదేశమాత్రుండును నగు పురుషు నెదుర్కొని పరమేష్ఠి సమాధానంబున వచ్చితే యని పలికి వెండియు".... (మ.భా.శాంతి.4-166)

తే॥ బ్రహ్మ రంధ్ర నిర్గతుండైన బ్రాహ్మణుండు
బ్రహ్మ వదనంబు సొచ్చె భూపతియు నట్లు
వెడలి తద్వక్త్ర మెప్పటి వికసనంబు
బొంద నందుబ్రవేశించె భూపవర్య. (మ. భా. శాంతి. 4-169)

'గుడామధురవత్' (బెల్లము దాని తీపు), 'శిలా ప్రతిమవత్' (శిల దానియందు శిల్పము) లవలె దేహి దేహములు విడదీయరానివని దీక్షితులవారు చెప్పినదానికి పై వాక్యములు విరుద్ధములు కదా?

అదిగాక, సత్యవంతుని దేహమునుండి వెడలిన ఆతని జీవుని సావిత్రి చూచినట్లు మహాభారత ఆరణ్యపర్వమున ఇట్లున్నది.

ఆ॥ "ధరణినాథతనయు తనువున బ్రాదేశ
పరిమితాత్ముడగుచు బ్రజ్వరిల్లు
జీవు వెడలదిగిచి చెచ్చెర నతి దీర్ఘ
భయదపాశనికరబద్ధుజేసి." (అరణ్య. 7-219)

"కృతాంతుండు సత్యవంతు నపగత పాశుంజేసి"

గూటినుండి పక్షి వెడలినట్లు దేహమునుండి వెడలుట, తిరిగి దేహమున ప్రవేశించెనట. విదురుని ఆత్మ అతని దేహమునుండి వెడలి యుధిష్ఠిరుని దేహమునందు ప్రవేశించినట్లు మహాభారతమునందలి ఆశ్రమవాస పర్వమున చెప్పబడినది. ఇట్టి కథ లనేకములు గలవు.

దేహి దేహము వేఱని చెప్పుటకు ఇట్టివి అనేక ప్రమాణములు చూపవచ్చును. దీక్షితులవారు **"మృత్యు కాలమునందు యెరుక యెక్కడికి లేచిపోయినదని చెప్పెను? యెరుక లేవనూలేదు. మరియొకచోటికి పోవనూలేదు."** (బృ. పూ. పు. 147, 148) **"ఎరుకను విడచి శరీరము వుండదు. శరీరమును**

**విడచి ఎఱుక యుండదు."** (బృ. పూ. పు. 163) **అని** చెప్పినందులకు ఇంత విస్తరించి చెప్పవలసి వచ్చెను. దీక్షితులవారి మతము పైశాస్త్రప్రమాణముల వలన **హిందూమతమునకు విరుద్ధమైనదని స్పష్టమైనది.**

## (౨౦) ప్రకృతియే పురుషుడను మతము

మహాభారతము అనేక దర్శనములకు నిలయమైనను దేహి దేహములు ఒక్కటియే (ప్రకృతియే) అను మతము మహాభారతకర్తకు గాని, శ్రీకృష్ణభగవానునకు గాని సమ్మతము కాదు. మహాభారత సంగ్రామానంతరము శ్రీకృష్ణార్జునులు ఇంద్రప్రస్థ పురమునందున్న సమయమున భగవానుడు అర్జునుని ప్రార్థనమును మన్నించి మఱియొకసారి గీతాసారమును ఉపదేశించెను. మహాభారత అశ్వమేధ పర్వమునందుగల యీ యుపదేశమును 'అనుగీత' లందురు. **అనుగీతలందు** సత్త్వస్థుడైన పురుషుని కనుగొనుటయే ప్రాముఖ్యముగాని తక్కిన యే మార్గము వలనను పురుషుని కనుగొన జాలరని చెప్పు సందర్భమున దేహి దేహములు ప్రకృతియే యను మతప్రసక్తి వచ్చెను. అం దిట్లున్నది:-

శ్లో॥ క్షమా ధృతి రహింసా చ సమతా సత్య మార్జవమ్।
జ్ఞానం త్యాగోఽథ సన్న్యాసః సాత్త్వికం వ్రత మిష్యతే॥ (అధ్యా. 51-8)

శ్లో॥ ఏతే నైవానుమానేన మన్యంతే వాథ మనీషిణః।
సత్త్వం చ పురుష శ్చైవ తత్ర నాస్తి విచారణా॥ (అధ్యా. 51-9)

శ్లో॥ ఆహు రేకే మహాత్మానో యే జ్ఞానేషు ప్రతిష్ఠితాః।
క్షేత్రజ్ఞ సత్త్వయోరైక్యం ఇత్యేత న్నోపపద్యతే॥ (అధ్యా. 51-10)

శ్లో॥ పృథగ్భూతం తతో నిత్యం ఇత్యేతదవిచారితమ్,।
పృథగ్భావశ్చ విజ్ఞేయః సహజశ్చాపి తత్త్వతః॥ (అధ్యా. 51-11)

శ్లో॥ తథా చైకత్వనానాత్వం ఇష్యతే విదుషాం నయః।
మశకో దుంబల స్త్వైక్యం పృథక్త్వ మపి దృశ్యతే॥ (అధ్యా. 51-12)

శ్లో॥ మత్స్యోదకే యథైవ స్యాత్ అప్సుయోగ స్తథా ఽవయోః।
సంబంధో స్తోయబిందూనాం పర్ణైః కోకవదస్య చ.॥ (అధ్యా. 51-13)

ఈ శ్లోకార్థములను తిక్కన సోమయాజిగారు ఇట్లనువదించిరి

సీ॥ ఇట్లగు టె ట్లనియెదరేని సత్యంబు
  సంతోషమును నహింసయును ధృతియు
క్షమయు నార్జవమును సన్న్యాసమును బరి
  త్యాగంబు విజ్ఞాన యోగదశయు
సాత్త్వికంబులు గాన తత్త్వవిజ్ఞనము లీ
  యనుమానమును బురుషాధిగమము
బడయుట యొప్పెడు పదమండ్రు సత్త్వంబు
  బురుషుండు నొకడను బుద్ధిగొంద

తే॥ ఱార్యులూదుదు రట్లల యగు నుదుంబ
రమున మశకమ్ము వారి మీనము వసించి
నట్లు సత్త్వంబునం దంతరాత్ము డుండు
గాక యనియెడివారు పెక్కండ్రు గలరు. (అశ్వ. 2-186)

తా॥ సత్యము, సంతోషము, అహింస మొదలగు సత్త్వగుణములను పోషించు అనుష్ఠానముల వలన, దేహస్థుడైన పురుషుని అనుమానమువలన తెలిసికొను మార్గము లభించునందురు. సత్త్వగుణమే పురుషుడనువారు కొందఱు గలరు. అట్లెల యగు? మేడిపండునందు మశకము (దోమయు)ను, నీటియందు చేపయు, ఉన్నట్లు సత్త్వంబున పురుషుడుండు ననువారు అనేకులు కలరు.

సత్త్వగుణమే పురుషుడనుట అవిచారమూలమని ('తత్ర నాస్తి విచారణా' యని) త్రోసివేయబడినది. మేడిపండునకు అందలి దోమకు సంబంధము లేదు. దోమ మేడి పండునకు కలిగినది కాదు. బయటినుండి వచ్చినది. చేపకు నీటికి జన్యజనక భావము లేదు. చేపను నీటినుండి వేఱుచేయవచ్చును. ఈ రెండు దృష్టాంతముల వలన దేహి ప్రకృతి సంబంధ మైనవాడు కాడని రూఢియైనది - ఇంకను ఇట్లున్నది:-

"వ॥ ... యోగిజనానుభావ్యంబైన నెల వెఱింగించెదనని పలికి యోగులు దాననాత్మ దర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపుమని యిట్లనియె. (అశ్వ. 1-206)

ఆ॥ అనఘ ముంజ గర్భమగు నిషీక నిదర్శ
నంబుగాగ గను గొనంగవలయు
దనువు ముంజ మాత్మ దదిషీక నిష్కర్ష
విధము సుమ్ము యోగవిదుని వెరవు. (అశ్వ. 1-207)

క॥ తనువువలన నిష్కర్షం
బొనర్చి జీవాత్మ గాంచు యోగి వరుం ద
య్యను వొదవి యట్లు దన్నుం
గనినప్పుడు జనన మరణ గతులం దొఱగున్. (అశ్వ. 1-208)

తా॥ ముంజగడ్డి గర్భమునందు నిషీకము (=ముల్లు) గడ్డి మొదట (మూలమునం దంటక) వేఱై యుండును. శరీరకము ముంజ, జీవాత్మ ఇషీకము అని యెఱుగవలయును. ఇషీకమునకు ప్రక్కనున్న గడ్డిపోచలను తీసివేసిన, ఇషీకము దాని నంటక (ముంజతో సంబంధములేక) దానిలోనే యున్నదని తెలియబడును. ఇట్లే యోగవిదుడు పంచకోశముల నుండి ఆత్మను వేఱుచేసి చూచినప్పుడు తన్ను తాను చూచిన వాడై జననమరణముల గతినుండి విముక్తు డగునని తాత్పర్యము. ఇది శ్రీకృష్ణభగవానుల మతము.

ఇచ్చట నీ క్రింది యంశమును గమనింపవలసి యుండును.

ప్రకృతినుండియే దేహి దేహములు కలిగినవని చెప్పు వారియందు భేదాభిప్రాయములున్నవి. ఎట్లన:-

(1) ఒండునీటిని ఒక పాత్రలో వేసి అందులో చిల్లగింజను చాదివేసిన ఒండుమట్టి వేఱుగను, శుద్ధజలము వేఱుగను ఏర్పడునట్లు పరబ్రహ్మమునుండి కలిగిన మూలమాయ యందలి సూక్ష్మభాగము ఎఱుక లేక దేహి (చైతన్యము)గ నేర్పడినది. ఇది శుభ్రమగు నీటివంటిది. మూలమాయ యందలి స్థూలభాగము త్రిగుణాత్మక ప్రకృతిగను రూపొందినది. ఇదే దేహము. ఇది ఒండుమట్టి వంటిది. ఈ విధముగ దేహి దేహములు మూలమాయ నుండి కలిగినవని చెప్పునట్టి మతము.

(2) త్రిగుణాత్మక ప్రకృతి (లేక సాంఖ్యుల పరిభాషలో మూలప్రకృతి) అనబడు అవ్యక్తప్రకృతి దేహిగను, అట్టి అవ్యక్తప్రకృతినుండి కలిగిన మహదాదుల సమ్మేళనము వలన నేర్పడినది దేహముగను- ఈ `విధముగ ఒక ప్రకృతియే దేహి దేహము లనియు చెప్పెడి మతము.

(3) త్రిగుణాత్మక ప్రకృతియొక్క సత్త్వరజస్తమో గుణములయందు సత్త్వగుణము జ్ఞానరూపమనియు, అదియే దేహి యనియు, తక్కిన రజస్తమో గుణములు దేహముగా రూపొందిన వనియు చెప్పునట్టి మతము.

(4) త్రిగుణాత్మక ప్రకృతియందలి సత్త్వగుణమునకు జ్ఞానము పుట్టినదనియు, అదియే దేహి యనియు, రజస్తమో గుణములకు దేహము కలిగినదనియు చెప్పునట్టి మతము.

(5) జడ ప్రకృతి సంబంధమగు నాలుగు భూతముల పరస్పర సంబంధము వలన దేహమేర్పడిన దనియు, దేహము యొక్క గుణమే జ్ఞానము, దానినే అజ్ఞులు దేహి యనుచున్నా రనునట్టి మతము.

ఈ అయిదు మతములు పర్యవసానమున ఒకటియే. అనగా: జడద్రవ్యమే దేహి దేహము లయినదను భౌతికమతము. కాని వాటియొక్క ఆరంభ స్వరూపమును పరిశీలించిన అన్నియు పరస్పర భిన్నమతములే. ఒకదానికిని మఱియొక దానికిని మధ్య చాలదూర మున్నది. ఇందులో మొదటిది సమర్థుల మతము, రెండవది శ్రీజ్ఞానేశ్వరుల మతము. మూడవది అనుగీతలయందు నుదాహరింపబడిన మతము. నాలుగవది శ్రీ దీక్షితులు శ్రీకృష్ణదాసుగారు చెప్పిన మతము. అయిదవది చార్వాకుల మతము.

ఇప్పుడు అనుగీతల యందలి ప్రస్తుతాంశమును చర్చింతము. మహాభారతకారుని అభిప్రాయము శ్రీకృష్ణభగవానుని మనమే యని స్పష్టమయినది. మఱియు మహాభారతాంతర్గత అనుశాసనికపర్వము నందలి హారసనత్కుమార సంవాదము నందు దేహి (పురుషుడు), దేహము భిన్నములని యెంత స్పష్టపరుపబడెనో యీ క్రింది సనత్కుమారమహర్షి వాక్యముల వలన తెలియవచ్చును.

క|| జలమున మీను నుదుంబర
ఫలమున మశకములు బోలె బ్రకృతిం దా ని
మ్ముల నునికి దెలిసి వేర్పా
టలవఱచిన పురుషు డవ్యయత్వము బొందున్. (తిక్కన. అను.4-232)

ఇందువలన మహాభారతకర్తకు సహితము దేహి దేహములు 'బెల్లము తీపు' వలె, 'శిలాప్రతిమ' వలె విడదీయుటకు సాధ్యము కానివను అచలవాదము సమ్మతమైనది కాదని విదితమైనది. కాని, దేహి దేహములు ప్రకృతి సంబంధమైన వనువారు కొలదిగా ఆ కాలమునందును గలరనియు, అది తప్పనువారు పెక్కండ్రు కలరనియు స్పష్టమైనది.

లోకవ్యవహారములయందు సహితము కొన్ని సమయములయందు ఇరువురు న్యాయాధిపతుల తీర్పులు పరస్పర విరుద్ధముగా నుండును. న్యాయాధిపతు లిరువురు సమానులే? ఎవరిది గ్రాహ్యము, ఎవరిది అగ్రాహ్యమను సంశయము కలుగును. అట్టి సందర్భముల యందు న్యాయస్థానమునందలి న్యాయాధిపతు లందఱును వివాదాంశమును విని తీర్పు చెప్పుదురు. అధికసంఖ్యాకుల తీర్పు సరియైనదిగా పరిగణింపబడును. సత్త్వమే పురుషుడనువారు కొందఱుమాత్రమే యనియు, సత్త్వమునందు సత్త్వముకంటె భిన్నుడగు పురుషు డుండుననువారు పెక్కండ్రు కలరనియు చెప్పుటవలన అధికసంఖ్యాకుల వాక్యమే గ్రాహ్యము. శ్రీకృష్ణభగవానుని అభిప్రాయము కూడ నిదియే

దీక్షితులవారు సహితము ముంజ ఇషీక దృష్టాంతమును గైకొనిరి. కాని, వారి భావము వేఱు. ముంజకు కలిగినదే ఇషీకము. అలాగే దేహమునకే దేహి కలిగినట్లని వారిభావము. సత్త్వగుణము పురుషుడను పొరపాటును కొందఱు కలిగియుండుటకు భగవద్గీత యందలి యీ క్రింది శ్లోకములను చక్కగా అర్థము చేసికొనక పోవుట యని నా అభిప్రాయము.

శ్లో|| సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ|
ప్రమాద మోహౌ తమసో భవతో ఒజ్ఞానమేవ చ|| (గీత. 14-17)

తా|| సత్త్వగుణము వలన జ్ఞానము పుట్టుచున్నది రజోగుణము వలన లోభము పుట్టుచున్నది. తమోగుణము వలన ప్రమాద, మోహ, అజ్ఞానములు పుట్టుచున్నవి.

భాగవతుల కృష్ణదాసుగారు పై శ్లోకమును ఆధారముగా గైకొని యిట్లు చెప్పిరి :-

క|| "జ్ఞానము సత్త్వగుణ మను
దానికి జన్మించె ననుచు దామోదరు డా
మేనత్త కొడుకుతోనవె
జ్ఞానమునకు జన్మమొకటి కలిగెగదోయీ." (కందము. 125)

క|| పుట్టింది గిట్టు జ్ఞానము
పుట్టెననుచు కృష్ణమూర్తి పురుహూతజుడౌ
నట్టి తనముద్దు మరదికి
గట్టిగ విన జెప్పె నిందు కలతేమోయీ. (కందము. 126)

ఈ పద్యద్వయము వలన కృష్ణదాసుగారి భావమిది :- గీతయొక్క 14 అ. 17వ శ్లోకము నందలి 'సత్త్వాత్సంజాయతే జ్ఞానం' అను శ్లోకమున సత్త్వగుణమునకు జ్ఞానము కలిగినది. జ్ఞాన మనగా : ఎఱుక. అది పుట్టినది. దానినే 'ప్రజ్ఞానం బ్రహ్మ' అని శ్రుతులు చెప్పినవి. కనుక, బ్రహ్మమునకు చావు పుట్టువులు కలవనిరి. ఈ మాట విన్నంతమాత్రమున "అయ్యో మేము బ్రహ్మము నిత్యసత్య మైనదని శ్రుతులు చెప్పగా నమ్మియుంటిమే అట్టి బ్రహ్మమునకు జనన మరణములు గీత అంగీకరించెనే" యని అద్వైతులు కలత చెందినట్లు భావించి 'ఇందు కలతేమోయి' అన్నారు. కృష్ణదాసుగారు చెప్పిన అర్థము అచ్చట సరిపోదు. ఎట్లనగా :-

గీతయందలి '-సత్త్వా త్సంజాయతే జ్ఞానం' సత్త్వగుణము వృద్ధిలోనికి వచ్చిన కాలమున మానవునకు భ్రాంతి రహితమగు బ్రహ్మజ్ఞానము (సంయక్ జ్ఞానము) కలుగును. అట్టి జ్ఞానము కలిగినప్పుడు నామరూపములను ముసుగుక్రింద నామరూపరహితమగు, అద్వితీయబ్రహ్మమును చూడగల యోగ్యత, వివేకము (జ్ఞానము) కలుగునని అర్థము. అది యెట్టిదనగా:-

**శ్లో|| యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి|**
**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా|| (గీత. 13-30)**

తా|| భిన్న భిన్న రూపములుగ నుండు సమస్త భూతముల యందును ఒక్కటియైన ఆత్మ (పరమాత్మ) ఎవడు చూచునో, - ఆ ఆత్మ వలననే యీ సమస్త ప్రపంచము పుట్టినట్లు ఎవడు తెలిసికొనునో ఆ మానవునకు గల **అట్టి వివేకమే సత్త్వగుణము వృద్ధిలోనికి వచ్చినప్పుడు కలుగుజ్ఞానము.**

ఇచట ఇంకొక విషయము చెప్పవలసియున్నది. శివసూత్రములయందలి 'జ్ఞానబంధః' అను సూత్రమునకును, భగవద్గీత 14-17 వ శ్లోకమునందలి 'సత్త్వాత్సంజాయతే జ్ఞానం' అను భగవద్వాక్యమునకును శ్రీజ్ఞానేశ్వరులు, వారి సిద్ధాంతమునకు సరిపోవునట్టి అర్థమును నీ క్రింది విధముగ చెప్పిరి:-

"మఱియు శివసూత్రంబులయందు నా సదాశివుండును జ్ఞానంబును గూర్చి వివరించుచు నదియు నొక్క బంధనవిధంబని వక్కాణించి యున్నాడు." (అను. 3-16)

"కాని, యివ్విషయంబు శివప్రోక్తంబొ శ్రీవల్లభోక్తంబొ, యగుటంజేసియే యున మంగీకరించెద మనుట మాత్ర మర్థంబు గానేరకుండు. వా రివ్విధంబున వాకొనకున్నను మన కయ్యది యవగతంబై యుండెడిదే." (అను. 3-17)

ఈ విషయమే సంస్కృతానువాదమున నిట్లున్నది.

**శ్లో|| శివ సూత్రే శివేనోక్తం జ్ఞానం బంధో హి కేవలః|**
**సత్త్వేన జ్ఞానబంధస్స్యాద్వక్తేతి గరుడధ్వజః||**
**(అమృతానుభవము. 3-16)**

అజ్ఞానమును నివర్తింపజేయునట్టి సంయక్జ్ఞానమును అనగా : అహం బ్రహ్మాస్మీత్యాకారమై యొప్పు **అఖండాకార** వృత్తిరూప జ్ఞానముకూడ బంధమేనని శ్రీజ్ఞానేశ్వరుల అనుయాయులు **అర్థము** చెప్పుచున్నారు. **ఆ అర్థము** సరికాదని దానిని **ఖండించుచు** 'జ్ఞాన బంధః' అనగా :- **భేద** జ్ఞానము బంధమని **అభేదజ్ఞానము** బంధవిచ్ఛేదకమని చెప్పుచు సూత్రమునందు చెప్పిన 'జ్ఞాన'

శబ్దమున కర్థము భేదజ్ఞానమేకాని అభేదజ్ఞానము కాదని అభేదజ్ఞానము బంధవిముక్తిని కలిగించునని పెద్దలు కొందఱు అర్థము చెప్పియున్నారు. ఈ యంశమును ఇదివఱలో విశదీకరించి యుంటిని.* కనుక నిచ్చట చెప్పవలసిన అవసర ముండదు.

'సత్త్వా త్సంజాయతే జ్ఞానం' (గీత. 14-17) లో చెప్పబడిన జ్ఞానము అఖండాకార వృత్తి జ్ఞానమే గనుక అట్టి సాత్త్వికజ్ఞానము సహితము బంధహేతువే యని శ్రీజ్ఞానేశ్వరుల తాత్పర్యము. పైన చెప్పబడిన (అను. 3-17) లో శివ, శ్రీవల్లభుల వచనము లొకటియే యని వారు చెప్పిరి.

శ్రీజ్ఞానేశ్వరులు చెప్పిన అర్థముతో దీక్షితులవారి యొక్కయు, కృష్ణదాసుగారి యొక్కయు, వచనములకు సామ్యము కుదురదు. ఎట్లన 'సత్త్వా త్సంజాయతే జ్ఞానం' అనగా సత్త్వాత్ = సత్త్వగుణము వలన, జ్ఞానం = జ్ఞానము, సంజాయతే = పుట్టుచున్నది. సత్త్వగుణము వలన (ఇది పంచమీవిభక్తి) శ్రీరాముని వలన సుగ్రీవుడు రాజ్యలాభము నొందెను. అన్నట్లు సత్త్వగుణము వలన అంతఃకరణము (మనస్సు) నిర్మలమై ఆత్మాకారమును పొందుచున్నదనియు దీనివలన ఆత్మసాక్షాత్కారము కలుగుననియు అర్థము.

ఇందులకు పోతనగారి భాగవతమునం దిట్లున్నది :-

"విక్రియాశూన్యమై విషయత్వమును లేని

దగుచు నాత్మాకారమై తనర్చు

అంతఃకరణము ... ..., అని యున్నది. (భా. 10. పూ. పద్యము. 554)

గీతయొక్క 14-17 శ్లోకము తరువాతి శ్లోకమున 'ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా' అని యున్నందున సత్త్వగుణము వృద్ధిలోనికి వచ్చినవాడు మరణానంతరము బ్రహ్మవిష్ణ్వాది స్థానముల బొందుచున్నాడని యర్థము. శ్రీకృష్ణదాసు సత్త్వగుణమునకు (షష్ఠీవిభక్తి) అని చెప్పియున్నారు. కృష్ణదాసుగారి

---

* ఈ భాగము మొదటి ప్రకరణమునందలి (౧౭) అధ్యాయమున అఖండాకారవృత్తి అఖండైక రసము అను శీర్షికక్రింద 'జ్ఞానంబంధః' అను సూత్రార్థమును వివరించి యున్నాను

పద్యములయందు సత్త్వగుణమునకు ఎఱుక (జీవుడు)ను, రజః తమోగుణములకు క్రమమున ప్రాణము, శరీరము (మరపు) కలిగినందున మొత్తము దేహి దేహములు ప్రకృతి సంభవములే (భౌతికములే) అను చార్వాక వాదమును దృఢపరుప బడినది. ఇప్పుడు శ్రీజ్ఞానేశ్వరులయొక్కయు, శ్రీదీక్షిత, శ్రీకృష్ణదాసుగార్లయొక్క వాదమునందు గల భేదము స్పష్టపరచితిని.

మఱియు పైన చెప్పిన గీతయొక్క 13-30 ; 14-17 శ్లోకముల యందలి యర్థమునే గీత 18-20 శ్లోకమున దృఢపరచినది. ఎట్లనగా:-

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు ***తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్***॥ (గీత 18-20)

తా॥ (మానవుడు) ఏ జ్ఞానముచేత భిన్నభిన్నములైన సర్వభూతముల యందును, అఖండమైనదియు, నాశరహితమైనదియు, ఏకమైనదియు నైన పరమాత్మ స్వరూపమును (ఎవడు) చూచుచున్నాడో (వాని) **అజ్ఞానము సత్త్వగుణము వలన కలిగినదిగా తెలియుము.**

గీత, తరువాత చెప్పిన రెండు శ్లోకములయందును (13-21, 22) రాజస తామస జ్ఞానముల స్వరూప మిట్టిదని వివరించినది. రాజసజ్ఞానమువలన సర్వభూతములయందు భేదభావము కలుగుచున్నది తామసజ్ఞానము వలన జీవుడు దేహమే యను విపరీత జ్ఞానము కలుగునని తాత్పర్యము. అంతియే కాని వృక్షమునకు ఫలము పుట్టునట్లును, గోవునందు వత్సము కలుగునట్లును, సత్త్వగుణమునకు జ్ఞానము (బ్రహ్మము) పుట్టినదను అర్థము విపరీతార్థము. అట్టి విపరీతార్థము పై (గీత. 18-20) శ్లోకముచేత ఖండింపబడినది.

కృష్ణదాసుగారు :-

**కందా॥ అన్నము శుక్లంబగు రస**
**మున్నతిగా రక్తమగును నొకచో రెండున్**
**పన్నుగ గలసిన మేనని**
**యెన్నబడున్ యెఱుక గల్గి యిదె మాయసుమ్మి**
**మూలములేనిదిదె నీవు సుమ్మీ-** **(152)**

అన్నపు సూక్ష్మాంశము . . అను 83 వ కందార్థము నందలి అర్థమునను పై కందార్థమునందు చెప్పిన అర్థమును ఒక్కటే.

ఛాందోగ్యోపనిషత్తు (6-2-6) మంత్రమునందు ఈ యంశము కలదు. దానిని సంగ్రహించి చెప్పెదను.

శ్రుతియందు త్రివృత్కరణము (అనగా : భూ, జలాగ్నులను మూడు భూతముల) వలన సృష్టి జరిగినట్లు చెప్పబడును కనుక, పై మూడు భూతములను మథించిన పెరుగును మథింపగా వెన్న వచ్చినట్లు అన్నము కలిగినదనియు, అన్నము జఠరమునందు చొచ్చి జీర్ణమై అందలి అన్ని భాగములయొక్క స్థూల, మధ్యమ, సూక్ష్మాంశముల వలన క్రమముగ ఎముకలు, మజ్జ, వాక్కు అను మూడును; జలభాగము యొక్క స్థూల మధ్యమ, సూక్ష్మాంశములనుండి క్రమమున మూత్ర, రక్త, ప్రాణములను మూడును, పృథ్వీ భాగముయొక్క స్థూల, మధ్యమ, సూక్ష్మాంశములనుండి పురీషము, మాంసము, మనస్సులను మూడును; పుట్టుచున్నవని చెప్పబడినది. కాని మనః ప్రాణసంయోగము వలన ఎఱుక, లేక జీవుడు, లేక ఆత్మ వస్తువు కలిగినట్లు చెప్పియుండలేదు.

ఆత్మ జడమను వాదము శ్రీశంకర శ్రీరామానుజ శ్రీవల్లభాచార్యాదులగు మహనీయు లందఱు పెక్కువిధముల ఖండించియున్నారు అందులో ఒకటి యిం దుదాహరింతును. శ్రీసురేశ్వరాచార్యులవారు నైష్కర్మ్యసిద్ధియం దిట్లు చెప్పిరి :-

శ్లో॥ బుసవ్రీహి పలలాంశై ర్బీజ మేకం త్రిధా యథా।
బుద్ధి మాంస పురీషాంశై రన్నం తద్వ దవస్థితమ్॥ (నై. 2. ౧౪-౪)

తా॥ వడ్లగింజ ఒకటియే యైనను కాడ (చెత్త) పొట్టు, గింజ (బియ్యము) అను మూడు భాగములుగ ఎట్లున్నదో అన్నముకూడ అట్లే అసార (స్థూల) మైన భాగము పురీషమనియు, కొంచెము సారమైన (మధ్యమ) భాగము మాంసమనియు, మిక్కిలి సారమైన (సూక్ష్మ) భాగము బుద్ధి యనియు, మూడు విధములుగా ఏర్పడియున్నది.

పై ఛాందోగ్యశ్రుతి ననుసరించియే సురేశ్వరాచార్యులవారు పై విధముగ చెప్పిరి.- అన్నపరిణామమైన పురీషమునందు నే నను బుద్ధి నీకు కలుగలేదు.

పురీషమును విసర్జించి దానియందు అనురాగము లేక వెడలిపోవుచున్నావు. అదే విధముగా అన్నపరిణామమైన దేహము (మాంసము) నందును, నేనను బుద్ధిని విడిచి పురీషమునందు వలెనే అనురాగమును వదలవలయును అట్లే అన్నపరిణామమే యగు బుద్ధియందును ఆత్మభావమును చేయక (పురీషమునందు వలెనే) రాగమును వదలి ఆత్మ కాదని మహాత్ము లుందురని భావము.

మన నిత్యానుభవమును చూచినను, అన్నము నీవు (ఎఱుక లేక ఆత్మ) కావు. అట్లే జలము సహితము ఎఱుక కాదు. జలాన్నముల రెండింటిని ఒక పాత్రలో నిడిన యెఱుక కాదు. అన్నోదకములయొక్క స్థూల పరిణాములగు మల మూత్రముల మిశ్రమము నీవు (ఎఱుక) కాదు. అట్లే అన్నోదకముల మధ్యను పరిణామమగు మాంసశోణితములు నీవు (ఎఱుక) కాదు. ఇట్లుండగా, సూక్ష్మ పరిణామముల కలయిక నీ వెట్లగుదువు? మల మూత్రములను వదలునపుడు "అయ్యో! నేను నాయందు కొంత భాగమును వదలుచున్నానే" అని దుఃఖింపవు. మల మూత్రముల యందు లేని ఆత్మాభిమానము (నేనను భావము) మనః ప్రాణ సంయోగమున నెట్లు కలిగెను? అదిగాక పురీషమునందు కొందఱకు ఒకప్పుడు ఏలికపాము (Pin Worms)ను, మఱియొకప్పుడు నులిపురుగులను తెల్లని సన్నని పురుగులు (round worms) పడును. అవి స్వదేహమునం దుద్భవించినను వాటియందు ఆత్మభావన (నేనను భావము) లేదేమి? సారాంశ మేమన:

ఆత్మ పుట్టినది కాదు. అది జడము కాదు. కృష్ణదాసుగారి 'పిండ బ్రహ్మాండము' లను (కందార్థమును ఈప్రకరణము 2వ అధ్యాయములో చూడుడు) కందార్థము జడాద్వైతమునే దృఢపరచుచున్నది.

పై ఛాందోగ్యశ్రుతి వాక్యములయొక్క తాత్పర్యమేమన:- అన్నోదకముల వలన మనస్సును ప్రాణమును కలుగుననుట నిజమే. కలుగుననగా:- మనః ప్రాణములకు శక్తిని సమకూర్చును. మనః ప్రాణములసంయోగము వలన 'చలనాత్మక శక్తి' కలుగును. అది ఆత్మ కాదు, జీవుడు కాదు. (ఈ విషయమై తెలియగోరువారు బ్రహ్మసూత్రములు 2-4-21, 22, 2-3-1 నుండి 8 వఱకు

సూత్రములకు శాంకర భాష్యమునుగాని, బ్రహ్మసూత్రార్థ చంద్రికను గాని చూడుడు.)

మఱియు, ఆత్మయందే ప్రాణము పుట్టినదని శ్రుతులు చెప్పినవి. (ప్రశ్న. 3-3 ;) నీటివలన ప్రాణము పుట్టిన దనగా . నీటిచే ప్రాణము పోషింపబడినదని అర్థము. ఎవ రెట్లు చెప్పినను జడద్రవ్యము నుండి చైతన్యము పుట్టదు.

శ్రీ లోకమాన్యతిలక్‌గారు చేతన యనగా : "జడ దేహమునందు గన్పట్టెడి ప్రాణములయొక్క సంచలనాత్మక క్రియ, చేష్ట, లేక బ్రతికియుండుట యను వ్యాపారము మాత్రమే యిచ్చో నుద్దేశింపబడినది. ఏచిచ్ఛక్తిచే జడపదార్థములందు సైతము చలనాదిక్రియ (అనగా వ్యాపారము) కలుగునో అదియే చైతన్యము" అని చెప్పిరి. (గీతా రహస్యము, పుట, 192 లేక, 6వ ప్రకరణము).

రైలు ఇంజనులో నిప్పు నీరు కలయికవలన ఆవిరిపుట్టి ఆవిరి ఇంజనును నడుపుచున్నట్లు జడ ద్రవ్యమునుండి చైతన్యము పుట్టునని కృష్ణదాసుగారి అభిప్రాయమై యుండవచ్చును. వారికాలములోనే మన ప్రాంతమునకు రైలువచ్చి యుండును. ఇట్టి మతమునకు లోకమాన్య శ్రీ బాలగంగాధరతిలక్ మహాశయులు జడాద్వైతమని పేరుపెట్టిరి.

హెకిల్ (ERNST HECKLE) అను పాశ్చాత్య పండితుడు జడద్రవ్యము యొక్క సంయోగముచే చైతన్య ముత్పన్న మైనదని వ్రాసెసట.

"ఇట్లుత్పన్నమైన ఈ చైతన్యమే ఆత్మయనియు, ఆత్మ మనస్సు అను నీ రెండును శరీరమునందు మెదడువంటి దనియు ఆత్మవంటి ప్రత్యేక శాశ్వత పదార్థము ఏదియు లేదనియు, అతని మతము."

హెకిల్‌గారి వాదమును యూరపు ఖండమునందలి తత్త్వవేత్త లంగీకరింపలేదని కూడ తిలక్ మహాశయులు వ్రాసిరి. జడాద్వైతమును విమర్శించుచు లోకమాన్యులు :

"జడ ప్రకృతి యందుండి చైతన్యము పుట్టుటకు వీలు లేకపోవుటయే గాక యెవడైనను తన భుజములమీద దా నెటుల ఆసీనుడు కాలేడో, యటులే ప్రకృతి నెఱుంగునది, లేక చూచునది, ప్రకృతికంటె వేఱగు పదార్థమైననే

కాని 'నేను దీని నెఱుంగుచున్నాను' అను సంభాషణమే ప్రచారములో నుండనేరదు. సృష్టి వ్యవహారమును చూచితిమేని ఎఱుగు వాడొకడును ఎఱుంగబడునది తద్భిన్నమగు మఱియొకటియు అనునది అందరికి అనుభవసిద్ధమే" అని వ్రాసిరి. (గీతారహస్యము, ఏడవ ప్రకరణము)

దీక్షితులవారు ఇట్లన్నారు: "**గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమే పరబ్రహ్మం అయితే క్షేత్ర మెందుకు?** (బృ. ఉ. పు 79) అని ప్రశ్నించిరి. ఇందుకు నా సమాధానము:- గాఢాంధకారమున మనకు కన్నులున్నను పదార్థముల రూపమును చూడలేము, దీపము వెలిగించగనే సమస్తమును చూచుచున్నాము గదా? రూపములను చూచినది దీపమా? లేక కన్నులా? కన్నులే చూచినవనిన దీపములేని సమయమున ఏల చూడలేదు? దీపమే చూచిన దనినచో వస్తు రూపములను దీపమున్నను కన్నులు లేకున్నచో మనమెఱుగజాలముగదా? క్షేత్రజ్ఞునకు క్షేత్రము సహకారి మాత్రమే. లోకమునందు ద్రష్టృత్వ-దృశ్యత్వములు రెండును ఒక పదార్థమునకు ధర్మములు కాజాలవు. ఇది మన నిత్యానుభవము. ద్రష్టత్వ మనగా : చూచునట్టి స్వభావము. దృశ్యత్వమనగా: చూడబడునట్టి స్వభావము. అందువలననే ఆత్మానాత్మలయొక్క స్వరూపజ్ఞానవే సర్వవేదాంతసారము."

ఎఱుక (ఆత్మ)ను లింగమని దీక్షితులవారును, కృష్ణదాసుగారును చెప్పిరి. (కందము. 231) మహాభారతమునందు తత్త్వశాస్త్రమునకు చెందిన భిన్న భిన్న సంప్రదాయములను చెప్పియుండినను ప్రకృతియే. దేహి దేహమను మతమును మహాభారతము అంగీకరింపకుండుటయేగాక, తీవ్రముగా నిరసించినది. ఉద్యోగపర్వము నందలి సనత్సుజాతీయమునందు సనత్సుజాతమహర్షి ధృతరాష్ట్రునకు తత్త్వోపదేశము చేయుచు ఆత్మనుగుఱించి యిట్లు చెప్పిరి :-

శ్లో|| "కో హ్యేనమంతు రాత్మానం బ్రాహ్మణో మంతు మర్హతి|
నిర్లింగ మచలం శుద్ధం సర్వద్వంద్వ వివర్జితమ్.||" (స.అ.2 శ్లో. 32)

తా|| బ్రహ్మవిదుడైన బ్రాహ్మణుడు ఆత్మను నిర్లింగము (స్త్రీ పురుష నపుంసక లింగభేదము లేనిది) అచలము (=ఎట్టి వికారములేక క్రియా కర్తృత్వము

లేక చలింపక యుండునట్టిది), శుద్ధం (= అవిద్యాది దోషములు లేనిది) సర్వద్వంద్వ వివర్జితమ్ = సమస్త శీతోష్ణ సుఖదుఃఖాదులు లేనిద్ధి అని మననము చేయుటకు అర్హుడగుచున్నాడు.

ఆత్మను పై విధముగ మననము చేయక అన్యథా చేయువానిని గుఱించి యిట్లు చెప్పిరి:-

శ్లో॥ "యోన్యథా సంత మాత్మాన మన్యథా ప్రతిపద్యతే।
కిం తేన న కృతం పాపం చోరే ణాత్మాపహారిణా॥" (సనత్సు. 2-33)

తా॥ ఎవడైనను ఆత్మను అన్యథా అనగా పైన చెప్పిన నిర్లింగము, అచలము, శుద్ధము, సర్వద్వంద్వ వివర్జితమను లక్షణములకు విరుద్ధముగా (ఆత్మను) ప్రకృతియని, లింగమని, ప్రాణమని, యింద్రియములని, దేహాది సంఘాతమని భావించినపుడు **ఆత్మను అపహరించిన దొంగ అగుచున్నాడు. అట్టివాడు ఈ లోకమున చేయని పాప మేమున్నది? అనగా : అన్ని పాపములు చేసిన పాపాత్ముడేయని తాత్పర్యము.** ఈ వాక్యములతో దీక్షితులవారి మతము సూర్యోదయముతో తమస్సు అదృశ్య మగునట్లు స్వరూపమును కోల్పోయినది

దీక్షితులవారు చెప్పిన మూడు మంత్రములలో మొదటిదగు షోడశాక్షరీ మంత్రమును, దానియొక్క తాత్పర్యమును, ఆ సిద్ధాంతము వేదాంతశాస్త్రములకు ఏవిధముగా విరుద్ధమో శాస్త్రప్రమాణములను చూపి చెప్పితిని. ఇంతటితో ప్రస్తుతము ఈ యంశమును విరమించి దీక్షితులవారి రెండవ మంత్రార్థమును గుఱించి చర్చింతము.

## (౨౧) రెండవ మంత్రము - పంచదశి

**"కల దోచిన శరీరము యేలాగో అలాగే"** (బృ. పూ. పు. 66) ఇందుకు సంస్కృతమున **"స్వప్నే ప్రతీయమానాని రూపాణి యదా తదా"** సంస్కృతాంధ్రముల రెండింటి యందును పదునైదు పదునైదు అక్షరము లున్నవి గాన పంచదశి యని పేరు పంచదశి షోడశిని సమర్థించునదేగాని, దీనికి ప్రత్యేకముగ విలువ లేదు. దీక్షితులవారే ఒకచోట **"కలదోచిన శరీరము యేలాగో ఆలాగే మూలములేని యీ గురుతెరిగే శరీర మేమిలేదు. ఇది**

**సర్వాబద్ధము"** (బృ. పూ. పు. 66) అని రెండింటిని కలిపి చెప్పిరి. రెండు మంత్రములు షోడశాక్షరీ పిండమును గుఱించి చెప్పినదనియు, పంచదశి బ్రహ్మాండమును గుఱించి చెప్పినదనియు భావించుట యుక్తము. ఈ మంత్రమువలన దీక్షితులవారు సాధించినది యేమనగా:- స్వప్నము, జాగరము రెండును స్వప్నమే. రెండవది నిద్ర. ఇది అవస్థ కాదు. ఎఱుక లేకపోవుటయే, వారిట్లనిరి :-

**"అనగా కల కలయనగా తనమట్టుకే కలగాని, ఇతరులకు కలగాదుగదా? తానేతప్ప ఎవరు లేరు. తనకే ఈ జగత్తు తోచుచున్నది. జాగ్రత్త యంతయు దట్టమైన కల. స్వప్నము సామాన్యమైన కల. రెండే దృష్టాంతములు. యేదేది యనగా కల వకటి, నిదుర వకటి; నిదుర సత్యము, కల అసత్యము. సర్వము కలవంటిదేగాని నిక్కము గాదు సర్వార్థములు మన స్సంభవములని భాగవతమునందును గలదు. ఇది నిజము."** (బృ. పూ. పు. 167)

పంచదశి మంత్రముయొక్క తాత్పర్యమే పై వాక్యములు. దీక్షితులవారి ద్వివిధ సత్తల నంగీకరించు మతమునకు చెందినవారు. కొందఱు పెద్దలు ద్వివిధ సత్తలను మాత్రమే అంగీకరించి వ్యావహారిక సత్తను త్రోసివేసిన విషయము ఇదివఱకే చెప్పియుంటిని. ఈ మతము ననుసరించువారు కొద్దిమంది మాత్రమే. ఇది మన అనుభవమునకు సరిపడదు. అదిగాక శ్రుతి యీ సిద్ధాంతమును అంగీకరింపలేదు.

ఈ విషయమై బృహదారణ్యక శ్రుతి (4-3-14) యందలి జనక యాజ్ఞవల్క్య సంవాదమునందు స్పష్టపరుపబడినది. అందు యాజ్ఞవల్క్యమహర్షి జనకరాజునకు "జాగ్రదవస్థ పురుషుడు దేనిని చూచుచున్నాడో దానిని స్వప్నమునందు చూచును. కావున స్వప్నజాగరములు ఒకటియే యందురు. కాని, అట్లుకాదు. ఏలయన? స్వప్నమునందు పురుషుడు స్వయంజ్యోతి" అని బోధించెను.

అదిగాక, జాగ్రత్తయందు పురుషుడు చేయు కర్మలు అతనిని బంధించుచున్నవి. అనగా : అచట చేయు పుణ్య పాప కర్మలయొక్క ఫల మనుభవించుచున్నాడు. స్వప్నము నందు పురుషుడు చేయు కర్మలు వానిని బంధింపవు. అనగా : స్వప్నమునందలి కర్మలకు ఫలానుభవము లేదు.

**దీక్షితులవారు స్వప్నజాగరములు సమములని చెప్పు సిద్ధాంతమును దృఢపరుచుకొనుటకై స్వప్నమున పురుషుడు చేసిన కర్మలకు ఫలము లేనట్లే జాగ్రత్తయందును పుణ్య పాప కర్మలకు ఫలము అనుభవించుట-లేదనిరి. ఇది చాల ప్రమాదమైన సిద్ధాంతము.**

బృహదారణ్యక శ్రుతియందు "**తృతీయగ్ం స్వప్న స్థానం తస్మి న్సంధ్యే**" స్వప్నము ఇహపరలోకములకు సంధి స్థానమని వర్ణించినది. (6-3-9) అనగా: జాగరణ సుషుప్త్యవస్థల మధ్య కలదని, ఆ పురుషుడు (తైజసుడు) సంధి యందుండి ఒక్కొక్కసారి రెంటిని (నిద్ర మెలకువలను) చూచునని చెప్పినది. స్వప్నమునందు పురుషుడు 'హిత' అను నాడి యందుండునట. (6-3-20) చేప యెట్లు నది యొక్క రెండు దరులమధ్య ఇటునటు సంచరించునో అట్లే పురుషుడు జాగ్రత్త- సుషుప్త్యవస్థల మధ్య స్వేచ్ఛగా సంచరించును (6-3-18).

మఱియు సుషుప్తిని గుఱించి బృహదారణ్యకశ్రుతి యందు గార్గ్యబాలాకికిని, కాశిరాజగు అజాతశత్రువునకును జరిగిన సంవాదమునందు కలదు. 4-1-16, 17, 18, 19 మఱియు 4-1-9 నుండి 32 వఱకును చెప్పబడినది.

శ్రుతి యాజ్ఞవల్క్యమహర్షి (బృహదారణ్యక శ్రుతి. 6-3-14 మంత్రమున) ద్వివిధ సత్తల వాదమును అనువదించి అది సరికాదని ఆ సిద్ధాంతమును త్రోసివేసియున్నారు మన అనుభవమునందు జాగ్రత్తయందు పురుషుడు (విశ్వుడు) ఇతర సహాయము నపేక్షించి ప్రవర్తించుచున్నాడు. అనగా. వెలుతురు లేనిదే అతని నేత్రము పనిచేయుట లేదు. అట్లె తక్కిన యింద్రియ వ్యాపారములు కూడ సాధనాపేక్షితములని యూహించుకొనవలయును

సుషుప్తిని గుఱించి విచారింతము. గాఢనిద్రయందు మాయా(అవిద్యా) కల్పితమగు నానాత్వము నశించి అవిద్యామాత్రమే మిగిలియున్నది. బృహదారణ్యకశ్రుతి 6-3-21 మంత్రమునుండి 32 వ మంత్రము వఱకు సుషుప్తిని గుఱించి చెప్పినది దీక్షితులవారి మతమున ఎఱుక ఉండుట, ఎఱుక లేకుండుట అను ఈ రెండింటియందు ఎఱుక లేకుండుట అనుదానినే లోకులు నిద్ర, మరణము, మూర్ఛ అనిరని చెప్పియున్నారు. ఈ యంశము ఇదివఱకే (౧౮ వ అధ్యాయమున) పెక్కురీతుల చర్చించితిని. కనుక యిచ్చట విస్తరించి

చెప్పవలసిన ఆవశ్యకత యుండదు. 'నిద్ర' **అనగా**:- ఎఱుక లేకపోవుట అని దీక్షితులవారు అనేక పర్యాయములు వారి గ్రంథమునందు చెప్పియున్నారు కాని ఒక్క పర్యాయము మాత్రమే "**గు" సుషుప్తి యందు యెరుక లయమైతే పిలిచితే పలుకుచున్నాడు గనుక ఎరుక కలదనే తెలియవలయును.**"

(బృ. పూ. ప్ర. 141)

ఈ వాక్యములను ప్రమాణముగా గైకొనిన వారి సిద్ధాంతము గందరగోళమై పోవును. ఏలయన? ఎఱుక నిత్యమైనదగును. వారి మతమున ఎఱుక అసత్యము. మాయ. కల అసత్యము. 'నిదుర సత్యము' అన్నారు గదా? మఱియు. "**నిదురలో యెరుక ప్రకాశించదు. అందువలన ఎరుకకు హాని గలదు. ఏవిధముగ జూచినను ఎరుకకు హానిగానే యున్నది. ఇటువంటి యెరుకను నిత్యమనరాదు.**" **(బృ. పూ. పు. 161) అనేక పర్యాయములు చెప్పినదానికి విరుద్ధముగ ఒక పర్యాయము చెప్పుట దీక్షితులవారికి పరిపాటి.** ఇట్టి సందర్భములయందు ఏది వారి మతమని తలంపవలెను? దీక్షితులవారు ఒక్కపర్యాయము చెప్పినది పొరబాటున చెప్పియుందురా? ఒక నిశ్చయజ్ఞానము లేక చెప్పియుందురా? అను సంశయము వారి గ్రంథము చదివినవారికి తప్పక కలుగును. వారి వాక్యములు అటుంచి శ్రుతి యీ యంశమును (నిద్ర) గుఱించి యేమి చెప్పినదో విచారింతము:-

"యుద్వైతన్న పశ్యతి పశ్య న్వైత న్నపశ్యతి, నహి ద్రష్టుర్దృష్టే ర్విపరిలోపో విద్యతే వినాశిత్వాత్,నతు తద్వితీయ మస్తితోన్య ద్విభక్తం యత్పశ్యేత్
(బృహదారణ్యక. 6-3-23)

తా|| ఆ స్థితియందు ఆ పురుషుడు చూచుట లేదనరాదు. చూచు సామర్థ్యముండియు అతడేమియు చూచుట లేదు. అతని (ద్రష్ట) యొక్క దృష్టికి (జ్ఞానమునకు) నష్ట మెప్పుడును కలుగదు. ఏలయన అతడు అవినాశి యగుట వలన, అతడు చూచుటకు అచట అన్యపదార్థము (దృశ్యము) లేకపోవుటవలననే అతడు చూడలేదు.

కనుక జాగరణ స్వప్న సుషుప్తులను మూడవస్థల యందుండు సాక్షియగు పురుషుడు ఒక్కడే, అతడు అజుడు, అవినాశి. అవస్థలు మారుచున్నను వాటికి సాక్షియై మార్పు లేకయున్నాడు. మహాభారత శాంతిపర్వమునందు

భీష్ముడు ధర్మరాజునకు స్వప్నాద్యవస్థల తెఱంగెఱిగించుచు నిట్లనెను:-

తే|| తెలియ మేల్కని యుండుట గలలు నిద్ర
యను నవస్థాత్రయంబును నవల బెట్ట
జాలు విజ్ఞాన నిర్మల సత్యబోధ
రూప నిర్భరానంద స్వరూపుడనఘు. (శాంతి. 4-327)

తా|| మేలుకొని యుండుట = జాగ్రదవస్థ; కలలు = స్వప్నావస్థ; నిద్ర = సుషుప్త్యవస్థ. ఈ మూడవస్థలను సచ్చిదానంద స్వరూపుడగు (ఆత్మ) పురుషుడు ఆవల పెట్టుచున్నాడు. అనగా: సమాధియందు ఈ మూడవస్థలు లేవు. అదియే అవల పెట్టుట. సమాధినుండి లేచిన పిమ్మట మూడవస్థలు అతని యెదుట వచ్చుచు, పోవుచున్నను తాను సాక్షియై వాటికంటెను భిన్నుడై యున్నాడు.

దీక్షితులవారు 'నిదుర సత్యమని, కల అసత్య' మని చెప్పియున్న యంశమును ఇంకను కొంత చర్చింతము. వారిమతమున జాగరణ స్వప్నములు కలసి రెండును కల. కల అసత్యమనిన అది లేకపోవుట అనునదే సత్యము. ఈ సత్యాసత్యములు కానిది బట్టబయలు. ఇది వారిమతము.

నిదుర సత్యమను విషయము బృహదారణ్యకశ్రుతి 6-3-32 మంత్రమునందు చెప్పిన దాని సారాంశమిది :- స్వచ్ఛమగు నీటియందు తన ఛాయను చూచినపుడు తానొక్కడే కనబడునట్లు సుషుప్తియందు తానే యున్నాడు. కనుక సుషుప్తియే బ్రహ్మలోకమని పురుషుని పరమగతి యని అతని అధికమగు సంపత్తు అని అన్నింటికంటె శ్రేష్ఠమగు లోకమని, ఆనందమయమని యాజ్ఞవల్క్యమహర్షి జనకరాజునకు బోధించెను.

దీని సారాంశమేమన:- బ్రహ్మలోకమునకు సత్యలోకమను నామాంతరము గలదు. కనుక నిద్ర సత్యమని చెప్పబడినది. ఇచ్చట నింకొక అంశము గమనింపవలెను. బ్రహ్మవిదులు తురీయమగు ఆత్మనే సత్యమని చెప్పియుండిరి. ఇచ్చట సుషుప్త్యవస్థనే సత్యమనినప్పుడు, తురీయమగు ఆత్మ (బ్రహ్మము)ను (సత్యస్య సత్యం) సత్యమునందలి సత్యమనియు పరమసత్య మనియు వచించిరి. తదితరమగు విచారమునందు ఆత్మ (బ్రహ్మము)ను సత్యమని, నిద్ర అసత్యమనియు చెప్పిరి.

పైన నుదాహరింపబడిన మహాభారతమునందలి పద్యమున మూడవస్థలను ఆవలపెట్టిన సత్యజ్ఞానానంద స్వరూపుడగు పురుషుని (ఆత్మను) గుఱించి చెప్పబడెను.

*"మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు కలే. గురు మూలంగా కలలో వచ్చిన శరీరాలు యెరుకతోటి వుండగానే యేమిలేదు. అని తనకు తానే యేలాగు ధృఢమౌ, అలాగే గురుమూలంగా, మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమిలేదని తాత్పర్యమాయెనా, అదే మేలుకొనుట. ఇంతేకాని వొక్కటైనా అవస్థలేదు. స్వప్నావస్థ గురువు మేలుకొలిపితే అదే జాగ్రత. ఇంతేకాని నాలుగవస్థలు లేవు. ఈ శరీరము వొక్కటే. నాలుగు శరీరములు అనుట అబద్ధము."* (బృ. ఉ. పు. 105)

"శిష్యా విను:- యీ సంసారము నీయొక్క సంకల్పము వలననే కలిగినది. ఈ సంసారమే బంధమోక్షములు అయింది. ఇదే యింద్రాదిదేవతలున్ను, త్రిమూర్తులున్ను, అష్టాంగయోగములున్ను, అష్టసిద్ధులున్ను, అష్టైశ్వర్యములున్ను, సంకల్పమువల్లనే కలిగినవి. ఈ సంకల్పమే మూలబీజం. ఇదే మూలమాయ. ఇదే గుర్తెరిగే శరీరం. దీనినుండే నానామతాలు నానాఅవుతారాలు అయినవి. ఇట్టి సంకల్పమునకు మొదలు వుత్పత్తి లేకనే తనకు తానే కలిగి తనకు తనే వుండి తనకు తానే యేమీ లేకపోచుంది. ఈ సంకల్పమే యిచ్ఛ. శృ॥ ఇచ్ఛా మాత్ర ప్రభోస్సృష్టిః అని వున్నది. కనుక యీ యిచ్ఛకు మూలంలేదు. తల్లి తండ్రి భార్యా బిడ్డలు యీ సంకల్పము వల్లనే పుట్టిరి." (బృ. ఉ. పు. 46)

అద్వైతులు జగత్తు వ్యావహారికసత్యమని, స్వప్నము ప్రాతిభాసిక సత్యమని, బ్రహ్మము పారమార్థిక సత్యమని అందురు. కాని జాగ్రత్తయు బ్రహ్మజ్ఞానము సిద్ధించినవారికి స్వప్నతుల్యమే. *స్వప్నతుల్యమే గాని స్వప్నము గాదు.** దీనిభావ మేమనగా:- జాగ్రదవస్థయందు జ్ఞానాభ్యాసము చేసి ముక్తిని బొందవచ్చును. స్వప్న మట్టిది కాదు. వాత పిత్త శ్లేష్మముల దోషముల చేతను, సత్త్వాది గుణవికారములును జాగ్రదవస్థయందనుభవించిన విషయ వాసనా విశేషముల వలనను, పూర్వజన్మవాసనల వలనను స్వప్నము కలుగును.

* "శ్రీ శంకరాచార్యులవారు జీవితము నిజముగా నొక స్వప్న మనికాని మనజ్ఞాన మొక స్వప్నదృశ్యమనికాని యాత డెచ్చటను చెప్పియుండలేదు." (భా. త. 5-వ సంపుటము. పుట. 134) అని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణపండితులు చెప్పిరి.

అందువలన స్వప్నజాగరములు రెండును ఒకటి కానేరవు. స్వప్నజాగరములు రెండును ఒకటియే యను సిద్ధాంతమును యోగవాసిష్ఠము ఒకవిధముగా అంగీకరించినది. అం దిట్లున్నది -

**శ్లో॥ యథా దృశ్యం జగచ్చేతి నిత్య మేకార్థతాం గతౌ।**
**ఉభౌ శబ్దౌ తథే వైత జ్జాగ్ర త్స్వప్నాత్మకౌ స్మృతౌ॥.**

తా॥ దృశ్యము, జగత్తు అను శబ్దద్వయము వేఱువేఱుగా వినబడుచున్నను వాటి యర్థమొక్కటే యైనట్లుగా జాగ్రత్స్వప్నము లను శబ్దములు రెండును ఒకే అర్థమును కలవియై యున్నవి అని చెప్పిరి. ఆ గ్రంథమునందే వేఱొకచోట ఇట్లు చెప్పబడినది:-

ప్రతిజీవునియొక్క జాగ్రత్ప్రపంచము ఒకేవిధముగ ఉన్నది. ప్రతి జీవునియొక్క స్వప్నప్రపంచ మట్లు లేదు. ఒక్కొక్కరి స్వప్నప్రపంచము ఒక్కొక్కవిధముగా ఉన్నది. కనుక జాగ్రత్స్వప్నములు రెండును ఒకటి కావని సంశయింపవలదు. ప్రథమజీవుడగు హిరణ్యగర్భునియొక్క స్వప్నమే మన జాగ్రదవస్థ అని వారి ప్రశ్నకు వారే ఆవిధముగా సమాధానము చెప్పుకొని తృప్తిపడిరి హిరణ్యగర్భుని స్వప్నము మన జాగ్రద్దశ అనినపుడు మన జాగ్రత్త మన స్వప్నము కాదని అర్థమగుచున్నది. ఇది చాల సూక్ష్మమగు విషయము. దీనిని తేలికగా అర్థము చేసికొనరాదు. ఈ యంశమును యోగవాసిష్ఠము ఏభావముతో చెప్పినదో దీక్షితులవారు అట్టిభావముతో చెప్పియుండలేదని వారి వాక్యములవలన తెలియగలదు. ఇదివఱలో ఆ వాక్యముల నుదాహరించియుంటిని (అ. ౧౮ లో చూడుడు). కొన్ని వాక్యముల నిచట స్మృతికి తెచ్చెదను. **"స్వప్నములో వచ్చిన శరీరము పుణ్యాపాపములు చేసిందా లేదా అని వ్రాసుకొన్నవారు యెవరు?" (బృ. ఉ. పు. 68)** ఇట్టి వాక్యములు అనర్థదాయకములు, హేయమైనవి. ఈ వాక్యములను గర్హింతును.

జిజ్ఞాసువు:- అయ్యా! "నా సంకల్పము వలననే ప్రపంచము కలిగినదని దీక్షితులవా రనిరిగదా! ఈ యంశము నాకు బోధపడలేదో, లేక వారు చెప్పినది సరికాదో, నాకు తెలియకున్నది? నావలన నా తల్లిదండ్రులు ఎట్లు కలుగుదురు? నా సంకల్పము వలన వారు కలిగిన వారికి నేను తల్లిని తండ్రిని కావలెను"కదా? పోనీ, నా సంకల్పము వలననే కలిగిరని తలంచినను వా రిప్పుడు లేరు.

వారు స్వర్గస్థులైరి. వారు మరణించవలెనని నే నెప్పుడును సంకల్పించలేదే, మఱి వా రెట్లు మరణించిరి? నా చిన్నతనమున నేను ఎన్నియో మారులు రాజు కావలెనని కోరుచుంటిని. నా సంకల్పము వలన నే నొక్క సారియైనను రాజును కాలేదే? నాకు, నావారికి రోగములు రావలెనని యెప్పుడును నేను సంకల్పించలేదే, మాకు రోగములు వచ్చుటకు కారణమేమి? నేను తప్ప అన్యులెవ్వరును లేరనియేగదా దీక్షితులవారు చెప్పిరి. నేను సంకల్పింపక రోగములు వచ్చుటకు అవకాశమే (కారణమే) లేదే.

ఇటీవల ఒక సంఘటన జరిగినట్లు పత్రికలయందు చదివితిని. ఒక కుటుంబమువారు మేడపై కిటికీవద్ద కూర్చుండి 'టీ' త్రాగుచుండిరట. వీథిలో జన సమూహమును చెదరగొట్టుటకు పోలీసువారు తుపాకులు కాల్చగా, తుపాకి గుండ్లు టీ త్రాగువారికి తగిలి వారు మరణించిరట. వారు తా మట్లు మరణింపవలయునని సంకల్పించుకొనలేదుగదా? ఇదియంతయు నా సంకల్పమే యందురేని త్రోవను పోవునపుడు పరధ్యానమున నడువగా కాలిలో ముల్లు విఱిగినది. అది నా సంకల్పము లేకయే అట్లు జరిగెను. దుఃఖము కలుగున నెవ్వరును సంకల్పింపరు. కాని దుఃఖము కలుగుచున్నది. దీనికి దీక్షితులవారి సమాధానమెట్లు చెప్పిరి?

వేదాంతి :- దీక్షితులవారి మతమునందలి గొప్పదోష మిదియే. ఇదివఱలో నేను నీకు బౌద్ధమతమును గూర్చి చెప్పియుంటిని. అందు విజ్ఞానవాదుల (యోగాచారుల) మతమును బ్రహ్మసూత్రభాష్యమున శ్రీ శంకరులవారు ఖండించిరి. ఆ ఖండనమును నా వాక్యముతో 'విజ్ఞానవాది-అద్వైతవాది' యిరువుర సంవాదరూపమున చెప్పియుంటిని.* దాని నిచ్చట స్మరింపుము. అదియే నీ ప్రశ్నకు ప్రత్యుత్తరము.

అదిగాక యోగవాసిష్ఠమువంటి కొన్ని వేదాంత గ్రంథములయందు ఏకజీవవాదము కలదు. అదియును అద్వైతమే. వారి మతమున జీవుడొక్కడే. ఆ జీవుడే జగత్తు ఉన్నట్లు బ్రహ్మాది దేవతలున్నట్లు భావించుకొనును. అతడొక్కడే నిజమైన జీవుడు. లోకములోని వారందఱు ప్రాతిభాసిక జీవులు.

* బ్రహ్మజిజ్ఞాస తృ. భా. నాలుగవ ప్ర. ౨౪ వ అధ్యాయము "అద్వైతి-విజ్ఞానవాదుల సంవాదము."

ప్రాతిభాసిక జీవులనగా అతని స్వప్నలోకమున కల్పించుకొన్న మనుష్యులు మొదలగు జీవుల వంటివారు ఆ జీవుడు హిరణ్యగర్భుడనియు, అతని స్వప్నము లేక మానసిక కల్పనయే మన జాగ్రదవస్థయందలి, వ్యావహారిక ప్రపంచమనియు, అతని స్వప్నప్రపంచమునందు మన మందరము ప్రాతిభాసికజీవులనియు చెప్పుదురు. ప్రతివాడును నా సంకల్పమువలననే సృష్టిస్థితిలయములు కలుగుచున్నవని తలంచిన అది బుద్ధిహీనతయే, అదియే వాస్తవమైనయెడల ప్రపంచము వెంటనే లయము కావలయునని ఒకడు కోరుకొనును. మఱియొకడు ప్రపంచ మెల్లప్పుడు నిట్లే యుండవలయునని కోరును. ఈ రెండింటిలో నేది జరుగును? యేది జరుగదు? ఇట్లున్నచో ప్రపంచము ఎట్లుండునో యెవ్వడును ఊహింపజాలడు.

జిజ్ఞాసువు:- 'ప్రతివాడును' అని మీ రనుచున్నారు. ఉన్నది నే నొక్కడనే గదా?

వేదాంతి:- అట్లే అనుకొందము. ఉన్నది నీ వొక్కడవే అయినను నీవు అనుకొనునట్లు జరుగుట లేదని నీకు తెలిసినదేకదా? దీక్షితులవారు చెప్పిన సిద్ధాంతము కొన్ని నవీన వేదాంత గ్రంథములయం దున్నదేకదా? దానికి సమాధానమేమి? అని అడుగవచ్చును. దాని సమాధానమిది:- ఎవని చిత్తము వాసనారహితమును, శుద్ధమునై యుండునో అట్టివాని సంకల్పము నెఱవేఱును. నీరు అలయైనట్లు అమలిన చిత్త మేరీతిగ భావించునో ఆరీతిగా అగును. కాని మలిన చిత్తులగువారు తలంచిన అట్లుకాదు. నే నొక్కడనే జీవుడను. తక్కిన వారందఱు ప్రాతిభాసికులే గదా? అనగా-నాచేత కల్పింపబడిన వారేగదా? అనిన; ప్రతివాడును తనకంటె అన్యులందఱును ప్రాతిభాసికులనియే తలంచుచున్నాడు. నీ చిత్తము మలినరహితముగ చేసికొని చూచినచో సర్వము నీవే నీకంటె అన్యము లేదు. నీ చిత్తము శుద్ధము కానంతవఱకు నీవును అనేకులును ఉన్నారు. **మలినరహితమగు శుద్ధ మానసము హిరణ్యగర్భుని మానసము వంటిది.** అత డేమితలచిన అది జరుగునని మనము శాస్త్రములయందు చదివియున్నాము. అమలిన చిత్త మెట్లు భావించిన అట్లే జరుగునని యోగవాసిష్ఠము చెప్పినది.

ఈ విషయ మింతటితో విరమించి దీక్షితులవారు చెప్పిన మూడవ మంత్రమును గుఱించి విచారింతము.

## (౨౨) మూడవ మంత్రము - ద్వాదశాక్షరి

దీక్షితులవారు ద్వాదశాక్షరీ మంత్రము నిట్లు చెప్పిరి:-*

(1) "**ఈ ఉత్త బట్టబయలు యేమీ లేదు.**"

దీనికి సంస్కృతము-

"**అయం వ్యర్థో బాహ్యః కో ఽపి న భ వతి.**" మఱియొక చోట దీక్షితులవారే యిట్లన్నారు. "**ద్వాదశాక్షరీ అభావం శివం అశివం న లిప్యతే' ఇదే గురువాక్యం. ఈ గురువాక్యం సార్వకాలం స్మరిస్తూ యుండవలయును**" అని వ్రాసియున్నారు. (బృ. పూ. పు 121)

రెండింటిలోను పంౘ్రెండు పంౘ్రెండు అక్షరము లున్నందున వీటికి ద్వాదశాక్షరీ యని పేరిడిరి. ఇది బట్టబయలును గుఱించి తెలుపును. బట్టబయలనగా నేమో దీక్షితులవారు తమ గ్రంథమున అచ్చటచ్చట వ్రాసిన వాక్యములను ఒకచోట చేర్చి చెప్పెదను.

*(2)* "**ఈ బయలు పుట్టదు. పుట్టించదు. రక్షించదు. చంపదు. దీనిని ఎవ్వరు యెరుగరు.** *అందరు యెరుగుదురు. ఎఱిగిన ఎరుగరు. ఎఱుగకున్నను యెరుగరు. చెప్పిన ఎరుగరు. చెప్పకున్నను ఎరుగరు.* **ఎవ్వరికి ఈ జోలి పట్టదు. ఇది యెవ్వరు విన్నను యేమో నందురు, గాని నిజమని అనరు.**" (బృ. పూ పు. 46)

(3) "**ఏమి ఉన్నది? 'అతి రహస్యం బట్టబయలు' అందురు గాని ఆ బట్టబయ లెటువంటిదో యెరుగరు.**" (బృ. పూ. పూ. 46)

(4) "**....అచలానకు యే జోలి లేదు. మధ్యను వచ్చి మధ్యను పోయేది యీ గుర్తెరిగే శరీరమే అచలానకు చంచలమైన శరీరానకు కొంచమైనా సంబంధం లేదు. సమస్తమైన మహత్తులు యీ గుర్తెరిగే శరీరానివే గాని పుట్టని చావని అచలానకు వొక్కటైనా మహత్తు లేదు. అచలం గనుక రాకడా లేదు పోకడా లేదు. సార్వకాలం ఒక్కతీరే. యీ గుర్తెరిగే శరీరంతో**

---

*(1) ఈ సంఖ్యలు దీక్షితులవారు వేసినవి కావు బోధనాసౌలభ్యముకొఱకు 1 నుండి 12 వఱకు నేనే వేసితిని

యీషత్తు సంబంధం లేదు. దాని కదే! దీని కిదే! సంబంధం లేనిదే వున్నదని మూలంలేని గుర్తెరిగే శరీరమే అన్నది." (బృ. పూ. పు. 53, 54)

(5) "ఎరుక మరుపులు కానిది, సదసత్తులు కానిది. రూపా రూపములు గానిది. జ్ఞానా జ్ఞానములు గానిది. గుణా గుణములు లేనిది. కోరికలు లేనిది. చలా చలము *గానిది.* సంకల్ప వికల్పములు లేనిది. సాక్షి గానిది, బ్రహ్మ గానిది, విష్ణువు గానిది. శివుడు గానిది. ప్రకృతి గానిది. ఆకాశము గానిది. ...." (బృ. పూ. పు. 72)

"అచలమనే పరిపూర్ణానకు యెరుకలేదు. మరుపులేదు." (బృ. ఉ. పు. 37) "సార్వకాలం జీవజగద్భావం లేంది ఏదో. వాసనాత్రయం లేంది యేదో, శ్రవణ మనన నిదిధ్యాసలు యెఱుగంది యేదో, జాగ్రత్ స్వప్న సుషుప్తి తుర్యావస్థలు వున్నవని యెరుగంది యేదో, సగుణ నిర్గుణాలు గాంది ఏదో, నేను గాంది ఏదో, నేను నీవు అనే జ్ఞానరహితమైంది ఏదో .... .... అది తానని యెరుకలేని స్వరూపం." (బృ. పూ. పు. 101)

(6) "ఈ ఉత్త బట్టబయలు తనకు తానే స్వతఃసిద్ధమై చలించక యున్నది. ప్రపంచం పుట్టనే లేదు. యిది నిజగురువుపదేశం. ఈ వుత్త బట్టబయలే పరిపూర్ణం. యీ వుత్త బట్టబయలు నిజ గురువు చెప్పక కానరాదు."

"శ్రుతి - ఆచార్యవాన్ స్వరూపాస్ వేదః"

"అని వున్నది కనుక శృతి|| 'ఖం బ్రహ్మ'అని శిద్ధాంత వాక్యం వుండనే వున్నది. వున్నా భ్రాంతి వాక్యం మొదటిది కాదు. మొదలు యేది వున్నదో అదే చెప్పినాడు." (బృ. ఉ. పు. 1) పుట్టని ప్రపంచముయొక్క జోలే కూడదు. యీ వుత్తబట్టబయలు వలన మాయ పుట్టనే లేదు. గనుక, యీ వుత్తబట్టబయలు మాత్రమే వున్నది. యీ వుత్త బట్టబయలు అత్యంత విలక్షణము. యీ వుత్త బట్టబయలు వలన క్షరమనే చైతన్య స్వరూపిణి అనే మాయ పుట్టనే లేదు. గనుక యేమీ లేదు. యీ వుత్త బట్టబయలుకు పరా ఏమీ లేదు. లేకుంటే శరీరం అనే క్షరం యేమీ లేదు. యీ వుత్త బట్టబయలే వున్నది. యీ వుత్తబట్టబయలు పుట్టదు. పుట్టించదు. అందుకే ప్రపంచం పుట్టనే లేదు. చావదు. యీ వుత్త బట్టబయలు మాట్లాడదు. యీ వుత్త బట్టబయలునకు

వొక్కటైనా భ్రాంతి లేదు. బాధలేదు. జన్మం లేదు." (బృ. ఉ. పు. 2)

(7) "ఈ ఉత్త బట్టబయలుకు జ్ఞానం లేదు. యీ వుత్త బట్టబయలుకు అహంకారం యెన్నడూ యేమీ లేదు. కనుక లేని మాయ యీ యెరుకలేని చైతన్య స్వరూపిని. లేని మాయను లేదని కన్నవారికి యేమీ లేదు. యీ వుత్త బట్టబయలు చెడి యెన్నడూ శరీరాకారం కాలేదు. వెనుకటికి కాలేదు. యిప్పటికి కాలేదు. ముందరా కాబోదు. సార్వకాలం రెండో ప్రకారం గాక వొక్కతీరుగానే యున్నది. ప్రపంచానకు ఈ వుత్త బట్టబయలు కారణం కాదు. తానే పుట్టని చావనిది. ప్రపంచాన్ని యెలాగు పుట్టించె, ప్రపంచంయొక్క జోలే లేదు." (బృ. పూ. పు. 120. 121)

(8) .... "యేమి అడిగినా చెప్పనిది. తాను వున్నానని యెరుగనిది శరీరాలు లేవు అని యెరుగంది .... గురు సూచన లేని వారికి కనుక్కోరానిది." (బృ. ఉ. పు. 6)

(9) .... .... శివ శక్త్యోపాధి ద్వయ దోష రహితమైంది. క్షేత్ర క్షేత్రజ్ఞోపాది ద్వయ దోషరహిత మైంది, తిననిది. లిప్తము గానిది, ఆత్మ బ్రహ్మం అనే గుర్తెరిగే చైతన్యానిని యెరుగనిది. ఈ శరీరమందే శరీరంలేక వున్నది."

(బృ. ఉ. పు. 7)

(10) "ఈ పరిపూర్ణమునకు కోపములు తాపములు లేవు. ఈ భూమకు యేమీ లేదని చెప్పుచునే యున్నాము." (బృ. పూ. పూ. 78)

(11) "అదే తత్వాతీతం. జగత్తు తత్వ స్వరూపమే. తత్వాతీతం మహాగుహ్యం. అందుకే ద్వైతా ద్వైత రహితమైన పరమత తత్వం అనే సౌంజ్ఞ. తత్వాతీతం ఇరవైఅరోది." (బృ. ఉ. పు. 101)

(12) "మహాకారణాతీతమే తుర్యాతీతం. యీ తుర్యాతీతం బోధించే ఆచార్యుడు దొరికితే నిజం. అద్వైతం మిథ్యాజ్ఞాన స్వరూపం."

(బృ. ఉ. పు. 36)

పరబ్రహ్మమును తెలిసికొనుటకు నిషేధ పద్ధతి ఒక్కటే మార్గమని కొందఱను, విధివాక్యములచేతను బోధింపవచ్చునని కొందఱను పూర్వాచార్యులు చెప్పిరి. నిషేధ పద్ధతి అనగా: నేతి, నేతి (న + ఇతి, న +

ఇతి) ఇది కాదు, ఇది కాదు. అని అనాత్మ పదార్థముల నన్నింటిని నిషేధించి, నిషేధించుటకు సాధ్యపడని వస్తువే బ్రహ్మమని (ఆత్మయని) నిశ్చయించుట. అనగా:- ఆత్మ దేహము కాదు. ఇంద్రియములు కాదు. మనస్సు కాదు. బుద్ధి కాదు. అహంకారము కాదు. అవ్యక్త ప్రకృతి కాదు అని యీ విధముగా వాటివాటి స్వరూప స్వభావాదులను చక్కగా విచారించి యిందులో ఒక్కటియైనను నిత్యసత్యమైన వస్తువు కాదని ఈ సమస్తమును జడము లేనని నిషేధించి ఏ జ్ఞానముచే ఈ సమస్తము నిషేధింపబడెనో ఆ ప్రజ్ఞానమే ఆత్మయని, అదియే బ్రహ్మమని నిశ్చయించుట. ఇది నిషేధ పద్ధతి.

విధి అనగా:- ఆ పరమసత్య మిట్టిదే అని నిరూపించి చెప్పుట-'**సత్యం జ్ఞానం అనంతం** బ్రహ్మ' సత్యమే బ్రహ్మము, జ్ఞానమే బ్రహ్మము, అనంతం (ఆనందము) బ్రహ్మము అని నిరూపించి చెప్పుట. ఈ రెండు పద్ధతులను దీక్షితులవారు అచలమును (బట్టబయలును) బోధించుటకు అవలంబించిరి. ఉదాహరణమునకు-నిషేధ పద్ధతి యేదన? 5వ అంశమునందు చెప్పినరీతిగ 'ఎరుక మరుపులు కానిది. సదసత్తులు కానిది' అని యీవిధముగ చెప్పినట్టిది. దీక్షితులవారి వాక్యములయందు విధివాక్యము లేవనగా 10, 12 లో 'అది భూమ', 'తుర్యాతీతము' అనునట్టివి. అనగా: బట్టబయలు భూమ, తుర్యాతీతము అని చెప్పిరి. కనుక ఉపనిషత్తులయందు, భూమ అని దేనిని చెప్పిరో దానిని తెలిసికొన్న బట్టబయలును తెలిసికొన్నట్లగును గదా?

ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడిన నిర్గుణ బ్రహ్మము మనోవాక్కుల కందనిదని చెప్పిరి.

పరమసత్యమైన వస్తువు మనోవాక్కుల కందనిచో దానిని ఎట్లు తెసిసికొనగలిగిరి? దానిని ఇంతవఱకు ఎవ్వరును తెలిసికొని యుండలేదా? ఉపనిషత్తులే 'బ్రహ్మము తెలిసికొనుటకు సాధ్యము కానిదని' చెప్పుచు బ్రహ్మమిట్టిదని అనేక విధముల బోధించెను. పెద్ద లనేకులు తెలిసికొనిరి. తెలిసికొనిరనగా నెట్లు?

## (౨3) ఉపనిషత్తులు - బ్రహ్మము

మానవునకు గల యింద్రియములు, అంతఃకరణము పరిచ్ఛిన్నములైనవి. జ్ఞానేంద్రియములు పంచభూతముల యందు ఆ యా భూతములయొక్క

సత్త్వగుణమునందలి ప్రత్యేక అర్ధభాగములనుండి కలిగినవి. ఏ భూతముయొక్క సాత్త్వికాంశమునుండి యే యింద్రియము కలిగినదో ఆ యింద్రియము ఆ భూతగుణమును మాత్రమే తెలిసికొన గలదు, అది మఱియొక భూతగుణమును ఎఱుగజాలదు. మనస్సందమా, అది పంచభూతములయందుండు సత్త్వ గుణముయొక్క సమష్టి అర్థభాగమువలన ఏర్పడినది. కనుక అది భూతపంచక సంబంధమగు గుణములను మాత్రమే యెఱుగగలదు. ఇంద్రియములకు మనస్సునకు గల భేద మిదియే. అయితే, బ్రహ్మ మె ట్లెఱుగబడును? అతీంద్రియజ్ఞానము వలననే యెఱుగబడును. ప్రకృతికంటె పరమునందున్న సత్యవస్తువును ప్రకృతిగాని, దాని వికారములుగాని యెఱుగ జాలవు. ప్రకృతి ఆవరణమును భేదించినవారే యెఱుగ గలిగిరి, ఒక ఋషి యిట్లు చెప్పెను.

"యది మన్యసే సువేదేతి దభ్ర మేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్, యదస్య త్వం యదస్య చ దేవేష్వథ ను మీమాంస్య మేవ తే మన్యేవిదితమ్." (కేన. 9)

తా|| ఎవడు నేను బ్రహ్మమును చక్కగా తెలిసికొంటినని చెప్పునో అతడు బ్రహ్మముయొక్క అల్పాంశమును మాత్రమే యెఱుగును. బ్రహ్మస్వరూపజ్ఞాన విషయమున దేవతలైనను మాకు తెలియు నన్నచో వారికి ఇంకను తెలియవలసియే యున్నది అని అర్థము.

ఋషు లనేకులు, వారందఱు ఏకదేశమునకు చెందిన వారుగాని, ఏక కాలమునకు చెందిన వారుగాని కారు. భిన్న దేశములకు, భిన్న కాలములకు చెందినవారు. ఐనను, వారు ఒక్కలక్ష్యమునే సాధింప ప్రయత్నించిరి. పరమసత్యమైన వస్తు వేదైన కలదా? దానిని తెలిసికొనవలయు ననియే వారి కృషి ఫలించినది. వారు కనుగొన్న పరమ సత్యమునకు వారికి తోచిన పేరు పెట్టిరి. ఒక ఋషి ఆ వస్తువును 'ఆత్మ-బ్రహ్మము' అనియు (బృహదా. 4-4-17, 18) ఇంకొకరు 'ఆత్మ' (మాండూక్య. 7) అనియు, మఱియొకరు 'అక్షరము' 'పురుషుడు' (ముండక. 1-2-13) అనియు. వేఱొకరు 'విజ్ఞానాత్మ' (ప్రశ్న.9) అనియును; సత్తు అని కొందఱు (ఛాందో. 6-2-1); ఒకరు అది అసత్తు (తైత్తిరీయ. 2-7) అనియును చెప్పిరి. దానినే 'భూమ' అని సనత్సుజాతమహర్షి చెప్పిరి. ఇట్లు వారివారికి తోచిన పేర్లతో పిలిచిరి. ఋషి ప్రయోగించిన నామము ఏ భావముతో ప్రయోగించెనో అచటి పూర్వాపర సందర్భముల

బట్టి దాని యర్థమిది యని చెప్పవలెనే గాని కేవల శబ్దమాత్రము చేతనే అర్థమును నిర్ణయింపరాదు. వస్తువును ఆ ఋషి 'సత్తు' అనియెను కనుక అది సత్తుగాదు. అది 'అసత్తు' అని చెప్పుట పొరపాటు అట్టివారికి వేదాంతము (ఉపనిషత్తుల యందలి జ్ఞానము) తెలియదని చెప్పవలసి వచ్చును. దీక్షితులవారు, వారు చెప్పినట్టి బట్టబయలు బ్రహ్మము కాదనిరి. ఆత్మ కాదనిరి. సదసత్తులు కాదనిరి. ఋషులు చెప్పినవన్నియును కావని త్రోసివేసిరి. కాని, 'భూమ' అని అంగీకరించిరి. ఇది సంతోషించవలసిన విషయము 'భూమ' అనగా నేమి? దానిని గుఱించి విచారించుట యుక్తము.

## (౨౪) భూమ

దీక్షితుల వారిట్లు చెప్పిరి. "**ఈ వృత్త బట్టబయలునకు జన్మము లేదు. మరణం లేదు. భూమ అంటే గుర్తెరుగనిది. విననిది. చూడనిది. భూమ అనే పేరు.**

***శృతి - యత్ర నాన్యత్ పశ్యతి నాన్య భృణోతి** నాన్యత్వ జానాతి స భూమ."** (బృ. పూ. పు. 170)

ఈ 'భూమ' శబ్ద మెక్కడిది? ఇది ఛాందోగ్యోపనిషత్తునందలి 7వ ప్రపాఠకమునం దున్నది. ఒకప్పుడు సనత్కుమార మహర్షికడకు జ్ఞానార్థియై నారదమహర్షి పోయి 'ఆత్మవిద్య నెఱిగింపుము' అని ప్రార్థించెను. అది విని సనత్కుమార మహర్షి 'ఆత్మవిషయమై నీవేమి తెలిసికొని యుంటివో చెప్పుము. ఆ పై విషయమును ఎఱిగింతు' ననెను. అంత నారదమహర్షి తాను ఋగ్వేదాది సమస్త గ్రంథములు చదివితి ననియు, సకల విద్యల నెఱింగితిననియు చెప్పెను. అందులకు సనత్కుమార మహర్షి అవి యన్నియు శబ్దమాత్రములే యని చెప్పి నారదమహర్షికి-నామము, వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, జలము, తేజస్సు, ఆకాశము, స్మరణము, ఆశ, ప్రాణమ్ము, సత్యము, విజ్ఞానము, మతి, శ్రద్ధ, నిష్ఠ, కృతి వీటిలో ఒక్కొక్క దానిని బ్రహ్మభావనతో ఉపాసింపుమని శాఖాచంద్రన్యాయమున

---

* 'శృతి' అనునది వారి గ్రంథమున వ్రాసియున్నట్లే నేనును వ్రాసితిని.

'**నాన్య చ్ఛృణోతి' అని యుండవలయును. 'భృణోతి' అనుట పొరపాటు. ఇట్టివి ఎన్నియో పాఠకులే గ్రహింతురు.

బోధించి కడపట అన్నింటికంటెను గొప్పది సుఖమని తెలిపి ఆ భూమ (సుఖ) స్వరూపమును నీ క్రింది విధమున బోధించెను.

మం|| యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖ మస్తి భూమైవ సుఖం భూమాత్వేన విజిజ్ఞాసితవ్య ఇతి భూమానం భగవో విజిజ్ఞాస ఇతి.
(ఛాం. 7-23-1)

తా|| ఏది నిరతిశయమై, అల్పము కానట్టిదైన సుఖము గలదో అది భూమ. అది అత్యంత వ్యాపకమై తెలిసికొనదగి యున్నదని చెప్పగ నారదమహర్షి భగవంతుడా! ఆ భూమతత్త్వమును నా కుపదేశింపు మనెను. అంత నారదమహర్షికి సనత్కుమార మహర్షి యిట్లుపదేశించెను:-

**మం|| యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా ఽథ య త్రాన్య త్పశ్యత్యన్యచ్ఛృణోన్య ద్విజానాతి తదల్పం యోవై భూమా తదమృత మథ యదల్పం తన్మర్త్యగ్ంస భగవః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని యది వా న మహిమ్నీతి. (ఛాం. 7-24-1)**

తా|| ఏ స్థితియందు (ఏ తత్త్వమునందు) మఱియొక సాధనముచేత చూడదగినది మఱియొకటి లేదో- తెలిసికొనదగినదిగాని, వినదగినదిగాని మఱియొకటి లేదో అది భూమ. ఎచట (ఏ స్థితియందు) రెండవదానిని (మఱియొక సాధనముచే) చూడదగినది, వినదగినది, కలదో అది అల్పము, (భూమకాదు). భూమ మమృతము, నశింపనిది-మర్త్యము అల్పము. నశించును. ఇట్లు సనత్కుమారమహర్షి భూమ స్వరూపమును వివరింపగ 'ఓ భగవంతుడా! ఆ భూమ దేనియందు ప్రతిష్ఠితమై యున్నది' అని నారదమహర్షి అడిగెను. 'భూమ తనయందే తాను ప్రతిష్ఠితమై యున్నది' అని సనత్కుమారమహర్షి బోధించెను.

**దీనియొక్క వివర మేమనగా : చూచునది, చూచువాడు, చూచునట్టి సాధనము (చూపు) అను నీ మూడును త్రిపుటి. ఈ త్రిపుటి యెచ్చట లేదో అదియే భూమ. తెలిసికొనదగినది, వినదగినది అనునవి దేనియందు కలవో అది భూమ కాదు. అది అల్పము. ఇంద్రియగోచర విషయము లన్నియు త్రిపుటీనిబద్ధములు. త్రిపుటి అనిత్యము. కనుక అది అల్పము. భూమ అనగా గొప్పది. (అల్పము కానిది.)**

తరువాత 2వ మంత్రమునందు గోవులు, అశ్వములు మొదలగునవి వాటి యజమానిని ఆశ్రయించుకొని యుండును. ఆ ప్రకారము భూమ దేనినీ ఆధారము చేసికొని యుండలేదు.

ఆ భూమ, క్రింద మీద వెనుక ముందు దక్షిణమున, ఉత్తరముననను అంతట నున్నది. అదే అంతయునై యున్నది. *ఆ భూమ నేనే, సర్వత్ర యున్నాను.* ఇది అంతయు నేనే. నేనే సర్వమునై యున్నాను. ఇచ్చట అహ మనిన భూమయే. (ఛాం. 7-25-1) ఈ భూమ బ్రహ్మమే. అదియే ఆత్మ అని యీ క్రింది మంత్రమున వివరింపబడినది.

మం|| *అథాత ఆత్మాదేశ ఏ వా త్మైవా ధస్తా దాత్మో వరిష్టా*
*దాత్మా పశ్చా దాత్మా పురస్తా దాత్మ దక్షిణత ఆత్మోత్తరత ఆత్మై*
*వేదగ్ం సర్వమితి సవా ఏష ఏవం ప్రశ్యన్నేవం మన్వాన*
*ఏవం విజాన న్నాత్మరతి రాత్మ క్రీడ ఆత్మ మిథున ఆత్మానందః*
*స సర్వాధ్భవతీ తస్య సర్వేషు లోకేషు కామచారో*
*భవతీ అథ యే న్యథా ఉతో విదు రన్యరాజాన*
*స్తే క్షయలోకా భవన్తి తేషాగ్ం సర్వేషు లోకే ష్వకామ*
*చారో భవతి.* (ఛాం. 7-25-2)

తా|| ఇక ఆత్మను గుఱించి యిట్లు చెప్పబడుచున్నది. ఆత్మయే క్రిందను, మీదను, ముందును, వెనుకను, దక్షిణముననను, ఉత్తరముననను ఆత్మయే యున్నది. ఇది అంతయు ఆత్మయే. ఈ విధముగ తెలిసికొనిన మనన పూర్వకమగు విజ్ఞానము గల విజ్ఞానియగు పురుషుడు ఆత్మయందే రమించును. ఆత్మతో క్రీడించును. ఆత్మ సంయోగ సుఖమును పొందును. ఆత్మానంద మనుభవించువాడు స్వరాట్టగును. అతడు సర్వలోకములయందును యథేచ్ఛగా విహరించువాడగును. ఇందులకు విరుద్ధమగు జ్ఞానము గలవారు (ఇట్టి ఆత్మను గ్రహింపలేనివారు) నిరతిశయమగు భూమను గ్రహింపలేరు. వారిలోకములు, వారిఫలములు నాశన మొందును. అజ్ఞులు అస్వతంత్రులై యుందురు.

ఈ విధముగ నామము మొదలు ప్రకృతి వఱకును ఒకదానికంటెను ఒకటి గొప్పయని చెప్పి తుదకు సుఖమే భూమ యని చెప్పబడెను. భూమ అనగా: గొప్పది అని అర్థము. బ్రహ్మమనగా : అదియే అర్థము. బ్రహ్మమన్నను, ఆత్మయన్నను, ఆనంద మనినను, భూమ యనినను ఒక్కటియే. భేదము లేదు. దీక్షితులవారు 'బ్రహ్మ గానిది ఆత్మ గానిది భూమ' అని చెప్పిరి. పై శ్రుతియందే భూమకును, ఆత్మకును అభేదము చెప్పబడెను

దీక్షితులవారు భూమను గుఱించి "**భూమ అంటే గుర్తెరుగనిది, విననిది, చూడనిది భూమ అనే పేరు. యీ భూమకు యేమి లేదని చెప్పుచునే యున్నారు.**" (బృ. పూ. పు. 170)

అని చెప్పిరిగదా! శ్రుతియందు "**యత్ర నాన్యత్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా.**" ఎచ్చట చూచుటకు, వినుటకు, తెలిసికొనుటకు యేమియు లేదో అదియే భూమ యని చెప్పిన శ్రుతివాక్యముల అర్థమునకు దీక్షితులవారి వాక్యములు ఎంత విరుద్ధములో చూడుడు. ఛాందోగ్యము 7-25-3 వ మంత్రమును దీక్షితులవారు చదివియుండిన నిట్లు వ్రాసియుండరు. భూమను గుఱించి యెవరో తెలియనివారు చెప్పిన వాక్యములను బట్టి అట్లు వ్రాసిరి, కాని శ్రుతియందలి ఆ భాగమును వారు స్వయముగా చదువలేదనవచ్చును సారాంశమేమన:- తెలిసికొనునట్టిది, వినునట్టిది, చూచునట్టిది భూమయే.

పేరు లేనిదానిని ఏమని పిలువవలయును. దానికి (బ్రహ్మమునకు) పేరు పెట్టినదెవ్వరు? దానికి తల్లిదండ్రులు ఉన్నారా? అది అజము-అట్లయిన బ్రహ్మము, ఆత్మ, భూమ, సత్తు, ఆనందము, చిత్తు మొదలగు నామములతో ఋషులేల పిలుతురు? బోధకొఱకు ఏదో ఒక నామమున పిలువవలయును గదా! '**నాయ మాత్మా ప్రవచనేన లభ్యో**' (కఠ. 1-2-23) ఆత్మ వేదపాఠమువలన లభ్యపడునది కాదు. '**యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ ఆనంద బ్రహ్మణో విద్వాన్**' (తైత్తిరీయ. 2-4) ఎచట మనస్సుగాని వాక్కుగాని ప్రవేశింపలేక వెనుకకు మరలుచున్నవో అదియే ఆత్మ, ఆనందము, బ్రహ్మము అని చెప్పిన శ్రుతులు అంతటితో మౌనము వహించి ఊరకుండక భూమాది నామముల బోధించుటకు కారణమేమి? లోకవ్యవహారము నందున్న అనుభవమును పురస్కరించుకొని దానికి విరుద్ధ పద్ధతిని (నిషేధ పద్ధతిని)

ఆత్మకు పేర్లు పెట్టిరి. ఉదాహరణమునకు-జగత్తు-దుఃఖస్వరూపము, ఆత్మయందు దుఃఖము లేదు గనుక **ఆత్మ సుఖ స్వరూపము, లేక ఆనంద రూపమనిరి. అంతే గాని దానికి ఆనందమను నామము సహితము కల్పితమే.** ఇట్లే 'బ్రహ్మ' (బృహదారణ్యక. 5-1-2) అనగా - సుఖము (ఆనందము) బ్రహ్మమని అర్థము. పరిమిత (పరిచ్ఛిన్న) పదార్థము అల్పము. ఆత్మ అపరిచ్ఛిన్నము గనుక అల్పమునకు వ్యతిరేక మగును.

శాక్తమార్గీయుల ననుసరించి తురీయము భూమ, చిచ్ఛక్తి, సాక్షి, ప్రజ్ఞానఘనము, చైతన్యరూప, బ్రహ్మ, ఆత్మ, గోవిందుడు, విష్ణువు శబ్దములు శక్తి పరములు. ఇవన్నియు లలితా నామములు. ఏకార్థమును బోధించును. లలితా సహస్రనామముల యందు (667 సంఖ్య గలది) "భూమ రూపాయై నమో నమః" అని లలితయు భూమయు ఆత్మయే యని యున్నది. లలితా సహస్రనామముల యందు పైన చెప్పిన నామము లన్నియు లలితాపరమున కలవు. ఏది ఆత్మయో అదియే భూమ యని ఛాందోగ్యశ్రుతియందే కలదు. దానిని దీక్షితులవారు చూచియుండరు. దీక్షితులవారి మతము ననుసరించి మూలములేని గుర్తెరిగే శరీరము-లేదా ఎఱుక అను అర్థము స్పష్టమే కదా! (బృ. ఉ. పు. 36) శాక్తమునందు 'భూమ' కూడ లలితాదేవియే యని లలితాసహస్రనామముల యందున్న సంగతి దీక్షితులవా రెఱుగరు. ఎఱిగియుండిన భూమ అనగా మూలములేని యీ గుర్తెరిగే శరీరమా? అని బాధపడియుందురు. దీక్షితులవారి యీ క్రింది వాక్యముల వలన భూమయే ఆనందమని శ్రుతి చెప్పిన వాక్యమును చదివి యుండరని యూహింపవచ్చును. ***"విషయానందమునే ఆనంద మనవలె గాని బ్రహ్మానందము లేనేలేదు."*** **(బృ. పూ. పూ. 131, 132)** ***"శరీరము వలన సచ్చిదానందం పుట్టినది. సచ్చిదానందమే అనాత్మ, ఆత్మ సచ్చిదానందమే."*** (బృ. పు. పు 129)

దీక్షితులవారు చెప్పిన బట్టబయలును గుఱించి యొక పద్ధతిలో విచారింతము-

## (౨౫) బ్రహ్మము త్రివిధమా?

బ్రహ్మము- సగుణ, నిర్గుణ, నిష్ప్రతి యోగిక మను త్రివిధమని కొంద అందురు. మాయోపాధి గల బ్రహ్మము సగుణ మనియు, నిర్మాయిక స్వరూపమగు బ్రహ్మము నిర్గుణ మనియు, ఈ రెండింటి కంటెను విలక్షణమగు

(అతీతమగు) బ్రహ్మ తత్త్వము నిష్ప్రతియోగిక బ్రహ్మమనియు చెప్పుదురు

మఱికొంద ఱిట్లు చెప్పుదురు. మాయోపాధికమగు బ్రహ్మ చైతన్యము సగుణము. దేహాది సంఘాతమునకు అధిష్ఠానమగు ఆత్మ సగుణ నిర్గుణము. మాయాసంబంధ మెంతమాత్రములేని బ్రహ్మ చైతన్యము శుద్ధ నిర్గుణము. శుద్ధనిర్గుణ మనునది నిర్గుణమే. ఈ మూడువిధములయందు కడపటి శుద్ధ నిర్గుణమును అచలవేదాంతులు బట్టబయలని అందురేమో? కృష్ణదాసుగారు వ్రాసిన కందార్థములకు "**శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థము**" లనియు, కందములకు "**క్షరాక్షరోపాధిద్వయ దోష రహిత పరమతత్త్వకందములు**' అనియు పేర్లు పెట్టిరి. కాని దీక్షితులవారు బట్టబయలు నిర్గుణమని కొన్నిచోట్ల చెప్పిరి. "**ఈ ఉత్త బట్టబయలే నిర్గుణం**" (బృ. పూ. పు. 122) "**ఈ ఉత్త బట్ట బయలే నిరంజనం నిర్గుణం**" (బృ. ఉ. పు. 3) పై వాక్యములకు విరుద్ధముగ "**సగుణ నిర్గుణాలు కాంది యేదో**" (బృ. పూ. పు. 101) అని చెప్పిరి. ఇందులో నేది గ్రాహ్యమో యేది అగ్రాహ్యమో తెలియదు.

దీక్షితులవారు బ్రహ్మమనగా-బయలు కాదని పలుమారు చెప్పిరి. వారికి ప్రమాణ గ్రంథమగు అనంతోపనిషత్తు 'బ్రహ్మము' , 'బయలు' అను శబ్దద్వయమును సమానార్థకముగా ప్రయోగించినది.

**" .... మచలం సర్వదా భాతి పూర్ణం నిర్వర్ణం నిరామయం నిర్దేశ రహితం నిత్యం బాహ్యం బ్రహ్మేతి నిశ్చితం."** (7)

ఇచ్చట అచలము, బాహ్యం=బయలు, బ్రహ్మము - ఈ మూడును సమానార్థకములే. ఇట్టి ఆధారములు మఱికొన్ని అనంతోపనిషత్తు నందు కలవు.

దశోపనిషత్తులును వాటి ననుసరించి వ్రాయబడిన ప్రకరణ గ్రంథములును పూర్వ (ప్రాచీన) వేదాంత గ్రంథములనియు, తరువాత వెలువడిన ఉపనిషత్తులను, వాటి ననుసరించి వ్రాయబడిన ప్రకరణ గ్రంథములను ఉత్తర (నవీన) వేదాంత (గ్రంథ)ము లనియు చెప్పుదురు. కొందఱు ఇంకొక విధముగ చెప్పుదురు. బౌద్ధమతము పుట్టుటకు పూర్వమున్న వేదాంత గ్రంథములు పూర్వ (ప్రాచీన) వేదాంత గ్రంథము లనియు, బౌద్ధమతానంతరము వెలువడిన ఉపనిషత్తులు మొదలగు వేదాంత గ్రంథములను ఉత్తర (నవీన)

వేదాంత గ్రంథములనియు చెప్పుదురు నాకు తెలిసినంతవఱకు నిష్ప్రతియోగిక బ్రహ్మమును గుఱించి పూర్వ వేదాంత గ్రంథములయందు చెప్పబడలేదు పూర్వ వేదాంత గ్రంథములకు గల గౌరవము ఉత్తర వేదాంత గ్రంథములకు లేదు. కనుకనే ప్రస్థానత్రయమున దశోపనిషత్తులను మాత్రమే చేర్చిరి. బ్రహ్మ సూత్రములను, భగవద్గీతను సహితము దశోపనిషత్తులతో సమానముగ గౌరవించి మతాచార్యులు భాష్యములు రచియించిరి.

పారమార్థికముగ బ్రహ్మమునందు సగుణ నిర్గుణాది భేదము లేకున్నను వ్యావహారికముగ బోధకొఱకు కట్టి భేదము శాస్త్రములయందు చెప్పబడినది. ఇచ్చట ఒక ప్రశ్న కలుగుచున్నది. గుణము సగుణునకు గలదా? లేక నిర్గుణునకు గలదా? సగుణు డనగా: గుణము కలవాడు. గుణము మొదలే గల సగుణునకు మఱియొక గుణము కలుగదు. నిర్గుణునకు గుణము కలదనుట బాలభాషణము. నిర్గుణుడు సగుణుడు కాడు. సగుణుండైనచో నిర్గుణు డెట్లగును? నిర్గుణుడే సగుణు డాయెనన్న అతడేల తననిర్గుణత్వమును కోల్పోయెను? ఒకసారి నిర్గుణత్వము కోల్పోయెనేని తరువాత నిర్గుణుడను వాడే లేడు గదా? ఆత్మ నిర్గుణుడు. నిర్లేపుడు, నిరంజనుడు గనుక తాత్కాలికముగనైను నిర్గుణుని గుణము లెట్లుంటగలవు? దీనికి సమాధానమిది:-

ఒక స్ఫటికపు ముక్కను ఎండలోనుంచి దానిసమీపమున జపాకుసుమము (మంకెన పువ్వు) నుంచినచో స్ఫటికము దాని సహజమగు స్వచ్ఛతను పోగొట్టుకొనకనే మన నేత్రములకు ఎఱ్ఱగ కనిపించును. మంకెన పువ్వును స్ఫటికము నుండి దూరముగ చేసిన స్ఫటికము ఎప్పటియట్లె స్వచ్ఛముగ కనబడును. కాని స్ఫటికము జపాకుసుమ సాన్నిధ్యమున తన స్వాభావిక స్వచ్ఛతను కోల్పోయి రక్తవర్ణముగ మాఱలేదు. మంకెన పువ్వును దూరము చేసినపుడు రక్తవర్ణమును వదలి పూర్వపురీతిగ స్వచ్ఛతను పొందలేదు. స్ఫటికము రెండు సమయములందును నెప్పటియట్లే స్వచ్ఛముగనే యున్నది. (దీనిని జపాస్ఫటిక న్యాయమందురు) అదేవిధముగ బ్రహ్మమునందు ఆయనకంటె భిన్నమును, అభిన్నమును అని చెప్పుటకు వీలులేని అనిర్వచనీయమగు మాయాప్రభావముచే సహజముగ నిర్గుణుడగు బ్రహ్మము సగుణుడుగ

తోచుటేగాని సగుణు డెన్నడును కాలేదు. జీవుడు సంసారదశ యందున్నప్పుడు బ్రహ్మము సగుణుడుగను, జీవుడు ముక్తావస్థయం దుండునపుడు బ్రహ్మము నిర్గుణుడుగను తోచుచున్నాడు. సగుణబ్రహ్మ ప్రాప్తివలన నిర్గుణబ్రహ్మ ప్రాప్తియు, నిర్గుణబ్రహ్మానుభవమువలన సంసారమునుండి జీవుడు ముక్తుడై మోక్షదశ నందుటయు, ఫలము.

శ్రీ శంకరాచార్యులవారు నిర్గుణబ్రహ్మమునందే శ్రుతుల తాత్పర్యమని భాష్యముల రచియించిరి. శ్రీమద్రామానుజాచార్యులవారు 'నిర్గుణబ్రహ్మ' శబ్దమునకు వేఱొక విధమగు అర్థమును చెప్పిరి. ఎట్లనగా:-

లోకమున నిర్గుణవస్తు వొక్కటియు లేదు. అట్లుండుటకును వీలులేదు. ఒక వేళ నిర్గుణవస్తువు ఒక్కటి ఉన్నట్లు మన మంగీకరించితిమేని దాని యునికి నెఱుగుట యెట్లు? నిర్గుణము నెఱుగుటకు ప్రమాణము లేవి? శ్రుతియే ప్రమాణమనిన శ్రుతులయందు చెప్పబడిన నిర్గుణ బ్రహ్మ శబ్దమునకు బ్రహ్మము గుణములు లేనివా డని అర్థము కాదు. గుణములు లేవనగా: ప్రకృతి సంబంధమైన హేయగుణములు లేనివాడనియే గాని, అనంత కళ్యాణ గుణములు లేనివాడని కాదు. ఆయన అప్రాకృతములైన అనంత కల్యాణ గుణములు కలవాడు.

కొందఱు దేవీభక్తులు. దేవిని పరదేవత అందురు. అనగా: దేవికంటె అతీతమగు పరతత్త్వ మొకటి కలదని వా రంగీకరింపరు. దేవీ భాగవతమునందు దేవి తానే సగుణయు, నిర్గుణయు నని చెప్పినట్లున్నది. అనగా: ప్రకృతి (దేవి) యందు గుణములు వ్యక్తము గాక అవ్యక్తస్థితియం దుండునప్పుడు దేవి నిర్గుణ యనియు, గుణములు వ్యక్తమైన స్థితియందు సగుణ యనియు తాత్పర్యము. శబ్దమును బట్టి గాక మన మనేక పర్యాయములు ఆ శబ్దములు ప్రయోగించినవారి భావ మేమైయుండునా? యని విచారించి శబ్దమునకు అర్థమును చెప్పవలసియుండును.

ఈ విషయ మిట్లుండనిండు. దీక్షితులవారు శరీరమును, ఎఱుకను- ఈ రెండింటిని క్రమముగ సగుణ, నిర్గుణము లనియు ఈ సగుణ నిర్గుణములు కానిది 'ఏమీ లేని ఉత్త బట్టబయ' లనియు చెప్పిరి. శ్రీ విద్యావిశారదులు

చెప్పునట్టి సగుణ నిర్గుణములను దీక్షితులవారు చెప్పిన వాటితో పోల్చవచ్చునా యని విచారించినచో రెండింటికిని సామ్యము కుదురదు. శ్రీవిద్యోపాసకులు చెప్పునట్టి నిర్గుణ తత్త్వము నిత్యమైనది దీక్షితులవారు చెప్పునట్టి ఎఱుక (గుర్తు) క్షణభంగుర మైనది.

సగుణ నిర్గుణములు కానిదని చెప్పబడు నిష్ప్రతియోగిక బ్రహ్మమును గుఱించి ఋభుగీత* యం దిట్లున్నది:-

శ్లో|| సగుణం నిర్గుణం తాభ్యా మన్యన్నిష్ప్రతియోగికమ్|
బ్రహ్మైవం త్రివిధం లింగై ర్వేదాం తేషు హి విశ్రుతమ్||

(ఋ. గీ. 1-72)

తా|| బ్రహ్మము సగుణమనియు, నిర్గుణమనియు, ఆ రెండింటికంటె అన్యము నిష్ప్రతియోగిక మనియు ఇట్లు త్రివిధముగా వేదాంతములయందు వినబడుచున్నది గదా?

శ్లో|| తత్రాద్యం హేయగుణకం సోపాధిత్వా న్ముముక్షుభిః|
'తత్త్వమస్యా' ది వాచ్యత్వాత్ జ్ఞేయం హేయతయాగ్రతః||

(ఋ. గీ. 1-73)

తా|| అందు మొదటిదగు సగుణ బ్రహ్మము మాయోపాధి సహిత మైనదియు, 'తత్త్వమస్యాది' మహావాక్యముల యొక్క వాచ్యార్థమగుట వలనను** హేయగుణకము (వర్జింపదగిన స్వభావము కలది)గా తెలియనగును.

---

* ఋభుగీత (వరాహభగవానుని శిష్యుడను ఋభుమహర్షికి) ఋభుమహర్షి వారి శిష్యుడగు నిదాఘునికివి చెప్పెనని దక్షిణామూర్తి బ్రహ్మదేవునకు ఉపదేశించినట్లు ఆ గ్రంథమున కలదు ఇది నాలుగధ్యాయములు కలిగి అందులో 347 శ్లోకములున్నవి గ్రంథకర్త (లేక సంకలనకర్త) తేజోబిందూపనిషత్తునుండి సుమారు 145 మంత్రములను, మాండూక్యశ్రుతి నుండి 3 మంత్రములను, ఇతర ఉపనిషత్తుల నుండి కొన్ని మంత్రములను, (శ్లోకములను) మాండుక్యకారికల నుండి కొన్ని శ్లోకములను గైకొని ఋభుగీతను రచియించిరి.

** ఈ గ్రంథముయొక్క ప్రథమభాగము రెండవ ప్రకరణమున ౪౨, ౪3 అధ్యాయముల యందు 'తత్త్వమసి' మహావాక్యవిచార మనియు, మహావాక్య విచారణమనియు రెండధ్యాయములు చెప్పితిని. అందు వాచ్యార్థము లక్ష్యార్థముల వివరము కలదు

"మఱియు ఆ సగుణ బ్రహ్మము, జీవేశ్వర విభాగము చేత ద్వివిధంబగును. అందు జీవేశ్వరు లిరువురును త్రివిధ వంతు లగుదురు. కనుక హేయ గుణము." (ఋ. గీ. 1-74)

**శ్లో|| ఉపాదేయం ద్వితీయం స్యా న్నిర్గుణం మోక్షకాంక్షిభిః|**
**తత్త్వమస్యాది లక్ష్యత్వాత్ జ్ఞేయం చాత్మతయా తతః||** (ఋ.గీ. 1-75)

తా|| రెండవది యగు నిర్గుణ బ్రహ్మము తత్త్వమస్యాది మహావాక్యముల యొక్క లక్ష్యార్థ మగుటవలన ముముక్షువులచే ఉపాదేయము (గ్రహింపదగినది) అగును. కనుక ఆత్మభావముగా నెఱుగదగినది యగును.

**శ్లో|| హేయోపాదేయ శూన్యం తృతీయం ప్రకృతం యతః|**
**ముక్తైః ప్రాప్యమత శ్శబ్ద మపి జ్ఞేయం ముముక్షుభిః||** (ఋ. గీ. 1-77)

తా|| మూడవదియగు నిష్ప్రతియోగిక బ్రహ్మము హేయోపాదేయ గుణములు రెండును లేనిదియును, ముక్తులచే పొందదగినదియు నైయున్నది.

ముక్తులచే పొందదగిన దనగా : ముముక్షువులు పొందసాధ్యము కానిదని అర్థము. అట్లయినచో నిష్ప్రతియోగిక బ్రహ్మప్రసక్తి యేల? యన ముముక్షువులు (మోక్షాపేక్ష గలవారు) అట్టిదొకటి గలదని అనామకమైనను ఎఱుగదగియున్నది. ఆ నామము వినుట తప్ప అన్యఫలము లేదని తాత్పర్యము.

ఇట్టి నిష్ప్రతియోగిక బ్రహ్మమును గుఱించి మఱియు నిట్లున్నది. 'ఇది' యనుటచేనైనను, 'నే' ననుటచే నైనను, 'తా' ననుటచే నైనను ఈ బ్రహ్మమునకు వేద్యత్వము లేదు. (తెలియబడెడి స్వభావము లేదు) అట్లైన శ్రుతి ప్రోక్తమగుట వలన నొకానొక విధమగు వేద్యత్వము గలదు. కనుక నాస్తికము కాదు. (ఋ. గీ. 1-77)

తేజోబిందూపనిషత్తు పంచమాధ్యాయమున సుమారు అఱువది మంత్రములయందు అరూప బ్రహ్మబోధ కొఱకు సర్వము మిథ్యయని చెప్పబడినది. ఆ మంత్రములనే ఋభుగీతాకారుడు ఉన్నవి యున్నట్లుగా ఋభుగీత ప్రథమాధ్యాయమున గ్రహించెను. అచట నిర్గుణ బ్రహ్మమునకు స్వరూప బ్రహ్మమనియు, నిష్ప్రతియోగిక బ్రహ్మమును అరూప బ్రహ్మమనియు

నామముల నుపయోగించినట్లు భావించవచ్చును. నిర్గుణ బ్రహ్మమును సప్రతియోగిక బ్రహ్మమనియు అందురు.

జిజ్ఞాసువు :- స్వామీ! సప్రతియోగిక (నిర్గుణ) బ్రహ్మమును నిర్మలాంతః కరణముచేతను, తత్త్వమస్యాది మహావాక్య శ్రవణముచేతను మనన నిదిధ్యాసలవలనను ఎఱుగ వచ్చును. అరూప (నిష్ప్రతియోగిక) బ్రహ్మమును తెలిసికొనుట యెట్లు?

వేదాంతి:- ఈ ప్రశ్నమునే నిదాఘునిచే ఋభుమహర్షి అడుగబడినవాడై శిష్యున కిచ్చిన సమాధానమునే నేను నీకు తెలిపెదను.

శ్లో॥ లక్ష్య లక్షణ హీనత్వా ద్యుక్త్యా నిష్ప్రతియోగికమ్।
న మంతవ్యం యథా యోగ్యం లౌకి కైస్త్వం వినిశ్చను॥

(ఋ. గీ. 2-22)

తా॥ నిర్గుణాతీతమునకు లక్ష్య లక్షణములు లేనందున యుక్తిచేనైనను నిష్ప్రతియోగికమని తలంపదగదు. (అయినను) లౌకికులచే నెట్లు వ్యవహార యోగ్యమో, (అట్లు) నీవును నిశ్చయించుకొనుము." అనగా-నిష్ప్రతియోగిక బ్రహ్మము ఏవిధముగను తెలియబడదని, అట్టి ప్రయత్నము గాని, దానిని గుఱించిన చర్చ (విచారము) గాని నిష్ప్రయోజనమని తాత్పర్యము. ముక్తి కలుగుట యెట్లనగా?

శ్లో॥ ద్వైతా చిద్రూప కార్యస్యా ద్వైత చిద్రూప కారణాత్।
నివృత్తి స్స్యాద్యథా దీపా త్తమసోనత్వరూపతః॥ (ఋ. గీ. 4-61)

తా॥ అజ్ఞాన కార్యమైన ద్వైతము అంధకారము వంటిది. అద్వైత చిద్రూప కారణ జ్ఞానము దీపము వంటిది. కనుక సరూప బ్రహ్మజ్ఞానముచేత మాయారూపబంధము నశించి ముక్తి కలుగును గాని అరూప బ్రహ్మము వలన ముక్తి కలుగదు.

శ్లో॥ చిద్రూప బ్రహ్మతాదాత్మ్యం జీవస్య హి వివక్షితః।
నారూప వాక్య దూరత్వాత్త న్నాద్వైత మరూపిణామ్॥

(ఋ. గీ. 4-63)

తా॥ "అద్వైత వేదాంతమునందు జీవునకు చిద్రూప బ్రహ్మముతో తాదాత్మ్యము చెప్పబడినది. అరూప బ్రహ్మమన్ననో విషయ వాక్యములకు దూరమగుట వలన జీవునకు అరూప బ్రహ్మముతో తాదాత్మ్యము చెప్పబడలేదు. కనుక **అరూప బ్రహ్మవాదులను అద్వైతులని చెప్పుట కూడ తగదు."**

"మోక్షాతీతదశయందు మాత్రమే అరూప బ్రహ్మత్వము సిద్ధించును. అట్లయినను అరూప బ్రహ్మమునకు ద్వంద్వహానిత్వంబగుట వలన అద్వైత భావము చెప్పుటకు వీలులేదు." (ఋ. గీ. 4-64) "అదియుగాక వాచ్యవాచక రహిత మైనదనియు, లక్ష్యలక్షణములు లేనట్టియు అరూప బ్రహ్మమందు అద్వైతమను శబ్దమును ప్రయోగించుటకు వీలులేదు.(ఋ. గీ. 4-65)

**శ్లో॥ అరూప వస్తునః ప్రశ్నః ప్రతిషిద్ధ శ్రుతౌ యతః॥**
**యాజ్ఞవల్క్యేన గార్గ్యై తన్నత్వం ప్రష్టు మిహార్హసి॥ (ఋ. గీ. 4-71)**

తా॥ "మరియు ఏ కారణమున శ్రుతియందు యాజ్ఞవల్క్యునిచే గార్గి కొఱకు అరూప వస్తువునకు ప్రశ్నము నిషేధింపబడెనో ఆ కారణమున, దీనిని గుఱించి ప్రశ్న చేయుటకు తగవు."

ఇచ్చట ఒక విషయము చెప్పవలసి యున్నది. ఏమనగా:- బృహదారణ్యక శ్రుతి తృతీయాధ్యాయము నందలి ఆఱవబ్రాహ్మణమునందు వచక్నుని బిడ్డయగు గార్గి యను నామెకును యాజ్ఞవల్క్య మహర్షికిని జరిగిన సంవాదమునందు గార్గి యాజ్ఞవల్క్య మహర్షిని 'బ్రహ్మలోకము దేనియందు ఓతప్రోతమై యున్నది?' అని ప్రశ్నించెను. అందుకు మహర్షి 'ఆ ప్రశ్నమును అడుగవద్దు. నీ తల పగిలిపోవును' అని చెప్పెను. అంతటితో గార్గి మిన్న కుండెను.

ఇచట విచారింపవలసిన విషయ మేమన - యాజ్ఞ వల్క్యమహర్షి ఏ బ్రహ్మమును గుఱించి అడుగవద్దని గార్గిని మందలించెను? ఇదియే ముఖ్యమైన ప్రశ్న. ఇందులకు నా సమాధాన మేమన-బ్రహ్మలోకము (హిరణ్యగర్భుని లోకము) సగుణ బ్రహ్మోపాసకులు మరణానంతరము అర్చిరాది మార్గమున (దేవయానమున) చెందు ముక్తిస్థాన మది. దానికి సత్యలోకమని ఖ్యాతియొక

నామము. దీనికంటె పరమునందున్న పరమసత్యమగు నిర్గుణ బ్రహ్మమునందు సత్యలోకము ఓతప్రోతమై యున్నదని చెప్పరాదు. నిర్గుణ బ్రహ్మము దేనికిని, కారణముగాని, కార్యముగాని కాకపోవుటవలనను, నిర్లిప్త మగుటవలనను, **"యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ"** అని (త్రైత్తిరీయ. అ. 2-48) శ్రుతి చెప్పియున్నందువలనను, మనోవాక్కుల కందరాని దానిని గుఱించి ప్రశ్నించుట తప్పని మహర్షి గార్గిని మందలించెను.

ఋభుగీతయందు చెప్పబడిన నిష్ప్రతియోగిక బ్రహ్మము, తేజోబిందూపనిషత్తునందు చెప్పబడిన అరూప బ్రహ్మము- ఈ రెండును ఒక్కటేయనియు, గార్గికి యాజ్ఞవల్క్యులు చెప్పుటకు నిరాకరించినది అదియే యనియు కొందఱు నవీన వేదాంతులు చెప్పుదురు. అట్లు చెప్పుట వలన వారికి కలుగు ప్రయోజన మేమన:- నిష్ప్రతియోగిక బ్రహ్మము ప్రాచీన శ్రుతులలో (దశోపనిషత్తులలో) బీజరూపమున చెప్పబడి యున్నదని నిరూపించుటకే కాని, అది సరికాదు. మహర్షి, బ్రహ్మలోకము నిర్గుణ బ్రహ్మమునందు ఓతప్రోతమై యున్నదని చెప్పిన పిమ్మట కూడ గార్గి "నిర్గుణ బ్రహ్మము దేనియందు ఓతప్రోతమైయున్న"దని అడిగియుండిన, మహర్షి గార్గికి చెప్పుటకు నిరాకరించిన వస్తువు నిష్ప్రతియోగిక బ్రహ్మమే యని యంగీకరింపవచ్చును. అట్లడుగ లేదు గనుక మహర్షి అడుగవద్దని చెప్పినది నిర్గుణ బ్రహ్మమునే యని యాజ్ఞవల్క్యుల యొక్కయు, ఋభుగీతాచార్యుల యొక్కయు అభిప్రాయమై యున్నదనుట యుక్తము. ముముక్షువునకు కావలసినది ముక్తియే గనుక ముక్తి అరూప బ్రహ్మజ్ఞానమువలన సిద్ధింపదు. మోక్షకాముడు చేయదగినది యేమన:-

శ్లో॥ **తస్మా త్తురీయం సద్బ్రహ్మ యోగవృత్త్యైవలక్షణైః।**
**సచ్చిదానంద పూర్ణైస్త్వం మదుక్తం విద్ధి ముక్తయే॥**

(ఋ. గీ. 4-72)

**తా॥** అందువలన, అరూప బ్రహ్మజ్ఞానము వలన మోక్షము సిద్ధింపదు. కనుక నాచే చెప్పబడిన తురీయరూపమగు* సత్యమైన బ్రహ్మమునే

* తురీయమును గుఱించి బ్రహ్మజిజ్ఞాస ప్రథమభాగము ౨,౨౮ వ అధ్యాయమునందును, తుర్యాతీతము సత్తాసామాన్యమును గురించి ౪౬ వ అధ్యాయమునందును వ్రాసియున్నందున నిచ్చట ఇంతటితో విరమించితిని

యోగవృత్తితోను, సచ్చిదానంద పూర్వకములైన లక్షణములచేతను మోక్షము కొఱకు నీ వెఱుంగదగును.

శ్లో॥ **స ఆత్మా స హి విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః,**
**తుర్యాత్మ జ్ఞాన హీనానాం న ముక్తి స్స్యాత్ కదాచన.** (బ్రు. గీ.4-47)

తా॥ "అది ఆత్మ, అదియే సమస్త ముముక్షువుల చేతను తెలియదగిన పదార్థము. తుర్యాత్మ జ్ఞానశూన్యులకు ఎప్పటికిని ముక్తి సిద్ధింపదు. వీర శైవులుకూడ తురీయమునే యెఱుగవలయునని చెప్పిరి.

శ్లో॥ **జాగ్రత్స్వప్న సుషుప్తిభ్యః పరావస్థా ముపేయుషః॥**
**కిం వా ప్రమాణం కిం జ్ఞేయం కిం వా జ్ఞానస్య సాధనమ్॥** (సి. శి. 20,21)

తా॥ "జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి మూడవస్థలను మీఱి తుర్యావస్థ నొందిన శివయోగికి ప్రమాణమును లేదు. తెలియదగినదియు లేదు. తెలియదగిన సాధనమును లేదు."

(ఈ శ్లోక తాత్పర్యమును నిదివఱలో చెప్పియుంటిని.)

శ్లో॥ **తుర్యాతీతపదం యత్ర ద్దూరం వాఙ్మనసాధ్వనః॥**
**అనుప్రవిశ్య తద్యోగీ న భూయో విశ్వ మీక్షతే॥ (సి. శి. 20-22)**

తా॥ తుర్యాతీత పదమనునది అవాఙ్మానస గోచరము. అది స్తుతి ధ్యానములకు దూరమైనది. శివయోగి దానియందు ప్రవేశించి తిరిగి జగత్తును చూడడు. కనుక తురీయమే జ్ఞేయము. **తురీయము నెఱుగుటయే తురీయాతీతస్థితి సిద్ధించుట.** తురీయాతీతము సిద్ధించుటకు వేఱు సాధనముగాని బోధగాని లేదు.

జిజ్ఞాసువు:- స్వామి! అరూప బ్రహ్మమును తెలిసికొనుటవలన ప్రయోజన మేమియు లేనప్పుడు అట్టిది తెలిసి కొనవలయునను ప్రయత్నమేల?

వేదాంతి:- తత్త్వమస్యాది మహావాక్య విచారము చేతను నిదిధ్యాసవలనను సజాతీయ విజాతీయ భేదము మాత్రమే నశించుననియు, స్వగతభేదము నశింపదనియు, అరూప బ్రహ్మజ్ఞానము వలన స్వగతభేదము కూడ నశించుననియు కొందఱు చెప్పుదురు. కాని యిది సరియైన అభిప్రాయము కాదు. ఏలయన అరూప బ్రహ్మము ఏవిధముగను ఎఱుగబడదు. అది

'అఖండైకరసాతీతము', 'మోక్షాతీతము' ఎఱుగబడని దానివలన ఫలమేమి కలుగును? ఫలము శూన్యమేగాక దుష్ఫలము లభించుట కవకాశమున్నదని నిదాఘుని వాక్యముల అర్థము. (ఋ. గీ. 1-63 నుండి 69). నిదాఘుని వాక్యములను ఋభుమహర్షి అంగీకరించెను. (ఋ. గీ. 1-71) కాని నిర్గుణ బ్రహ్మమును పొందుటవలన సజాతీయ విజాతీయభేదము నశించుననియు స్వగతభేదము నశింపదనియు; నిష్ప్రతియోగిక బ్రహ్మానుభవమువలన స్వగతభేదము నశించుననియు, అదియే నిష్ప్రతియోగిక బ్రహ్మానుభవమునకు ఫలమనియు చెప్పబడెను. (ఋ. గీ 1-78). అది కేవలము ఉపశమనవాక్యము మాత్రమేకాని యథార్థము కాదు. ఏలయన: మహర్షి నిర్గుణ బ్రహ్మ స్వరూపమును చెప్పుచు,

**శ్లో|| ఆనందో ఽసి పరో ఽసి త్వ ఏ వాద్వితీయకః|**
**చిద్ఘనానంద రూపో ఽసి పరిపూర్ణ స్వరూపకః||** (ఋ.గీ.2-12)

తా|| "మరియు, నీవు ఆనందరూపుడవు. పరుడవు. సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనివాడవు. జ్ఞానానంద స్వరూపుడవు. అద్వితీయుడవు, పరిపూర్ణ స్వరూపుడవు" అని చెప్పిరి. సర్వ వేదాంత శాస్త్రములు నిట్లే చెప్పినవి

జ్ఞాని తన స్వరూపమును తాను తెలిసికొని తాను అద్వితీయ నిర్గుణ బ్రహ్మ స్వరూపుడనని యెఱిగినప్పుడే స్వగతభేదము నశించుచున్నది. అట్టియెడ అరూపబ్రహ్మము (నిష్ప్రతియోగిక బ్రహ్మము)తో ఫలము లేదని నా యభిప్రాయము దీనిని వివరించి చెప్పెదను. మనుష్యునకు శిరస్సువలె బాహువులుగాని, తదితర అవయములుగాని లేవు. హస్తము లున్నట్లు పాదములు లేవు. పాదములవలె ఉదరము లేదు. కాని యివన్నియు ఒక శరీరమునకు సంబంధించినవి. అట్లే చెట్టునందు ఆకులు, పువ్వులు, ఫలములు, కొమ్మలు వేఱు వేఱు రూపములతో నున్నను అవి యన్నియు చేరి ఒక వృక్షమే. ఒక శరీరమునందు అవయవములయందున్న యీ భేదము స్వగతభేదము. స్వగతభేద మనునది సాకార, సగుణ వస్తువునందే కలదు. అఖండము, అద్వితీయ

వస్తువునందు స్వగతభేదము లేదు. నిర్గుణ బ్రహ్మభావనయందే యీ భేదత్రయము నశించుచుండగా నిష్ప్రతియోగిక బ్రహ్మప్రసక్తితో అవసరము లేదు.

బంధమోక్షములు రెండును వ్యావహారిక సత్యమే గాని పారమార్థిక సత్యములు కావు. పదుగురు స్నేహితులు నదిని దాటి యిందులో ఎవరైన నదిలో పోయిరేమోయని వారిలో ఒకడు తన్ను తప్ప తక్కిన వారిని లెక్కించి దశముడు (పదియవవాడు) ఏటి పాలైపోయెనని అందఱు విలపించుచుండ, మార్గమున పోవువాడొక డావృత్తాంతము వారివలన విని తొమ్మండ్రుగురను లెక్కించినవాడే దశముడని చెప్పి చూపినపుడు వారు భ్రాంతి రహితులై మహానందము ననుభవించుచు "దశముడున్నాడు, దశముడున్నాడు" అని బిగ్గఱగ చెప్పుకొనుచు పోయిరి. కాని, వారు బ్రతికియున్నంతకాలము 'దశముడున్నాడు' అని అఱుచుచుందురా?

అట్లే ఆత్మానాత్మ వివేకమువలన అవిద్య నశించును. తత్త్వమస్యాది మహావాక్యవివేకము వలన బ్రహ్మైక్యము సిద్ధించును. ఆ స్థితిలో స్వస్వరూపము నెఱిగి 'అహం బ్రహ్మాస్మి' - నేనే బ్రహ్మమునై యున్నాను. నేను సచ్చిదానంద స్వరూపుడ నయితిని. నేను ముక్తుడను. నా కిప్పుడు బంధము లేదు. పూర్వము నేను బద్ధుడ ననుకొంటిని కాని నిజముగా నా కెప్పుడును బంధము లేదు అని నిశ్చయించును. ఆ తరువాత 'అహం బ్రహ్మాస్మి' అని గాని, 'అయామాత్మా బ్రహ్మ' అని గాని బ్రతికియున్నంత కాలము జపించుచుండునా? అట్లుండడు. అతనికి మహావాక్యములతోను, వాటి అర్థముతోను అవసరము తీరిపోయినది. ఋభుగీతను ముగించుచు, ఆ గీతాచార్యు డిట్లు చెప్పెను:-

**శ్లో॥ ఏవం శ్రుత్వా నిదాఘస్స ఋభువక్త్రా ద్యథార్థతః।**
**బ్రహ్మైవాహ మితి జ్ఞాత్వా కృతకృత్యో భవద్విధే॥ (ఋ. గీ. 4-89)**

**తా॥** ఋభుమహర్షివలన యథార్థమును విన్ననిదాఘుడు 'నేను బ్రహ్మమే' అని యెఱిగి కృతకృత్యుడాయెను. పర్యవసాన మేమనగా:- అరూప బ్రహ్మము వల్ల అజ్ఞాన నివృత్తి కలుగదు. కనుక జిజ్ఞాసువు అరూప బ్రహ్మవిచారము చేయుటవలన ప్రయోజనము లేదు.

జిజ్ఞాసువు:- దీక్షితులవారు చెప్పిన 'ఉత్త బట్టబయలు' ఈ అరూపబ్రహ్మ (నిష్ప్రతియోగిక బ్రహ్మ)మే యైనదాని నెఱుగుటవలన ఫలమేమియు కలుగదుగదా?

వేదాంతి:- వారు చెప్పిన ఉత్త బట్టబయలు ఎట్టిదో వారి వాక్యములను ఉదాహరించి చెప్పెదను. అది వినిన పిమ్మట నీవే నిశ్చయించుకొనుము.

## (౨౬) దీక్షితులవారి శూన్యవాదము

దీక్షితులవారి గ్రంథమును పరిశీలించిన, అందు వారొకచోట చెప్పినదానిని వేఱొకచోట నిరాకరించినట్టి స్వవచన వ్యాఘాతములు అనేకములు గలవు. ఒకచోట 'ఈ ఉత్త బట్టబయలు అచలము' అని చెప్పి ఆ అచలమునే మఱియొకచోట 'చలాచలములు కానిది' అనిరి. మంత్రమునందు 'ఈ ఉత్త బట్టబయలు యేమీలేదు' అని గదా ఉన్నది? 'ఉత్తది' అన్నను 'ఏమీలేదు' అన్నను అర్థము ఒక్కటియేకదా! పరిపూర్ణము యేమి లేనిది కాదు. మానవునకు గల పరిచ్ఛిన్న పంచేంద్రియములచే నెఱుగు శబ్దాది పంచవిషయములు అందు లేవనినంత మాత్రమున అది 'ఉత్తది'కాదు. 'ఏమి లేనిది'కాదు. అది ప్రజ్ఞానఘనము. ఈ యంశమును శ్రీ జ్ఞానేశ్వరస్వాములవారును అంగీకరించి దానికి 'విశుద్ధజ్ఞానము' అని పేరిడిరి.

**దీక్షితులవారు ఒకచోట ఈ క్రింది విధముగ చెప్పిరి:- "అందరికి అన్నిరూపములుగా అహంకారమే యెరుకై. యెరుకే శరీరమై. శరీరమే మరణదేహమై, మరణదేహమే మన్నై. నీరే అగ్నియై, అగ్నియే వాయువై, వాయువే ఆకాశమై, ఆకాశమే అహంకారాత్మయై, అహంకారతత్త్వమే మహదహంకారమై, మహదహంకారమే ప్రకృతియై, *ప్రకృతియే అచలమై, అచలమే శూన్యమై, శూన్యమే మహాశూన్యమై, మహాశూన్యమే అగోచరమై నశించియున్నది.* అయితే మరణమయ్యేవారందరు యీలాగుననే జన్మరహితు లగుచున్నారా! యని శంక రాగా, అందరి కాలాగున జన్మరహితము కాదు. అట్లైన అందఱు ముక్తు లగుచున్నారని శంక రాగలదు. అలాగున ఒప్పుకొనిన గురుశిష్యన్యాయము లేకపోవుచున్నది. పాపపుణ్యములు లేకపోవుచున్నవి.**

ఈ విపరీతార్థములు అన్నియు కలుగుచున్నవి. ఇది ముక్తులైన వారు ఒప్పుకొందురు. ఎలాగు ననగా *రజ్జుభ్రాంతి కలిగినంత సేపు సర్పభ్రాంతి తోచదు. సర్పభ్రాంతి కలిగినంతసేపు రజ్జు భ్రాంతి తోచదు గదా!* అలాగుననే ముక్తులకు అముక్తులు, అముక్తులకు ముక్తులు గనపడరు. కనుక ముక్తులకందరు ముక్తులే, *అముక్తుల కందరు ముక్తులే గావున యిదే సిద్ధాంతముగాను, సాధారణముగా నిరాక్షేపముగా నందరికి తోచదు."

(బృ. పూ. పు. 43)

"రజ్జుభ్రాంతి కలిగినంతసేపు సర్పభ్రాంతి తోచదు, సర్పభ్రాంతి కలిగినంతసేపు రజ్జుభ్రాంతి తోచదు." దీక్షితులవారి యీ వాక్యములు అర్థశూన్యములు. ఏలయన? రజ్జువును రజ్జువునుగా చూచుట భ్రాంతికాదు. అది వ్యావహారిక సత్యము. అది ప్రమాజ్ఞానము, భ్రాంతిజ్ఞానము కాదు. దీక్షితులు అంతటితో ఆగక -'సర్పభ్రాంతి కలిగినంతసేపు రజ్జువను జ్ఞానము కలుగదు' అనవలెను, గాని 'రజ్జుభ్రాంతి తోచదట.' దీక్షితులవారి యీ వాక్యముల కర్థమేమైన కలదా? మఱియు వారి వాక్యములయందు 'ప్రకృతియే అచలమై' అని ఉన్నది. అనేక పర్యాయములు 'ఇది అది కాదు. అది యిది కాదు' అని చెప్పిన వాక్యములు మఱచిరి కాబోలు.

శ్రీ దీక్షితుల పై వాక్యములయందు అచలమునకు నాశనము నంగీకరించిరి. లేదా అచలము శూన్యముగ పరిణమించుట యను పరిణామము నంగీకరించిరి. దీక్షితులవారి మతము వారిబోధను 'అచలబోధ' యనిరి. 'అచలాద్వైత' మనిరి. 'అచల వేదాంత' మని ప్రచారము చేసికొనిరి. వారి గ్రంథమునందు 'రాకడ పోకడ లేక యెప్పటికిని నిలిచియుండునది అచల' మనిరి. దానినే పరిపూర్ణమనిరి. వారు చెప్పిన యీ వాక్యములను వారే పైన చెప్పిన వాక్యములతో ఖండించిరి. తత్త్వములను ఎఱుకతో ప్రారంభించి, మహాశూన్యముతో అంతమొందించిరి. తుదకు మహాశూన్యము సహితము

---

* అముక్తులకందరు ముక్తులే అని యున్నది. అది అచ్చుతప్పు కావచ్చును "అముక్తుల కంద రముక్తులే అని యుండవలెను."

**అగోచరమై పోవునట. ఆహా! ఎవరికి అగోచరమగునో?** ఈ విధముగా చూచిన బట్టబయలు లేదు, ఎఱుక లేదు. సర్వము మహాశూన్యము.

కాని దీక్షితులవారు మహాశూన్యమని చెప్పిరే అది యెట్టిది? శూన్యమనునది ఒకటి యుండుట కలదా? శూన్యము నశించి మహాశూన్య మగుట యెట్లు? శూన్యమనగా-ఏమియు లేనిదని గదా? ఉన్నదానికి నాశనము కలదనిన అర్థమున్నది. కాని, లేనిది నశించుట లోకమున నెచ్చటను వినలేదు, కనలేదు. 'వంధ్యాపుత్రుడు మరణించెను', 'శుక్తి రజతము భస్మమయ్యెను' అను వాక్యములవలె వ్యర్థభాషణములు కదా? ఈ మార్పునంతయు చూచు సాక్షి ఒకడుండవలయును కదా? అట్టివాడు లేకపోయినచో యిది తెలియుటెట్లు? సాక్షి నంగీకరించిన అతడు నాశరహితుడు, నిత్యుడు, మార్పు లేనివాడని అంగీకరించినట్లే కదా? నిత్యుడగు సాక్షి ఒకడుండగ, శూన్యమనుమాటకు అర్థమేమున్నది? సాక్షి నశించెనని చెప్పిన అట్టి సాక్షి నాశము నెఱుగుట కింకొక సాక్షి ఉండవలయును కదా! ఇది ముక్తులైనవారికే వర్తించునట. బంధముక్తులు లేరని, 'ముక్తి' అను వారు మూర్ఖులని వేనోళ్ల చాటిన దీక్షితులవారు ముక్తులైనవారు' అని అనుట వింతగదా! ముక్తి యెవరికి? నిత్యు డగువానికే గదా ముక్తి? బంధమున నున్న వారైనను ఒకానొక కాలమున ముక్తులైన శూన్య మగుదురా?

శూన్యమతము జ్ఞానేశ్వర స్వాములవారికి సమ్మతము కాదు. వారి వాక్యముల నిచట నుదాహరింతును.

"మఱియు నీయాత్మ స్థితిరహితంబై విరాజిల్లు నన్నచో దత్త్వస్త్యభావంబునేనియు దెలియంగల నరుడెవ్వండగు." (అను. 4-26).

"ఇట్లగుచో శూన్యవాదంబున కాధారంబెద్ది యగు? అయ్యది సత్పదార్థవిషయంబున గేవల మసంబద్ధంబగు దోషారోపణంబ యనంజెల్లు." (అను. 4-27).

ఈ విధముగా పదునైదు ఛందములతో శూన్యవాదమును శ్రీ జ్ఞానేశ్వరులు ఖండించిరి.

"దీక్షితులవారు చెప్పిన బట్టబయలు అరూపబ్రహ్మమేనా? అని నీ వడిగితివి. ఇప్పుడు వారి బట్టబయలు ఏదో నీవే నిశ్చయించుకొనుము. దీక్షితులవారు బట్టబయలును అరూపబ్రహ్మమనిగాని, నిష్పత్తియోగిక బ్రహ్మమనిగాని వారెచ్చటను చెప్పియుండలేదు

జిజ్ఞాసువు:- శశవిషాణము, వంధ్యాపుత్రుడు అనునవి శబ్దమాత్రమేగాని భావ పదార్థములు కావను భావము మనకు కలుగుచున్నది కదా? అట్లే శూన్య విషయమున గూడ నేల యూహింపరాదు?

వేదాంతి:- అట్లూహించియే యెవ రెట్టి భావము కలవారో వారట్టి దానినే పొందుదురని తేజో బిందూపనిషత్తునం దిట్లు చెప్పబడినది:-

**మం॥ భావ వృత్త్యా హి భావత్వం, శూన్యవృత్త్యా హి శూన్యతా।**
**బ్రహ్మవృత్త్యా హి, పూర్ణత్వం తయా పూర్ణత్వమభ్యసేత్॥ (1-42)**

తా॥ ఏవృత్తి సభ్యసించినవాడు దానిని పొందుచున్నాడు. శూన్యవృత్తి వలన శూన్యమే యగును. బ్రహ్మవృత్తి నభ్యసించుటవలన బ్రహ్మమే (పూర్ణత్వమే) యగును, కనుక పూర్ణత్వ మభ్యసింపు మని శ్రుతి తాత్పర్యము. మఱియు, ఆశ్రుతియే యిట్లు చెప్పినది.-

**మం॥ భావితం తీవ్రవేగేన యద్వశం నిశ్చయాత్మకమ్।**
**దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మకారేణ చింతయేత్॥ (1-50)**

ఈ మంత్రమునే శ్రీ శంకరులు "అపరోక్షానుభూతి యందు

**శ్లో॥ భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా।**
**పూమాం స్తద్ధి భవే చ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్॥ (140)**

భ్రమరకీటన్యాయము ననుసరించి యెవడు దేనిని తీవ్రముగ భావించుచున్నాడో వా డదియే యగుచున్నాడని భావము.- కనుక దీక్షితులవారి శూన్యమును తలంపరాదని శ్రుతి తాత్పర్యము. దీక్షితులవారి శూన్యము బౌద్ధుల శూన్యము కాదు.

## (౨౭) ఎఱుకకు బయలునకు సంబంధము లేదట

దీక్షితులవారు చెప్పిన బట్టబయలు ఏమీ లేనిదని ఉత్తదని అన్నారు. ఏమీ లేనిది అంటే యేమి? దానికి ఏ విశేషములు లేవనియేనా? "ఉత్తది" అన్నను అదియే అర్థమగును గదా! అద్వైతులు బ్రహ్మము నిర్విశేషమని చెప్పిరి. ఆ వాక్యములనే వీరీరీతిగా చెప్పిరని మనమూహించిన సరిపోవునా? ఉత్త బట్టబయలునకు జ్ఞానము లేదు. అది తనకు తానెఱుగదు ప్రపంచమును అనగా :'ఈ మూలము లేని గుర్తెరిగే శరీరమును" ఎఱుగదు. ఎఱుకే ఎఱుకను, బయలును ఎఱుగుచున్నది. ఎఱుక బయలు నెఱిగి యేమీ లేకపోవుచున్నది. అని వీరి సిద్ధాంతము. ఇందులో గల సంశయమిది:- బయలు నెఱిగిన యెఱుక వెంటనే యేమీ లేక పోవునట గదా! అట్లయిన బయలు కలదని ప్రతీతి యెట్లు కలిగినది? చూచిన యెఱుక వెంటనే నశించెను. ఉన్న బయలు తన ఉనికియే యెఱుగదు - ఈ యంశము లోకమున కెట్లు తెలిసినది?

**"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, (ముండక 3-2-9) ", "బ్రహ్మైవ స బ్రహ్మవిదో "** అని శ్రుతి. అనగా:- బ్రహ్మము నెఱిగినవాడు బ్రహ్మమే అని తాత్పర్యము. పరిపూర్ణమును ఎఱుక ఎఱిగిన దన్నచో ఎఱుక పరిపూర్ణమే కావలెను. ఏలయన పరిపూర్ణము పరిపూర్ణముచే కాక మఱియొక దానిచే ఎఱుగబడిన యెడల పరిపూర్ణము దృశ్యమగును. ఏది దృశ్యమగునో అది నశించును. పరిపూర్ణమునకు నాశము లేదు. కనుక, దాని నదే యెఱుగవలయును. అట్లుగాక పరిపూర్ణము ఎఱుగబడినదన్న దాని నెఱింగిన ద్రష్ట మఱియొక డున్నాడని అంగీకరింపవలసి వచ్చును. అట్లైన ఎఱుగబడిన వస్తువు పరిపూర్ణము కాదు. అది పరిమితమైనదే. పరిపూర్ణమును (బయలును) ఎఱుక యెఱిగినదన్న యిట్టి చిక్కులు అనేకములు కలుగును. ఆత్మ తనను తా నెఱుగలేదని జ్ఞానేశ్వరులవారి సిద్ధాంతము అయినను ఆత్మ శుద్ధజ్ఞాన స్వరూపమేయని అంగీకరించిరి. కనుక జ్ఞానేశ్వరులు చెప్పిన ఆత్మకును, దీక్షితుల వారు చెప్పిన బయలునకును సామ్యము లేదు. రెండును ఒకటి కావు.

ఎఱుక బట్టబయలునకు పుట్టలేదట. బట్టబయలు పుట్టించను లేదట. ఎఱుక యెట్లో వచ్చిన దన్నారు. దాని రాకడ యెవరికిని తెలియదన్నారు. బట్టబయలునకు ఎఱుకకు నెట్టి సంబంధము లేదన్నారు. అంటే-యెఱుక

బయలు యొక్క అంశమని గాని, దాని ఛాయ అనిగాని కాదనియే వారి సిద్ధాంతము. "ఎఱుక కానిది బట్టబయలు". "బట్టబయలు కానిది ఎఱుక" అన్నారు. సరే, దీక్షితుల వారి మతానుసారము సర్వత్ర బట్టబయలే యున్నది కదా! ఎఱుక యెచ్చటినుండి వచ్చినను బట్టబయలు నుండే రావలెను కదా? బయలు లేని చోటు లేదు. అది అఖండము. అఖండము కనుక అద్వితీయము. కనుక ఎఱుక వచ్చినదంటే దానినుండియే రావలెను. అచలమునకు పుట్టిన యెఱుక అచలము యొక్క బిడ్డయే. లేదా, దాని అంశమే. అంశమని అన్నయెడల పరిపూర్ణమునకు పరిచ్ఛిన్నత వచ్చునేమో యని సంశయింపవలదు అట్లు రాదు. ఘటము నందున్న ఆకాశము మహాకాశము యొక్క అంశమే కదా? పరిపూర్ణము యొక్క అంశమే. ఎఱుక (ఆత్మ) అని చెప్పిన సరిపోవును. ఆ విధముగా చెప్పిన అది శ్రుతి స్మృతులకు సమ్మతమే. అది అద్వైతమే అగును. ఏమైనను బట్టబయలు నుండి యెఱుక పుట్టినదని వారంగీకరింపక తప్పదు. కాని దీక్షితులవారు "ఎఱుక పుట్టనేలేదు పుట్టని యీ ప్రపంచము జోడే కూడదు" అన్నాడు. ఎఱుక పుట్టలేదనిన పరిపూర్ణము కలదని యెఱిగినవా రెవరు? ఈ ప్రశ్నకు సమాధానము కలదా? **దీక్షితులవారి అనుయాయు లెవరైన నిందులకు సమాధానము చెప్పగలరా?** ఇట్టి చిక్కులు లేకుండుటకై శ్రీశంకరులు మాయ బ్రహ్మమునకంటె భిన్నమనిగాని అభిన్నమనిగాని చెప్పుటకు వీలులేని దనిరి.

అచలవేదాంతులకు పరమ ప్రమాణమని చెప్పబడు చున్న 'అనంతోపనిషత్తు' నందు:-

శ్లో॥ **బాహ్యమధ్యే చ జాతం తు** బాహ్యమధ్యే చ నశ్యతి
సముద్రే మత్స్య కూర్మాద్యాః యథా చరతి జంతవః।
తథా చరతి బాహ్యశ్చ మధ్యే సర్వ చరాచరమ్
సర్వం బాహ్యగతం నిత్యం అచలం చావ్యయం సదా.॥ (19)

తా॥ సముద్రమునందు పుట్టిన జలచరములు అందే నివసించి అందే నాశమొందునట్లు బయలు **మధ్యమునందు బుట్టిన సమస్త** చరాచరంబులును ఆ బాహ్యమధ్యమందే నివసించుచు అందే లయించుచున్నవి. ఆ బాహ్య మొక్కటియే నశింపక స్థిరముగా నున్నదని నిశ్చయింపవలెను.

**శ్లో॥ యదేవ జాత మిత్యుక్తం తదైవ నశ్యతి శ్రుణు।**
**తస్యాపి కారణం నాస్తి సత్యం సత్యం పునః పునః॥ (21)**

తా॥ ఈ విధముగ జెప్పబడిన ప్రపంచాదులు దేనియందు బుట్టుచుండునో దానియందే లీనమగుచుండును. దానికి (బయలునకు) గారణ మనునది లేదు. ఇదియే సర్వ విధములచేతను సత్యమని యెఱుంగుము.

సమర్థులవారు చెప్పినట్లు ఎఱుక (ప్రపంచము) బయలునకే కలిగినదను వాదమునే పై శ్లోకములు దృఢపఱచినవి. బయలునకు మూలము లేదుగాని జగత్తునకు, ఎఱుకకు మూలము బయలని దృఢపడినది. దీక్షితులవారు అనంతోపనిషత్తునకు విరుద్ధముగా నిట్లనిరి:-

**"ఈ ఉత్త బట్టబయలందు యేమియు పుట్టలేదు. పుట్టిన దనుటకు యేలాగున నోరాడును."** (బృ. పూ. పు. 45)

**"యీ వుత్త బట్టబయలు చెడి యెన్నడు శరీరాకారం కాలేదు, వెనుకటికి కాలేదు. యిప్పటికి కాలేదు. ముందరా కాబోదు. సార్వకాలం రొండోప్రకారం కాక వొక్కతీరుగనే యున్నది. ప్రపంచానకు ఈ ఉత్త బట్టబయలు కారణం కాదు. తానే పుట్టని చావనిది. ప్రపంచాన్ని యేలాగున పుట్టించె."** (బృ. పూ. పు. 121)

**"యీ శరీరం జోలి యీ బట్టబయలుకు పట్టదు. బట్టబయలు జోలి యీ గుర్తెరిగే శరీరానికి పట్టదు."** (బృ. ఉ. పు. 88)

***దీక్షితులవారి యీ వాక్యములు అనంతోపనిషత్తునకే గాక శ్రీజ్ఞానదేవ, సమర్థరామదాసస్వాములవారి సిద్ధాంతములకు సయితము విరుద్ధమని యింకను చెప్పవలయునా?***

నిర్గుణబ్రహ్మము నుండి సగుణజగత్తు కలిగిన దని చెప్పినను, నిర్గుణ బ్రహ్మము జగద్రూపమున పరిణమించిన దనినను, లేదా, ఆత్మయొక్క లీలావిలాసమే జగద్రూపమున అయినదనినను - ఇట్టి సిద్ధాంతములు తర్కము నెదుట నిలువజాలవని (వెనుక ప్ర. 1-19 వ అధ్యాయమున శ్రీశంకరుల అజాతవాదమును గుఱించి చెప్పిన సందర్భమున) విశదీకరించియుంటిని. అచ్చట ఏ కారణములను చూపి పై సిద్ధాంతములు తర్కహత మగుచున్నవని చెప్పియుంటినో ఆ కారణములను పరిహరించుట కష్టమని దీక్షితులవారో,

వారు గురువులో యోచించి యెఱుకకు బయలునకు సంబంధము లేదని, ఎఱుక (ప్రపంచము) బయలునుండి కలుగలేదని క్రొత్తమార్గమును త్రొక్కిరి. ఈ మార్గము దోషము లేనిదని తలచియుందురు. ఈ యూహ శ్రీజ్ఞానేశ్వరాదులకు తెలియదా? తెలియదని తలంచినారు వెఱ్ఱివారు. ఎఱుక యెచ్చటినుండి యెట్లు వచ్చినను సర్వవ్యాపి యగు బయలు నుండియే రావలయునుగాని వేఱు మార్గము లేదని బాలురైనను అర్థము చేసికొనగలరు. దీక్షితులవారి వాక్యము లివి:- **"నీవు అది యెన్నటికి కావు."** (బ్ర. పూ. పు. 109) **"దాని కదే దీని కిదే."** (బ్ర. పూ. పు. 54) కనుక బయలు యెఱుక కానపుడు ద్వైతమే సంభవించెను. దీక్షితులవారు తమ మతము **"మహాద్వైతము"** అని చెప్పుకొనియున్నారు. (బ్ర ఉ. పు. 133)

దీక్షితులవారి మూడు మంత్రములను గుఱించి తగినంత చర్చ జరిపితిమి. అయినను వారి అచలబోధను పూర్ణముగ తెలిసికొనవలెననిన వారికి వైదికమతముపై గల అభిప్రాయమును కూడ కొంత తెలిసికొనుట మంచిది.

## (౨౮) దీక్షితులు చేసిన వేదనింద

ఒకచోట దీక్షితులవా రిట్లు వ్రాసిరి:-

"పురాణాలు అప్రమాణమే. పరమాత్మవలన అహంకారము పుట్టనే **లేదు. పుట్టని అహంకారము వలన, పుట్టినవి లేని తామస పురాణాలు అప్రమాణం. వేదములు వట్టి మాయ. మాటలు యేలాగున అబద్దమో అలాగే అబద్ధం. యీ ఉత్తబట్టబయలే సత్యం. పుట్టలేని ప్రపంచమే అసత్యం. మతాలు అడవి త్రోవ. చీ తలచరాదు.** (బ్ర. పూ. పు. 171)

"ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి బ్రహ్మ, **అయమాత్మాబ్రహ్మ"** మని వేదవాక్యములు నాలుగు గలవనియు, **అవి** గురూపదేశముగ విచారించవలెనని చెప్పుచున్నారు. **అదే ముందుగా** విచారించెదము. ఆ మహావాక్యమునకు చిగురుకొమ్మ కాయలుగా ఎంత **అర్థమున్నను** క్రియాపర్యవసానము బ్రహ్మమే నీవు, నీవే బ్రహ్మమని చెప్పుచున్నది. ***ఇందుకే తామసము గలుగుచున్నది.*** ఇది విచారించినచో

ఆకాశమును పిడికిట బట్టి పదే పదే పొడచినట్టుగాను, ఆకలిగొని పొట్టదంచుకొన్నట్టుగాను గొంగడిలో అన్నము దిని దాహమై ఎండమావులు జూచి పరుగులెత్తినట్టుగాను నున్నది. గాని సంతోష మేమియు కనపడలేదు."
(బృ. పూ. పు 132)

"శృతి॥ అయమాత్మా బ్రహ్మ అనే శృతి అబద్ధమాడించి ఛీ ఛీ అలాగున అనరాదు. *వేదవాక్యం మహా ప్రమాణమైంది. యీ గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే పరా ప్రకృతి అధిష్ఠానం గనుక యీ గుర్తెరిగే చైతన్యమనే చిత్ ప్రకృతి సాక్షిణీ గనుక .... .... "
(బృ. ఉ. పు. 153)

"న గురోరధికం" అని శాస్త్రములయందు కలదు. శాస్త్రములు సిద్ధాంతములే. శాస్త్రదృష్టము కలుగవలెను. శాస్త్రదృష్టము లేని గురూపదేశము యెన్నడు చేయరాదు.
(బృ. పూ. పు. 39)

మఱియొకచోట అరూఢునకు శాస్త్రములతో పనిలేదనియు, ఆరురుక్షువునకు మాత్రమే శాస్త్రములతో అవసరమనియు, దీక్షితులవారు చెప్పియున్నారు.
(బృ. పూ. పు. 140).

ఇట్లు పరస్పర విరుద్ధాంశము లనేకములు గలవు.

## (౨౯) మత నిరసన

మతమునందలి కర్మానుష్ఠానమును గుఱించి దీక్షితులవారి అభిప్రాయము:-

"నోట ప్రసంగాలు మొదలుపెట్టితే బడి చదువుకో లెస్సా; చదువు నేర్చుకోవయ్యా! నేర్చుకొని అనంతమైన వేదాలు చదువుకో; శాస్త్రాలు చదువుకో; యజ్ఞాలు చెయ్యి. చేయించు; మహాపెద్దలు అనిపించుకో; కుక్కలవలె మొరుగు. గాడ్దెలవలె కుయ్యి. పందులవలె చూచింది అల్లా యెగబడి తిను. ఆవులవలె వుచ్చ త్రాగు. పేడ తిను. కాశీ రామేశ్వరం పో; తీర్థాలు చేస్తూ వుండు. కొనకు కుక్కకు యేది గతో నీకూ అదేగతి. యీ భ్రాంతిలేని రాజమార్గం

* "ఛీఛీ అలాగున అనరాదు. వేదవాక్యం మహాప్రమాణమైంది." అను వాక్యములు వేదములను హేళనచేయుటయే గాని వేదములు ప్రమాణములని అంగీకరించుట కాదని స్పష్టమే వేదశాస్త్రములను అప్రమాణములని అనరాని మాటలన్నియు అని తిరిగి పై విధముగా చెప్పిరి కాన వేదప్రమాణ మంగీకరించిరని భావింపరాదు.

సాధనలుచేత సాధ్యంకానిది. విచారణచేత అతి సులభమైంది.
(బృ. ఉ. పు. 137, 138)

భగవదవతారముల గుఱించి దీక్షితులవారి అభిప్రాయమిది:-

ఈ ఉత్త బట్టబయలు వలన భగవానులు పుట్టనే లేదు. పుట్టని చావని వాడని గీతల్లో వుండనే వున్నది. *పుట్టని చావనివాడు అయోధ్యలో యేలాగు పుట్టె. పదహారువేల గోపికలు* అష్టభార్యలు అనే మాటకు మూలం లేదు.* (బృ. పూ. పు. 169)

ధర్మశాస్త్రములయందు చెప్పిన ప్రాయశ్చిత్తాదులను గుఱించి దీక్షితులవారి అభిప్రాయము.

"తిన్నదల్లా అన్నమే; వెల్లిందల్లా పురీషమే కాని మనిషిది భ్రష్టుది. గోవులది, బఱ్ఱెలది, ఎడ్లది, దున్నపోతులది, మేకలది, గొఱ్ఱెలది పనికి వస్తుంది. గోవులది శ్రేష్టమని శాస్త్రం పేడ తినిపించింది. మూత్రస్రావం చేయించింది. చేయరానివి ఎన్ని వున్నాయో అన్నీ శాస్త్రాలచేత మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే చేసి చేయించింది. పుట్టని చావని బట్టబయలు ఏమీ చెప్పలేదు. ఏమి చెయ్యదు." (బృ. ఉ. పు. 99)

దీక్షితులవారు హిందూమతమును నిందించిన విధమును చెప్పితిని. శ్రీ కృష్ణభగవానుడు ఇందుకు విరుద్ధముగా భగవద్గీతయందు చెప్పిన వాక్యముల వివరింతును:-

శ్లో॥ సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత।
కుర్యా ద్విద్వాంస్తథా ఽ ఽ సక్తశ్చికీర్షు ర్లోక సంగ్రహమ్॥

**(గీత. 325)**

తా॥ అర్జునా! అనాత్మజ్ఞులు కర్మమునందే ఆసక్తులై ఏప్రకారముగా కర్మలను చేయుచున్నారో ఆ ప్రకారముగా జనులను దుర్మార్గప్రవర్తనమును నివారించుటకు యత్నించిన ఆత్మవేత్త సంగవర్జితుడై కర్మలను చేయవలయును.

---

* పదునాఱువేల క్షత్రియ కన్యలను భగవానుడు వివాహమాడినట్లు పురాణములయందు చెప్పియుండగా దీక్షితులవారు పదహారువేల గోపికలని వ్రాసిరి. ఇది తప్పు.

శ్లో॥ న బుద్ధి భేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్॥ (గీత.3-26)

తా॥ ఆత్మవిదుడు, కర్మమం దాసక్తికలిగిన అవివేకులను వారి బుద్ధికి చలనము కలుగునట్లు (అనగా కర్మలను నాస్తికబుద్ధితో వదలుకొనునట్లు) చేయగూడదు. అట్లు చేసినయెడల కర్మలను వదలుటవలన పుణ్యఫలమును లేనివారై, జ్ఞానహీను లగుటవలన తత్త్వజ్ఞానమునకు దూరులై రెంటికిని చెడినవా రగుదురు. విద్వాంసుడు సయితము కర్మలయం దాసక్తి కలవానివలె కర్మలను చేయుచు వారివలన కర్మములను చేయింపవలయును.

ఈ విధముగా భగవద్గీతకు దీక్షితులమతము ప్రత్యక్షవిరుద్ధము. సమాజమునకు నాశము చేకూర్చునదియని అర్థమగుచున్నది.

## (30) రాజయోగ నిరసన

రాజయోగమును గుఱించి దీక్షితులవారి అభిప్రాయము ఈ క్రింద కనబరచిన విధముగా నున్నది:-

"యోగాభ్యాసం చేసెనా గుర్తెరిగే దొమ్మరివానివలె సాధించి వొక్కనాడు పడి చస్తాడు." (బృ. పూ. పు. 58)

"రాజయోగసమాధి లేక హఠయోగము సిద్ధించదు. హఠయోగములేక రాజయోగము సిద్ధించదు అని వేదాంత వార్తికము మొదలైన గ్రంథములయందు చెప్పబడుచున్నది. రాజయోగమనగా సంసారమున నుండి దారాపుత్రాదుల సంరక్షణ చేయుచు ఎరుకను మరువక ఎరుకే నిత్యమని తలచుచూ దేహ శక్తి వదిలి మనోలయము చేయుచుండుట రాజయోగమని చెప్పుదురు." (బృ. పూ. పు. 130)

"అనగా ఈ సుఖదుఃఖములు ఎటులైనను దప్పవుగాని, పైనుండి యోగాభ్యాసము వలన కలిగే అయాసములను ఎందుకు పొందవలెను. యోగాభ్యాసమువలన అయాసము గలుగునా యనిన యెడల గలుగును. ఎలాగున అనగా,

"అహారనియమమువలన క్షుద్బాధ మొదటి అయాసము, ఇచ్ఛావిహారముగా దిరుగుచుండేవానికి దేహము నిక్కబెట్టి కదలక కూర్చుండుట వలన

దేహాయాసము కలుగును. కనులు, ముక్కు మొదలైనవి మూసికొనుట వలన కనులకు విరోధము. కనుక యోగాభ్యాసము వలన దుఃఖములు కలుగును కదా? ఆనందము గలుగు ననుటకు ఆ యానందము అతనికేమి దృష్టమోకాని ప్రపంచమునకు ఏమియు కనపడదు. ఆనందపరుడని యందురు. *విషయానందమునే ఆనంద మనవలె గాని బ్రహ్మానందము లేనేలేదు.* ఎందుచేతననగా బ్రహ్మమునకు రూపమైన కలదని ప్రతిపాదించితే ఆ రూపమైనా చూచి ఆనందపడుచున్నారని అనవచ్చును."

(బృ. పూ. పు. 131, 132)

"యోగసాధనములు రోగాస్పదములు." (బృ. పూ. పు. 154)

## (3౧) శ్రీ శంకరాచార్యాదుల నిందించుట

శ్రీ శంకరాచార్యుల యందును, అద్వైతము నందును దీక్షితులవారికి గల ద్వేషము, నిరసన యీ క్రింద వివరించితిని:-

"శంకరాచార్యులవారికి అహంభావము లేదు. శివో హమ్మనుట వాచ్యార్థము." (బృ. పూ. పు. 18)

"శంకరాచార్యులవారేగదా అద్వైత స్థాపన చేసినది. వారికి అహంకారము వదలలేదు." (బృ. పూ. పూ 33)

ప్రథమమున అ ద్వైతస్థాపన చేసినవారు శ్రీ శంకరాచార్యులవారు కాదు. వారికంటె పూర్వమే ప్రసిద్ధిగాంచిన ప్రస్థానత్రయమునకు, శ్రీ శంకరులు అద్వైతపరమగు భాష్యములను రచియించి, అ ద్వైత మొక్కటే సంసారమునుండి తరించుటకు తరణోపాయమని ప్రచారము చేసిరి. ఈ సందర్భమున శ్రీ వివేకానందస్వాములవారి వాక్యములను ఈ క్రింద నుదాహరింతును.

"శంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతమునకు మూలకర్త యని మీరు తలంప గూడదు. ఏది శంకరాచార్యులు పుట్టుటకు పూర్వము యుగాంతరములనుండి వచ్చుచున్నదో దాని తుదిప్రతినిధులలో ఈయన ఒకరు." (వి. సం. గ్రం. వేదాంతము. 6-430)

ఈ సత్యము సామాన్య వేదాంతికి సయితము తెలిసియుండగా దీక్షితులవారికి తెలియకపోవుట దురదృష్టకరము.

గురుశిష్యసంవాద రూపమున వా రిట్లు చెప్పిరి :-

"గురువు - ఓయి శిష్యుడా! నేను బ్రహ్మను, నేనే శివుడను, నేనే విష్ణువును, నేనే జగత్తును, నేనే గురువును, నేనే శిష్యుడను, అన్నియు నేనే అని యనుట ఎటువంటిది. కనుకనే ఆత్మస్తుతి యనిపించుకొనెను. ఆత్మస్తుతి యనగా ఇంతకన్నను వేరుగలదా? నేను శివుడను, నేనే దేవుడను, నేను బ్రహ్మను అని యనుట ఆత్మస్తుతి గాదా! అది అహంవృత్తి గాదా! తానే బ్రహ్మదేవుడా? సకల జగత్తును తానే కల్పన జేయుచున్నాడా? తానే విష్ణువా? అందరిని తానే పోషించుచున్నాడా? తానే శివుడా? అందరిని తానే లయము చేయుచున్నాడా? అందరిని తానే లయము చేయువాడైతే తన మనోలయమునకు ఇన్ని అగచాట్లు ఎందుకు? తానే బ్రహ్మమని అంటున్నారు గదా? బ్రహ్మము నిర్వికారుడు గదా? నిర్వికారునకు నేనను వృత్తి లేదుగదా? అయితే నే ననేవృత్తి బ్రహ్మమైన తనకు ఏలాగున గలిగెను? ఈ మొదలైన సందేహములచేతనే వేదాంతము ఆత్మస్తుతి యని చెప్పుచున్నాను .... ...."

(బృ. పూ. పు. 134)

మహావాక్యముల అర్థమును గుఱించి దీక్షితులవారి వాక్యములు ఇదివఱకే (౨౮ వ అధ్యాయమున) చెప్పియుంటిని. వానిని పై వాక్యములతో కలుపుకొని విచారించిన యెడల పూర్వ మొకనికి "రామాయణ మంతయు వినిన పిమ్మట సీతకు రాము డేమికావలయును" నన్న సంశయము కలిగెనట. ఆవిధముగనే దీక్షితులవారి వాక్యముల వలన వీరికి అద్వైతము (వేదాంతము) తెలియునా? తెలియదా? అను సంశయము కలుగుచున్నది.

శ్రీ శంకరులవారు 'శివో ౾హం' అనుట అహంకారము కాదు. ఏలయన:- 'కాలటి' అను గ్రామమున నంబుద్రీ బ్రాహ్మణకుటుంబమున 'శివగురు' వను తండ్రికి 'సతి' అను తల్లికి జన్మించి శంకరాచార్యులను నామధేయము గల నేను (వ్యక్తిని) మాత్రమే శివుడను, ఇతరులు అనగా- ప్రపంచమునందున్న యెవరును శివుడు కాడు" అని శ్రీ శంకరులు చెప్పియుండిన అది అహంకార మనబడును.

కాని, శంకరుల వారిట్లు ఎచ్చటను చెప్పియుండలేదు. వారు చెప్పిన దాని తాత్పర్య మేమనగా :- 'అహం' శబ్దవాచ్యుడైన జీవుడే శివుడు. ఉపాధి

భేదము తప్ప స్వరూప భేదము లేదు అట్లే ఆత్మకును పరబ్రహ్మమునకు భేదము లేదనిరి. ఇది శంకరుల వారి కల్పన కాదు. శ్రుతి ప్రసిద్ధమగు విషయము. 'నేనే మనువును', 'నేనే సూర్యుడను' అని వామదేవమహర్షి ప్రతిపాదించెను. ఈ విషయము బృహదారణ్యక శ్రుతి ప్రథమాధ్యాయము 4వ బ్రాహ్మణమునందలి 10వ మంత్రార్థమును చూచిన బోధపడును. శ్రీ జ్ఞానేశ్వరుల మతము సయితము సర్వము ఆత్మయే యని కదా? చెప్పిరి.

'శివో ఽహం' అన్నది ఒక్క శంకరులవారేనా? 'అహం బ్రహ్మాస్మి' - నేనే బ్రహ్మమును-అను మొదలగు మహావాక్యములు శంకరులవారు కల్పించినవి కావు. అవి శ్రుతివాక్యములు. అవి శ్రీ శంకరులకేగాక మతాచార్యుల యం దనేకులకు ప్రమాణములే. బ్రహ్మసూత్రమునకు శివాద్వైతపరమగు భాష్యమును రచియించిన శ్రీ కంఠాచార్యుల వారు మహావాక్యములు బ్రహ్మోపాసనకు సాధనములని అంగీకరించియున్నారు.

ఉపనిషత్తులయందలి 'అహంగ్రహోపాసన' నుగుఱించి దీక్షితులవారు వినియుండరు. 'యద్భావం తద్భవతి'- ఎవడు ఏభావముతో ఎల్లప్పుడు గాఢముగా (తీవ్రవేగముతో) దేనిని తలంచునో అతడు అదియే (ఉపాస్యవస్తువే) అగుచున్నాడని పెద్దలన్నట్లు పై యుపాసనవలన పాపవిముక్తియు, జన్మరాహిత్యమును కలుగును. దీక్షితుల వారికి నీ విషయము తెలిసియుండదు. తెలిసియుండెనేని సుప్రసిద్ధులగు శ్రీ శంకరాచార్యాదులను వదలి ఒక్క శంకరులవారినే యుక్తాయుక్త విచక్షణ లేక యేల విమర్శింతురు? శ్రీకంఠ శ్రీరామానుజు లిరువురును మోక్షదశయందు అహంకారముండు ననిరి. అహంకారము - ప్రాకృతము, దివ్యము (అప్రాకృతము) అని రెండువిధములు. ప్రాకృతాహంకారము దేహాదుల నాధారముగా చేసికొని యుండును. పరమేశ్వరుడను నేనే అనిగాని లేక నేను పరమేశ్వరుని అంశమనిగాని మోక్షదశయందుండు అహంకారము దివ్యము. ఈ అప్రాకృతాహంకారమునకు నాశనము లేదు. ఇది ముక్తిప్రదమని పై ఆచార్యుల అభిప్రాయము. ఈ యర్థము నెఱుంగక దీక్షితులవారు మఱియు నిట్లనిరి:-

**"శంకరాచార్యులు దేహాది పదార్థాలను గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే పరాప్రకృతిని ఆత్మ అని అబద్ధమాడి యీ ఆత్మ బ్రహ్మ స్వరూపమని అన్నాడు. శ్రుతి *'అయమాత్మా బ్రహ్మ*మనే *అబద్ధాల శ్రుతిని ముందర***

*బెట్టినాడు'* జ్ఞాన స్వరూపం నిబద్ధి ఖర్మాలు అబద్ధం అని యెందుకు మొరగవలె?- గుర్తెరిగే చైతన్యము నిర్గుణం శరీరాలు సగుణం అని *యెందుకు కుయ్యవలె?"*
(బృ. ఉ. పు. 79)

"ఇటువంటి అప్రమాణంవలన యేమి లాభమోగాని బహు శ్రమపడ్డాడు. దీనినుంచి ప్రజలకు సుఖము లేకపాయ, తనకు మహాపాపం ఘటించె. జగత్తుకు కారణం వున్నదని అబద్ధం ఆడి అందరినీ అడవిలో కలిపిరి. సంకర్లు చేసిరి. సంకర్లు నొకటే అని గుర్తెరిగే చైతన్యం నిబద్ధి అని దేహాదులు యేమీ లేవని సంకర్లు చేసిరి. గుర్తెరిగే చైతన్యం ఒకటే అని నమ్మినవారికి నరకము తప్పకపాయ. స్వర్గం యిటువంటిదే శరీరాలు కల్ల వొక్కటే. శభాషు శంకరాచార్యులవారు జ్ఞానం నిబద్ధి కర్మాలు అబద్ధం అంటే గుర్తెరిగే జ్ఞానం వున్నంతసేపు కర్మాలు వదలనే వదలవు." (బృ. ఉ. పు. 80)

"యింతేకాని శరీరం లేని గురుసాంప్రదాయం వున్నదని యెరుగక అద్వైతమనే అడవిలో పులిని దొరికించుకొన్నట్లు దొరికించుకొని గుర్తెరిగే సచ్చిదానందం, నేను అనుకొంచూ మునుపటికంటె రాగద్వేషాలు అధికమై అడవిపట్టె. శరీరమనే గుహలో పెద్దపులివలె. గుర్తెరిగే శరీరం నేను అని లెస్సా గుర్తెరిగి ఆవులు రాంగానే ఆవులను గుర్తెరిగి కదలక మెదలక గుండు క్రింద నతికి తప్పున పశువులను దొరికించుకొని పలహారం చేస్తూ వున్నట్లు యీ శరీరంలో గుర్తెరిగే చైతన్యం నేను అని నిశ్చయం గలవారు ప్రజలను క్లేశపెడుచారు. చైతన్యం చెయ్యదు. చేయించదు అనుకొంచూ సర్వము గుర్తెరిగిన తర్వాత చేస్తూ వుంచాడు. మధ్య మధ్య నాకు కర్తృత్వం లేదు అని అనుకొంచూ శంకరాచార్యులవారి సిద్ధాంతం దొడ్డిది అని అనుకొంచూ నరకమనే శరీరంలో గుర్తెరిగే చైతన్యం నేను అనుకొని పుట్టలో పామువలె వొక్కపెట్టెలో పామువలె బుస్సూబుస్సూ మని అనుకొంచూ కాలం గడిపేవారేగాని నిజం విచారించిన పెద్దలు లేరు." (బృ. ఉ. పు. 98)

## (3౨) సీతాదేవిని నిందించుట

"...రావణాసురుడు సన్యాసివేషం వేసుకొని స్త్రీని దొంగలించుకొని పోయినాడు. మూఢులకు దొడ్డది సీత. భ్రాంతి రహితులకు యేమీ లేదు. సీత మూఢురాలు. గనుక సన్యాసి అని భక్తిచాత వుంటే యెత్తుకపోయినాడు.

సన్యాసము మొద్దులకు, మొద్దుసన్యాసిని నమ్మరాదు. మనిషిని కుక్కనుచేసి రాత్రి దానితో సంసారముచేసి మళ్ళీ కుక్కను చేస్తాడు. సర్వాత్మన సన్యాసిని నమ్మరాదు. తమరు చెడి యితరుల చెరిచేవాండ్లు, ఛీ ఛీ. సన్యాసులను స్మరించరాదు. జగత్తునకు కారణం వున్నదన్న వారి పాపం రెండోవానికి లేదు." (బృ ఉ. పు. 80, 81)

దీక్షితులవారికి సన్న్యాసులపై గల కోపము సీతమ్మ వారిపై చూపిరి. సన్న్యాసిని గౌరవించడమే అమ్మవారు చేసిన తప్పట. ఈ వాక్యములు ఒక వేదాంత సంప్రదాయమునకు చెందిన గురుపీఠము నధిష్ఠించి అచలమత స్థాపకులని ప్రసిద్ధికెక్కిన వ్యక్తి (దీక్షితులవారు) చెప్పవలసినవి కావు. మనదేశ ప్రజలు అనేకవేల సంవత్సరములనుండి సన్న్యాసులను గౌరవించుట ఆచారమై యున్నది. సీతాదేవియే ప్రథమమున సన్న్యాసిని గౌరవించు సంప్రదాయమును నెలకొల్పియుండలేదు. సన్న్యాసి యోగ్యుడా? కాదా? అని తెలిసికొనవలయునన్న అతనితో సంభాషించిన అనంతరమే గదా నిశ్చయము కలుగును.

ఒక మూఢురాలగు స్త్రీ సుమారు సంవత్సరకాలము నిరాహారియై జలపానమైనను చేయక నిద్రలేక మహాపాపాత్ములమధ్య శీలసంరక్షణ చేసికొనుచు భర్తృనామ స్మరణముతో బ్రతికియుండగలదా? సర్వమును దహించు అగ్ని సహితము ఆమెనుగాని, ఆమె ధరించిన వస్త్రమునుగాని దహించుటకు శక్తిలేకపోవుట, అగ్ని దేవుడే స్వయముగా రూపము గైకొని సీతమ్మను పరమపావని యని చెప్పుట - యివి సామాన్యులకు గాని మూఢులకు గాని సాధ్యమా? ఇట్టి అతిమానుషమైన కల్యాణగుణములు గల మహాతల్లి సీతాదేవి, సీత లోకమాత యని శ్రుతులు, స్మృతులు, పురాణములు, కావ్యములు వాల్మీకివ్యాస కాళిదాసాది మహనీయులు చెప్పియుండగా వీ రందరు మూఢులా? దీక్షితులవారు సీతాదేవియొక్క సమగ్ర చరిత్రమును చదివియుండరు. శ్రీమద్రామాయణమునందలి ఉత్తరకాండయందు 17వ సర్గమున వేదవతి చరిత్ర కలదు. ఆ కథను సంగ్రహించి చెప్పెదను.

కన్యయగు వేదవతి, భగవంతుడు శ్రీమన్నారాయణుడు తనకు భర్త కావలెనని మహాతప మాచరించుచుండెను. ఎట్లో రావణు డామె ఆశ్రమమునకు వచ్చెను. అమె రావణున కాతిథ్య మిచ్చి తనవృత్తాంతము వాని కెఱింగించెను. రావణుడు వేదవతియొక్క నిరుపమాన సౌందర్యమును చూచి కామమోహితుడై

తన్ను వివాహమాడుమని కోరెను. వేదవతి తాను భగవంతుడగు నారాయణుని తప్ప అన్యుని వివాహ మాడనని వానిని తిరస్కరించి అచటనుండి వెడలిపోవుచుండ రావణు డామెను పట్టుకొనబోయెను. వాని చేతికి వేదవతి కేశముల (జడల) చివఱ (కొన) భాగము చిక్కెను. వేదవతి తనచేతిలో రావణుని హస్తమునందు చిక్కిన కేశములను ఖండించి రావణునితో "నిన్ను శపించి యిప్పుడే అంతమెందింపగలను. తపోవ్యయ మగునని భీతిచే శపింపక వదలుచున్నాను. నేను నీ వినాశమునకు అయోనిజనై జన్మించి శ్రీమన్నారాయణుని వివాహ మాడుదును" అని చెప్పి మహాగ్నిజ్వాలయందు ప్రవేశించి దగ్ధ మయ్యెను.

కొంతకాలమునకు లంకానగర సమీపమున ఒక పద్మమునందు వేదవతి జన్మించెను. విధివిలాసమున రావణు డా పద్మమును నందున్న సర్వశుభ లక్షణసంపన్నమగు శిశువును చూచి ఆ పద్మమును లంకకు తెచ్చి తన సచివునకు చూపెను. వాడును ఆ శిశువును చూచి 'ఈమె నీ యింట నుండిన నీకు మృత్యువు తప్పదని' యెను. రావణు డా శిశువును సముద్రమున పారవైచెను. ఆమె మహాద్భుత శక్తి సంపన్నురాలు కనుక సముద్రమును దాటి భారత భూమియందు భూమిలోపల నుండియే మిథిలానగర ప్రాంత ప్రదేశమందు చేరి, అందుండెను.

జనకరాజు భూమిని దున్నుచుండ నాగేటిచాలున ఆ శిశువు కనిపింపగా ఆమెకు సీత యను నామకరణమిడి పుత్రికగా పెంచెను.

వేదవతి మొదటి సంకల్పము సిద్ధింప రాముడై యవతరించిన శ్రీమన్నారాయణుని వివాహమాడెను. రెండవ సంకల్పము సిద్ధించుటకు సీతమ్మ లంకానగరమును చేరవలసియుండెను. విధివిలాసమున రావణుడే సీతమ్మను లంకానగరమునకు కొని చని సర్వనాశము పొందెను. తొలుత వేదవతి అగ్ని ప్రవేశము చేసెను. సీతారూపమున మరల అగ్నియందు ప్రవేశించెను.

సీతారాములు మానవవేషధారులై తమ పాత్రలను జగన్నాటకరంగమున చక్కగా అభినయించిరి. ఈ కథను నమ్మినవారు ధన్యులు-మాన్యులు. సీతాదేవి చరిత్రను పూర్ణముగ అర్థముచేసికొన్నవారికి ఆ కథయందలి గంభీరతయు తత్త్వమును బోధపడును. సీతాదేవిని గుఱించి విపులముగ చెప్పుట కిచట చోటు లేనందున చింతిల్లుచు చెప్పుటకు మానుకొంటిని. దీక్షితులవారికి

సీతారాముల తత్త్వ మిట్టిదని తెలిసికొనగలుగు శక్తి లేదు. పాపాత్ముడును, లోకకంటకుడును నగు రావణుని నిందింపలేదు. సరికాదా- రావణుడు బయలును ఎఱిగియున్నట్లు వ్రాసిరి.

**"శంకరాచార్యులవారి అద్వైతము, రామానుజాచార్యులు వారి విశిష్టాద్వైతం సర్వం వారితోటే పోయింది. వున్నది ద్వైతాద్వైత రహితమైన పరమతత్త్వం. దశముఖుడు వేరే అన్నట్టు. యెక్కడబడితే అక్కడ బట్టబయలు వున్నది. ఈ గుర్తెరిగేది లేకుంటే యేలాగున్నదో అలాగే వున్నది."**

(బృ. ఉ. పు. 29)

ఎక్కడబడితే అక్కడ బట్టబయ లున్నట్లు రావణునకు తెలియునని అర్థమగుచున్నది. నేను చెప్పిన అర్థమే సరియైనచో రావణుడు బట్టబయలును చూచినాడని ఆయన అచలవాది అని తలపవచ్చునా? మహాత్ములకు సైతము దుర్లభమగు తుర్యాతీతమును రావణుడు పొందినాడా? రావణుడు శివుని స్తుతించి ఆయనవలన చంద్రహారమును పొందినందున వీరశైవులు రావణుని శివభక్తులలో చేర్చుకొనిన చేర్చుకొందురుగాక, కాని రావణుడు పరిపూర్ణ మెఱుగునని, తత్త్వజ్ఞాని యని యెవరును చెప్పలేదు. శివుడు సతీదేవితో రావణుడు పాపాత్ముడని చెప్పినట్లు శివపురాణమున గల యీ క్రింది పద్యమువలన తెలియగలదు.

**శా॥ "పాపాత్ముండగు పంక్తి కంతునకు బల్ భాగ్యంబు లర్పించి"**

(ఆంధ్రశివపురాణము. సతీఖండము, 1-235)

రావణుడు పరిపూర్ణ మెఱుగ డనుటకు దీక్షితులవారు వేఱొకచోట **"అహంకారమును వదలకనే రావణాసురుడు నశించి పోయెను."** (బృ. పూ. పు. 19) అని చెప్పిరి. అహంకారము వదలనివాడు పరిపూర్ణ మెట్లెరుగును? ఇట్టి పరస్పర విరుద్ధమగు వాక్యములు దీక్షితులవారి గ్రంథమున అనేకములు కలవు.

## (33) బ్రహ్మాదులకు అహంకారము కలదట

మనదేశమునందు గల సమస్త సంప్రదాయముల వారికిని గురువునందు భక్తి కలిగియుండుట అందఱు ఎఱిగిన విషయమే. దీక్షితులవారి

సంప్రదాయమునకు చెందిన వారి యందు గురుభక్తి మెండు. ఏ సంప్రదాయమువారైనను తమ గురుపరంపరను బ్రహ్మదేవునుండిగాని, విష్ణుదేవునుండిగాని, శివునినుండిగాని, దేవినుండిగాని, దత్తాత్రయులనుండిగాని వచ్చినదని చెప్పుదురు. బ్రహ్మాదులు గురువునకు గురువులు. ఆ యా సంప్రదాయమువారికి ఆది గురువులు. దీక్షితులవారు తమ గురుభక్తిని నీ విధముగ ప్రకటించిరి:-

**"అహంకారము విష్ణువునకు గలదు. బ్రహ్మకు అంతకన్న గలదు. శివునికి చెప్ప శక్యము గాదు. ముప్పైమూడు కోట్ల దేవతలకున్నూ గలదు. గురువునకు మాత్రము లేదు."** (బృ. పూ. పు. 71)

**"గురువుకన్నను దైవము హెచ్చని పలుకకూడదు. దైవముకైన అహంకారము గలదు గాని గురువు కెన్నటికి అహంకారము గలుగదు."** (బృ. పూ. పు. 20)

ఈ వాక్యములవలన త్రిమూర్తులు దేవతావ్యక్తులని దీక్షితులవారి నమ్మకమైనట్లు దృఢపడినది మంచిదే. దీక్షితులవారి గురువుకంటె త్రిమూర్తులు తక్కువవా రెట్లయిరి? త్రిమూర్తులు బయలును చూడలేదనియేనా? పురాణముల యందలి కొన్ని గాథల నాధారముగా గొని త్రిమూర్తులకు అహంకారము కలదని వారట్లు చెప్పియుందురు. అంతేకాని దీక్షితులవారికి త్రిమూర్తులతో సాక్షాత్పరిచయము లేదు కదా?

భాగవతము దీక్షితులవారికి సమ్మతమైన గ్రంథము కదా! అందు మహర్షి వాక్యములుగా నిట్లున్నది:-

**క॥ సత్యము ప్రభువుల వచనము**
**నిత్యము దద్వచన వీథి నిలుతురు పెద్దల్**
**సత్యా సత్యము గావున**
**సత్యమనుచు జనరు వారి చరితమున నృపా! (ద. పూ. 1109)**

ఈ పద్యమునందలి భావ మేమనగా:- ప్రభువులగు బ్రహ్మాదులు ఏది చెప్పుదురో అది అంతయు సత్యమే. అందులో లేశమయినను అసత్యము కలదని శంకింపరాదు. ప్రభువుల వాక్యములే ప్రమాణమని భక్తితో

నడచుకొనవలయును. కాని, ప్రభువులు ఇట్టి కార్యములు చేసిరన ఇతరులుకూడ అట్టి కార్యములు చేయరాదు. అనగా: ప్రభువుల వృత్తమును ఆదర్శముగా గొని నడచుకొనరాదు. ఏల? వారి చరిత్రము సత్యము-అసత్యము, కూడ. కనుక వారి చరిత్రము సత్యమే యని వారివలె మనమును నడుచుకొనుట తగదు. పెద్ద లట్లు నడువరు.

దీక్షితులవారి గురుపరంపర సాందీపని శ్రీకృష్ణుల నుండి వచ్చినట్లు చెప్పిరి. బ్రహ్మాదులకంటె సాందీపని గొప్పవారా? సాందీపనికి కోరికలు లేవా? ఎప్పుడో మృతిజెందిన అతని (సాందీపని) పుత్రుని గురుదక్షిణగా తెచ్చియిమ్మని బలరామ శ్రీకృష్ణులను కోరలేదా? ఇది కోర్కె కాదా? దీనివలన అహంకార మమకారములు ఉన్నట్లే కదా? లేకపోయిన లోకమున నెందఱు తండ్రులు తమ పుత్రులను కోలుపోలేదు. వారి పుత్రుల నందఱిని బ్రతికించి తెచ్చియిమ్మని సాందీపని యేల కోరలేదు? అందఱు తండ్రులు తనవలెనే పుత్రశోకమును అనుభవించినవారే గదా. ఇది మమకారము కాదా? మమకారము అహంకార వృక్షముయొక్క శాఖయేగదా? బ్రహ్మదేవుడు ఒక్క భూరేణువును గైకొని అందుండి కోటి సాందీపనులను సృష్టించలేడా?

బ్రహ్మాదులకు గల అహంకారము వేఱు. అది వారికొక లీల. అవిద్యాదోషముగల మానవుల అహంకారము వేఱు. దీక్షితులవారు ఈ మాత్రము తాత్త్వికాంశములను వదలి త్రిమూర్తుల గుఱించి తెలియక యిట్టి మాటలాడిన హిందూమతేతరులు వ్రేలెత్తి చూపి 'మీ దేవత లిట్టివారని మీరే చెప్పుచున్నారే' అని హేళన చేయుదురు, దీనివలన నింతకంటెను వేఱొక ఫలము సిద్ధింపదు.

త్రిమూర్తులతో ఒకరగు బ్రహ్మదేవుని ఒక దేవతావ్యక్తిగా దీక్షితులవా రంగీకరించిరి. కనుక, బ్రహ్మదేవుని యొక్క యోగ్యత యెంతటిదని పురాణములు వచించెనో దీక్షితులవారు ఆ విషయమును తెలిసికొనవలసిన బాధ్యత కలదు. బ్రహ్మదేవుని గుఱించి పద్మపురాణము ముఖ్యముగా చెప్పినది. అది యట్లుండ భాగవత పురాణమునందలి ద్వితీయ స్కంధమున 5వ అధ్యాయమున బ్రహ్మదేవుడు నారద మహర్షికి తన్ను గుఱించి చెప్పిన వాక్యములయందు పోతనగారి పద్యమొకటి యుదాహరింతును:-

సీ|| ఇది యంతయును నిక్కమే బొంక నుత్కంఠ
మతి దద్గుణ ధ్యానమహిమజేసి
పరికింప నేనేమి పలికిన నదియెల్ల
సత్యంబయగు బుధస్తుత్య! వినుము
ధీ యుక్త! మామకేంద్రియములు మఱచియు
బొరయవ సత్యవిస్ఫురణ మెందు
నదిగాన మత్తనువామ్నాయ తుల్యంబు
నమరేంద్ర వందనీయంబు నయ్యె. (ద్వి.104 పద్యము)

ఇందులో బ్రహ్మదేవుని మహిమయు, తరువాత పద్యములయందు విష్ణుదేవుని మహిమయు వర్ణింపబడినవి. దీక్షితులవారు భాగవతమును సాంగోపాంగముగా చదువలేదనియు, ఒకవేళ చదివినారని అంగీకరించినను, ఇట్టి ఘట్టములయందలి విషయము వారి బుద్ధికి గ్రాహ్యము కాలేదనియు, చెప్పుటకు అవకాశమున్నది. బ్రహ్మదేవుని పై వాక్యములయందలి ఒక వాక్యము "ధీయుక్త మామ కేంద్రియములు మఱచియు బొరయ వసత్య విస్ఫురణమెందు" అను వాక్యము నొక్కదాని నాధారముగా గైకొని పింగళసూరనార్యులు 'కళాపూర్ణోదయము' ను రచియించిరి.

## (3౫) శ్రీజ్ఞానదేవ-శ్రీదీక్షితుల దర్శన సమీక్ష

జిజ్ఞాసువు:- అయ్యా! దీక్షితులవారి సంప్రదాయమునకు చెందినవారు తమ మతము శ్రీ జ్ఞానదేవులనుండి పరంపరగ వచ్చినదని చెప్పుదురే! నేను విన్నంతవఱకు ఆ రెండు మతములకు భేదము కనబడుచున్నది. ఆ మతములు ఏ అంశములయందు పరస్పరము భేదించునో మఱియొక పర్యాయము సంగ్రహముగ ఆనతిండు.

వేదాంతి:- చక్కగా గమనించితివి. వాటి మధ్యగల వైరుధ్యములయందు ముఖ్యమయిన వాటిని వరుసక్రమమున తెలిపెదను వినుము.

(1) శ్రీ జ్ఞానేశ్వరులు 'అనుభవామృతా' మను తమ గ్రంథమును ఆరంభించుటకు మంగళాచరణమునందు వారు గురుదేవులగు నివృత్తినాథ నామధేయ పరబ్రహ్మమునకు నమోవాకంబు లర్పించుచు చెప్పిన మొదటి పద్యమందు **పరమేశ్వర తత్త్వమును గూర్చి** 'ఆనంద పూర్ణంబును ననాదియు

నిత్యము' అని వర్ణించిరి. 2వ పద్యమున 'నవ్విశుద్ధజ్ఞాన స్వరూపున కత్యంత భక్తి పూర్వకంబుగ బ్రణామంబు గావించెద.' 5వ పద్యమున 'ఆది మధ్యాంత రూపుడును, దద్విలయకరుండును నగు నవ్విశుద్ధ శంభుమూర్తికి నతిభక్తిమై నమస్కరించెద.' అనియును పరమేశ్వర తత్త్వమును 'ఆత్మ' అనియు 'శుద్ధజ్ఞాన' మనియు తమ గ్రంథమున అనేక పర్యాయములు చెప్పియున్నారు.

దృశ్య సంబంధము లేని ఆత్మను శుద్ధజ్ఞానమనియు, దృశ్యసంబంధము గల ఆత్మను (వృత్తి) జ్ఞానమనియును ద్వివిధముగ పేర్కొనిరి. ఆత్మ శుద్ధజ్ఞాన స్వరూపమయినను ద్రష్ట కాదనిరి (అను. 7-86). ఏలయన తనకంటె అన్యమగు పదార్థమును చూచినపుడే చూచినవాడు ద్రష్ట యని పిలువబడును. ఆత్మ అద్వితీయ మైనందునను, ఆత్మకు ద్రష్టృత్వము సంభవింపదు. ద్రష్ట కానంతమాత్రమున ఆత్మ (విశుద్ధజ్ఞానము) జడము కాదనిరి. "సాజంబుగ జ్ఞానంబై కొమరొప్పుచుండుటం జేసి య య్యాత్మ స్వవిషయ పరిజ్ఞానంబు గలుగకుండు," (అను 6-88) అనియును, ఆత్మజ్ఞాన మాత్రమగు వస్తువు గనుక సూర్యునియందు రాత్రింబవళ్ళు లేనియట్లు ఆత్మ తన్ను తాను మఱచుట జ్ఞప్తికి తెచ్చుకొనుట యనునవి ఆత్మకు లేవు. (అను. 6-17) అనియును చెప్పిరి. పరమేశ్వర తత్త్వమును గుఱించి జ్ఞానేశ్వరులవారి సిద్ధాంత మది

దీక్షితులవారి సిద్ధాంతము:-

ఏమీలేని ఉత్త బట్టబయలే అచలము. దానికి జ్ఞానము లేదు. అది జ్ఞానము కాదు. దానికి ఎఱుక లేదు. అది తనను తా నెఱుగదు. ఈ మూలము లేని గుర్తెరిగే శరీరాన్ని ఎఱుగదు. అది యెట్టిదనగా నిద్ర, మరణము, మూర్ఛ- వీటితో పొల్పదగిన దనిరి. దీనివలన పరిపూర్ణము (ఉత్త బట్టబయలు) జడము. కనుక (పరమేశ్వర పరబ్రహ్మ) తత్త్వమును **గుఱించి దీక్షితులవారి దర్శనముతో శ్రీ జ్ఞానదేవుల దర్శనమునకు ఏకీభావము లేదు.**

(2) మనయెదుట మనకు తెలియుచున్న యీ విశ్వమును గుఱించి శ్రీ జ్ఞానేశ్వరులవారి అభిప్రాయమిది:- శుద్ధజ్ఞానముయొక్క స్పందనమే విశ్వము. శుద్ధజ్ఞానమగు ఆత్మ తన్ను తా నాలోకించుటయే ఆత్మస్పందనము (అను. 7-162, 165 నుండి 170 మఱియు 171, 245 నుండి 250 వఱకు) విశ్వము

శివశక్తుల వలన కలిగినట్లు చెప్పిరి. (1-6) "ఈ రీతిగ సమస్త వస్తు సముదాయంబునకును మూలకారణంబై కొమరొప్పు నవ్విశుద్ధజ్ఞానము" (అను. 7-125) అనిరి. కనుక విశ్వమునకు మూలము ఆత్మయే.

దీక్షతుల వారిట్లు చెప్పిరి:-

**"ఈ ఉత్త** బట్టబయలువలన సత్తు పుట్టనే లేదు. **అసత్తు** పుట్టనే లేదు." (బృ. ఉ. పు. 3)

**యెషువంటి గడ్డితినేవాడు అయినా యీ బట్టబయలువలన ఈ శరీరాలు పుట్టినవనడు.** (బృ. ఉ. పు. 109)

శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిన శివశక్తిద్వయమునే దీక్షితులవారు 'ఈ మూలములేని గుర్తెరిగే శరీరము ఏమీలేదు' అనే యీ మంత్రమునందే యిమిడ్చి చెప్పియున్నారనిన, అది సరికాదు. ఏలయన? జ్ఞానేశ్వరులవారు చెప్పిన శివశక్తులు నిత్యమైనవి. అవి రెండును ఆత్మయందే లయమగును దీక్షితులవారు చెప్పిన 'గుర్తెరిగే శరీరము' వంధ్యాపుత్రునివంటి దని, రజ్జువునందు తోచిన సర్పము వంటి దని చెప్పిరి. కనుక రెండును ఒకటికాదు. దీక్షితులవారు మాయనంగీకరించిరి. "ఇదే మూలమాయ. ఇదే గుర్తెరిగే శరీరం" అనగా : "నేనే మాయను" అన్నాడు. "**ఈ ఉత్త** బట్టబయలు వలన మాయ పుట్టనే లేదు." (బృ. ఉ. పు. 12). *కనుక జగత్తును గురించిన విచారమునందు శ్రీ జ్ఞానేశ్వర, శ్రీ దీక్షిత మతములు రెండును పరస్పర విరుద్ధములు.*

(3). జ్ఞానేశ్వరులవారు తత్త్వమస్యాది మహావాక్యముల విషయమున చెప్పిన అభిప్రాయ మిది :- "శబ్దము ఆత్మ స్వరూపమును ప్రత్యక్షము చేయజాలక పోయినను కేవలము నిరుపయోగమైనది కాదు. *తత్త్వమస్యాది మహావాక్యములు స్వరూపమును జ్ఞప్తికి తెచ్చిన జ్ఞాపక చిహ్నములే గాక రూపరహిత వస్తు విశేషంబులను సహితము జ్ఞప్తికి తెచ్చిన జ్ఞాపక చిహ్నములని చెప్పక తప్పదు.* రూపరహిత వస్తు విశేషంబులను సహితము ప్రతిబింబింపజేయు దర్పణము. . . . " (అను. 6-1)

దీక్షితులవారు *ఈ విషయమున నిందులకు భిన్నముగ చెప్పిన వాక్యములను వెనుక (౨౮ వ అధ్యాయమునందు) చెప్పియుంటిని. కనుక వాటిని ఇచ్చట స్మరింపవలెను. ఈ యంశమునందును నిరువురు నేకీభవింపలేదు.*

(4) శ్రీ జ్ఞానేశ్వరులు జీవాత్మ పరమాత్మల ఐక్యతను అంగీకరించిరి. 'జ్ఞానేశ్వరి' అను గీతావ్యాఖ్యానమున వా రిట్లు చెప్పిరి.- "వాస్తవదృష్టితో చూచినయెడల జీవుడే బ్రహ్మ . . . 'నేను ఆత్మను' అను అనుభవము ఏ పురుషునికి కలుగునో; వ్యర్థమైనట్టియు, మిథ్యలైనట్టియు విషయములను ఎవడు అంగీకరించడో అతడే శ్రేష్ఠుడైన ఆత్మజ్ఞుడు అని నేను చెప్పుచున్నాను." (ఆంధ్ర. జ్ఞా. 6-6). "మైల లేక కల్తీ పూర్తిగా తీసివేసిన తరువాత శుద్ధమైన బంగారు మిగిలినట్లు సంకల్ప వికల్పముల గొడవ తొలగినంతనే జీవుడు తానే పరమాత్మ అయి నిలిచిపోవుటకు ఆరంభించెను. ఘటము పగిలిన తరువాత దానిలోనుండు ఆకాశము ఇతర ఆకాశముతో కలసిపోవుటకై స్థానాంతరమునకు పోవ నవసరము లేదు. అట్లే మిథ్య అగు దేహాభిమానము నశించినట్లైన పరమాత్మరూపము అగుటకు ఎట్టి క్రొత్తయత్నము చేయ నవసరములేదు. ఏలన జీవుడు మొదటి నుండియే పరమాత్మతో పడుగుపేకలుగా నిండిఉన్నాడు." (ఆంధ్ర. జ్ఞా. 6-7, 8)

ఈ వాక్యములు ఉపనిషత్తులకును, శాంకరమతమునకును సమ్మతమైనవని వేఱుగా చెప్పవలసిన అవసరము లేదు. ఈవిధముగా జీవాత్మ పరమాత్మయొక్క అభిన్నత్వమును తెలియజేయు వాక్యములు జ్ఞానేశ్వరులవా రెన్ని యో చెప్పియున్నారు.

ఈ యంశమును దీక్షితులవారు చెప్పిన దానిని వివరింతును.

*"నీవు అది యెన్నటికి కావు. అది నీవు కావు. నీకు దానికి చాల యెక్కువ తక్కువ వున్నది.* **అది మొదలు కొన లేనిది. వుత్పత్తి స్థితి లయములు లేనిది. నీకు వుత్పత్తి స్థితిలయము వున్నది. కనుకనే చాల యెక్కువ తక్కువ."** (బృ. పూ. పు 109)

**" .... మూలంలేని యీ గుర్రైరిగే శరీరానకు వున్న సామర్థ్యము పుట్టని చావని దానికి లేదు."** (బృ. ఉ. పు. 64)

**"అచలానకు చంచలమైన శరీరానకు కొంచమైనా సంబంధము లేదు. సమస్తమయిన మహత్తులు యీ గుర్రైరిగే శరీరానవేగాని పుట్టని చావని**

అచలానకు నొక్కటైనా మహత్తు లేదు. .... దాని కదే! దేని కదే! సంబంధము లేనిదే సంబంధం వున్నదని మూలంలేని గుర్తెరిగే శరీరమే అన్నది.

(బృ పూ. పు 53-54)

ఒకచోట దీక్షితులవా రిట్లు చెప్పిరి .-

"భ్రాంతి రహితం అయ్యే యుక్తి అద్వైతంవలె గుర్తెరిగే చైతన్యం నీవు అన్నట్టు కాదు. చిత్తులో విశిష్టం అన్నట్టు కాదు. ద్వైతం వున్నది అన్నట్టు కాదు. *అంతా చైతన్యమనే సమరసజ్ఞానం అన్నట్టు కాదు.*"

పై వాక్యములో అద్వైత విశిష్టాద్వైత ద్వైతములను నిరసించిరి. *క్రింది (కడపటి) వాక్యము సూటిగా శ్రీ జ్ఞానేశ్వరమతమును నిరసించుచున్నది.*

(5) శ్రీ జ్ఞానేశ్వరులు పాతంజల రాజయోగమును గుఱించి ప్రశంసించిరి. వారు గీతయందలి ఆఱవ యధ్యాయమునకు వ్రాసిన వ్యాఖ్యానమును చూచిన యే భాష్యకారులుగాని ఆ విధముగ ఆ యధ్యాయమునకు వ్యాఖ్యానము వ్రాసియుండలేదేమో అని తోచును. వారి వ్యాఖ్యానమునందలి వాక్యములు కొన్నింటిని నిచట ఉదాహరింతును:- "ఇది తత్త్వనిర్ణయమునకు మూలస్థానము. క్షీరసాగర మథనము తరువాత సమస్త రత్నములకు సారమైన అమృత మెట్టిదో, గీతాతత్త్వజ్ఞానము యొక్క సారము వివేక సాగరముయొక్క ఆవలిబడ్డు. సమస్తయోగసంపత్తులయొక్క తెరచిన ధనాగారము-అయిన ఈ ఆరవ అధ్యాయము అట్టిది అనవచ్చును. ఈ అధ్యాయములోనే మాయ స్తబ్ధమై నిలిచిపోయినది. వేదవాక్యము ఇచటనే ఆగిపోయినది. ఇక్కడినుండియే గీతారూపమైన తీగ ప్రాకినది. నేనుకూడ సాహిత్యము ఉట్టిపడునట్లు ఆలంకారిక భాషలో దీనిని చెప్పుదును. మీరు శ్రద్ధగా వినుడు." (అం. జ్ఞా అ. 6)

"ఓ పార్థా! ఇప్పుడు ఈ యోగాభ్యాసమునకు రాజమార్గము నీకు తెల్పెదను వినుము. ఈ మార్గములో అనేక స్థలములలో ప్రవృత్తిరూపమైన వృక్షముల కొమ్మలలో నివృత్తిరూపములైన పండ్లగుత్తులు వ్రేలాడుచుండును. **శంకరుడు ఇప్పటికి ఈ మార్గములో నడచుచున్నాడు.** ఇతర యోగులుకూడ మొదట మొదట వేరు వంకరమార్గములలో చిక్కుకున్నారు. కాని అనుభవము వచ్చిన తరువాత తుదకు వారు ఈ రాజమార్గమును స్వీకరించినారు. వారు అజ్ఞానజనితములగు ఇతర వంకర మార్గములను విడిచి ఆత్మబోధ రూపమగు

ఈ సరళ మార్గమున అడ్డంకులు లేక ముందుకు పోవుచుందురు. యోగులేగాక గొప్ప గొప్ప ఋషులుకూడ ఈ మార్గముననే నడచుచు సాధకావస్థను దాటి సిద్ధావస్థ వరకు చేరుదురు. గొప్ప ఆత్మవేత్తలును ఈ మార్గముననే పోయి శ్రేష్ఠత్వమును పొందిరి. ఈ యోగముఅను రాజమార్గము దొరకిన తరువాత, ఆకలి దప్పులు మొదలైనవి అన్నియును నశించును." (ఆంధ్ర. జ్ఞా. 6-6)

మరియొకచోట వా రిట్లనిరి ". . . .ఇది వినుచు మధ్యఅర్జునుడు ఇట్లనెను. . . . మీరు చెప్పిన దంతయు సత్యమే! ఇప్పుడు మీరు చూపిన సాధనవలన పరబ్రహ్మప్రాప్తి తప్పక కలుగును. దృఢనిశ్చయముతో ఈ యోగసాధన చేయువారు తప్పక పరబ్రహ్మమును ప్రాప్తించగలరు."

(ఆంధ్ర. జ్ఞా. 6-15)

శ్రీ జ్ఞానదేవులు లోకవిఖ్యాతి గాంచిన యోగీశ్వరులు. కనుక అందు వారి యనుభవమును చక్కగా వ్రాయగలిగిరి. అంతయేగాక యోగము వారి సంప్రదాయముయొక్క మూలసూత్రమని స్పష్టముగ నిట్లు వ్రాసిరి:-

"ఈ విధముగ యోగసాధన మూలమున పిండములో పిండమును గ్రహించుట 'నాథ' (జ్ఞానేశ్వరుని) సంప్రదాయముయొక్క మూలసూత్రము."
(ఆంధ్ర. జ్ఞా. 6-14)

దీక్షితులవారికి రాజయోగమును గుఱించి యెంతటి అసహ్యాభావ ముండెనో యిదివఱకే (యీ ప్రకరణమునందే 30వ అధ్యాయములో) వివరించియుంటిని. అయినను వారి వాక్యములు మఱికొన్ని యిచట నుదాహరింతును:-

"యోగాభ్యాసం చేసేనా గుర్రెరిగే దొమ్మరివానివలె సాధించి వొక్కనాడు పడి చస్తాడు." (బృ. పూ. పు. 58)

"…. ….. ఎటువలె ననగా బీజనాశమైతేగదా, వృక్షనాశ మగుచున్నది. అందుకే శరీర వృక్షమునకు సూక్ష్మశరీరమే బీజము. ఆ బీజమును నశింపజేయవలెను. ఆ బీజనాశమునకు యత్నమును చేయవలెను గదా? ఆ యత్నమునకు యోగసాధనములు ముఖ్యములు గావు. యోగసాధనములు రోగాస్పదములు." (బృ. పూ. పు. 154)

శ్రీ జ్ఞానేశ్వరులు తమ సంప్రదాయమునకు మూలపురుషుడు (మొదటి గురువు లేక సంప్రదాయాచార్యుడు) శివుడని చెప్పియున్న సంగతి తెలిసినదే.

అట్టి శివుని గుఱించి దీక్షితులవారు చెప్పిన వాక్యములు విన్నవారికి ఆశ్చర్యమును కలిగించును. ఆ వాక్యములను ఈ క్రింద వివరింతును -

**"వైకుంఠం దొరకక శివుడు స్వరూపమనే భ్రాంతిచేత సమాధి చేస్తూ యిప్పటికి ఉన్నాడష. ఆచార్యకటాక్షము గలిగి మూలంలేని యీ గుర్తెరిగే సచ్చిదానందమనే దేహభ్రాంతి తీసివేసి వైకుంఠం అరచేతిలో వున్నట్టు యెవ్వరైనా సూచన చేస్తారా అని చింతచాత కైలాసమనే లోకాంతర భ్రాంతిచేత వున్నాడు. యితర లోకాలవారికి వైకుంఠముయొక్క అపేక్ష కద్దు. వైకుంఠం వున్నది వున్నట్టు జాడ సూచన అయితే యిచ్చ యెన్నటికీ పుట్టదు. వైకుంఠము పుట్టని చావనిది గనుక దానికి బదులు లేదు. యితర స్థానాలు యెక్కడ వుంటే సర్వత్ర లేవు. యీ వైకుంఠం అయితేనో సకల దేశాలయందు వున్నది."** (బృ. ఉ. పు. 142, 143)

పై వాక్యములయందు 'వైకుంఠ' మనగా: ఏమీ లేని యీ ఉత్త బట్టబయలని దీక్షితులవారి పరిభాష. వారి వైకుంఠమున, విష్ణులోకముగాని, శ్రీమన్నారాయణుడు లక్ష్మీసహితుడై నివసించుచున్నట్లు ఆగమపురాణాది గ్రంథములయందు చెప్పబడిన లోకముగాని కాదు. **శివునంతటివాడు యేమీలేని యీ ఉత్త బట్టబయలు తెలిసికొన లేక అవస్థలు పడుచున్నాడట.** జ్ఞానేశ్వరులవారి నాథ సంప్రదాయమునకు ప్రథమాచార్యుడైన శివునకు బయలు తెలియదని చెప్పునట్టి దీక్షితులవారు తమది జ్ఞానేశ్వర సంప్రదాయమని చెప్పుట ఎంతటి అసత్యమో ఆలోచింపుడు. శ్రీజ్ఞానేశ్వరులు గీతావ్యాఖ్యానమున "శంకరుడు ఇప్పటికి ఈ మార్గములో నడచుచున్నాడు" అన్న వాక్యములు దీక్షితులవారు వినియుందురు. ఆ వాక్యములయందలి సరియైన యర్థమును గ్రహింపలేక విపరీతార్థమును గ్రహించిరని తోచుచున్నది.

శ్రీ జ్ఞానేశ్వరులు జన్మించిన మహారాష్ట్రమునందే జన్మించిన శ్రీ లోకమాన్య బాలగంగాధరతిలక్ మహాశయులు గొప్ప పండితులు. ఆత్మవేత్తలు, నాబోంట్ల కంటెను, దీక్షితులవారి కంటెను శ్రీ జ్ఞానేశ్వరులవారిని గుఱించి శ్రీ లోకమాన్యతిలక్ గారికి ఎక్కువగా తెలియును. తిలక్ మహాశయులు తాము రచియించిన గీతారహస్యము నందలి 'విషయ ప్రవేశము' అను ప్రథమ ప్రకరణమున శ్రీజ్ఞానేశ్వరులను గుఱించి యిట్లు వ్రాసియున్నారు:-

'భక్తాస్తే ఽతీవ మే ప్రియాః'= 'నా భక్తులే నాకు మిక్కిలి ప్రీతిపాత్రు లగుచున్నారు' (గీతా. 12-20) అని భగవంతు డర్జునున కుపదేశించిన కారణముననే యద్వైత పర్యవసాయి యగు భక్తిమార్గమే గీతలలో ముఖ్య ప్రతిపాద్య విషయమగును అనియు వారు యుక్తిగ జెప్పుదురు. శ్రీధర స్వాములవారు గీతకు (తమటీకలో గీత. 18-78) నీ తాత్పర్యమునే వ్రాసిరి. ఐనను గీతల కీసంప్రదాయ సంబంధమగు 'జ్ఞానేశ్వరి' యను గ్రంథము మహారాష్ట్ర భాషలో వ్రాయబడినను నుత్తమ మగునదిగనే యున్నది. ఇందు గీతాష్టాదశాధ్యాయములలోను, తొలి నాలుగధ్యాయములలో గర్మము, పిమ్మట నేడధ్యాయములలో జ్ఞానమును బ్రతిపాద్యము అని యున్నది. మఱియు తమ టీక శాంకరభాష్య ప్రవేశమునకు మార్గదర్శక మగునట్లు రచియింపబడినదని జ్ఞానేశ్వరులుగారు తమ గ్రంథాంతమున స్వయముగా చెప్పియున్నారు.

మఱియు గీతార్థము ననేక సరసదృష్టాంతములచే విస్తరింపజేసి వర్ణించు జ్ఞానేశ్వర మహారాజుగారి శైలి యలౌకిక మగుటయుగాక శ్రీ శంకరాచార్యులవారి కంటెను విశేషము భక్తిమార్గమును, నిష్కామ కర్మమును సమర్థించి యుండుటంజేసి జ్ఞానేశ్వరి యను గ్రంథము గీతల మీద నొక స్వతంత్ర భాష్య గ్రంథముగ నంగీకరింపబడదగినది. జ్ఞానేశ్వర మహారాజు తాను యోగి గాన గీతాషష్ఠాధ్యాయమున బాతంజల యోగాభ్యాస విషయముగల శ్లోకములకు టీక విస్తరించి రచియించెను. ఆఱవ అధ్యాయము సమాప్తియందు 'తస్మాద్యోగీ భవార్జున'- 'కావున నో యర్జునా! యోగి వగుము.' (అనగా యోగాభ్యాసములో బ్రవణుడవు కమ్ము) (గీత.6-46) అని భగవంతు డర్జునున కుపదేశము చేయుచు సర్వమోక్షమార్గములలో బాతంజలయోగము సర్వోత్తమమని స్థాపించెనని జ్ఞానేశ్వరులు స్పష్టీకరించిరి."

దీక్షితులవారికి పాతంజల యోగమును గుఱించి జ్ఞానేశ్వరులవారి భావమేమో తెలియదనియు, దీక్షితులవారు 'జ్ఞానేశ్వరిని' చదివిగాని, వినిగాని యుండలేదనియు స్పష్టమైనది. ఏలయన, జ్ఞానేశ్వరులు దేనిని పూజించిరో దానినే దీక్షితులవారు నిందించిరి. పర్యవసాన మేమన యోగవిషయమున దీక్షితులవారికి, జ్ఞానేశ్వరులవారికి పరస్పర విరుద్ధాభిప్రాయము లున్నవి.

(6) శ్రీ జ్ఞానేశ్వరులు ఆత్మయే శివశక్తి ద్వయముగ భాసించెనని చెప్పిరి.

దీక్షితులవారు అందులకు విరుద్ధముగ 'మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లే'దనిరి శరీరము, ఎఱుక - యివి రెండును ఒకదానినొకటి సృజించినవని దీక్షితులవారి మతము. **ఈ రెండును పరస్పర విరుద్ధాభిప్రాయములు.**

(7) శ్రీ జ్ఞానేశ్వరులు యోగీశ్వరులే గాక మహాభక్తులు. వీరిది, స్వాభావిక భక్తి. భక్తి యన్నను యోగమన్నను దీక్షితుల వారికి గిట్టదు. కనుక ఈ *యంశమున సయితము ఇరువుర మతములు భిన్నములు.*

**(8) శ్రీ జ్ఞానేశ్వరులు పరా-అపరా ప్రకృతులను గుఱించి చేసిన నిర్వచనమునకును, దీక్షితులవారి మతమునకును భేదమున్నది.** ఎట్లన:-

త్రిగుణాత్మక ప్రకృతియొక్క త్రిగుణముల సామ్యావస్థ, లేక అవ్యక్తస్థితి 'పరా' అనియును; అది వ్యక్తమై మహదాది అష్టవిధ ప్రకృతు లైనప్పుడు అష్టప్రకృతుల సమష్టి స్వరూపము 'అపరా' అనియును శ్రీ జ్ఞానేశ్వరుల మతము. పరా ప్రకృతియే 'జ్ఞానదేవి' యనిరి. ఇదియే నిర్జీవ శరీరమును సజీవముగా చేయును అని శ్రీజ్ఞానేశ్వరులు చెప్పిరి.

జ్ఞానము (ఎఱుక) త్రిగుణములలో ఒక్కటియగు సత్త్వగుణము వలన జనించినదని దీక్షితులవారి మతము. కనుక యీ యంశమున సహితము ఇరువుర మతములు ఏకీభవింపవు.

(9) శ్రీ జ్ఞానేశ్వరులు (1) ఆత్మయొక్క స్వరూప జ్ఞానము (విశుద్ధజ్ఞానము)ను, (2) చిదాభాస సంబంధమగు (శివశక్తులయందు జ్ఞానశక్తి) జ్ఞానమును ఇట్లు **జ్ఞానద్వయమును అంగీకరించిరి.**

దీక్షితులవారు **ఎఱుకను మాత్రమే అంగీకరించిరి.** రెండు జ్ఞానములు లేవనిరి. కృష్ణదాసుగారు ఇట్లు చెప్పిరి.

**కం|| నేను గాకొకటి శుద్ధ**
**జ్ఞానము గలదనుచు బల్కు జ్ఞానులమాటల్**
**పూని వినదగదు శుద్ధ**
**జ్ఞానంబన నేనె నేను లేనిది యౌనే. (కం. 227)**

(10) శ్రీ జ్ఞానేశ్వరులు, వారి సోదరు లిరువురును, సోదరియగు ముక్తాంబగారును సన్న్యసించిరి. దీక్షితులవారికి సన్న్యాసమన్న సరిపడదను సంగతి తెలిసినదే. సన్న్యాసిని గౌరవించినదని గదా జగదంబ యగు సీతను మూర్ఖురాలని నిందించిరి. సీతమ్మను గౌరవించిన వారందఱుకూడ మూర్ఖులే యనిరి. కనుక **దీక్షితులవారు జ్ఞానదేవుల సంప్రదాయమునకు చెందినవారని తలంచినవారు విచారము లేనివారు.**

(11) శ్రీ జ్ఞానేశ్వరులవారికి, పూర్వుల యెడలను, పూర్వ సంప్రదాయముల యందును గౌరవము కలదు. దీనికి దృష్టాంతము:- అతి ప్రాచీన కాలమున క్షీరసాగరతీరము వద్ద శంకరుడు పార్వతీదేవి చెవియందు చెప్పిన రహస్యమును మొసలిగర్భమునందున్న మత్స్యేంద్రనాథులు విని ఆ రహస్యమును చౌరంగీనాథులకు చెప్పిరని, చౌరంగీనాథులవలన ఆ రహస్యము శ్రీ వృత్తినాథులకు లభించెనని చెప్పియున్నారను ఈ యంశ మిదివఱకే చెప్పితిని. ఎక్కడ శివుడు? ఎక్కడ మత్స్యేంద్రనాథులు! వారు కొన్నివేల సంవత్సరములు జీవించి యుండిరని నమ్మకము శ్రీ జ్ఞానేశ్వరుల కుండియుండిన గదా వా రిట్లు చెప్పియుందురు. యోగీశ్వరు లనేక సంవత్సరములు జీవింతురని పెద్దలు నమ్ముదురు

దీక్షితులవారు ఇట్టి వాక్యములను నమ్మరు. వారొకచో నిట్లు చెప్పిరి · **"ఎవరునూ నూరు సంవత్సరముల కన్నను యెక్కువ బ్రతుకరు"** (బృ. పూ. పు. 69). అనేకులు నూరు సంవత్సరములకంటె నెక్కువకాలము జీవించినట్లు వార్తాపత్రికలయందు చదివియున్నాము* కొందఱిని చూచుచున్నాము.

---

* ఆంధ్రజ్యోతి 27-7-1969 తేదీన వేయబడిన పత్రికలో ఇట్లున్నది: "న్యూఢిల్లీ జూలై 26 సోవియట్ యూనియన్‌లోని దాఘేస్తాన్‌లో 3743 మందికిపైగా శతాధిక వృద్ధులున్నట్లు వెల్లడయినది శతాధిక వృద్ధులలో స్త్రీ పురుషులు సమానముగా నున్నారట

పర్వతశ్రేణులు అశేషంగావున్న కాదర్ గ్రామములో అఘరాఅమరోవా, అనే పేరుగల వ్యక్తి వయస్సు 151 సంవత్సరములు ఈయన ఒక సుప్రసిద్ధ రష్యన్‌కవి అదేగ్రామంలో 'డైలమ్‌బేబ' అనే మహిళ వయస్సు 123 సంవత్సరములు. ఆవిడ ఆరోగ్యస్థితి వైద్యులకు కూడ ఆశ్చర్యము కలిగిస్తున్నదట-ఇట్టివి అనేకములు పత్రికలయందు ప్రచురింపబడినవి ఆంధ్రప్రదేశముననే శతాధిక వృద్ధులు కలరని 21-6-1973వ తేదీ హైదరాబాదు రేడియోస్టేషన్ నుండి ప్రచారము చేయబడినది. దీక్షితులవారు ముందు వెనుకలు ఆలోచింపక వారికి తోచినదే నిజమను భావముతో చెప్పుచుందు రనుటకు ఇది దృష్టాంతముగా చూపితిని.

శ్రీ జ్ఞానేశ్వర, శ్రీ శివరామ దీక్షితులవారి గురుపరంపరను గుఱించి యిదివఱలో తెలిపియుంటిని. ఈ రెండును భిన్నములని పై యిరువురు తమ గురుపరంపరను గుఱించి చెప్పుకొనిన వాక్యములనే యుదాహరించి యుంటిని. కనుక యీ యంశమునకు వేఱొక ప్రమాణము అవసరములేదు. దీక్షితులవారు, శ్రీ జ్ఞానేశ్వరుల గురుపరంపరను గుఱించి తెలియకయో లేక తెలిసియు గొప్పవారి పేరును ఉపయోగించుకొనుటవలన తమ అచలబోధకు మంచి ప్రచారము లభించుననియో ఆవిధముగ చెప్పుకొని యుందురని తలంచుట తప్పు కాదు.

పర్యవసానమేమన-శ్రీ జ్ఞానేశ్వరుల దర్శనము ఆధునికులయందు శ్రీ అరవిందయోగి దర్శనముతో కొంతవఱకును, దీక్షితులవారి దర్శనమును హెకిల్ జడాద్వైతముతోను పోల్చవచ్చును. ఇంతవఱకు శ్రీ జ్ఞానదేవుల మతమునకు దీక్షితులవారి మతమునకు గల వైరుధ్యముల దెలిపితిని.

ఇప్పుడు శ్రీ సమర్థుల మతముతో దీక్షితులవారు ఎంతవఱకు ఏకీభవింపరో పరిశీలింతము.

## (35) శ్రీ దీక్షితుల - శ్రీ సమర్థుల తత్త్వభేదము

(1) శ్రీ సమర్థులు :- బ్రహ్మము శుద్ధజ్ఞాన స్వరూపము.

శ్రీ దీక్షితులు :- ఈ ఉత్త బట్టబయలునకు జ్ఞానము లేదు.

(2) శ్రీ సమర్థులు :- మూలమాయ బ్రహ్మమునందు కలిగి అందే లయమగుచున్నది.

శ్రీ దీక్షితులు :- మూలమాయ బయలునందు కలుగలేదు.

(3) శ్రీ సమర్థులు :- మూలప్రకృతియందు ఎఱుకకు అధిష్ఠానమున్నది. (దా. బో. 9-6-5)

శ్రీ దీక్షితులు :- (నీకు) ఎఱుకకు అధిష్ఠానము లేదు. (బృ. ఉ. పు. 42)

(4) శ్రీ సమర్థులు :- ఎఱుక, లేక అంతఃకరణము విభువు. పంచభూతములయందు కలదు. (దా. బో. 9-6-19, 20)

శ్రీ దీక్షితులు:- ఎఱుక విభువు కాదు. మహాభూతముల యందు కనబడదు (బృ. పూ. పు. 32)*

(5) శ్రీ సమర్థులు :- నీవు నాలుగు దేహములకంటె వేఱుగా ఉన్నావు. నీవు జన్మకర్మలకు భిన్నుడవు. (దా. బో. 5-6-56)

శ్రీ దీక్షితులు :- నేనన నాలవదేహము (కృష్ణదాసుగారి కందము 230) మహాకారణశరీరమే ఎఱుక ఎఱుకే నేను - నీవు.

(6) శ్రీ సమర్థులు :- వేదశాస్త్రములు మిథ్యయని నుడువజాలము.

(దా. బో. 7-7-33)

శ్రీ దీక్షితులు :- వేదములు వట్టి మాయ, మాటలు యేలాగున అపద్ధమో అలాగే అబద్ధము. (బృ. పూ. పు 171)

(7) శ్రీ సమర్థులు :- "మహర్షులు జనసముదాయమునకు జ్ఞానోపదేశము గావించిరి. సారాంశమేమన అద్వైతజ్ఞానము సత్యము."

(దా. బో 7-7-35)

శ్రీ దీక్షితులు :- "అద్వైతము వాదము కొఱకే గాని భ్రాంతిరహితము కాదు." (బృ. ఉ. పు 154)

(8) శ్రీ సమర్థులు:- "మహావాక్య వివరణము గావించుటయే జ్ఞానమునకు ముఖ్యలక్షణము. అట్టి ముఖ్యలక్షణము కతన మనము బ్రహ్మస్వరూపుల మగుదుమను సంగతి బోధపడును." (దా. బో. 5-6-14)

శ్రీ దీక్షితులు :- మహావాక్యములు నీవే బ్రహ్మమని చెప్పుచున్నవి. "ఇందుకే తామసము కలుగుచున్నది." (బృ. పూ. పు. 132)

(9) శ్రీ సమర్థులు :- విగ్రహారాధనమును సమర్థించిరి.

---

**"ఆకాశాదిక భూతానీకాత్మకమగుచు ఎరుక యీ జగమయ్యెన్."** (కందా 38) లో **ఎఱుకే ఆకాశాది భూతపంచకమైనదని కృష్ణదాసుగారు చెప్పియున్నారు ఎఱుకే మహాభూతము లైనప్పుడు భూతములయందు ఎఱుక లేకపోవుట యెట్లు? ఇవి పరస్పర విరుద్ధభాషణములు కావా?**

శ్రీ దీక్షితులు - విగ్రహారాధనమును ఖండించిరి

(10) శ్రీ సమర్థులు - జిజ్ఞాసువు (ముముక్షువు) బ్రహ్మవిద్యనుగోరి గురువును ఎన్నుకొను విషయమై యిట్లు వ్రాసిరి - నీచజాతి గురువు నేర్పరచుకొనుట గూడ కళంకము. నీచజాతి గురుడు బ్రహ్మజ్ఞానుల సభలలో దొంగవలె దాగి యుండును (దా బో 5-2-58) బ్రహ్మసభయందతని పాదతీర్థము నెవ్వరు పరిగ్రహింపరు అతని ప్రసాదము స్వీకరించినయెడల బ్రాయశ్చిత్తము గూడం జేసికొనవలయును (దా. బో 5-2-59) నీచుని గురువుగా జేసికొనుటచే నిట్టి తగవు లెన్నియో తటస్థించును (దా బో 5-2-61)

శ్రీ దీక్షితులు :- "సకలజీవులు కలలో వస్తువులవలె పుట్టుచున్నారు కలలోవాటివలెనే లేకపోవుచున్నారు. కులములను యెవ్వరు చూచినారు? గోత్రములను యెవ్వరు చూచినారు? కులగోత్రములను అహంకారమే యేర్పరచినది." (బృ. పూ. పు. 48) "బ్రాహ్మణుడైనను విష్ణుభక్తిలేనివాడు కుక్కను వండుకొని తినే శ్వపచుడని చెప్పుచున్నారు. నారదుడు దాసీపుత్రుడట. అతను భగవద్ భక్తివలన బ్రహ్మ ఋషి అయినాడట. విదురుడు శూద్రుడట. అతని యింట భగవంతుడు భోజనము చేసెనట. వాల్మీకి బోయవాడట. అతను మహాఋషియై రామాయణాది గ్రంథములు చేసెనట. ఈలాగున అనేక హీనకులములు ఘనకులములాయెనట ఈ కులములకు నిరుకులేదు. (బృ. పూ పు 49)

శ్రీ సమర్థులవారు రచియించిన 10వ అంశమునందలి వాక్యములవలన వారుచెప్పిన తదితర వాక్యములయందలి రుచి కూడ పోయినది. కడివెడు ఆవుపాలయందు కొంచెము గోమూత్రము కలిపినయెడల ఆ పాలన్నియు విరిగి విషతుల్య మగునట. ఆరీతిగా శ్రీ సమర్థులవారు చేసిరి. 10వ అంశములోని వాక్యములవలన వారికి కులాభిమానము (అభిజాత్యము) పోలేదని స్పష్టపడినది. "వర్ణాశ్రమధర్మ కర్మ సంకల్పో బంధః" అని శుకరహస్యోపనిషత్తు చెప్పినది. కనుక యిదియును ఒక బంధమే.

"వర్ణాశ్రమాచారయుతా విమూఢాః
కర్మానుసారేణ ఫలం లభంతే।
వర్ణాది ధర్మం హి పరిత్యజంత
స్స్వానందతృప్తాః పురుషా భవంతి॥" (మైత్రేయ్యుపనిషత్తు)

వర్ణాశ్రమానుసారము కర్మలు చేసినవానికి ఆ కర్మానుసారము ఫలము లభించునేగాని వర్ణాశ్రమాచారముల ధర్మమును పరిత్యజించినవారికి కలుగునట్టి పరమానందఫలము కలుగదు.

"కులగోత్రజాతి వర్ణాశ్రమరూపాణి షడ్భ్రమాః."

కులము, గోత్రము, జాతి, వర్ణము, ఆశ్రమము, రూపము- ఈయాఱును భ్రమలని ముద్గలోపనిషత్తు చెప్పినది. కనుక భ్రమయందుండువారికి సత్యదర్శన మెట్లగును? ఆళ్వారుల చరిత్రములు చదివినవారు* శ్రీ సమర్థులను పూజింపరు.

శ్లో॥ " యశ్శూద్రభగవద్భక్తం, నిషాదం శ్వపచం తథా।
వీక్షతే జాతి సామాన్యా త్స యాతి నరకం నరః॥"

తా॥ భగవద్భక్తుడు శూద్రుడైనను, శ్వపచుడైనను, నిషాదుడైనను, అతనిని జాతి సామాన్యదృష్టితో చూచినవారు నరకమునకు బోవుదురు.

శ్లో॥న శూద్రా భగవద్భక్తా విప్రా భాగవతాః స్మృతాః।
సర్వవర్ణేషు తే శూద్రా యేహ్యభక్తా జనార్దనే॥ (ప్ర. ప. 84-13)

తా॥ జన్మమువలన శూద్రులైనను భగవద్భక్తులైన వారు శూద్రులు కారు. వారు విప్రులు, భాగవతోత్తములు భగవద్భక్తిలేనివారు ఏ వర్ణమునకు చెందినవారైనను శూద్రులుగనే లెక్కింపబడుదురు.

కుల మదము మదత్రయములో ఒకటి. వీటినే గర్వత్రయ మందురు.**

---

* ఆళ్వారులను విశిష్టాద్వైతులను గుఱించి యీ గ్రంథముయొక్క ద్వితీయభాగమున వ్రాసియున్నాను

** ఈ గ్రంథముయొక్క ద్వితీయభాగమునందు "ముముక్షువులు పరిత్యజింపదగినవి" అను 4వ అధ్యాయమున మదత్రయమును (కుల, ధన, విద్యా మదములను) విడువవలెనని వ్రాసియున్నాను.

శ్లో॥ "పూర్వదేహ పరిత్యాగే జాత్యాదీనాం ప్రమాణతః।
దేహస్యైవతు జాత్యాది స్తస్యాప్యేవం హ్యనాత్మతా॥

తా॥ దేహము నేనుకానని నిశ్చయము కలిగినపుడు, దానివెంటనే నేను బ్రాహ్మణకులమునకు చెందినవాడను, నేను ఈ ఆశ్రయమునకు చెందినవాడను, అను అభిమానము సహితము పోవును. (ఉ. సా 17-45) అని శ్రీ శంకరులు చెప్పిరి.

మఱియు శ్రీ శంకరులు "**చండాలో౽స్తు సతు ద్విజో౽స్తు గురురిత్యేషా మనీషా మమ**"= "**సర్వసాక్షియగు చైతన్యమే నేను**" అను నిశ్చయ మెవనికి గలదో, అట్టివాడు చండాలుడే యగుగాక, ద్విజుడే యగుగాక, అతడు నాకు గురువు. ఇదీ నా నిశ్చయమని కాశికాపురియందు చెప్పిన సుప్రసిద్ధ 'మనీషాపంచకము' శ్రీ సమర్థులవారు చదువలేదా? చదివి యుండినను శ్రీ శంకరుల గొప్పతనమును గౌరవించుట కిష్టపడలేదేమో?

శ్రుతి స్మృతి పురాణేతిహాసములనుండి ఇదివఱకే యిట్టి ప్రమాణములను అనేకములు చూపియున్నాను. ఇంకను ఎన్నియేని ప్రమాణములను చూపవచ్చును. అవన్నియు నిచ్చట చెప్పుట అనవసరము.

పర్యవసాన మేమనగా:- శ్రీ సమర్థ రామదాసస్వాములవారు మొదట బ్రహ్మచారి (గోసాయి)గా ఉండిరి. పిమ్మట సన్న్యసించిరని వింటిని ఇట్లుండిన శూద్రుని గురువుగా గైకొనరాదని చెప్పుట వారికి తగదని, వారికి అప్పటికిని కులాభిమానము పోలేదని, కులాభిమానము పోగొట్టుకొననివారికి ముక్తి లేదని, తిరిగి జన్మమున్నదని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఇందుకు ఎంతమాత్రము సంశయము లేదు. ఈ యంశమున శ్రీ సమర్థులవారికంటె శ్రీ దీక్షితులకు ధన్యవాదము లర్పించుచున్నాను.

## (36) శ్రీ దీక్షితుల బోధ - ఇతర దర్శనములు

జిజ్ఞాసువు:- అయ్యా! శ్రీ జ్ఞానదేవ, శ్రీ అరవింద, శ్రీ సమర్థుల దర్శనముతో దీక్షితులవారి బోధకు పొత్తు లేదని స్పష్టమయినది. శ్రీ శంకర, శ్రీ రామానుజ, శ్రీ మధ్వాచార్యాదుల మతములను దీక్షితులవారు తూలనాడిరి. న్యాయ వైశేషికాది దర్శనములతోగాని శైవశాక్తాది మతములతోగాని సంబంధము

(సమానత) ఉన్నట్లుకూడ నాకు తోచలేదు. అయినను మఱియొకసారి బోధించి సంశయము లేకుండ చేయుదురని ప్రార్థన.

వేదాంతి :- న్యాయ, వైశేషిక పూర్వమీమాంసా దర్శనములయందు ఆత్మలు జడము. అనగా : ఆత్మ జ్ఞానస్వరూపము కాదు. ఆత్మ సుఖదుఃఖాది గుణములు కలది. ఆత్మ లనేకములు. విభువులు (వ్యాపకములు). కనుక దీక్షితులవారి బట్టబయలుతోను ఎఱుక (ఆత్మ)తోను సమానత కుదురదు. న్యాయ వైశేషిక మీమాంసా దర్శనములయందు మనస్సు అణురూపము. అది కొంతవఱకు అనగా మోక్షపర్యంతము నిత్యము. కాని అదియును జడమే మనస్సంయోగమున ఆత్మయందు జ్ఞానక్రియలు కలుగును. దీక్షితులవారి యెఱుక మిథ్య వీరు, బట్టబయలు సంయోగమున ఎఱుకయందు జ్ఞానము కలిగినదని చెప్పరు. కనుక నైయాయికుల మనస్సుతో దీక్షితులవారి ఎఱుకకు సామ్యము కుదురదు. న్యాయ వై శేషిక దర్శనములయందు దేహి దేహములు వేఱు. జగత్తు మిథ్య కాదు. దీక్షితుల వాదము ఇందుకు విరుద్ధము. ఆధునిక నైయాయికాదులు ఈశ్వరాస్తిత్వమును అంగీకరింతురు. దీక్షితులు అంగీకరింపరు. సాంఖ్య, యోగ, వేదాంత దర్శనములయందు ఆత్మజ్ఞాన స్వరూపము-ఇవి దీక్షితులవారి బోధకు ప్రత్యక్ష విరుద్ధములు.

జిజ్ఞాసువు :- దీక్షితులవారి బోధ శాంకరముతో సరిపోక పోయినను ఇతర అద్వైతులతో నేకీభవించునా?

వేదాంతి :- ఏకీభవింపదు శ్రీ శంకర శ్రీ విద్యారణ్యుల అద్వైతము ఆభాసవాదము. వారి దర్శనములను ఖండించుటయే ప్రధానాశయముగ దీక్షితులవారు వారి బృహద్వాసిష్ఠ సిద్ధాంతము (శివరామదీక్షితీయము)ను రచియించిరి. శాంకరమార్గము గాక అద్వైతులలో తక్కినవి ప్రతిబింబ వాదము, అవచ్ఛేద వాదము వాటితోకూడ దీక్షితులవారి బోధకు స్నేహము కుదురదు. అవచ్ఛేద ప్రతిబింబ వాదములను గుఱించి తొలుత కొంత చెప్పియుంటిని.*

ఇక అద్వైతశాఖలయందు మిగిలియున్నది అజాత వాదమను దృష్టి సృష్టి వాదము. దీక్షితులవారి వాదము సయితము అజాతవాదమే కాని శ్రీ

* బ్రహ్మజిజ్ఞాస ౧-౨-౮ జీవస్వరూపము భిన్నమతములు అను అధ్యాయమును సంగ్రహముగా చెప్పియున్నాను

జ్ఞానేశ్వరులయొక్కయు, యోగ వాసిష్ఠ కారులయొక్కయు, శ్రీ శంకరులయొక్కయు అజాతవాదములను గుఱించి ఇదివఱకే విస్తరించి చెప్పియుంటిని. అందులో దేనితోను దీక్షితులవారి అజాతవాదమునకు సామరస్యము కలుగదు.

## (38) బౌద్ధతత్త్వ - అచలబోధలకు గల సారూప్యము

బౌద్ధమతమును గుఱించి యిదివఱకే** చెప్పియుంటిని. దాని నిచట స్మరించుకొనవలెను. ప్రస్తుతము బౌద్ధమత అచలమతములకు గల సారూప్యమును గుఱించి విచారించు సందర్భమున బౌద్ధమతమును గుఱించి కొలది వాక్యములు మాత్రమే చెప్పెదను. బౌద్ధమతము ననుసరించి విశ్వమంతయు బౌద్ధుల తత్త్వత్రయముక్రింద చేరును. తత్త్వత్రయ మనగా (౧) స్కంధములు (౨) ఆయతనములు (3) ధాతువులు - స్కంధము లైదు. అవి యివి :- (1) రూప, (2) వేదన (3) సంజ్ఞ (4) సంస్కార (5) విజ్ఞాన- ఆయతనములు. ధాతువులను ఒకేవిధముగా పంచస్కంధములలోనే చేర్చుకొనవచ్చును. మానవుడు పంచస్కంధ సముచ్చయము. పంచస్కంధముల యందు అయిదవది విజ్ఞానము. అనగా : తెలిసికొను తెలివి, లేక యెఱుక. మరణకాలమున మానవుని దేహము నుండి నిర్గమించి జన్మాంతరము పొందునట్టిది విజ్ఞానమే. ఇది ప్రాచీన బౌద్ధ సిద్ధాంత సారాంశము-

బుద్ధభగవానుని యనంతరము బౌద్ధము అనేక శాఖలైనది. అందు ముఖ్యమైనవి నాలుగుశాఖలు. అవేవన:- (1) వైభాషికులు (2) సౌత్రాంతికులు (3) యోగాచారులు (విజ్ఞానవాదులు) (4) మాధ్యమికులు (శూన్యవాదులు). ఇందు (1) వైభాషికులు ద్వైతులు. (2) సౌత్రాంతికులు ద్వైతాద్వైతులు. (3) యోగాచారుల మతమున విజ్ఞాన మొక్కటియే ప్రపంచాకారముగను విజ్ఞానమునకే గోచరించుచున్నది అని చెప్పిరి కనుక. ఇది ఒక విధమగు అద్వైతమే. విజ్ఞానమును ద్వివిధమని చెప్పిరి. (౧) వ్యక్తివిజ్ఞానము. పంచస్కంధముల నొక్కటిగా ప్రపంచాకారమును పొంది ప్రపంచమును చూచుచున్నది. (౨) ఆలయవిజ్ఞానము :- సర్వప్రపంచమునందున్న సమష్టి విజ్ఞానము లేక విజ్ఞానముల ఆలయము. దీనిని ఆలయ విజ్ఞానమందురు. ఆలయ విజ్ఞానమును సముద్రముతోను, వ్యక్తి విజ్ఞానమును తరంగముతోను పోల్చుదురు. ఆలయ,

---

** ఈ గ్రంథముయొక్క తృతీయభాగమునందలి నాలుగవ ప్రకరణమున బౌద్ధమతమును గుఱించి వ్రాసియున్నాను.

వ్యక్తి విజ్ఞానముల కంటె పరమునందుండినది 'తథత'. ఇది అట్టి దిట్టిదని వర్ణింపరానిది. (4) మాధ్యమికులు-విజ్ఞాన మొక్కటియే కలదని విజ్ఞానవాదులనగా - వీరు అట్టి విజ్ఞానముకూడ లేనిదే యనిరి. ఇక ఉన్నదేమందురా? శూన్యమే. కనుక వీరికి శూన్యవాదులని పేరువచ్చినది. ఇది 'నవీన బౌద్ధము' లేక 'తదనంతర బౌద్ధము' -

ఇప్పుడు బౌద్ధమతముతో నెంతవఱకు దీక్షితుల అచల బోధకు సారూప్యము సిద్ధించునో సంగ్రహముగ నీ క్రింద వివరింతును:-

(1) బౌద్ధు లిట్లు చెప్పిరి:- దేహము జన్మింపగా విజ్ఞానము ; విజ్ఞానము జన్మింపగా దేహము కలిగినది.

దీక్షితులవారిట్లు చెప్పిరి:- **ఎఱుక, దేహము ఒక దాని నొకటి సృజించుకొన్నవి.**

అట్లయిన అన్యోన్యాశ్రయ దోషము కలుగును. కనుక యిరువురి వాదములు పరిహరింపదగినవి.

(2) మాధ్యమిక బౌద్ధులు సర్వము శూన్యమే యనిరి.

దీక్షితులవారు "**అచలమే శూన్యమై శూన్యమే మహాశూన్యమై అగోచరమై నశించుచున్నది**" అని చెప్పిరికదా?

ఈ యంశమున బౌద్ధులతో దీక్షితులవారు ఏకీభవించిరి.

(3) బౌద్ధ విజ్ఞానవాదుల వ్యక్తి విజ్ఞానమును దీక్షితులవారి యెఱుకయు ఇంచు మించుగా నొక్కటియే. వారి ఆలయ విజ్ఞానముతో కృష్ణదాసుగారికి అఖండమైన యెఱుకను చాలవఱకు పోల్చవచ్చును.

(4) మాధ్యమికుల శూన్యముతో దీక్షితులవారి బట్టబయలును కొంతవఱకు పోల్చవచ్చును.

(5) బౌద్ధులును శ్రీ దీక్షితులును నిరువురు అసత్కార్యవాదులే - అనగా: శూన్యమునుండియే సమస్తము కలిగినదనువారు.

(6) బౌద్ధులు "తానున్నంతవఱకు దుఃఖమే, తాను లేకపోవుటయే నిర్వాణమనిరి - దీక్షితులవారును - ముక్తి అనునది లేదని, తాము లేకపోవుటయే

విచారమునకు ఫలమని చెప్పిరి. ఈ యంశమునందు పూర్తిగా ఇరువుర అభిప్రాయ మొక్కటే.

(7) విజ్ఞానమే విజ్ఞానమును అనుభవించుచున్నది (తెలిసికొనుచున్నది) అని బౌద్ధులును, ఎఱుకయే యెఱుక నెఱుగుచున్నదని దీక్షితులవారును చెప్పిరి.

(8) బౌద్ధులు, దీక్షితులవారు శ్రుతిప్రమాణ మంగీకరింపరు. హిందువులకు పూజనీయులగు త్రిమూర్తులను గౌరవింపరు. త్రిమూర్తులకంటె వారి గురువే అధికు డందురు.

(9) బౌద్ధులు శ్రీ దీక్షితులు నాలుగు భూతములనే అంగీకరించిరి. ఆకాశమును భూతముగ అంగీకరింపలేదు.

(10) "జ్ఞాత లేని జ్ఞేయము లేదు. జ్ఞేయము లేని జ్ఞాతయు ఉండదు" అను నీ తర్కముతో మాధ్యమికులు యోగాచారమతమును ఖండించిరి. *ఎఱుక లేకపోయిన బయలుకూడ లేదని దీక్షితులవారును చెప్పిరిగదా?*

(బృ. పూ. ప్ర. 10)

జిజ్ఞాసువు:- స్వామి! దీక్షితులవారు ఎఱుక లేకపోతే బయలు లేదన్నారు? ఎఱుక లేనిదే అని కొన్ని వందలమారులు చెప్పిరి. బయలు నిత్యమని రాకడ పోకడ లేక నిత్యమై యున్నదనిరి. ఇట్లు పిచ్చివాని చేతిలోని ఱాయి లక్ష్యములేక ఎటుపోవునో తెలియనట్లు స్థిరముగా చెప్పిన వాక్యము (సిద్ధాంతము) ఏదియు లేదుకదా? ఎఱుక, బయలు- ఈ రెండు ఒకటి కాదని పలుమారు చెప్పిరి. దానికి కొట్టు ఎచ్చటనైన చెప్పిరా?

వేదాంతి :- చెప్పిరి. ఆ వాక్యములను వినిపింతును వినుము "గురువు:- **ఓయీ! బట్టబయలని అనుట యెందు కనగా సూచనకు అనుటయే గాని యెరుక పోయిన పిమ్మట బయలు యెక్కడ గలదు. బయలని అనుకునే వారు ఎవరు గలరు.** ***ఎరుకే బట్టబయలగును.*** **యీ యెఱుక యీ బట్టబయలు రెండు సమానమే. ఎంతమాత్రము భేదములేదు. ఎరుక వున్నంతసేపే పరమని యనవలసి వచ్చెను. గాని యెఱుక లేకపోతే పరమని యెవరందురు?"**

(బృ. పూ. పు. 162, 163)

ఇంతవఱకు బౌద్ధమతముతో అచలమతమునకు గల కొన్ని పోలికలను చెప్పితిని కాని బౌద్ధమునందున్న కొన్ని మంచిలక్షణములు అచల వేదాంతమున లేవు.

జిజ్ఞాసువు :- లేకపోయిననేమి? ఉన్నంతవఱకును రెండును ఒక్కటియేకదా? మీరు బౌద్ధమతము అవైదికము కాదంటిరి. దానియందు చాలవఱకు పూజ్యభావము చూపితిరి. అంతమాత్రము గౌరవమైనను అచలవేదాంతమునకు ఇవ్వవచ్చునా?

వేదాంతి :- బౌద్ధ విజ్ఞానవాదుల ఆలయ విజ్ఞానమును, తథతాయును; మాధ్యమికుల శూన్యమును, దర్శించుటకు ధర్మానుష్ఠానము, అహింస, యోగాభ్యాసమును, ధ్యానమును మొదలగు సాధనలు అవసరము. అవి లేనిదే 'తథత', 'మహాశూన్యము' లెట్టివో సామాన్యులకు తెలియబడవు. అనుభవపూర్వకముగ అవి తెలిసిననే నిర్వాణము కలుగును. అప్పుడే 'నేను లేకపోయితిని' అను అనుభవము కలుగును.

బౌద్ధుల నిర్వాణము సామాన్యముగ అందఱికి లభ్య మగునది కాదు. నిర్వాణమును, పరినిర్వాణమును పొందగోరువారు వీతరాగులై సకలద్వంద్వములకు దూరమై యుండవలయును. వేదాంతులు జీవన్ముక్తిని సాధించుటకు ఎంత సాధన, యెంత చిత్తశుద్ధి, యెట్టి కష్టముల కోర్చుకొనవలయునో, బౌద్ధుల నిర్వాణమునుగాని పరినిర్వాణమునుగాని (జన్మరాహిత్యమును) సాధించుటకు అంతటి సాధన, అంతటి చిత్తశుద్ధి, అంతటి సహనము కలిగియుండవలయును. కనుక బౌద్ధులయందు గల మంచి లక్షణములు అచలమతమున లేవంటిని. కాని అచలవేదాంతులయందు ఎచ్చటనో, యే కాలమునందో సకృత్తుగా ఒక మహాపురుషుడు బౌద్ధులు సాధించిన పరినిర్వాణమును సాధించియుండి యుండవచ్చును. ఇప్పటివఱకు అట్టివా రొక్కరును జన్మించియుండలేరని అనలేము. కాని అది దీక్షితులవారి అచలము కాదు. 'మాలపల్లి' లో బుచ్చయ్యపంతులవారు అచలయోగులు.

జిజ్ఞాసువు:- దీక్షితులవారికి బౌద్ధమతమును గుఱించి తెలియదా?

వేదాంతి:- ఈ క్రింది వారి వాక్యములను వినుము.

**"యేమీ లేదు అంటే బౌద్ధుడు."** (బృ. పూ. పు. 102)

"శూన్యం అంటే యేమీ లేదనుట." (బృ ఉ. పు. 9)

"శాస్త్రములు లేక నడిచేవారు బౌద్ధులు." (బృ ఉ. పు. 37)

యోగాచార్యుల ఆలయ విజ్ఞానము, 'తథతా' యున్నవనిగాని, మాధ్యమికుల శూన్యమును గుఱించిగాని దీక్షితులవారికి తెలియదు. అట్టి వివేకము లేకపోవుటకు కారణమేమన:- బౌద్ధమతము ఎప్పుడో మనదేశమున అస్తమించి వజ్రయానాది నానా వికారములు బొంది వైదిక మతవేషమును ధరించినది. ఈ మధ్యకాలమున జ్ఞానేశ్వరుల సంప్రదాయమునందును, సమర్థులవారి సంప్రదాయము నందును ఎందరో గురువులు గడిచిపోయిరి. వారిలో కొందఱు వంశపారంపర్యముగా బౌద్ధులుగా నుండి యేకారణమువలన నైననేమి ఆ మతమును వదలి వైదికమతము నందు చేరియుందురు. అట్టి సందర్భములయందు వారు పూర్తిగా బౌద్ధమతమును మఱచిపోజాలరు. అందు వారు విజ్ఞానవాదులనుండి విజ్ఞానము (ఎఱుక, లేక, జ్ఞానము)ను గైకొని యుందురు. అట్టి విజ్ఞానము సయితము లేనిదేయని మాధ్యమికులు చెప్పిరి కనుక యెఱుక లేనిదే యని చెప్పుచూ, మాధ్యమికులు చెప్పిన శూన్యము (పరిపూర్ణము లేక బయలు)నే నాశనరహితమనియు, ఇదియును ఒక విధమగు వేదాంతమే యనియు లోకులకు బోధించియుందురు. ఈ విధముగా బౌద్ధమతమును విడువలేక, బౌద్ధమత విరోధులగు హిందువుల వలనను, ముసల్‌మానుల వలనను బాధలు పడలేక బౌద్ధమతమునే బౌద్ధులే వేదాంతమనుపేర ప్రచారమునకు తెచ్చియుండవచ్చును. వైదిక సంప్రదాయోద్ధారకు లగు శ్రీ శంకరులనే 'ప్రచ్ఛన్న బౌద్ధుడని' అద్వైతేతరులు నిందించుటకు కారణము అద్వైతమునందు కొన్ని బౌద్ధమత లక్షణములున్న వనియే కదా?

ఇట్లుండ బౌద్ధమత మిట్టిదని యెఱుగని శ్రీ దీక్షితులవంటి వారికి తమ మతమునకు బౌద్ధమతముతో సంబంధమున్నదని తెలియదు. కాలము గడచినప్పుడు అనేక మతములయం దిట్టి మార్పులు కలుగుచుండుట సహజమే. బుద్ధభగవానుని బౌద్ధమతమునందు నాకు కొంత గౌరవ మున్నదని వెనుక తెలిపియుంటిని. బుద్ధ భగవానునియందు (వ్యక్తియందు) నాకు చాల భక్తి కలదు. బౌద్ధమతమును గుఱించి తెలిపిన సందర్భమున అది మనదేశమున నశింపలేదనియు, పేరు మార్చుకొని తత్త్వము నందు కొలది మార్పులతో

'అచలవేదాంత' మను పేర ఆంధ్రప్రదేశమున కలదనియు తెలిపియుంటిని. బౌద్ధమతమున దోషములు కలవని నే నంగీకరింతును. కాని, బుద్ధభగవాను డుపదేశించిన బోధ యెట్టిది? అని ప్రస్తుతము తెలిసికొనుట చాల కష్టము. బుద్ధభగవానుని అనంతరము బౌద్ధమున అనేక మార్పులు జరిగినవి.

బృహద్వాశిష్ఠ సిద్ధాంత గ్రంథము అచల వేదాంతుల యందు అతివాదుల వాదమును అధికముగను, మితవాదుల వాదమును కొంతవఱకును సమర్థించుచున్నందున చార్వాకమతముతో ఈ మతము కలసి యిది దీక్షితులవారి మతముగా రూపొందినది.

అచలబోధ అనగా - శివరాము దీక్షితులవారిచే బృహద్వాసిష్ఠ సిద్ధాంతమునందు రచియింపబడినది మాత్రమేయని అనుకొనరాదు. దీక్షితులవారు జన్మించుటకు పూర్వమే ఆంధ్రప్రదేశమునందు అచలబోధ కలదు. దానికిని బృహద్వాసిష్ఠ సిద్ధాంతమునందు చెప్పబడిన అచలబోధకును భేదమున్నది. ***దృష్టి - సృష్టి వాదమునే పూర్వులు స్వల్పమార్పుతో గైకొని అచలబోధ యనిరి.*** వీరి శాస్త్రీయ సిద్ధాంతము యోగవాసిష్ఠము. వీరి అనుభవము (సాధన పద్ధతి) పాతంజల యోగపద్ధతి. ఈ రెండింటిలో అనుభవము, జ్ఞానము ఆర్జించినవారే అచలయోగులు. విజ్ఞానవాదులకు యోగాచారులను ప్రసిద్ధనామము కలుగుటకు వారికి పాతంజల యోగమునందు గొప్ప ప్రవేశముండుటయే కారణము. శ్రీ దీక్షితులకు యోగము సరిపడదు.

## (3ఎ) అచలవాదులు అద్వైతమార్గమున నడచినవిధము

దీక్షితులవారి శిష్యపరంపరకు చెందినవారమని చెప్పుకొనిన వారిలో కృష్ణదాసుగారును, పోకల శేషాచలంనాయుడుగారును, విఖ్యాతులు. పోకల శేషాచలంనాయుడుగారు అద్వైతమును సమీపించినంతగా, కృష్ణదాసుగారు సమీపింపకపోయినను కొంతవఱకైన అద్వైతమార్గమును సమీపించిరని విదిత మగుచున్నది. ఈ యంశమును విస్తరించి చెప్పక కృష్ణదాసుగారి వాక్యములను కొన్నింటిని ఈ క్రిందనుదాహరింతును. కృష్ణదాసుగారు ఇట్లు చెప్పిరి:-

(1) కందా॥ **రాకడ పోకడ లేకను - యేకస్థితి నుండు నట్టి యీ బయలందుస్ - రాకడ పోకడ కలిగి యనేకముగా దోచు లేని యెఱుకా సుసీలా - *ప్రతిమలోని పెరుమాళ్ల లీలా* - లేక తోచిన యెఱుక లేనేలేదనుచునీ - కీ కీలు గురునీచే యెరుకైతే** ...."(70)

(2) కందా॥ **వడగళ్లుదకము లోపల - తనకైతావొచ్చి తనకు తానేగువిధం - బున పరిపూర్ణములోపల తనకైతావొచ్చి యెరుక తనకైతాజనును - అచలమున్నదని తానెరిగిననూ-** (71)

ఈ కందార్థముల తాత్పర్యము ఈ క్రింది విధముగా చెప్పవచ్చును.

(1) బయలు కనబడుచున్నది. దానియందు (ఎఱుకను) ప్రపంచమును చూచుచున్నాము ఎట్లనగా : మనము శిలతో చేసిన ఒక ప్రతిమనుగాని లేదా నైసర్గిక స్థితి ననుసరించి ఒక శిల ప్రతిమాకారమును పొందియుండిన ఆ ప్రతిమనుగాని చూతుము. అది శిలయే. అయినను చతుర్భుజములయందు శంఖచక్రా ద్యాయుధములను ధరించినట్లున్న శిలామూర్తిని చూచి విష్ణువనుకొనుచున్నాము. ఇది, మందాంధకారమున **త్రాటిని చూచి పాము అనుకొనునట్టి భ్రాంతిజ్ఞానము వంటిది కాదు.** శిలయని తెలిసికూడ దానియందు విష్ణుభావన చేయుచున్నాము. వేదాంతులు చెప్పునదియు ఇట్టిదియే. ఉన్నది పరబ్రహ్మమునే ప్రపంచరూపమున చూచుచున్నాము. ఘటాకారముననున్న మృత్తికను ఘటముగను, కనకమును కంకణరూపముగను, చూచుచున్నట్లు బ్రహ్మమునే జగద్రూపమున చూచుచున్నామను అద్వైతుల మార్గమును కృష్ణదాసుగారు అనుసరించినట్లే కదా?

(2) రెండవ కందార్థము నందలి భావమిది:- **జలమును బయలుతో సామ్యముచేసి వడగండ్లను ఎఱుక (జగత్తు)తో పోల్చిరి.** వడగండ్లు పూర్వము జలముగనే యుండెను. పిమ్మట కొంతసేపటికి జలముగనే మారినవి. మధ్యకాలమున జలము 'వడగండ్లు' అను నామరూపముతో వ్యవహరింపబడెను. **ఇది అద్వైతులయందు బ్రహ్మపరిణామవాదుల మార్గమును సమీపించినది.** ఇష్టముండియో, కాలుజారియో కృష్ణదాసుగారు అద్వైతమును సమీపించుటే గదా?

ఇప్పుడు పోకల శేషాచలనాయుడుగారి మార్గమును విచారింతము. నాయుడుగారి శిష్యులగు పోలకం నరసింహులుశెట్టిగారు 'శ్రీకృష్ణరుక్మిణీ సంవాదము'న శ్రీకృష్ణభగవానుడు రుక్మిణీదేవికి ఉపదేశించిన ఘట్టమున నిట్లు వ్రాసిరి:-

ఆ|| నెలత వినుమ యింత నీ స్వస్వరూపంబు
బట్టబయలు గని భ్రాంతిచేత
వెలయ దోచుచుండు విశ్వరూపంబైన
*మాయ నీవు గావు* మధురవాణి. (5-177)

ఆ|| ఎఱుక నేనటంచు నెన్నను నెఱుకచే
నెఱిగి కేవలాత్మయే నటంచు
నెరుగు నెరుక నాకు గురుదక్షిణగ నిప్పు
డిమ్ము తడవులేక యిందువదన| (5-183)

ఈ పద్యములయందలి సారాంశమేమి? 'అహం బ్రహ్మాస్మి', 'తత్త్వమసి' మొదలగు మహావాక్యముల అర్థముతో పూర్తిగ అద్వైతులతో ఏకీభవించిరి కదా? అ౦తమాత్రమే కాదు, కొన్ని యంశములయందు జ్ఞానదేవుల యొక్కయు సమర్థులవారియొక్కయు తత్త్వములతో పోకలవారి అచలవేదాంతము ఏకీభవించును.

శ్రీకృష్ణరుక్మిణీ సంవాదమను గ్రంథమును గుఱించి కొంత చెప్పవలసియున్నది :- శ్రీమద్భాగవత పురాణానుసారము శ్రీకృష్ణ బలరాములు కంసవధానంతరము సాందీపని వద్ద అఱువదినాలుగు విద్యల నభ్యసించిరి. భాగవత పురాణమును దీక్షితులవారు అంగీకరించియుండిరి శ్రీకృష్ణభగవానుడు సాందీపని వద్ద బ్రహ్మవిద్యను (వేదాంతమును) అభ్యసించినట్లు భాగవతపురాణమున చెప్పబడి యుండలేదు. రుక్మిణీదేవిని భగవానుడు వివాహమాడిన తరువాత భగవానుడు సాందీపనిసన్నిధికి పోయి యీ అచలబోధను తెలిసికొనివచ్చి రుక్మిణీదేవికి బోధించెనట.

ఈ యంశమును దీక్షితులవారును అంగీకరించిరి. కాని, ఈ కథ భాగవత పురాణమునందు లేదే? వీరి కాధారమేమి? శ్రీ కృష్ణభగవానుడు బాల్యముననే (సాందీపనికడకు విద్యార్థియై పోవుటకు ముందే) ఒక శరద్రాత్రియందు గోపికలకు తన నిజస్వరూపమును ఉపదేశించినట్లును, ఉద్ధవుని ముఖమున గోపికలకు పంపిన సందేశమునందును (భ్రమరగీతలయందును) వేదాంతసారమును ఉపదేశించియున్నట్లు కలదు కదా? భగవానుడు సర్వజ్ఞుడయ్యును కొందఱిని అనుగ్రహించుటకొఱకు (వారిపూర్వజన్మ తపఃఫలమును వారికి ప్రసాదించుటకు) వారికి శిష్యుడయ్యెను. భగవానుడు ఉపమన్యుడను శైవునివలన శాంభవదీక్ష

గైకొనినట్లు శివపురాణమున కలదు. మఱియు "దేవకీపుత్రుడగు కృష్ణుడు 'ఘోర' అను అంగిరస్సువలన బ్రహ్మవిద్య నెఱింగె" నని ఛాందోగ్యోపనిషత్తు తృతీయ ప్రపాఠకము 17వ ఖండము 6వ మంత్రమున చెప్పబడినది. సారాంశమేమన శ్రీకృష్ణభగవానుడు సాందీపనివలన అచలబోధ నెఱిగెననుట పుక్కిటిపురాణము; దీని కాధారము లేదు.

ప్రస్తావవశమున వచ్చిన 'శ్రీకృష్ణరుక్మిణీ సంవాద' గ్రంథప్రసక్తిని వదలి ముఖ్యాంశమునకు మరలుదము:-

కృష్ణదాసుగారు, పోకలవారే గాక దీక్షితులవారును అద్వైతములోనికి జారిన సందర్భములు గలవని వారి ఈ క్రింది వాక్యముల వలన తెలియుచున్నది.

దీక్షితులవారు వారిగ్రంథమున కొన్నివందల సారులు శరీరము లేదన్నారు ఆ యర్థమును దృఢపరచుటకు షోడశాక్షరీ మంత్రమును కల్పించి రెప్పపాటు కాలమైనను దానిని మరువరా దన్నారు. ఆ మంత్రము *"మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు"* అనికదా? శరీరం ఉన్నదంటే నరకమన్నారు. శరీరంలో కొంత నిబద్ధి కొంత అబద్ధం అన్నవారు పుత్రమిత్రకళత్రాదులతో నిర్మూలమై పోచారు" అన్నారు (౧౨ వ అధ్యాయములో ఈ వాక్యముల ఉదాహరించియుంటిని) ఇందులకు విరుద్ధముగా శ్రీ దీక్షితులు అద్వైత ధోరణిని అవలంబించిన యీ క్రింది వాక్యములను గమనింపవలయును.

**"మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నదన్న సంగటమే, లేదన్న సంగటమే."** (బృ. ఉ. పు. 30) **"ఛీ, అందుకే మూలంలేని గుర్తెరిగే శరీరం వున్నదన్న పాపమే లేదన్న పాపమే."** (బృ. ఉ. పు. 61, 62) ఈ వాక్యములు షోడషాక్షరీ పంచదశి మంత్రములను ఖండించుచున్నవి. అద్వైతుల మాయ అనిర్వచనీయ మైనది. అది ఉన్నదీ కాదు, లేనిదీ కాదు. ఉన్నదన్నను తప్పే, లేదన్నను తప్పే. కనుక అనిర్వచనీయ మనిరి. మాయయొక్క నిర్వచనమును గుఱించి (1వ ప్ర. 5వ అధ్యాయమునందు) చెప్పియుంటిని.

అదిగాక, ఒకచోట నిట్లనిరి. **"గురువు - ఓయీ! అవస్థాత్రయ భంగమయ్యే అచలము పొందెను."** (బృ. పూ. ప్ర. 99) ఈ వాక్యము యొక్క అర్థమును గమనింతము. అవస్థాత్రయము నశింపగా ఆత్మసాక్షాత్కార మయ్యెను. అదియే

తురీయమగు ఆత్మయని, అదియే పరబ్రహ్మమని మాండూక్యోపనిషత్తు చెప్పినది. అవస్థాత్రయరహితమగు **'అచలయును'** పొందెననగా అద్వైతులు చెప్పినదానిని అంగీకరించిన ట్లయినది. ఇంకొకవిషయ మేమన:- దీక్షితులవారు, వారి గ్రంథమునందంతటను **ఉత్త** బట్టబయలు సగుణ నిర్గుణములు కానిదని చెప్పియుండియు రెండుచోట్ల **"ఈ ఉత్త బట్టబయలే నిర్గుణం"** (బృ. పూ. పు. 122) **"ఈ ఉత్త బట్టబయలే నిరంజనం నిర్గుణం"** (బృ. ఉ. పు. 3) ఈ వాక్యములను ఇదివఱకే ఉదాహరించియుంటిని. అద్వైతులు బ్రహ్మమును నిర్గుణమనిన దానినే దీక్షితులవారును ఆమోదించిరి కదా? ఇట్టివి మఱికొన్ని గలవు. ఎన్ని చూపినను సారాంశమొక్కటే.

పర్యవసాన మేమనగా:- శ్రీ దీక్షితులు, అద్వైతమును తమ అచలబోధకంటె తక్కువైనదను సిద్ధాంతమును స్థాపింపదలచి దానియందు కృతార్థులు కాలేకపోగా ఏదో ఒకవిధముగ అప్పుడప్పుడు బుద్ధిపూర్వకముగనో తెలియకయో అద్వైతమునే ఆశ్రయించిరి.

## (3F) దీక్షితుల మతము (బోధ)అవైదికము - మాయావాదము

జిజ్ఞాసువు:- అయ్యా! దీక్షితులవారి మతమును 'అచలవేదాంత' మని చెప్పుచుంటిరి కదా? అది వేదాంతమేనా?

వేదాంతి :- వేదాంతమని నే ననుటలేదు. **'అచల వేదాంత'** మనుచున్నాను. దీక్షితులవారు తమ మతమును 'అచలబోధ' యనిరి 'మహాద్వైత' మనిరి. వేదాంతము కాదనిరి. కాని, వారి "బృహద్వాశిష్ఠ సిద్ధాంత" మను 'శివరామదీక్షితీయ' గ్రంథమునందలి ప్రతి ప్రకరణాంతమందును **"ఇతి శ్రీమద్గురు శివరామదీక్షితప్రభావే వేదాంత విచారణే"** అని యున్నది. వేదాంతమునకును, అచలబోధకును భేదము తెలియజేయుటకు అచలబోధను 'అచలవేదాంత' మని నే నంటిని. అంతియ కాని వారి మతమునకు 'వేదాంత' మని నేను పేరుపెట్టలేదు. వారు వేదాంత మనిరి. కనుక, నేను **'అచలవేదాంత'** మనవలసి వచ్చినది. ఒక వ్యక్తి తన పేరు 'జగదీశ్వరు' డని చెప్పుకొనిన లోకులందఱు ఆ నామముననే అతనిని చెప్పుదురుకదా? ఆ వ్యక్తికి జగదీశ్వరత్వము కలదా, లేదా? అని విమర్శింపరు కదా? ఇది లోకాచారము. నేనును లోకాచారమును పాటించితిని.

## 299 (39) దీక్షితుల మతము (బోధ) అవైదికము - మాయావాదము

దీక్షితులవారు రచించిన బృహద్వాశిష్ఠ సిద్ధాంతమను గ్రంథమును పోకల శేషాచలం నాయుడుగారు శోధించి అందలి విషయమును సంగ్రహించి (అందుండి కొన్ని వాక్యములు తొలగించి) శివరామదీక్షితీయ మను పేర 'క్రౌన్ సైజు' లో 117 పుటలలో అచ్చువేయించిరి. ఈ యంశము తొలుత (రెండవ ప్రకరణము, 3-వ అధ్యాయములో) చెప్పియుంటిని. ఆపుస్తకము 1951వ సంవత్సరమున అయిదవ మారు (5వ కూర్పు) అచ్చువేయబడినది. ఆ గ్రంథమున అచల బోధను గుఱించి దీక్షితులవారు వారి శిష్యులగు కంబాలూరు అప్పారావుగారికి ఈ క్రింది విధముగా చెప్పినట్లు వ్రాయబడియున్నది:-

**"యోరి యప్పయ్యా! ఈ యచలబోధనుం బట్టుటకు బ్రహ్మాదులకైన నలవికాదు. సద్గురు వాక్యముల నమ్మి సంశయము లేనివాడవు గమ్ము. సంశయములు తోచినయెడల నిన్ను రక్షించుటకు నెవరికి నలవికాదు. నీ సంశయమే జనన మరణంబులకు గారణంబగును. *నేను నీకు బోధించెడు నచలబోధ త్రిలోకంబులకును త్రిలోకవాసులకును, వేదంబులకును, ఉపనిషత్తులకును, శాస్త్రంబులకును, మిగుల విరుద్ధముగా నుండును."***

అచలబోధ వేదశాస్త్రములకు విరుద్ధమని ఆ సంప్రదాయమునకు చెందినవారే చెప్పియుండగా అచలవాదులు కొందఱు అందులకు విరుద్ధముగా వైదికమని చెప్పుట తగదు. కాని, కృష్ణదాసుగారు **"ఆగమ నిగమోపనిష త్సాగర మథితార్థ"** మనియు, (కందా. 19) **"సకల నిగమాగమాది ప్రకరమహానారికేళఫల సారము"** (కందము 26) అనియు, వారి కందార్థములను, కందములను పొగడుకొన్నను, ఆగ్రంథముల యందే శ్రుతులను అనేక చోట్ల నిందించియున్నారు.

అచలబోధను శివుడు సయిత మెఱుగడని దీక్షితులవారు ఈ క్రింది వాక్యములను చెప్పియున్నారు.

**"సకల దేశాలయందు సర్వకారాయందునూ, సమస్తమైన వస్తువులయందూ క్రియాశూన్యమై చలించక తనకు తానే స్వతస్సిద్ధమై యున్నది. అటువంటిదాన్ని మూడుకన్నులు వున్న వాడయినా సూచన చెయ్యలేదు."** (బృ.పూ. పు. 125)

జిజ్ఞాసువు:- అచలబోధకు కర్త దీక్షితులవారేనా? వారికంటె పూర్వమున ఉండిన శ్రీధరస్వామి మొదలగువారా?

వేదాంతి:- అచలబోధను 'బృహద్వాశిష్ఠసిద్ధాంతము' నందు చెప్పియున్న రీతిగా స్థాపించినవారు దీక్షితులవారేనని నా అభిప్రాయము. అట్లు చెప్పుటకు ఈ క్రింది అధారము లున్నవి.

కృష్ణదాసుగారు ఇట్లు చెప్పిరి.

కందా. **శ్రీమించు నచలబోధను**
**యేమహనీయుండు జేసి యెగజల్లెనొ యీ**
**భూమిన్ సుజనులకొఱ కా**
**రామడుగన్వయజ శివరామదీక్షితులన్**
**తలచి అప్పారావ్ గుణతతులన్. "** (కందా. 6)

అని చెప్పియున్నందున ఈ అచల మత స్థాపకులు దీక్షితులవారే అనవచ్చును. కృష్ణదాసుగారు "కందార్థదరువుల" ను రచియించిన పిమ్మట సుమారు పందొమ్మిది సంవత్సరములకు "పరమతత్త్వకందములు" అను గ్రంథమును రచియించిరి అందు "దక్షుని శ్రీధరమూర్తిని - నిక్షేపముగా దలంచి" (కందము. 15) అని దీక్షితులవారి గురువును శ్రీధరమూర్తియని పేర్కొనిరి. కాని, "శ్రీధరస్వామి" అని అనలేదు. శ్రీధరమూర్తియే శ్రీధరస్వామి యని మనమనుకొన్నను, మొదట కందార్థదరువులు వ్రాసినప్పుడు లేని యీ శ్రీధరమూర్తి 19 సంవత్సరముల తరువాత కృష్ణదాసుగారికి ఎట్లు జ్ఞాపకమునకు వచ్చిరో తెలియదు.

అది యట్లుండ, **"రాదు పోదు శివరామ దీక్షితులు బోధపరచినా అచలమిది"** అను కీర్తనలు విరివిగా ప్రచారములో ఉన్నవి. ఈ కారణములవలన అచలబోధ స్వరూపము పూర్వ మెట్లుండినను బృహద్వాసిష్ఠ సిద్ధాంతగ్రంథమున చెప్పబడిన అచలబోధకర్త దీక్షితులవారే అని నా యభిప్రాయము. దీక్షితులవారు తమ గురువునుండి గ్రహించిన బోధతో తమ అభిప్రాయములను కొన్నింటిని చేర్చి, గురువు చెప్పిన బోధయందు కొన్ని మార్పులు చేసి, బృహద్వాశిష్ఠ సిద్ధాంత గ్రంథమున చెప్పబడిన అచలవేదాంతరూపమును దీనికి కలిగించుటవలన దీక్షితులవారే అచలమత

స్థాపకులను ఖ్యాతి (ప్రతీతి) కలిగియుండును. ఇందలి లోపములకు దీక్షితులవారి గురువులు బాధ్యులు కారని నా యభిప్రాయము.

దీక్షితులవారి గురు పరంపరకు చెందిన వారిలో కొందఱు పెద్దలు అద్వైతమున నేవో కొన్ని చిన్న మార్పులను చేసి 'అచల'మని పేరిడియుందురు. వాచస్పతి మొదలగు పెద్దలు శ్రీ శంకరానుయాయులై యుండియు, మూలతత్త్వమునకు దెబ్బతగులని విధమున శంకరాద్వైతమును మార్పు చేసియుండిరి కదా? అట్లే దీక్షితులవారికంటె పూర్వమున అచలబోధ దీక్షితులవారు చెప్పిన విధముగా గాక మఱికొంతమార్పుతో ఉండవచ్చునని చెప్పియుంటినిగదా? 'అచల' మనిన 'ఆత్మ', 'బ్రహ్మము' అను నామములకు పర్యాయపదమని వేదాంతులెల్లరు నెఱింగినదే. "అద్వైత సుధానిధి"* అను గ్రంథమున ఒకశ్లోక మిట్లున్నది:-

"శిలాభావం పరిత్యక్త్వా శివభావం చ కారయేత్
శివభావం పరిత్యక్త్వా ఆత్మభావం చ కారయేత్|
ఆత్మభావం పరిత్యక్త్వా అచలభావం చ కారయేత్
ఏవం విజ్ఞానసంప్రాప్తే సద్యోముక్తి ర్న సంశయః||"

దీని తాత్పర్యము సులభమే. శిలారూప శివలింగమును బ్రహ్మ భావనచే ఉపాసించువాడు బ్రహ్మమును సాకార సగుణమూర్తిగా భావించును. శిలారూపమున నున్న శివలింగమే శివుడని కొంతకాల మట్లు ఉపాసించినను, శివలింగమును (శిలాభావమును) వదలి శివభావమును చేయవలయును. ఇచట పూర్వమున్న సాకార సగుణములయందు సాకారమును వదలి సగుణమాత్రునిగా శివు నుపాసన చేయవలయును. అట్టి శివభావమును సయితము వదలి శివుని 'ఆత్మ'గా భావన చేయవలయును ఇచట ఆత్మ అనగా జీవుడని అర్థము చేసికొనవలయును. అట్టి జీవ భావమును సయితము పరిత్యజించి 'అచల' భావము, అనగా నిర్గుణ బ్రహ్మభావము చేయవలయును. అట్లు నిర్గుణ బ్రహ్మతత్త్వమును ఎఱిగించినవానికి సద్యోముక్తి కలుగునని తాత్పర్యము. ఇందు దోషమేమియును లేదు. ఇచట 'ఆత్మ' భావమును పరిత్యజింపు మనగా నిర్గుణభావమును కూడి పరిత్యజింపుమని యర్థము కాదు. ఎచటనో లభించు

* అద్వైతసుధానిధి అను గ్రంథము అద్వైతమును బోధించును, అచలమును బోధింపదు

నిట్టి శ్లోకములకు విపరీతార్థమును చేసి **అ**చలబోధ అద్వైతమునకన్న గొప్పదని, శ్రీ శంకరులు అచలబోధ నెఱుగరనుట మిక్కిలి సాహసము.

శ్రీ శంకరాచార్యులను, వారి అనుయాయులను మాయావాదులని దీక్షితులవారు పెక్కు పర్యాయములు చెప్పిరి. మాయావాదు లెవరు, అను అంశమును విచారింతము. దీక్షితులవా రిట్లు చెప్పిరి.

**"...........తాను వేరే శరీరం వేరే అని వాదించేది తత్త్వవాదము. అదే మాయావాదము".** (బృ. పూ. పు. 22)

**శ్రీ శంకరులుగాని, వారి అనుయాయులుగాని, మాయావాదులు కారు. వారు బ్రహ్మవాదులు. బ్రహ్మమొక్కటే సత్యము, తక్కినదంతయు మిథ్యయనువారే బ్రహ్మవాదులు.** శ్రీ శంకరులను, వారి అనుయాయులను 'మాయావాదు' లని శ్రీమద్రామానుజ, శ్రీ మధ్వ, శ్రీ జ్ఞానేశ్వరుల వంటివారు అనిరి. వారట్లనుట ఉచితమా? కాదా? అను నంశ మెట్లున్నను, వారట్లనుటలో కొంత అర్థమున్నది. కాని దీక్షితులవా రట్లనుట అర్థరహితము. శ్రీ దీక్షితులు పూర్తిగ మాయావాదులై యుండియు, బ్రహ్మవాదులను మాయావాదు లనుట సరికాదు. దీక్షితులవారే మాయావాదు లనుటకు హేతువును చూపుదును.

దీక్షితులవారును, కృష్ణదాసుగారును ఎఱుకను 'మాయ' యనిరి. వారి వాక్యములను బట్టి ఎఱుకే నేను నీవు. ఎఱుకే బ్రహ్మాండములు, ఎఱుకే యెఱుక మరపులు; సమస్తమును ఎఱుకయే. అదియే 'మూలమాయ', దాని నదియే యెఱుగును. బయలు నెఱుగునదియును అదియే, ఎఱుక లేకున్న బయలులేదు. బయలు యొక్క కలిమి యెఱుకపై ఆధారపడియున్నది అని చెప్పిరి.

ఇప్పుడు విచారింపుము. దీక్షితులవారిది మాయావాదమా? శ్రీ శంకరులవారిది మాయావాదమా? ఎవరో అద్వైతమును మాయావాద మనిరని దీక్షితులవారును అనుటకు కారణము వారికి అద్వైతమునందు తగినంత జ్ఞానము లేకపోవుటయే కదా? ఇందుకు వారివాక్యములను కొన్నింటిని **ఉదాహరింతును :-**

**"అద్వైతమంటే విశిష్టాద్వైతమే".** (బృ ఉ. పు 134)

**"అగ్నిహోత్రాలు యెందుకు చేస్తారు. మాదిగవాండ్లవలె, మాలవాండ్లవలె. మేము బ్రాహ్మణులమని అనుమానం యెందుకు వుండవలె? అందుకే మాయావాదుల మార్గం విచారించండి"** (బృ. ఉ. పు. 135)

**"అద్వైతమువలె దేహం అబద్ధం దేహి నిబద్ధి అన్నట్లు కాదు"**

(బృ. ఉ. పు. 147)

**"సర్వానర్థమూలం అద్వైతం గనుక వొకటి లేనిది వొకటి నిజం".** (బృ. ఉ. పు. 35)

**"అద్వైతం మిథ్యాజ్ఞాన స్వరూపం".** (బృ. ఉ. పు. 36)

ఇందుకు నా సమాధానము :- అగ్నిహోత్రములు అద్వైతులు మాత్రమే చేయుచున్నారా? దేహము అసత్యము, దేహి సత్యము అని అద్వైతులు మాత్రమే చెప్పుచున్నారా? వైదికమత సంప్రదాయములకు చెందిన ద్వైత - విశిష్టాద్వైతాది సమస్త శాఖలవారును అగ్నిహోత్రములు చేయుచుండలేదా? దేహము అసత్యము - దేహి సత్యము అని సమస్త వైదికసంప్రదాయములకు చెందిన దర్శన కారులు ఏకకంఠయుగ చెప్పుచుండుట లేదా? "అద్వైతమంటే విశిష్టాద్వైత"మట. అద్వైతమును గుఱించి సామాన్యముగ తెలిసినవారైనను ఇట్టిమాట లనరే. దీనిని బట్టి దీక్షితుల వారికి అద్వైతమునందు నిర్హేతుక ద్వేషము కలదని మందబుద్ధు లైనను తెలిసికొనగలరు.

పర్యవసాన మేమనగా:- **దీక్షితులవారిదే మాయావాదము. అది అవైదికము. వైదికశాఖ లన్నింటికిని విరుద్ధము. బౌద్ధ, చార్వాక, జడాద్వైతములు, సమర్థ రామదాసస్వామి వారి మతములు కలసిన ఒక కలగూరగంప వంటిది.**

## (౪౦) గురువులు - శాస్త్రములు

గురుసహాయము లేనిదే బ్రహ్మవిద్య లభింప దని చెప్పుదురు. ఇది చాలావఱకు సత్యమే. కాని, గురువు లేకయే బ్రహ్మవిద్యను పొంది ముక్తులైన మహాత్ములు కలరు. గురువులకు గురువగు భగవంతుడు కలడు. వాని కరుణ కలిగిన మానవ గురువులతో పనిలేదు. భాగవత పురాణమునందలి **అవధూత యదుసంవాదమను ఘట్టమున "తనకు (అవధూతకు) మానవులేగాక,**

పాము, తేనెటీగలు మొదలగునవి కూడ గురువులే" యని అవధూత యదురాజునకు చెప్పినట్లు కలదు. సత్యకామ జాబాలుడు బ్రహ్మోపాసనమును ఋషభము, నీటికోడి, హంస, అగ్ని - వీటినుండి వినెను. వాటిని ప్రేరేపించి వాటినుండి మానవభాషణములను వెలువరింపజేసిన వాడెవడు? అతడే గురువులకు గురువు. ఆధునికులయందు సుప్రసిద్ధ మహా పురుషులగు శ్రీ అరవిందయోగి, శ్రీ రమణ మహర్షి వంటి వారు గురువులేకయే బ్రహ్మవిదులైరి. ఆత్మచింత అధికముగ గలవాడు గురువులేకయే సంసారమునుండి తరింపగలడని దీక్షితులవారు అంగీకరించియున్నారు. వారి వాక్యముల నీ క్రింద నుదాహరించుచున్నాను:-

**"..... శిష్యుని కొరతతీర్చక గురువు చనిపోయినా ఆ గురువునకు జన్మము కలదు. శిష్యునకు జన్మము లేదు .... .... .... గురువు చనిపోయెనేని మరిమరి విశేషముగా చింత కలుగుచున్నది. ఆచింతకు మితములేదు. ఆచింత యేచింత యనగా అది ఆత్మచింత. ఆచింత అధికమైన పరమార్థమును పొందించును. లోకమునందు యెవరైన *అరక్షణము అధ్యాసచేసినట్లాయనా* అటువంటివానికి జన్మరహితమని శాస్త్ర పురాణాది గ్రంథములలో చెప్పుచున్నది. అది నిజమేకదా, అది నిజమైతే యెప్పుడు ఆత్మచింత గలవానికి జన్మరహితము కానేరదని యేలననుకోవలెను? వానికిన్ని జన్మరహితమే. *గురూపదేశమైతేగాని జనన మరణ రహితముగాదని అనుకోవలెనా? అనుకోవలసిన పనిలేదు.* ఎందుకు యీ సందేహము గలుగును? ఈ సందేహమునకు అవకాశములేదు.**

(బృ. పూ. పు. 38)

"అధ్యాస చేసినట్లాయనా" అనినదాని కర్థము లేదు. "అభ్యాసము" అని యుండవలెను. ఎప్పుడును ఆత్మచింత గలవానికి గురువు సహాయము లేకయే జన్మరాహిత్యము కలుగునని దీక్షితులవా రంగీకరించిరి. నేను వారి వాక్యముతో నేకీభవించుచున్నాను.

ఎవరికి బ్రహ్మవేత్తయగు గురువు లభించునో అట్టివారు అదృష్టవంతులు. దురదృష్టవంతులు కొందఱు అజ్ఞానులను గురువులుగా పూజించుచున్నారు. 'యోగవాసిష్ఠము' నందొకచోట చెప్పిన దేమనగా:-

శ్లో॥ **తావత్తావ త్స్వకేనైవ చేతసా ప్రవిచార్యతే।**
**యావ ద్యావ ద్విచారాణాం సీమాన్తః సమవాప్యతే॥** (యో. వా 5-12-16)

తా॥ ఆత్మజ్ఞానము లభించువఱకు స్వచిత్తముచే తత్త్వవిచారము లెస్సగ నొనర్చుచునే యుండవలయును

శ్లో॥ **న త ద్గురో ర్నశాస్త్రార్థా న్నపుణ్యా త్ప్రాప్యతే పదమ్।**
**యత్సాధు సంగాభ్యుదితా ద్విచారవిశదాద్ధ్రువః॥** (యో. వా. 5-12-17)

తా॥ సజ్జనసాంగత్యమువలన వృద్ధినొందినదియు, ఆత్మతత్త్వవిచారముచే విశాలమైనదియు నగు తన హృదయముచే లభించు నుత్తమ పథము గురువులచేతగాని, శాస్త్రార్థములచేగాని పుణ్యములు చేయుటచేగాని లభింపదు.

శ్లో॥ **సుందర్యా నిజయా బుద్ధ్యా ప్రజ్ఞ యేవ వయస్యయా।**
**పదమాసాద్యతే రామ ననామక్రియయాన్యయా॥** (యో. వా. 5-12-18)

తా॥ అట్టి బ్రహ్మపదము ఉత్తమశాస్త్రములు శోధించుటవలన కలిగిన వివేకముచే శోధితమై ఊహాపోహ కుశల మయినదియు, అనురాగవతియగు సఖినిబోలిన నిర్మల బుద్ధిచే ప్రాప్తించును గాని అన్యమగు నెట్టి క్రియచేతను ప్రాప్తింపదు.

శ్లో॥ **ప్రజ్ఞా వా న సహాయో ఽపి విశాస్త్రో ఽప్యరిమర్దన।**
**ఉత్తరత్యేవ సంసారసాగరా ద్రామ పేలవాత్॥**

(యో. వా. 5-12-22)

తా॥ రామా! ప్రజ్ఞావంతు డసహాయుడైనను, శాస్త్రశ్రవణము లేనివాడైనను జ్ఞానమాత్రముచే సంసారసాగరమును సులభముగ దాటగలడు.

మఱియు యోగ వాసిష్ఠమునం దిట్లున్నది.

ఆత్మవిశ్రాంతి పొందనివానియందు గురుభావ ముంచువానికి నిరావరణ స్థలమునకు జాగిలమును (వేట కుక్కను) పిలుచుటవలన నెట్టి ఫలము కలుగునో అట్టి ఫలము కలుగునని చెప్పబడినది -

నిజమైన ముముక్షువులు, జిజ్ఞాసువులు మాయావుల చేతులలో పడి జీవితమును వ్యర్థము చేసికొనుచున్నారు. గురువుకొఱకు తొందరపడక సద్గురువు లభించునంతవఱకు పరమగురుడగు భగవంతుడే గురువని నమ్మికొని శాస్త్రాధ్యయనమును చేయుచు తమవంటి ముముక్షువుల సాంగత్యముతో సద్విచారము చేయుట యుక్తము.

కొందఱు గురువులమని చెప్పుకొని, ఒక్కక్షణములో బ్రహ్మమును చూపగలమని వారి శిష్యుల మూలమున ప్రచారము చేసికొనుచుందురు. వర్తమాన కాలమున నిది జీవనోపాయమగు ఒక వ్యాపారముగ నున్నది. ఈ ప్రసంగమును వదలి యీ యంశమున దీక్షితులవారు చెప్పిన దేమో దానిని వివరింతును.

"చెప్ప శఖ్యంగాని ప్రశ్నలకు ఎవ్వరూ భ్రాంతిలేకుండా చెప్పరు. **యేభాష్యాలు భ్రాంతిలేకుండా చెప్పలేరు. ఎటువంటి వారికి చెప్పగానే భ్రాంతిపోవద్దా? నిప్పుదగ్గరకు పోతే చలిపోయి నట్లు వుండవలె. భోంచేస్తే ఆకలి తీరినట్లు యుండవలె. ప్రయాణం నుంచి యింటికి వస్తే ఆయాసం పోయినట్లు వుండవలె. అన్నీ సరేగాని దాటించేవాడు ఘట్టివాడు కావలె".**

(బృ. పూ. పు. 60)

దీక్షితులవారు బయలును చూచిన తన శిష్యుడు చెప్పిన వాక్యములుగా ఇట్లు చెప్పిరి. ఆ శిష్యుడు ప్రకృతి యట.

ప్ర|| **గురుకటాక్షం చేత అనాయాసమాయ - వొక్క భ్రాంతి పుట్టకపాయ. చేసినా - విడిచినా వూరకేవున్నా వొక్కటే ప్రకారం అచలం చలించదు. గనుక దర్వాజా తీసినట్లు అయ*** (బృ. పూ. పు 110)

దీక్షితులవారి పై వాక్యములను వినినవారికి ఎంతో ఆశకలిగి అలస్య మెంత మాత్రము చేయక అచలగురుని కటాక్షమును (ఉపదేశమును) పొందగోరుదురు. బంగారమును అమ్ముటకు వర్తకునికడకు మనము దానిని తీసికొనివెళ్లిన అది శుద్ధమైన బంగారమా? కాదా? యని అత డనేకవిధముల

---

* ప్రకృతి అను శిష్యురాలికిని గురువునకును జరిగిన సంవాదము.

పరీక్షించి చొక్కమైనదైన కొనును. బ్రహ్మసాక్షాత్కారమును పొందినవాని లక్షణములుకూడ అట్లే పరీక్షింపవలయును. అట్టివానియందు ముఖ్యముగా చూడవలసిన గుర్తు లేవనగా - విషయవాంఛలనుండి గురువు విరక్తు డాయెనా లేదా యని.

**శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః।**
**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ (గీత. 2-59)**

పరతత్త్వమును చూచినవానికి ఇంద్రియములు, మనస్సు తమంత తామే వశమగును కనుక విషయాభిలాషమే యుండదు. అట్టి స్థితప్రజ్ఞునకు ఇంద్రియనిగ్రహమునకై ఉపాసనాది సాదనము లక్కరలేదు. అచలగురుడు పరమాత్మను చూపగనే నిప్పువద్దకు పోతే చలిపోవునట్లు మనోనిగ్రహమైన అంతకంటె కావలసిన దేమున్నది?

బయలును చూచిన ఒక అచలవాది ఒక కీర్తన యిట్లు పాడినాడు.

**"ఆహాహా యిదయేమిచిత్రమో సద్గురుని మహిమ యూహింపరాకున్నది - వేదశాస్త్రపురాణములు యితిహాసములు అరకాసుకును కొరగాకపోయెను."**

అతడన్నట్లు, తెరతీసిన కనబడునట్లు బ్రహ్మమును చూచిన వేదశాస్త్రాదులను బండ్లతో తోలుకొనిపోయి సముద్రున కర్పింపవలసినదేకదా? ఇన్ని శాస్త్రములు శోధించి తెలిసికొనదగిన వస్తువును అచలగురుడు చేతికందించిన వేదాదు లెందుకు? శ్రీదీక్షితులు తరువాత చెప్పిన వాక్యములలో శిష్యుడు పంద్రెండేండ్లు గురుసేవ చేయవలెనట. దేనికి? చిత్తశుద్ధికొఱకా? చిత్తశుద్ధితో పనియేమి? గురుడు బయలును చూపించుట, శిష్యుడు చూచుట. ఇంతటితో సమస్తము ముగిసినది కదా?

దీక్షితులవారి యీ క్రింది వాక్యములను గమనింపుము.

**"శి॥ .... నాకు శీఘ్రముగా సూచన చెయ్యండి."**

**"ఈ ఉపదేశమునకు మంత్రము లేదు. తంత్రము లేదు. యోగములు గావు. ధారణములు గావు. క్షేత్రములు గావు. వ్రతములు గావు. తపములు గావు. యజ్ఞములు గావు. మహాసూక్ష్మసులభము. ఈ సులభము పదిరెండు**

సంవత్సరములు శోధించవలెను. ఈ వాక్యము మరువక యుండవలెను. ఆ మరణాంతము యుండవలెను". (బృ. పూ. పు. 18)

"గురువు యెటువంటి వా డనగా ఓడ నడుపుటయందు సారథిగా నగుచున్నాడు. గురువునకు పదిరెండు సంవత్సరములు సేవచేయవలెను. దీర్ఘకాలము గురుసేవచేతగాని భ్రాంతిరహితులు కారు. శిష్యుడు యేమైన తొందరపడనీగాక, గురువునకు సమానము గలుగవలెను. మాటలవలననే బోధ చేయుచుండవలెను". (బృ. పూ. పు. 17)

"గురువుదగ్గరకు శిష్యుడు వెళ్లి, పదిరెండు సంవత్సరములు వారికి శుశ్రూష చేయవలెను. గురువుకు ప్రతిదినము. ప్రదక్షిణము చేసి దీర్ఘనమస్కారము పదిరెండుసార్లు చేయవలెను. గురువు భార్యకున్ను అదేవిధముగా నమస్కారము చేయవలెను. గురువు యెంగిలి తినవలెను". (బృ. పూ. పు. 37)

ఒక్క క్షణములో 'దర్వాజా తీసినట్లు" అయితే పంద్రెండు సంవత్సరములు శోధించు టెందులకు? అంతేకాదు, ఆమరణాంతము (ఆమరణము) గురువాక్యము మరువక యుండవలయునట. ఇతరులకంటెను వీరి యాధిక్య మే మున్నది?

జిజ్ఞాసువు :- అయ్యా! ఒక ముముక్షువునకు సద్గురువు లభింపలేదు. భగవంతునిపై భారము వైచి వేదాంత శాస్త్రాధ్యయనము చేయును, అతనికి విముక్తి కలుగదా?

వేదాంతి :- యోగవాసిష్ఠము గురువులతోను శాస్త్రములతోను అవసరము లేదని చెప్పిన వాక్యములు ఇదివఱకే చెప్పియుంటినికదా! మఱల ఈ ప్రశ్న యెందుకు? అయినను చెప్పెదను వినుము :- జ్ఞానము విజ్ఞానము ఈ రెండును ముక్తిహేతువులేనని శాస్త్రములును, పెద్దలును చెప్పిరి. జ్ఞానమనగా:- ముముక్షువు శ్రద్ధాళువై ముక్తిని కాక్షించి వేదాంతశాస్త్రములు చదివి వాటికి సరియగు అర్థమును గ్రహించిన అతనికి కలుగు వివేకము, లేక అనుభవము, జ్ఞానమనబడును, బ్రహ్మ పరోక్షానుభవము విజ్ఞాన మనబడును. పరబ్రహ్మమును గురించిన సంపూర్ణ జ్ఞానము కూడ విజ్ఞాన మనబడు నందురు. భగవద్గీతకు వ్యాఖ్యానములు రచియించిన వారందఱు నిట్లే చెప్పిరి. కాని, లోకమాన్య శ్రీ బాలగంగాధర్ తిలక్ మహాశయులు 'విజ్ఞాన' శబ్దమునకు భిన్నార్థమును చెప్పిరి. దానిని (14వ అధ్యాయమున) చెప్పియుంటిని. భగవద్గీతకు

వ్యాఖ్యానమును రచియించిన వారిలో శ్రీ విద్యారణ్యస్వాములవారి గురువగు శ్రీ శంకరానందస్వాములవారు గీతయొక్క 3-41వ శ్లోకవ్యాఖ్యానమున జ్ఞాన, విజ్ఞాన శబ్దములకున్న అర్థభేదమును ఇట్లు వ్రాసిరి:-

"చంద్ర, సూర్యులవలె సామాన్యముగను విశేషముగను ప్రకాశించునవియునగు జ్ఞాన విజ్ఞానములను"

అనగా:- పున్నమినాడు చంద్రుని వెన్నెలయందు ప్రపంచమును చూచినట్లు జ్ఞానమువలన బ్రహ్మసాక్షాత్కార మగుననియు, విజ్ఞానమువలన మధ్యాహ్నకాలమున సూర్యుడు ప్రకాశించుచుండగా ప్రపంచమును చూచినట్లు స్పష్టముగా బ్రహ్మ సాక్షాత్కార మగుననియు తాత్పర్యము ఇదిగాక గీతయొక్క 6-8 శ్లోకము వ్యాఖ్యానమున జ్ఞాన విజ్ఞానముల భేదమును ఇట్లు వ్రాసిరి-

"ఇట్టి శ్రుతి స్మృతి వాక్యముల బలమువలన శాస్త్రములను బట్టి సూర్యగ్రహణమును నిర్ధారణ చేయునట్లు సమస్తమును బ్రహ్మమాత్రమే యని నిరర్గళముగా నిశ్చయించుటకు జ్ఞానమనిపేరు . . . నేత్రములద్వారా రాహుగ్రస్త సూర్యబింబమును దర్శించినట్లు నిర్విశేషముగా సర్వత్ర సంపూర్ణమైయున్న బ్రహ్మమును సాక్షాత్తుగా ప్రత్యక్షము చేసికొనుటను విజ్ఞానమనిపేరు " కావున జ్ఞానికిని ముక్తి కలుగునని తాత్పర్యము.

గురువు లేకున్నను వేదాంత శాస్త్రములను చదివి వాటియొక్క సరియైన అర్థమును గ్రహించుటవలన జ్ఞానము కలుగును. జ్ఞానమువలన మోక్షము కలుగునని నా నిశ్చయము. సద్గురువు లభించినవానికి ముక్తి సులభముగ లభించును

## (౪౧) గురువు శిష్యునకు బయలు సూచన చేయుట

గురువు శిష్యునకు బయలును చూపునట, చర్మచక్షువునకు కాదట, మఱిదేనికి? జ్ఞాన చక్షువునకట. జ్ఞానమే నీవనిరికదా? 'కంటిలో పాపనే నీవనిరి' కదా? (కందములు 72 ; 102) దీక్షితులవారు ఈ యంశమున చెప్పిన వాక్యముల నిట నుదాహరింతును:-

**"ఈ ఉత్త బట్టబయలు ఎవ రెరుగుదురు, కేవలాత్మ ఈ ఉత్తపరం ముంజేతి కంకణమువలె నగుపడుచున్నది".** (బృ. పూ ప్ర. 10)

"పరిపూర్ణ మనగా యీ కనపడువదే పరిపూర్ణము. ఈ కనపడేది పరము కాదని యందురేమో, యిది బట్టబయలు కాకపోతే దీనిని మాత్రము నిషేధింపబడుచున్నదా? ఇది సృష్టికి పూర్వము ఉండలేదా? (బృ. పూ. ప్ర. 10)

ఈవిధముగా దీక్షితులవారు బయలు అపరోక్షమని చూపినట్లు చెప్పిరి. (సృష్టి జరుగలేదని జెప్పియు "సృష్టికి పూర్వము" అని అనుట తప్పు కాదా?) కృష్ణదాసుగారును అట్లే చెప్పిరి. కృష్ణదాసుగారి వాక్యములు కొన్ని మాత్రమే ఉదాహరింతును :-

"కనబడెడు బయలులోపల" (కంద. 78), "కావున నద్దేవుణ్ణియిదిగో - కనుగొనవోయి" (కంద. 110), "ఈ ఉత్త బట్టబయలు" (కంద. 135) "వేదనకు మున్న దదిగో" (కంద. 136) "కనవచ్చు బయలు లేదని యనవచ్చునె" (కంద. 138), "పరిపూర్ణ మిదిగో" (కంద. 226), "అబ్బ యీ బయలున్నది" (కంద. 49), "జ్ఞాన కర్మ స్వరూపము - గాని బయల్ నదిగో చూచి" (కంద. 51), "యీ బయలుండ జూచి" (కంద. 54), "చూపించరానిది - యప్పా యల్లదిగో చూడుమని నే నీకున్ - చెప్పి చూపిస్తి మరువకు" (కంద. 63), ఈ విధముగా వారు, ఎఱుక బయలును ఎఱిగినట్లు చెప్పిరి. అట్లనిన ఎఱుక ద్రష్టయు, బయలు (అచలము) దృశ్యమును అని అంగీకరించినట్లయినది. దృశ్యమంతయు నశించునదే, చూచిన ఎఱుకకూడా నశించునని అనేకపర్యాయములు చెప్పియున్నారు. అట్లయిన నిత్యసత్యమగు వస్తువేది? అచల వాదులలో కొందఱు 'చూపిస్తి' అనుటకు - చూపను నీకిస్తిని - అని అర్థమును చెప్పుదురు. దీక్షితులవారు చెప్పిన మఱికొన్ని వాక్యములను కూడ చెప్పెదను.

(1) "శరీరము ఎషువంటిదంటే సర్వము శూన్యం యెషువంటిదో అషువంటిది. శరీరము లేకుంటే ఏలాగున వున్నదో అలాగే పరిపూర్ణం వున్నధి." (బృ. పు. ప్ర. 1) మఱియు గురుశిష్య సంవాదరూపమున నీ క్రింది వాక్యములు చెప్పిరి :-

(2) "గు|| మూలంలేని గుర్తెరిగే శరీరం లేకుంటే యేలాగో అలాగే వ్యవహారం యిటువంటిది. వారు గుర్తెరిగే చైతన్యరహితులు."

(బృ. పూ. ప్ర. 3 అ. 4)

(3) "ఈ శరీరం లేకుంటే ఏలాగు వున్నదో అలాగే పరిపూర్ణం వున్నది."

(బృ. ఉ ప్ర 6 అ 6)

(4) గు॥ సర్వం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ యేలాగో అలాగే పుట్టని చావని అచలం తనకు తానే స్వతసిద్ధమై వుండె.

(5) ప్ర॥ సరే అసాధ్యమంటే భయమాయె. యేసాధన లేకనే పరిపూర్ణం స్వతసిద్ధమై వున్నది. ఏమి ఆశ్చర్యం యింతే కదా."

(6) "గు॥ ఎంత గట్టిదానవు." (బృ. పూ ప్ర. 7)

పై చెప్పిన ఆ అంశములలో సారాంశమేమన మొదటి నాలుగంశముల యందలి సారాంశము ఎఱుక యొక్క లేమియే, బయలని చెప్పినట్లు అర్థమగుచున్నది. ఈ యంశమును దృఢపరచు ఈ క్రింది వాక్యములను గమనింపుము:-

"గు॥ అలాగేమూలంలేని గుర్తెరిగే శరీర మేమిలేదని నిశ్చయముంటే చాలు. పుట్టని చావనిది తనకుతానే స్వతసిద్ధమై వున్నది. కనుక ప్రయత్నం యేమీలేదు.", (బృ. ఉ. ప్ర. 6 అ. 6) అంతేగాక "ఈ ఉత్త బట్టబయలును యెవరు గుర్తెరుగరు.", (బృ. పూ. ప్ర. 6) అంతేకాని, యిచట అపరోక్షాను భవ మేమియును లేదు. ఇంతమాత్రము తెలిసికొనుటకు దీక్షితులవారు చెప్పినట్లు సాధనములతోగాని యోగాదులతో గాని అవసరము లేదు. కనుకనే (5వ అంశమున) ప్రకృతి అను శిష్యురాలు దీని అర్థము నెఱిగి గురువును ప్రశంసించి "యింతేకదా" అని గురువు చూపిన సూచనను చులుకనచేసి చెప్పినది.

ఇట్లు సులభముగా తెలిసికొన్న శిష్యురాలిని (6వ అంశమున) "ఎంతగట్టిదానవు" అని గురువు ప్రశంసించుట జరిగినది. (5వ అంశమున) "అసాధ్యమేమంటే భయమాయె - అనుట. అందులో అసాధ్యమేమియు లేదని అర్థము. ఇంతమాత్రమున కాశిష్యుడు గురువుదగ్గరకు వెళ్ళి పదిరెండు సంవత్సరములు వారికి శుశ్రూష చేయుట, గురువునకు ప్రతిదినము ప్రదక్షిణముచేసి దీర్ఘనమస్కారములు పంద్రెండుసారులు చేయవలెనట. గురువుభార్యకు ఆవిధముగనే నమస్కారము చేయవలెనట. గురువు నెంగిలి తినలయునట. (ఈ వాక్యములు వెనుకటి అధ్యాయమునందు చెప్పినవే).

గురువునకు ఎంతమంచి లాభమో చూడుడు. జీతము బత్తెము లేని సేవకుడు, పంద్రెండేండ్లు సేవ చేయవలెననిన గురువునకు అదృష్టమే. గురువునెంగిలిని శిష్యుడు తినవలెనని చెప్పిరిగాని గురుపత్నియెంగిలి కూడ తినవలయునని యెందుకు చెప్పలేదో? ఈ పంద్రెండేండ్లు శిష్యున కేవిధముగా జీవితము గడవవలెను? వాని భార్యాపుత్రుల గతియేమి? ఈ మధ్యకాలములో గురుడో, శిష్యుడో మరణించిన శిష్యునిగతి అధోగతియేనా? బయలు చూపుటకు దీక్షితులవారు పెద్ద బేరమే చెప్పినారు. ఇప్పు డిట్టి శిష్యులున్నారా?

జిజ్ఞాసువు :- అయ్యో! కొందఱు గురువులు శిష్యులయెడ దయగలవారై పరతత్త్వమును పొందుటకు ఆటంకములగు బుద్ధిగత మాలిన్యములు, మలినవాసనలు పోగొట్టుటకై తమ శక్తిని శిష్యునియందు మొదట ప్రవేశపెట్టి బుద్ధిగత మాలిన్యమును పోగొట్టి తత్త్వోపదేశము చేయుదురని వింటిని. దానిని గుఱించి చెప్పుడు.

వేదాంతి :- అట్టి ఆచారమున్నట్లు గ్రంథములయందు చదివియున్నాను. దానినే 'శక్తిపాత' మందురు. ఇది హస్తమస్తక సంయోగమున కలుగును. వీరశైవులు దీనిని 'మేధాదీక్ష' యందురు.

**శ్లో॥ గురోరాలోకమాత్రేణ హస్తమస్తక యోగతః।**
**యః శివత్వ సమావేశో మేధాదీక్షేతి సా మతా॥ (సి. శి. 6-13)**

తా॥ శ్రీ గురుని కృపాదృష్టి మాత్రముననను హస్తమస్తక సంయోగ, మాత్రముననను (శిష్యుని తలపై గురుడు తనచేతి నుంచుటవలనను) ఎట్టి జ్ఞానక్రియారూపమైన శివతత్త్వ సమావేశము కలుగనో అదియే మేధాదీక్ష యనబడును.

ఆ గ్రంథమునందే 'దీక్షా పాదోదక స్థలము' నందు ఇట్లు వ్రాసిరి :-

గురు హస్తమస్తక సంయోగరూప మైనట్టిగాని, శిష్యమస్తకాఘ్రాణ రూపమైనట్టిగాని, దీక్షా విశేషముచే గురుశిష్యుల యైక్యము చెప్పబడును. అనగా : గురువు తన తపశ్శక్తిచే సంగ్రహించిన శివతేజస్సును తనచేయి శిష్యుని తలపై నుంచిగాని, శిష్యుని శిరము మూర్కొనిగాని శిష్యుని యందు సక్రమింపజేయును. దీనికే శక్తిపాతమని పేరు.

శ్రీ సీతారామాంజనేయ సంవాద మను గ్రంథమున నిట్లున్నది:-

సీ॥ అని యిట్లు బోధించి యానందమయుడగు
శ్రీరాఘవుడు నిజ శ్రీపదార
విందంబులకు భక్తి వందనంబులుసేయు
హనుమంతు గనుగొని యప్పుడతని
శిరమును పూర్వాద్రి శిఖరంబుపై స్వక
రార్క మండలము డాయంగ జేర్చి
తనరు నీహస్తమస్తకయోగ మిప్పుడ
తెలివి యెఱుంగు నా తెలివి నీవు

తే॥ తెలివి నీవని తెలుపగా దెలియు నెద్ది
యదియె నీవను వెలుగుచే ననిలసుతుని
ధీ గతాజ్ఞాన నిత్యాంధతిమిర మెల్ల
బాపి కేవల తత్త్వరూపంబు జూపె.

శ్రీరామచంద్రుడు ఆంజనేయుని శిరమున తనహస్తము నుంచుటను 'హస్తమస్తక సంయోగ' మందురు. ఆవిధముచే శ్రీరామచంద్రుడు తనయందున్న కొంత శక్తిని ఆంజనేయునకు సంక్రమింపజేసెననియు, అదే కార్యమున ఆత్మస్వరూప మిట్టిదని అనుభవపూర్వకముగ తెలిపెననియు భావింపవలయును. కవి పద్యమునందు '**నీ హస్త మస్తక యోగ మిప్పుడే తెలివి యెఱుగు నా తెలివి నీవు**' అనియు '**తెలివి నీవని తెలుపగా తెలియు నెద్ది యదియె నీవు**' అనియును రెండుమారులు 'నీవు' 'నీవు' అని తెలిపియుండుట వలన మొదట చెప్పిన నీవు 'చిదాభాసుడగు జీవ స్వరూపమును వివరించెననియు, రెండవమారు చెప్పిన 'నీవు' చిదాభాసుని తెలిసికొను తెలివి (జ్ఞానము) సాక్షియగు ప్రత్యగాత్మ స్వరూపమును ఇట్టిదని వివరించి చూపుటచే ఆంజనేయుని బుద్ధిగతమైన అజ్ఞానాంధకారమును నశియింపజేసి కేవల తత్త్వమును (కేవలాత్మను) దర్శింపజేసెననియు, ఆ తరువాత చెప్పిన పద్యమున చెప్పియున్నారు. ఆంజనేయులు ఉపదేశమాత్రమున ప్రత్యగాత్మ సాక్షాత్కారమును పొందుట శ్రీరామచంద్రుని శక్తిపాతమువలననే యని యూహించుకొనవలయును. అంతేకాక, ఆంజనేయులు పరమానందము ననుభవించెననియు చెప్పబడును.

శ్రీరామచంద్రునకు వసిష్ఠమహాముని యొనర్చిన శక్తి పాతమువలన చిత్తము వికసించి కొంతతడవు పరమానంద సముద్రమున నోలలాడెనని యోగవాసిష్ఠమున కలదు. (నిర్వాణ ప్రకరణము)

శ్రీ దక్షిణామూర్తి తనచూపులతోను, మందస్మితముతోను మఱ్ఱిచెట్టుక్రింద కూర్చుండి తన్ను పరివేష్ఠించియుండు మునుల అజ్ఞానమును పోగొట్టునట్లు శ్రీ శంకరులు వ్రాసిరి.

శ్లో|| "అద్రాక్ష మక్షీణ దయానిధాన
మాచార్య మాద్యం వటమూలభాగే|
మౌనేన మందస్మిత భూషితేన
మహర్షి లోకస్య తమోనుదంతమ్||" (దక్షిణామూర్తిస్తోత్రం)

గుర్వనుగ్రహమును గుఱించి మఱియొక యితిహాసమును వినిపింతును. శ్రీ శంకరుల శిష్యులయందు 'గిరి' అను శిష్యుడుండెను. వారికి సర్వమును వారి గురుదేవుడే. గురుదేవుని వస్త్రము ఉతుకుట, వారి పాదము లొత్తుట, గురువు స్నానమునకు పోవునపుడు వెంటపోవుట, భోజనాది సౌకర్యము లొనర్చుట - యిట్టిసేవయందే వారికి కాలమంతయు గడిచిపోవును. గ్రంథపఠనముగాని, సాధనముగాని వారికి ఇష్టము లేదు. అందువలన వారికి శాస్త్రపరిచయము లేదు.

ఒక దినమున శృంగేరి ఆశ్రమమునందు పద్మపాదాది శ్రీ శంకరశిష్యులు ఉపనిషత్పఠనమున కుపక్రమించి శాంతిమంత్రమును పఠించుట కుద్యుక్తులు కాగా, శ్రీ శంకరులు వారిని చూచి 'ఆగండి. గిరికూడా క్షణమాత్రమున రాగలడు' అని చెప్పిరి శ్రీ పద్మపాదులు శ్రీ గురువాక్యములు విని 'గోడవలె జడుడును, శాస్త్రమున కనధికారియు నగు, వానికొఱకేల యెదురుచూచెదరు' అని గోడను చూపించిరి.

పద్మపాదుల వాక్యములకు శ్రీ శంకరులు హృదయమున నొచ్చుకొని, అతని గర్వమడంచుటకును, తన్నే నమ్ముకొనియున్న గిరియెడల గల కారుణ్యము చేతను, తన మనస్సునందే గిరికి పదునాలుగువిద్య లుపదేశించెను. (పదునాలుగు విద్యలు గిరికి లభించుగాక యని మనస్సున తలచెను.) గిరి ఆశ్చర్యముతో తిరిగివచ్చి ఉపనిషత్తులయందలి అర్థము స్పష్టపరచుచు,

గురుదేవుని తోటకవృత్త రూపమగు శ్లోకములచే స్తుతించెను అంత శ్రీ శంకరులు గిరికి 'తోటకాచార్యులు' అను నామకరణ మొనర్చిరి సోదర శిష్యులు (సతీర్థులు) అతనిని సమ్మానించిరి (శ్రీ శంకరవిజయము 12 వ సర్గము). శ్రీ శంకరులు తదనంతరము బదరికాశ్రమము నందలి శ్రీ మఠమునకు తోటకాచార్యులవారిని ప్రథమాచార్యులుగా నియోగించిరి.

ఇదికూడ ఒకవిధముగా శక్తిపాతము గావించుటే, శ్రీరామకృష్ణ పరమహంసగారు శ్రీ వివేకానంద స్వాములవారికి శక్తిపాతము కలిగించిరని శ్రీరామకృష్ణ పరమహంస జీవిత చరిత్రయందు చదివియున్నాను. శ్రీ రమణమహర్షి తమ శిష్యులగు కావ్యకంఠ గణపతిమునిగారికి ఇట్లే శక్తిపాతము నిచ్చినట్లు 'నాయన' అను గ్రంథమున కలదు. ప్రస్తుత కాలమున నిట్టి గురువు లున్నట్లు వినుచున్నాము.

జిజ్ఞాసువు:- దీక్షితులవారును కృష్ణదాసుగారును బయలు 'ముంజేతి కంకణమని' 'ఈ కనబడేదే' నని చెప్పిరి కదా? అట్లయిన ఒకరు మరియొకరికి చూపింపవలసిన అవసరమేమి?

వేదాంతి:- కృష్ణదాసుగారు ఇట్లు చెప్పిరి:-

కం|| **అయమాత్మా యనిన రీతిగ**
**నయముగ యీబట్టబయలు నదిగో యనుటల్**
**అయ మియమని యనుట ల్మ**
**క్కియమున ననవలెసె నీదు కీడుడుగుటకై.** (కంద. 40)

ఈ పద్యభావ మేమన :- మేము (అచలవేదాంతులము) 'అదిగో బయలు' 'ఇదిగో బయలు' అని అనేక పర్యాయములు చెప్పియుండుట యెట్టిదనగా - మాండూక్యశ్రుతి 'అయమాత్మా బ్రహ్మ' అనుటవంటిదే. రెండును అబద్ధమే. ఇది టక్కు. ఇది దబ్బర. అయినను నీ కీడును పోగొట్టుట కిట్టి అసత్య మాడితిమి - అనిరి

వీరే వీరి 101 వ కందార్థమున గురుకృప కలిగిన పరోక్షమైన బయలు అపరోక్షమగు ననిరి. ఇవి పరస్పర విరుద్ధములు. సర్వవ్యాపియగు వస్తువెప్పటికిని అపరోక్షమే.

ఒకడు బ్రహ్మమును చూపుట, మఱియొకడు చూచుటయును వ్యవహారమునందు చూడబడినది దృశ్యమగును గదా? బ్రహ్మము దృశ్యము కాదు. దృశ్యమైనది నిత్యసత్యమైన బ్రహ్మము కాదు.

శ్రుతి 'అయమాత్మా బ్రహ్మ' ఈ ఆత్మయే బ్రహ్మము అను మహావాక్యమును చెప్పుట ముముక్షువునకు ఆత్మయొక్క అపరోక్షత్వమును బోధించుటకే గాని ఆత్మ హుళక్కి కాదు. ఇచట శ్రుతిచేత చెప్పబడిన ఆత్మ అపరోక్షము, అద్వైతము (ఏకము), ప్రజ్ఞానఘనము. ఇదియే శ్రుతులు చెప్పిన పరబ్రహ్మము; పరమ పురుషుడు. ఇట్టి ఆత్మ తానే తన్ను తెలిసికొనుచున్నందున అపరోక్షమే పరోక్షమునందు, ద్వైతభావముండును. ఆత్మ తప్ప అన్యమేమియు లేనందున ఆత్మ తనకు తాను అపరోక్షమయ్యే యున్నది. అప్పుడు బ్రహ్మము దృశ్యము కాదు. దీక్షితులవారును, కృష్ణదాసుగారును చెప్పునట్టి బయలువిషయమున అట్లు చెప్పుటకు వీలులేదు. ఎఱుక మిథ్య, బయలు తన్ను తా నెఱుగదు. బయలు ఎవరికిని అపరోక్షము కనుక 'అదిగో' 'ఇదిగో' ఇత్యాది అపరోక్షానుభవమును బోధించు వాక్యము లిందు వర్తింపవు. ఇవి కేవలము **లోకులను తమ శిష్యులనుగా ఆకర్షించుటకు చెప్పినవే.** బయలును **'అదిగో' అనుట హుళక్కే యని సత్యమును దాచక చెప్పినందులకు** వారు (కృష్ణదాసుగారు) అభివందనీయులు.

## (౪౨) శబ్దబ్రహ్మవాదము - స్ఫోటవాదము

జిజ్ఞాసువు:- స్వామి! ఏ సాధనము లేకయే 'ఎఱుక లేకపోవుటయే బయలు' అని చెప్పగా విన్న శిష్యునకు యెఱుక నశించునా?

వేదాంతి:- వారు ఎఱుకను గుఱించి యింకొక విధముగ కూడ చెప్పిరి. దానిని నీకు వినిపింతును. అందువలన విషయము చక్కగా బోధపడును. అది యేమనగా- దీక్షితులవారు వాక్కును ఎఱుక అన్నారు. అనగా మాటయే యెఱుకయట. ఎఱుకచేత బయలును తెలిసికొనిన యెఱుక లేకపోవునట. వారివాక్యములను వినుము- **"మాయ సమస్తభాషారూపిణి, గాయత్రీ సావిత్రీ సచ్చిదానంద రూపిణీ అని ఉన్నది"** (బ్ర. ఉ. పు. 35) ఇదేవిధముగా

మఱియొకచోట (బృ. ఉ ప్ర 5 అ. 4) నిట్లే చెప్పియున్నారు. "**అజ్ఞానమే కారణశరీరము**" (బృ. పూ ప్ర. 4 అ. 1)

ఇప్పుడు ఆలోచింపుము. గురువాక్యమనే జ్ఞానము (మహా కారణశరీరము) చేత అజ్ఞానమను కారణశరీరము నశింపగా బయలును చూపి యెఱుక నశించినదని చెప్పిన వాక్యము నీకు బోధపడియుండును. ఇచ్చట (గురు) వాక్యమే యెఱుక. అనగా - మాటయే యెఱుక, ఇది ఒకవిధమగు స్ఫోటవాదము, శబ్ద బ్రహ్మవాదమువంటి వాదము. భారతీయ దర్శనములయందు శబ్ద బ్రహ్మవాదమను శబ్దాద్వైతవాద మొకటి కలదు. ఇది వైయాకరణులచే ప్రాచీన కాలమునందే స్థాపింపబడినదందురు. పాణిని మహర్షి వ్యాకరణమును రచియించిరి. వారి వ్యాకరణమునకు శ్రీ కాత్యాయనులు వార్తికమును వ్రాసిరి. దానికి శ్రీ పతంజలి భాష్యమును రచియించిరి. వీ రందఱు ఈ మతమునకు చెందిన వారని అందురు. వీరిమతము సంగ్రహముగ ఇట్లుండును :-

ఆద్యంతములు లేని శబ్దమే బ్రహ్మము. ఇదియే ప్రపంచముగా (నానాత్వముగ) మారినది. భర్తృహరి (క్రీ. శ. 600-650) యీ మతమునకు చెందినవారు. శబ్దబ్రహ్మతత్త్వముయొక్క ప్రథమరూపము, ప్రథమనామము 'ఓమ్' అను ప్రణవము.* ఆ ఓమ్ నుండియే జగత్తు ఆవిర్భవించినది. శబ్దతత్త్వమే అవిద్యాసంబంధము లేని అనంతాత్మయై యుండియు అవిద్యతోకూడిన జీవాత్మవలె కనబడును. శబ్ద శ్రవణమువలన భావ ముదయించుట వాస్తవమే కాని భావము బ్రహ్మము (ఆత్మ)కాదని వేదాంతుల సిద్ధాంతము.

జిజ్ఞాసువు :- స్ఫోటవాద మంటిరికదా? అది యెట్టిదో ఆనతిండు.

వేదాంతి :- అది మనకు ప్రస్తుతాంశము కాదు. ప్రస్తావనవశమున ఆమాట చెప్పితిని. అయినను దానిని గుఱించి సంగ్రహముగ చెప్పెదను. - నేనిదివఱలో శ్రీవిద్యను గుఱించి నీకు చెప్పినప్పుడు కామేశ్వరీ కామేశ్వర

---

*** ప్రణవమును గుఱించి యీ గ్రంథముయొక్క ద్వితీయభాగము నందలి మొదటి ప్రకరణము "(౧౧) ప్రణవోపాసన" అను అధ్యాయమున చెప్పియున్నందున నిచట విస్తరించి చెప్పలేదు.**

దంపతీద్వయమునుండి నామ రూప శాఖలు ఎట్లేర్పడినవో ఆవిధమును, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ - అను చతుర్విధ వాక్కులను గుఱించిన వివరమును చెప్పియుంటిని.* వాటి నిచ్చట జ్ఞప్తికి తెచ్చుకొనవలయును. పరావాక్కే సంకల్పము. మధ్యమమే స్ఫోటము. సంకల్పము, (లేక, శబ్దము) బ్రహ్మమునందే కలిగినదందురు. 'పర' సర్వవ్యవహారాతీతమును, నిర్గుణాద్వయ బ్రహ్మమే స్ఫోటమని కొందఱందురు. స్ఫోటవాదము ననుసరించి 'ఓమ్' కారమే బ్రహ్మము. అది సర్వశబ్దములకు మూలము. అది బ్రహ్మస్వరూపమని స్ఫోటవాదుల మతము. సృష్టియొక్క ఆరంభమున నామరూపము లేర్పడుటకు ముందు సమస్తమును ఓమ్ అను శబ్దముచే నిండియుండినదట. శబ్దోచ్చారణచేయు వానియందు మధ్యమావైఖరీలు ఏకకాలముననే కలుగును. వినువానియం దట్లుకాదు. వైఖరీవాక్కు వినువాని శ్రవణేంద్రియముద్వారా హృదయమున ప్రవేశించుటచే మధ్యమాధ్వని ప్రకాశించును. అనగా - అర్థస్ఫురణము కలుగును. ఈ కార్యద్వయము వ్యక్తమగుటకు స్వల్పవ్యవధి కలుగును. శబ్దము నుచ్చరించిన పిమ్మటకదా? దానిని వినినవాడు శబ్దముయొక్క అర్థమును గ్రహించుచున్నాడు. వైఖరీ వాక్కుచే అభివ్యక్తమగు వాక్యము ఆ

---

* ఈ గ్రంథముయొక్క తృతీయభాగము 15వ అధ్యాయము నందలి "నామశాఖ - వాక్పుట్టుయము" అను శీర్షికలయందు చెప్పియున్నాను

శబ్దము బ్రహ్మమునందే కలిగినదనియు, అదియే సమస్త బ్రహ్మాండముల సృజించినదనియు, లేదా జగద్రూపమున పరిణమించినదనియు, చెప్పునట్టి శబ్దబ్రహ్మవాదుల యీ సిద్ధాంతము క్రైస్తవదర్శనములోని ప్రధాన సూత్రముతో కొంత పోలియున్నది. బైబిల్ క్రొత్త నిబంధనయం దిట్లున్నది:-

"ఆదియందు వాక్యముండెను. (In the beginning there was word) వాక్యము దేవుడైయుండెను. ఆయన ఆదియందు దేవునియొద్ద యుండెను. సమస్తమును ఆయనమూలమున కలిగెను. కలిగియున్న దేదియు ఆయన లేకుండ కలుగలేదు" (యోహాన్ సువార్త 1-4).

"ఈ వాక్యము శరీరధారియై, కృపాసత్యసంపూర్ణుడుగా మనమధ్య నివసించెను." (యో. సు. 1-14) క్రైస్తవుల త్రితయైక సిద్ధాంతమునందు, రెండవవారు ఏసుక్రీస్తు. వాక్యమే ఆయనగా అవతరించెనని క్రైస్తవుల విశ్వాసము

క్షణముననే అంతరించుచున్నదను ప్రతీతి * మధ్యామావాక్కుచే అభివ్యక్తమగు స్ఫోటమును నిత్యము అఖండము అని అందురు.

మహాకాశము అంతటను వ్యాపించియుండియు ఘటము, గృహము మొదలగు ఉపాధులయందున్నపుడు లోకవ్యవహారమున ఘటాకాశమనియు, గృహాకాశమనియు మొదలగు నామములచే వ్యవహరింపబడుచున్నట్లు అఖండమైన స్ఫోటము పద - వాక్య - ధ్వని - భేద సంయోగము వలన వర్ణస్ఫోటము - పదస్ఫోటము - వాక్యస్ఫోటము అని వ్యవహరింపబడుచున్నది. కాని స్ఫోటము అఖండమే కనుక నిత్యమైనదే యందురు.

దీక్షితులవారు ఒకప్పుడు పరావాక్కును ఎఱుకయను నర్థమిచ్చు వాక్యములను, వేఱొకప్పుడు వైఖరీ వాక్కును ఎఱుకయను నర్థమిచ్చు వాక్యములను చెప్పియున్నారు. దీక్షితులవారి యెఱుకకును, స్ఫోటమునకును దీక్షితులవారి మతమునకును భేదమున్నది. ఇంత యేల చెప్పవలసి వచ్చెననగా, ఈ యంశమున కృష్ణదాసుగారు చెప్పిన వాక్యములను కొన్నింటిని ఉదాహరించి వాటి అర్థమును పరిశీలించుటకుగాను. కృష్ణదాసుగారి వాక్యములివి :-

కం|| "మాటలేనట్టి బయలున
మాట కలిగెననుట వినుట మాయగదయ్యా
మాట మాయైతె మానెను
మాటను మాట్లాడి మనము మానుదమవలన్. (కందము 2)

కం|| మాటసుమీ నే ననినను
మాట సుమీ మాయ యనిన మరి జీవశివుల్
మాట సుమీ బ్రహ్మ మనినను
మాట సుమీ మేను జగము మాటేసుమ్మీ." (కందము 137)

---

* ప్రస్తుతకాలమున శబ్దమును గుఱించి భౌతికముగా విశేషపరిశోధన జరిగినందున గ్రామఫోనుప్లేట్, రేడియోఫిలిమ్ టాకీలలో శబ్దము అవ్యక్త స్థితినుండి అవసరమగునపుడు వ్యక్తీకరించుటను మన మెఱిగియున్నాము. కనుక వైఖరివాక్కు సైతము ఉచ్చరించిన మఱుక్షణముననే నశించినదని చెప్పకూడదు. సంకల్పము, శబ్దము ఇవి రెండును ఒకటిగనే భావించి క్షణక్షణము పుట్టుచు గిట్టుచున్న యెఱుక వాక్కేయని దీక్షితులవారి మతమై యుండవచ్చునా? అనియు, అంతలోతునకు పోయి తెలిసికొను శక్తి వారికి కలదా యనియు, సంశయము కలదు ఈ నిరయము పాఠక మహాశయులే చేయగలరు.

ఈ పద్యతాత్పర్యము సులభమే. మాటయే యెరుకయట 'రామ' అను రెండు అక్షరముల నుచ్చరింతుము. అవి విందుము. తిరిగి అవి వినబడవు. అనగా - మాయమగును. కనుక, మాట యన్నను, మాయ యన్నను ఎఱుక యన్నను ఒక్కటే యని వారి భావము ఇందుకు ఏ సాధనలతోను పనిలేదు. కనుక, వీరి మతము స్ఫోటవాద, శబ్దబ్రహ్మవాదములతో పూర్తిగ నేకీభవింపకున్నను కొంతవఱకైన సంబంధ మున్నట్లు తోచును.

స్ఫోటవాదమును నైయాయికులు, సాంఖ్యులు, అద్వైతులు ఖండించిరి. ఎట్లనగా:- పదములయందలి ఒక్కొక్క యక్షరమును ఉచ్చరించునపుడు అంతిమ వర్ణమును ఉచ్చరింపగనే అర్థస్ఫూర్తి కలుగుచుండగా, స్ఫోటమను నొకదానిని తెచ్చిపెట్టుకొనవలసిన అవసరము లేదని ఇతర దార్శనికులు స్ఫోటవాదమును ఖండించిరి - ప్రణవమును పరా పరబ్రహ్మమునకు ప్రతీకముగా ఉపాసకులు గ్రహించుట వేదాంతులకు సమ్మతమే.

సృష్టిసిద్ధాంతమునందు శబ్దమునకు ప్రాముఖ్యము కలదు. స్ఫోటవాదమును వదలి మఱికొంత లోతునకుపోయి శబ్ద బ్రహ్మవాదమును గైకొని విచారించిన మఱికొన్ని విషయములు బోధపడును. వేదములకు భాష్యములు రచియించిన సాయనాచార్యులవారు సృష్టికి (కల్పమునకు) వేదములే మూలము లనిరి. సాయన సిద్ధాంతమును మహాత్ములనేకు లంగీకరించిరి శ్రీ వివేకానంద స్వాములవారు ఒక ఉపన్యాసమునందు,* సాయన సిద్ధాంతమును చక్కగా సమర్థించుచు నిట్లు చెప్పిరి:-

"వేద మనగా అనాదిసత్యములయొక్క సమష్టి. ఆ సత్యములు వేదములకు గోచరించెను. అతీంద్రియ దృశ్యానుభూతి గల వారికి మాత్రమే అవి గోచరించును. మనబోటి సామాన్యులకు గోచరింపవు. కావుననే వేదముల యందు ఋషినామమునకు 'మంత్రార్థద్రష్ట' అని యర్థము గాని యజ్ఞోపవీతమును దాల్చిన బ్రాహ్మణుడు అని కాదు. సంఘమును కులములుగా విభజించినది అనంతరకాలమున. వేదము శబ్దాత్మకము. లేక 'భావాత్మకము'. భావముల రాశికే వేదము అని పేరు. ప్రాచీన ఆర్షభాషలో 'శబ్ద' మనగా అప్రకాశిత

* శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి - సంపుటము 1 భాగము 1 ప్రకరణము 1 ఖండము 9 = (స్థలము కలకత్తా, సంవత్సరము 1897, ఋగ్వేదము మొదలగు వానిని గుఱించిన యుపన్యాసము - 1

రూపమున నుండు సూక్ష్మభావము. అదియే పిదప స్థూలరూపమున ప్రకాశిత మగునది. జగత్తునకు ప్రళయము వచ్చినపుడు భవిష్యత్సృష్టికి మూలములగు సూక్ష్మ బీజములు వేదరూపమున సంక్షిప్తము లగును. కావునే భగవంతుని మొదటి యవతారమగు మత్స్యావతారమున వేదములు దృష్టిగోచర మొనర్పబడినట్లు పురాణములలో చెప్పబడినది. ఈ యవతారమున వేదములు మొదట ప్రకాశితము లగుటతోడనే, తక్కిన సృష్టి వికాసము లన్నియు రూపొంద నారంభించినవి. అనగా - వేదములలోని శబ్దముల (భావముల)లో నుండి విషయప్రపంచమంతయు స్థూల రూపమున గోచరింపసాగెను. ఏలన 'శబ్దము' ('భావము') లో సర్వస్థూల పదార్థములును సూక్ష్మ రూపమున ఇమిడియుండును. పూర్వకల్పము లన్నింటియందు కూడ సృష్టి ఇట్లే ఉత్పత్తియైనది."

జిజ్ఞాసువు:- అయ్యా! పూర్వకల్పమున రూపనామము లన్నియు నశించెను గదా? శబ్దము (భావము) నశింపలేదా ?

వేదాంతి :- ఈ ప్రశ్ననే శ్రీ వివేకానంద స్వాముల వారిని, వారి శిష్యుడు మఱొక విధముగా ప్రశ్నించెను. అందులకు శ్రీ స్వాములవారు చెప్పిన సమాధానమును నాకు తెలిసిన సమాధానముతో చేర్చి నీకు బోధపడునట్లు చెప్పెదను. సావధానుడవై వినుము :-

మొదట నీవు సృష్టిలోని విచిత్రమును చక్కగా అర్థము చేసికొనుము. సృష్టి రెండు విధములు (1) ఈశ్వర సృష్టి, (2) జీవ సృష్టి. మొదటిదగు ఈశ్వర సృష్టియే పంచమహా భూతములును వానికి సంబంధించిన నామరూపములు గల వస్తుజాలమును కాని ఈశ్వరసృష్టిని మనము ప్రత్యేకముగ చూడజాలము. నేను నీకు ఇదివఱలో చెప్పిన కొన్ని విషయముల నిచట స్మరించుకొనుము.*

అంతఃకరణమునందు ప్రతిఫలించిన కూటస్థ (ఆత్మ) ప్రతిబింబము చిదాభాసుడని చెప్పియుంటిని. వెలుతురు సహాయమున బాహ్య ప్రపంచమునసున్న ఘటమును (కుండను) చూచినయెడల దాని ఆకారము నేత్రేంద్రియము ద్వారా మనస్సు గ్రహించి బుద్ధి యెదుట నుంచును. బుద్ధి

---

* బ్రహ్మజిజ్ఞాస ప్రథమభాగము రెండవ ప్రకరణము (౨౯) కూటస్థ చిదాభాసులు (౩౦) దృగ్దృశ్య వివేకము (౩౧) సాక్షి విచారము అను అధ్యాయములు.

ఘటాకారమును పొందును. చిదాభాస సంబంధమగు జ్ఞానము బుద్ధివృత్తియందుండుటవలన ఘటాకారమగు బుద్ధివృత్తిని చూచి ఇది ఘటము అని తెలిసికొందుము. ఈ ఘటమే జీవసృష్టి. తెలిసికొంటిననగా - ఈ ఘటమునే నీవు తెలిసికొన్నది. భూమిపై నుండు స్థూల ఘటమును కాదు. కాని, ఈ రెండును కలిసియే నీకు ఘటాకారమున గోచరించును. అనగా - ఈశ్వర సృష్టియు, జీవసృష్టియు ఒక్కటి కావలెను. (అనగా కలసి పోవలెనని అర్థము). అంతఃకరణమునందు జీవసృష్టియగు ఘటము కలుగకుండిన బాహ్యమునకున్న ఘటమును నీవు చూడజాలవు. దానికిని నీకును సంబంధము లేదు. జీవసృష్టియగు ఘటాకారము, ఘటనామము నీయందు నిలిచిపోయినవి.*

ఈశ్వర సృష్టికి సంబంధించినట్టియు, బాహ్యమున నున్నట్టియు ఘటము పగిలిపోవును. అప్పుడు దానికి ఘటరూపముగాని, ఘటనామముగాని లేదు. కాని, జీవసృష్టియగు నీయందలి ఘటాకారముగాని, ఘటనామముగాని నాశమొందదు. స్థూల రూపమున నేలపైనున్న ఘటము నశించినపుడు నీయందున్న సూక్ష్మఘటమునకు నాశమేల ఘటింపదు? ఆ సృష్టి వేఱు. ఈ సృష్టి వేఱు. ఈశ్వర సృష్టియగు స్థూలరూపము నశియించినను జీవసృష్టియగు సూక్ష్మరూపము భావరూపమున సూక్ష్మాతి సూక్ష్మరూపమున, నీయం దట్లే నిలిచియుండదు. నీవు కోరినప్పుడు అది నీయందు తిరిగి భావరూపమున ఘటాకారముగా గోచరించును. దానివెంటనే 'ఘట' నామము అంటిపెట్టుకొని యుండును. ఈ ద్వివిధ సృష్టులను గూర్చి నీ వర్థము చేసికొంటివా? మొదటి ఘటము లేకపోయినను రెండవది కలదు. మొదట ఈశ్వర సృష్టియు, పిమ్మట జీవసృష్టియు, కలసి నీకు వస్తు (ఘట) జ్ఞానము కలిగించుచున్నది.

---

* శ్రీ విద్యారణ్యస్వాములవారు పంచదశి 4-27 నం దిట్లు చెప్పిరి

శ్లో|| బాధం మానేతు యేనేన యోగాత్స్యా ద్విషయాకృతిః|
భాష్యవార్తిక కారాభ్యా మయ మర్థ ఉదీరితః||

తా|| "మనోవృత్తి ప్రమాణము. ఘటాదివిషయము ప్రమేయము. చిదాభానునితో గూడిన మనోవృత్తియందు విషయాకార మేర్పడును. ప్రత్యక్షమున జూచు వస్తువుల యాకారము చిత్తమం దేర్పడుచున్నది. అదియే మనోమయ రూపమగునని భాష్యవార్తికకారు లిరువురును చెప్పిరి. (భాష్యకారులు శ్రీశంకరులు, వార్తికకారులు శ్రీసురేశ్వరులు).

మం॥ ఈక్షణాది ప్రవేశాంతాః సృష్టిరీశేన కల్పితా।
జాగ్రదాది విమోక్షాంత సగ౦ సారో జీవకల్పితః॥

(వరాహ - ద్వితీయ)

ఈశ్వరుడు సృష్టిచేయ సంకల్పించెను అనునది మొదలు సృష్టి సమస్తమును కలిగిన పిదప ప్రాణులయందు జీవరూపమున ప్రవేశించెను, అనునంతవఱకు సృష్టి ఈశ్వర కల్పితము. జాగ్రదవస్థ మొదలు మోక్షపర్యంతము గల సృష్టి జీవకల్పితము.

బౌద్ధులలో విజ్ఞానశాఖవారును, శివరామదీక్షితుల వారును బాహ్యసృష్టియే లేదందురు. అంతయు నీ మనోమయ సృష్టి యందురు. అందువలన వారి మతము (విజ్ఞానవాదుల మతము), బ్రహ్మసూత్రకారులును, భాష్యకారులును ఏవిధముగా ఖండించిరో (తృతీయ భాగమున) చెప్పియుంటిని. స్థూలఘటము నష్టమైనను ఘటనామము నష్టము కాలేదు. కనుకనే శబ్దము నిత్యమని చెప్పిరి. ఇది ఒక వ్యక్తి యందలి (వ్యష్టి) అనుభవమునకు సంబంధించినది. వ్యక్తులందఱి (సమష్టి) అనుభవము హిరణ్యాగర్భుని అనుభవము గదా? ప్రళయకాలమున స్థూలపదార్థ సముదాయ మంతయు నాశమొందగా వాని నామములు (శబ్దములు) మాత్రము నశింపక మిగిలియుండును. లోకమునందలి రూపము లన్నియు స్థూలాకృతులను వదలి భావరూపమున హిరణ్యాగర్భుని యందుండును. సర్గారంభముస అవి తిరిగి స్థూలరూపమును పొందును. అప్పుడు స్థూలసృష్టి కలిగినదని అర్థము.

జిజ్ఞాసువు:- అట్లయిన మనయెదుట కనబడుచుండు స్థూలఘటము నాశమైనను, దాని సూక్ష్మరూపమగు భావము మనయం దుండును కదా? మనము మఱల దానికి స్థూలరూపము కలుగునట్లు తలంచిన ఏల స్థూలఘటము సృష్టింపబడదు?

వేదాంతి :- నీవును నేనును సిద్ధసంకల్పులము కాము. సత్యసంకల్పుడగు బ్రహ్మదేవునకే ఆశక్తి కలదు. సత్య సంకల్పులగు కొందఱు మహర్షుల కట్టి శక్తి కొంతవఱకు కలదని తెలియుచున్నది. ఇందులకు దృష్టాంతము - కురుక్షేత్రసంగ్రామమున మృతులైన భారతవీరులను చూడవలెనని కోర్కె కలదని, అట్టి వరమును అనుగ్రహింపుమని గాంధారి శ్రీకృష్ణద్వైపాయన

మునీంద్రుని వేడుకొనగా - సత్యసంకల్పుడగు ఆ మహర్షి గంగానదీ జలముల నుండి యుద్ధమున మృతులైనవారి నందరిని రమ్మని ఆజ్ఞాపింప వారు (పూర్వ స్థూలదేహముతో) వచ్చి ఒక్కదినముండి గంగా జలముల మునిగి అదృశ్యులైరని మహాభారతమున చదివి యున్నాము కదా!

జిజ్ఞాసువు :- స్థూలరూప మెట్లు కలుగును?

వేదాంతి :- నీయందున్న భావమే స్థూలాకృతిని పొందును. శబ్దశక్తిని గుఱించి (మొదటి ప్రకరణమున) శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిన వాక్యములను జ్ఞప్తికి తెచ్చుకొనుము.

సర్గారంభమున శబ్దముల సమూహమునకు మూలభూతమై శబ్దగర్భాత్మకమై యుండు ఓంకారము స్వయంవ్యక్తము నొంది దానినుండి ఒక్కొక్క శబ్దమును, దాని అర్థమగు స్థూలపదార్థమును వ్యక్తము కాజొచ్చును. ఇది బాహ్యప్రపంచ సృష్టివిధానము. అందువలననే సృష్టికి శబ్దరూపమగు ఓంకారము ఆది యని అందుండియే సమస్తమును కలిగెనని సాయనాచార్యులవారి అభిప్రాయము. ఈ యర్థమును తెలియజేయునట్టి పద్యమొకటి భాగవతపురాణమునందు కలదు. వినుము:-

మ॥ జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిన్ సంధింప నూహించి యే
భగవంతుండు సరస్వతిం బనుప, నా పద్మాస్య దా నవ్విభున్
మగనింగా వరియించి తద్భువన సామ్రాజ్యస్థితిన్ సృష్టి పా
రగు జేసెన్ మును బ్రహ్మ నట్టిగుణి నారంభింతు సేవింపగన్.
(ఆంధ్ర. భాగ. 2-67)

వేదములయందలి హిరణ్యగర్భుడు పురాణముల యందు చతుర్ముఖ బ్రహ్మదేవుడుగా పేర్కొనబడెను. అతని యందు సూక్ష్మరూపమున (భావరూపమున) నున్న జగత్తును స్థూలరూపమున వ్యక్తీకరించుటకు బ్రహ్మదేవునకు స్వయముగా సామర్థ్యము లేనందున, సగుణబ్రహ్మము (గుణి) శబ్దబ్రహ్మమును, అనగా నాదమును (నామమును) తోడ్పడజేయగా - నాదరూపిణియు, సకల విద్యాధిదేవతయు నగు సరస్వతి బ్రహ్మదేవుని భర్తగా వరియించినంత బ్రహ్మదేవునకు సృష్టి సామర్థ్యము కలిగినదని

తాత్పర్యము. అనగా కారణరూప శబ్దబ్రహ్మమే కార్యరూప జగత్తుగా వ్యక్తమైనదని అర్థము.

జిజ్ఞాసువు:- అట్టి సమయమున (కాలమున) దీనిని అనుభవమునకు తెచ్చుకొన్న వారెవ్వరు? అది మన కెట్లు తెలియుచున్నది?

వేదాంతి:- ఇది చాల చిక్కైన ప్రశ్న. ఎంతో చెప్పినగాని బోధపడదు. ఇదివఱలో దీనిని గుఱించి వేఱొక విధముగా కొంత చెప్పియుంటిని.* ఇది అనుభవ విషయము. నిర్వికల్పసమాధియందున్న మహాత్ములు తమ అనుభవముచే దీనిని కనుగొనిరి. ఆ సమాధియందు కార్యకారణరూప మగు జగత్తుగాని, ఓంకారముగాని, మాయగాని, మాయసంబంధమైన దేదియుగాని ఉండదు. కేవల చైతన్యము మాత్రమే యుండును. నిర్వికల్ప సమాధిని పొందిన మహాత్ములు ఆ దశకు పోవునపుడు మాయసంబంధమైన మనః కక్షల నొక్కొక్కదానినే దాటిపోవుచుందురు. సమాధ్యవస్థ సిద్ధించుటకు ముందు జగత్తు భావమయముగా వారికి కనిపించును. పిమ్మట సమస్తమును అవ్యక్తనాదరూపమును పొంది గంభీరమగు ఓంకారములో లీనమగును వీని నన్నింటిని వీక్షించుచుండు అతీత మానసము (మనస్సుయొక్క అత్యున్నతస్థితి) కూడ లయమగును. అంతటితో మాయయు తత్సంబంధమగు సర్వమును సమాప్తమగును. మిగిలియుండునదే నిర్వికల్పసమాధి అదియే ప్రత్యగభిన్న పరమాత్మ యగు అఖండైకరసము. అఖండ శాంతిసమాధియందున్న మహాత్ముడు దానియందుండి తిరిగి బాహ్యమునకు వచ్చునప్పుడు తొలుత సమాధికి పోవునప్పుడు, ఏయేకక్షలను దాటి (సోపానక్రమమున) పైకి (సమాధిస్థితికి) పోయెనో ఆక్రమముననే క్రిందికి దిగివచ్చును. పూర్వము పైకిపోవునపుడు ఎచ్చటెచ్చట ఏయనుభవము కలుగునో క్రిందికి దిగివచ్చునప్పు డట్టి అనుభవమే కలుగునని తాత్పర్యము. అట్టిమహాత్ములే యీ సృష్టి సంహారక్రమమును వారి అనుభవగోచరమైన విధమున శాస్త్రములయందు వివరించిరి.

---

* ఈ గ్రంథమునందలి తృతీయభాగము రెండవ ప్రకరణమున (౧౪) అధ్యాయమునందలి శాక్తాద్వైతమున - నామశా - ను గుఱించి చెప్పియుంటిని దానిని చూచిన మఱికొంత చక్కగా బోధపడును. మఱియు మొదటి ప్రకరణమునందలి ౧౪ వ అధ్యాయమును చూచిన చక్కగా బోధపడును

జిజ్ఞాసువు - శబ్దమునకు నాశము లేదంటిరి కదా? నిర్వికల్పసమాధియందు నశించెనుగదా?

వేదాంతి:- జగత్ప్రళయమున శబ్దమునకు నాశము లేదంటిని, నిర్వికల్పసమాధియందు శబ్దమున్నదని చెప్పలేదు కదా?

శ్రీమద్భాగవతమునం దిట్లున్నది.

శ్లో|| **అహం వై సర్వభూతాని భూతాత్మా భూతభావనః|**
**శబ్దబ్రహ్మ పరబ్రహ్మమయోభౌ శాశ్వతీ తనూ|| (6-16-51)**
ఇందుకు పోతనగారి ఆంధ్రీకరణము :-

సీ|| **పూని నారూపంబు - భూత జాలంబులు**
**భూతభావనుడ నే - బొందు పడంగ**
**బ్రహ్మంబు మఱియు శ - బ్దబ్రహ్మమను శాశ్వ**
**తంబైన తనువుల - దవిలె నాకు.**
(ఆంధ్ర. భా. 6-478)

మనకు ఈశ్వరసృష్టి బంధహేతువు కాదు, జీవ సృష్టియే బంధహేతువు. సమస్త భావములు మన బుద్ధుల యందుండి జీవుడు అనేక జన్మము లెత్తుటకు కారణము లగుచున్నవి. బంధహేతువగు జీవసృష్టి నశింపజేసికొన్నచో ప్రపంచమే తోచదు. అట్టివారు తిరిగి జన్మించుటకు కావలసిన సామగ్రి వారి బుద్ధులయందు లేదు. నిర్వాసనాయుతమగు బుద్ధి (చిత్తము) బ్రహ్మాకారమైనది. కనుక ఇది శుద్ధమై దగ్ధపటమువలె చూచుటకు కనబడునేకాని భోగమున కుపయుక్తము కాదు. జీవేశ్వరుల ద్వివిధ సృష్టిని గుఱించి వేదాంతపంచదశి ద్వైతవివేక ప్రకరణమునందీవిధముగా చెప్పబడియున్నది:-

శ్లో|| **ఈశకార్యం జీవభోగ్యం జగద్ద్వాభ్యాం సమన్వితమ్|**
**పితృజన్యా భర్తృభోగ్యా యథాయోషిత్తదేష్యతామ్|| (4-118)**

తా|| ఒక స్త్రీ తండ్రిచేత పుట్టించబడి భర్తచేత అనుభవింపబడినట్లు జగత్తు ఈశ్వరునిచే సృజింపబడి జీవునిచే భోగింపబడుచున్నది. -

అనగా -ధాన్యాదులు ఈశ్వరునిచే సృజింపబడి జీవులకు అన్నమగుచున్నవి కదా?

జిజ్ఞాసువు :- ఈశ్వరసృష్టివలన బంధము లేదనియేనా మీ యభిప్రాయము.

వేదాంతి :- దూర దేశమునందున్న భద్రుడను నీ మిత్రుడొకడు బ్రతికియుండినను ఇంకొకమిత్రుడు భద్రుడు నెలదినముల క్రిందట చనిపోయెనని నీకు చెప్పిన నీవు దుఃఖింతువు. మఱియొక సందర్భమున నీకు ప్రేమాస్పదురాలగు మనోరమ అను స్త్రీ సంవత్సరము క్రిందట మరణించి యుండినను, ఆమె సుఖముగా ఉన్నదన్నవార్త విన్న నీవు సంతసింతువు. ఇవి రెండును జీవసృష్టికి సంబంధించినవే.

పర్యవసాన మేమనగా :- శ్రీకృష్ణదాసును, శ్రీదీక్షితులును, మాటను గుఱించి చేసిన నిర్వచనము స్ఫోటవాదమునకుగాని, శబ్దబ్రహ్మ వాదమునకుగాని, చాలవఱకు విరుద్ధము. వేదప్రామాణ్య మంగీకరింపని దీక్షితులవారికి, వారి శిష్యులకు శబ్దబ్రహ్మమును గుఱించి తెలియదగినంత తెలియదని వారి వాక్యమువలన తెలిసికొనవచ్చును.

## (౪3) చిదాకాశము - చిత్తాకాశము - జడాకాశము

జిజ్ఞాసువు :- అయ్యా! చిదాకాశ - చిత్తాకాశ - జడాకాశములకు గల భేదమును ఆనతిండు.

వేదాంతి :- జడాకాశ మనఁగా చైతన్య (జ్ఞాన) రహితమగు ఆకాశము. పంచీకృత పంచభూతములలో మొదటిది, పెద్దది. ఆకాశము ఆత్మనుండి కలిగినదని శ్రుతి చెప్పినది. తండ్రిపోలికలు కొన్ని కుమారుని యందున్నట్లు ఆత్మలక్షణములు ఆకాశమునందు కొన్ని గలవు. అది పుట్టినప్పుడు అతి సూక్ష్మముగా శబ్దతన్మాత్రగా నుండి తరువాత స్థూలమై మహాకాశ మనబడినది. ఇది నేత్రేంద్రియమునకు గోచరము కాదు. వెలుతురు, చీకటి దీనియందు వచ్చుచు పోవుచుండును. ఏవియు దీని నంటవు. ఇది బ్రహ్మాండమునందు సర్వత్ర వ్యాపించియున్నది. రెండు వస్తువుల నడుమను, మన యిరువుర మధ్యను, మన యనుభవమువలన తెలియవచ్చునదదియే. దీనినే బయలందురు.

చిదాకాశ మననేమి? మనమొక గోడను చూతుము. చూచితిమనగా :- బుద్ధివృత్తి* కుడ్యాకారమును పొందును. ఆ వెంటనే ఒక వృషభమును, ఆ

* ఇచట "బుద్ధివృత్తి" అని చెప్పిన ప్రతివాక్యమును "చిదాభాససహితమగు బుద్ధివృత్తి" యని తెలియవలయును.

వెనుక ఒక గోవును చూతుము. ఒక పదార్థమును చూచినపుడు పూర్వమున్న బుద్ధివృత్తి నశించి మఱియొక పదార్థమును చూచినపుడు పూర్వమున్న బుద్ధివృత్తి జనించును. ఈ రీతిగ గోడ, యెద్దు, ఆవు మొదలగు రూపములను చూచినపుడు ఆ యా బుద్ధివృత్తులు జనించి నశించుచున్నవి. ఇచ్చట గమనింపవలసిన యంశమిది:- ఒక వృత్తి పుట్టి నశింపగా, మఱియొక వృత్తి పుట్టుచుండగా మొదట కలిగిన వృత్తి నశించిన పిమ్మటను రెండవ వృత్తి పుట్టుటకు పూర్వమును, ఈ మధ్యనున్న వ్యవధిని చిదాకాశ మందురు. అదియే బ్రహ్మము. బ్రహ్మమునందున్న (చిదాకాశము నందున్న) చిత్ శక్తియే చిత్తరూపమును పొంది త్రిపుటి యగుచున్నది.

ఇచట నీకు కొంత చెప్పవలసియున్నది. ఏమన:- 'చిత్తవృత్తి నశించి' అని నేను చెప్పినదాని అర్థమును వివరింతును. ఇంద్రియములతో సంబంధముండి బాహ్యమున నున్న విషయములను (నామరూపములను) బుద్ధి కందించునది మనస్సు. బుద్ధి విషయాకారమును బొందును. బుద్ధి ప్రక్కననే చిత్తమున్నది. చిత్తమును గొప్ప అగాధ సరోవరముతో పోల్పవచ్చును. మనము ఒక ఱాతిని ఒక సరోవరములో విసరివైచితిమేని, అది నీటి అడుగునకు పోయి అందే స్థిరముగా నిలుచును. మనము సరోవరమున మునిగి ఆ ఱాతిని బయటికి తీసికొనిరావచ్చును. మనమట్లు చేయకున్న ఆ ఱాయి యెప్పటికిని సరోవరమునందే యుండునుగదా? ఇచట బుద్ధివృత్తి నశించిన దనగా - బుద్ధి యేవిషయాకారమును పొందెనో ఆ విషయములు (నామరూపములు) సూక్ష్మాతిసూక్ష్మములై (వాసనారూపమున) చిత్తమునందే నిలిచియుండును. అంతేకాని సర్వనాశనము కావు. బుద్ధి అవసరమైనపుడు వానిని బయటికిలాగి తిరిగి వాని యాకృతి పొందగలదు. దానినే మన యనుభవమున 'స్మృతి' అని అందుము. వెంటనే ఆ విషయాకారము చిత్తమున చేరి బుద్ధి మఱియొక వృత్తి రూపమును పొందుట కవకాశ మిచ్చెను. అట్లుగాక బుద్ధి స్మృతిరూపమున కొంతవఱకు అట్లే నిలిచియున్నదానిని ధ్యానమందురు. నేను దేనికి చిత్తసరోవరమని పేరిడితినో యోగవాసిష్ఠము దానినే చిత్తాకాశమని చెప్పినది.

చిదాకాశమును గుఱించి యోగవాసిష్ఠమున నిట్లున్నది:-

**శ్లో॥ చిద్వ్యోమ బ్రహ్మ చిన్మాత్ర మాత్మా చితి మహానితి।**
**పరమాత్మేతి పర్యాయో జ్ఞేయా జ్ఞానవతాం వర॥ (యో. వా. 6-1-5-29)**

చిదాకాశము, బ్రహ్మము, చిన్మాత్రము, జీవ చైతన్యము, మహాచిద్రూపము, పరమాత్మ అనునవి యన్నియు పర్యాయశబ్దములై యున్నవని వసిష్ఠమహర్షి జ్ఞానులలో శ్రేష్ఠుడగు శ్రీరామచంద్రునకు చెప్పెను.

చిదాకాశమును గుఱించి మహోపనిషత్తు ఇట్లు చెప్పినది :-

**శ్లో॥ చిత్తాకాశం చిదాకాశ మాకాశం చ తృతీయకమ్।**
**ద్వాభ్యాం శూన్యతరం విద్ధి చిదాకాశం మహామునే॥ (4-58)**

తా॥ ఓ మునీ! సంకల్ప సముదాయ మెందుండునో అది చిత్తాకాశము. దృశ్య ప్రపంచ మెందుండునో అది భూతాకాశము. ఈ రెండు దేనియందు లేవో అదియే చిదాకాశము.

**శ్లో॥ దేశాద్దేశాంతర ప్రాప్తౌ సంవిదో మధ్యమేవ యత్।**
**నిమేషేణ చిదాకాశం తద్విద్ధి మునిపుంగవ॥ (4-59)**

నేను పైన చెప్పినట్లు రెండు బుద్ధి వృత్తుల మధ్య నుండు వ్యవధియే చిదాకాశము ఆకాశమువలె వ్యాపకమైన చిత్తు.

అద్వైతులు చెప్పు బుద్ధి వృత్తి (చిదాభాససంబంధమైన) జ్ఞానమునే యెఱుక యని పైన చెప్పిన చిదాకాశమే బట్టబయలని దీక్షితులవా రంగీకరించిన వారి సిద్ధాంతమును గుఱించి శంకింపవలసి యుండదు. అట్లు కాదేని వారికి శాస్త్రజన్య జ్ఞానముగాని, బ్రహ్మానుభవముగాని, ఆ సూచనగాని లేదని అనుమానింపవలసి వచ్చును.

కృష్ణదాసుగారి వాక్యము లివి :-

కం॥ **"రెండువస్తువుల నడుమ న**
**ఖండం బదె కానుపించు గద దీనిని నీ**
**వుండి కనుగొని చనందగు**
**మండిత సత్కీర్తి సాంద్రమానవచంద్రా." (70)**

'రెండు వస్తువుల నడుమ అఖండంబదె కనుపించు' అన్నారుకదా? దీని తాత్పర్య మేమి? 'రెండు వస్తువుల నడుమ' నుండు అఖండము లోకులు చెప్పినట్టి 'బయలు' అదే మహాకాశము. ఆకాశమే బయలని అందురా? అంతకంటె నాస్తిక మేమున్నది. ఆకసము బయలు కాదని, ఎఱుక యని, దీక్షితులవారును, కృష్ణదాసుగారును చెప్పియున్నారుగదా? వారి పరిభాషలో 'ఆకస' మనగా- యెఱుక, అట్లయిన పక్షమున పై పద్యమున చెప్పబడిన 'రెండు వస్తువుల నడుమ అఖండముగ కనుపించు' నదియేది? మహాకాశమే గదా? బయలును చిదాకాశమని దీక్షితులవారుగాని, కృష్ణదాసుగారు కాని తమ గ్రంథములయం దెచ్చటను చెప్పియుండలేదు. దీక్షితులవారు ఒకచోట నిట్లన్నారు.

"చిదాకాశమన్నారు జడాకాశమన్నారు .... ఇవన్ని కలత వాక్యాలే" (బృ. ఉ. ప్ర. 6 అ. 6) అని అద్వైతులను విమర్శించిరి. బయలును చిదాకాశమనుట వారి కిష్టము లేదు. ఏలయన 'చిత్' అనగా - విశుద్ధ జ్ఞానము. దీక్షితుల వారి మతమున బయలు తన్ను తా నెఱుగదు, ఇతరుల నెఱుగదు. బయలునకు యెఱుక (జ్ఞానము) లేదు. కనుక, దానిని చిదాకాశమన్న వారిమతకమునకు మొదటికే మోసము వచ్చునని వారి భయము. అందువలన 'చిదాకాశ' మను నామమును బయలునకు అంగీకరింపరు. రెండు ఎఱుకలు ఉన్నట్లు దీక్షితులవారుగాని, కృష్ణదాసుగారు గాని అంగీకరింపరు. అది వారి మతమునకు విరుద్ధము.

దీక్షితులవారు వారి గ్రంథమున అచ్చటచ్చట వారి మతమునకు వత్తాసిగా నుండునట్టివని భావించి కొన్ని గీతపద్యముల నుదాహరించియున్నారు. అవి యెవరు వ్రాసినవో వారి పేరు అందు చెప్పబడలేదు. దీక్షితులవారివి కాదనుట స్పష్టమే. అందొక గీత పద్య మిట్లున్నది:-

" గీ|| ఎరుక దైవమైన మరుపేల కలుగును

నరుడు దానదెలియ నగుణహౌనని యంద్రు

మరుగులన్ని దెలిసి మరుగు శిష్య." (బృ. పూ. ప్ర. 10)

పై పద్యమునందలి రెండవ పంక్తియందు 'యెరుకొ మరపులేని యెఱుక' అద్వైతులు చెప్పునట్టి కూటస్థజ్ఞానము, లేక, ఆత్మ యనునది. మొదటి పంక్తియందు చెప్పబడిన యెఱుక సామాన్యమగు యెఱుక. అది అద్వైతమున చిదాభాసునితో కూడిన బుద్ధి వృత్తి జ్ఞానము. ఇది దైవము కాదని చెప్పి. 'యెఱుక మరపులు లేని యెఱుక' మఱియొకటి కలదని రెండవ పాదమున స్థిరపరచెను. ఆ యెఱుక (కూటస్థజ్ఞానమే) చిదాకాశము, బ్రహ్మము, ప్రత్యగాత్మ. - పద్యము చివఱన "మరుగు శిష్య" అన్నారు. దాని అర్థము వారికే యెఱుక. 'యెఱుక మరుపు లేని యెఱుక' మఱి యొకటి కలదని (పై పద్యము నుదాహరించుటవలన) వారంగీకరించినట్లే కదా? అట్టి రెండవ యెఱుక నెఱిగినవాడు నిర్గుణు డగునని పద్యమునందలి మూడవ పాదమునందలి అర్థము. దీక్షితులవారు పై పద్యమును తమ సిద్ధాంతమునకు విరుద్ధమని తెలియక దాని నుదాహరించిరి. ఏలయన, "**ఎరుక కలది అచలము కాదు**" (బృ. పూ. ప్ర. 10) దీక్షితులవారు ఇట్టి వాక్యము లనేకములు చెప్పియున్నారు.

అచలవేదాంతులు కొందఱు వేమన్న గారిని తమవాడందురు. ఎఱుకను గుఱించి వేమన్నగారు చెప్పిన పద్యము నొకదానిని ఉదాహరింతును. దీనివలన వేమన్నగారు అద్వైతియని తెలియును.

**ఎఱుక యుండువాని కెఱుక యే యుండును**
**ఎఱుక లేనివాని కెఱుక లేదు,**

**విశ్వదాభిరామ వినురవేమ.**

ఇచట పద్యమునందలి మూడవపాదమున 'ఎఱుక లేని యెఱుక' యే చిదాకాశము. అదియే వృత్తి జ్ఞానము లేని శుద్ధజ్ఞానము. వేదాంత తత్త్వము ననుసరించి పై పద్యమునందు మొదటి పాదములో చెప్పిన యెఱుక బుద్ధివృత్తి. (వృత్తి జ్ఞానము)

చిదాకాశమనే ఆత్మ (విశుద్ధ జ్ఞానము) పరబ్రహ్మమని శ్రీ జ్ఞానేశ్వరు లంగీకరించియుండిరి. (అను. 7-185) చిదాకాశమే పరబ్రహ్మమని, శుద్ధజ్ఞానమని, శ్రీజ్ఞానేశ్వరు లంగీకరించినట్లు ఈ క్రింది ప్రమాణములను చూపెదను.

అమృతానుభవము మొదటి ప్రకరణమునందు 64 వ శ్లోకవ్యాఖ్యానమున (విజయదుందుభియందు) ఇట్లున్నది :-

"...నామరూపక్రియలనెల్ల మిథ్యాత్మదృష్టిని భాగత్యాగ లక్షణముద్వారా వేరుచేయగా చివరకు స్వతస్సిద్ధమైన చిదాకాశమే మిగిలి త్రోసివేయబడిన నామరూపాత్మక జగత్తంతయు వాచారంభమైనట్లు భావారూఢస్థితియందు, వందనాదిక్రియ లన్నియు వాచారంభణములే కాని వేరుకావు." (పుట. 120)

"...గురుశిష్యాదిరూపమైన అధ్యాస ప్రపంచమంతయు చిదాకాశ స్వరూపుడైన నాయందు 'నభసో నీలవత్' అనునట్లు ఆకాశమునందు నీలపీతాదులు తోచినరీతి తోచినవి." (పుట. 148)

విజయదుందుభి 2-57వ శ్లోకమున 'శుద్ధ స్ఫురణరూపే తు' అని ఉన్నదానినే - శుద్ధ స్ఫురణమే చిదాకాశమని చెప్పిరి. శుద్ధ స్ఫురణ మనగా- విశుద్ధజ్ఞానము.

"మరియు నయ్యాత్మ నైజస్థితి ద్రష్టయు, దృశ్యంబును నను నీ యుభయ విషయంబులు వినష్టంబై పునరుత్పన్నంబగు నమ్మధ్యంబునం జెల్వొందుచుండునని సారాంశంబగు." (అను. 7-185)

పై యంశమునే మఱియొక విధముగ స్పష్టపరచిరి.

'కాదేని నేత్రదృష్టి యొక వస్తువునెడ బ్రసరించి దానిం దొఱంగి యన్యవస్తువునెడ బ్రసరింపకయున్న మధ్యావస్థను గూర్చి మన మూహింపగల్గుచో నాత్మ నైజస్థితి యివ్విధంబగు." (అను. 7-188)

తమ అచలబోధ శ్రీ జ్ఞానేశ్వరస్వాములనుండి గురుశిష్య పరంపరగా శ్రీ దీక్షితులకు లభించినదని చెప్పుకొను అచలవాదులు ఈ యంశము నేల గ్రహింపరు?

జిజ్ఞాసువు :- (1) అచలవాదులు ఆకాశమును శూన్యమన్నారు. ఎఱుకను శూన్యమన్నారు. బయలును తెలిసికొన్నదేది? శూన్యము తన్ను తా నెఱుగదు. ఇతరులను ఎఱుగదు గదా? (2) చిత్తాకాశమనగా నేది? ఈ సంశయముల నివర్తింపుడు.

వేదాంతి :- నీకు కలిగిన రెండవ సంశయమును మొదట తొలగింతును. - చిత్తుయొక్క శక్తి చిత్‌శక్తి. చిత్ శక్తియే చిత్తరూపమును ధరించినది. ఈ చిత్తమే చిత్తాకాశము. మహాకాశమున సమస్త వస్తువులు ఉన్నట్లు సమస్త వస్తు సముదాయము సూక్ష్మరూపమున చిత్తాకాశమున నుండును. చిత్తాకాశమే తనయందుండు సూక్ష్మ ప్రపంచమును స్థూలరూపమున అభివ్యక్తము చేయును. ఈ విషయమును పూర్ణముగా తెలియగోరుదువేని యోగవాసిష్ఠమును చదివి అర్థము చేసికొనుము.

నీ వడిగిన మొదటి సంశయమును తొలగింతును శ్రద్ధగా వినుము. కృష్ణదాసుగారుగాని దీక్షితులవారుగాని రెండు బుద్ధివృత్తులను నడుమ (మధ్య) నుండినది అఖండమనినను, బయలనినను, దానికి వారు చిదాకాశమని పేరు పెట్టక పోయినను అది చిదాకాశమే. (బ్రహ్మమే) దానిని బయలనినను తప్పేమియును లేదు. కాని కృష్ణదాసుగారు రెండు వృత్తులకు నడుమ అని చెప్పక పద్యమున "రెండు వస్తువుల నడుమ నఖండంబదె కానిపించు" అని స్పష్టముగా చెప్పియున్నందున రెండు వస్తువుల నడుమ అఖండముగ కానిపించునది భూతాకాశమగు బయలే. దానినే వారు బట్టబయలని పరిపూర్ణమని యందురు. నేను చెప్పిన ఈ యర్థమును బలపరచునట్టి వారి వాక్యముల కొన్నిటిని నుదాహరింతును.-

కం|| నేను గాకొకటి శుద్ధ
జ్ఞానము గలదనుచు బల్కు జ్ఞానుల మాటల్
పూని వినదగదు శుద్ధ
జ్ఞానం బననేనె నేను లేనిది యౌనే. (కంద. 227)

ఈ విధముగా చిదాకాశమునుగాని కూటస్థునిగాని అంగీకరింపక యున్నది 'ఎరుక' ఒక్కటే నన్నారు.

లోకులు 'ఆకాశమని' దేనినందురో అచలవాదులు దానిని ఎఱుక యందురు. శబ్దమును సహితము ఎఱుకయే యందురు. "మాటసుమీ నేననినను" అను కందపద్యమును ఇదివఱకే ఉదాహరించియుంటిని. శబ్దరహితమగు మహాకాశమునే 'బయలని', 'బట్టబయలని', 'పరిపూర్ణమని' యందురు. నేను చెప్పిన యీ యర్థము సరియైన దనుటకు కృష్ణదాసుగారి వాక్యము నుదాహరింతును:-

కం|| "ఆవరణము నాకసము -
నిరావరణము నచలమనుచు అనిరి మహాత్ముల్ -
ఆవరణము మితము గలిగిన
ఆవరణము లేంది యమితమని తెలిసికోరా." (కందా. 80)

దీని తాత్పర్యము :- ఆవరణము ఆకసమనగా శరీరములో నిమిడియున్నది యెఱుక. శరీరము లేకపోయిన యెఱుక లేదు. శరీరము లేకపోయిన మాట లెట్లు వచ్చును. మాటయే తాను గదా? శబ్దరహితమగు మహాకాశమును (బయలు) నిరావరణము దాని గుణమగు శబ్దమును దాని నుండి విడదీసి (వేఱు వేఱని చెప్పి) శబ్దము ఎఱుక యని శబ్దరహిత మగునది, 'యేమిలేని ఉత్త బట్టబయలని' చెప్పిరి. అదే 'రెండు వస్తువుల నడుమనుండు అఖండము' అనిరి. కానీ అది వేదాంతులు చెప్పు చిదాకాశమని వా రంగీకరింపరు. ఆకాశము శూన్యమని (కంద. 81) అదియే యెఱుకయని అచలవాదుల రహస్యమని కృష్ణదాసుగారి పై వాక్యములనుబట్టి యూహించుట సులభము. కృష్ణదాసుగారి యీ క్రింది కందార్థ మొకటి నేను చెప్పిన పై తాత్పర్యము సరియైనదని దృఢపరచును.

కందా|| కనబడెడు బయలులోపల
కనుగొనలేదయ్యో యెరుక గావున శూన్యం
బనవలసెను దీన్నె ఆకస
మన వలసెను దీన - విశ్వమాయనో యప్పా
యింతకు వేరే మాయలేదప్పా. (78)

ఆకాశమును ఎఱుక యని కృష్ణదాసుగా రనిరి కదా? లోకులు శాస్త్రములు దేనిని ఆకాశమని (తానుండియు సర్వము తనయందుండుటకు అవకాశమిచ్చిన దానిని) యే పేరున పిలువవలయును? అది ఆకసము కదా? దానిని అచలవాదుల పరిభాషలో 'బయలని' 'బట్టబయలని' అనవలయునా? శాస్త్రములయందు సృష్టి క్రమమును చెప్పిన ప్రకారము మహాభూతములకంటె ముందు తన్మాత్రలు పుట్టినవి. ఆ పిమ్మట వాటినుండి మహాభూతములు కలిగినవని చెప్పిరి. అట్లైన మొదట శబ్ద తన్మాత్ర పుట్టినది. దానిని అచలవాదులు ఎఱుక యని పేరిడిరి. అచలవాదమును అనుసరించి చెప్పవలయునన్న శబ్ద గుణమును

ఆకాశమునుండి వేఱుచేసినచో మహాకాశమే అచలవాదుల బట్ట బయలగును. ఇది నా అభిప్రాయము కాదు. అచలవాదుల యొక్క వాక్యములనుండి యీ యర్థ మేర్పడుచున్నది. ఆకాశము శబ్ద గుణక మైనదని అందఱు అంగీకరింతురు. కాని గుణియగు ఆకాశమునుండి యీ యర్థ మేర్పడుచున్నది. ఆకాశము శబ్ద గుణక మైనదని అందఱు అంగీకరింతురు. కాని గుణియగు ఆకాశమునుండి గుణమును వేఱుచేయుటెట్లు? ప్రపంచము పుట్టినది మొదలు ఇంతవఱకు వస్తువును, దాని గుణమును వేఱుచేసి చూపినవారు కలరా? వస్తువునందలి గుణము కారణాంతరములచే మార్పు చెందవచ్చును. అసలే గుణము లేకుండ చేయలేరు. అట్లు చేయగలిగినయెడల గుణరహితమగు ఆ వస్తువే బ్రహ్మము. కృష్ణదాసుగా రిట్లు చెప్పిరి:-

"ఆకాశాదిక భూతా
నీకాత్మక మగుచు యెఱుక యీజగమయ్యెన్
రాకడ పోకడ దీనికి
ప్రాకటముగ దేనిలోనొ బట్టబయ లదిరా." (కందా. 38)

శబ్దము (ఎఱుక) యొక్క రాకడ పోకడ మహాకాశమునందే జరుగుచున్నది కదా?

"ఎరుకతో వచ్చిన విశ్వము
యెరుకతొ జనుగాని నిల్వదీ బయలైతే
యరుకతొ రా దెరుకతొ బో
దెరుక తనందేమి లేదు యిది నిశ్చయమురా
వుందంటె యెరుక తానొరా." (కందా 40)

"ఎరుకే బట్టబయలగును. యీ యెరుక బట్టబయలు రెండు సమానమే. ఎంతమాత్రము భేదము లేదు." (బృ. పూ. ప్ర. 162, 163) ఇందుకు విరుద్ధముగా అనేకపర్యాయములు చెప్పిన దీక్షితులవారి వాక్యములో ఒకదాని నిదివరకే యుదాహరించి యుంటిని. దానినే మఱల నిట నుదాహరింతును :-

"నీవు అది యెన్నటికికావు. అది నీవుకావు. నీకు దానికి చాల యెక్కువ తక్కువ వున్నది." (బృ. పూ. ప్ర. 109) ఇట్టి స్వవచన వ్యాఘాతములు శ్రీ

దీక్షితుల, కృష్ణదాసుగారల గ్రంథములయందు అనేకము లున్నవి. ఆ కందార్థముపై 38వ కందార్థమునందలి అర్థమునే బలపరచినప్పటికి నిందొక విశేషమును చేర్చినారు. ఎఱుక రాకడ పోకడ లేకయుండిన యెఱుకయే బయలగును. లేదా, బయలే ఎఱుక యగునని భావము.*

శ్రీ దీక్షితులు కృష్ణదాసుగారు బయలునకు కేవలాత్మయని మఱియొకపేరు పెట్టియున్నారు. ఆ విషయము విచారింతము.

"పుట్టనిది కేవలాత్మ, పుట్టేది చచ్చేది ప్రకృతిద్వయం." (బృ. ఉ. ప్ర. 1)

"ఈ ఉత్త బట్టబయలు ఎవరెరుగుదురు కేవలాత్మ .... ఈ కేవలాత్మ గజ్జలుకట్టుకొని ఆడేదికాదు .... యీ కేవలాత్మను ఎరుగుట యనగా యెరుక లేకపోవుట యని అర్థము. (బృ. పూ. ప్ర. 10)

**శిష్యుడు :- అది బట్టబయలైతే ఉత్త బట్టబయలని యెందుకనవలె, బయలు అనరాదా?**

**గురువు :- ఆత్మ అంటే చాలునుగదా? కేవలాత్మ యని యెందు కనవలెను? కేవలాత్మ అనగా నిర్మలమైనదని తాత్పర్యము. అలాగుననే ఉత్త బట్టబయలనిన అర్థము సుమా! ఉత్త బట్టబయలనగా కేవలాత్మ యని అర్థము.** (బృ. ఉ. ప్ర. 2. అ. 1)

ఆత్మ బట్టబయలు కాదని దీక్షితులవారు పెక్కు మారులు చెప్పి ఇప్పుడు బయలును కేవలాత్మ యని పై వాక్యముల వలన స్పష్టపరచిరి దీక్షితులవారి మతమున అహంకారమే ఆత్మ. అహంకారము వదలిన కేవలాత్మ యట. శ్రీ సీతారామాంజనేయ సంవాదమను గ్రంథమున ఈ క్రింది పద్యమునందు కేవలాత్మయే ఆత్మయని స్పష్టపరుపబడెను.

. కం|| నేననిన దనువునకు నభి
మానమునకు నర్థమగు భ్రమాదము వలనం
గానియవి - రెండనర్థము
తానేనన కేవలాత్ముడను నే ననఘా.

---

* ఈ వాక్యములను దృఢపరచునట్టి దీక్షితులవారి వాక్యములను ఈ ప్రకరణమునందలి ౧3వ అధ్యాయము "గురువు" చెప్పిన వాక్యములు చెప్పియున్నాను. చిత్తగింపుడు.

నేను అనుదాని అర్థము కొందఱు (చార్వాకులు) శరీరమని చెప్పుదురు. (లోకులు వ్యవహారము నందును అందురు) అభిమానమునకు = అహంకారము నుద్దేశించి కూడ 'నే' నందురు. పద్యము పై రెండు పాదములయందలి (1) తనువు (2) అహంకారము. ఈ రెండింటిని కలిపి 'నేను' అని కొంద ఱందురు. (అచలవాదులు) దేహమును, అహంకారమును, ఈ రెండింటిలో దేనినైనను 'నేను' అనిన ఆ రెండును అనర్థములే. ప్రమాదమువలన అట్లందురు. 'నేను' అనగా - 'కేవలాత్మను' అని తాత్పర్యము. మఱియు ఆ గ్రంథమునందే యిట్లున్నది.

సీ॥ ఏను శరీరంబుగా నింద్రియములు
గాను బ్రాణంబులు గాను మనము
గాను చిత్తంబుగా నహంకారంబు
గాను శూన్యంబును గాను బుద్ధి
గాను ... ,

తే॥ గాను గాననువాడను గాన వినుము
కాను గానను వానిని గాంచువాడ
గాంచువానిని సతతంబు గాంచువాడ
నౌను గానను వికృతులు లేనివాడ. (2-82)

చిదాభాస సంబంధమగు బుద్ధివృత్తియే శబ్దాదివిషయముల నెఱుగుచున్నది. అది తన్ను తా నెఱుగదు. చిదాభాసుడు లేని సమయమున అతని లేమియు; ఉన్న సమయమున అతని యునికియు; సతతంబు గాంచునది అచలవాదులు చెప్పునట్టి యెఱుక కాదు. ఇతడే (అదియే) చిదాకాశము, సాక్షి. కూటస్థాత్మ నాశరహితమగు బ్రహ్మచైతన్యము కేవలాత్మ.

శ్రీ సీతారామాంజనేయ సంవాద గ్రంథకర్తగారు. ఆత్మయనిన చాలును 'కేవలాత్ముడ' నని యనుట యెందుకనగా - శరీరమును, అహంకారమును నేను కానని నిషేధించుటద్వారా (చిదాభాసునికూడ నిషేధించి) నేను పరబ్రహ్మస్వరూపుడనేగాని అన్యుడను కాననుటకు కేవలాత్ముడ ననిరి.

పర్యవసాన మేమనగా :- అద్వైతులు చెప్పు కేవలాత్మ శుద్ధజ్ఞానము (శుద్ధచైతన్యము). అచలవాదులు చెప్పు కేవలాత్మ శుద్ధజడము. ఎఱుకయు జడమే. కనుక నిది జడాద్వైతము, భౌతికవాదము.

మం॥ అతిబాహ్యం తథా ఽబాహ్య మంతరాభ్యంతరం ధియః।
శుక పశ్య న్నపశ్యేస్త్వం సాక్షి సంపూర్ణకేవలః॥ (మహో. 2-73)

తా॥ బాహ్యము నతిక్రమించినదియు, బాహ్యము లేనిదియు, బుద్ధిలోపలి తత్త్వము నైనదానిని చూచుచు చూడనివాడ వగుము. సాక్షివగు నీవు పరిపూర్ణుడవు. కేవలుడవు.

## (౪౪) సింహావలోకనము - సంగ్రహపరిశీలనము

వేదాంతి:- అచలబోధ పరిశీలనము ముగించుటకు ముందు ఇదివఱలో చెప్పిన కొన్నియంశములను సింహావలోకన న్యాయమున దృఢబోధకొఱకు స్మృతికి తెచ్చుకొనుటయేగాక యిదివఱలో చెప్పని విషయములను సందర్భము ననుసరించి సంగ్రహముగ చెప్పెదను, సావధానుడవై వినుము.

(ఈ ప్రకరణమున 4వ అధ్యాయమునందు) అచలవాదులలో మితవాదులు, అతివాదులు అను రెండు శాఖలున్నవనియు, వారు దీక్షితులవారి గ్రంథమగు బృహద్వాసిష్ఠ సిద్ధాంతమునందలి వాక్యములకు పరస్పర విరుద్ధమగు భిన్నార్థములు చెప్పుదురనియు, చెప్పి (7వ అధ్యాయములో) షోడశాక్షరీమంత్రమునకు వా రుభయులు చెప్పెడి భిన్నార్థములనుగూడ సంగ్రహముగ వివరించియుంటిని. (8వ అధ్యాయమున) ఆ రెండు శాఖలయందు ఎవరివాదమును ఎంతవఱకు దీక్షితులవారు సమర్థించియున్నారను విషయమును పరిశీలించితిమి. (9వ అధ్యాయమున) జ్ఞానముయొక్క వివిధ స్వరూపవిచారము చేసితిమి. (10, 11, 12వ అధ్యాయములయందు) ఎఱుక, సాక్షి, జీవుడు వీరల స్వరూపవిచారము వేదాంతమునుండియు, దీక్షితులవారి మతము నుండియు పరిశీలించితిమి. (13వ అధ్యాయమున) శరీరములు మూడా నాలుగా? అను అంశము చర్చింపబడెను. ఇందు చాల గొప్పచర్చ జరిగి శ్రుతులకు దీక్షితులవారి మతము విరుద్ధమని ఋజువుచేసితిని.

శివరామదీక్షితులవారి అచలబోధయందు ముఖ్యమైన అంశములు ఎఱుక, బయలు - అని నీ వెఱుగుదువు. కనుక వానినిగుఱించి పునఃపరిశీలనము చేయుదుము.

## ఎఱుకను గుఱించి పునఃపరిశీలనము

దీక్షితులవారు తమ గ్రంథమున తామే యెఱుకను గుఱించి అచ్చటచ్చట పరస్పరభిన్నములగు నిర్వచనములు చేసిరి. ఏవిధముగానైనను వారి సిద్ధాంతము శాస్త్రసమ్మతమని నిరూపించుటకు అనేకవిధముల ప్రయత్నముచేసి విఫలులైరి. ముఖ్యముగా వారితత్త్వము (ఎఱుక) భగవద్గీతకు సమ్మతమని నిరూపించుటకు గీతయొక్క యేడవ అధ్యాయమున చెప్పిన పరా - అపరా - ప్రకృతులను, పదుమూడవ అధ్యాయమునందలి క్షేత్ర - క్షేత్రజ్ఞులను, పదునైదవ అధ్యాయము నందలి క్షర - అక్షరములను, మూలములేని గుర్తెరిగె శరీరమేయని నిరూపించుటకు ప్రయత్నించిరి. కాని గీతయొక్క పదుమూడవ అధ్యాయము నందు గీతాచార్యుడు 'మహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్త ప్రకృతి - యీ సముదాయము నంతయు క్షేత్రములోనే చేర్చి చెప్పి యీ క్షేత్రమును తెలిసికొనుచుండువాడు క్షేత్రి, లేక, క్షేత్రజ్ఞుడు అనియు, అతడు క్షేత్రమునకంటె భిన్నుడనియు, స్పష్టముగా చెప్పియున్నందున దీక్షితులవారి ప్రయత్నము విఫలమగుటచే వారికి ఆగ్రహము కలిగి **"గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమే పరబ్రహ్మ అయితే క్షేత్రమెందుకు?"** (బృ. ఉ. ప్ర. 6 అ. 4) అని ప్రశ్నించిరి. అందులకు నేను సరియగు సమాధానమును (ఈ ప్రకరణమునందలి 14, 15, 16 అధ్యాయములయందు) ఎంతటి సామాన్యబుద్ధులకైనను అర్థమగునట్లు దీక్షితులవారి యెఱుక యివి యేమియు కావని చెప్పితిని.

(17వ అధ్యాయమున) దేహి దేహములు ఒక్కటి యేనా? యనియు, (18వ అధ్యాయమున) పరలోకము పునర్జన్మములు లేవా? అను సంశయములను విచారించి శ్రుతిస్మృతి పురాణాదులనుండి అనేక ప్రమాణములను చూపి దీక్షితులవారి మతమును నిరాకరించితిని.

(19, 20 అధ్యాయములయందు) దేహిదేహము భిన్నములని నిరూపించుచు, అందునను ప్రకృతియె పురుషుడను వాదమును శాస్త్రప్రమాణములచూపి

వ్రాసివేసితిని. ఈ విధముగా (ఇరువది అధ్యాయములయందు) 'మూలము లేని గుర్తెరిగే శరీరము'ను గుఱించిన విచారమును ముగించితిని.

(21వ అధ్యాయమున) కలదోచిన శరీరము ఎలాగో ఆలాగే అను పంచదశీమంత్రార్థమును పరిశీలించితిని. శ్రీ దీక్షితులవాదము అనుభవమునకు, శాస్త్రములకు సమ్మతము కాదని నిరూపించితిని.

(22వ అధ్యాయమున) 'ఈ ఉత్త బట్టబయలు ఏమిాలేదు' అను ద్వాదశాక్షరీమంత్రమును (27వ అధ్యాయమువఱకు) పరిశీలించితిని.

(28వ అధ్యాయమునుండి 33 వఱకు) దీక్షితులవారు చేసిన వేదాదుల నిందనుచూపి దీక్షితులవారిమతము అవైదిక మని నిరూపించితిని.

(34, 35, 36 అధ్యాయములయందు) శ్రీ దీక్షితుల దర్శనము శ్రీ జ్ఞానదేవ, శ్రీ సమర్థరామదాస, శ్రీ అరవింద, యోగవాసిష్ఠాది దర్శనములకు ఎట్లు విరుదమో వివరించితిని

(37వ అధ్యాయమునందు) అచలబోధకు బౌద్ధదర్శనముతో నెంతవఱకు సారూప్యము కలదో చూపితిని.

(38వ అధ్యాయము నందు) అచలవాదులు అద్వైతములో అడుగుపెట్టిన సూచనలను వివరించితిని.

(39వ అధ్యాయములో) దీక్షితులవారి మతము ఏవిధముగా అవైదికమో వివరించి

(40వ అధ్యాయమున) గురువులు - శాస్త్రములను గుఱించి బోధించితిని.

కొందఱు అచలవాదులు దీక్షితులవారి మతము శ్రీ బసవేశ్వరులవారి వీరశైవముతో సరిపోవునందురు. అట్టివారు వీరశైవమును గుఱించి తెలియనివారని చెప్పుచున్నారు. (అట్టివారు ఈ గ్రంథముయొక్క తృతీయభాగమునందు 13, 14వ అధ్యాయములు చదివి తెలిసికొనవచ్చును.)

జిజ్ఞాసువు.- అయ్యా! తమరు నాకు శాక్తేయమునందలి శ్రీవిద్యనుగుఱించి చెప్పినపుడు దేవీభాగవతమునందలి రెండు పద్యములను వినిపించియుండిరి.* వాని యర్థము ఆత్మానాత్మలు ఏకమని చెప్పినట్లు అనుమానించుట కవకాశమున్నది. దానికి మీ రేమందురు.**

వేదాంతి:- ఆ పద్యములను మరలచెప్పి నీ సంశయమును నివర్తింపజేయుదును

గీ|| బీజములు రెండు మన్మంత్రరాజమునకు
రెండు భాగములు గల నాదు సృష్టి యెల్ల
జగమనుట గల్గె ద్వైవిద్య మగణిత ప్ర
భావమున బొల్చు నా రెండు భాగములను. (దే. భా. 12-39)

కం|| ఒకడలరు సచ్చిదానం
దకమై - ప్రకృతి సంజ్ఞ దగు నొక్కడు - చం
ద్రికకుం జంద్రునకుం బలె
బ్రకృతికి నా కైక్య మెలయు వాసన యెపుడున్. (దే. భా 12-40)

ఇట్లు ఉమాదేవి ఇంద్రునకు దేవీతత్త్వము నుపదేశించినట్లున్నది సంగ్రహముగ వీని తాత్పర్యమిది:-

దేవి తన మంత్రమునకు రెండు బీజములు కలవని చెప్పినది. అవి "ఓమ్" 'హ్రీం' అనునవి. ఆ రెండింటి వలన జగదుత్పత్తి కలిగినది 'ఓమ్' అను బీజము సచ్చిదానంద స్వరూపము పరబ్రహ్మమును సూచించును. 'హ్రీం' అను రెండవ బీజము మాయను (ప్రకృతిని) బ్రహ్మమునుగూడ సూచించును. అందు సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మము నేనే అనియు, ప్రకృతికిని, నాకును చంద్రికకు చంద్రునకు సంబంధమువంటి సంబంధ మున్నదనియు దేవి చెప్పెను.

---

* ఈ గ్రంథముయొక్క తృతీయభాగమునందు శాక్తము - దేవీతత్త్వము. పుటలు 324, 325 చదివిన కొన్ని విషయములు బోధపడును

**ఆ పద్యములు పూజ్యులు తిరుపతి వేంకటకవుల దేవీభాగవతము లోనివి

మఱియు ఉమాదేవి యిట్లు చెప్పినది - "నామాయ నిత్య; అనగా పుట్టుట గిట్టుట లేనిది. తురీయ రూపమును నేనే **తురియాతీతంబయిన పదము రూపరహితమైనను నా రూపము, పరబ్రహ్మమని దాని నందురు"**

ఇచ్చట దేవి యనగా - ఎవరో తెలియునా? ఈ దేవి సాంఖ్యుల ప్రకృతి కాదు. అద్వైతుల మాయ కాదు. పరబ్రహ్మము (పరమేశ్వరుడు) స్త్రీ మూర్తిగా (స్త్రీ లింగముగా) భావించి చెప్పబడెనని యర్థము. ఈమె పరమేశ్వరుని శక్తి శక్తికి శక్తిమంతునకును భేదము లేనట్లు. పరబ్రహ్మమునకును దేవికిని భేదము లేదు. కనుక యీ దేవి దీక్షితులవారు చెప్పు 'లేని యెఱుక' కాదు. మఱియు, ఆ పద్యమునకు ముందున్న పద్య మిట్లున్నది:-

కం|| **అనయంబు వల్కునది లో**
**క నిదానము బ్రహ్మము మాయకునుం**
**గని సర్వ సాక్షియునై**
**తనరెడి మద్రూపమిది యథార్థం బింద్రా.** (దే. భా. 15-37)

దీని తాత్పర్యము సులభమే :-

ఈ పద్యమువలన దేవి మాయ కాదనియు, తాను సర్వసాక్షి ననియు చెప్పినందున దీక్షితులవారు ఎఱుకను మాయ యనిరి. కనుక ఈ రెండు తత్త్వములు భిన్నములు.

ఎఱుక బయలునందు పుట్టినదని దీక్షితులవా రంగీకరింపరు. పై పద్యమున 'మాయకునుంగని' అని యున్నందున మాయ పరబ్రహ్మమునందు కలిగినదని తాత్పర్యము.

అద్వైతులు మాయను గుఱించి చెప్పిన నిర్వచనము నిదివఱకే వినియున్నావు. (ఈ భాగమునందలి మొదటి ప్రకరణమున 5వ అధ్యాయము) కనుక, ఇచట చెప్పనవసరములేదు. ఈ కారణమువలన శ్రీవిద్యకు దీక్షితులవారి అచలబోధ విరుద్ధము.

దీక్షితులవారు 'ఈ మూలంలేని గుర్తెరిగే శరీరం ఏఘాలేదు' అనునది 'షోడశి' యని వారి గ్రంథమున చెప్పిరి. శాక్తేయులు చెప్పిన షోడశియే యిదియని భ్రమపడరాదు. శ్రీవిద్యయందు షోడశిని గుఱించి అచ్చటచ్చట చెప్పినదానిని నీ క్రింద వివరింతును :-

(1) బ్రహ్మప్రణవ పథకము ననుసరించి జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములు నాలుగును ఒక్కొక్క దానిని నాలుగు భాగములుగా చేసిన 16 భాగము లగును. అందు ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్కనామము నిడియున్నారు. పదునారవదియగు 'తురీయ తురీయ' ను షోడశి యందురు.*

(2) శరత్కాలమునందలి చంద్రుని పదునారవకళను షోడశి యందురు.

(3) శివశక్త్యైక్యస్వరూపిణి (1000) అని లలితాసహస్రనామములయందు కలదు. దానిని 'అహం' అందురు. అందు 'అ' శివుడు 'హం' శక్తి. శివశక్తుల కూడికను షోడశి యందురు.

(4) అకారాది హకారాంతమై వైఖరీ వాగ్రూపమున శోత్రేంద్రియముచే తెలియబడును. (ఇవి అచ్చులు 16) దీనిని షోడశి యందురు.

(5) మనస్సును 'షోడశి'కామకల యందురు. మహానిత్యమనియు అందురు.

(6) షోడశిరూప శ్రీవిద్యయే శుద్ధవిద్యయని యందురు.

(7) యజ్ఞమునకుగాను కైకొను ఋత్విజులను 16 గురను షోడశి యందురు.

(8) (i) చర్మము, (ii) రక్తము, (iii) మాంసము, (iv) మెదడు, (v) ఎముకలు, (ఈ అయిదు ధాతువులు శక్తి మూలకములు) (vi) మజ్జ, (vii) వీర్యము, (viii) ప్రాణము, (ix) జీవము (జీవుడు). (ఈ నాలుగును శివమూలకములు) ప్రాణము జీవము ధాతువులు కావు. ఈ శివశక్తుల కలయిక శరీరము. కనుక దీక్షితుల పైతొమ్మిది ధాతువులు కలుపుకొని 'గుర్తెరిగే శరీరము' అని

* దీనిని ఈ గ్రంథముయొక్క ప్రథమభాగమునందలి రెండవ ప్రకరణమున (౯౮) తురీయాతీత - సత్తాసామాన్యములు అను అధ్యాయమున వివరించియుంటిని. దానిని చిత్తగింతురు గాక.

యుండవచ్చునని ఊహింపరాదు. శైవశాక్తముల ననుసరించి దీనికి మూలము కలదు. వారి మతమును మిథ్యయే, 'ఏమిలేదు' కనుక శ్రీవిద్యయందు చెప్పిన షోడశి యిది కాదు.

## (1) ఎఱుక - భ్రాంతియేనా?

"పరిపూర్ణములో లేనిదే యెరుకొక్కటి తోచి తనను యెరిగిన మృషగా" (కం. 95) అని కృష్ణదాసుగారు చెప్పిరి. వీరి సిద్ధాంతము ననుసరించి ఎఱుకే భ్రాంతి. భ్రాంతి యెవరికో కలిగినదికాదు. వీరి మతమున జీవుడు లేడు, చిదాభాసుడు లేడు; శరీరి, దేహి అనువారులేరు. కనుక, భ్రాంతి అను మాటయే సరికాదని అందురు. వ్యావహారిక జగత్తున భ్రాంతి కాధార మొకటి ఉండవలయును. రజ్జువు నాధారముగా చేసికొనియేకదా సర్పభ్రాంతి కల్పింపబడినది. అనిర్వచనీయ మిథ్యాసర్పమునకు రజ్జువు అధిష్ఠానము లేని అధ్యాస లోకమునందు లేదు.

మార్గమధ్యమున వెలుతురు కావలసినంత లేని సమయమున మనము రజ్జువును చూచినపుడు, రజ్జువుయొక్క సామాన్యరూపము మాత్రమే మన నేత్రేంద్రియమునకు గోచరమగును. విశేషరూపము కనబడదు. ఆ మసక చీకటిని ఆధారముగ చేసికొని రజ్జూపహిత చైతన్యము నాశ్రయించియున్న అవిద్యయందలి తమోగుణాంశము మిథ్యాసర్పమును కల్పించినది. అదేసమయమున చిదాభాసునితో కూడిన అంతఃకరణోపహిత చైతన్యమును ఆశ్రయించియుండిన అవిద్య తనయందలి సత్త్వగుణాంశమువలన సర్పజ్ఞానమును కల్పించునది. ఇట్లు మిథ్యాసర్పజ్ఞానమునకును అవిద్య ఉపాదానకారణము. ఇట్లు మిథ్యావస్తువు, మిథ్యాజ్ఞానమును, ఈ రెండునుచేరి 'భ్రమ' అనబడును. దీనినే 'భ్రాంతి' యందురు.

ఇక్కడ ఒక సూక్ష్మమయిన విషయమును చెప్పుచున్నాను. జాగ్రత్తగా వినవలయును. అద్వైతుల ననుసరించి త్రాటియందు త్రాడు అను ఎఱుక కలుగక పాము అను నెఱుక కలుగుటయే 'భ్రాంతి' అని అర్థమయినది కదా! దీక్షితులవారు అదే రజ్జుసర్పభ్రాంతిని గుఱించి చెప్పిన వాక్యములను వినుము.-

"యేమిలేని గుర్తెరిగే శరీరం వున్నదన్న భ్రాంతి ,రజ్జుసర్పభ్రాంతి, వుత్త త్రాడువలె పుట్టని చావనిది సకల దేశాలయందు సమస్తమయిన వస్తువులయందు చలించక యుండగా పాము తోచినట్లు మూలము లేని గుర్తెరిగే శరీరము తోచిందిగాని, కలతోచిన శరీరంనుండి మేలుకొంటే యేమీ లేదు." (బృ. పూ. ప్ర. 1)

ఇచ్చట బట్టబయలును రజ్జువుతోను, యెఱుకను సర్పముతోను పోల్చినారా? పోల్పలేదా? బయలునందు ఎప్పటికిని లేని యెఱుక ఉన్నట్లు ఆ 'లేని యెఱుకకే' తోచినదట. అట్లు తోచుటకు కారణమును వా రెచ్చటను చెప్పలేదు. అద్వైతులు చెప్పిన విధమును వారంగీకరించుటకు వారికి కొన్ని ఆక్షేపణలు కలవు. వారు (శ్రీ దీక్షితులవారు) చిదాభాసు నంగీకరింపరు. వారిమతమున అవిద్యయే యెఱుక. ఎఱుక మూడుకాలములయందును లేనిదే యందురు. ఇది సరికాదు.

దీక్షితులవారు చెప్పినట్లు ఉన్న బయలునందు లేని యెఱుక రజ్జువునందు భ్రాంతివశమున సర్పము కనబడినట్లు కనబడినదని చెప్పిరికదా? బయలు ఎఱుకకు అధిష్ఠానమనియు, ఎఱుక బయలునందు తోచిన అధ్యాసయనియు అంగీకరించినట్లయినవికదా? దీక్షితులవారు ఎఱుకకు అధిష్ఠానము లేదన్నారు.

అనగా అర్థమేమి? ఒకవంక బయలునందు లేని యెఱుక త్రాటియందు లేని పామువలె కనబడినదని చెప్పుచు, మిథ్యాసర్పమునకు రజ్జువు అధిష్ఠానము కాదనిన ఆ మాటలకు అర్థమేమైన కలదా? అధిష్ఠానము, అధ్యాస, భ్రాంతి అను పదముల యర్థము వారికి తెలియునా? తెలిసియుండిన నిట్లు చెప్పుదురా?

అధ్యాసమనగా -'అతస్మిన్ తద్బుద్ధిః' 'అది కాని దాని యందు అదియును జ్ఞానము'. అధిష్ఠాన మనగా - అధ్యాసములో దేనియందు దానికంటె వేఱగుబుద్ధి పుట్టునో అది అధ్యాసము. అధ్యారోపము, భ్రాంతి, అనునవి సమానార్థకములు.

భ్రాంతి యనునది ఒక పదార్థమునందు దానికంటెను భిన్నమగు మఱియొక పదార్థముయొక్క ఆరోపణ, అధిష్ఠానమగు రజ్జువు లేకున్న సర్పధ్యాసయే కలుగదు. ఈ సర్పము అద్వైతము ననుసరించి

అనిర్వచనీయమైనది. కనబడుచున్నది. కనుక ఇది (సర్పము) లేనిది అని చెప్పగూడదు. వెలుతురు వచ్చినంతనే కనబడుటలేదు కనుక యిది (సర్పము) ఉన్నదని చెప్పకూడదు. ఉన్నదని లేనిదని చెప్పుటకు వీలులేని దానినే వేదాంతులు 'అనిర్వచనీయ' మని చెప్పిరి. దీక్షితులవారి యెఱుక (ప్రపంచము) అనిర్వచనీయము కాదు. ఏలయన? అది 'లేనిది' అని చెప్పిరి. 'లేనిది' అని నిర్వచించుటవలన అనిర్వచనీయము గాక పోయెను. ఎఱుక లేనిదే అయిన కనబడకుండవలెనుగదా?

భ్రమ అనాది కాదని దీక్షితులవారు ఈ విధముగా చెప్పిరి. "ఈ భ్రమ అనాది యని పలుకుచుందురు. అనాది భ్రమగా విచారించితే నిత్యానిత్యత్వము కలుగుచున్నది. కనుక **ఈ భ్రమ అనాది యని యెంచకూడదు. ఈభ్రమ దుర్భ్రమ. ఈ భ్రమలను నమ్మియుండెడివాడు వెఱ్ఱివాడు."** (బ్ర. పూ. ప్ర. 6)

అనాది యనగా పరమసత్య మని యిచ్చట అర్థము కాదు. కర్మ, అవిద్య, సంసారము, కాలము, భ్రాంతి - యివి అనాదులు. అనగా ఆది తెలియనివని అర్థమేగాని, ఆది లేనివని యర్థము గాదు. కనుక వీటిని నాశరహితమైన నిత్యములని అర్థము చేయకూడదు. అట్టి అర్థము నిత్యసత్యమైన పరబ్రహ్మమునకే చెల్లును. ఇతరత్ర చెల్లదు. భ్రాంతి అనాది కా దనిరికదా? భ్రాంతికి ఆది యెప్పుడో ఆ కాలమును దీక్షితులవారుకాని, కృష్ణదాసుగారుగాని, నిర్ణయము చేసియుండలేదు. అనాది యనిన 'నిత్యానిత్యము కలుగుచున్న' దట. అనగా - దాని కర్థమేమో వారికి తెలియదు.

## (2) ఎఱుకను గుఱించి వివరముగా చెప్పలేకపోయిరి

దీక్షితులవారి గ్రంథమున ఎఱుకను గుఱించి పరస్పర విరుద్ధములైన వాక్యములు గలవు. అందులో కొన్నింటిని నీ క్రింద వివరింతును:-

**"శిష్యుడు:- సుషుప్తియందు యెరుక లయమాయెనా కలదా?**

**గురువు:- సుషుప్తియందు యెరుక లయమైతే పిలిచితే పలుకుచున్నాడు. గనుక ఎరుక కలదనే తెలియవలయును".** (బృ. పూ. పు. 141)

అదే ప్రకరణమునందు పై వాక్యముయొక్క అర్థమును ఖండించుచు శ్రీ దీక్షితులు చెప్పిన వాక్యము లివి:-

**"నిదురలో ఎఱుక ప్రకాశించదు. అందువలన ఎరుకకు హాని గలదు. ఏవిధముగా చూచినను ఎరుకకు హానిగానే యున్నది. ఇటువంటి యెరుకను నిత్య మనరాదు"** **(బృ. పూ. పు. 161)**

ఇవి సామాన్య వాక్యములుకావు. వీటి అర్థమును గమనించిన ఎఱుకను గుఱించి దీక్షితులవారికిగాని, కృష్ణదాసుగారికిగాని సంశయ రహితమైన పూర్ణజ్ఞానము కలుగలేదు. మార్గములేని అడవిలో సంచరించు మానవుడు ఎప్పటికెట్లు తోచిన అప్పటి కాదిశ ననుసరించి పోవునట్లు *శ్రీ దీక్షితులు, శ్రీ కృష్ణదాసుగారు ఎప్పటికెట్లు తోచిన అప్పటి కామాటలు చెప్పిరి. కాని స్థిరమైన నిర్ణయము వారికి లేదు. వారు నడుచుటకు రాజబాట యేర్పడలేదు. స్థిర నిర్ణయము లేకపోవుటచేత విసుగెత్తి తలనొప్పిపుట్టి చెప్పిన వాక్యములా యివి, అని తోపచేయు ఈ క్రిందివాక్యముల చెప్పి :*

**యెరుక కులము అరణ్యము. ఈ అరణ్యములో ప్రవేశించువారు ఎన్నటికి తేలరు. ఈ యెరుక మనకోసరమై గలిగినది. బ్రతుకనిబిడ్డ బారెడను సామెతగాను యెరుక అనేకరూపములు అనేకనామములు, యెరుకను వివరముగా తెలిసికొనజాలరు. యెరుకే నరకము".** **(బృ. పూ. ప్ర. 10)**

కృష్ణదాసుగారు చెప్పిన వాక్యములను చూడుడు:-

కందా|| **నిక్కముగ బీర పీచుల**
**చిక్కుసుమీ విచ్చరాదు ఛీ యీయెరుకన్**
**మక్కువనే బోధించిన**
**చిక్కని బోధాగ్నిచేత, సాధించుపోరా**
**విచ్చేచింత చాలించుకోరా**
**చొక్కమౌ యీ బోధకెక్కడ యీడౌను**
**తక్కిన బోధాల దిక్కు**
**చూడక దీన సాధించుపోరా**
**విచ్చేనంత చాలించుకోరా** (265)

కందా|| "యెరుకైన రీతినుండును
యెరుగ నశక్యంబటంచు యెన్నిన యెరుకన్
యెరుగుదుననినను
యెరుకన్ యెరుగుట దుర్లభము సుమ్మీ". (33)

ఈ విధముగ శ్రీ దీక్షితులు, శ్రీ కృష్ణదాసు ఎఱుకను గుఱించి సరియైన నిర్వచనము చేయలేకపోయితి మను తమ అసమర్థతను తుదకు అంగీకరించిరి కాని, సత్యమెఱిగిన వారికి చిక్కేమియు లేదు. సత్యస్ఫురణము లేనివారికి వేదాంత మంతయు చిక్కే. దీక్షితులవారు "నేననగా ఎఱుక, ఎఱుకనగా మాయ, మాయ యనగా త్రికాలముల యందును లేనిదే. బయలు నిత్యము" అని అన్నారు. అద్వైతులు చెప్పునది -"మాయ సత్యా సత్యములు రెండును కాదు. పరబ్రహ్మము పరమ సత్యము.

జిజ్ఞాసువు:- అయితే అంత మాత్రమునకు మీరంత చెప్పవలసిన అవసరమేమి గలిగినది?

వేదాంతి:- దీక్షితులవారు పై రెండు వాక్యములతో ఆగి వాటి యర్థమందు స్థిరముగా నిలువలేదు. బట్టబయలు కూడ నశించునన్నారు. వేదశాస్త్రములను, సీతాదేవిని, సీతాదేవి భక్తులను, బ్రహ్మాది దేవతలను, శ్రీ శంకరాచార్యులను నిందించిరి. అంతమాత్రమే కాదు. ఒకచోట చెప్పిన యంశమును సత్యమని స్థిరపరచి, వేఱొకచోట దానిని అసత్యమని ఖండించిరి. ఈ కారణములవలన విధిలేక ఇంత విస్తరించి చెప్పవలసి వచ్చినది.

జిజ్ఞాసువు:- అయ్యా! నేను "గొడ్రాలి కొడుకు"ను అని యెవరైనా చెప్పుకొనుటకు వారికి నోరెట్లాడునో నాకు తెలియదు "నాకు నాలుక లేదు" అని అనుట ఎట్టి అర్థశూన్యమో "నేను శూన్య" మనుట అట్టిదే కదా? నాస్తికులు, భౌతికవాదులు అన్నదేమి? "నాలుగు భూతముల వలన ఈ శరీరము కలిగినది. ఈ శరీరములో ఎఱుక కలిగినది". దానికిని దీక్షితులవారి మతమునకును భేదమేమి?

వేదాంతి :- నీవన్నది సత్యమే. సకల వేదాంతసారము రెండు వాక్యములలో చెప్పెదను. **"నేను అనబడు ఆత్మయే పరమసత్యము. నాకంటె భిన్నమైన**

దంతయు అసత్యము" - దీక్షితులవారి మతమున నే ననునది అసత్యము తన(నా) కంటె భిన్నమైనది సత్యము" ఇది జ్ఞాపక ముంచుకొనుము. ఈ యంశమును భగవద్గీతయొక్క 3వ అధ్యాయమునందలి 27, 28, శ్లోకములయందలి యర్థమును గమనింపుము. నీకు సమస్తము విశదపడగలదు. గీతోపదేశమేమనగా:-

నేను ఆత్మను, క్రియాశూన్యుడను, చేయబడుచున్న సమస్తము మాయ (ప్రకృతి) యే చేయుచున్నది. అహంకార విమూఢాత్ముడగు వాడు "నేను కర్తను" అనుచున్నాడు.

దీక్షితులవారు చెప్పినదేమనగా:- నేను మాయను (ప్రకృతిని) ఆత్మను, సమస్తమును చేయుచున్నది నేనే, నేనే కర్తను, గీతోపదేశమే ఉపనిషత్తుల సారము. "అహంకార విమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే" అను గీత వాక్యమునకు దీక్షితులవారు దోసిలొగ్గినారు. ఇచట పరస్పర విరుద్ధతత్త్వముల యొక్క భావము ఏకమై తిరుగ దూరమైపోయినది దీక్షితులవారిబోధ యెంత విన్నను సారాంశమింతే, కాని. జిజ్ఞాసువులయందుండు వివేక తారతమ్యముల బట్టి యింత విస్తరించి చెప్పవలసి వచ్చినది. మఱియు, అచలవాదులలో కొందఱు, శాస్త్రపరిచయములేని జిజ్ఞాసువుల బుద్ధిని కలతపెట్టకుండుటకై యింత విశదపరచితిని.

## (3) యోగవాసిష్ఠ - బృహద్వాసిష్ఠ సిద్ధాంతముల యందలి ప్రపంచస్థితి

జిజ్ఞాసువు:- అయ్యా! ఇదివఱలో (ఈభాగము ఒకటవ ప్రకరణమున 17వ అధ్యాయములో) తమరు "యోగ వాసిష్ఠము-అజాతవాదము" అను అంశమును గుఱించి చెప్పితిరి. సృష్టి జరుగలేదని మాత్రమే చెప్పితిరి. తదనంతరము శంకరులవారి అజాతవాదము యొక్క ప్రస్తావనరాగా యోగవాసిష్ఠ ప్రసక్తి పూర్తిగాకయే అంతటితో నిలిచిపోయెను.

తమరు అచట చెప్పిన ప్రకారము కారణాభావము వలన సృష్టి జరుగ లేదను సిద్ధాంతమును నమ్మినను పంచేంద్రియములచేత వ్యక్తమగుచు, మనస్సుచేత తెలియబడుచున్న నామరూపాత్మక జగత్తు ఎట్టయెదుట ఉండగా ఇది పుట్టుకపోయినట్లైన ఏల వ్యక్తమగుచున్నది? అను ప్రశ్నకు యోగవాసిష్ఠము తృప్తికరమైన సమాధాన మేమి చెప్పినది? ఆవిషయమును అనుగ్రహించి వివరింపుడు.

వేదాంతి:- ఈ విషయము అతిసూక్ష్మ మయినది. యోగ వాసిష్ఠము చెప్పినదానినే సంగ్రహించి చెప్పెదను వినుము- పరబ్రహ్మము శుద్ధజ్ఞాన స్వరూపము. మన బుద్ధికి అందునట్లు ఊహించుకొనవలయునన్న పరబ్రహ్మమును ఒక నిస్తరంగసముద్రము వలెను, స్పందములేని గాలి వలెను భావింపవలెను. వాస్తవముగా పరబ్రహ్మమునందేమియు పుట్టలేదు. గాలిలోనుండు చలనశక్తివలె ప్రపంచము పరబ్రహ్మమునందే అభేద స్వరూపముతో నున్నట్లును, అద్దమునందు తోచు నగరము అద్దమునకంటె అన్యమేదియునుగాక, దర్పణము మాత్రమే యైయున్నట్లును, వాయువునందు చలనశక్తి వాయువునకంటె భిన్నముగా గాని, అభిన్నముగా గాని, భిన్నాభిన్నముగా గాని నిరూపించుటకు వీలులేనట్లును - ఆ విధముగనే ప్రపంచముకూడ పరబ్రహ్మమునకంటె భిన్నముగా గాని, అభిన్నముగా గాని, భిన్నా భిన్నముగా గాని నిరూపించుటకు వీలులేదు.

జిజ్ఞాసువు:- పరబ్రహ్మము శుద్ధజ్ఞానస్వరూపు డని యంటిరిగదా! ప్రపంచము అయనయందున్నదనిన ఆస్వరూపమునకు బాధ కలుగదా?

వేదాంతి:- వస్త్రమునందు చిత్తరువు వలెగాని, ఒక పాత్రయందు నీరు, ధాన్యము వలెగాని- పరబ్రహ్మమునందు ప్రపంచమున్నదని చెప్పుట లేదు. పైన చెప్పితినిగదా- అద్దమునదు తోచు ప్రతిబింబమువలె నున్నది. ప్రతిబింబము చేతికి చిక్కదు. కాని కనబడుచున్నది. ప్రతిబింబములోని మంచి చెడ్డలు అద్దమును ఏవిధముగను అంటవు. ప్రతిబింబము కనబడిన కాలమందుగాని, కనబడని కాలమందునగాని అద్దము ఎప్పటివలెనే యుండును. ప్రతిబింబము వలన దాని కెట్టి మార్పును కలుగదు. అందువలన ప్రపంచము పరబ్రహ్మము నందు లేదని చెప్పినను ఒకవిధముగా తప్పుకాదు. కాని ,నీవడిగిన ప్రశ్నకు అట్లు చెప్పుట సరియైన సమాధానము కాదు.

ప్రతిబింబము (ప్రపంచము) అద్దమునందే యున్నది. కాని మాయ ప్రభావముచేత బ్రహ్మమునకంటె వెలుపల నున్నట్లు తోచుచున్నది. ఈ యంశమును తొలుత బ్రహ్మవిచారమును ప్రారంభించినపుడు దక్షిణామూర్తి శ్లోకము నుదాహరించి చెప్పియుంటిని.*

జిజ్ఞాసువు :- అద్దమునందు పట్టణ ప్రతిబింబమువలె బ్రహ్మమునందు ప్రపంచమున్న దంటిరికదా? బింబ భూతమగు యథార్థ వస్తువుండినపుడే దానికి ప్రతిబింబ ముండవలయును. ఆవిధముగానైన జగత్తు బ్రహ్మమునకంటె వేత్తైయుండి బ్రహ్మమునందు ఆ ప్రపంచము ప్రతిఫలించుచున్నదని అర్థము చేసికొనవచ్చునా?

వేదాంతి:- ఉన్న చిక్కంతయు ఇచ్చటనే. లోకమున బింబభూతమగు పదార్థ మున్నపుడే అది ఒక యుపాధియందు ప్రతిఫలించిన దానిప్రతిబింబ మేర్పడును. ఇచ్చట నన్ననో బింబ భూత పదార్థ మేదియు లేదు. ప్రతిబింబము మాత్రమే కలదు. బ్రహ్మమునందు ప్రపంచము ఆవిధముగా ఉన్నదని నీకు బోధించుటకొఱకు దర్పణ ప్రతిబింబ దృష్టాంతమును అట్లు చెప్పవలసి వచ్చినది.

జిజ్ఞాసువు:- పరబ్రహ్మము నందులేని ప్రపంచము అట్లు కనిపించుటకు కారణ ముండవలయును గదా?

వేదాంతి:- పరబ్రహ్మమునకంటె భిన్న పదార్థమే లేనపుడు కార్య కారణము లనెడి ద్వంద్వ మెక్కడిది? ఉన్నది పరబ్రహ్మ మొక్కటే. అట్టి బ్రహ్మమునందు, వాయువు నందు చలనశక్తివలె. బ్రహ్మమునకంటె వేఱనిగాని, వేఱుకాదనిగాని చెప్పుటకు సాధ్యపడని ఆయన సంకల్పశక్తి యేర్పడినది. ఆ సంకల్పశక్తి చేత ఏర్పడిన రూపమే మనస్సు. ప్రపంచమదియే.

ఈమనస్సు అతి విచిత్రమయినది. 'కలదు', 'లేదు' అను రెండు భావములకు (సంశయ, నిశ్చయములకు) మధ్య నిలిచి చంచలమై యుండుట యనునది యేది కలదో అదియే మనస్సునకు రూపము. సంకల్ప, వికల్పము లుండని మనస్సే పరబ్రహ్మము. అది కొంచెము స్థూలమైన ప్రాణాదులతో సంబంధము కలిగించుకొన్నట్లు తోచుచున్నపుడు దానినే జీవుడందురు. మనః

---

* బ్రహ్మజిజ్ఞాస ప్రథమభాగము. 1వ ప్రకరణము 6వ అధ్యాయము.

ప్రాణముల సంబంధము లేకున్న జీవుని స్వరూపమే పరబ్రహ్మస్వరూపము. ఆ జీవరూపమే ఘనమై అధిక చలనము గలదియై అభిమానరూపమగు అహంకారమును ధరించుచున్నది. ఇది జీవునకంటె స్పష్టముగా మన అనుభవమునం దున్నది. దీనియందుండు అభిమానమును దీని నుండి తొలగించిన అప్పుడు ఇది పరబ్రహ్మ స్వరూపమే. ఇది (అహంకారము) మరింత స్థూలమై చిత్తమనబడుచున్నది.

మొదట చెప్పిన మనస్సు సంకల్ప వికల్పాత్మకము. కనుక పరబ్రహ్మమునందు ప్రపంచ (జగత్) కల్పనము చేసినది. మనస్సునకు పరబ్రహ్మమునకంటె భిన్నమగు సత్తలేదు. మనస్సు అనునది శబ్దమాత్రమేగాని అర్థము లేదు. అది పేరుగల ఒక కల్పన. మనన శక్తితో కూడిన జ్ఞానమునే లోకులు మనస్సనిరి. చేతనా చేతనములకు నడుమనుండి రెంటితో సంబంధము ఏది కలిగియున్నదో అదియే మనస్సు. మనస్సే సంసారము. కనుక మనస్సుచేత కల్పింపబడిన ప్రపంచము పరబ్రహ్మమునకంటె భిన్నము కాదు. సంకల్ప వికల్పములవలన తోచు జగత్తు నామరూపములు కోల్పోయి పరబ్రహ్మమునందే లయమగుచున్నది. లయమనగా కనబడక పోవుచున్నది. లేదా పరబ్రహ్మరూపముగా కనబడుచున్నది.

ఈవిధముగా సంసారికి అద్దమునందు తోచు పట్టణము కైవడి ప్రపంచము సత్యమని తోచుచున్నది. జీవన్ముక్తులకన్ననో నిర్మలమగు అద్దము మాత్రమే కనబడుచున్నది. అందు పట్టణ ప్రతిబింబము లేదు. లేదా - పట్టణముగ కనబడినను అది మిథ్యాభూతమని, సత్యము కాదని, దర్పణము మాత్రమేయని నిశ్చయ మగుచున్నది. మనస్సు సంకల్ప వికల్పములు కలిగియున్నపుడే, అది ప్రపంచరూపమున తోచుచున్నది. మనస్సు నిశ్చలమైన జగత్తు మిథ్య. ఇంకను విశదముగా చెప్పెదను.

ఆద్యంతరహిత మగు చిద్రూపసముద్ర మొకటి కలదనుకొనుము. అది తనయందే తన స్వరూపమువంటి తరంగమువలె స్పందించిన దనుకొనుము. ఆస్పందమే చిచ్ఛక్తి. శ్రీ జ్ఞానేశ్వరులు చెప్పిన దాస్పందమే కదా? అది శివశక్తు లైనదని వారు చెప్పిరి కదా?

మహోపనిషత్తు ఇట్లు చెప్పినది:- చిద్రూపస్పంద మనబడు చిచ్ఛక్తియే దేశకాలానుగుణముగ వృత్తి భేదము ననుసరించి మనస్సనియు, బుద్ధియనియు,

వృత్తిజ్ఞానమనియు, క్రియ యనియు, అహంకారమనియు, చిత్తమనియు, ప్రకృతియనియు, మాయయనియు, మలమనియు, కర్మయనియు, బంధమనియు, పుర్యష్టకమనియు, అవిద్యయనియు, ఇచ్ఛయనియు, చెప్పబడుచున్నది.

(5-130, 131, 132)

శాస్త్రము లీరీతిగా చెప్పియుండగా దీక్షితులవారు చెప్పిన యెఱుక మనస్సు కాదని చెప్పుటకు వీలులేదు. కాని, దీక్షితులవారు పైన చెప్పిన పరబ్రహ్మసంబంధమైన శక్తి (చిచ్ఛక్తి)యే సర్వరూపములతో ఉన్నదని అంగీకరింపరు. వారు చెప్పిన ఉత్త బట్టబయలునకు ఏశక్తియు లేదట కనుక యెఱుక బయలునకు సంబంధించినది కాదందురు

బయలు - ఎఱుక : ఈ రెండింటిలో ఒకటి యెఱుక (జ్ఞానము) కలది. మఱియొకటి యెఱుక లేనిది. ఎఱుక యెన్నటికి బయలు కాదు బయలు ఎన్నటికి యెఱుక కాబోదు, కాదు, అని యొకచోట చెప్పి మఱియొక చోట అందుకు విరుద్ధముగా చెప్పిరి.

మనస్సే (ఎఱుకే) ప్రపంచరూప మైనది. అది మిథ్య కనుక దాని పరిణామమగు ప్రపంచము మిథ్య. మిథ్యయనగా:- **అనిర్వచనీయము కనుక మిథ్య యని వేదాంతులును - ప్రపంచము కుందేటికొమ్మువలె త్రికాలముల యందును లేనిదే యని దీక్షితులవారును భిన్నార్థములను చెప్పిరి.** కాని ప్రపంచ మనునది పరబ్రహ్మముయొక్క విస్తరమని యోగవాసిష్ఠమును, అట్లు కాదని బృహద్వాసిష్ఠమును చెప్పినవి.

అజాతవాదమును చేసిన యోగవాసిష్ఠకర్తయు, శ్రీశంకరులును, శ్రీ జ్ఞానేశ్వరులును, శ్రీ దీక్షితులును జగత్తు పుట్టలే దనుటలో భేదాభిప్రాయములు లేకపోయినను, వారి వారి సిద్ధాంతమును వివరించుటలో భేదమున్నది. ఎట్టయెదుట కనబడుచున్న జగత్తు పుట్టలేదనుట యోగవాసిష్ఠకర్త యిట్లు చెప్పెను:-

**శ్లో॥ అబుద్ధిపూర్వం సంజాతా రత్నాద్దీపం యథార్చిషః॥**
**సత్తైవ సంనివేశేన తథైవాసాం జగద్దృశామ్॥ (6-107-30)**

తా॥ రత్నములు తమప్రయత్నము (లు) లేకయే తమ (రత్నములయొక్క) కాంతులు రత్నములనుండి ప్రకాశించునట్లు పరబ్రహ్మము సంకల్పము లేకయే జగదాకారమున స్ఫురించుచున్నది.

జిజ్ఞాసువు :- అయ్యా! తమరు తొలుత (ఈ గ్రంథము యొక్క ప్రథమభాగమున) ఆత్మయందు ఆకాశాది సూక్ష్మభూతపంచకము కలిగినవని, వాటియందలి సత్త్వగుణము యొక్క సమష్టి అర్థభాగ పంచకములవలన మనస్సు కలిగినదని చెప్పియుంటిరి. కాపిల సాంఖ్యుల సృష్టిక్రమములోను, వారి సృష్టిక్రమమును కొంతవఱకు అనుసరించిన ఉపనిషత్తులలోను ప్రకృతికి మహత్తును; దానికి సాత్త్విక, తామస భేదములు గల అహంకారమును; అందు సాత్త్వి కాహంకారమునుండి మనస్సు కలిగినదని చెప్పితిరి. యోగవాసిష్ఠమున పరబ్రహ్మమునుండియే, లేక ఆయనస్పందమే లేదా, ఆయన లీలయే, మనస్సని చెప్పితిరి. ఈ యంశమున ఈ భేదమును పరిహరించుటెట్లు?

వేదాంతి:- మొదట చెప్పినది సృష్టివాదుల పద్ధతి. రెండవది అజాతవాదుల పద్ధతి. కనుక యీ భేదమేర్పడినది. విచారించినచో ఇది నామమాత్ర భేదమే. పరబ్రహ్మము యొక్క స్పందము, లేక లీల, అనుదానికే మనస్సను మఱియొకపేరు కలదనుకొనిన సరిపోవునుకదా? మనస్సు శుద్ధమనియు - అశుద్ధమనియు - రెండువిధములు. బ్రహ్మము నుండి తొలుత కలిగినదని చెప్పబడినది శుద్ధ మానసము. అదియే చిత్తము, స్పందము. మైత్రాయణ్యుపనిషత్తు - శుద్ధ మానసమును హృదయముతో సమానమని చెప్పినది. - ఏది హృదయమో అదియే మనస్సని ఐతరేయశ్రుతి చెప్పినది. (ఐ. 3-2). అదియే అతిమానసమని, అతీతమానసమని రెండు విధములుగా చెప్పుదురు. అవి యోగులయందును మహర్షులయందును నుండు నందురు. పంచేంద్రియములతో కూడి పనిచేయు మనస్సు సామాన్య మానసము (భౌతికమానసము). అదియును గాక వేదాంతులు అజాతవాదులైనను వారుచెప్పినదేమన - ఉపనిషత్తులయందు చెప్పిన సృష్టిక్రమము ముముక్షువులకు పరతత్త్వము సులభముగ అవగాహన చేసికొనుటకు కల్పింపబడినదని అందురు.

జిజ్ఞాసువు:- ప్రపంచము నాకు కనబడుచున్నదికదా? అది జడమునకు చైతన్యమునకు మధ్యనుండి మనస్సు ప్రపంచముగా నెట్లు పరిణమించును?

వేదాంతి:- యోగవాసిష్ఠ మిట్లు చెప్పినది:- జడమని చేతనమని వేర్పాటు

సర్గాదియందు లేదు. ఇప్పుడు నీకు కనబడుచున్న ఆ రెండింటికి సత్త పరబ్రహ్మమే. 'సమస్త' మును చిదేకరసమే. జడము లను కల్పన బుద్ధి యొక్క కల్పనయే. అయా వస్తువులయం దున్న ప్రత్యేక బుద్ధి తమ్ము అయా వృక్ష శిలాదులుగ భావించుకొని అయారూపములతోనే అభివ్యక్తి చెందియున్నది. (3. 55-57-59)

కాని, నీవడిగిన ప్రశ్నకు సూటియైన సమాధాన మేమన - మనస్సు. ఇంద్రియముల వైపునకు మరలి చూచిన జడజగత్తును, ఇంద్రియముల నుండి మరలించి అంతర్ముఖమై యుండిన చైతన్యమును చూచును. కనుక మనస్సు జడచైతన్యముల మధ్య నున్నదనిరి.

ఇవి యంతయు స్వప్నతుల్యమని యోగవాసిష్ఠము చెప్పిన దానినే దీక్షితుల వా రంగీకరించిరి. కనుక మఱియొకమారు స్వప్న విచారమును గుఱించి పరిశీలింతము.

## (4) స్వప్నవిచార పునః పరిశీలనము

స్వప్నమును గుఱించి వెనుక (ఈ గ్రంథము. 1-2-33 నందును) దీక్షితులవారు చెప్పిన పంచదశీ మంత్రార్థమును పరిశీలించు సందర్భముననను (2-21) చెప్పియుంటిని. స్వప్నజాగరములు రెండును నొక్కటియేయను (దీక్షితులవారి) సిద్ధాంతము శ్రుతులకు సమ్మతము కాదని (21. వ అధ్యాయమున) శ్రుతి వాక్యముల నుదాహరించి యుంటిని.

ప్రస్థానత్రయమం దొకటిగను, వేదాంత శాస్త్రములయందు సాటిలేని గౌరవము పొందినట్టియు, బ్రహ్మసూత్రముల (వేదాంత సూత్రముల) యందు 3వ అధ్యాయమున 2వ పాదమున సంధ్యాధికరణమున స్వప్న విచారము చేయబడినది. సంధ్య - యనగా రాత్రిగాని, పగలుగాని కాక ఆ రెండింటికి మధ్యగల సమయము. దానిని శ్రుతులయందు సంధి యనికూడ చెప్పిరి. స్వప్నము పరలోకమును (సుషుప్తి) కాదు. ఇహలోకమును (జాగ్రత్తయు) కాదు, మధ్యనున్నది. కనుక సంధియని ఆ యధికరణమునకు నామమిడిరి.

సంధ్యాధికరణము నందలి చర్చలో స్వప్నమున అనుభవింపబడు సృష్టి సత్యమే అని పూర్వపక్షియు, సత్యము కాదు మిథ్య యని సిద్ధాంతియు వాదించినట్లు కలదు. సారాంశమిది:

స్వప్నము నిద్రనుండి మేల్కొనగనే అసత్యమగును. స్వప్నము ప్రాతిభాసిక సత్యమే. జాగ్రత్త అట్లు కాదు. బ్రహ్మ సాక్షాత్కార పర్యంతము సత్యమే. ఇదే వ్యావహారిక సత్యము. స్వప్న జ్ఞానము కొన్ని సమయములయందు భవిష్యత్తు నందలి జాగ్ర దనుభవమును సూచించును. ఉపాసకులకు వారి ఉపాస్య దేవత స్వప్నమున సాక్షాత్కరించి భక్తులకు వరము లిచ్చునందురు. దీనిని "సూచ్య సూచకభావ సంబంధ" మందురు. (బ్రహ్మ. 3-2-4) ఇంతమాత్రము చేత స్వప్న జాగరములు ఒకటి యనరాదు. వివరములను తెలియగోరువారు. ఆ యధికరణమునకు శ్రీ శంకరులు వ్రాసిన భాష్యమునుగాని, బ్రహ్మసూత్రార్థచంద్రికను గాని చదువవలయును. సూత్రకారులు చేసిన వాదము దీక్షితులవారి మతమును ఖండించుచున్నది.

జాగ్రదవస్థయందు మనకు నామరూపాత్మక జగత్తు పరబ్రహ్మమును అధిష్ఠానముగా జేసికొని మాయచే కల్పింపబడినది. స్వప్న ప్రపంచమున సాక్షి నధిష్ఠానముగా జేసికొని అవిద్య కల్పించుచుండును. స్వప్న జాగరములు నొక్కటియే యైన పక్షమున వారి యనుభవ మీ క్రింది విధముగ నుండవలయును:-

(1) స్వప్నమున నొకనికి నిధి (ధనము) లభించిన మేల్కొన్న పిమ్మటను నిధి వానియొద్ద యుండవలయును.

(2) స్వప్నమున నొకడు వానికి కాలు తెగిపోయినట్లు కలగనిన స్వప్నము నుండి మేల్కొన్నపుడును వానికి కాలు తెగియుండవలయును.

(3) స్వప్న ప్రపంచమున కార్య కారణములు రెండును నొక్కమారే కలుగును. జాగ్రత్తయందు మొదట కారణము, దాని ననుసరించి కాల పరిపాకమున కార్యమును కలుగుచుండును.

(4) ఒకడు ఒక ఆదివారము ఒక గ్రంథమును చదువుటకు ప్రారంభించి యేబది పుటలు చదివె ననుకొనుము. వాడే మరుదినమున ఆ గ్రంథమును గైకొని వెనుకటి దినమున నేబది పుటలు చదివితినని స్మరించి యేబది యొకటవ పుటనుండి చదువుటకు ప్రారంభించి చదువును. కాని, ఆదివారము రాత్రి వానికి గలిగిన కలయందు గ్రంథమును ఏబది ఒకటవ పుటనుండి

చదువడు. స్వప్నమున వాని కాగ్రంథ స్మరణమే యుండదు. స్వప్నము మన యధీనము కాదు, అనగా - ఒకని కొకరాత్రి నిద్రయందు కలిగిన స్వప్నమునకును, మఱియొక రాత్రి వానికే కలిగిన కలకును సంబంధ (అనుబంధ) ముండదు

(5) ఒకడు స్వప్నమున నొకయూరికి నడిచిపోవునట్లు కలగనుచుండు నంతలో నిద్రాభంగమై మెలకువ వచ్చును అప్పుడు వాడు, తన ఇంటిముందే రాత్రి తాను శయనించిన పడుకయందే మేల్కొనునుగాని, రాత్రికలలో నడచుచు పోయిన మార్గమధ్యమున మేల్కొనడు.

(6) జాగ్రదవస్థయందు ముక్తిసాధనములగు శాస్త్రాధ్యయనము, జ్ఞానయోగము, అష్టాంగ యోగముల సభ్యసించుటకును, ఈశ్వరారాధనము మొదలగు వాటిచే ముక్తిని బొందుటకు అవకాశమున్నది స్వప్నమున అట్లు చేయుట కవకాశము లేదు.

(7) నేను నాయనుభవమును చెప్పెదను. స్వప్నమును గనుచున్నపుడు ఇది స్వప్నమని తెలియకపోయినను స్వప్నగతమగు నా శరీరమునకు నేను వేఱుగా (సాక్షిగా) నుంటినను అనుభవము జాగ్రదవస్థయందు కంటె స్వప్నమున స్పష్టముగా నుండును. ఈ యనుభవమును మాటలతో విశదీకరించుట కష్టము. ఇందులకు శాస్త్రదృష్టాంతమును సహితము చూపెదను.

మహాభారతాంతర్గత శాంతిపర్వము నందలి, మనుబృహస్పతి సంవాదమునందు ఈ విషయ మిట్లు వివరింపబడినది.-

చ. **కలలోనం దనమేను నేలబడుటన్ గన్గొంచు దానన్యు న**
**ట్టులు గన్పట్టునుగాన దేహమున కెప్డున్ భిన్నుడై జీవు డొ**
**డ్డులు మేనుల్ గొని ధీమనో ఒక్షముల తోడుం గల్గి లింగాంతరం**
**బుల బొల్పొందు నటంచు నీకు దెలియంబోలున్ బుధేంద్రోత్తమా.**

(కృ. భా. శాం. 5-366)

ఒకడు వాని స్వప్నమున వాని దేహము క్రిందపడినట్లు చూచును. తనదేహమును చూచినట్టి తాను వేఱుగను, తనచే చూడబడునట్టి తన

దేహము వేఱుగను నున్నట్టి యనుభవము కలుగును. కనుక దేహము వేఱుగను నున్నట్టి యనుభవము కలుగును. కనుక దేహమునకంటె జీవుడు భిన్నుడు. అట్లె వాడు మరణించినపుడు బుద్ధి, మనస్సు, ఇంద్రియములు వీటితో కూడినవాడై దేహమును వదలి వేఱొక దేహము పొందినవా డగునట్లు నీవు తెలిసికొనవలెనని తాత్పర్యము.

జిజ్ఞాసువు:- అయ్యా! కొంద ఱిట్లందురు:- ఒకదొక రాత్రి నిద్రలో ఒక స్త్రీతో సంభోగించినట్లు కలగనును. వాడు కట్టుకొన్న వస్త్రమునందు వానికి వీర్య స్ఖలన మగును. మేల్కొనగనే అది వానికి తెలియును. అకారణమున స్వప్న జాగరములు సమములే యందురు. ఇందులకు సమాధాన మేమి?

వేదాంతి:- అది తప్పు. కలగనిన పురుషుడు వాని స్వప్నమున వా రేకాంతతో భోగించెనో దాని యోని యందుగదా వాని వీర్యము పతన మయ్యెను. మేల్కొన్నప్పుడు ఆ స్త్రీ కనబడనట్లె వాని వీర్యము సహితము కనబడకుండ నుండవలయునుగదా? అట్లుగాక, వాని వీర్యము వాడు కట్టుకొన్న బట్టయందు కనబడుటకు కారణమేమి? శరీరమున ఉష్ణ మధిక మైనప్పుడును, ఆనాడు భుజించిన అన్నపానముల వలనను నాడులకు ఉత్తేజము కలిగి లింగోత్థానమై అండములలోని (శుక్ల కోశాలలో నిండిన) వీర్యము బయట పడుచున్నది. ఇంకను శారీరక, మానసికమగు నితర కారణము లున్నవి. అది తాత్త్విక విషయము కాదు.

ఇంకొక విషయము గమనింపుము. కలలో కనబడిన ఆ స్త్రీ వానిని గంధ మాల్యాదులతో అలంకరించి, తాంబూల మొసగి, పరిమళ ద్రవ్యము లలంది వానితో సంభోగించినట్లు కలగనును. వాడు మేల్కొన్న పిదపకూడ ఉపభోగ చిహ్నములగు దంత నఖ క్షతాదులు వానియం దుండవలయునుగదా? మేల్కొనగానే వాటిలో నొక్కటియైనను కనబడదు. స్వప్న జాగరము లొక్కటి కాదనుట కీకారణము చాలదా? స్వప్నగత స్త్రీతో కలిగిన భోగానుభవము నిద్రాదోషముతో కూడిన అవిద్యాకల్పితము. నిద్ర లేకపోవుటతో అవిద్య అక్షణమునందే స్వప్న కల్పనము నుపసంహరించినది "కల యెవ్వరి స్వాధీనం లేదు". (బృ. ఉ. ప్ర. 6. అ. 2) అని దీక్షితులవారే చెప్పిరి కదా?

కల కార్యకారణబద్ధమై యున్నది. జాగ్రత్త కార్యబద్ధమై మాత్రమే యైయున్నది. దీని వివరమిది :-

త్రివిధావస్థల స్వరూపమును విచారించి చూచిన త్రివిధ సత్తల నంగీకరించుట ఉత్తమపద్ధతి యని నా యభిప్రాయము. పెద్దల యభిప్రాయమే అది.

(1) సుషుప్తి (గాఢనిద్ర) :- దీక్షితులవారు చెప్పు ఎఱుక దీనియందు లేదు. అద్వైతులు చెప్పు సాక్షి కలదు. వృత్తిజ్ఞానమును లేదు. దీనియందు స్వప్నము కలిగినది. కనుక స్వప్నమునకు సుషుప్తి కారణము. స్వప్నము దీని కార్యము. సుషుప్తికి కారణము లేదు. కనుక నిద్ర కారణబద్ధము, కార్యబద్ధము కాదు. అనగా నిద్రకు కారణము లేదు.

(2) స్వప్నము :- ఇదే దీక్షితులవారు చెప్పిన ఎఱుక. ఆయన మతము ననుసరించి యిది లేతశరీరము. దీనికి కారణము లేదని వారి వాదము. వారి మతమున నిదే "మూలములేని గుత్తితిగే శరీరము" నిద్రలో స్వప్నము కలుగుచున్నదని యెంత అమాయకుడైనను ఎంతటి పశుప్రాయుడైనను తెలిసికొనుచున్నాడు. ఇట్టి ప్రత్యక్షానుభవమును కాదనిన నెవరు మోసపోవుదురు? కనుక గుత్తితిగే శరీరమునకు మూలమున్నది. ఆ మూలమే సుషుప్తి. అదియే అవిద్య.

స్వప్నమునకు కారణము సుషుప్తి. స్వప్నమునందుండి జాగ్రత్త కలిగినది. కనుక స్వప్నమునకు జాగ్రదవస్థ కార్యమును, సుషుప్తి కారణమును అయినందున స్వప్నము కారణ - కార్య బద్ధమై యున్నది.

(3) జాగ్రత్త :- ఇది స్వప్నమునుండి కలిగినది. దీనిని దీక్షితులవారు ముదురు శరీరమన్నారు. ఇది స్వప్నము నుండి కలిగినందున కార్యబద్ధమై మాత్రమే యున్నది. దీని యందు మఱియొక యవస్థ కలుగలేదు. కనుక ఇది కారణ బద్ధము కాలేదు. ఇట్లు కార్యకారణ బద్ధమగు స్వప్నమును కేవల కార్యబద్ధము మాత్రమే అయియున్న జాగ్రత్తను ఒక్క ప్రాతిభాసికసత్తయని అంగీకరింపగూడదు.

నదియొక్క ఉభయతటముల యందు సంచరించు చేపవంటిది స్వప్నమని బృహదారణ్యకశ్రుతి (6-3-18) చెప్పినది. మూడవస్థలయందు జీవుడుండు స్థానములు వేఱువేఱని శ్రుతులు చెప్పినవి.

జిజ్ఞాసువు:- అయ్యా! స్వప్నము కేవలము మిథ్య యనవచ్చునా?

వేదాంతి:- (దీనిని గుఱించి) యోగ వాసిష్ఠము నందలి నిర్వాణ ప్రకరణమున 148వ సర్గమున వ్యాధ - ముని సంవాదమను ఇతిహాస రూపమున ఈ తత్త్వము బోధింపబడినది. ఒకమునికి వ్యాధునికి జరిగిన సంవాదమునందు ముని వ్యాధునకు ఇట్లు చెప్పెను:-

స్వప్నఫలములు కొందఱికి కాకతాళీయ న్యాయము వలె ఫలము కలుగజేయును. వీటిని సత్య స్వప్నములని తెలియజేయవచ్చును. ఒకానొక మహాపురుషునియందు (సత్త్వగుణ సంపన్నునియందు) స్వప్న ప్రభావము జాగ్రత్త దశయందు సత్యమే యగును. అయినను అది ఆకస్మికమే. ఈ స్వప్నము నిత్యమేయను జ్ఞానము దృఢ నిశ్చయమై యున్న చోట సత్యమే యగుచున్నది. సంశయ జ్ఞానము కలచోట ఫలమును సంశయమే యగుచున్నది. అట్లే స్వప్నము అజ్ఞానులయొక్క దృష్టియందు ఒకానొకచోట (సంవిత్తు యొక్క దృఢత్వముగ) సత్యముగను, మరియొకచోట (సంవిత్తుయొక్క అదృఢత్వముగ) అసత్యముగను ఉన్నది. జ్ఞానులయొక్క దృష్టియందు సద్రూపముగగాని అసద్రూపముగ గాని కాక అనిర్వచనీయమై ఒప్పుచున్నది.

స్వప్నములు కూడ శాశ్వతములే యనిన పెద్దలు కొంద ఱున్నారు. శ్రీ అరవిందయోగి స్వప్నములు ఈశ్వర ప్రేరితములై కలుగు ననిరి. స్వప్నములు అసత్యము లైనను వానివలన భావి శుభాశుభములను తెలిసికొనవచ్చు ననిరి-

## (5) బయలును గురించిన పునఃపరిశీలనము

బయలు - ఇది ద్వాదశాక్షరీ మంత్రమునకు సంబంధించినది. బయలును గుఱించి వెనుక (22వ అధ్యాయము నుండి 25వ అధ్యాయము వఱకు) చెప్పియుంటిని. ఆ సందర్భమున (23వ అధ్యాయమున) "ఉపనిషత్తులయందలి బ్రహ్మము" అను చర్చయు. (24వ అధ్యాయమున) "భూమి అనగా నేమి" అను చర్చయు (25వ అధ్యాయమున) "బ్రహ్మము సగుణ, నిర్గుణ,

నిష్ప్రతియోగికములని త్రివిధముగా" చెప్పబడిన యంశమును, (43వ అధ్యాయమున) చిదాకాశ, చిత్తాకాశ, జడాకాశముల గుఱించియు చెప్పితిని. అందు (పై అధ్యాయములయందు) బయలునకంటె వేఱగు అంశముల కొన్నింటిని చర్చించినను అవి బయలును గుఱించి చర్చించి యున్నందున నిచట ఎక్కువగా చర్చింప నవసర ముండదు.

ఒకచోట దీక్షితుల వా రిట్లు చెప్పిరి:-

**"శంకరాచార్యులవారి అద్వైతము, రామానుజాచార్యులవారి విశిష్టాద్వైతము, సర్వం వారితోటే పోయింది, వున్నది ద్వైతాద్వైతరహితమైన పరమతత్త్వం. దశముఖుడు వేరే అన్నట్లు యెక్కడబడితే అక్కడే బట్టబయలు వున్నది.** **(బృ. ఉ. ప్ర. అ. 2)**

అద్వైత విశిష్టాద్వైతములు ఎక్కడికిని పోలేదు. దశముఖుడు (రావణాసురుడు) "యెక్కడ బడితే అక్కడ బట్టబయలు వున్నది" అన్నమాట కర్థమేమి? రావణుడు యుద్ధము సమాప్తము కాకముందు లంకానగరములోని గోపురమెక్కి చూచినపుడు వాని చతురంగబలము లన్నియు నశించి యుద్ధభూమి శూన్యముగా నుండుట చూచి యుండి "యెక్కడిబడితే అక్కడ బట్టబయలుండు" నని అని యుండునా? లేక దశముఖుడు దీక్షితులవారు చూచిన బయలును చూచినాడా? ఇందులకు ప్రమాణ మెచ్చట? కృష్ణదాసుగారు ఇట్లు చెప్పిరి:-

బయలులో ఎఱుక కనబడుటలేదు, కనుక యెఱుకను శూన్యమనవలసి వచ్చెనట (కృష్ణదాసుగారి కందములు 77, 78, ఇదివరలో ఉదాహరించితిని). ఆ శూన్యమునే ఆకస మనవలసి వచ్చెనట. ఆకసమువలననే విశ్వమయినదట. అది యెట్లు? శూన్యమునుండి యేదియు కలుగదు. శూన్యము నుండి జగత్తు కలిగిన శూన్యము కారణధర్మము గలదియు, తనయం దుండి కలుగబోవు విశ్వముయొక్క బీజమును గర్భమునందు గలదియు, కనుక సగుణయు జగత్తునకు కారణమును కావలయును. అట్టిది శూన్య మెట్లగును?

శ్రుతియే భూమ, బయలు - అని చెప్పుట కూడ ఒక విధముగా (చూచిన) వ్యావహారికమే. ఏలయన? అల్పమున్నపుడే అధిక మున్నదను భావము కలుగుచున్నది. "బ్రహ్మము" అన్నను, "భూమ" అన్నను, గొప్పది అని అర్థము.

దేనికంటె గొప్పది? తదితరమైన సమస్తమున కంటె గొప్పది తదితరమే యున్నది. ఉన్నది ఒక్క భూమయేగదా? నిజమే. నామరూపాత్మక నానావిధ వస్తుజాలము కలదను అజ్ఞానులకే ఈ బోధ చేయవలసి వచ్చినందున గురువు అట్టి సంసారియొక్క అనుభవమునకు తగినట్లు తన బుద్ధిని శిష్యుని బుద్ధియొక్క స్థానమునకు తెచ్చి పై విధముగా చెప్పవలసి వచ్చినది. "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అని శ్రుతి చెప్పినది. కాని శ్రుతి పొరపాటుపడదు. పైశ్రుతి వాక్యమున కర్థ మేమనగా:- ఓ సౌమ్యుడా! అగ్రే = సృష్టికి పూర్వమునందు, సత్ = సత్యము మాత్రమే ఉండెను. సృష్టికి పూర్వము అన్నపుడు ఆ సత్పదార్థము ఇపుడు లేదని యర్థమా? భవిష్యత్తునందు ఉండబోదని అర్థమా? త్రికాలాది బాధితమైన వస్తువే సత్పదార్థము గదా? పూర్వము అనుట తప్పుగదా? శ్రుతి తప్పు చెప్పదు. మానవుడు పుట్టినది మొదలు వానికి గల జ్ఞానము దేశకాలములచేత పరిమితమై యున్నది. వాని అనుభవము దేశకాలముల నతిక్రమించియుండలేదు. కనుక వానికి బోధించుటకు శ్రుతి, లేక గురువు, దేశకాల పరిమితిలోనికి తన బుద్ధిని ప్రవేశపెట్టి అచ్చటనుండియే శిష్యులకు బోధింపవలయును. లేనిచో (ముముక్షువునకు) నేల విడిచి సాము చేయుమని చెప్పినట్లగును.

కనుక అఖండాద్వయ వస్తువు ఒకటి కలదంటిమేని ఆ వస్తువు శుద్ధజ్ఞాన స్వరూపమై యుండవలయును. ఆ వస్తువు గాక మఱియొకటి కాదనిన ద్వైతము సిద్ధించును. ఒకటే కలదనిన దాని ఉనికి అది తప్ప ఇతరమైన దేదియు ఎఱుగుటకు వీలులేదు. ఈ చిక్కును విడదీసి పరిశీలించినట్లయిన దీక్షితులవారు చెప్పు ఈ ఉత్త బట్టబయలు "యేమీ లేదు" అన్నప్పుడు "యేమీ లేని దానిని" గుఱించి యేమి చెప్పవలయును?

బృహద్వాసిష్ఠ సిద్ధాంత గ్రంథముయొక్క ప్రతియందు గ్రంథము సమాప్తమయిన పిమ్మట "భావార్థ దీపిక"* అను పేరున నున్నదానినే "భావరహిత ప్రకరణ" మని మఱియొకరు భిన్న ప్రతులయందు ముద్రించియున్నారు.

---

* ఈ ప్రకరణమునందే 187-వ పుటలో శ్రీమద్భాగవతమునకు శ్రీధరస్వాములవారు వ్రాసిన వ్యాఖ్యానమునకు "భావార్థదీపిక" అను పేరని వ్రాసియుంటిని. అందులో అచలవాదులు కొంత భాగము నుదాహరించిరేమో తెలియదు.

అది వ్రాసినవా రెవరో తెలియదు. సంస్కృతము నందున్నది. ఒక ప్రతిలో దానికి టీకాతాత్పర్యమును కూడ వ్రాసి ముద్రించి యున్నారు. అందులో -

శ్రుతి "సర్వదా మాం అహం న వేద, ప్రత్యక్చైతన్యమాయా రహితత్వాత్, తస్మాత్కదాచి న్మాయయా వేద ! మాయయా న వేద!

టీక:- సర్వదా = ఎల్లప్పుడును, మాం = నన్ను, అహం = నేను, ప్రత్యక్చైతన్య = అచల పరిపూర్ణ బ్రహ్మమని చెప్పబడుచున్నాను, మాయారహితత్వాత్ = మాయ రహిత మగుటచేత. తస్మాత్ = అందువలన, కదా చిత్ = ఒకప్పుడును, మాయయా న వేద = మాయను తెలియబడదు".

పై వాక్యములవలన 'అహం' శబ్ద వాక్యమైన ప్రత్యగాత్మయే అచలపరిపూర్ణమని అర్థమగుచున్నది. దీక్షితులవారి వాదమును ఈ వాక్యము ఖండించుచున్నది. ఇది చాలదా?

బౌద్ధమత - అచలబోధలకు గల సారూప్యమును గురించి (వెనుక 37వ అధ్యాయమున) చెప్పియుంటిని. ఆ యంశములను జ్ఞప్తికి తెచ్చుకొనిన నాగార్జునాచార్యులవారి శూన్యవాదముతో దీక్షితులవారు చెప్పిన బట్టబయలునకు కొన్ని పోలిక లున్నవి. మాధ్యమికబౌద్ధుల శూన్యమునకు అర్థమేమనగా:- సర్వమును పరివర్తన శీలము గలవై నిలుకడ లేనివైనందున సర్వము శూన్యమే అనిరి. నాగార్జునాచార్యులవారు చెప్పిన శూన్యము నశించునదని వా రెచ్చటను చెప్పియుండలేదు. దాని భావము వేఱు. శ్రీ దీక్షితులవారు "మహాశూన్యమే అగోచరమై నశించుచున్న" దనిరి, (అ. 26) కనుక ఈ రెండును పూర్తిగా ఒకటి కావు. దీక్షితులవారు గురుపరంపరలోని వారిపెద్దలు, మాధ్యమికుల శూన్య భావమును "ఉత్త బట్టబయ లని యేమి లేదని" మార్పులు చేసియుందురని నమ్మవచ్చును.

## (6) తురీయ - తురీయాతీతముల గురించిన పునఃపరిశీలనము

జ్ఞాన భూమికలను గురించి ఇదివరలో అచ్చటచ్చట చెప్పియుంటిని.* వాటిలో తురీయ, తురీయాతీతములను గురించి మఱొయొకమారు చెప్పెదనని

* ఈ గ్రంథముయొక్క ౧ - ౧౫ నందు "జ్ఞాన భూమికలను" ఆ ౪౬ నందు, "తురీయాతీతము - సత్తా సామాన్యము"ను గురించియు, ద్వితీయ భాగమునందలి, ౨౫, ౨౬, ౨౭ అధ్యాయములయందు తురీయాతీతమును గురించియు చెప్పియుంటిని. చిత్తగింపుడు.

చెప్పియుంటిని. ఇప్పుడావిషయమును విచారింతము - మొదట మూడు భూమికలు సాధించినవారికి పుణ్యలోక ప్రాప్తి కలుగును నాలుగు నుండి యేడు వరకుగల భూమికలు సాధించినవారు ముక్తులే. అయిదవ భూమికయం దుండువారలు సమాధి నుండి యితరుల ప్రేరణచే జాగ్రదవస్థకు వచ్చెదరు ఆఱు ఏడు భూమికలయం దుండువారి అనుభవమును గుఱించి శాస్త్రముల యందు భిన్నాభిప్రాయము లున్నవి. ఆఱవ భూమికయందుండువారు జీవన్ముక్తులనియు, ఏడవ భూమికయందుండు వారు విదేహముక్తులనియు భేదమును చెప్పిరి. "అద్వైతులు జీవన్ముక్తులే గాని విదేహముక్తులు కారనియు, తాము విదేహముక్తుల మనియు, అనగా శరీరము లేనివార మనియు శ్రీ జ్ఞానేశ్వరుల సంప్రదాయమునకు చెందిన కొందఱు చెప్పుదురు. "ఉన్నది విదేహముక్తియే గాని జీవన్ముక్తి లే" దని దీక్షితులవారు చెప్పిరి. కనుక నీ యంశమును తిరుగ పరిశీలింపవలసి వచ్చినది.

ఆఱవ భూమికయం దుండువారు సమాధిని చెందినపుడు వారు ఇతరుల ప్రేరణముననే జాగ్రదవస్థకు రాగలరు. వారికై వారు రాలేరు. నేనొక యోగిని చూచితిని. ఆయన సమాధిస్థితికి పోవుటకు ముందు అచట నున్న వారితో "నేను రెండు దినములు సమాధినుండి లేవనేనని కొంచెము వెన్న నాతలపై నిడిన జాగ్ర దవస్థకు వత్తును. మీ రాప్రకారము చేయుడు" అని చెప్పి సమాధ్యవస్థకు పోవును. ఆయోగిమిత్రులు యోగి చెప్పినట్లు చేయుదురు. ఈ యోగి అయిదవ భూమికయం దుండువాడు ఆఱవ భూమికయం దుండు సమాధినుండి మేల్కొల్పవలయునన్న ఇంకొక యోగి ప్రయత్నముతో మాత్రమే మేల్కొల్పవలెను. ఇట్లుండగా తాము (అచలవాదులు) ఏడవ భూమిక యందుండువార' మని యెట్లు చెప్పుదురో వింతగా నున్నది సప్త జ్ఞానభూమికలను, తురీయ, తురీయాతీతములను గుఱించి వివరించిన ఉపనిషత్తులయందు జీవన్ముక్తులకును, విదేహముక్తులను భేదమును చెప్పలేదు. భేదమును చెప్పినట్లు తోచినను సూక్ష్మముగ విచారించిన భేదము కనబడదు. ఇందులకు ప్రమాణము:-

". . . . . తురీయే కేవల పరమాత్మ సంబంధినీ భవతి, నిత్యబోధ స్వరూపా భవతి, తదా శనైః శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా ఆత్మ

సంస్థం మనః కృత్వా న కించిదపి చింతయే త్తదా ప్రాణాపానయోరైక్యం కృత్వా సర్వం విశ్వ మాత్మా స్వరూపేణ లక్ష్యం ధారయతి తదా తురీయాతీతావస్థా తదా సర్వేషా మానంద స్వరూపో భవతి"

(ధ్యానబిందూపనిషత్తు4)

"నిర్బీజా వాసనా యత్ర తత్తుర్యం సిద్ధిదం స్మృతమ్, ..... నిర్దగ్ధ వాసనా బీజ సత్తా సామాన్యరూపవాన్, స దేహో వా విదేహో వా న భూయో దుఃఖభాగ్భవేత్" (ధ్యాన బిందు)

"కేవలం తుర్యరూపో உస్మి తుర్యాతీతో உస్మి కేవలః|
సదా చైతన్య రూపో உస్మి చిదానంద మయో உస్మ్యహమ్"||

(తేజో. 3-4)

"తుర్య తుర్యః పరానందో వైదేహీ ముక్త ఏవ సః"|| (తేజో. 4-48)
"జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం చిత్తం చిత్త త్వమేవ హి|
తదేవ తుర్యావస్థాయాం తుర్యాతీతం భవత్యతః"|| (అన్నపూర్ణ)
"షష్ఠీం తుర్యాభి మన్యాం క్రమా త్పతతి భూమికామ్|
యత్రనాస న సద్రూపో నాహ నాన్య న హంకృతిః||

కేవలం క్షీణమనస ఆస్తే ద్వైతేతి నిర్భయః|
నిర్గ్రంధి శాంత సందేహో జీవన్ముక్తో విభావనః"|| (అక్ష్యుపనిషత్)

ఎందు (తురీయమునందు) సదసద్భేదముగాని అహంకృతిగాని ద్వైతముగాని, భయముగాని లేదో గ్రంథి నశించి శాంతియు, సంశయ నివృత్తియు, క్షీణమనస్సును ఎందుగలదో అదియే జీవన్ముక్తుని స్థితియని శ్రుతులు చెప్పి యుండగా ఇంతకుపైన చెప్పవలసిన దేమున్నది.

"పరం ప్రయత్నేన చిరం ప్రయత్నే నావబోధనమ్"||
"పదార్థ భావనా నామ షష్ఠీ భవతి భూమికా|
షడ్భూమికా చిరాభ్యాసా ద్భేద స్యానుపలంభనాత్||
య త్స్వభావైక నిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః|| (వరాహ)

1, 2, 3 భూమికలయం దుండువారిని ముముక్షువు లనియు, 4, 5, 6, 7 భూమికలయం దుండువారిని క్రమముగా బ్రహ్మవిత్, బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయాన్, బ్రహ్మవిద్వరిష్ఠ లని వరాహోపనిషత్తు పేర్లు పెట్టినది.

ఏడవ భూమికయందుండు యోగి బ్రతికియుండుట దుర్లభము. ప్రారబ్ధవశమున కొంతకాలము జీవించియుండినను అతని వృత్త మెట్లుండును? "ఆకాశమునందు సంచరించు పక్షుల కాలిజాడలనైన నెఱుగనగు గాని మహాత్ముల వృత్త మెట్లుండును? "మహాత్ముల వృత్త మిట్టిదని మన మెఱుంగజాలము" అని శ్రీ శంకరులు ఎవరినిగుఱించి చెప్పిరో అట్టివారే వీరు. పైనున్న వస్త్రము క్రిందపడినను అత డెరుగడు. గోచికూడ ఉండదు. ఎవరైన బలవంతముగ గోచిని పెట్టిన అది ఉండినంతకాలము ఉండును. అది యూడి క్రిందపడిన దానినెత్తి ఆ మహాత్ముడు ధరింపడు. శాస్త్రకారు లాఋ - ఏడు భూమికలను వేఋ వేఋని చెప్పిరేగాని ఆ భూమికలయం దుండువారి వృత్తము సమానమే. శ్రీవిద్యయందు ప్రవేశము కలిగినవారును మంత్రశాస్త్రమునందు పాదుకాంత దీక్ష గైకొన్నవారును నగు, శ్రీ విద్యానందనాథ దీక్షానాములగు శ్రీ కనుపర్తి వేంకటరామయ్యగారు తాము రచియించిన కైవల్యనవనీతమను గ్రంథమున ఈయంశమును గుఱించి ఇట్లు వ్రాసిరి:-

"వీని కన్నింటిపైన వెలుగుచుండెడి తుర్యమను పేరుగల ఏడవ భూమిని తుర్యాతీతమని వేదములు వచియించుననని తాత్పర్యము".

"ఏడవ భూమిని తుర్యమని తుర్యాతీతమని చెప్పునచో గ్రహించువారికి భ్రమ దోచునని దానిని తుర్యమందు జీవన్ముక్తియని, తుర్యాతీతమునందు విదేహముక్తియని మోక్షమును రెండు విధములగు సంజ్ఞలచేత చెప్పుదురు. కార్యమందు ఒక్కటే యగును". (2-156-157 పద్యముల తాత్పర్యము)

పైన చెప్పినవారు తురీయ తురీయాతీతములను గుఱించి చక్కగా అవగాహనము చేసికొని వ్రాసిరి.

ఋభుగీతయందు (4-72 శ్లోకమున) మోక్షము తురీయమువలననే కలుగునని స్పష్టపరుపబడెను.

శాక్తేయమునందు లలితాభావము చాలముఖ్యమైనది. అందు లలితా సహస్రనామములలో 384వ నామము - "విశ్వసాక్షిణీ" అనియు, 385వ నామము "సాక్షి వర్జితా" అనియు చెప్పబడినది. సాక్షివర్జితనే తురీయాతీతమని చెప్పిరి.

262 వ నామము "తుర్యా" అని, తురీయమును కూడ దేవియే యని యున్నది. ఇన్ని ప్రమాణములవలన తురీయ - తురీయాతీతములు ఒక్కటే, బోధ సౌలభ్యము కొఱకు వేఱువేఱుగా చెప్పబడెనేగాని భిన్నము కాదు. అంతే కాదు.

"తురీయరూపాం తురీయాతీతాం సర్వోత్కటాం సర్వ మాత్రాసనగతాం"
అని (సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్తు)

"గుహాత్రీణి నిహితా నేగయంతి తురీయం వాచో మనుష్యా వదంతి".
అని కలదు. (సరస్వతీరహస్యోపనిషత్తు)

వరాహోపనిషత్తు జీవన్ముక్తుని లక్షణములను విస్తరించి చెప్పినది. అందు శుకమార్గము విహంగమార్గ మని, వామదేవునిమార్గము పిపీలికమార్గ మని పేర్కొన్నది. మఱియు:-

..... "శ్రుత్వా పూర్వాం కామాఖ్యాం తురీయరూపాం తురీయాతీతాం సర్వోత్కటాం సర్వమంత్రాసన గతాం" అని (త్రిపురతాపిన్యుపనిషత్తు) చెప్పినది.

"లక్ష్యాలక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠేత్ కేవలాత్మనా।
శివ ఏవ స్వయం సాక్షా దయం బ్రహ్మవిదుత్తమః॥
జీవన్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః।
ఉపాధినాశా ద్బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్॥
శైలూషో వేషసద్భావాద్ భావయోశ్చ యథా పుమాన్।
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠ సదా బ్రహ్మైవ నాపరః॥

ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్వయం॥ (ఆత్మోపనిషత్తు)

ఘటము నష్టము కాగానే ఘటాకాశము, మహాకాశము ఒక్కటియే యైనట్లు బ్రహ్మవిదుడే బ్రహ్మ మగుచున్నాడు - అని శ్రుతి.

తాత్పర్యము :- అన్నపూర్ణోపనిషత్తునందు తురీయ - తురీయాతీతములు రెండును ఒక్కటియే యని చెప్పిన ఈ క్రింది శ్రుతి వాక్యమును గమనింపుము.

"క్షయాతిశయ నిర్ముక్తం నోదేతి న చ శ్యామతి।
జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం చిత్తత్త్వ మేవ హి।
తదేవ తుర్యావస్థాయాం తుర్యాతీతం భవత్యతః"॥

జీవన్ముక్తినే అస్పర్శయోగమని వరాహోపనిషత్తు (2-56) చెప్పినది. - అచలవాదులు తమకు దేహము లేదందురు. ఇందులకు వారి వాక్యము నుదాహరింతును-

"నేను నీకొరకునై మేను దాల్చుకొని
పూనివచ్చిన వాడ పరము దెల్పుటకు
మేనుతో నున్నట్లు మరితోచువాడు
మేను నాకెపుడు లేదన్నా - నీ వుండువరకే -
మేను నాకుండునో యన్నా - „ - (బాలరామ్ గారి ద్విపదార్థములు)

## (7) శ్రీ దీక్షితులు - వారి గ్రంథరచన

దీక్షితులవారు "బ్రహ్మద్వాసిష్ఠ సిద్ధాంతమును వారు చెప్పుచుండగా వారి శిష్యులు వ్రాసిపెట్టిరని అందురు. వారే స్వయముగా వ్రాసినట్లు వారి వాక్యముల నుదాహరింతును-

"బుద్ధియని, చిత్తమని, అహంకారమని, వేదాలుయని, శాస్త్రాలుయని, పురాణాలుయని, శృతులుయని, వుపనిషత్తులుయని, లక్ష్యాలుయని, మంత్రాలుయని, ఎన్నియనివ్రాతు, .... .... వ్రాయ శఖ్యంకాదు" .... "యెన్ని అని వ్రాతు జన్మభ్రాంతిలేకుండ చేసిన వాడు గురువు" అనియును వ్రాసిరి.
(బృ. ఉ. పు. 6. అ. 7)

ఎట్లైనను కర్తృత్వము వారిదే ; అందులో భేదము లేదు. వీరి గ్రంథమును చదివిన - వీరు వీరి గురువువలన విన్నది. తమ బుద్ధికి తోచినది వ్రాసిరేగాని, వీరుదాహరించిన శాస్త్రములు స్వయముగా చదివి యుండలేదని, వీరు వీరి గ్రంథమున ఉదాహరించిన శాస్త్రములయందలి కొన్ని వాక్యములకు ముందును, వాని వెనుకను (ఆ శాస్త్రముల యందు) ఏమున్నదో వీరికి తెలియకయే ఉదాహరించిరని- వీరి రచనవలన అనుమానింపవలసి వచ్చును. వారొకచోట

నిట్లు వ్రాసిరి "నేను చిన్నతనములోనే వేదములు చదివిన్నాను. శాస్త్రములను చదివినాను, ముద్రల చూచినాను. యోగములు సాధించినాను. మంత్రములు తెలిసికొన్నాను. యెన్ని తెలిసికొన్ననేమి? అన్ని అడవిమార్గములుగానే యున్నవి". (బృ. పూ. ప్ర. 6) కాని వారి గ్రంథమును చదివినవారికి వారి వాక్యములు సత్యములు కావని బోధపడును. వీరు పండితులంటే యిష్ట పడరు. 'చదువుకొన్న పాపాత్ములకంటె వూరకే వున్న రాళ్ల నయం" (బృ. ఉ. ప్ర. 6. అ. 3). అని వ్రాసిరి.

దీక్షితులవారి కొన్ని వాక్యములకు అర్థమే ఉండదు. మతాచార్యులతో నెవరు ఏకాలమువా రైనది వారికి తెలియదు. ఇందుకు వారి వాక్యమొకటి యుదాహరింతును. "అద్వైతమంటే విశిష్టాద్వైతమే, మూలంలేని యీ శరీరమే లేదు. గనుక వ్యవహారమేలేదు. శ్రీ భాష్యకారులమాట అబద్ధమో, నిబద్ధో, అని శంకచార్యులవారు వాదించినారు". (బృ. ఉ ప్ర. 6. అధ్యా. 11). శ్రీ శంకర భగవత్పాదులవారి జన్మమునకు తరువాత సుమారు రెండువందల సంవత్సరములకు శ్రీ భాష్యకారులు (శ్రీ మద్రామానుజాచార్యులు) జన్మించినారు. ఇట్టి వాక్యములను ఎట్లు విమర్శింపవలెను?

వీరికి ఒక స్థిరమైన మార్గము లేదు. "ఈ మార్గము లక్ష్యములేని మార్గము". (బృ. ఉ. ప్ర. 6. అ. 10). అని దీక్షితులవారే అన్నారు. వీరి గ్రంథముయొక్క పూర్వభాగమునందలి మూడు నాలుగు ప్రకరణములయందు కుల దూషణ చేసిరి. నాలుగవ ప్రకరణమునకు "వర్ణ నిరసన ప్రకరణము" అని పేరిడిరి. వర్ణవ్యవస్థ లేనట్లే వ్రాసిరి. వర్ణవ్యవస్థను నిరసించిరి. "కులములను యెవ్వరు చూచినారు? గోత్రమును యెవ్వరు చూచినారు? కులగోత్రములను అహంకారమే యేర్పరచినది". (బృ. పూ. 4 వ.ప్ర) ఇది బాగున్నది. ఈవిధముగా వ్రాసినందులకు చాల సంతోషము. ఇది వారి శిష్యులచేత ఆచరణయందు పెట్టించి సంఘమును సంస్కరింప వలయునుగదా?

ఆగ్రాలోని రాధాస్వామి సమాజమువారి గురువుగారు వారి శిష్యులయందు కులభేదమును పాటించక వివాహము చేసికొనవచ్చు నని అనుజ్ఞ నిచ్చియున్నారు. ఆ విధముగా దీక్షితులవారును చేసియుండిన వారికి నా ధన్యవాదముల

నర్పించి యుందును. పూర్వ భాగముయొక్క ఆఱవ ప్రకరణమునందు "అందఱిది ఒక కులమేనని అన్నాను" అని వ్రాసిరి. సంఘమునకు భయపడిరేమో గాని అచ్చటనే "మేము కుల నిరసన ద్వేషము కలవారమై చేయలేదు" అని వ్రాసిరి. అంతటితో తృప్తి చెందక "కుల త్యాగము ఆచార త్యాగము చేయరాదు. కులదూషణ చేయరాదు. కులగురువుల నిందింపరాదు". (బృ. పూ. ప్ర. 2) అని వ్రాసిరి.

బృహద్వాశిష్ఠ సిద్ధాంత గ్రంథమును, యోగ వాసిష్ఠమును పరిశీలించినవారికి బృహద్వాశిష్ఠ సిద్ధాంతము నందు నూటికి నలుబది శాతము యోగ వాసిష్ఠమున చెప్పినదే వ్రాసిరి. దానినైనను దీక్షితులవారు కొన్నిచోట్ల చక్కగా అర్థము చేసికొనియుండక దానిలోని తత్త్వమును సంగ్రహముగా వారి గురుముఖమున నలువది శాతము వినియుందురనియు,తక్కిన అఱువది శాతము, బౌద్ధచార్వాకాది మతములతో తమ అభిప్రాయమును కలిపి అదియొక కలగూరగంపగా చేసిరనియు చెప్పవచ్చును.

దీక్షితులవారు తమ గ్రంథమునకు "శ్రీ బృహద్వాశిష్ఠ సిద్ధాంతమను శివరామ దీక్షితీయము" అని పేరేల పెట్టిరి? గ్రంథమునకు వసిష్ఠ మహర్షి పేరిడుటకు కారణమేమి? శివరామ దీక్షితీయమన్న సరిపోవును కదా? దీక్షితులవారు వారి గురుముఖమున విన్నది యోగవాసిష్ఠకారులు చెప్పినదే యని వారికి తెలిసి యుండవచ్చును. దానిని త్రోసివేసికొనలేక తమకిష్టము లేకపోయినను వారట్టి నామకరణము చేసి యుండవచ్చును. అదియే నిజమైనచో అది చాల గొప్ప భావము కదా? కృతజ్ఞత తెలుపుకొనుట కృతజ్ఞుని గుణముకదా? అనుకొనిన, అట్లర్థము చేసికొనుటకును వీలులేదు.

వారొకచోట ఇట్లు వ్రాసిరి - "శ్రీ కృష్ణస్వామికి తగ్గ గురువు సాందీపునిగాని మరివొకరు లేరు. సాందీపులకు వసిష్ఠులకు చాలయెక్కువ తక్కువ ఉన్నది". (బృ. ఉ. ప్ర. 6. అ. 12). దీనినిబట్టి యోగవాసిష్ఠమున కంటె తమ గ్రంథము గొప్పదని యోగవాసిష్ఠమును కించపరచుటకు "యోగవాసిష్ఠము" అను పేరునందు 'యోగ' శబ్దమును తొలగించి దానికి బదులు బృహత్ = గొప్పది అని అర్థముతో బృహత్ శబ్దమును చేర్చి, బృహద్వాశిష్ఠ సిద్ధాంతమని పేరిడిరని భావించినచో

సరిపోవును. దీనినిబట్టి దీక్షితులవారి అభిప్రాయము, తెలియబడెను. వసిష్ఠమహర్షితో సరిచూచుటకు సాందీపని యేగ్రంథమును వ్రాసిరి? వారి యోగ్యత వీరి కెట్లు తెలియును? శ్రీ కృష్ణభగవానుడు బలరామసహితుడై సాందీపనియొద్ద అఱువదినాలుగు దినములలో అఱువదినాలుగు కళలను (విద్యలను) నేర్చుకొని వచ్చిరని భాగవతమునందు కలదే గాని బ్రహ్మవిద్యను తెలిసికొన్నట్లు భాగవత పురాణమున వ్రాయలేదు. భగవానుడు రుక్మిణీదేవిని వివాహమాడిన తరువాత సాందీపనివద్దకు పోయి అచలబోధ యెరిగిరనుటకు తగిన ప్రమాణమేది? ఏదైన పుక్కిటి పురాణము నాధారముగ గైకొని వ్రాసిన వ్రాతలకు గౌరవ మీయరాదు.

వీరి రచనయందు దోషములు లెక్కింపరానివి. వీరి వ్యక్తిత్వమును కొంత విచారింతము. వీరొకచోట "అందుకే తామసము గలుగుచున్నది". (బ్ర. పూ. ప్ర. 10). అని అన్నారు. 'తామస' మనగా కోపమని వారి భావమై యుండవచ్చును. కాని ఆ అర్థము ఏ నిఘంటువులో కలదో నాకు తెలియదు. తామసమనగా = తమోగుణము కలది. పాము, ఆలస్యము, అస్త్రములలో ఒక్కటి అని అర్థమేగాని కోపమని నిఘంటువులో లేదు. కోపము వచ్చుననుటకు మారు తామస మొస్తుంది అని అనాగరికులు విద్యలేని వారందురు. విద్యాధికు లనరు. దీక్షితులవారు తాము శరీరము లేని వారమని చెప్పుకొనిరే! శరీరము లేనివారికి కోపము వచ్చునా? మరియు వారిట్లు చెప్పిరి. "సన్మార్గులకు సన్మార్గులవలెనే యుండవలయును, దుర్మార్గులకు దుర్మార్గులవలనే యుండవలయును. కాని మేము సన్మార్గముగా ప్రవర్తించుటకు అనుకూలముగా యుండరాదు". (బ్ర. పూ. ప్ర. 3)

దేహి దేహము ఒకటేనని చేసిన భౌతిక వాదమును ఇదివరలో (7వ అధ్యాయము నుండి 12 వరకు) వివరించియుంటిని. గోడమీద నడచుచు కుడి యెడమ ప్రక్కలను చూచు పిల్లి యేప్రక్కకు దుముకునోయని చూచువారిని సందిగ్ధ స్థితిలో నుంచునట్లు దీక్షితులవారును అచల వాదులలో అతివాద మితవాద పక్షములవారి నిరువురను కొంతవరకు (ముస్లింలను కూడ) సంతృప్తి పరచునట్లు వ్రాసిన వ్రాతలు సామాన్య పాఠకులను సందిగ్ధ స్థితిలో నుంచినవి.

అదియొక విధమయిన నేర్పరితనము. ప్రశంసింపదగినదే. కాని యీ సందర్భమునం దట్టి వ్రాతలవలన ముముక్షువులకు కీడు కలుగును

దీక్షితులవారు వ్రాయకూడని స్థితి యట్టి అమంగళకర మగునట్టి కొన్ని వాక్యములను వ్రాసిరి. వాటి నన్నిటిని చెప్పవలయునన్న చాల పెద్ద గ్రంథమగును.

పోకల శేషాచలం నాయుడుగారు వ్రాసిన అచల గ్రంథమున, దీక్షితులవారు వారి శిష్యుడగు కంచలూరు అప్పారావు గారికి అచల మతమును గుఱించి చెప్పిన వాక్యములను ఇదివఱకే (ఈ ప్రకరణము నందలి 39వ అధ్యాయము) ఉదాహరించి యుంటిని. అందుండి కొన్ని వాక్యములను మఱల చెప్పెదను వినుము:-

**"యెూరి యప్పయ్యా .... నేను నీకు బోధించిన అచలబోధ త్రిలోకంబులకును, త్రిలోక వాసులకును, వేదంబులకును, ఉపనిషత్తులకును, శాస్త్రంబులకును మిగుల విరుద్ధముగా నుండును".**

పై పంక్తులు సువర్ణాక్షరములతో లిఖింపదగినవి. దీక్షితులవారు సత్యమును చెప్పిరి. ఈ సత్యమును దాచకూడదని పోకల శేషాచలం నాయుడుగారు లోకమునెదుట పెట్టిరి. బృహద్వాశిష్ఠ సిద్ధాంతమును అచ్చువేయించినవారు కొందఱు పై వాక్యములను వదలి అచ్చువేయించి యుందురు. లేదేని అచలవాదులలో ప్రముఖస్థాన మాక్రమించి విఖ్యాతి గాంచిన శేషాచలం నాయుడుగారు వారికి అగౌరవమగు అనృతము సృష్టింపరు:-

భారతీయ తత్త్వశాఖలగు అద్వైత విశిష్టాద్వైతాది శాఖలయందు అద్వైతము ననుసరించి ఆత్మబ్రహ్మల ఐక్యమును సాధించినవారికి సద్యోముక్తియు, తక్కినవారికి క్రమముక్తియు కలుగును. ఇచట ముక్తి యనునది అజ్ఞానము లేకపోవుట. స్వరూపస్థితి యని తెలియవలయును. దీక్షితులవారి అచలబోధను అవలంబించిన ముముక్షువులకు ఏ ముక్తియు కలుగదు. ముక్తి యనునది నిత్య సత్యమగు దానికే గాని 'లేని' దానిని ముక్తి యనునదికూడ లేనిదే

కదా? కనుక వారికి కడపట కలుగు స్థితిని "పునరపి జననం పునరపి మరణం" అనగా సంసారమే గతి.-

ఇంకను దీక్షితులవారి అచలబోధ గుఱించి నీవు ఇంకేమైన అడుగవలసినది కలదేని అడుగుము-

జిజ్ఞాసువు:- అచలబోధను గుఱించి వింటిని చాలును, నాజన్మ తరించుటకు తత్త్వజ్ఞాన వాసనాక్షయ మనోనాశములు కలుగునట్టి సాధనను ఇదివఱకే విపులముగ బోధించి యుంటిరి (ఈ గ్రంథమునందలి రెండవ భాగము జ్ఞానయోగ ప్రకరణమున) బోధను దృఢపరచుటకు మరికొన్ని వాక్యములు ఆనతిండు.

శ్లో|| అపారకారుణ్యా సుధాతరంగై
రపాంగ పాతై రవలోకయంతమ్|
కఠోర సంసార నిదాఘతప్తాన్
మునీ మహం నౌమి గురుం గురూణామ్"||

ఇది పరమేశ్వరానుగ్రహమువలన మఱ్ఱిబోయిన రామ
సుబ్బయ్యచే రచియింపబడిన "బ్రహ్మజిజ్ఞాస"
చతుర్థభాగమందలి "అచలబోధ" అను
రెండవ ప్రకరణము సంపూర్ణము.
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# బ్రహ్మ జిజ్ఞాస

## చతుర్థభాగము

### మూడవ ప్రకరణము : ముగింపు (ఉపసంహారము)

శ్లో|| అవినయ మపనయ విష్ణో
దమయ మనశ్శమయ విషయ మృగతృష్ణామ్|
భూతదయాం విస్తారయ
తారయ సంసార సాగరతః|| "*

### (౧) ఆరంభము

జిజ్ఞాసువు :- స్వామీ! నే నిదివరకు మోక్షోపాయములను (అనగా - అచలమును పొందునట్టి మార్గములను) మీవలన (ద్వితీయభాగమున) వినియుంటిని. చాలవరకు ఆ వాక్యములు జ్ఞప్తియందున్నవి. అంతకన్నను సులభోపాయమున్న బోధింపుడు.

వేదాంతి :- సులభమార్గమనిన, ఎవరికి సులభము? ఒక వ్యక్తియొక్క పూర్వజన్మ సంబంధమగు శుద్ధ వాసనలు ప్రస్తుత జన్మయందుండు దేశకాలాదులు, ఆవ్యక్తి (ముముక్షువు) పుట్టి పెరిగిన వాతావరణము - ఇటువంటి మతికొన్ని పరిస్థితుల పైనను, ముముక్షువుయొక్క పట్టుదల, బుద్ధి కుశలతల పైనను ఆధారపడి ఒక మార్గము సులభమగును. వేరొక వ్యక్తికి ఆ మార్గము కష్టతరమగును. శ్రీ శంకరాచార్యులవారి శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రమును చదువుము. అందులో "కరావలంబమ్" అనునపుడు ఆ హృదయావేదన నూహించుకొనుము.

---

* శ్రీహరీ! నా యవినయమును పోగొట్టి, నామనస్సును నియమించి, శబ్దాది విషయముల యందు నాకు విరక్తి కలుగునట్లు చేసి, భూతదయ పెంపొందించి, సంసార సముద్రమునుండి నన్నుద్ధరింపుము.

అది చిన్న గ్రంథమైనను ముముక్షువు యొక్క హృదయావేగము దానియం దున్నట్లు ఏ గ్రంథమునందును లేదు. అట్టి ముముక్షువునకు మార్గము సులభము. గమ్యస్థానము సమీపమునందే యుండును.

జిజ్ఞాసువు:- స్వామి! కొందఱు "సులభ మార్గమనియు", "సహజ మార్గ" మనియు చెప్పుచున్నారు. సాధనయందు అవి ఎంతమాత్రము సులభమో అనతిండు.

వేదాంతి:- వానిని గుఱించి నేను విన్నాను. స్థాలీపులాకన్యాయమున వానిని గురించి తెలిపెదను.

## (అ) సులభ మార్గము

కొందఱు ముముక్షువులు ఇట్లందురు:- నేను అనగా మనస్సే - మనస్సే సంకల్ప వికల్పములు. మనస్సును జయించిన చాలును. నీకు ఏ శాస్త్రములతోను నిమిత్తము లేదు. ద్వైతాద్వైత విశిష్టాద్వైత మత చర్చలతో పనిలేదు. నీవు ఇవన్నియు వదలి యేకాంతమున సుఖాసనమున కూర్చుండి అవయవము లన్నియు తేలికయగు నటుల సడలించి నీయందుండి వెలువడు, ప్రతిసంకల్పమును తిరిగి నీ యందే అణగులాగున చేయుము. ఈ విధానముగా కొంతకాల మభ్యసించిన మనస్సు నిరోధింపబడును. (సంకల్పము లుడుగును) అదియే సమాధి, అదియే అమనస్కము. ఈశ్వర సాక్షాత్కార మదియే. "నేను లేకపోయితిని, ఉన్నది పరమాత్మయే' అను భావమదియే. ఇది ఒక మతము కాదు. ఇది యొక సాధన పద్ధతి. ఇది యొక యోగ పద్ధతి.

జిజ్ఞాసువు :- మీరు నాకు జ్ఞానయోగమును ఇదివఱలో (రెండవ భాగమునందలి మొదటి ప్రకరణము నందు) బోధించిన సందర్భమున ఈ యంశమును చెప్పియుంటిరి. అచట సమాధి విఘ్నములగు లయ, విక్షేప, కషాయ, సమప్రాప్తులను తొలగించుటకు నిరోధసంస్కారమును వృద్ధి పొందింపవలయు నని బోధించితిరి. అంతకన్న నిందులో విశేష మేమున్నది?

వేదాంతి :- అవును, అప్పుడు విపులముగా చెప్పియుంటిని. మనోనిరోధమునకు ఇదియును ఒక సాధనమే. దీనికి ప్రాణాయామాదులతో పనిలేదు. దీనిని "సులభ మార్గ" మని యందురు. కాని ఇది వా రనుకొనినంత సులభమార్గము కాదు. ఏలయన? మనస్సునందు అనేక కోట్ల జన్మల

(మనోవాక్కాయములతో చేసిన కర్మలయొక్క) సంస్కారములు వాసనా రూపమున నుండును. అవి బీజసహితముగా దగ్ధము కావలయునన్న జ్ఞానాగ్ని చేతనే దగ్ధము కావలయునుకాని వేఱొక యుపాయము లేదు. అట్లు చేయకపోయిన మఱల జన్మమున్నది. జన్మరాహిత్యమును కోరినవారు తత్త్వజ్ఞాన, వాసనాక్షయ, మనోనాశములు ఏకకాలమున సాధింపవలసియున్నది.

**మం॥వాసనాక్షయ విజ్ఞాన మనోనాశ మహామతే|**
**సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదా మతాః॥(అన్నపూర్ణ - ముక్తిక)**

తా॥ వాసనాక్షయ, తత్త్వజ్ఞాన, మనోనాశములు ఏకకాలమునందే యభ్యసింపవలయును, కాలభేదము చేత నొకటి యొకప్పుడు, మఱియొకటి యింకొకప్పుడు సాధించుటకు సాధ్యపడదు.

ఈ యంశము నిదివఱలో* చెప్పియుంటిని. దానిని జప్తికి తెచ్చుకొనుము. ఈ యంశమును గుఱించి శ్రీ వివేకానందస్వాములవారి వాక్యము లివి:-

"కాని యెవ్వ రేమన్నను భగవదన్వేషణ జీవనమునకు వైరాగ్య మొక్కటియే మార్గము". అని (జ్ఞానయోగమునందు మాయ భ్రాంతి యను ఉపన్యాసమున) అనిరి. మఱియొకచోట శ్రీ స్వాములవారు ఇట్లు చెప్పిరి:-

"వేదకాలమున నీతి వైరాగ్య ధర్మము లెంత ఔన్నత్యము నంది యుండెనో కాని, భోగాసక్తిని జయించిన వానియందు తప్ప సత్యము దీపింపజాలదని సిద్ధాంతీకరించినది" (అపరోక్షానుభూతి యను నుపన్యాసము).

భగవద్గీత యొక్క ఆఱవ అధ్యాయమునకు గీతాచార్యులు "ఆత్మసంయమన యోగ" మని పేరిడిరి. "ఆత్మ" శబ్దమునకు. (1) ఆత్మ లేక పరబ్రహ్మమనియు. (2) 'తాను' అనియు, (3) అంతఃకరణము లేక మనస్సు అనియు, మూడర్థములు కలవు. గీతయందలి ఆత్మసంయమన యోగమనగా:- అచట ఆత్మ యనునది మనస్సని యెఱుగ వలయును. మనస్సంయమన మన మనస్సును నిగ్రహించుట, జయించుట. ఆ యధ్యాయమునందు

* ఈ గ్రంథముయొక్క రెండవ భాగమున జ్ఞానయోగమను మొదటి ప్రకరణమున విస్తరించి చెప్పియున్నాను, చిత్తగింపుడు.

మనోనిగ్రహమును గుఱించి భగవానుడు అర్జునున కుపదేశించెను. అద్వైత సిద్ధాంతము ననుసరించి కేవలము మనస్సును నిరోధించినంత మాత్రమున ముక్తి కలుగదు. చెప్పినంత సులభముగ సంకల్పము లుడుగవు. (శమింపవు) ఏలయన:- గీత యొక్క పై యధ్యాయమునందలి 2వ శ్లోకమున "అసంన్యస్త సంకల్పః"- విడువబడని ఫలాపేక్షతో గూడిన కర్మలు గలవాడు అని యర్థము. అనగా:- పూర్ణ వైరాగ్యము కలవానికేగాని వైరాగ్యము లేనివానికి మనోజయము దుర్లభము. మనస్సు విషయముల వైపునకు పోవును. (విక్షేపము కలుగును). వైరాగ్యవంతుడే భయరహితుడు. వైరాగ్యము లేనివానికి భయము కలుగును. పిరికివానికి మనస్సు నిలువదు. కనుక వైరాగ్యము మనోనిగ్రహమునకు ముఖ్యమగు సాధనము. వైరాగ్యముండిన వానికే బ్రహ్మజిజ్ఞాస కలుగును., అట్టి జిజ్ఞాస కలవాడే వేదాంతశాస్త్రశ్రవణము చేయును. వేదాంతశాస్త్ర విచారము చేసినవానికే తానెవరు? ఈ జగత్తునకు కర్తయెవరు? జగత్తు ఎట్లు కలిగినది?' అను మొదలగు ప్రశ్నలకు సమాధానము లభించును అట్టి వారికే "ఇది అనాత్మ" యను వివేకము కలుగును. పిండ, బ్రహ్మాండముల గుఱించిన జ్ఞానము కలిగి బ్రహ్మాండమే సూక్ష్మరూపమున పిండముగా నున్నదనియు, పిండ బ్రహ్మాండములయం దున్న చైతన్యము ఏకమనియు నిరంతరము బ్రహ్మాభ్యాసము చేయవలయును.

శ్రుతులు చెప్పిన తత్త్వమస్యాది మహావాక్యముల అర్థమును ఎఱుగుట వలన ఆత్మైక్యబోధ సిద్ధించును. అనగా - తత్త్వజ్ఞానము కలుగును. మనోనాశ తత్త్వజ్ఞానములు అను ఈ రెండును ద్వంద్వములు. తత్త్వజ్ఞానము లేనిదే మనోనిగ్రహము (మనోనాశము) కలుగదు. మనోనాశము లేనిదే తత్త్వజ్ఞానము కలుగదు. ఇదియొక విషయ చక్రము. కనుక, రెండును ఒకేసారి సాధింపవలయును. అట్టిబోధ కలవాడే తిరిగి పుట్టడు. మోక్ష సౌధమును నిర్మించుటకు వైరాగ్యమను గట్టి పునాది ఆవశ్యకము. దృఢమైన పునాది లేక కట్టబడిన సౌధము అల్పకాలమునకే కూలిపోవునట్లు వైరాగ్యము లేక తాత్కాలికముగ మనస్సును జయించినను తిరిగి మనస్సు వారిని జయించి వారిని అధఃపతితులను చేసిన గాథలను రామాయణాది గ్రంథములయందు చదివి యున్నాము. రావణ, హిరణ్యకశిపాదులు మనస్సు నిగ్రహించి తప

మాచరించిరి. తపస్సు ఫలింపగనే మనస్సు వారిని జయించి అధఃపతితులను చేసెను. బోధ లేకయే వైరాగ్యము, మనోనిగ్రహము మాత్ర మున్నవారికి ముక్తి లభింపదు. అట్టివారికి వారి మరణానంతరము పుణ్యలోకములు మాత్రమే సిద్ధించును. ఈ యంశము ఇదివఱలో (జ్ఞానయోగ ప్రకరణము నందు) విపులముగా చెప్పియుంటిని. దాని నిచట జ్ఞప్తికి తెచ్చుకొనవలయును.

అద్వైతులు చెప్పినది అట్లుండ, మన అనుభవమును కూడ విచారింతము. మనోనిగ్రహమనగా: "మనస్సు సంపూర్ణముగ నశించుట కాదు. మనస్సు ఆత్మాకారమును పొందుట విషయముల వైపునకు మనస్సు పోకుండుట. అదియే మనోజయము, అదియే అమనస్కము".

ఆత్మయందు అనాత్మబుద్ధిగాని, అనాత్మయందు ఆత్మబుద్ధిగాని కలుగదు. అట్టివారికి మనోజయము సులభ మగును. "సులభమార్గము" అనగా - ప్రాణాయామాది అష్టాంగ యోగాభ్యాసములతో ఆయాసమును పొందక వివేకముతో కూడిన మనస్సు చేతనే విషయములపైకి పరుగిడుచుండు మనస్సును మెల్లమెల్లగా (ఏడ్చుచు మారాము చేయుచుండు బాలుని ముద్దుమాటలతో సంతోషింపజేయునట్లు) లక్ష్యమువైపునకు మఱలించు చుండవలయును. మఱల మనస్సు విషయముల వైపునకు పోయిన మఱల నదేవిధముగా చేయవలయునేగాని, కోపగింపక విసుగుకొనక ప్రశాంతతతో మనస్సును లాలింపవలయును. ఈ సందర్భమున నొక ఐతిహ్యము స్మృతికి వచ్చుచున్నది. దాని నిట వివరింతును:-

పంజాబునందు గోస్వాముల వంశమున జన్మించిన సుప్రసిద్ధ మహాపురుషుడు శ్రీ రామతీర్థస్వామి (వారి పూర్వాశ్రమ నామము తీర్థారామ గోస్వామి)వారు మనో నిగ్రహమును సాధన చేయుచుండగా మనస్సు నిలువనందున ఒకదినము ఇట్లు నిశ్చయించుకొనిరి. "ఈ దినము సూర్యాస్తమయ మగులోపల నాకు మనోనిగ్రహము కలుగదేని గంగానదిలో పడి మరణింతు" నని ప్రతిజ్ఞచేసిరి. గంగాతీరమున నొకచోట ఆసనము వేసికొని కూర్చుండిరి. కాని, యెంత ప్రయత్నము చేసినను ఆనాడు సూర్యాస్తమయ సమయమునకు ఏకాగ్రత కలుగలేదు. స్వామికి కోపము వచ్చి, శరవేగముతో ప్రవహించు

గంగా ప్రవాహమున దుమికిరి. గంగా గర్భమున నెచ్చటికో కొంతదూరము పోవునప్పటికి గంగామతల్లి శ్రీ స్వామివారిని అలలతో గట్టునకు విసరివేసెను. అప్పటికి స్వామికి తెలివిలేదు. అచట నున్నవారు స్వామి చనిపోయి యుండురని చూచి ప్రాణమున్నదని తగిన చర్యలు తీసికొని స్వామిని ఆశ్రమమునకు చేర్చిరి. తరువాత స్వామికి సులభముగనే మనోజయము కలిగి జ్ఞానియై అనేకులను సంసారమునుండి తరింపజేసిరి. (రామచరిత) మనోనిగ్రహము సాధ్యమా? అని సంశయించిన అర్జునుని వాక్యములను త్రోసివేయక భగవానుడు:-

శ్లో॥ అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥ (గీత. 6-35)

తా॥ ఓ అర్జునా! నీ వన్నది నిజమే. అభ్యాసము వలనను వైరాగ్యము వలనను మనోనిగ్రహము సాధింపవచ్చును.

పై శ్లోకమున భగవానుడు - వైరాగ్యేణ చ = వైరాగ్యము చేతను - అని వైరాగ్యమున కంతటి ప్రాముఖ్య మిచ్చిరి. కనుక మనస్సును జయించుట అంతసులభము కాదు.

## (3) సహజ మార్గము

జిజ్ఞాసువు :- ఇటీవల 'సహజ మార్గ' మను ఒక సమాజము ఏర్పడినదని, దాని గురువు శ్రీ రామచంద్రజీ మహారాజ్ గారని అనుచున్నారు. మోక్షమునకు వారు చెప్పు మార్గము దగ్గరేదని, అతిసులభ మైనదని అందురు. దానిని సంగ్రహముగా దయయుంచి తెలుపుడు.

వేదాంతి :- 'సహజ మార్గ' మను మాటకు వారు చెప్పు అర్థమేమో నాకు తెలియదు. 'సహజము' అనగా:- జన్మతో వచ్చినది అనియర్థము, మోక్షము జన్మతో వచ్చినదైన అది జన్మగలవారి కందఱికి సహజముగనే అందుబాటులో ఉండవలయును. లోకమున జన్మించిన ప్రతిప్రాణియు జన్మవిముక్తికై నిరంతరము కృషి చేయుచున్నదని పెద్దలనిరి. కాని దాని మార్గముమాత్రము ప్రాణులందఱకు తెలియదు. ఇంద్రియములు చూపిన మార్గము ననుసరించుట వాని ప్రవృత్తి. ప్రాణుల యందు ఉత్తమ జన్మ గలవారమగు

మానవులయందుకూడ ఏ కొందఱికో తప్ప తక్కినవారికి తాము ముక్తికొఱకు పాటుపడుచున్నామని తెలియదు. వారి దృష్టిలో 'ముక్తి' యనునది వారు చేసిన ఋణమును తీర్చుకొనుటయో, భద్రమైన సుందర మందిరమును నిర్మించుకొనుటయో, గొప్ప అధికారమును సంపాదించుటయో అనుకొని నిరంతరము దానిని పొందుటకు పాటుపడుచున్నారు. అదే అజ్ఞానము. ముక్తి యిట్టిదని తెలియక పోవుటయే గొప్ప తప్పిదము. కనుక అట్టివారి మార్గములు సహజమార్గములు కావు, పెడత్రోవలు, బుద్ధిమంతులకు మాత్రము జన్మరాహిత్యమే ముక్తియని తెలియును వారు దానికై పాటుపడుచున్నారు.

దురదృష్టవశమున అట్టి వారిలో కొందరు సరియైన మార్గమున పయనించుట లేదు. పుట్టుకతో అందఱికి ఒకే మార్గము కనబడిన అది సహజమార్గమే. భిన్న భిన్న మార్గములకు గమ్యస్థాన మొక్కటే కావచ్చును. కాని, భిన్న మార్గములయందు సహజమార్గ మేది? వాని వాని పూర్వ వాసనలు వాని నేమార్గమున కీడ్చునో అదియే వానికి సహజమార్గ మనుకొనును. ఏదో ఒక సంఘము, ఒక గురువు చెప్పినదే సహజమార్గమని చెప్పలేము కదా? ప్రస్తుతము ఆసంఘమునకు గురువు ఉత్తరప్రదేశ్ (U. P)లోని షాజహాన్‌పూర్ నివాసి రామచంద్రజీ మహారాజ్‌గారు. వారి బోధను "సహజ మార్గ" మనియు "రాజయోగ" మనియు అందురు. వారు బోధించు తత్త్వము సనాతనమైన దనియు, సూర్యవంశజుడగు దశరథమహారాజునకు 72 తరముల ముందు జీవించియుండిన యొకానొక మహర్షి దీనిని స్థాపించి అనుష్ఠించి కృతార్థుడయ్యె నందురు. కాని, దీని కాధారమేమో తెలియదు.

రామచంద్రజీ మహరాజ్‌గారు ఉత్తరప్రదేశ్ లోని ఫతేఘడ్‌కు చెందిన సమర్థగురు శ్రీ మహాత్మ రామచంద్రజీగారు. ప్రస్తుతము వీరు లేరు. ఈశ్వర సన్నిధానమును చేందిరి. వీరే తొలుత ఈ సహజమార్గ రాజయోగమును కనిపెట్టిన వారని, ఇప్పటి గురువుగారగు షాజహాన్‌పూర్ రామచంద్రజీగారు చెప్పియున్నారు. గురువుల యిరువురి నామములు ఒక్కటే, జన్మస్థానములు భిన్నములు. వీరిది ఒక మతము కాదు. భక్తి, ధ్యానములతో కూడిన, అదియొక అనుష్ఠాన (అనుభవ) పద్ధతి. వీ రిట్లు వ్రాసిరి:-

హిందూమతముయొక్క మూలోద్దేశము మాయము కాగా బాహ్య సంప్రదాయములు మాత్రమే మిగిలియున్నందున తత్ఫలితముగ మత విధానమునకు కాలదోషము పట్టి పోయినది. నేటి మతవిధానము పూర్వకాలమునకు చెందిన అవశేషమన్నను, మృతకళేబరమున మిగిలిన అస్థికలన్నను తప్పులేదు". (సత్యోదయము).

వారి అభిప్రాయములను సంగ్రహముగ చెప్పెదను. ముముక్షువు మతపరిమితులకు అతీతుడై యుండవలయును. మతమెచ్చట అంతమగునో ఆధ్యాత్మికత అచ్చట మొదలగును. ఆధ్యాత్మ తత్త్వ మెచ్చట అంతమగునో అచట సత్యానందోదయము కలుగును. అది గతించిన పిమ్మటనే గమ్యస్థానము చేరుదురు.

వారి సిద్ధాంతము ననుసరించి - వారి సమాజమున చేరిన ముముక్షువు శ్రుతిస్మృతి పురాణాదుల అధ్యయనమున నిలిపివేయవలయును. శాస్త్రమువలన నే మాత్రము ప్రయోజనము లేదు. అట్లే మంత్ర తంత్రాదికము నిరర్థకమే. గురువును మాత్రము శరణు పొందవలెను. అంతకంటె ముముక్షువు చేయవలసిన దేమియు ఉండదు. గురువునకు శరణాగతుడైన పిమ్మట శిష్యుడేమి చేయవలయునో గురువే చెప్పును. శిష్యుని భారమంతయు గురువే వహించును. శిష్యునకు గురువు ధ్యానపద్ధతి నేర్పును. గురువు ఒక గురుతును చూపి దానియందు లక్ష్య ముంచుమని చెప్పును. అప్పుడు గురువు శిష్యుని యందు శక్తి పాతము కలిగించును. గురువు నుండి శిష్యునకు శక్తి సంక్రమించును. అప్పుడు శిష్యుడు తన హృదయస్థానమున తేజో లేశ మున్నట్లు గమనించును. అది క్రమముగా వృద్ధి పొందును. సాధకుని సాధన వృద్ధి నొందుకొలది గురువు పురోగమనము తెలుపుచుండును.

గురువుగారు సహజాపూర్ణనం దుండి తన ఆత్మబలముతో ఎవనియందైనను యోగశక్తిని ప్రసరింపజేయ వచ్చునందురు. దీనిని ప్రాణాహుతి యందురు. ఇది అత్యున్నత స్థితికి చెందిన యోగ సిద్ధియట. గురువుగారు ఎచట నుండియైనను ఒక సమయమున (ఉదాహరణమునకు - ఉదయమున 8 గంటల కనుకొనుము) శక్తి ప్రసారమును చేయ నిమగ్నులగుదురో అదే

సమయమున దేశమునందు వివిధ ప్రదేశములయం దున్న వారి శిష్యులు వారి వారి ఇండ్లయందుగాని, కొందఱు కలసి నియమించుకొనిన ప్రదేశమునందు కాని, ఆసీనులై చిత్తమును ఏకాగ్రముచేసి యుండి రేని గురువుగారి శక్తి ప్రతిశిష్యునియందును ప్రవేశించి శిష్యుని ధ్యానశక్తిని అభివృద్ధి నొందించు నందురు.

వీరు గురువును గుఱించి యిట్లు వ్రాసిరి -

"పుస్తకములద్వారా గణించిన జ్ఞానముపై నాధారపడి చేయు యోగసాధనములు అపమార్గమును పట్టించునవే గాక మన అధ్యాత్మిక పురోగతికి అపకారకములు గూడ".

"అందుచేతనే అధ్యాత్మికాన్వేషణమున నిమగ్నులైన వారికి గురు సాహాయ్య మతిముఖ్యము. తప్పనిసరికూడ. అయినను మహనీయులు కొందఱు నేఱుగా దేవుని శరణార్థులై స్వప్రయత్నముతో పరిపూర్ణమును సాధించిన సందర్భములు కొన్ని యున్నవి.* కాని అట్టి దృష్టాంతములు అరుదు".

వీరు కొన్ని విషయములయందు వేదాంతులతో ఏకీభవింతురు. కాని, చాల విషయములయందు వ్యతిరేకింతురు. వారు చెప్పిన ఒక ముఖ్య విషయమువలన వారి సంప్రదాయతత్త్వ మెట్టిదైనది బోధపడదు. అందులకు దృష్టాంతముగ ఈ క్రింది విషయమును గమనింపవలెను.

శ్రీ రామచంద్రజీగారు కొన్ని గ్రంథములు రచియించిరి. అందులో Reality at Dawn అనుదానిని "సత్యోదయము" అను పేరున తెనిగించిరి. ఆ గ్రంథములో చిన్న చుక్క కేంద్రము (Centre) కలదు. దానిచుట్టును 23 వృత్తములు (23 వలయములు) గీయబడినవి. వాటిని మూడు వర్గములుగా విభజించి యిట్లు వ్రాసిరి.

"బయటినుండి లెక్కించిన మొదటి అయిదు వృత్తములు మాయయొక్క దశలు. మోక్షమని ప్రజలు, లేక శాస్త్రములు. ఊహించినట్టి స్థితి రెండవ

* ఫతేఘర్ శ్రీ రామచంద్రజీ గారు (ప్రస్తుత గురువుగారి గురువు). గురువు లేకయే యీ యోగము సాధించిరని చెప్పియున్నందున పై వాక్యములు చెప్పవలసి వచ్చెను.

మూడవ వృత్తముల మధ్యనున్నది. అత్యంత బాహ్యమున నుండి మనము పయన మారంభించి తదనంతరదశ సంప్రాప్తించుటకు ప్రతివృత్తము దాటుచు కేంద్రము వైపునకు పోవుదము". (పుట. 25).

మఱియు వారిట్లు వ్రాసిరి:- శ్రీ రామకృష్ణాది అవతార పురుషులు ఈ అయిదు వృత్తముల నుండియే జన్మించిరి. అయిదవ వృత్తమువఱకు పూర్వకాల మహర్షులలో కొందరు మాత్రమే పోగలిగిరి. వారిలో జనకమహారాజొకడు. అయిదు వృత్తములు దాటిన, పదకొండు వృత్తములు అహంకారపు వివిధ దశలను తెలియజేయును. 16 వృత్తముల వఱకు పురోగమించి యుండగలవారు శ్రీ కబీరు తప్ప ఇతరు లెవ్వరును లేరు. శ్రీ రామకృష్ణాది అవతార మూర్తులు అయిదవ వృత్తము దాటలేదని అర్థము. అవతార పురుషుల యోగ్యత ఇంతమాత్రమే అయియుండ మతాచార్యులగు శ్రీ శంకర, శ్రీ రామానుజాదులను గుఱించి చెప్పవలసిన దేమున్నది? మఱియు వా రిట్లు చెప్పిరి:-

"ప్రపంచములోని కొందరు మహర్షులు, యోగులందు చాల కొలదిమంది మాత్రమే దానిని (కేంద్రమును) గూర్చిన భావన నేమైనను కలిగియుండిరి. అనేక సందర్భములలో వారి పురోగతి యెంతైనప్పటికిని - రెండవ మూడవ వృత్తముల వఱకే. ఇంత ప్రాథమికదశయం దుండి కూడ వారు కొన్నియెడల తాము సాధించిన పురోగతి చాల గొప్పదని భావించుట దురదృష్టకరము".

(ఈ వాక్యములను శ్రీ శంకరాచార్యాది ఆచార్య పురుషులను గుఱించి చెప్పియుండవచ్చును. "కబీరుగారు తప్ప 16వ వృత్తము వరకు పురోగమించి యుండువారు కానరారు" అని వ్రాసిరి) (పుట. 26, 27)

వీరు అద్వైతులు కారు. పరమేశ్వరునితో జీవాత్మకు పూర్ణముగ ఐక్యము అభేదమునుండు స్థితి నంగీకరింపరు. అద్వైతులవలెనే వీరు సగుణ, నిర్గుణ బ్రహ్మముల అస్తిత్వము నంగీకరింతురు.

శ్రుతి స్మృతులను వీరు త్రోసివేసిరి. జ్ఞానమునకు తగిన గౌరవ మివ్వలేదు. బ్రహ్మాదులగు దేవతల మాటకూడ అంతే, వారందరు శ్రీ కబీరు కంటె తక్కువవారే. ఇందువలన ఈ సంప్రదాయము వైదిక సంప్రదాయము కాదని, భారతదేశ సరిహద్దుల అవలనుండి వచ్చిన తత్త్వముతో వేదాంత తత్త్వము జతచేర్చబడి యీ విధముగా రూపొందింపబడి యుండవచ్చునని నా

యభిప్రాయము. ఇందులకు ఆధారము రామచంద్రజీ గారు చెప్పిన వాక్యములను గమనింపుము:- "నా పూర్వులు త్రవ్విన బావి యని దాని యందలి ఉప్పునీటినే త్రాగుదునని, పవిత్ర పరిశుభ్రమగు జలమును విసర్జించిన వానివలె నా పూర్వులు చెప్పిన మార్గమున నడతును. ఈ క్రొత్త మార్గమున (మతమున) నడవ నందురు".

ఇందువలన వారి మార్గము పూర్ణముగ ఉపనిషత్తుల మార్గము కాదని వారే అంగీకరించిన ట్లయినది. వారి అనుభవ మెట్టిదో చెప్పజాలము.

విశ్వమునకు, పైన చెప్పిన 23 వృత్తముల మధ్య నున్న కేంద్రము (Centre) వలెనే మానవునియందు మనస్సు కేంద్రమై యున్నది. మనస్సుతోనే సర్వశక్తిమంతుడు సర్వజ్ఞుడు నగు భగవంతుని భక్తిప్రేమతో శరణు పొందవలయును. పవిత్రమైన మనస్సుతో కడుంగడు వినమ్రులమై, దాసులమై ప్రార్థింప వలయును. కేంద్రమును సమీపింపవచ్చును. కేంద్రముతో ఐక్యము కావచ్చును కాని సంపూర్ణముగా ఐక్యము కారు. "మనస్సు" యొక్క నానావిధములైన కార్యకలాపములను చక్కదిద్దుటే మన ప్రయత్నము. కాని మనస్సును పనిచేయని స్థితియం దుంచుట కాదు". (పుట. 40).

కొందఱు ఆ సమాజములో చేరిన కొలది కాలమునకే విముఖు లగుచున్నారు కొందరు భక్తితో దానియందే నిలిచి పురోగమించుచున్నారట. కొన్ని వాక్యములు వారి గ్రంథము నుండియు మరికొన్ని నా వ్యాఖ్యానముగాను ఈ విషయము క్లుప్తముగా చెప్పితిని.

వీరు, భగవంతుని శరణుబొందుట, భక్తిభావము, మనస్సును పరిశుభ్రపరచుట యను వాటియందు శ్రద్ధ వహింతురు. కనుక ఇది తప్పుత్రోవ యని అనలేము. వేచిచూడవలయును. కొంతకాలమునకుగాని దీని ఫలితము ప్రపంచమునకు తెలియదు. వీరు ఆగ్రా సమీపమున నున్న దయాల్బాగ్ సత్సంగమువారివలెనే కబీరుకు అగ్రస్థాన మిచ్చుటవలన ఇరువుర సంప్రదాయముల యందు సారూప్యము కలదని తోచును. ఇరువుర సంప్రదాయముల యందును విదేశీయ వివేకము మిళితమై యున్నది.

## (౪) హృదయ విద్య*

జిజ్ఞాసువు:- స్వామీ! మన శరీరమునందు హృదయ మెచ్చట నున్నది! హృదయమునందు పరమాత్మ డున్నాడని పెద్దలందురు. దానిని తెలిసికొనిన పరమాత్మను సులభముగ తెలిసికొనవచ్చునుగాదా? ఆ విషయము విపులముగ వివరించుదురని ప్రార్థన.

వేదాంతి:- హృదయమును గుఱించి తెలిసికొనుట కష్టమే; నీ వనుకొన్నంత సులభకార్యము కాదు. లోకులు వ్యావహారికముగ ఎద, ఎడద, గుండె, ఱొమ్ము, వక్షము అను భాగము రెండు భుజములకు మధ్యనుండు ప్రదేశము అని అనుకొందురు. ఇది శరీరమునందు కనబడుచుండును. ఆ ప్రదేశమునందే శరీరములోపల హృదయమను మాంసపిండ ముండును. దానినే హృదయమని అందురు. గుండెకాయయని కొంద ఱందురు.

ఇదివరలో నీకు రాజయోగమును గుఱించి చెప్పిన సందర్భమున మూలాధారాది షట్కమలములను గుఱించి చెప్పియుంటిని. ఆ సందర్భమున అనాహత చక్రమునకు క్రింది భాగమున హృదయ పద్మము కలదనియు, అది అష్టదళములు గలదనియు చెప్పియుంటిని.

*అక్కడ ఆ విచారమంతటితో ముగిసినది. హృదయమును గురించి శాస్త్రములయందు ఏకాభిప్రాయము లేదు. అయినను వానిని గుఱించి సంగ్రహముగా తెలిపెదను. **మంత్రపుష్పమునం** దిట్లున్నది:-

మం॥ **పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్।**
**అధో నిష్ట్యా వితస్త్యాం తే నాభ్యా ముపరితిష్ఠతి॥**

---

* ఉపనిషత్తులయందు ఉపాసనలకు విద్యలని పేరు. ఉపనిషత్తుల యందలి 32 కలవు. మొదటి దశోపనిషత్తులయందు 27ను. తరువాత కాషీతకీ, శ్వేతాశ్వతరాది ఉపనిషత్తులయందు తక్కిన 5 విద్యలును కలవు అందులో "దహరవిద్య" ఛాందోగ్యశ్రుతి 8వ ప్రకరణమున కలదు. బ్రహ్మసూత్రములయందు 1వ అధ్యాయమున 3 గుహాధికరణము. 5. దహరాధికరణము. 3వ అధ్యాయము. 18వ "అనియమాధికరణము" నందును ఈ ప్రసక్తి కలదు.

* బ్రహ్మజిజ్ఞాస ద్వితీయ భాగము 11 వ ప్రకరణమున, 20వ అధ్యాయమునందు చెప్పియున్నాను.

తా॥ గళమునకు అధోభాగమున నాభికి ఊర్ధ్వభాగముననను, నడుమ ద్వాదశాంగుళప్రమాణ భాగమున అధోముఖమై హృదయకమల మున్నది. ఆ హృదయ కమలమునందే దేవుడున్నాడు. (తర్జని మొదలగు నాలుగు అడ్డవేళ్ల కొలతలు మూడైన ద్వాదశాంగుళములు)".

మం॥ సంతితగ్ం శిలాభిస్తు లంబత్యా కోశసన్నిభమ్.।
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్॥
తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః॥

తా॥ ఆ హృదయ పుండరీకము నాశ్రయించి జ్వాలావళులచే ప్రకాశించునాడీ సమూహము వ్రేలాడుచు జీవునకు ముఖ్యస్థానమై కొంచెము వికసితమైన తామర పుష్పముతో తుల్యమై హృదయాగ్రమందు సూక్ష్మమైన యొక కమలమున్నది. దానియందు సర్వము ప్రతిష్ఠితమై యున్నది. దానినడుమ సర్వత్ర జ్వలించు జఠరాగ్నియైన వైశ్వానరు డున్నాడు.

కఠోపనిషత్తు నందిట్లున్నది:-

మం॥ తం దుర్దర్శం గూఢం సుప్రవిష్టం
గుహాహితం గహ్వ రేష్ఠం పురాణమ్।
అధ్యాత్మ యోగాధిగ మేవ దేవం
మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి॥ (2-12)

తా॥ చూచుటకు. సాధ్యము కానిది ఏకాంతస్థితియందుండునది హృదయకుహరమందు గుప్తమై సనాతనమై (జననము లేనిదై) యుండు పరమాత్మను అధ్యాత్మధ్యానము వలన ధీరుడైనవాడు కనుగొని హర్షశోకముల త్యజించుచున్నాడు.

మం॥ అణోరణీయా న్మహతో మహీయా
నాత్మస్య జంతో ర్నిహితం గుహాయామ్। (2-20).

తా॥ఈ ఆత్మ అణువునకంటె అణువుగాను, మహత్తునకంటె మహత్తుగాను, ప్రతిప్రాణి హృదయ కుహరము నందు నివసించుచున్నది.

**మం|| ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే**
**గుహా ప్రవిష్టౌ పరమే పరార్ధే|**
**ఛాయాఽఽతపౌ బ్రహ్మవిదో వదంతి**
**పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః||** (3-1).

తా|| పరమాత్మకు స్థానమైన హృదయ కుహరములో కూర్చుండి యేఇరువురు తమ సుకృత ఫలముల ననుభవించు చున్నారో వారిని బ్రహ్మ విదులును, పంచాగ్నుల నారాధించి త్రిణాచికేతాగ్నిని వ్రేల్చిన గృహస్థులును, ఆ యిరువురును ఛాయాఽఽతపములని చెప్పుచున్నారు.

ఇచట ఛాయాఽఽతపములు జీవాత్మ పరమాత్మలా? జీవేశ్వరులా? అను ప్రశ్న కలుగుచున్నది. మన ప్రస్తుత ప్రసంగమునకు దానికి సంబంధము లేదు.

మం|| యః పూర్వం తపసో జాత మద్భ్యః పూర్వ మజాయత, గుహాం ప్రవిశ్య తిష్ఠన్తం యో భూతేభి ర్వ్యపశ్యత, ఏతద్వైతత్. (4-6)

తా|| పంచభూతముల మధ్యనున్న వానిని గను, బ్రహ్మయొక్క తపస్సుచే కనబడినవాడును, జలమునకంటె పూర్వమే ఉండినవాడును, హృదయకుహర మందు నివసించు వాడును, ఎవనిని ఎవడు చూచుచున్నాడో వాడు బ్రహ్మమునే చూచుచున్నాడు. ఇదియే అది. (నీవు ఇంతకుముందు అడిగినది.)

మం|| యా ప్రాణేన సంభవ త్యదితి ర్దేవతా మయీ, గుహాం ప్రవిశ్య తిష్ఠంతీం భూతేభి ర్వ్యజాయత. (ఏతద్వైతత్. 4-7)

తా|| ఎవడు సమస్త దేవతామయుడో, సమస్తప్రాణులతో సహ హృదయ గుహయందు ప్రవేశించి అచ్చట స్థిరముగా నున్నాడో వానిని తెలిసికొనినవాడు తప్పక బ్రహ్మమును తెలిసికొనుచున్నాడు. ఇదియే అది.

మం|| అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశానో భూత భవ్యస్య సతతో విజుగుప్సతే. (ఏతద్వైతత్)

మం|| అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతి రివాభూమకః, ఈశానో భూతభవ్యస్య స ఏ వాద్య స ఉవిశ్వః. (ఏతద్వైతత్)

తా॥ అంగుష్ఠమాత్రుడైన పురుషుడు పొగలేని జ్యోతివలె హృదయ మధ్యమున నివసించుచున్నాడు. అతడు భూత భవిష్యత్తులకు ప్రభువు; నేడున్నాడు. అతనిని తెలిసి కొనినవాడు భయము లేనివాడగుచున్నాడు. ఇదియే అది.

మం॥ న సందృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్। హృదామనీషా మనసాభిక్లప్తో, య ఏతద్విదు రమృతాస్తే భవంతి. (6-9)

తా॥ అతని స్వరూపము దృగ్గోచరము కాదు. అనగా నేత్రములచేత ఎవనికిని ప్రత్యక్షము కాడు. పరిశుద్ధాంతః కరణులు ఆబ్రహ్మమును తెలిసికొనుచున్నారో వారమృతత్వమును పొందుచున్నారు.

మం॥ శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన మభినిస్సృతైకా, తయోర్ధ్వ మాయన్నమృతత్వ మేతి, విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి. (6-16)*

తా॥ హృదయమునందు 101 నాడు లున్నవి. అందులో ఒకటి నడినెత్తివఱకు పోయినది. (అదియే సుషుమ్న) ప్రాణోత్క్రమణ కాలమున ప్రాణము ఆనాడి నుండి వెడలిపోయిన అట్టి వా రమృతమును పొందుదురు.

మం॥ అంగుష్ఠమాత్రః పురుషో ఽన్తరాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః, తం స్వాచ్ఛరీరా త్ప్రవృహే న్ముంజాది వేషీకాం ధైర్యేణ తం విద్యా చ్ఛుక్ర మమృతమితి.॥ (6-17)

తా॥ హృదయమున నివసించు అంగుష్ఠ మాత్ర పురుషుని ముంజగడ్డి మధ్య సన్నని ఈనెను పైపొర తీసి వేఱు చేయునట్లు (అన్వయ వ్యతిరేకములచే) వేఱుచేయవలెను. వానిని పవిత్రమైన వానిగను అమృతునిగను తెలిసికొనవలెను.

ప్రశ్నోపనిషత్తు. మం॥ హృదిహ్యేష ఆత్మా, అత్రైతదేకశతం నాడీనాం తాసాం శతం శతం శతమేకైకస్యాం ద్వాసప్తతి ర్ద్వాసప్తతిః ప్రతిశాఖానాడీ సహస్రాణి భవత్యాసు వాన శ్చరతి.॥ (3-6)

తా॥ ఆత్మ హృదయము నందున్నది. అచ్చట 101 నాడులు గలవు ఒక్కొక్క దానియందు నూఱు నూఱు శాఖలు కలవు. ఆ శాఖలయందు

* ఈ మంత్రము ఏవిధమైన మార్పులేక యోగశిఖోపనిషత్తు (5-17-18) నందున్నది.

ప్రతి ఒక్కొక్క శాఖకు 72 వేలు ప్రతిశాఖానాడులు గలవు. వాటియందు వ్యానవాయువు సంచరించును - (పిప్పలాద మహర్షిని అశ్వలాయను డడిగిన ప్రశ్నకు - పైన చెప్పినది ఈ సమాధానము).

**ముండకోపనిషత్తు.** మం॥ అవి స్సన్నిహితం గుహాచరం నామ మహత్పద మత్రైత త్సమర్పితమ్.। ఏతత్ప్రాణ న్నిమిషచ్చ యదేతజ్జానథ సదసద్వరేణ్యాం పరం విజ్ఞానాద్య ద్వరిష్ఠం ప్రజానామ్.॥ (2-2-1)

తా॥ హృదయ గుహయందు ఇంద్రియ వృత్తులచే అభివ్యక్త మగుచు సంచరించుచు వ్యక్తావ్యక్త స్వరూపమైన బ్రహ్మమే మహాధారము. ఇదే సత్తు, ఇదే అసత్తు, ఇదే శ్రేష్ఠము. సర్వభూతములు అందే యున్నవి. అట్టి తత్త్వమును తెలిసికొనవలెను.

మం॥ మనోమయః ప్రాణశరీరనేతా ప్రతిష్ఠితో ఒన్నే హృదయం సన్నిధాయ। తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా ఆనందరూప మమృతం యద్విభాతి॥(2-2-7)

తా॥ మనోమయుడై ప్రాణములకు నియామకుడై హృదయమునందు నిలిచియుండువాడును, ఆనందరూపమున అమృతమయుడునై ప్రకాశించు ఈ ఆత్మను ధీరులైన జ్ఞానులు సర్వత్ర గాంతురు.

మం॥ ద్వా సుపర్ణా స యుజా సఖాయా! సమానం వృక్షం పరిషస్వ జాతే.। తయోరన్యః పిప్పలం సాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥ (3-1-1)

తా॥ ఒకే వృక్షముపై అందమైన ఱెక్కలు గలవియు, అత్యంత స్నేహము గలవియునగు, రెండు పక్షులు జంట గలిగి యున్నవి. అందులో ఒకటి ఆ చెట్టుయొక్క మంచిరుచిగల ఫలములను తినును. రెండవది తినక తినుచుండు మిత్రుని చూచుచుండును. (ఈ మంత్రమునందు వృక్షమని చెప్పబడినదే హృదయమని అర్థము చేసికొనవలయును).

మం॥ దూరాత్సుదూరే తదిహాంతికే చ। పశ్యంత్స్విహైనం నిహితం గుహాయామ్.॥ (3-1-7)

తా॥ అది దూరముకంటె అతిదూరమును, సమీపముచకంటె అత్యంత సమీపమునై యుండి దివ్యదృష్టి గల జ్ఞానులు వారి హృదయ కుహరమందే చూచుచున్నారు.

**తైత్తిరీయోపనిషత్తు.** మం॥ స. ఏషో ఽంతర్హృదయ ఆకాశః తస్మి న్నయం పురుషో మనోమయః అమృతో హిరణ్మయః. అంతరేణ తాలుకే య ఏషస్తవ ఇవాలంబతే సేంద్రయోనిః యత్రాసౌ కేశాంతో వివర్తతే, వ్యపోహ్య శీర్షక పాలే, భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి, భువ ఇతి వాయౌ. (శిక్షావల్లి. 6-1)

తా॥ అంతర హృదయమునందు ఆకాశమున్నది. అచటనుండు నీ పురుషుడు మనోమయుడు, అమృతుడు, హిరణ్మయుడు, రెండు తాలువుల మధ్య స్తనాకారముగ వ్రేలాడు మాంసపిండము కొండనాలుక ఇంద్రుని ఉత్పత్తి స్థానము. కపాలద్వయ మధ్యమున జేరి కేశాంతము వఱకు వ్యాపించియున్నది. భూః అని అగ్నియందుండును. భువ అని వాయువు నందుండును.

మం॥ బ్రహ్మవిదాప్నోతిపరమ్, తదేషా భుక్తా సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ యోవేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ సో ఽశ్నుతే సర్వాన్కామాంత్యసహ.......... (బ్రహ్మానందవల్లి. 1అ)

తా॥ బ్రహ్మజ్ఞాని పరమపదమును పొందును. బ్రహ్మము నెఱింగినవాడు బ్రహ్మమే యగును. హృదయ గుహయందుండు సత్య జ్ఞానానంద స్వరూపమగు బ్రహ్మము నెఱింగినవాడు సమస్త కోరికలు పొందిన వాడగును.

**ఐతరేయోపనిషత్తు.** మం॥ యదేత ద్ధృదయం మనశ్చైతత్. (3-2)

తా॥ ఏది హృదయమో అది మనస్సు.

జిజ్ఞాసువు :- స్వామీ! మనస్సు హృదయము రెండును ఒకటే యెట్లగును?

వేదాంతి :- "**మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ**
**అశుద్ధం కామ సంకల్పం శుద్ధం కామ వివర్జితమ్।**
**లయవిక్షేపరహితం మనః కృత్వా సునిశ్చలమ్**
**యదా యావ త్యమనీభావం తదా తత్పరమం పదమ్॥...**"

(మైత్రాయణి. ప్ర. 4).

అని చెప్పియున్నందున శుద్ధ మానసము హృదయముతో సమానమని శ్రుతి చెప్పినది.

బృహదారణ్య కోపనిషత్తు :- చతుర్థాధ్యాయము ప్రథమ బ్రాహ్మణము గార్గ్యబాలాకికిని, అజాతశత్రుడను రాజునకును జరిగిన సంవాదమునందు అజాతశత్రువు ఇట్లు చెప్పెను :- **మం|| ఏతత్సుప్తో ఉభూ ద్యఏష విజ్ఞానమయః పురుష స్తదైషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ య ఏషో ఉత్తర్హృదయ ఆకాశ స్తస్మి ఞ్ఛేతేతాని.** (17).

తా|| ఇతడు నిద్రించిన కాలమున ఈ విజ్ఞానమయ పురుషుడు ఈ ప్రాణములు విజ్ఞానముతో సహ తెలియు శక్తిని గ్రహించి హృదయాంతర్గతమై యుండు ఆకాశమున విశ్రమించి యుండును.

తరువాత పంచమాధ్యాయము 9వ బ్రాహ్మణము నందు యాజ్ఞవల్క్య శాకల్య సంవాదమునందు :- **మం||... కస్మిన్ను రూపాణి సర్వలోకో జానాతి తస్మాద్ధృదయే హ్యేవ రూపాణి ప్రతిష్ఠితాని భవంతీ త్యేవమేవైత ద్యాజ్ఞవల్క్యః.** (20)

తా|| ప్రశ్న :- రూపము దేనియందు ప్రతిష్ఠితమైయున్నది?

సమాధానము:- హృదయమునందు, హృదయము నుండియే మనుష్యుడు రూపమును గ్రహించును. హృదయమునందే రూపము లన్నియు ప్రతిష్ఠింపబడినవి".

కైవల్యోపనిషత్తు. మం||... పరేణనాకం నిహితం గుహాయాం బిభ్రాజ దేత ద్వితమో విశన్తి (3) వేదాంత విజ్ఞాన సునిశ్చతార్థా స్సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః (4).

తా|| స్వర్గముకంటె పరమునందుండునదై, హృదయ గుహాయం దుండునదై ఏది ప్రకాశించుచున్నదో, ఆ పరబ్రహ్మమును వేదాంత జ్ఞానముచేత చక్కగా నిశ్చయింపబడియుండు అర్థమును తెలిసికొన్నవారును, సన్న్యాస యోగముచేత పరిశుద్ధమైన అంతఃకరణము కలవారును నగు యతులు ప్రవేశించుచున్నారు. అనగా పరబ్రహ్మమును బొందుచున్నారు.

మం॥ హృత్పుండరీకం విరజం విశుద్ధం
విచిన్త్య మధ్యే విశదం విశోకమ్.
అచిన్త్య మవ్యక్త మనంతరూపం
శివం ప్రశాంత మమృతం బ్రహ్మయోనిమ్ . . .
ఉమా సహాయం పరమేశ్వరం ప్రభుం . . . (6).

తా॥ హృదయ కమలము రజోగుణము లేనిదనియు శుద్ధమైనదనియు భావించి(న వాడు) హృదయకమల మధ్యమున . . . ఉమాసహితుడైన పరమేశ్వరుని (బొందుచున్నాడు).

జాబాలోపనిషత్తు. మం॥ దహరేవ విరజే త్రదహరేవ ప్రవ్రజేత్.

శ్వేతాశ్వతరోపనిషత్తు. మం॥ అణోరణీయా న్మహతో మహీయా
నాత్మాగుహాయాం నిహితో ఽస్య జంతోః,|
తమ క్రతుం పశ్యతి వీతశోకో, ధాతుః ప్రసాదాన్మహిమాన మీశమ్.
(3-20)

(ఈ మంత్రము కఠోపనిషత్తులో పూర్వము చెప్పబడినదే).

అథర్వశిరోపనిషత్తు. మం॥ హృదిస్థా దేవతా సర్వా
హృది ప్రాణాః ప్రతిష్ఠితా, హృది త్వమసి యో
నిత్యం త్రిస్రోమాత్రాః పరస్తు సః (4-1)

తా॥ హృదయ కమలమునందు సమస్త దేవతలు, ప్రాణము, సూత్రాత్మ కలరు. ఎల్లప్పుడు ప్రతిసిద్ధిగల ఓంకార స్వరూపుడవగు నీవు (రుద్రుడవు) ఆహృదయకమలమునందు కలవు. (అనగా రుద్రుని పరబ్రహ్మముగా దేవతలు స్తుతించిరి).

మం॥ వాలాగ్రమాత్రం హృదయస్య మధ్యే|
విశ్వం దేవం జాత వేదం వరేణ్యామ్॥
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః
తేషాం శాంతి శ్శాశ్వతీ నేత రేషామ్॥

తా॥ కేశాగ్రమువలె అతి సూక్ష్మ మైనట్టివాడును, హృదయ మధ్యమునందుండు వాడును, విశ్వరూపుడును, వేదములకు జనకుడును స్వయంప్రకాశుడును, వరణీయుండును, అంతఃకరణమునం దుండువాడును అగు దేవుని (రుద్రుని) ఏమహాత్ములు ఎఱిగి సాక్షాత్కారమును పొందుదురో వారే ధీరులు.

అథర్వశిరోపనిషత్తునకు ఆనామ మేకారణమున కలిగెనో ఆకారణమును శ్రుతి నిర్వచనరూపమున ఈ క్రింది ఆఖ్యాయిక చెప్పినది:-

పూర్వ మొకప్పుడు ఒక మహర్షి అథర్వునకు ఇట్లు శాపమిచ్చెను:- "తత్క్షణమే అథర్వుని శిరమూడి క్రిందపడుగాక, వాని హృదయము సైతము పడిపోవుగాక". ఈ శాప వృత్తాంతమును అథర్వుడెఱిగి యోగాభ్యాసబలము చేత తాను తన శరీరమునుండి వెలుపలికి వచ్చి, దేహమున కంటె భిన్నరూపుడై క్రిందపడియున్న తన శిరస్సును, హృదయమును సూక్ష్మ (లింగ) శరీరముతో మెదడునందలి పై భాగమున ప్రవేశించి శిరమును, హృదయమును వాటి వాటి స్థానముల చేర్చి బ్రతికెను. ప్రాణోపాసనవలన ప్రాణరూపు డగుటచేత ఆమహాత్ము డట్లు చేయగలుగుటచే ఆయనకు "పవమానుడు" అను పేరుకలిగెను. అథర్వునిచే చెప్పబడినది గనుక శ్రుతికి అథర్వశిరోపనిషత్తని పేరు కలిగెను.

సుబాలోపనిషత్తు. మం॥ హృదయస్య మధ్యే లోహితం మాంసపిండం, యస్మిన్ తద్దహరం పుండరీకం కుముద మివానేకధా వికసితం . . .

తా॥ హృదయ మధ్యమందు ఎఱ్ఱనగు లేక కుంకుమ పువ్వు రంగు గలిగిన మాంసపిండము కలదు. దానియందు దహరము తామరపువ్వువలె వికసించి యుండును. (ఈ శ్రుతియందే మఱికొన్ని చోట్ల హృదయమును గుఱించి వ్రాయబడినది).

ధ్యాన బిందూపనిషత్తు. మం॥ అష్ట పత్రం తు హృత్పద్మం ద్వా త్రింశత్కేసరాన్వితం తస్యమధ్యే స్థితోభాను ర్భాను మధ్యే గతశ్శశీ. (26).

మం॥ అబ్జ పత్ర మధఃపుష్ప మూర్ధ్వనాళ మధోముఖమ్ కదళీ పుష్ప సంకాశం సర్వవేదమయం శివమ్. (33).

.యోగతత్త్వోపనిషత్తు. మం॥ హృదిస్థానే స్థితం పద్మం తస్య వక్త్ర మధోముఖమ్

తా॥ హృదయ స్థానమందు అధోముఖము గల పద్మమున్నది. (అదే హృదయపద్మము).

మహోపనిషత్తు. మం॥ పద్మకోశ ప్రతీకాశం లంబత్యాకోశ సన్నిభమ్। హృదయం చాప్యధోముఖం సంతత్యై సీత్కరాభిశ్చ॥

తస్య మధ్యే మహానర్చి ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖమ్,।
తస్య మధ్యే వహ్నిశిఖా అణియోర్ధ్వా వ్యవస్థితా,॥
తస్యాః శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితా.॥

తా॥ అధోముఖమైన పద్మపు మొగ్గవలె నుండి కోశ సమానముగ హృదయము వ్రేలాడుచుండును. అందు అనేకనాడులు చేరి యున్నవి. దాని మధ్యమున నలువైపుల మహాజ్వాలలతో వైశ్వానరాగ్ని ప్రకాశించుచున్నది. ఆ యగ్ని మధ్యమున అతి సూక్ష్మమైన దీప శిఖవలె నుండి ఒక జ్వాల ఊర్ధ్వముఖముగా విలసిల్లుచుండును. దాని శిఖామధ్యమున పరమాత్మ వెలుగుచున్నాడు".

మం॥ అహంకార కళాయుక్తం బుద్ధిబీజ సమన్వితమ్.।
తత్పుర్యష్టక మిత్యుక్తం భూతహృ త్పద్మషట్పదమ్.॥

తా॥ అహంకారమను కళచేత కూడినదియు, బుద్ధియే బీజముగా గలదియు నగు, పుర్యష్టకమే ప్రాణులయొక్క హృదయమనెడి పద్మమున వసించు తుమ్మెద యగుచున్నది.

శారీరకోపనిషత్తు. మం॥ మనస్థానం గళాన్తం బుద్ధే ర్వచన మహంకారస్య హృదయం చిత్తస్యనాభి రితి।

తా॥ మనస్సు యొక్క స్థానము కంఠము. బుద్ధి యొక్క వాసస్థానము వాక్కు. అహంకారముయొక్క వాసస్థానము నాభి. (మంత్రము "బుద్ధేర్వచన" అని కొన్ని ప్రతులయందును "బుదేర్వచన" అని కొన్నిప్రతుల యందును గలదు).

(బ్రహ్మసూత్రములు) పై యంశము బ్రహ్మసూత్రములయం దేమిచెప్పబడినదో దాని నిచట విచారింతము:- సూ॥ అర్భకౌ కస్త్వాత్త ద్వ్యపదేశాచ్చ నేతిచే న్ననిచాయత్వా దేవం వ్యోమవచ్చ. (బ్ర. సూ. 1-2-7)

తా॥ ఉపాసకుడు సర్వవ్యాపకుని ఉపాసింపజాలడు కనుక సర్వవ్యాపకుండగు పరమాత్మను ప్రాదేశ మాత్రమగు హృదయమునం దున్నాడనుట తప్పుకాదు.

సూ॥ హృదయాపేక్షయా తు మనుష్యాధికారవత్. (బ్ర. సూ. 1-3-24)

తా॥ విద్యాధికారియగు మానవునకు హృదయము నందుండు పరబ్రహ్మమును తెలిసికొనుటకు (ఉపాసన కొఱకై) అంగుష్ఠ మాత్రుడని చెప్పబడినది.

బ్రహ్మసూత్రములయందు ప్రథమాధ్యాయ ద్వితీయ పాదమునందలి (3) గుహాధికరణము నందును, తృతీయపాదమునందలి (5) దహరాధికరణము నందును, తృతీయాధ్యాయ ద్వితీయ పాదమునందు తదభావాధికరణమునందును ఈ చర్చ జరిగినది. మఱియు-

సూ॥ గుహాం ప్రవిష్టా దాత్మానౌ హి తద్దర్శనాత్. (బ్ర. సూ. 1-2-11)

తా॥ ఈ సూత్రభాష్యమునందు భాష్యకారులు (నే నిదివరలో చెప్పిన) కఠోపనిషత్తు నందలి "ఋతం పిబంతౌ" (3-1) మంత్రమును, ముండక శ్రుతి యందలి "ద్వాసుపర్ణా" (3-1-1) అను మంత్రమును ఉదాహరించి యున్నారు.

సూ॥ దహర ఉత్తరేభ్యః. (బ్ర. సూ. 1-3-14)

తా॥ దహరాకాశ మనగా బ్రహ్మమే.

సూ॥ ధృతేశ్చమహిమ్నో ఒస్యాస్మి నుపలబ్ధేః. (బ్ర. సూ. 1-3-16)

తా॥ మఱియు విశ్వమును ధరించిన వాడని చెప్పుట చేతను దహరాకాశము పరబ్రహ్మమని తెలియుచున్నది. "అథ య ఆత్మా స నేతు ర్విధృతిః" ఈ ఆత్మయే సమస్త జగత్తును ధరించి నియమన మొనర్చుచున్నాడని చెప్పుట వలన 'దహర' మనగా బ్రహ్మమే.

భగవద్గీత.

శ్లో|| జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే|
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్.||

(గీత. 13-18)

తా|| ఆ బ్రహ్మము సూర్యాది తేజస్సులకు ప్రకాశమైనదియు, అజ్ఞానముకంటె పరమునం దున్నదియు, సమస్త ప్రాణులయొక్క హృదయమునం దున్నదియు అని చెప్పబడినది.

ఈ శ్లోకమునకు శ్రీ శంకరానంద స్వాములవారు రచియించిన వ్యాఖ్యానముయొక్క ఆంధ్రీకరణమునందిట్లున్నది:-

"బ్రహ్మాది స్తంబ పర్యంతముగల సమస్త ప్రాణి సమూహముయొక్క హృదయమునందు - బుద్ధి గుహ యనబడు అవ్యాకృతాకాశమునందు సర్వ ప్రాణులకును సంబంధించిన బుద్ధికిని, ప్రాణుల వ్యాపారమునకును, వాని యవస్థలకును, సాక్షిగా నుండి "నేను" "నేను" అని అహంప్రత్యయమునకు అర్థముగా వెశేషించి యున్నది."

**(ఉత్తరగీత)**

శ్లో|| హృదయకమలమధ్యే దీపవ ద్వేదసారం
ప్రణవమయ మతర్క్యం యోగిహృద్ధ్యానగమ్యమ్|
అజ హరి శివయోగం సర్వభూతస్థమేకం
సకృదపి మనసా మాం ధ్యాయతే యస్సయుక్తః|| (4-21)

తా|| "హృదయకమల మధ్యమునందు, దీపమువలె ప్రకాశించు వాడును, వేదముయొక్క సార స్వరూపుడును, ప్రణవ స్వరూపుడును, యోగులచేత ధ్యానింపబడిన పిదప వారి హృదయముల యందు గోచరించువాడును, బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపుండును, సకల భూతములయం దుండువాడును. అద్వితీయుడును అగు నన్ను (పరమేశ్వరుని) ఒక్క పర్యాయమైనను ఎవడు ధ్యానించుచున్నాడో వాడు ముక్తుడగుచున్నాడు".

శ్లో|| అధోముఖం తు హృత్పద్మ ముద్ధృత్య ప్రణవేన తు|
గత్వా తు పద్మకోశాంత మేకస్సేవ్యో పునః పునః|| (4-31)

తా|| "అధోముఖమైన హృదయ పద్మమును ప్రణవముచేత లేవదీసి పద్మకోశాంతమును బొంది అతడు (విష్ణు దేవుడు) ఒక్కడే మాటిమాటికి సేవింపదగినవాడు".

శ్లో|| తతః పశ్చా ద్భవేత్పద్మం సర్వగాత్ర సుఖావహమ్.|

తా|| పిదప ఆపద్మము దేహమున కంతయు (అనగా సకలావయవములకు) సుఖమును కలుగుజేయునది యగును.

శ్లో|| హృదిస్థితం పంకజ మష్టపత్రం
సకేసరం కర్ణిక మప్యలీనమ్|
అంగుష్ఠ మాత్రం మునయో వదన్తి
ధ్యాయేతి విష్ణుం పురుషం పురాణమ్|| (4-32)

తా|| "ఆ పద్మము హృదయమునం దున్నది. ఆ పద్మమునకు ఎనిమిది దళములు గలవు. కింజల్కమునందు కర్ణికను (బొడ్డును) గలదియైనను లీనమైనది కాదు. అంగుష్ఠపరిమాణము గలది. అయ్యంగుష్ఠ పరిమాణము గల హృదయ పద్మమునందు పురాణపురుషుడగు శ్రీ మహావిష్ణువు నను ధ్యానింపవలయును".

ఈ శ్లోకమున హృదయపద్మమని చెప్పక (హృదయమే పద్మాకారముగ నున్న దనక) హృదయమునందు పద్మమున్నట్లు చెప్పబడినది.

శ్లో|| అష్టపత్రం హృత్పద్మం ద్వాంత్రిశ త్కుసుమం తథా|
తత్ర మధ్యస్థితం ధ్యాయే దింద్రాద్యాన్దిశి దేవతాః|| (4-33)

తా|| హృదయకమలము ఎనిమిది దళములును, ముప్పది రెండు కుసుమములును గలిగియున్నది. ఆ పద్మ మధ్యభాగమున నున్న దేవుని ఇంద్రాది దిగ్దేవతలను ధ్యానము చేయవలయును".

శ్రీ వివేకానందస్వాములవారు ఇట్లు చెప్పిరి:- "కుండలిని యొక చక్రమునుండి మఱియొక చక్రమునకు ఊర్ధ్వముఖముగా బోవునప్పుడు హృదయకమల మందలి దళము లొకదాని వెంబడి నొకటిగా వికసించుట కారంభించును". (ఆంధ్రానువాదము, రాజయోగము, చతుర్థాధ్యాయము).

"మఱియొక విధమైన ధ్యానము కలదు. నీ హృదయాకాశమధ్యమున నొక జ్యోతి ప్రకాశించు చున్నట్లు భావింపుము. ఆ జ్యోతియే నీ యాత్మయనియు దివ్య తేజో మయమగు మఱియొక జ్యోతి దానియందు వెల్గొందు చున్నదనియు, అదియే పరమాత్మ యనియు భావించి ధ్యానింపుము". (రా. యో. అష్టమాధ్యాయము).

శ్రీ వివేకానందస్వాములవారు చెప్పిన జ్యోతి, వాసుదేవోపనిషత్తు చెప్పిన మంత్రమునకు సరిపోవును.

శ్రీ అరవిందుల శిష్యురాలగు శ్రీమాత (శ్రీమతి అల్సాసామీరాగారు ఇట్లు చెప్పిరి:- "ధ్యానమునకు ఇతర లక్ష్యస్థానములు కలవు. ఉదాహరణమునకు: శిరమునకు పైనొకటి (దినిని సహస్రారమునకు పై బ్రహ్మ రంధ్రమందురు) భ్రూ మధ్యమునకు మఱియొకటి, ఒక్కొక్కటియు నొక ప్రభావము గలది; ఒక ఫల విశేషము నిచ్చును. కాని, హృదయమునం దుండియే (దివ్యమైన) మార్పునకు కావలసిన ప్రేరణ, సాక్షాత్కార సామర్థ్యము, క్రియాపరశక్తి - ఇవి యన్నియును సకల ముఖ్యవృత్తులును బయలుదేరును". (శ్రీ మాతృ వాక్కులు. 1వ. ప్ర.)

మఱియు శ్రీ మాత యిట్లు చెప్పిరి :- "మనస్సు, భిన్న భిన్న జనులయందు, భిన్న భిన్న మార్గముల బనిచేయును. హృదయము మాత్రము ఎచ్చటను ఏకరూపమైనదే. హృదయము సత్యతరమైన వాస్తవము.

(శ్రీ మాతృ వాక్కులు. 2వ ప్ర.)

హృదయమును గుఱించి శాస్త్రములు, మహాత్ములు చెప్పినదానిని సంగ్రహముగ వివరించితిని. కాని ఇందులో కొన్ని అంశముల గుఱించి పరిశీలింపవలసి యున్నది. ఉపనిషత్తులయందు కఠోపనిషత్తు హృదయమును గుఱించి విస్తరించి చెప్పినది. దశోపనిషత్తులందు, ఈశ, కేన, మాండూక్యోపనిషత్తులు తప్ప తక్కిన ఏడు ఉపనిషత్తులును, హృదయమును గుఱించి చెప్పినవి. ఈశోపనిషత్తు నందు "హిరణ్మయేన పాత్రేణ" అను 15వ సూత్రమునందు హిరణ్మయ పాత్రను హృదయ గుహగా అర్థము చేసికొనిన కేన, మాండూక్య శ్రుతుల యందు మాత్రమే యీ ప్రసక్తి ప్రత్యక్ష మగుట లేదు. దశోపనిషత్తులుగాక యితర ఉపనిషత్తులయం దన్నింటి

యందు హృదయమును గుఱించి వ్రాయబడినది. కాని, వాటిలో కొన్నింటిని మాత్రమే, పైన చెప్పియుంటిని.

భగవద్గీత యందలి శ్లోకము నుదాహరించితిని. అదిగాన "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" (గీత. 18-61) ఈశ్వరుడు సమస్త ప్రాణులయొక్క హృదయ ప్రదేశమం దున్నాడు. ఇచట చెప్పబడిన "ఈశ్వరుడు" సగుణబ్రహ్మము.

పై విధముగా ప్రస్థానత్రయమందేగాక అనేక వేదాంత గ్రంథములయందు సయితము హృదయాకాశమును గుఱించి చెప్పబడియున్నది. హృది = హృదయము నందు, అయం = బ్రహ్మమున్నది. కనుక (హృదయము) హృదయ మనబడుచున్నది. దీనిని దహరాకాశమనియు అందురు.

జిజ్ఞాసువు:- హృదయమును గుఱించి శ్రుతులయందు చెప్పినది విద్య (ఉపాసన) యా? లేక బ్రహ్మవిచారమా?

వేదాంతి:- రెండును అని నా యభిప్రాయము. కాని, విద్యకే ప్రాధాన్య మున్నది.

జిజ్ఞాసువు:- శాస్త్రములయందు "హృదయాకాశము" అనియు "హృదయ పద్మము" అనియు రెండు విధములుగ చెప్పిరి కదా? ఈ భేదమునకు కారణమేమైన కలదా?

వేదాంతి :- ఇందును గుఱించి నా యభిప్రాయ మేమనగా:- రెండు పద్ధతులలో వస్తు భేదము లేదు. పదార్థమొక్కటే, హృదయ పద్మమని చెప్పువారు సాకార, సగుణ బ్రహ్మోపాసకులని భావించవచ్చును. ముఖ్యముగా వైష్ణవులు వారి యిష్ట దైవమును వారి హృదయ పద్మము నందున్నట్లు భావించి యుపాసింతురు. హృదయ పద్మము కోశమువలె అధోముఖముగా వ్రేలాడుచున్నదనియు, ఈ పద్మ కర్ణికయందు శ్రీ మహావిష్ణువో, శ్రీ కృష్ణ భగవానుడో, లక్ష్మీనారాయణులో ఉన్నట్లు భావించుకొని ఉపాసింతురు. హృదయ గుహయందు ఆకాశమని చెప్పువారు నిర్గుణ నిర్వికార బ్రహ్మోపాసకులు. లేక బ్రహ్మ విచారపరులు హృదయమున వారెట్టి ఆకారమును భావింపరు.

జిజ్ఞాసువు :- హృదయగుహ అంగుష్ఠ మాత్ర పరిమాణము గలది యందురు గదా? అపరిచ్ఛిన్నుడగు పరమాత్మను పరిచ్ఛిన్నునిగా భావించుట తప్పు కాదా?

వేదాంతి :- మన లోకానుభవమునందు పర్వతములలో గుహలను చూచి యున్నాము. గుహయందుండు ఆకాశము (శూన్య ప్రదేశము) మహాకాశము (భూతాకాశము) నుండి వేఱుకాలేదు. మహాకాశమును పరిచ్ఛిన్న మొనర్చుటకు సాధ్యము కాదు. ఘటము పుట్టగనే ఘటాకాశమను వ్యవహారము కలిగినది. ఘటాకాశమను వ్యవహార మున్నను, ఘటమునందును ఘటము వెలుపలను సర్వత్ర ఆకాశ ముండుటవలన అది పరిచ్ఛిన్నము కాలేదు. అట్లే హృదయమున నుండు పరమాత్ముడు అఖండాద్వితీయ వస్తువే గాని పరిచ్ఛిన్నుడు కాడు. హృదయాకాశమునందు సమస్త విశ్వమును కలదు. అట్లనుటవలన చిన్న ఫిలిమ్‌లో రూపములు కనబడునట్లు కాదు. సూర్య, చంద్ర, నెబ్యులాలు, గెలాక్సీలు, (తేజోరాసులు), సహితము ఏవేవి ఎంతెంత పరిమాణముతో పరిభ్రమించుచున్ననో, ఎట్టి యాకృతులతో నున్నవో యోగులకు అవి యథారీతిగ కనబడును. ఋషులు, యోగులు ప్రపంచమునం దెచ్చటనో జరుగుచుండు కార్యములు తామున్న చోటునుండియే చూడగలుగుటయు, వాక్యములను వినుటయు, పరుల హృదయముల యందలి భావములను తెలిసికొన గలుగుటయు వారు వారి హృదయాకాశమునందు చూచుచుండుట వలననే గదా? అట్టి హృదయాకాశమును చూచినవారు అమృతస్వరూప మగు బ్రహ్మమే.

హృదయాకాశము అంగుష్ఠ మాత్ర ప్రమాణము గలదని కొన్ని శ్రుతులయందు చెప్పియుండినను, కఠోపనిషత్తు నందును (2-20) శ్వేతాశ్వతరోపనిషత్తు నందును, (3-20) హృదయమున నుండు పరమాత్మ (హృదయాకాశము) అణువున కంటె చిన్నదనియు, మహత్తునకంటె పెద్దదనియు వర్ణించబడినది. ఇట్టి వర్ణన వలన అంగష్ఠ మాత్రమే యని మేరను నిర్ధారణ చేయ నవసరము లేదు. సర్వమునకును హృదయాకాశమే అధిష్ఠానమని యెప్పుడు చెప్పబడెనో అప్పుడే అంగుష్ఠ ప్రమాణము సాధకుని ఉపాసనా సౌకర్యము కొఱకు చెప్పబడియుండునని నిశ్చయమైనది. సాలగ్రామమును విష్ణుమూర్తి అని, లింగము శివుడని యుపాసించుట లేదా?

జిజ్ఞాసువు:- హృదయ మనునది (గుహయని గాని, లేక పద్మమని గాని) శరీరమునందుండు ఒక మాంసపిండమా? లేక. ఎదలోపలి భాగమున ఒకానొక నిర్దిష్ట స్థానమునందు అట్టిది ఒకటి లేకపోయినను కలదని సాధకుడు భావించుకొనుచున్నాడా?

వేదాంతి :- స్థూలముగనో - సూక్ష్మముగనో హృదయము పదార్థ రూపమున లేకున్నచో, అష్టదళ పద్మకోశ మనియు, దాని నాశ్రయించి 101 నాడులున్నవనియు (కఠ. 6-16) మొదలగు శ్రుతి వాక్యములు అర్థశూన్యములు కావలసి వచ్చును.* కొందఱు, హృదయమను నట్టి పదార్థమేమియు లేదనియు, ఉపాసన కొఱకు సాధకు డావిధముగా ఉన్నట్లు భావించుకొనవలయు ననియు, దేహమునందలి రక్తమును పరిశుభ్రపరచి దేహమునకంతకును ప్రసారముచేయు యంత్రమువంటి గుండె (Heart) శాస్త్రములయందు చెప్పునట్టి హృదయకోశము కాదనియు చెప్పుదురు. సుబాలోపనిషత్తు "హృదయస్య మధ్యే లోహితం మాంసపిండం" ఎఱ్ఱనైనది - లేదా - కుంకుమపువ్వు వర్ణము కలది మాంసపు ముద్ద అని స్పష్టము చేసియున్నందున పదార్థము లేకయే కేవల భావనామాత్రమున ఉపాసన చేయుదురను వాదమునకు బలము చాలదు. "పద్మకోశ ప్రతీకాశం" అని చెప్పియుండుటవలన, (కోశ మనగా = కత్తినుంచుకొను నొఱ). కొంచెముగా వికసించిన పద్మము పరమాత్మకు ఒఱగా నున్నదని స్పష్టపరుపబడినది.

జిజ్ఞాసువు :- మానవ శరీరమును కోసి మనము దానిని చూడవచ్చునా?

వేదాంతి :- మానవుడనగా నేమి? పాంచభౌతికమగు స్థూల శరీరమును, అందుండు జీవుడును కలిసి యున్నపుడే మానవు డందురు. ఈ రెండింటిలో ఏది లేకున్నను మానవు డనరు. జీవుడు శరీరమునుండి వెళ్లిన తరువాత ఉండు కళేబరము (శవము)నకును, బ్రతికియున్నప్పటి శరీరమునకును చాల భేదమున్నది. ప్రాణము (జీవుడు) శరీరము నుండి వెడలగనే ఆశరీరమునందు

* కొందఱు ఇన్ని లక్షల నాడులుండునా? ఇది కల్పన యని యనుకొందురు. మన శరీరమునందలి ప్రతి కండరము నాడులయొక్క సముదాయమే. మానవుని మెదడు (Brain)ను ఫోటోతీసి దానిని, న్యూయార్కు నగరమంత పెద్దదానిగా (Enlarge) చేసి చూపవచ్చునట. మెదడు సర్వమును వెంట్రుకలకంటె అతిసూక్ష్మమగు నాడుల పదార్థ సముదాయమే యందురు.

అనేక మార్పులు జరుగుచున్నవి. ప్రాణమున్నపుడు నాడులు తేజస్వంతములై వివిధ వర్ణములు కలిగియుండును. అది యట్లుండనిమ్ము. జీవుడున్నప్పుడు కూడ హృదయాకాశమును కొందఱు మాత్రమే చూడగలరు. వారెవరనగా:-

అధ్యాత్మ యోగమున ధీరులైన వారును (కఠ. 2-12) ముంజగడ్డిలోనున్న సన్నని యీనెను పై పొరలు తీసి ముల్లును వేఱు చేయునట్లు పంచకోశములను విచారించి వాటిని వేఱుగా భావించి వాటి మధ్యమున నున్న ఆత్మను చూచునట్టివారును, యోగముచే నాడులను శుద్ధముచేసిన వారును, నియతాహార విహారములు గలవారును, వాసనారహితమైన చిత్తము గలవారును అగు మహనీయులే చూడగలరు. తక్కినవారు చూడలేరు. ఒఱలో కత్తి యున్నపుడు మనము ఒఱను మాత్రమే చూడగలము. కత్తిని చూడలేము. అట్లే శవమును శోధించు (Post mortem చేయు) వాడెట్లు హృదయ కోశమును చూడగలడు? శవమునందు మనస్సును వెదికిన కనబడునా? వేదాంత గ్రంథములయందు పరమాత్మను చూచుటకు ఏ యే యుపాయములను, ఎట్టి సాధనములను చెప్పిరో అవియే హృదయాకాశమును చూచుటకు సాధనములు. ఏల యందునా? అది బ్రహ్మమే కనుక "వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థా" అని కైవల్యోపనిషత్తు చెప్పియుండలేదా?

జిజ్ఞాసువు :- హృదయ గుహయందు ఛాయ - ఆతపములవలె ఇరువురున్నట్లు, ఒక వృక్ష శాఖపై రెండు పక్షులున్నట్లును చెప్పిరికదా? ఈ ద్వైతముయొక్క భావమేమి?

వేదాంతి:- ఛాయా ఽ ఽతపము లనగా జీవాత్మ పరమాత్మలే యని అర్థము చెప్పిరి. చెట్టుపైన రెండు పక్షులున్నట్లు చెప్పిన వాక్యములకు అదే అర్థము. ఇందువలన ద్వైతము సిద్ధింపదు. నీ ఛాయ నీకంటె భిన్నమగు స్వతంత్రాస్తిత్వముగల వస్తువు కాదు. రెండు పక్షులయందు ఫలములను తినక చూచుచుండు పక్షియొక్క ఛాయయే రెండవ పక్షి. కనుక యిచట ద్వైతమునకు చోటులేదు.

పరమేశ్వరుడు జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారణమని చెప్పిన వాక్యముల రహస్యమును విచారించినచో పిండమే బ్రహ్మాండము.

ఇందలి యింద్రియములు ఇంద్రియాధిష్ఠాన దేవతలు. ప్రాణము. మనోబుద్ధ్యాదులు- జాగ్రత్స్వప్నములయందు వివిధ వ్యాపారములచే ఆనందము పొందవలెనని వ్యవహరించి ఆనందమును పొందలేక తుదకు అలసి శ్రమచేత శక్తి హీనములై తొలుత ఇవన్నియు ఏ యమృత స్వరూపు నుండి వెలువడినవో అట్టి దహరాకాశమగు ఆనందమును బొంది తిరిగి బలమును పుంజుకొని వాటి వాటి స్థానములకు చేరి తిరిగి యెప్పటి యట్ల కర్మల నాచరించుచున్నవి. ఇది ప్రాణుల్కకు నిత్యపరిపాటి యైనది. దేహము నందలి సమస్త నాడులు హృదయమున చేరి అచట ఆనందమును అనుభవించి (శక్తిని ఆర్జించి) ఊర్ధ్వ, అధో భాగములకు వ్యాపించుచున్నవి. అహంకారము మాత్రమే హృదయమునందు నిలిచి యుండునని శాస్త్రములు చెప్పుచున్నవి. అందువలననే శ్రుతి ఛాయా ఒ ఒతపము లను నామములచే వాటిని చెప్పినది.

జిజ్ఞాసువు:- హృదయ మనగా లోకవ్యవహారముల యందు ఎద, ఱొమ్ము అని యందురు. ఇందు ఎచ్చట హృదయమున్నది?

వేదాంతి:- ఇందులోను అభిప్రాయ భేదమున్నది. ఎడమప్రక్క అనువా రనేకులు. ఇటీవల శివైక్యమును చెందిన భగవాన్ శ్రీ రమణమహర్షిగారు, హృదయము కుడిప్రక్కన కలదని చెప్పిరి. వారి విషయమై కొంత విస్తరించి చెప్పవలసి యున్నది. సావధానుడవై వినుము:-

**రమణగీత:-** రమణమహర్షి* శిష్యులలో ఒకరు ఒక శ్లోకమును వ్రాయదలచి "హృదయ కుహరమధ్యే" అని వ్రాసి తరువాత నేమి వ్రాయవలయునో తోచక యుండుటను భగవానుడు చూచి అతనివద్దనున్న కాగితమును పెంసిలును తీసికొని ఆ శ్లోకమును వారే యీ క్రిందివిధముగా పూర్తిచేసిరి.

శ్లో॥ హృదయకుహరమధ్యే కేవలం బ్రహ్మ మాత్రం
హ్యహమహమితి సాక్షా దాత్మరూపేణ భాతి।
హృది విశ మనసా స్వం చిన్వతా మజ్జతా వా
పవనచలనరోధా దాత్మనిష్ఠో భవ త్వం॥

---

* శ్రీ రమణ భగవానుడు 30-12-1879 తేది జన్మించి 14-4-1950 లో భౌతిక దేహమును వదలిరి.

తా॥ "హృదయమను గుహయొక్క మధ్యమున కేవలము బ్రహ్మమే 'నేను నేను' అని ప్రత్యక్షముగ ఆత్మరూపముగ ప్రకాశించుచున్నది. ఆత్మను గుఱించి వెదకుట చేతనో, లేక, తనయందు మునుగుట చేతనో, లేక, ప్రాణవృత్తి నిరోధము వలననో మనస్సుచే హృదయమున బ్రవేశించి నీ వాత్మయందు నిలుకడ గలవాడ వగుము".

శ్రీ రమణమహర్షి శిష్యులలో అగ్రగణ్యులు గణపతి దేవుని అవతారమని ప్రసిద్ధికెక్కిన కావ్యకంఠ గణపతిమునిగారు. వీరికి దైవయోగమున శ్రీ రమణమహర్షి దర్శనము కలిగినది. గణపతిమునిగారు మహర్షియొక్క రెండు పాదములను తన రెండు చేతులతో పట్టుకొని -'తా నెంత ప్రయత్నించినను తనకు తపః ఫలము (శాంతి) లభింపలేదని చెప్పుకొనిరి. అంతకుముం దొక పర్యాయము మహర్షి గణపతిగారిని చూచి వారి యోగ్యతను తెలిసికొని యుండిరి. మహర్షికి అది అప్పుడు స్ఫురించెను. ఇట్లు శరణాగతుడైన గణపతిగారితో మహర్షి యిట్లనిరి:- "ఈ 'నేను' అను భావము ఎందుండి పొడముచున్నదో పరికించిన మనస్సు అందు లీనమగును. అదియే తపస్సు".

"మంత్రజప మప్పుడు మంత్రనాద మెం దుద్భవించునో పరికించిన మనస్సు అందులో లీనమగును. అదియే తపస్సు".

గణపతుల * తప్త హృదయమున నమృతసేచన మయ్యెను

(శ్రీ రమణలీల - 5వ ప్రకరణము).

మహర్షి సన్నిధానమున వారి శిష్యులు అధ్యాత్మానుభవమున తమకుగల సంశయములను నడుగుచుందురు. మహర్షి వారికి సమాధానము చెప్పుచుందురు. అచ్చటనున్న శిష్యులలో ఒకరు జాగ్రత్తగ ఆ ప్రశ్నోత్తరములను వ్రాసియుంతురు. వాటిలో కొన్నింటికి గణపతి మునిగారు శ్లోకములుగా వ్రాసి, ఆ శ్లోకములకు తామే తాత్పర్యమును వ్రాసిరి. అది గ్రంథరూపము

* శ్రీ గణపతిమునిగారిని రమణాశ్రమవాసులు "నాయన" అని పిలుతురు. వీరు 1711-1878న జన్మించిరి. 25-7-1936న సిద్ధి పొందిరి. వీరి జన్మస్థానము బొబ్బిలి సమీపమున కలువరాయి అను నగ్రహారము. మహర్షితో వీరికి ప్రథమ పరిచయము 1903లో. వీరి జీవిత చరిత్రమును గుఱించి తెలియగోరువారు. 'నాయన' అను గ్రంథమును చదువవలయును.

దాల్చినది. దానికి 'రమణగీత' అని పేరిడిరి. దానిని మహర్షి జాగ్రత్తగా చూచి వారి అమోదముద్ర నిడిరి. అందు హృదయమును గుఱించి చెప్పిన శ్లోకములను కొన్నింటిని ఈ క్రింద ఉదాహరింతును:-

**శ్లో॥ నిర్గచ్ఛంతి యతస్సర్వా వృత్తయో దేహధారిణామ్।**
**హృదయం తత్సమాఖ్యాతం భావనాకృతి వర్ణనమ్"॥ (ర. గీ. 52)**

తా॥ "దేహధారులకు సకలములగు వ్యాపారము లెచ్చటనుంచి బయలు వెడలుచున్నవో అదియే హృదయ మనబడును. అకార వర్ణనము కేవల భావన".

**శ్లో॥ తస్య దక్షిణతో ధామ హృత్పీఠే సైవ వామతః।**
**తస్మాత్ ప్రహోతి జ్యోతిః సహస్రారం సుషుమ్నయా॥ (ర. గీ. 5-6)**

"తా॥ హృత్ఫలకమునందు హృదయము కుడివైపున నున్నది. ఎడమవైపున కాదు. ఆ హృదయ స్థానమునుండి సుషుమ్నా నాడియొక్క మార్గముగ జ్యోతిస్సు (వెలుతురు) సహస్రారమునకు ప్రవహించుచున్నది".

**శ్లో॥ సర్వాసామపి వృత్తీనాం సమష్టి ర్యా సమీరితమ్।**
**అహంవృత్తే రముష్యాస్తు జన్మస్థానం విమృశ్యతామ్॥**

(ర. గీ. 7-3)

"తా॥ దేనిని సకలమగు వృత్తులయొక్క చేరికయని చెప్పుదురో అట్టి ఈ 'నేను' అను వృత్తియొక్క పుట్టిన తావును విమర్శింపవలయును".

శ్రీ రమణమహర్షి (ర. గీ. 5-2) శ్లోకమునందు - శాస్త్రములయందు వర్ణింపబడిన విధమున హృదయమను పదార్థము లేదనియు, హృత్పీఠము - బహుశః ఎదలోపల నుండు ఒకానొక స్థలమునే హృదయమని భావించుటయే లక్ష్యమనియు చెప్పిరి. మహర్షి వాక్యములను కాదని త్రోసి వేయుటకు వీలులేదు. కాని, ఇదివఱలో నే నుదాహరించిన శ్రుతి వాక్యములు మహర్షులు చెప్పినవే, అవియును త్రోసివేయరానివే.

సామాన్యమానవునకు హృత్పీఠము - లేక - ఱొమ్ము (Chest) అనబడునది కుడి చంకవద్ద నుండి ఎడమ చంకవఱకు కొలిచిన సుమారు 16 అంగుళములు

(Inches) ఉండును. కంఠమూలమునుండి క్రిందికి కొలిచిన సుమారు 7 అంగుళము లుండును దీనినే ఎద యందురు. దీని క్రింది భాగమున నాభివఱకు నుండు భాగమును "కడుపు" అని అందురు. కడుపు పైభాగమున పైన చెప్పినట్లు ఎదలోపల హృదయ మనునది యెచ్చట కలదో ఇదివఱకు ఎవరును స్పష్టముగ చెప్పలేదు. అనాహతచక్రమునకు క్రింది భాగమున కలదని నే నిదివఱలో రాజయోగమును గుఱించి చెప్పినపుడు (ద్వితీయ భాగమునందు) చెప్పియుంటిని.

శారీరక శాస్త్రజ్ఞులు ఎదక్రింది భాగమును పోటోతీసి ఆయా అవయవములకు ఆయారంగులతో చిత్రపటము ముద్రించి చూపియున్నారు. గుండె (Heart) ఎద యొక్క యెడమ భాగమునందే ఊపిరితిత్తికి క్రింది భాగమున నున్నది. స్వల్ప మాత్రము కుడి ప్రక్కన కనబడును. దానిపై ఊపిరితిత్తియొక్క అచ్ఛాదనము లేదు. ఇది కేవల భావన కాదు. దీనిని సమన్వయించు టెట్లు?

నా యనుభవ మొకటి చెప్పెదను. ఇప్పటికి సుమారు 45 సంవత్సరముల క్రిందట ఒక డాక్టరు, నా యెదుట ఒక బాలుని పరీక్షించెను. అంత ఆడాక్టరు చకితుడై యిట్లనెను- "ఈ బాలునకు గుండె కుడిభాగమున నున్నది. ఎడమ భాగమున లేదు. ఇట్టి వింత నేను వినలేదు. ఈ బాలుని మద్రాసు జనరల్ ఆసుపత్రికి తీసికొనిపోయి చూపింపు"మని ఆ బాలుని తండ్రితో చెప్పిపంపెను. ఆ బాలునకు పండ్రెండేండ్ల ప్రాయము. కొంతకాలమునకు ఆ బాలుడు మరణించెనని తెలిసినది-

రమణమహర్షి "కుడి ప్రక్కన ఉన్నదని చెప్పుటయే గాక "ఎడమ ప్రక్క లేదు", అని చెప్పిరి. ఈ వైరుద్ధ్యమును సమన్వయించుకొను టెట్లు?

**జిజ్ఞాసువు:- అథర్వశిరుడను ఋషి వేఱొక మహర్షిచేత శపింపబడినవాడై అతని శిరము, హృదయము, శరీరము (అథర్వశిరుని దేహము) నుండి వేఱై క్రిందపడినట్లు చెప్పితిరి. హృదయము ఎంత సూక్ష్మమైన దైనను, భావనామాత్రము గాక యథార్థ పదార్థమై యుండినపుడే దేహము నుండి క్రిందపడుటయు దానిని అథర్వశిరుడు తిరిగి అది తొలుత ఉన్నచోట చేర్చి**

అతిక్రమించుటయు జరుగును. హృదయపద్మమునకు అష్టదళములు గలవని ఉత్తరగీతయు, శ్రీ వివేకానందస్వాములును, చెప్పిరికదా? వాటిని కాదనుట యెట్లు? ఇంతవఱకు ఎవరుగాని వ్రేలుపెట్టి చూపినట్లు, ఇదిగో హృదయము అని చెప్పలేదుగదా?

వేదాంతి :- అథర్వశిర ఋషి హృదయపీఠము క్రిందపడునపుడు దానిలో హృదయస్థానము ఎచటనున్నను క్రిందపడిపోవునుగదా? హృదయము అష్టదళ పద్మములనగా - ఎదలో అష్టదిక్కుల నుండి అష్ట విధములైన ముఖ్యనాడీ సమూహము ఒకచోట చేరును. అవి పద్మాకారము గలవిగా అధ్యాత్మదృష్టి గలవారికి కనిపించును. అసంఖ్యాకమగు నాడీ సమూహమునకు వాటిలో సంబంధ ముండును. అందుండియే శరీరమునందలి అష్టదిక్కులకు అమృతమును, ప్రాణశక్తియు, ప్రవహించును. అధోముఖముగా నున్ననాడులు యోగమువలన ఊర్ధ్వముగా లేచుననుటయు యుక్తమే. అప్పుడు పద్మకోశాకారముగ కన్పట్టునని యోగులు కనుగొందురు.

నీవు "ఎవరుగాని వ్రేలుపెట్టి" - ఇందులో ఈస్థానమే హృదయ ముండునది అని చూపినట్లు చెప్పలేదుగదా?' అని అడిగితిని. శ్రీ రమణమహర్షిగారు రెండు సందర్భములయందు అట్లు చూపి చెప్పినట్లు కలదు. 'శ్రీరమణలీల' అను గ్రంథమున వ్రాసియున్నదాని నిచట నుదాహరింతును:-

కొందఱు స్వామి! మీరు హృదయము వృక్షస్థలమున కుడిభాగమున నున్నదందురు. మా కనుభవమునకు వచ్చుట లేదే? యనిరి. వారిని స్వామి తనదేహమున తాము చెప్పిన హృదయ స్థానమును తాకుడనిరి. అంత హృదయస్ఫురణ త్వరత్వరగా మూడు స్పందనములు, తర్వాత దీర్ఘవిరామము తాకినవారి చేతులకును తెలిసినది. వారి శరీరము లంతటను శక్తి ప్రసారమువలె నయ్యెను. (రమణలీల, అమృతలీలా ఖండము). "నాయన" అను గ్రంథమునందిట్లున్నది:-

"దీనిని పరిమిత మొనర్చి శరీరమందొకచో నున్నట్లు వచింపరాదు. అట్లయినను శరీరమందు వ్యాపారస్ఫూర్తి యెక్కడ పుట్టుచున్నదో అస్థలము హృదయ స్థలమని నిర్దేశింపక తప్పదు. అది యనుభవమునందు

తెలియవలసినదైనను రొమ్మునకు దక్షిణ భాగమం దిదిగో. అక్కడనే..." యని దాని నిర్దేశ స్థలము స్ఫురించుటకు నావైపు దృష్టి నొకసారి హఠాత్తుగా బరపి మహర్షి యటుప్రక్కకు దిరిగెను". (నాయన. పుటలు. 737-740).

నేను హృదయమును (Heart) కుడిప్రక్కన గల బాలుని గుఱించి చెప్పితినికదా? శ్రీ రమణమహర్షి గారికి కూడ అట్లే కుడి భాగమున పుట్టియుండును. కుడిప్రక్కగుండె ఉన్నవారు కలరని వార్తాపత్రికలయందు మనము అప్పుడప్పుడు చదువుచున్నాము. అట్టివారిలో మహర్షి ఒకరని యూహించిన సమస్య విడిపోవును.

ఇటీవల వ్యాప్తిలోనికి వచ్చుచున్న రామచంద్రమిషన్ గురువుగారగు రామచంద్రజీ మహరాజ్ గారు 'రాజయోగ ప్రభావ' మను గ్రంథమున హృదయస్థానమును నిర్దేశించి చూపినట్లు చెప్పిరి. వివరములు తెలియగోరువారు ఆ గ్రంథమును చూడవలెను.

ఏది యెట్లున్నను మనకు కావలసినది అనుభవము కనుక నీ ప్రశ్నలకు సమాధానము వెదకి పరస్పర విరుద్ధాంశములవలె కనబడు శాస్త్ర వాక్యముల సమన్వయము కుదుర్చుకొనుటకంటె శ్రీ రమణ మహర్షి చెప్పినట్లు సాధన చేయవలయును. నీ మనస్సును వాసనాక్షయముగ (శుద్ధముగ చేసికొని) శుద్ధ మానసముతో హృదయము నన్వేషించినచో మనస్సు యెక్కడికిపోయి లయమగునో ఆచోటనే హృదయమని నీమనమున నిశ్చయింపుము. కొంతకాలము ఈ విధముగ సాధనచేసిన ఒకనాడు ఫలము సిద్ధించును. తరువాత కష్టము లేకయే నీమనస్సు అప్రయత్నముగ హృదయముతో చేరును. నీకు కావలసిన దదియేకదా? దానితో నీకు గల సర్వసంశయములు తీరును.

పర్యవసాన మేమనగా :- నే నిదివఱలో చెప్పినట్లు ఉపనిషత్తులయందు ఏ కొన్నింటి యందో తప్ప సామాన్యముగ అన్నింటి యందును హృదయప్రస్తావన వచ్చియున్నది. అందులో కొన్ని శ్రుతులు హృదయమును గుహతోను, మఱికొన్ని శ్రుతులు హృదయమును పద్మకోశముతోను పోల్చినవి. ధ్యాన బిందూపనిషత్తు నందు అధికముగా "కదలీపుష్ప సంకాశం సర్వవేదమయం శివమ్." (33) అని చెప్పబడినది. కాని "హృదయ మిదిగో, యిచ్చట నున్నదని"

చూచినట్లు స్థలనిర్దేశము చేసి చెప్పలేదు. మంత్రపుష్పమునందు కుడియెడమ భేదములు చెప్పక నాభికి చక్కగా ద్వాదశాంగుళములు (నాలుగు బెత్తలు) పైన కలదని నిర్ధారణ చేసియున్నది. శ్రీ రమణమహర్షి వారి శిష్యులకు సూచన చేసిరిగాని పూర్తిగా స్పష్టపరుపలేదు. శరీరమునందు వ్యాపార స్ఫూర్తి యెక్కడ పుట్టుచున్నదో ఆ స్థలము హృదయస్థ మని నిర్దేశింపక తప్పదనిరి.

ఎట్లైనను, జీవించి యుండగా ఏమహాత్ములు హృదయనిర్గుణ బ్రహ్మభావన చేయుదురో వారు క్రమముక్తిని పొందుదురు. ఎవరు హృదయపద్మమునందు సత్య సంకల్ప సత్యకామాది గుణ విశిష్టుడగు బ్రహ్మము నుపాసింతురో అట్టి విద్వాంసులు సత్యకామ సత్య సంకల్పులై సమస్తలోక సంచారమును పొందుటకు అర్హు లగుచున్నారు. శ్రీ రమణమహర్షిగారికి సత్యకామ, సత్యసంకల్పములును, వియద్గమనాది మహిమలును, ఉన్నట్లు వారి జీవిత చరిత్రయందు వ్రాసియున్నందునను, తొలుత వారు సత్యకామాది గుణములు గల సగుణబ్రహ్మమును ఉపాసించుచు సిద్ధి నొందిరనియు, అనంతరము నిర్గుణ బ్రహ్మమును విచారముచేసి తత్త్వజ్ఞానము నార్జించిరనియు తెలియుచున్నది. వారు ఏ దేవతా తేజమునుండి భూమిపై నవతరించిరో భౌతిక దేహమును వదలిన తరువాత ఆ దేవతా (స్కందుని) తేజమున ఐక్యమైరనియు చెప్పవచ్చును.

జిజ్ఞాసువు:- స్వామీ! నాసికాగ్రము బ్రహ్మమునకు స్థానమందురు గదా?

వేదాంతి:- హృదయము బ్రహ్మమునకు స్థానమని చెప్పిన ఉపనిషత్తులను తెలిపితిని. నాసికాగ్రము (భ్రూ మధ్యము) బ్రహ్మమునకు స్థానమని కొందఱందురు గాని అది అధిక వ్యాప్తిలో లేదు, గీతయొక్క 6-13 శ్లోకమున - ఉపాసకుడు (సాధకుడు) తన దేహమును, మెడను, శిరమును చక్కగా నిలిపి, స్థిర చిత్తుడై, దిక్కులు చూడక, చూపును నాసికాగ్రమున నిలుపవలయునని చెప్పుటవలన మనస్సు ఏకాగ్రమగుటచే జీవము బ్రహ్మైక్యమునకు సాధన మగుననియేగాని, అది పరబ్రహ్మమునకు స్థానమని చెప్పుట కాదని కొందఱు పెద్దల యభిప్రాయము. "నాసాగ్రే చైవ హృన్మధ్యే బిందు మధ్యే తురీయకం" అని వరాహోపనిషత్తు చెప్పినది. తిక్కనసోమయాజిగారు మహాభారత భీష్మపర్వారంభమున నిట్లు చెప్పిరి:-

కం॥ శ్రీ సంపాది పదాంబుజ
నాసాగ్ర నివాస రసిక నాదామృత ధా
రా సార రూప వేద
వ్యాస వ్యంజిత విహార హరిహరనాథా॥
నాసికాగ్ర నివాసమును దృఢపరచిరి.

## (౫) బోధ - ద్రఢీకరణము

జిజ్ఞాసువు :- స్వామీ! తాము ఇదివఱలో (ఈ భాగము ప్ర. 1. అ. 16) అఖండాకారవృత్తి - అఖండైకరసము అనునంశమును బోధించు సందర్భమున జ్ఞాతృత్వము బుద్ధియొక్క జ్ఞాతృత్వ మనియు, ప్రత్యగాత్మ జ్ఞాతృత్వమనియు - రెండు విధములని చెప్పియుంటిరి. తరువాత (2 ప్రకరణము. 9వ అధ్యాయమున) జ్ఞానము 7విధములని బోధించితిరి. చైతన్యము అద్వితీయ మనిగదా తమరు ముఖ్యముగా బోధించినది. ఈ భేదమును ఎట్లు సమన్వయింతురు?

వేదాంతి :- బోధ కొఱకు అట్లు చెప్పవలసివచ్చెను. అది వాస్తవము కాదని అచ్చటనే చెప్పియుంటిని. బోధ దృఢపడుటకై ఇప్పుడు మఱల చెప్పెదను. సావధానుడవై వినుము. ఇదియే వేదాంతమునందలి కడపటి బోధ. దీనిని తెలిసికొనిన తరువాత తెలిసికొనవలసిన దేమియు మిగులదు.

శ్రీ విద్యారణ్యస్వాములవారు వేదాంతపంచదశియందు ఇట్లు చెప్పిరి:-

శ్లో॥ యస్మిన్ యస్మి న్నస్తిలోకే బోధస్తత్ దుపేక్షణే।
యద్బోధమాత్రం తద్బ్రహ్మే త్యేవం ధీర్బ్రహ్మనిశ్చయః॥

(వే. పం. 3-21)

తా॥ లోకమునందు ఏ పదార్థమునందు బోధ కలుగునో ఆయా పదార్థములను త్రోసివైచిన ఏబోధ మాత్రము (స్ఫురణ మాత్రము) మిగిలి యుండునో ఆ స్ఫురణమే (జ్ఞానమే, లేక బోధయే) పరబ్రహ్మమని నిశ్చయింపుము.

నీవు ఘటమును, పటమును, కుడ్యమును (గోడను), జలమును చూడుము. ఘటమును చూచిన జ్ఞానము (బోధ) కంటెను, పటమున చూచిన జ్ఞానము వేఱనియును, ఘట పటముల చూచిన జ్ఞానమునకంటె గోడను చూచిన జ్ఞానము వేఱనియును, అవిధముగనే జలమును చూచిన జ్ఞానము అంతకంటెను వేఱనియును తలంతువా?

జిజ్ఞాసువు :- లేదు, ఘట పటాదుల తెలిసికొనిన జ్ఞానమంతయు ఒకటే, ఘట పటాదులు మాత్రమే వేఱు వేఱుగా నున్నవి.

వేదాంతి :- ఘట పటాదు లనగా నేమి?

జిజ్ఞాసువు :- అది నామరూపములే.

వేదాంతి :- నామరూపములకు మఱియొక పేరున్నది. అది యేది?

జిజ్ఞాసువు :- మాయ లేక అవిద్య లేక ప్రపంచము.

వేదాంతి :- ఏబోధ (జ్ఞానము)చే నీవు "ఇదిఘటము" !"ఇది పటము", "ఇదికుడ్యము" అని తెలిసికొని యుంటివో ఆ బోధను అఘట పటాదులనుండి వేఱుచేసి కేవల బోధను మాత్రమే గ్రహించిన అబోధయే "ఏక మే వా ద్వితీయమ్ బ్రహ్మ" (ఛాం. 6-2-2). "విజ్ఞానం బ్రహ్మ" (తై. 3-5), "ప్రజ్ఞానం బ్రహ్మ" (ఐతరేయ. 3-3)- అని శ్రుతులు చెప్పిన పరబ్రహ్మము. ఏబోధచే ఘట పటాదులను తెలిసికొంటివో ఆ బోధను వానినుండి (ఘట పటాదుల నుండి) వేఱు చేయకపోయితివేని, దానినే వృత్తిజ్ఞాన మనియు, వేఱుచేసిన ప్రత్యగాత్మ బ్రహ్మస్వరూప జ్ఞానమనియు బోధకొఱకు రెండు జ్ఞానములని చెప్పబడెను. సారాంశమును ఒక్కమాటలో చెప్పవలయునన్న లోకమున నెచ్చటెచ్చట బోధ కలదో అచ్చటచ్చట తోచు ఆయా విషయములను (నామరూపములను) బోధనుండి వేఱుచేసి బోధను మాత్రమే గైకొనిన ఆ బోధయే బ్రహ్మము. ఇందులకు ఎట్టి సంశయము వలదని పెద్ద లానతిచ్చిరి.

జిజ్ఞాసువు :- స్వామీ! ఘటాదుల నుండి బోధను వేఱుచేయుటకు ఉపాయ మేమి?

వేదాంతి :- ఘటమును నీవెట్లు "ఇది ఘటము" అని తెలిసికొంటివి?

జిజ్ఞాసువు :- వెలుతురు సహాయమువలన నేత్రేంద్రియము ద్వారా మనస్సు ఘటమున ప్రవేశించి ఆయాకృతిని మనస్సు చిదాభాసునితో కూడిన బుద్ధి కందింపగా బుద్ధి ఘటాకారమును పొందును. అప్పుడు నాకు ఘటమని తెలియవచ్చుచున్నది.

వేదాంతి :- బుద్ధి ఘటాకారమును పొందకున్నచో నేమగును?

జిజ్ఞాసువు :- అచ్చట ఘటమున్నను ఘట మున్నదని నాకు తెలియబడదు.

వేదాంతి :- ఘటాదులు నామరూపములు మాత్రమే యని యంటిని. అనగా - మాయ. ఘటమును చేత గైకొని పరిశీలించిన అది మృత్తికయే. మృత్తికను ఘటమంటివి. ఘటమను నామ మెట్లు మిథ్యయో ఘటాకారమును మిథ్యయే. సత్యమేమన మృత్తిక. శ్రుతి యిట్లు చెప్పినది. "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్". (ఛాందో. 6-1-4).

జిజ్ఞాసువు:- ఘటము మృత్తికయే యైనను నామరూపములయందు మృత్తికకు భేదము కలదుగదా? ఈ భేదము నశించుటెట్లు?

వేదాంతి:- ఒక నారింజపండును కోసి దానిరసమును ఒక పాత్రలో పిండిన దానియందు రసము, బీజములు (విత్తనములు) కలసియుండును. వేఱొక పాత్రయందు వస్త్రము వేసి దానిని వడియగట్టిన రసము వేఱుగను విత్తనములు వేఱుగను నేర్పడును. నీవు రసమును మాత్రము గ్రహింతువు విత్తనములను వదలివేయుదువు.

జిజ్ఞాసువు :- విత్తనములు వేఱు, రసము వేఱను ద్వైతభావ ముండును గదా?

వేదాంతి :- నారింజ వృక్షమునకు తొలుత ఒక బీజము కారణము. ఆ బీజమే వృక్షమైనది. దానికి వేయి నారింజ ఫలములు పుట్టినవి. ఒక్కొక్క ఫలమునందు నూఱు బీజములున్నవి. వానిలో చిన్నవి, పెద్దవి, నాసి రకమైనవి మొదలగు భేదము లున్నవి. ఈ లక్ష బీజములకును, ఆ వృక్షమునకును, దాని ఆకులు, కొమ్మలు మొదలగువాని కన్నింటికి కారణమైనది తొలుత

భూమిలో వేసిన బీజమొక్కటియే యని తెలియునుగదా? కనుక నీకు కనబడిన భేదమంతయు మిథ్యయే కదా?

శ్లో|| విజాయమాన విషయం సన్నికర్షేణ యద్యసి|
న భవే ద్యోగ భంగాయ భేదస్యాగ్రహణే మనః|| (ర. గీత.)

తా|| మనస్సు సాన్నిధ్యముచే లోక విషయంబుల తెలిసికొనుచున్నను, భేదము గ్రహింపనప్పుడు యోగమునకు భంగము కలుగదు. ఏలయన? నేను పైన చెప్పినట్టు నారింజ వృక్షములకు మూలము బీజము ఒక్కటియే యని నిశ్చయము నీ మనమున నిలుకడ చెందియుండెనేని లక్షబీజముల యందును భేదదృష్టి కలుగదు. కనుక, నీవు ఎచ్చటెచ్చట నే యే నామ రూపములను చూచుచున్నావో ఆ యా నామరూపము లన్నియు మాయా కల్పితములు. ఒక కఱ్ఱ చేతియందున్నది. దానిని నిప్పంటించిన అది కాలి బూడిద యగును. ఇప్పుడు కఱ్ఱయను నామమును కఱ్ఱ యొక్క రూపమును నేమైనవి? ఎచటికి పోయినవి? బూడిదయను పేరును, దాని యాకృతియు నెచ్చటినుండి వచ్చినవి. ఇదియే మాయ. మాయ యనునది పరబ్రహ్మము యొక్క శక్తియే. శక్తికి శక్తిమంతునకు భేదము లేదు. ఇప్పుడు ప్రపంచ మెచ్చట నున్నది?

జిజ్ఞాసువు :- ప్రపంచ మనునది కేవల వ్యావహారిక సత్యమేగాని వాస్తవముగ లేదు. బ్రహ్మ మొక్కటే కలదు.

వేదాంతి :- ఉపనిషత్కారులగు మహాత్ములు ఉపనిషత్తులయందు మోక్ష సౌధమును ప్రవేశించుటకు అనేక సోపానములు నిర్మించిరి. వారు దయామయులు గనుక వారు మనకు చేయూతనిచ్చి ఒక్కొక్క సాపోనమునే యెక్కించుచు మోక్ష సౌధమును ప్రవేశింప శక్తి నొసగిరి. క్రింద నున్న సోపానము ఎక్కినప్పుడే ముముక్షువులు, కనబడి కనబడనియ ట్లుండు మోక్ష సౌధమును చూతురు. ఇట్లు పోనుపోను పై సోపానమును (కట్టకడపటి సోపానమును) ఎక్కగనే మోక్షసౌధమునందు ప్రవేశించిన ట్లయినది. అప్పుడే శ్రుతి యీ విధముగా పలికినది. "సర్వం ఖ ల్విదం బ్రహ్మ, నేహ నానాస్తి కించన" - సర్వమును బహ్మమే. ఇతరమైనది కొంచెమైనను లేదు. అనుభవము కలుగునంత పర్యంతము, ప్రపంచము మిథ్యమని శాస్త్రముల యందును, గురు వాక్యముల యందును నమ్మక ముంచిన ఆ కడపటి సోపానమును

దాటి మోక్షసౌధమును ప్రవేశించినపుడు కలుగు దృఢమగు విశ్వాసమువంటి విశ్వాసము (శ్రద్ధ) కలుగదు. ఇదియే కడపటి బోధ (వాక్యము). ఇంతకు మించి యింకేదియు లేదు. మోక్ష సౌధములో అడుగిడగనే మాటలు లేవు. మనస్సు లేదు.

మోక్ష సౌధమునందును, బయటను ఉన్నది నీ వొక్కడవే. మోక్షమే నీవై యున్నావు. బ్రహ్మమే నీవై యున్నావు. ఇదియే అద్వైతము నందలి రహస్యము. నీవట్టి బోధ స్వరూపుడవని నిశ్చయించుకొని సంశయ రహితుడవు కమ్ము. "తత్త్వమసి"- అదియే నీవయి యున్నావు అను మహావాక్యమునందలి అర్థము అనుభవమునకు వచ్చును. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి". (ముండక. 3-2-9). ఈ బోధను నిరంతరము మరవకుండుము. ఇట్టి ఆత్మైక్య బోధ కలవాడు తిరిగి పుట్టడు. ఇట్టి బోధ లోకమునకు బోధించిన మహాత్ముల పాదపద్మములకు నమస్కరింతము.

## (౬) ముగింపు (ఉపసంహారము)

జిజ్ఞాసువు:- (సాష్టాంగ సమస్కృతుల నర్పించి) స్వామీ! ధన్యుడను, ఓ మహాత్మా! పరబ్రహ్మ విషయమైన సర్వవిధములగు జ్ఞాన, విజ్ఞానములు మీకృపవలన తెలియ గలిగితిని. ఇప్పుడు నాకు తెలియదగిన దేదియు లేదు. నా సంశయము లన్నియు తొలగిపోయినవి.

వేదాంతి:- నీవేమి తెలిసికొంటివో నాకు చెప్పుము?

జిజ్ఞాసువు:- స్వామీ! గురుదేవా? సత్యాన్వేషినై నేను తొలుత తమ సన్నిధికి వచ్చినపుడు శూద్రకుల జాతుడనే, నేను వేదాంతము తెలిసికొనుట కర్హుడను కానేమో? అని సంశయించి యుంటిని. అట్టి సంశయమును సంపూర్ణముగ తొలిగించితిరి. ఆప్రసంగమునందే అచలవేదాంత ప్రసక్తి రాగా "అద్వైత వేదాంతమును గురించి చక్కగా తెలిసికొనిన పిమ్మట అచలబోధ యెట్టిదైనది నీకు సులభముగా బోధపడును" అని తమ రానతిచ్చిన వాక్యముల యందలి గంభీరత యింతటిదని యిప్పుడు నా కవగతమయనది.* తదనంతరము

* బ్రహ్మజిజ్ఞాస ప్రథమభాగము మొదటి ప్రకరణమునందలి విషయము.

అద్వైత సిద్ధాంతము ననుసరించి "పరబ్రహ్మము, మాయ, ఈశ్వరుడు, జీవుడు, కూటస్థుడు, చిదాభాసుడు మొదలగు విషయము లన్నియు బోధించితిరి.

ఆపిమ్మట జీవుల మరణానంతరము దేవయాన పితృయాన మార్గముల ననుసరించి ** బ్రహ్మాది లోకములకు పోవుటయు, కొందఱు జీవులు తిరిగి భూలోకమునకు వచ్చి జన్మించుటయు, బ్రహ్మవిదునకు మాత్రము ఉత్క్రాంతి లేకుండటయు మొదలగు విషయములు బోధించితిరి.

ఓ కరుణామూర్తి! ముముక్షువు ఏ మార్గము ననుసరించిన తిరిగి పుట్టడో అట్టి మోక్షోపాయమును తెలుపుడని నేను ప్రార్థింప మొదట జ్ఞానమార్గమును నెఱిగించితిరి. జ్ఞానమార్గమునకు అనర్హులగు మందాధికారుల కొఱకు పాతంజల రాజయోగమను రెండవ యుపాయమును సాంగోపాంగముగ వివరించితిరి. అందుకును అర్హత లేని వారికిని, జ్ఞానులయ్యును సన్న్యసింపక లోక కల్యాణమునకు పాటుపడు వారికిని సులభమగు కర్మయోగమను మూడవ యుపాయమును గీతాశాస్త్రము ననుసరించి యీ కాలానుగుణముగ నుండునట్లు బోధించితిరి. జీవులయొక్క పూర్వజన్మ సంస్కారముల ననుసరించి కలిగిన రుచిభేదముల వలన పై మూ డుపాయములు రుచియింపని వారికిని, హిందూ మతేతరులకు సయితము ఆమోదయోగ్య మగునట్టియు, అనేక విధములగు ఈశ్వరభక్తిని అనుష్ఠింపలేని రోగులు, దుర్బలులు, వీరు వారను భేదము లేక ఉపాయమును, ఉపేయమును నగు ఈశ్వర శరణాగతిని (ప్రపత్తిని) అతిసామాన్య జనులకు సయితము అవగాహన మగునట్లు అయిదవ యుపాయమును ఎఱిగించితిరి. ఇట్లు పంచవిధ మోక్షోపాయముల యందు * మీరు చెప్పక వదలిన ముఖ్యవిషయ మేమియు ఉండదని నా నిశ్చయము.

ఇంతేకాదు ***హిందూమతమునకు మూలాధారము లయినట్టియు, ఈ భూమిపై నుండు గ్రంథము లన్నింటి కంటెను, అతి ప్రాచీనములగు

---

** బ్రహ్మజిజ్ఞాస ప్రథమభాగమునందు రెండవ ప్రకరణమున చెప్పిన విషయము.

* జ్ఞాన, రాజ, కర్మ, భక్తియోగములును, ప్రపత్తియు, ఈ అయిదు ప్రకరణములుగా "బ్రహ్మజిజ్ఞాస" ద్వితీయ భాగము (ద్వితీయ సంపుటము) గా ముద్రింపబడినది.

***ఇచట తృతీయభాగమునందలి విషయములు చెప్పుచుంటిని.

చతుర్వేదముల గురించియు, షడ్దర్శనముల యొక్క మూలరూప మనదగిన "అన్వీక్షికి"ని గురించియు, షడ్దర్శనములయందు ఆత్మ చైతన్యమను నట్టియు, ఆత్మ జడమనునట్టియు దర్శనముల భేదమును తెలిసికొంటిని. దర్శనము లాధారముగా రచియింపబడిన వివిధ దర్శనకారుల సూత్రములను గురించి తెలిసికొంటిని.

షడ్దర్శనములచే పెంపొందిన షణ్మతములయందు శైవ, వైష్ణవ, శాక్తాది మతములను, వాటియందుగల వివిధ భేదములను, శ్రీ శంకరాది భాష్యకారుల భిన్న భిన్న భావములను; భాష్యకారులు గాని; శ్రీ కృష్ణచైతన్య స్వాముల వారిమతమును; శైవ, వైష్ణవ, శాక్తాది మతములను పోషించిన అయా భక్తుల యొక్కయు, వారి వారి మతములయందు కలిగిన పరిణామములును, మంత్రశాస్త్రమును, శ్రీవిద్యయు, కాశ్మీర శైవము, శాక్తమునందలి లలితా భావమును- మొదలగు వైదిక మత విషయములు మీ కృపచే అవగాహన చేసికొన గలిగితిని.

జైన, బౌద్ధములేగాక చార్వాకాది నాస్తిక మతములును ఇంద్ర విరోచన మతములును అవగతము* లైనవి.

శివరామ దీక్షితులవారు, తమ అచలబోధ శ్రీ జ్ఞానేశ్వరుల నుండి గురుపరంపరగా తమకు లభించినట్లు శ్రీ జ్ఞానేశ్వరులవారి తత్త్వ మిట్టిదని తెలిసిననే సత్యము బయలుపడునని శ్రీ జ్ఞానదేవుల మత మిట్టిదని స్థాలీపులాక న్యాయమున బోధించితిరి. శివశక్తి తత్త్వమును గురించి చెప్పు సందర్భమును బట్టి ఆనుషంగికముగా వచ్చిన శ్రీ అరవింద యోగి యొక్క శివ-శక్తి తత్త్వ మిట్టిదని వివరించితిరి. దీక్షితుల వారు తమ గురువు శ్రీధరస్వామి యని చెప్పియున్నందున సమర్థ రామదాస పంథకు చెందిన శ్రీధర కవియే, ఆ శ్రీధరస్వామియై యుండ వచ్చునని శ్రీ సమర్థుల మతమునుగూడ సంగ్రహముగ వినిపించితిరి.

దీక్షితులవారి బోధ యిట్టిదని వారి వాక్యముల నుదాహరించి బోధించుటతో అచలబోధను నేను సులభముగా గ్రహింప గలిగితిని. నేను

---

* అంతటితో తృతీయభాగము పూర్తి అయినది.

"అచలబోధ అనగా నెట్టిది?" అని తొలుత మిమ్ముల ప్రశ్నించినపుడు మీరు తొందరపడక యెప్పు డద్దానిని గుఱించి చెప్పిన బాగుండునో ఆ సమయముననే బోధించితిరి. నేను తమవలన విన్నదంతయు స్మరించిన ఒక మహాగ్రంథ మగును. దానిని నావంటివాడు ప్రశంసించుటకు అనర్హుడు.

అచలబోధపరిశీలన మనువ్యాజమున వేదాంతము నందలి నిగూఢాంశముల నెన్నింటినో సులభగ్రాహ్య మగునట్లు బోధించితిరి. కేవలము అచలబోధ స్వరూప మిట్టిదని మాత్రమే తెలుపుటకు ఇంతటి దీర్ఘోపన్యాసము అవసరము లేకయే మీరు నావంటి మందబుద్ధికి బోధించి యుండగలరు. కాని, అచల వేదాంతుల మాటలు విని ఆరురుక్షువగు జిజ్ఞాసువు తబ్బిబ్బు పడకుండుటకై అచల వేదాంతమును అద్వైతమును రెండును ఒకచోట చేర్చి రెండింటి భేదమును వివరించి చెప్పుటవలన రెండింటిలో నేది శ్రేష్ఠము? ఏది కనిష్ఠము? అను నిర్ణయమునకు సులభముగ రాగలిగితిని. తమవంటి సద్గురువు నాకు లభించుట నాపురాకృత సుకృత ఫలము. భగవంతుడే నన్ను ప్రేరేపించి తమ సన్నిధికి తెచ్చెనో, అట్లుగాక భగవంతుడే మీ రూపమున నాకు బోధించెనో అని నమ్ముచున్నాను. శ్రీ సదానందయోగి చెప్పినట్లు-

"ధరణి లోపల దనరారు తత్త్వములను
నెవరు దెలియరు తత్త్వంబు నెవ్వడెఱుగు
శివుడు గురురూపమై వచ్చి చెప్పకున్న
నవ్యతరభోగి శ్రీ సదానందయోగి?"

అను పద్యములోని భావము తెలిసికొంటిని. అందులకే శ్రుతులు.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।
గురురేవ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః॥

అను మంత్రార్థము బోధపడినది. సమస్త మహామండలాధి పత్యము నా కబ్బినను నేనిప్పుడు పొందియుండునట్టి ఆనందమును పొందియుండలేను. స్వామీ! గురుదేవా? మీ కెంత ఋణపడితినో చెప్పజాలను. మీ ఋణము నేనెట్లు తీర్పగలను, ఋణము తీర్పలేని శిష్యుని జన్మము వ్యర్థము, మీకు గురుదక్షిణ నేనేమి సమర్పింపగలను? మీకెట్లు సేవచేయగలను? ఈ శరీరమనః

ప్రాణాదులను మీ కర్పణ చేసితిని. ఈ యంశమున నాకు తమపై గల భక్తిభావమును ఉన్నదున్నట్లు తమ కెఱిగించుటకు నేను పండితుడను కాను, కవిని గాను, నాయందేదైన గుణమున్న అది నేను తమ యందు గురుభావముంచు టొక్కటే.

వేదాంతి:- మిత్రుడా! బుద్ధిమంతులగు వారు సామాన్యముగ చెప్పునట్టి మాటలనే నీవును చెప్పితివి. పరమార్థమునందు 'నీవు', 'నేను' అను భేద మెచ్చట కలదు? రెండు ప్రమిదెలయందు ఇంత నూనె వేసి, రెంటియందును ఒక్కొక్క దానియందు ఒక్కొక్క వత్తిని వేసి, ఒక దీపమును వెలిగించి యుండగా నేకారణముననో రెండవ ప్రమిదె మొదటిదీపమును సమీపించిన సమయమున మొదటి ప్రమిదెయందలి జ్యోతియొక్క సంయోగము రెండవ ప్రమిదె యందలి వత్తికి కలిగి అదియును వెలిగినపుడు రెండింటియందలి జ్యోతులు (అగ్ని) భిన్నములుగా (రెండుగా) కనబడుచున్నను రెండును ఒక్కటియే కదా? రెండు ప్రమిదెలయందలి వత్తులను ఒక ప్రమిదయందుంచిన, అనగా రెండింటికి సంయోగము కలిగించిన, అప్పుడు రెండు ప్రత్యేక జ్యోతులుగా గాక రెండు దీప జ్వాలలు ఒకే తేజమగునట్లు మన మిరువురము వేఱు కాము. ఇరువురము ఒక్కటియే యయ్యును వేఱుపడినట్లుండి యేకమైతిమి. **ఇప్పుడు గురు శిష్య భావము లేనేలేదు.**

శుక్ల యజుర్వేదమునకు సంబంధించిన శ్రుతుల యందు ఆరంభమునను అంతమునను చెప్పు శాంతి మంత్రమును చెప్పి దాని యర్థమును చెప్పెదను వినుము:-

మం॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే।

పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే॥

పూర్ణం + అదః = శ్రుతియందు తత్త్వమసి, (తత్ + త్వమ్ + అసి) అది నీవై యున్నావు - అను మహావాక్యము నందలి తచ్ఛబ్ద వాచ్యమైనది (అది) బ్రహ్మము పూర్ణమైనది. అఖండాద్వితీయమైన పరిపూర్ణవస్తువని భావము - పూర్ణం + ఇదం = పై మహావాక్యము నందలి త్వం శబ్దనిర్దిష్టమైన ప్రత్యగాత్మ

స్వరూపము (ఇది అనబడినది) పూర్ణమైనది (ఈ తత్త్వం పదముల రెంటికిని ఎట్లు పూర్ణత్వము కలుగుచున్నదో చెప్పుచున్నది. అనగా : రెండు పూర్ణము లుండవుగదా? పూర్ణమనిన 'ఏకమే వ ద్వితీయం బ్రహ్మ' అన్నట్లు బ్రహ్మము మాత్రమే పూర్ణము; పూర్ణాత్ = పూర్ణమునుండి, పూర్ణం + ఉదచ్యతే = పూర్ణమే సంభవించుచున్నది. జీవేశ్వరుల కిరువురకు పూర్ణత్వమని అర్థము. పూర్ణం + ఆదాయ = పూర్ణరూపమును గ్రహించి, తత్త్వం పదార్థములను శోధించి, శోధింపబడిన పదార్థములు గలవాడవై అని అర్థము. పూర్ణం + ఏవ + అవశిష్యతే = పూర్ణమగు బ్రహ్మమేయై శేషించు చున్నాడు బ్రహ్మమే అగుచున్నాడని అర్థము.

రెండు అఖండములు (పూర్ణములు) ఉండజాలవు. రెండు అఖండములు కలవనిన అవి రెండును ఖండములేగాని అఖండములు కావు. పూర్ణ మనగా-పరిపూర్ణమనియే, కొఱత లేనిది. బ్రహ్మాండము నంతటను వ్యాపించియున్న మహాకాశము (భూతాకాశము) నందున్న భూమి నుండి కుమ్మరివాడు కొంత మట్టిని తీసికొని కుండను చేసెననుకొనుము. కుండ (రెండు కపాలములు ఏకము కాగానే కుండ యగును), ఘటము కలిగినదనగా ఘటమునందున్నది మహాకాశమే యైనను, ఘటాకాశమని వ్యవహారము కలిగినది. అట్లే పరిపూర్ణమునుండి ఘటాకాశమువలె ఉద్ధరింపబడిన జీవుడు పరిపూర్ణుడనియే తాత్పర్యము. ఎచ్చట నుండియో జీవుడు లేక ఎఱుక వచ్చినదనియు, అది పరిపూర్ణముతో సంబంధము లేనిదనియు చెప్పిన, అప్పుడు పరిపూర్ణమను నదియే యుండుటకు వీలులేదు. పూర్ణము కాక అన్యమైనది కలదనిన పూర్ణము సహితము లేనిదే యగును. ఈ విషయము అటుంచుము.

నాకు నీవు ఋణపడితి నంటివి. నాకు నీ వెంత ఋణపడితివో నీకును నే నంతయే ఋణపడియున్నాను. బోధ్ధయగు నతనికి నిజమైన జిజ్ఞాసువు (ముముక్షువు) లభించుట వాని యదృష్టము. 'ఏలయన? విద్వాంసు డగువాడు వాడెఱిగిన విద్యను ఇతరులకు తెలుపడేని వాని శరీరము వ్యర్థముగా నశించును. జన్మ సార్థకము కాదు. నీ యట్టి జిజ్ఞాసువు లభించుట దుర్లభము. లోకమునందలి మానవులను పరిశీలించి చూడుము. నీవలె వేదాంత విచారము చేయవలెనను ఆకాంక్షగలవా రెందఱున్నారు? నాకు గురుదక్షిణ నెచ్చెదనంటివి.

"మీ కెట్లు సేవచేసెద" నంటివి. చెప్పెదను వినుము. నా వలన విన్న సమస్తమును కుల, మత; స్త్రీ, పురుష భేదమును పాటింపక నీవంటి ముముక్షువునకు నీవు చెప్పుము, అదియే నీవు నాకు చేయవలసిన సేవ. అదియే నాకు ప్రియతమమగు గురుదక్షిణ. లోభివి గాకుము. నేనింత శ్రమపడి ఆర్జించిన వేదాంత విద్యను ప్రతిఫలరహితముగ నేల యీయవలయు నను కొనకుము. 'కేవల కృపచేత' జిజ్ఞాసువులకు (ముముక్షువులకు) జ్ఞానదానము చేసిన, వానికి కలుగు ఫలముతో సమస్త సంపదలతోటి సర్వంసహాచక్రదాన ఫలము సరి తూగ జాలదు. కాని అట్టి ఫలమును మనస్సున ఉంచుకొనకుము. "కేవలకృప" అని చెప్పితిని. అంతకంటె ఫలమును కోరకుము.

## (౭) ఫలశ్రుతి

జిజ్ఞాసువు:- స్వామీ! తాము నా కుపదేశించిన తత్త్వజ్ఞాన మంతయు గ్రంథరూపమున వెలువడునట్లును, ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో చదివినవారికి తప్పక దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యములును, సత్సంతానమును కలిగి వారి వంశమున బ్రహ్మజ్ఞానులు, సత్సంతానమును కలిగి వారి వంశమున బ్రహ్మజ్ఞానులు జన్మించునట్లును, అంతమున అక్షయమగు పుణ్య లోకములు సిద్ధించునట్లును - ఇందలి తత్త్వము అర్థముచేసికొని అనుభవమునకు తెచ్చు కొనిన భాగ్యవంతులకు శరీరపతనానంతరము అర్చిరాది మార్గమున చతుర్ముఖుని లోకమున కేగి బ్రహ్మసాయుజ్యము పొందునట్లును - ఇందలి అద్వైత సిద్ధాంతమును చక్కగా అర్థము చేసికొని ఆత్మానాత్మ వివేకము కలిగి ఆత్మైక్యబోధ సిద్ధించిన మహాత్ములు జీవన్ముక్తు లగునట్లును, ఈ గ్రంథము జగమున్నంత దనుకను ప్రచారమునం దుండునట్లును, పరమేశ్వరు డనుగ్రహించునట్లు ఆశీర్వదింపుడు.

వేదాంతి:- తథాస్తు - నీవన్నవన్నియు అధికార భేదమునుబట్టి సహజముగనే సిద్ధించును. ఇందుకు నా ఆశీస్సులేల? సర్వమును బ్రహ్మస్వరూపముగ చూచు మహనీయుల పాదపద్మములను స్మరించుచు నీ వన్నట్లే యగుగాక యని కోరుచున్నాను.

ఓం నమో విశ్వరూపాయ విశ్వస్థిత్యంత హేతవే|
విశ్వేశ్వరాయ విశ్వాయ గోవిందాయ నమో నమః"||
నమస్తే నమస్తే విభో! విశ్వరూప!
నమస్తే నమస్తే చిదానందరూప!
నమస్తే నమస్తే తపోయోగగమ్య!
నమస్తే నమస్తే శ్రుతజ్ఞాన గమ్య!

## శాంతి వాక్యములు

ఓమ్ సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వినావధీత మస్తు, మా విద్విషావహై||

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

తా|| సః = ఆ ఉపనిషత్ప్రతిపాదిత పరబ్రహ్మము, హ = ప్రసిద్ధముగా, నౌ = శిష్యాచార్యులమయిన మాయిద్దఱిని, అవతు = రక్షించుగాక, మేమిద్దఱము బ్రహ్మవిద్యాభ్యాసము చేయుచున్నాము. మా యిద్దఱిచేత అధ్యయనము చేయబడిన బ్రహ్మవిద్య తేజోవంతమగు గాక, మే మిద్దఱము ఎప్పుడును ఒకరి నొకరు ద్వేషింపక ఉందుముగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓమ్ భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః

భద్రం పశ్యే మాక్షభిర్యజత్రాః, స్థిరైరం గై స్తుష్టు

వాగ్ం సస్తనూభిః, వ్యశేమ దేవహితం యదాయుః

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః

స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

తా|| ఓ దేవతలారా! శిష్యాచార్యులమగు మా శ్రవణములచే మంగళకరమగు శబ్దజాలము విందుముగాక. మా నేత్రములచే మంగళప్రదమగు కృత్యముల

(దృశ్యముల) చూచెదముగాక, దృఢమగు అవయవములు గల శరీరము గలవారమై మేము భగవంతుడు మాకు ప్రసాదించిన ఆయువు నంతయు మీ స్తోత్రములచే గడుపుదుముగాక. శ్రేష్ఠుడును, జ్ఞానియునగు ఇంద్రుడు మాకు శుభములు కలిగించుగాక, సర్వద్రష్టయగు సూర్యుడు మాకు శుభమును ప్రసాదించుగాక, సర్వారిష్ట వినాశకరుడగు గరుడుడు మమ్ము కృపాదృష్టితో చూచుగాక, దయామయుడగు బృహస్పతి మాకు శుభములు కలిగించుగాక.

**ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః**
**అసతో మా సద్గమయ|**
**తమసో మా జ్యోతి ర్గమయ|**
**మృత్యోర్మా అమృతం గమయ.** (బృహదారణ్యక శ్రుతి)

**తా||** అసత్తు (అసత్యము) నుండి మమ్ముల సత్యమును చేర్పుము. తమస్సు (అజ్ఞానము)నుండి తేజస్సు (జ్ఞానము)ను చేర్పుము. మృత్యువునుండి అమృతమును చేర్పుము.

ఇది పరమేశ్వరరానుగ్రహమువలన

మట్టిబోయిన రామసుబ్బయ్యచే రచియింపబడిన

"బ్రహ్మజిజ్ఞాస" చతుర్థభాగమందలి

"బోధద్రఢీకరణ - ఉపసంహారము"

అను మూడవ ప్రకరణముతో

గ్రంథము సర్వము సంపూర్ణము

**హరిః ఓమ్ తత్సత్**

**ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః**

